# విద్యార్థికల్పతరువు.

అను

## ఆంధ్రభాషావిషయ సర్వస్వము



రచయిత:

విద్వాన్, శ్రీ ముసునూరి వేంకటశాస్త్రి

శబ్దార్థదీపిక, వ్యాసమంజరి వగైరా గ్రంథకర్త, రాజమండ్రి.

ప్రచురణ:

వేంకట్రామ అండ్ కో.,
విజయవాడ - మద్రాసు - హైదరాబాదు

1964

 [ వెల రు 8-00

లను గనిపెట్టి చూచువాఁడు = ఒకానొక బుల్విపిక్క

ఉపధ— వ్యాకరణ పరిభాషయందుఁ బదముయొక్క తుది యక్షరమునకు ముందున్న యక్షరము మంత్రి మొదలగువారి గుణములను బరీక్షించుట

ఉపధానము— దీనియందు శిరముంపఁబడును = తలగడ

ఉపధ్మ— ముఖమార్గమున గాలి విడుచుట = ఊఁదుట

ఉపధ్మానీయము—ఉపధ్మానము (పెద)నందుఁ బుట్టినది- పఫలకుఁ బూర్వము అర్ధవిసర్గమువలె నుండు వర్ణభేదము (పయ పానము)

ఉపనక్షత్రము—అప్రధానమగు నక్షత్రము (అశ్విని మొదలగు నిరువదియేడు నక్షత్రములలో నొక్కొక్కదానికి వేఱువేఱుగా నిరువదియేడేసి చిన్ననక్షత్రములు అనుసరించి రాశిచక్రమున నుండును)

ఉపనయనము—1 దగ్గఱకు దెచ్చుట 2 పొందింపఁజేయుట 3 వేదపరనార్థము బాలుని గురుసమీపమునకుఁ బంపుటకై కావింపఁబడు సంస్కారవిశేషము = వడుగు

ఉపనాయకుఁడు—(దగ్గఱకుఁ దెచ్చువాఁడు) 1 ఉపపతి=విటుఁడు నాటకాదులయందునాయకునకుఁ గొంచెము తక్కువయై సహాయుఁడుగానుండు మఱియొక నాయకుడు - నాయకుని గుణోత్కర్షమును ప్రకటించువాఁడు

ఉపనాయిక—నాటకాదులయందు ముఖ్యనాయికకుఁ గొంచెము తక్కువ ప్రాధాన్యముగల నాయిక

ఉపనిక్షేపము—వస్తురూప సంఖ్యాదులను జెప్పి యేదే నొకవస్తువు నొకనియొద్ద దాఁచుట రూపమును సంఖ్యను జెప్పి చూపి పదిలపఱచుటకై యొకని కప్పగించిన వస్తువు

ఉపనిధాత— ఏదోయొకవస్తువు నొకనియొద్ద నుపనిధిగా దాచువాఁడు

ఉపనిధాయకుఁడు- చూ ఉపనిధాత.

ఉపనిషత్తు— (ఉప-ని-సత్) గురుని సమీపమున శిష్యునిచే లెస్సగ బొంద బడినది = బ్రహ్మవిద్యాప్రతిపాదకమును వేదశిరోభాగము నగు బ్రహ్మజ్ఞానోపదేశ సర్వస్వము

ఉపనీతుఁడు—ఉపనయన సంస్కారము పొందినవాఁడు వేదాధ్యయనార్థము గురుసమీపమునకుఁ దేఁబడిన బ్రహ్మచారి

ఉపనేత—వేదపరనార్థతకై ఉపనయన సంస్కారమును జేయు నాచార్యుఁడు.

ఉపన్యాసము—1 సమీపమునఁ బెట్టుట 2 ఒక విషయమునుగూర్చి విస్తరించి మాట్లాడుట 3 తనకార్యమును నెఱవేర్చుటకై చేసికొనుసంధి.

ఉపపతి—మాఱుమగఁడు = విటుఁడు.

ఉపపదము— ఒక పదమునకు అవ్యవహితపూర్వముగా నున్న బదము ఒక

నామము నకు వెనుక పలుకఁబడుబిరుదు. (శర్మ, వర్మ, గుప్తాది.)

ఉపపాతకము— పాతకమువలె నుండి దానికంటె నించుక తక్కువఫలము గల పాతకభేదము.

ఉపపాదనము—యుక్తిచేసమర్థించుట, ఏ విషయము నైనను వివరించి చెప్పుట.

ఉపపురాణము — వ్యాస మహర్షి ప్రోక్తములగు నష్టాదశపురాణములవలె నుండి నానాముని రచితములగు నారసింహాది పురాణములలో నొకటి.

ఉపష్పిక—దీనిచే నోరు పుష్పమువలె వికసించును = ఆవులింత.

ఉపమాత—తల్లితో సమానమయినది = సవతితల్లి, పినతల్లి మొ.

ఉపమాద్రవ్యము — పోలికగా గ్రహింపఁదగిన వస్తువు = కమలాది.

ఉపమానోపమేయభావము — ఉపమానమునకును, నుపమేయమునకును గల సంబంధము.

ఉపమేయము— సరిపోల్పఁదగినది = ముఖాది.

ఉపయాచనము—సమీపమునకు వచ్చి యభీష్టములను ప్రార్థించుట.

ఉపరక్తము— దాసన పుష్పముయొక్క సమీపమున నుండుటచే దానియెఱుపు గుణము గలదియై తోఁచెడు స్ఫటికపు ఱాయివలె ఉపాధి సాన్నిధ్యమున నుండుటచే దానిగుణము గలదిగా నూహింపఁబడునది = జీవాత్మ.

ఉపరక్షణము—శిబిర రక్షణము కొరకుఁ జుట్టును వేసిన కంచె మున్నగు నావరణము, శిబిరరక్షణార్థము సైన్యమును గాపుంచుట.

ఉపరక్షుఁడు—పరులవలనఁ గీడులేకుండ ప్రభువునొద్ద గాపుండు భృత్యుఁడు.

ఉపరసము— మందులోఁ జేర్పఁబడు ననుపానరసము.

ఉపలక్షకము— స్వార్థమును విడువక అన్యార్థమును లక్షణచే దెలుపునట్టి శబ్దము.

ఉపలక్షణము—వాచ్యార్థమునే కాక దానికంటె నితరమగు నర్థమును సయితము లక్షణచేఁ దెల్పుట.

ఉపలధిప్రియము — ప్రియమైన వాలము (తోఁక) గలది = చమరీమృగము.

ఉపవీతము—ఎడమ భుజము మీఁద నుండి కుడిచేతిక్రిందుగా వ్రేలాడునట్లు ధరింపఁబడు జన్నిదము.

ఉపవేదము—వేదసదృశమైనది. (ఋగ్వేదమున కాయుర్వేదమును, యజుర్వేదమునకు ధనుర్వేదమును, సామవేదమునకు గాంధర్వవేదమును, అథర్వవేదమునకు స్థాపత్య శస్త్రవేదములను నుపవేదములు.)

ఉపవ్యాఘ్రము— క్రూరత్వమున పెద్దపులితో సమానమైనది = శివంగి

**ఉపశయము**—మృగములను బట్టుటకై దాఁగుట కనుకూలమగు పల్లము

**ఉపశాయము**—కావలివారు వంతుల ప్రకారము పరుండుట

**ఉపశిష్యుఁడు**—శిష్యునకు శిష్యుడు = ప్రశిష్యుఁడు

**ఉపశ్రుతి**—ఒక దేవతను శుభాశుభము లను గూర్చి ప్రశ్నింపఁగా నా దేవత యొక వ్యక్తిపై నావేశించి వానిచేఁ జెప్పించెడు సమాధాన వాక్యము ప్రసంగ సమయమున దైవికముగా వినఁబడు శుభాశుభవాక్యము

**ఉపశ్లేషణము** — (గృహఘటములకు వలె) ఆధారాధేయములకు గల యేక దేశసంబంధము

**ఉపసంక్రమణము** — ఉన్నయాధార మును విడిచి సమీపమునునుండు మఱి యొక యాధారమును జేరుట

**ఉపసం(గ్రహ)గ్రహణము**— నమ స్కారార్థము పాదముల పట్టు కొనుట.

**ఉపసంహారము**—1 విడిచి పెట్టిన బాణమును మఱల నాకర్షించుట 2 గ్రంథాదుల ముగింపు.

**ఉపసదనము**—గురుని పాద సమీప మున గూర్చుండుట = సేవ

**ఉపసూర్యకము** — సూర్యచంద్రుల పరివేషము

**ఉపస్తరణము**— అన్నాదులుం పెట్టుటకు నడుగున నాధారముగా వేసిన యాకు పాత్ర మొ

**ఉపస్త్రీ**— అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన భార్యకాక యుంచుకున్న యాఁడుది

**ఉపస్మృతి**— జాబాలి మున్నగు ఋషు లచే రచింపఁబడిన ధర్మశాస్త్ర విశేషము

**ఉపస్వేదము**— అగ్ని మొదలగువాని దాపుననుండుటవలనఁ గలిగిన యూష్మము = చెమట.

**ఉపహారము**— దేవతలకును రాజుల కును గానుకగా నిచ్చెడు ద్రవ్యము

**ఉపాంశుక్రీడితుఁడు**— స రాజునకు రహస్యక్రీడలయందు స్నేహితుఁడు.

**ఉపా(కరణ)కర్మము**—స ఉపనయ నాంతరమున సంస్కార పూర్వక ముగాఁజేయు నధ్యయనారంభము

**ఉపాకృతము** — యజ్ఞమున నభిమం త్రించి హింసింపఁబడు బలిపశువు

**ఉపాఖ్యానము**—ప్రధాన కథలో వచ్చెడి యవాంతరకథ

**ఉపాధ్యాయ**—చదువు చెప్పునది

**ఉపాధ్యాయాని**— ఉపాధ్యాయుని భార్య

**ఉపాధ్యా(య)యి**— 1 చదువుచెప్పు యువతి 2 ఉపాధ్యాయుని భార్య

**ఉపాధ్యాయుఁడు**—1 వేదమును జది వించువాఁడు, 2 చదువుచెప్పువాఁడు.

ఉపాసనము— మన్ను మున్నగువానిచే చేయఁబడిన బండి = మృచ్ఛకటికము మట్టిబండి

ఉపావృత్తము— శ్రమముపోవుటకై పరుమాఱు నేలపైఁ బొర్లాడునది = గుఱ్ఱము

ఉపాహ్వానము— దేవతాదులను మంత్రోచ్చారణముచేఁ బిలుచుట

ఉపేంద్రుఁడు—చూ ఇంద్రావరజుఁడు 1 ఇంద్రునకుఁ దమ్ముఁడు 2 ఇంద్రుని రక్షించుట కతని సమీపమున నుండువాఁడు 3 ఇంద్రలోకమునకుఁ బైలోకమున నుండువాఁడు = విష్ణువు

ఉపోద్ఘాతము— 1 మిక్కిలి సమీపమునందు తెలుపఁజేయఁబడునది 2 ప్రకృతార్థమును తెలియఁజేయుటకు నర్థాంతరమును జెప్పుట = పీఠిక

ఉభయచరము— రెండింటి యందుఁ (అనఁగా భూమియందును నీటియందును గాని నీటియందును ఆకాశమందును గాని భూమియందును ఆకాశమందును గాని) తిరుగునది = తాఁబేలు పక్షి మొ

ఉభయతోముఖము— రెండువైపుల ముఖద్వారములు కలది = ఇల్లు మొ

ఉభయతోముఖి— ఈనుచున్నప్పుడు ఒక ప్రక్క దూడయొక్క ముఖమును మఱియొక ప్రక్క తనముఖమునుగలది= ఈనుచున్న యావు

ఉభయవేతనుఁడు— రెండుపక్షముల నుండియు జీతము పుచ్చుకొనువాఁడు =పైకి శత్రురాజుల కొలువులోనున్నట్లగపడు చారుఁడు.

ఉభయవ్యంజనము— స్త్రీ పురుష లక్షణములు గల వ్యక్తి = పోట

ఉమ— ఓబిడ్డా వలదని తల్లిచేఁ దపస్సునుండి నిషేధింపఁబడినది రక్షించు నట్టిది = పార్వతి

ఉమా (పతి) వల్లభుఁడు— పార్వతికి మగఁడు = శివుఁడు

ఉమాసుతుఁడు—పార్వతి యొక్క పుత్త్రుఁడు = 1 వినాయకుఁడు, 2 కుమారస్వామి

ఉరగము—ఉరస్సు (పొట్ట) చేఁ బ్రాకునది = సర్పము

ఉరగరాజు— పాములకుఁ బ్రభువు = వాసుకి శేషుఁడు

ఉరగారి— సర్పములకు శత్రువు = 1 గరుడుఁడు 2 నెమలి 3 ముంగి.

ఉరగాస్యము— సర్పముఖమువంటి ముఖముకలది = తొల్లిక

ఉరసిలుఁడు— విశాలమైన రొమ్ముకలవాఁడు = శౌర్యవంతుఁడు.

ఉరస్యుఁడు— ధర్మపత్నియందుఁ బుట్టినవాఁడు = ఔరసపుత్త్రుఁడు

ఉరస్త్రాణము—వక్షస్స్థలమును రక్షించునది = కవచము.

ఉరుక్రముఁడు— పెద్దయడుగు లిడినవాఁడు = వామనరూప విష్ణువు.

ఉరోజము } ఉరోజాతము
ఉరో(భవము)భువు } వక్షస్థలమునఁ బుట్టినది = కుచము

ఉరోహస్తము— హస్తములతో ఱొమ్మున పైఁ గొట్టుకొని బాహువులతోఁ బోరాడు మల్లయుద్ధవిశేషము

ఉర్వర—సమస్తసస్యములు పండునది= మంచిభూమి

ఉర్వశి—1 గొప్పవారిని సయితము వశపఱచుకొను నొక దేవవేశ్య 2. నారాయణుని యూరువులనుండి పుట్టినది = ఊర్వశి

ఉర్వి—1 విశాలమైనది 2 కశ్యపుని యూరువులచే నెత్తఁబడినది 3 పర్వతములచే నెత్త బడినది = భూమి

ఉర్వీధరము— భూమిని ధరించునది = పర్వతము

ఉర్వీభృత్తు—భూమినిధరించు వా(డు) నది = 1 కొండ 2 రాజు

ఉర్వీ (జము) రుహము— భూమి యందు మొలచునది = చెట్టు

ఉర్వీశుఁడు— భూమి కధిపతి = 1 ప్రభువు 2 రాజు

ఉలుఁ (ల్లు) ద్రాడు—ఆవలను పాలు పితుకునప్పుడు వెనుకకాళ్ళకుఁ గట్టు త్రాడు = బంధము

ఉలూకము— నేత్రతేజముచేఁ గాకు లను దహించునది = గూబ

ఉల్క—మంటలేనినిప్పు = కొఱవి చుప్ప.

ఉల్కాపాతము—ఆకాశమునుండి రేఖాకారమగు కాంతి పుంజము పడుట

ఉల్కాముఖము— కొఱవివంటి ముఖముగలది = కొఱవిదయ్యము

ఉల్కాముఖి- కొఱకచ్చువలె నుండెడు ముఖము కలది = ఆఁడునక్క.

ఉల్లాపము— శోకభీత్యాదుల వలనఁ గలిగిన వికృతస్వర విశిష్టమైన పలుకు.

ఉల్లుంఠనము— మనస్సునఁ గ్రోధము గలిగి పైకి స్తోత్రము చేయుచున్నట్లు పల్కుట

ఉషప్పుఁడు- ప్రాతఃకాలమును పాలించు వాఁడు = సూర్యుఁడు

ఉషర్బుధుఁడు— ప్రాతఃకాలమునఁ బ్రజ్వలించువాఁడు = అగ్ని ప్రాతఃకాలమున మేల్కొనువాఁడు = బిడ్డ.

ఉషాకలము— ప్రాతఃకాలమునఁ గూయునది = కోడి

ఉషాపతి— బాణాసురుని కుమార్తె యగు నుషకు భర్త = అనిరుద్ధుఁడు

ఉష్ణంకరణము—వేడిచేయుటకు సాధనమయినది = 1. చిత్రమూలము. 2 కంబళి

ఉష్ణనది—నిరంతరము తపించుచుండెడు నరకలోక నదీవిశేషము.

ఉష్ణ (రుచి) రశ్మి—(ఉష్ణకరుఁడు)

పంక్తిలో వందఱు భుజింపకపూర్వ మొకఁడు లేచినచో మిగిలినవారిపాత్రల యందలి యన్నము

ఉచ్ఛిష్టుఁడు—అన్నము భుజించిన పిదపఁ బ్రక్షాళనాదిశుద్ధి చేసికొనని వాడు

ఉచ్ఛ్వాసము—ఊపిరి బయటకు విడుచుట

ఉటజము—గడ్డితోఁగాని యాకులతోఁగాని కట్టబడిన యిల్లు = పర్ణశాల

ఉడుఁబోతుపిందె—చెట్టు కొపుడిగిన పిమ్మటఁ బుట్టు పిందె

ఉడుపకుక్క—ఉడుము లోనగువానిని వేటాడెడు కుక్క

ఉడు(పుఁడు)పతి—నక్షత్రములకుఁ బ్రభువు = చంద్రుఁడు

ఉడుపథము—నక్షత్ర మార్గము = ఆకాశము

ఉడుపము—నీటినుండి రక్షించునది = తెప్ప నావ పుట్టి

ఉడ్డకేలుగలాఁడు—నాలుగుచేతులు గల వేలుపు = శ్రీవిష్ణువు

ఉడ్డమోమువేలుపు—నాలుఁగు ముఖములుగల దేవుఁడు = బ్రహ్మ

ఉత్కంఠిత—ప్రియుఁడు సమయమునకు రాకుండుటను సహింపక దుఃఖించెడు నాయిక

ఉత్కలికాప్రాయము—సమాసములతోడను) కటువైన యక్షరములతోడను గూడిన గద్యభేదము

ఉత్కలుఁడు—కులమర్యాదలు దాటినవాఁడు = కులభ్రష్టుఁడు

ఉత్ఖాతకేళి—ఏనుఁగులు మొదలగునవి దంతములు మున్నగువానితోఁ గోరాడుట

ఉత్తమర్ణుఁడు—అప్పిచ్చినవాఁడు

ఉత్తమసాహసము—అపరాధమునకు విధించు దండుగులలోఁ బెద్దది = శిరచ్ఛేదము మొ

ఉత్తమాంగము—శరీరావయవములన్నిటిలో శ్రేష్ఠమైనది = శిరము

ఉత్తరకాయము—దేహముయొక్క ఊర్ధ్వభాగము

ఉత్తరక్రియలు—మృతులగువారి నుద్దేశించిజేయఁబడిన దహనసంస్కారము శ్రాద్ధము మొదలుగాఁగల కర్మకలాపము

ఉత్తః(జందె)జన్నిదము—యజ్ఞోపవీతమువలె ధరించు ముత్యాలహారము సువర్ణసూత్రము మొ

ఉత్తరపక్షము—రెండవదియగు కృష్ణపక్షము వాదమందు సిద్ధాంతపక్షము.

ఉత్తరవేది—యజ్ఞమం దగ్నిస్థాపనార్థమై యుత్తరదిక్కున వేసినవేది

ఉత్తరసాక్షి—సాక్షులుచెప్పిన విషయమును దాను విన్నదానినిబట్టి ధ్రువ

శించు దంతములుగలది = అష్టదిగ్గజము లలో నొకటి.

పుష్ప బాణుఁడు — పుష్పములు బాణములుగాఁగల ధనుస్సుగలవాఁడు = మన్మథుఁడు.

పుష్పలావిక- పుష్పములను మాలలుగా గ్రుచ్చి యమ్మునది.

పుష్పలిహము— పుష్పము లందలి మధువును గ్రోలునది = తుమ్మెద.

పుష్పవంతులు— పుష్పమువలె వికాసము గలవారు = సూర్యచంద్రులు.

పుష్పవతి (పుష్పిణి)— ఋతుసంబంధమైన రజస్సు గలది = బహిష్ఠ.

పుష్పశరుఁడు— పుష్పములు బాణములుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

పుష్పహీన—ముట్లుడిగిన యాఁడుది.

పుళిందుఁడు— తమ భాషకంటె నితర భాషల నెఱుంగనివాఁడు = చండాల భేదములలో నొక జాతి మ్లేచ్ఛుఁడు.

పూఁటకాఁపు— ఇతరుఁడు చేయవలసినపనిని దాను చేసెదనని పూనుకొనిన వాఁడు.

పూర్ణానకము—ఉత్సవకాలమున సంతోషముతో వస్త్రాభరణాదికము లిచ్చుట.

పూర్ణిమ— పూర్ణచంద్రుఁడుగల దినము.

పూర్వ (జుఁడు) జ— తనకంటెఁ బూర్వమునఁ బుట్టినది (వాఁడు) = అక్క, అన్న.

పూర్వదేవుఁడు—పూర్వకాలమున దేవపదమునం దున్నవాఁడు = రాక్షసుఁడు.

పూర్వపక్షము—సిద్ధాంతము కానిది= వాదము.

పూర్వపర్వతము— తూర్పు దిక్కున నున్న పర్వతము = ఉదయపర్వతము.

పూర్వరాగము— మిగుల ననురాగము గల నాయికా నాయకులకు దర్శనాభావముచే, శ్రవణాదుల మాత్రమున సంభవించెడు దశావిశేషము.

పూలముడుపు—గర్భిణికిఁ జేయించెడు పుష్పధారణము.

పూ(వింటివా) (విల్తు) విలుకాఁడు —చూ. నవవిలుకాఁడు.

పృతన— (3 వాహినులు) 243 ఏనుఁగులు, 243 రథములు, 729 గుఱ్ఱములు, 1215 కాలిబంటులు గల సేనాసమూహము.

పృతనాషాట్టు—శత్రుసేనయొక్క బలమును సహింపఁగలవాఁడు = దేవేంద్రుఁడు.

పృథగ్జనుఁడు— సజ్జనులతోఁ గలియనివాఁడు = దుర్మార్గుఁడు.

పృథివి—1. ప్రసిద్ధమగునది, 2. పృథుచక్రవర్తిచేఁ దెస్సగాఁ జేయఁబడినది, 3. విశాలమైనది.

పురుహూతుఁడు— యజ్ఞములయందుఁ బ్రచురమైన పిలుపు గలవాఁడు, పురువనెడి రక్కసుని జంపినవాఁడు = ఇంద్రుఁడు.

పురోభాగి— ముందు దోషమును స్వభావముననే గ్రహించువాఁడు = దోషాన్వేషకుఁడు.

పురో (ధసుఁ) (హితుఁ)డు—

1. శాంతిక పౌష్టికాదికర్మలయందు ముందుగా నుండువాఁడు, 2. యుక్తాయుక్తములను దెలుపుచు యథావిధిగఁ గర్మలను జేయించువాఁడు, 3. పురము యొక్క క్షేమమును గోరువాఁడు = శుభాశుభవైదిక కర్మలను జేయించుచు మేలు కీడులను దెలుపుచుండెడు నాచార్యుఁడు.

పులికూడు— పులిసిన యన్నము (భిక్షాన్నము), పులియొక్క ఆహారము.

పులికోచ— పులిముఖమువంటి ముఖము కల సాలెపురుగువంటి ప్రాణోపద్రవకరమగు పురుగు = పురికోస.

పులిగోరు— నడుము వ్యాఘ్రనఖమును బతకమునకు మాఱుగాఁ గూర్చిన హారము.

పులినవతి— ఇసుక తిన్నెలుకలది = నది.

పులిజూదము— పులులు మేకలతోఁ గలసిన యొక యాట.

పులుచూలి సవతితల్లి— ఱెల్లుగడ్డియందుఁ బుట్టిన కుమారస్వామికి సవతి తల్లి యైనది = గంగ.

పులుఁగు (తత్తడిరౌతు) బొల్లఁడు— చూ. గరుడవాహనుఁడు.

పులుఁగు (ఱేఁడు) దొర— చూ. ఖగేశ్వరుఁడు.

పులుకాసిపులుఁగు— పచ్చనిపక్షి = చిలుక.

పులోమజ— పులోముఁడను ముని వలనఁ బుట్టినది = శచీదేవి.

పులోమజిత్తు— పులోముని జయించిన వాఁడు = ఇంద్రుఁడు.

పువుఁ(పూఁ)బోఁడి, పువ్వారుఁబోఁడి— పుష్పమువలె మనోజ్ఞురాలగు నాఁడుది.

పువ్విలు (కాఁడు) తుఁడు— పుష్పములు బాణములుగాఁగల ధనుస్సు కలవాఁడు = మన్మథుఁడు.

పుష్కరము— 1. పోషణ చేయునది = ఉదకము, 2. బడలినవానిని బోషించునది = తామరపద్మము.

పుష్కరిణి— 1. ఉదకములు కలది = చెఱువు, 2. తామరలుకల కొలను.

పుష్పంధయము— పువ్వులోని మధువును గ్రోలునది = తుమ్మెద.

పుష్పకము— పుష్పమువలె నుండునది = కుబేరుని విమానము.

పుష్పకేతువు— పుష్పములు చిహ్నములుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

పుష్పదంతము— పుష్పములవలె ప్రకా

పుత్రైషణ—పుత్రుఁడు కలుగవలె ననెడి కోరిక.

పుత్రోత్సవము—పుత్రుఁడు కలిగిన వెంటనే సంతోషముతోఁ జేయఁబడు బహుమానాదికము.

పునర్భవ—మరల మరలఁ బుట్టునది = గోరు, సంసారము, చంద్రకళ.

పునర్భువు—తొలుత నొకనికిఁ బెండ్లి మయియుండి మరల నింకొకనికిఁ బెండ్లి మయినది.

పునశ్చరణము— మంత్రముయొక్క పునః పునః పఠనము.

పునస్సంధానము—విచ్ఛిన్న మై పోయిన యగ్నిని మరల హోమగుండము నందుఁ గూర్చుట, గర్భాదానము.

పునస్సంస్కారము—రెండవసారి జరిపెడి యుపనయన సంస్కారము.

పునాసలు—సూర్యుఁడు పునర్వసు నక్షత్రమున నున్నప్పుడు చల్లిన ధాన్యము.

పునుకకంచమువాఁడు—చూ. కపాలి.

పునుకతాలుపు, పునుకదారి—చూ. కపాలభృత్తు (కపాలి).

పురందరుఁడు (పురందుఁడు) } 1.పురువను రాక్షసుని జంపినవాఁడు,2.శత్రు పురములను భ్రక్కలించినవాఁడు = ఇంద్రుఁడు.

పురంధ్రి—గృహమును ధరించునది = గృహిణి, ఇల్లాలు.

పురశ్చరణము—హోమకాలమున దేవతపేరు మాటిమాటికినుచ్చరించుట.

పురహరుఁడు—చూ. త్రిపురాంతకుఁడు.

పురాకృతము— పూర్వజన్మమునఁ జేయఁబడిన పుణ్యాపాపరూప (శుభాశుభ) కర్మవిశేషము.

పురాణదంపతులు— పురాతనులగు భార్యాభర్తలు = పార్వతీ పరమేశ్వరులు.

పురాణపురుషుఁడు—పురాతన పురుషుఁడు = శ్రీవిష్ణువు, ముదుసలి.

పురాణము—వేదముకంటె బురాతన చరిత్రము. చూ. పంచలక్షణము.

పురాతనము— బహుదినముల నాఁటిది = ప్రాఁతది.

పురా (రి) రాతి, (పురవైరి)—చూ. త్రిపురాంతకుఁడు.

పురీషము—దీనిచే నుదరము పూరింపఁ బడును = అమేధ్యము, మలము.

పురుషాదుఁడు—మనుష్యులను దిను వాఁడు = రాక్షసుఁడు.

పురుషాయితము—స్త్రీ పురుషునివలె నాచరించుట = ఉపరతి.

పురుషార్థము—ధర్మార్థకామమోక్ష రూపమైన పురుషప్రయోజనము.

పురుషోత్తముఁడు—పురుషులలో నుత్తముఁడు = విష్ణువు, శివుఁడు.

పుడమిచెవి— భూమి (వల్మీకము) చెవిగాఁగలది = సర్పము.

పుడమితాలుపు—భూమిని ధరించువాఁడు = శేషుఁడు, రాజు (కొండ).

పుడమితేరెక్కు-వాఁడు—త్రిపురాసుర సంహారకాలమున భూమిని రథముగాఁ జేసికొని యెక్కినవాఁడు = శివుఁడు.

పుడమినంటు— భూమికి చెలికాఁడు = విష్ణువు.

పుడమి(పుట్టు)పట్టి—చూ. నేలపట్టి (1 భూదేవి విష్ణునను గ్రహమున గర్భవతియై పవడపురూపమున నొక బీజము గనెను. అందుండి అంగారకుఁడు పుట్టెను 2. విష్ణుని స్వేదబిందువు భూమిపైఁ బడగా నందుండి కాంతిమంతుఁడగు పురుషుఁడు పుట్టెను. 3 శివుఁడు దాక్షాయణిని గోల్పోయిన విరహముచేఁ గుందుచుండ నతనిశరీరము నుండి స్వేదబిందువు జారెను. అందుదయించిన లోహితాంగుఁడను పుత్రుని భూదేవి పుత్రభావముచేఁ బెంచెను) = అంగారకుఁడు.

పుడమిముద్దియకోక—భూదేవికిఁ జీరయైనది = సముద్రము.

పుడమిమొలనూలు—భూదేవికి మొలత్రాడైనది = సముద్రము.

పుడ(మిఱేఁడు) (మీశుఁడు)మీశ్వరుఁడు చూ. నేలఱేఁడు.

పుడమివేలుపు—చూ. నేలవేలుపు.

పుడుకఁగల్లు—ఈవిగలరాయి = చింతామణి.

పుడుకఁదోడుకు— ఈవిగలయావు = కామధేనువు.

పుడుకుమ్రాను—ఈవిగల చెట్టు = కల్పవృక్షము.

పుణ్యజనుఁడు— పుణ్యాత్ముఁడగు మనుష్యుఁడు = నిరృతి, యక్షుఁడు మొ.

పుణ్యజనేశ్వరుఁడు— పుణ్యజనులకు (యక్షులకు) ప్రభువు = కుబేరుఁడు.

పుణ్యభూమి— వింధ్యపర్వతమునకును, హిమవత్పర్వతమునకును మధ్యనుగల భూమి.

పుణ్యశ్లోకుఁడు— పవిత్రమయిన చరిత్రకలవాఁడు = నలుఁడు-మొ.

పుణ్యస్త్రీ—భర్తగల యాఁడుది.

పుణ్యాహవాచనము— దైవాదికర్మ ప్రారంభమున విఘ్నేశ్వర పూజకుఁ బిమ్మట మంగళార్థము పుణ్యాహమను శబ్దమును మూఁడుమారులుచ్చరించుట = అశుద్ధినివారణ కర్మము.

పుత్రకామేష్టి—పుత్రులను గోరి చేసెడు యాగవిశేషము.

పుత్రాచార్యుఁడు—తన పుత్రుఁడు తన కుపాధ్యాయుఁడుగాఁ గలవాఁడు.

పుత్త్రుఁడు— పున్నామనరకము నుండి రక్షించువాఁడు = కుమారుఁడు.

పీతాంబరుఁడు—పచ్చని వస్త్రము గలవాఁడు = విష్ణువు.

పీనుఁగుదిండి—శవములను దినునది = పిశాచము, నక్క.

పీయూషము—పానము చేయఁబడునది = అమృతము, ఈనిన 7 దినములలోని యావుపాలు = జున్నుపాలు.

పుంజుదారిపెద్ద— పుంజుధ్వజముగాఁ గల కుమారస్వామి యన్న=వినాయకుఁడు.

పుంజు(దారి)దాలుపు— కోడిపుంజును ధ్వజముగాధరించినవాఁడు = కుమారస్వామి.

పుండరీకము—ప్రకాశించునది = అష్టదిగ్గజములలోనొకటి, శుభకార్యములందు మంగళప్రదమైనది = తెల్లతామర, శుభకర్మమును జేయునది=తెలగొడుగు.

పుండరీకాక్షుఁడు— పద్మములవంటి నేత్రములు గలవాఁడు, హృదయకమలమున వ్యాపించి యుండువాఁడు = శ్రీవిష్ణువు.

పుంశ్చలి—1. పురుషుని జలింపఁజేసి కూడునది, 2. తనభర్తను విడిచి కదలునది = జారిణి.

పుంశ్చలీయుఁడు—లంకులాఁడికిఁ బుట్టినవాఁడు.

పుంసవనము— గర్భవతియగు స్త్రీకిఁ బురుషుఁడు పుట్టవలెనని చేయు శుభకర్మ విశేషము.

పుక్కిటిపురాణము— పుక్కిలినుండి బయలువెడలిన వ్యర్థవాక్యప్రసంగము (అక్కఱమాలిన కల్పితకథ).

పుట్టకాపు(కాపరి)— పొదలయందు నివసించునది = ఎలుఁగుగొడ్డు,పాము.

పుట్టకూడుదిండి,పుట్టకూటిమెకము—చీమ్మగడ్డలతోఁగూడిన పుట్టవట్టిని దినునది = ఎలుగుఁగొడ్డు.

పుట్టకొక్కు — పుట్టయందుఁ దెల్లగా మొగ్గవలె మొలచునది.

పుట్ట(పుట్టువు)చూలు— పుట్టయందుఁ బుట్టినవాఁడు = వాల్మీకి.

పుట్టపెట్టినట్లు—శరీరమును జుట్టఁగా జుట్టుకొని యుండుటకు వీలైన పుట్టనివాసస్థానముగాఁ గలది = త్రాఁచు.

పుట్టమనెడుగబ్బి(పుట్టదిట్ట)— పుట్టయందు నివసించెడుగొప్పదిట్టరి = త్రాఁచు.

పుట్టుకచల్వజోతి— పుట్టుకనుండియుఁ జల్లనైన కాంతిఁగలవాఁడు = చంద్రుఁడు.

పుట్టుగట్టు—సూర్యుఁడుదయించు దిక్కునందలి కొండ = ఉదయాద్రి.

పుట్టుగ్రుడ్డి—పుట్టుకనుండియు కండ్లు కనఁబడనివాఁడు.

పుట్టుచెయువు—చూ. జాతకర్మము.

పుట్టువడుగు—పుట్టినదిమొదలు బ్రహ్మచారి.

పింజరము— ఎఱుపుమించిన పసుపు వర్ణము కలది = బంగారు,హారిదళము.

పిండపాతికుఁడు, పిండాశకుఁడు— బిచ్చమెత్తుకొనువాఁడు.

పికబంధువు— కోకిలకు బంధువువలె నాశ్రయమైనది = మామిడిచెట్టు.

పికము—చాటుననుండి కూయునది = కోయిల.

పికవర్ధనము— కోకిలలను తెక్కలు వచ్చువఱకుఁ బెంచునది = కాకి.

పిచ్చి(క)కుంటు, పిచ్చు(క)కుంటు- కాళ్ళులేనివాఁడు = అనూరుఁడు.

పిచ్చుగుంటివాండ్రు— కమ్మవారిని అడిగికొని జీవించువారు.

పిడుగుకైదువు—పిడుగు ఆయుధముగాఁ గలవాఁడు = ఇంద్రుఁడు.

పిత—రక్షించువాఁడు = తండ్రి.

పితరుల(దణి)(దొర)(ఱేఁడు)సామి- పితృదేవతలకుఁ బ్రభువు=యముఁడు.

పితామహి—తండ్రితల్లి = నాయనమ్మ.

పితామహుఁడు, పితలఁ బుట్టించుదొర—1. తండ్రులను బుట్టించిన వాఁడు = బ్రహ్మ, 2. తండ్రి తండ్రి = తాత.

పితృపతి—పితృదేవతలకుఁ బ్రభువు = యమధర్మరాజు.

పితృప్రసువు—ప్రొద్దు పొడుచుటకు ముందైదు గడియలవఱకును, ప్రొద్దు గ్రుంకిన వెనుక మూఁడు గడియల వఱకును గల కాలము.

పితృయజ్ఞము—పితరులకొఱకైన తర్పణాదికము.

పితృవనము—పితృదేవతల వనము = శ్మశానము, వల్లకాడు.

పితృవ్యుఁడు—తండ్రితోడఁ బుట్టిన వాఁడు = పినతండ్రి.

పితృష్వస—తండ్రితోడఁ బుట్టినది = మేనత్త.

పినాకము—త్రిపురదహన కాలమున బాణజ్వాలలచే నాకము (స్వర్గము) ను గప్పినది = శివుని ధనువు.

పినాకి—పినాకమను పేరుగల ధనుస్సు గలవాఁడు = శివుఁడు.

పిప్పలాశనము—రావిచెట్లను దినునది = ఏనుఁగు.

పిటికిమొకము—భయముగల జంతువు = జింక.

పిల్లఁగ్రోలు, పిల్లఁగ్రోవి— ఊఁదుటకు వీలుగానుండుటకు బెజ్జము చేయఁబడిన వెదురుగొట్టము.

పిశాచులు—మాంసమును భుజించువారు = కుబేరానుచరులు.

పిష్టపశువు— యజ్ఞార్థము పిండితోఁ జేయఁబడిన పశువు.

సూత్రముల నధ్యయనముచేయువాఁడు = సన్న్యాసి, వ్యాసుఁడు.

పారికాంక్షి— పరమును (బ్రహ్మజ్ఞానమును) గాంక్షించువాఁడు = తాపసి.

పారుపత్తెము— దొరతనమువారికియ్యవలసిన ద్రవ్యమును బ్రజలవలన రాఁబట్టెడి యధికారము.

పార్థివము—పృథివీ సంబంధమైనది = గుఱ్ఱము.

పార్థివుఁడు— పృథివి (భూమి)కి ప్రభు = రాజు, పృథ (కుంతి) యొక్క కుమారుఁడు = అర్జునుఁడు.

పార్థుఁడు— పృథ (కుంతి) యొక్క పుత్త్రుడు = అర్జునుఁడు.

పార్వణము— పర్వములయందు జేయఁదగిన పిండప్రదానాదికము.

పార్వతి—హిమవంతుఁ డను పేరుగల పర్వతరాజు కొమార్తె = శివునిభార్య.

పార్వతీనందనుఁడు—పార్వతియొక్క కుమారుఁడు = కుమారస్వామి, వినాయకుఁడు.

పార్ష్ణిగ్రాహుఁడు— దండెత్తి పోవు రాజునకు వెనుకనుండు శత్రువు.

పాల (కడలల్లుఁడు) మున్నీటి యల్లుఁడు— క్షీరసముద్రునకు (కొమారితయగు లక్ష్మికి మగఁడు) యల్లుఁడు= విష్ణువు.

పాలకడలివెన్న— పాలసముద్రమున వెన్నవలె నుదయించినవాఁడు = చంద్రుఁడు.

పాలమున్నీటికూఁతురు— క్షీరసముద్రుని కొమారిత = లక్ష్మి.

పాల్కడలికానుపు— పాలసముద్రమునఁ బుట్టినది = కామధేనువు, ఐరావతము, ఉచ్చైశ్శ్రవము మొ.

పాల్కడలిపట్టి— క్షీరసముద్రునికుమా(రుఁడు) ర్తె = చంద్రుఁడు, లక్ష్మి.

పావకుఁడు— పవిత్రము చేయువాఁడు = అగ్ని.

పావని— పవనుని పుత్రుఁడు = ఆంజనేయుఁడు, భీముఁడు (గంగ, తులసి).

పాశి(పాశధరుఁడు)— పాశములచే శత్రువులను బంధించువాఁడు = వరుణుఁడు, పాశము ఆయుధముగాఁ గలవాఁడు = యముఁడు.

పాశుపతము — పశుపతి(శివుఁడు) అధిదైవతముగాఁగల యొక యస్త్రము.

పాశుపాల్యము— గోమహిష్యాది పోషణవృత్తి.

పాశ్చాత్త్యులు—పశ్చిమదేశమునఁ బుట్టినవారు = ఆంగ్లేయులు మొ.

పాషండుఁడు— సంసారబంధహేతుభూతములైన యసచ్ఛాస్త్రములను బల్కువాఁడు = వేదబాహ్యుఁడు.

పింగదృష్టి— పచ్చనికన్నులు గలది = సింహము.

పింగళ— గోరోజనము వంటి కాంతి గలది = కోఁతి, ముంగిస.

పాథేయము— మార్గమునందుఁ దిన దగిన యాహారపదార్థము.

పాథోధి(పాదోధి)— చూ. అంబుధి.

పాదో(పాథో)నిధి— చూ. అంబునిధి.

పాదకటకము, పాదాంగదము— పాదమున ధరించు కంకణము = అందియ.

పాదజుఁడు— బ్రహ్మ పాదమునుండి పుట్టినవాఁడు = శూద్రుఁడు.

పాదపము—వేళ్ళతో నీరు త్రాగునది = వృక్షము.

పాదలేపనము— ఆకాశగమన శక్తి నిచ్చెడు ఓషధీవిలేపనము.

పాదూకృత్తు, పాదుకృత్తు— చెప్పులను తయారుచేయువాఁడు = మాదిగ (పాదు (దూ) కృతుఁడు).

పాదూవాహుఁడు— పాదుకలను మోయువాఁడు = మాదిగ.

పాద్యము— పాదప్రక్షాళనార్థమైన యుదకము.

పానగోష్ఠిక— మద్యపానము చేసెడి స్థలము.

పానీయము— పానము చేయఁదగినది = ఉదకము మొ.

పాముమేఁత— పాములకాహారమైనది = వాయువు, పాములాహారముగాఁ గలవాఁడు = గరుడుఁడు.

పాముల (మేఁతరి) వేఁటకాఁడు— పాములను దినువాఁడు = గరుడుఁడు.

పాయసము— పయస్సు (పంచదారతో గూడినపాలు) చేఁ బక్వము చేయఁబడునది = పరమాన్నము.

పార(ంగతుఁడు)గుఁడు— అంతమును బొందినవాఁడు.

పారజాయికుఁడు, పారదారికుఁడు- ఇతరుని భార్యతో సంబంధముగల వాఁడు = జారుఁడు.

పారణ(ము)— ఉపవాసముండి మఱు నాఁడు చేసెడు భోజనము, పిండము.

పారత్రికము, పారలౌకికము— పరలోకసంబంధము కలది.

పారదము— రోగముయొక్క అంతము నిచ్చునది = పాదరసము.

పారమార్థికుఁడు— మిగుల నుత్కృష్టమైన ప్రయోజనమును గోరెడు బుద్ధి కలవాఁడు

పారస్వధికుఁడు, పారశ్వధుఁడు — గండ్రగొడ్డలి యాయుధముగాఁ గల వాఁడు=పరశురాముఁడు.

పారస్త్రైణేయుఁడు— పరస్త్రీయందుఁ బుట్టినవాఁడు.

పారావారము— అపారమైన తీరము గలది = సముద్రము.

పారాశరి— పరాశరుని పుత్త్రుఁడగు వ్యాసునిచే రచింపఁబడిన బ్రహ్మ

పాంచజన్యమను పేరుగల శంఖమును ధరించినవాఁడు = విష్ణువు.

పాంచజన్యము— సముద్రమున తిమిరరూపుఁడై సంచరించుచున్న పంచజనుఁడను రక్కసుని యెముకవలనఁ బుట్టినది = విష్ణుని శంఖము.

పాంచాలి— పాంచాల దేశపురాజగు ద్రుపదుని కుమార్తె = ద్రౌపది.

పాంచాలిక— వస్త్రదంత కాష్ఠాదులచేఁ జేయఁబడిన నరమృగాది రూపము కలది = బొమ్మ.

పాండవులు— పాండురాజు కుమారులు = ధర్మజ, భీమ, అర్జున, నకుల, సహదేవులు.

పాం(సు)(శు)ల— దుష్టమైన చరితము కలది = ఱంకులాఁడి.

పాఁతర— ధాన్యమును గుప్తము చేసి కొనుటకై త్రవ్వఁబడిన కల్లము.

పాఁప(జందెములమేటి)జన్నిగట్టు— సర్పమున యజ్ఞోపవీతముగా ధరించిన దిట్ట = వినాయకుఁడు.

పాఁపజగము— పాములు నివసించెడు జగత్తు = నాగలోకము.

పాఁపతొడవులవేల్పు— సర్పములు భూషణములుగాఁగల దేవుఁడు = శంకరుఁడు.

పాఁప(మేపరి)మేపుఁడు— పాములు తినువాఁడు = గరుడుఁడు (నెమలి).

పాఁపరమ్ము— సర్పరూపముగల యస్త్రము = నాగాస్త్రము.

పాఁపఱేఁడు— పాములకుఁ బ్రభువు = వాసుకి (సర్పరాజు).

పాకశాసని— దేవేంద్రుని పుత్త్రుఁడు = 1. జయంతుఁడు, 2. అర్జునుఁడు.

పాకశాసనుఁడు, పాకారి—1. వృత్రాసురుని సోదరుఁడగు పాకాసురుని జంపినవాఁడు, 2. గర్భవతియగు లీలావతిని శిక్షించినవాఁడు = ○ ఇదుఁడు.

పాటచ్చరుఁడు— శిథిలమైన వస్త్రమును సయితము తీసికొనువాఁడు = దొం .

పాఠీనము— వేయికోఱల చేఁప.

పాఠీనుఁడు— పీఠిలోఁ బురాణము చదువువాఁడు.

పాణిగృహీత— పెండ్లి కొక పూర్వము చుకొన్న యువతి.

పాణిగృహీతి— అగ్నిసాక్షిగా వివాహమైన భార్య = ధర్మపత్ని.

పాణి(గ్రహణము)పీడనము— వధూవరు లొండొరుల హస్తమును గ్రహించుట = వివాహము

పాణి(ఘుఁడు)వాదుఁడు— చేతులతోఁ దాళము వేయువాఁడు.

పాతంగి— పతంగుని (సూర్యుని) కుమారుఁడు = శని.

పాతకము— (నరకరూపమున) పడుటకు హేతువైనది = పాపము.

పాతాళము— పాపముకలవ దీనియందుఁ బడుదురు = ఒక యధోలోకము.

పలగండుఁడు—సున్నపుఁబూఁత పూయువాఁడు = లేపనుఁడు. (వెల్ల వేయువాఁడు)

పలపైతృకము—శ్రాద్ధకాలమున మాంసము నుపయోగించెడు పూర్వకాలపుకర్మ.

ప (ల) లాశి, ప (ల) లాశుఁడు—మాంసమును భక్షించువాఁడు=రాక్షసుఁడు.

పలిక్ని—నెఱసిన వెండ్రుకలు కలది = వృద్ధురాలు.

పలుకు(లు)ఁజెలి—పలుకుల యధిష్ఠాన దేవత = సరస్వతి.

పలుకుఁదత్తడి—విద్యలు నేర్చిన వాహనము = చిలుక.

పలుకుల పులుఁగు—మాటాడ నేర్చిన పక్షి = చిలుక.

పలుకువెలఁది (పలుకుల జవరాలి) మగఁడు—సరస్వతి భర్త = బ్రహ్మ.

పల్గొమ్ముల మెకము, పలుగొమ్ముల మెకము— దంతములు కొమ్ములుగాఁ గల జంతువు = ఏనుఁగు.

పల్కుటల్గుమేటులు—శాపరూప వాక్కులు బాణములుగాఁగల దిట్టరులు = దేవతలు, బ్రాహ్మణులు.

పల్లవాస్త్రుఁడు—చిగుళ్ళాయుధములుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

పల్వాలుగలదొర—కోఱలు ఆయుధముగాఁ గల సర్పములకుఁ బ్రభువు = వాసుకి

పవనతనయుఁడు— వాయుదేవుని కుమారుఁడు = హనుమంతుఁడు, భీముఁడు, అగ్ని.

పవ(మానుండు)నము— పరిశుద్ధము చేయునది = గాలి.

పవనా(శి)శనము—గాలి యాహారముగాఁ గలది = సర్పము.

పవ(నుఁడు)మానుండు—ఎల్లప్పుడును సంచరించువాఁడు, పవిత్రము చేయువాఁడు = వాయుదేవుఁడు.

పశుపతి—ప్రమథగణములకును,జంతువులకును ప్రభువు జీవులను సంసారబంధమునుండి రక్షించువాఁడు=సాంబశివుఁడు, పశువులకు మగఁడు = ఎద్దు, దున్న.

పశ్యతోహరుఁడు—చూచుచుండఁగనే యపహరించువాఁడు = అగసాలి.

పశ్యత్ఫాలుఁడు— చూడఁగల ఫాలము (నుదుటనేత్రము)గలవాఁడు=శివుఁడు.

పసిఁడికంటి—చూ. పైడికంటి.

పసిఁడిపుట్టము (దువ్వలువ)దాల్పు—చూ. పీతాంబరుఁడు.

పసిఁడి(పయిఁడి)ఱేఁడు— ధనమునకుఁ బ్రభువు = కుబేరుఁడు.

పసిగాపు —చూ. గోపాలుఁడు.

పాంచజ(న్యధరఁడు)న్యుఁడు—

పరమాన్నము—పాలు బెల్లము వేసి వండిన యుత్కృష్టమైన యన్నము.

పరమేశ్వరుఁడు—శ్రేష్ఠుఁడైన ప్రభువు = విష్ణువు, శివుఁడు.

పరమేష్ఠి—శ్రేష్ఠమైన స్థానమగు సత్యలోకమున నుండువాఁడు = బ్రహ్మ

పరశు (హస్తుఁడు) రాముఁడు — చూ. గండ్రగొడ్డలి తాలుపు.

పరశువు— పరులను హింసించునది = గండ్రగొడ్డలి.

పరా (ఙ్ముఖుఁడు) ఙ్ముఖుఁడు— పెడ ముఖము పెట్టినవాఁడు, విముఖుఁడు.

పరాత్పరుఁడు—శ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడు = భగవంతుఁడు.

పరార్థవాది, పరవాది —పరుల ప్రయోజనమునకై (ధనము గ్రహించి) వాదించువాఁడు = న్యాయవాది

పరిపంథి—బంధించువాఁడు = శత్రువు.

పరిభాష—సంక్షేప నిర్వాహార్థము కల్పింపఁబడిన శాస్త్ర సంకేతము.

పరి(విత్తుఁడు) త్తి— తమ్మునికిఁ బెండ్లి యై తాను పెండ్లికాకయుండువాఁడు.

పరివేత్త — అన్నకంటె ముందుఁ బెండ్లాడిన తమ్ముఁడు.

పరి(ధి)వేశము(పరివేషము) — అంతటను వ్యాపించునది, సూర్య చంద్రులకుఁ జుట్టును మండలాకారముగా నేర్పడెడు తేజోవిశేషము.

పరి(రీ)వ్రాజకుఁడు, పరివ్రాట్టు — సమస్తమును త్యజించిపోవువాఁడు.

పరిషత్తు — వేదమును బఠించి శాస్త్రనిర్ణయమునకు సమర్థులైన ఆహితాగ్నులగువారలు నలుగురుగాని, ముగ్గురుగాని కూడి, లేక వేదవేదాంగములను బఠించి ధర్మజ్ఞులైనవారలు ఐదుగురు కాని కూడినది = సభ.

పరిషేచనము— పుడిసిట నీళ్ళుంచుకొని భోజన పాత్రాదుల చుట్టును సమంత్రకముగఁ బోయుట.

పరిష్వంగము— అంతటను గూడుట = కౌగిలి, గాఢాలింగనము.

పరుసవేది—తాకించుటచే లోహమును బంగారముగా మార్పఁగల మూలికా విశేషము.

పరేత(పతి)రాజు— మృతి చెందిన వారికి ప్రభువు = యముఁడు.

పర్ణాదుఁడు— ఆకులను తినువాఁడు.

పర్యంకము—దీనియందు గభోగాదులతో నుండుకొనఁబడును = మంచము.

పర్వతము—సంధులు కలది = కొండ.

పర్వసంధి—పూర్ణిమకును, పాడ్యమికిని, అమావాస్యకును, పాడ్యమికిని నడుమఁగల కాలము.

పఱిగబ్రతుకు—కోయునపుడు చేను యందు వ్రాలిన వెన్నులను తిని, లేదా యేరుకొని బ్రతుకు వృత్తి = ఉంఛవృత్తి.

పద్మ(గర్భ)నాభుఁడు— చూ కమలనాభుఁడు.

పద్మబాంధవుఁడు— చూ. కమలబాంధవుఁడు.

పద్మము— దీనిని లక్ష్మి పొందును = తామర.

పద్మరాగము— పద్మము యొక్క రక్తిమవంటి రక్తిమ గలది = కెంపు.

పద్మాకరము— చూ. కమలాకరము.

పద్మాలయ— చూ. కమలాలయ.

పద్మి—దేహమున బొట్లుకలది=ఏనుఁగు.

పద్మిని—పద్మము(లు)గలది = సరస్సు, తామరతీఁగ, లక్ష్మి (కమలిని).

పద్మినీ(కాంతుఁడు) వల్లభుఁడు — తామరలకుభర్త = సూర్యుఁడు. (సూర్యోదయము కాఁగానే కమలములు వికసించును.)

పన్నగము— పాదములచేఁబోవనిది = పాము.

పన్నగాశనుఁడు—చూ. ఉరగారి.

పయోధరము— ఉదకమును ధరించునది = మేఘము, టెంకాయ; పాలను ధరించునది = స్తనము.

పయో(ని)ధి—చూ. అంబుధి.

పయోరాశి— చూ. అంబురాశి.

పరంతపుఁడు— శత్రువులను మిగుల గాసి పడఁజేయువాఁడు = శూరుఁడు.

పరం(పరమ)పదము— మిక్కిలి ఉత్కృష్టమైన స్థానము = వైకుంఠలోకము.

పరంపరావాహనము— అనేకులు మోయునట్టి అందలము [illegible] తేరుమోకు.

పరఁటిపుట్టువు— కుంభసంభవుఁడు

పరతంత్రుఁడు— చూ. పరాధీనుఁడు.

పరదేశి— అన్యదేశమునుండి వచ్చినవాఁడు = అతిథి.

పరపత్తెము— మన [illegible] ఇతరులయొద్ద ద్రవ్యమును చేబదులుగా గ్రహించుట.

పరపిండాదుఁడు, పరాన్నుఁడు — ఇతరులయన్నమును దినువాఁడు.

పరపుష్టము—చూ. పరభృతము.

పరపూర్వ— పూర్వము పెండ్లియాడిన మొదటి భర్తగల యాఁడుది

పర(భృతము)భృత్తు— పరులచేఁ బెంచఁబడునది. (కోయిల పిల్లలు వచ్చువఱకు కాకులచేఁ బెంచబడును.)

పరమము— ఉత్కృష్టమైనది = పరమాత్మ.

పరమహంస— ఉత్తమపదము నందిన సన్న్యాసి.

పరమాణువు— మిక్కిలి సూక్ష్మమైన యణువు.

పరమా (త్ముఁడు) త్మ—ఉత్కృష్టమైనయాత్మ = పరబ్రహ్మము.

పచ్చవారపుజోదు—పచ్చని చిలుక వాహనముగాఁ గల యోధుఁడు = సూర్యుఁడు.

పచ్చవి(లుతు) (ల్తు) ల్కాఁడు — పచ్చని విల్లుగలవాఁడు=మన్మథుఁడు.

పచ్చ(విల్తుని) (విల్కాని) తేజి—మన్మథుని వాహనము = చిలుక.

పట్టాభిషేకము—యువరాజునకుఁ బట్టము కట్టునపుడు చేయు నుత్సవ విశేషము.

పట్టెవర్ధనము—పట్టెగలెఁ దీర్చి పెట్టిన నొసటి నామము.

పడగ (దారి) తాలుపు—పడగను ధరించునది = సర్పము.

పడుపుగొమ్మ—వ్యభిచారవృత్తిచే సంపాదనచేసెడియువతి = వేశ్య మె.

పడమటిదొర-పశ్చిమదిశకుఁ బ్రభువు= వరుణదేవుఁడు.

పణ్యాంగన—చూ. వెలయాలు.

పణ్యాజీవుఁడు—అంగటిసరకు లమ్ముకొని జీవించువాఁడు = వర్తకుఁడు.

పత(ం)గము—ఎగురుచుఁ బోవునది = పక్షి, అగ్నియందుఁబడునది = మిడుత.

పతత్త్రము—క్రిందఁ బడకుండునట్లు రక్షించునది = ఱెక్క.

పతత్త్రి—ఱెక్కలు గలది = పక్షి.

పతివ్రత— మగని సేవించుటే వ్రతముగాఁ గలది = సాధ్వి.

పత్తి—1 ఏనుఁగు, 1 రథము, 3 గుఱ్ఱములు, 5 కాల్బంట్లుగల సేనాసమూహము.

పత్ని— పతితోఁగూడ యజ్ఞయోగము గలది = భార్య.

పత్త్రపరశువు—పత్త్రాకారముగా నున్న ఆయుధము = ఆకురాయి

పత్త్రరథము— ఱెక్కలే గమనసాధనమైన రథముగాఁగలది = పక్షి.

పత్త్రి— పత్త్రములు (ఱెక్కలు) గలది= పక్షి.

పథికాశ్రయము—మార్గస్థుల కాధారమైనది = సత్త్రము.

పదా(జి)తి— పాదములతో నడచుచు యుద్ధముచేసెడి సేన = కాల్బలము.

పదాపది—ఒకరినొకరు కాలితోఁ దన్నుకొనుచుఁ జేసెడి పోరాటము.

పదార్వాళ్ళదొర—పదునారు కళలుగల ప్రభువు = చంద్రుఁడు.

పదినూఱంచులవాలు— వేయి అంచులు గల ఆయుధము = సుదర్శన చక్రము.

పదివేసములసామి— లోకోద్ధరణార్థము పది యవతారముల నెత్తినవాఁడు = విష్ణువు.

పద్మ—చూ. కమల.

పంచాస్యుఁడు—ఈశానము, తత్పురుషము, వామదేవము, సద్యోజాతము, అఘోరమునను 5 ముఖములు కలవాఁడు = శివుఁడు.

పంచ(వక్త్రుఁడు)ముఖుఁడు— చూ. పై.

పంటపైరులదొర— సస్యములు పండుట కాధారుఁడైన ప్రభువు = చంద్రుఁడు.

పంట(చెలి) (పొలఁతి) వలంతి— పంటలిచ్చు స్త్రీ = భూదేవి

పండితంమన్యుఁడు— తన్నుఁ బండితునిగాఁ దలంచుకొనువాఁడు.

పండితపుత్త్రుఁడు—పండితుని కుమారుడు = (శంకరయని రూఢ్యర్థము)

పండితుఁడు— శాస్త్రమందు మంచి బుద్ధిగలవాఁడు (పండ = బుద్ధి) = విద్వాంసుఁడు.

పంచాస్త్రుఁడు—చూ. పంచశరుఁడు.

పక్కిడాల్వే(లుపు)ల్పు-చూ. గరుడధ్వజుఁడు.

పక్కిమెుడలివాఁడు—పక్షి శరీరమువంటిశరీరముగలవాఁడు = కిన్నరుఁడు.

పక్కి(ఱేఁడు) రాయఁడు - పక్షులకుఁ బ్రభువు = గరుడుఁడు.

పక్షచరుఁడు—శుక్లపక్షమందు సంచారము చేయువాఁడు = చందురుఁడు. (శుక్లపక్షమం దభివృద్ధి నొందుచును కృష్ణపక్షమందు క్షీణించుచును సంచరించువాఁడు.)

పక్షజన్ముఁ—శుక్లపక్షమందు జన్మముగలవాఁడు = చంద్రుఁడు.

పక్షాంతము—పక్షముయొక్క అంత్యదివసము = పూర్ణిమ, అమావాస్య.

పగటి(గ్రుడ్డి)చీఁకటి—దివాంధము.

పగటిచీఁకు—పగలు కన్నులు కనఁబడనిది = కనకాక్షి.

పగటిజ్యోతి—పగటిభాగమున దీపమువలెఁ బ్రకాశించువాఁడు = సూర్యుఁడు.

పగటివే(ల్పు)లుపు— పగలు ప్రకాశించు దేవుఁడు = సూర్యుఁడు.

పగడపంటిదొర—ఏకదంతుఁడు.

పగలింటిదొర—పగలనెడు గృహముననుఁ బ్రభువు = సూర్యుఁడు.

పగలుసేయువలంతి—దినకరుఁడు.

పచ్చకన్నులమెకము— పసుపువన్నె కన్నులుగల మృగము = సింహము.

పచ్చకప్పురము—చల్లఁదనమును, మంచిపరిమళమునుగల యొకవిధమగు కర్పూరము.

పచ్చగుఱ్ఱములుగలాఁడు— పచ్చనియేడు గుఱ్ఱములు రథ్యములుగాఁ గలవాఁడు = సూర్యుఁడు.

పచ్చటెక్కలపిట్ట— పసుపువన్నె టెక్కలుగల పక్షి = చిలు.

పంగనామము— ఫాలమున పంగవలె నుండునట్లుంచిన తిరుమణి.

పంచగవ్యము—ఆవుపేడ, మూత్రము, పాలు, పెరుగు, నేయి (5).

పంచగుప్తము, పంచగూఢము— తన యవయవములనైదింటిని (నాలుగు పాదములు, తల) దాఁచుకొను శక్తి కలది = తాఁబేలు.

పంచజనుఁడు— పంచభూతములవలనఁ బుట్టువాఁడు = మనుష్యుఁడు.

పంచత్వము- పంచభూత సమ్మిళితమగు శరీరము పంచభూతములలో నైక్యమును బొందుట.

పంచదశి— పదునైదధ్యాయములు గల యొకానొక వేదాంతగ్రంథము.

పంచనఖము— ఐదుగోళ్లుగలది=పులి.

పంచనఖి— ఐదుగోళ్లుగలది=ఉడుము.

పంచనదము— ధూతపాప, కిరణానది, ధర్మనది, గంగ, యమునలు గలసిన పుణ్యతీర్థము.

పంచబాణుఁడు—చూ. పంచశరుఁడు.

పంచభద్రము— ఐదుస్థలములయందు మంచిసుళ్ళుగల గుఱ్ఱము.

పంచమంగలము- శరీరావయవములలో నైదుసుళ్ళుగల యేనుఁగు.

పంచమము— నాభి, ఉరస్సు, హృదయము, కంఠము, శిరము - వీనియందుఁ బుట్టునది, కోయిలలచే విస్తరింపఁబడునది = ఒక స్వరవిశేషము.

పంచమి— పక్షమునం దైదవ తిథి, ఐదుగురు భర్తలుగలది = ద్రౌపది.

పంచముఖుఁడు— పంచాస్యుఁడు.

పంచముఁడు— ఐదవజాతివాఁడు.

పంచలక్షణము— సృష్టి, ప్రతిసృష్టి, వంశము, మన్వంతరము, వంశానుచరితము నను నైదు లక్షణములుగలది = పురాణము.

పంచశరుఁడు—ఉన్మాదన, తాపన, శోషణ, స్తంభన, సమ్మోహనములను నైదుబాణములు గలవాఁడు = మన్మథుఁడు (అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అను నైదు బాణములు కలవాఁడు.)

పంచశాఖము— ఐదు శాఖారూపములైన వ్రేళ్ళుకలది = చేయి.

పంచాంగము— 1. తిథి వార నక్షత్ర యోగ కరణము లను నైదవయవములు గల సాంవత్సరిక గ్రంథము, 2 ఐదవయవములు మాత్రమే గలది=తాఁబేలు.

పంచాననుఁడు—చూ. పంచాస్యుఁడు.

పంచామృతము— పాలు, పెరుగు, నెయ్యి, తేనె, జలములయొక్క మిశ్రమము.

పంచాయతి—న్యాయము తీర్పు చెప్పుటకు మధ్యస్థులుగా నెన్నుకొనఁబడిన 5 గురి కూటమి.

పంచాసన (స్య)ము— విస్తృ ముఖముగలది = సింహము.

**నేత్రయోని**— నేత్రాకారములగు యోనులు (స్త్రీల మర్మావయవములు) గలవాఁడు = ఇంద్రుఁడు. (రాత్రి భాగమున కోడియై కూసి, గౌతముఁడు నదికిఁబోఁగా మోసముచే నహల్యను గూడిన యింద్రుని గౌతమమహర్షి శరీరమంతయు సహస్రయోనులతోఁ గూడి యుండునట్లు శపించెను. ఇంద్రుఁడు పాదములపైఁ బ్రాలఁగా నవి లోకమునకు నేత్రాకారము గలవిగాను దనకు మాత్రము యోనియాకారముగానే యుండునట్లుగాను శాపమును మార్చెను)

**నేపథ్యము**— నాట్యరంగమునకుఁ దెర లోపలి ప్రదేశము.

**నేమంబుఁగన్న మన్నీని తల్లి**— తండ్రి కొఱకుఁ బెండ్లి చేసికొనని ప్రతిజ్ఞ వహించిన భీష్ముని తల్లి = గంగ.

**నేల (చూలి) పట్టి**— భూమికిఁ బుట్టినది. (జనకుఁడు సంతానములేక పుత్రేష్టి చేయఁదలఁచి భూమిని దున్నించుచుండ నాఁగటిచాలున నొక బంగరుపెట్టె లభించినది. అందీమె లభించుటచే సీత యను నామకరణము చేసినట్లు రామాయణప్రసిద్ధి.) = సీత, చూ. ధరణీ సుతుఁడు.

**నేలతాలుపు**— భూమిని ధరించునది (వాఁడు) = పర్వతము, శేషుఁడు.

**నేలఱేఁడు**— భూమికిఁ బ్రభువు = రాజు.

**నేలవే (ల్పు) లుపు**— భూదేవుఁడు.

**న్యర్బుదము**— పది అర్బుదములు. (అర్బుదము = వేయికోట్లు)

**నైగమము**— నిగమము (వేదము) నకు సంబంధించినది = వేదాంతము.

**నైచికి**— సురూపమును, మంచి పరువమును గలిగి సమృద్ధిగా బాలిచ్చెడి యావు.

**నైమిత్తికము**— అప్పుడప్పుడు చేయవలసిన అబ్దికాది విధాయక కర్మము.

**నైమిశారణ్యము**— (లోకనిర్మాణార్థము పరమేష్ఠి సత్రయాగము చేయఁదలఁచి సంచరించుచుండఁగా ధర్మరథచక్రము యొక్క నేమి జారిపడిన పవిత్రస్థలము) నగరనిర్మాణ సమర్థమగు మణికై గౌరముఖుఁడను మునితోఁ గలహించు దర్జయరాజుసేనను నిమిషకాలములోనే విష్ణువు సంహరించిన పుణ్యక్షేత్రము.

**నైయాయికుఁడు**— న్యాయశాస్త్రము (తర్కము) నెఱింగినవాఁడు.

**నైవేద్యము**— భగవంతునకు నివేదింపఁబడిన వస్తువు.

**పంకజము**— పం (కేజ) కజాతము, పంక (పంకే) రుహము, బురదయందుఁ బుట్టినది = తామర.

**పంక్తి (కంఠుఁడు) కంధరుఁడు**— పదియగా నున్న (-ది) కంఠములు గలవాఁడు = రావణుఁడు.

**పంక్తిరథుఁడు**— చూ. దశరథుఁడు.

నుసిపురుగు—కట్టిసామానులను దొలిచి పొడిచేసెడు పురుగు.

నూఱంచులకైదువు — నూఱంచులు గల యాయుధము = వజ్రాయుధము.

నూఱంచులవాలు—చూ. పై.

నూఱుజన్నముల సోమాసి—నూఱు యజ్ఞములు చేసిన సోమయాజి.

నృత్త(నృత్య)ప్రియుఁడు— నాట్యమునం దిష్టము కలవాఁడు = శివుఁడు, నెమలి.

నృత్త(త్య)ము—హస్తాద్యవయవ విక్షేపమాత్రము కల నాట్యము = నర్తనము.

నృపతి—నరులకుఁ బ్రభువు = రాజు.

నృపలక్ష్మము—రాజున కుండెడు ప్రధానచిహ్నము = తెల్లగొడుగు.

నృపుఁడు } చూ. నృపతి (నరపతి)
నృపాలుఁడు }

నృశంసుఁడు—నరులను పీడించువాఁడు = దుర్మార్గుఁడు.

నృ(సింహుఁడు)హరి— చూ. నరసింహుఁడు = విష్ణువు.

నైష్ఠికశీల— సదాచార సంపన్నమగు స్వభావము కల (ది) వాఁడు.

నెత్తమ్మిదిమ్ముల నిదురమందు— వికసించిన తామరలను ముకుళింపఁ జేయుటకు మందువంటి వాఁడు = చంద్రుఁడు.

నెత్తురుద్రావుఁడు—రక్తమును ద్రావు వాఁడు = రాక్షసుఁడు.

నెమ్మి(జేఁడు)రా(రవు)తు— నెమలి నెక్కువాఁడు = కుమారస్వామి.

నెల(కూన)(చూలి)పట్టి — చంద్రుని కుమారుఁడు = బుధుఁడు. (గురువగు బృహస్పతి భార్యయైన తారయందుఁ జంద్రునికిఁ బుట్టినవాఁడు )

నెలజోడు— చంద్రునకు జోడయిన వాఁడు = సూర్యుఁడు. (శ్రీకృష్ణుని నేత్రములు సూర్యచంద్రులు.)

నెల (దారి) తా (ల్పు) లుపు— చూ. చంద్రశేఖరుఁడు.

నెలత్రావుడము— వెన్నెలను త్రావు పక్షి = చకోరపక్షి.

నెలపు(లుఁగు) (ల్గు)ల్వ— చూ. పై.

నెలదారిసింగిణి— (చంద్రుని శిరమున ధరించిన) శివుని ధనుస్సు.

నెల (దిండి)మేసరి—చంద్రుని మ్రింగు వాఁడు = రాహువు.

నెలయల్లుఁడు— చంద్రుని (సోదరియగు లక్ష్మికుమారుఁడు) మేనల్లుఁడు = మన్మథుఁడు.

నెలఱాయి—చంద్రోదయమున స్రవించెడు ఱాయి = చంద్రకాంతము.

నెలవెలుఁగు— చంద్రుని కాంతి = వెన్నెల.

నేజకుఁడు— బట్టలు శుద్ధిచేయువాఁడు = చాకలి.

నీడజము, నీడోద్భవము—గూఁటి యందుఁ బుట్టినది = పక్షి.

నీరజభవుఁడు—అంబుజభవుఁడు.

నీరదము—చూ. అంబుదము.

నీర(ని)ధి—చూ. అంబు(ని)ధి.

నీరాటము— చూ. జలచరము, నీరు ద్రిమ్మరి, నీటిదయ్యము, చూ. పై.

నీరుమని—నీరు సమృద్ధిగాఁగల ఋతువు = వర్షర్తువు.

నీరుకాసులు—తీర్థములందు స్నానము చేసి బ్రాహ్మణులకిచ్చు ధనము.

నీరుకాళ్ళు—శోణ హరిత వర్ణములై యుభయసంధ్య లందును దోఁచెడు సూర్యకిరణములు.

నీరు(పాప)చిచ్చు—నీటి యందలి అగ్ని = బడబాగ్ని.

నీరుటెంకి—చూ. జలాశయము.

నీలకంఠము—నల్లని మెడకలది=నెమలి.

నీల(గ్రీవుఁడు)కంఠుఁడు—(క్షీరసాగర మథనమునఁ బుట్టిన హాలాహలమును మ్రింగుటచే)నల్లనైన కంఠముగలవాఁడు = శివుఁడు.

నీలధ్వజము—నల్లజెండావలె నుండునది = తాడిచెట్టు.

నీలలోహితుఁడు—కంఠమున నలుపును, కేశములయం దెఱుపును గలవాఁడు (బ్రహ్మ హోమము చేయునపుడు లలాటమునందలి స్వేదబిందువు అగ్ని యందుఁబడి నల్లనిరంగు కలదై పిమ్మట నెఱ్ఱనయ్యెనని పురాణ ప్రసిద్ధి) = శివుఁడు.

నీలవసనుఁడు, నీలాంబరుఁడు—నల్లనివస్త్రములు గలవాఁడు = శని, బలరాముఁడు.

నీలాంబుజము, నీలాబ్జము—నీటియందుఁ బుట్టినది = నల్లగలువ.

నీలిరాగము—బాహ్యమునకు విశేషముగా నగుపడక లోనను౦డెడుగాఢాను రాగము.

నీ(వరి)వారము—ఎవి త్త న ము లేక పండెడు దూసరులు మున్నగు తృణ ధాన్యము = నివ్వరి.

నీహారము—అగ్నిచే మిక్కిలిహరింప బడునది = మంచు.

నీళ్ళరాయఁడు—ఉదకముల కధిపతి = వరుణుఁడు.

నీళ్ళవరుగు—సముద్రపునీటిని వరుగు వలె నెండఁబెట్టఁగా వచ్చునది = ఉప్పు.

నుడికారము—మాట యందలి చమత్కారము.

నుడుగుఱేఁడు—వాక్కులకుఁ బ్రభువు = బృహస్పతి.

నునుగాడ్పుదిండి— మృదువైన వాయువును భక్షించునది = సర్పము.

నది = నక్క, గూబ, పాము, చక్రవాకము.

నిశాధీశుఁడు—చూ. నిశాపతి.

నిశాచ(రుఁడు)రి— రాత్రులందు సంచరించు (వాఁడు) నది = రాక్ష(సుఁడు) సి = జా(రుఁడు)రిణి, దొంగ.

నిశాటనము— రాత్రియందు సంచరించునది = గుడ్లగూబ.

నిశాటుఁడు—చూ. నక్తంచరుఁడు.

నిశాపతి } రాత్రికిఁ బ్రభువు=
నిశానాథుఁడు } చంద్రుఁడు.

నిశాపుష్పము—రాత్రులందు వికసించుపువ్వు = కలువ. మొ.

నిశా(రత్నము)మణి— రాత్రులందు మణివలెఁ బ్రకాశించు (వాఁడు) నది = మెరుగుడుపురుగు; చంద్రుఁడు.

నిశామృగము— రాత్రులందు సంచరించు జంతువు = నక్క.

నిశావసానము } రాత్రివిడుచువేళ =
నిశోత్సర్గము } వేకువ.

నిశ్చలాంగము—చలింపని దేహము గలది = కొంగ.

నిశ్చేష్టాకరణము— మనుష్యుని నిశ్చేష్టునిగాఁజేయు మన్మథబాణము.

నిశ్శ్రీకుఁడు—సంపద లేనివాఁడు = దరిద్రుఁడు.

నిషాదుఁడు— జంతుహింసచే వీనియందుఁ బాపముండును = కిరాతుఁడు.

నిష్కామము— కోరికతోఁ జేయఁబడని కర్మ.

నిష్కించనుఁడు—కొద్ది సంపదయైనను లేనివాఁడు = దరిద్రుఁడు.

నిసివెలుఁగు—రాత్రులందు కాంతి గలవాఁడు = చంద్రుఁడు.

నిస్త్రింశము—ముప్పది యంగుళములకంటెను అధికమైనది = ఖడ్గము.

నిస్సంగుఁడు—స్వకుటుంబ సంబంధమును వర్జించి ఋషివలె సంచరించువాఁడు = ముముక్షువు.

నీటికానుపు—చూ. అంబుజన్ముఁడు.

నీటి(బిడ్డఁడు)చూలి—చూ. పై.

నీటికుప్ప—చూ. అంబురాశి.

నీటితాత— నీటికిఁ దండ్రియైనవాఁడు = వాయువు.

నీటినీరుతాలుపు) } చూ. జలధరము.
నీటి(నీరు)మోపరి }

నీటిపుట్టు(వు.గు)వ— అంబుజము.

నీర(రుహము)జము } చూ. పై.
నీరుపుట్టు(వు) వ }

నీటియిక్క—నీరు స్థానముగాఁగలది = కౌస్తుభమణి.

నీటిరొమ్ముడయుఁడు, నీటి(నీళ్ల)ఱేఁడు—చూ. అంపాపతి.

నిపానము — నియతముగాఁ బశువులు దీనియం దుదకమును పానముచేయును = తొలిగోలెము.

నిమంత్రణము — శ్రాద్ధ భోజనాదుల యందుఁ దగినవానిని నియమించుట.

నిమ్నగ — పల్లమునగూర్చి పోవునది = నది.

నిరంజన — కాటుక లేనిది; దోషము లేనిది = పున్నమ. నిరంజనుఁడు = పరమాత్మ.

నిరయము — దీనివలన శుభానవాప్తి నిర్గత మగును = నరకము

నిరాకారుఁడు — ఆకారము లేనివాఁడు = భగవంతుఁడు, హంసుఁడు.

నిరాలంబ(న)ము — ఆధారములేనిది = ఆకాశము, స్వతంత్రము.

నిర్జిహ్వము — వెలుపలికివచ్చు నాలుక గలది = కప్ప.

నిర్గుణయోగము — భగవంతుఁడు నామ రూప రహితుఁడని ధ్యానించుట.

నిర్గుణుఁడు — సుఖ దుఃఖాది గుణములు లేనివాఁడు = పరమాత్మ.

నిర్గ్రంధుఁడు — దిసమొలవాఁడు, బీద వాఁడు.

నిర్జరులు — అమృతము ద్రాగుటచే ముసలితనము లేనివారు = దేవతలు.

నిర్భాగ్యుఁడు — భాగ్యములేనివాఁడు = అదృష్టహీనుఁడు.

నిర్మాల్యము — దేవతాపూజకు వాడగా మిగిలిన లేక వాడిన పుష్పాదికము.

నిర్ముక్తుఁడు — సంసారసంబంధమును విడచినవాఁడు = సన్న్యాసి.

నిర్వపణము — మీఁదిజన్మమునకు బీజ రూపముగా మొలవఁబెట్టఁబడునది = దానము.

నిర్వాణము — దుఃఖాదులు లేనిది = మోక్షము.

నిర్వేదము — జ్ఞానముచేఁ గల్గిన వైరాగ్య బుద్ధి.

నివాతము — బాణముచే భేదింపరానిది = కవచము, గాలిలేనిది.

నివాపము — పితృదేవతలనగూర్చి చేయఁబడునది = ప్రేతత్వమునువిడచి పితృత్వమును బొందినవారికిఁ జేయు జలాంజల్యాదిదానము.

నివీతము — నియతముగాఁగప్పఁబడునది = కంఠమున హారమువలె వ్రేలాడు జన్నిదము.

నిశ — వ్యాపారమును శమింపఁ జేయునది = రాత్రి.

నిశాంతము — నిశయొక్క అంత్య భాగము = వేకువ, పగుల శాంతము గలది = ఇల్లు.

నిశాకరుఁడు — రాత్రిని గలుగఁజేయు వాఁడు = చంద్రుఁడు

నిశాచరము — రాత్రులందుఁ జరించు

మయిన పాపమును ఖండించువాఁడు= బ్రహ్మహానఁ పుత్త్రుఁడు.

నారసము— నరసమూహమునుగూర్చి పోవునది = బాణము.

నారాచము— నరసమూహము నాచమించునది = బాణము, నీటిఏనుఁగు.

నారాయణుఁడు- అవతారములయందు నరసంబంధమయిన శరీరమును బొందువాఁడు ఉదకము స్థానముగాఁ గలవాఁడు, నరసమూహము నివాసముగాఁ గలవాఁడు, శబ్దముల కాధారభూతుఁడయినవాఁడు, సాకూప్య ముక్తికి స్థానమైనవాఁడు, ౨౪ తత్త్వములు స్థానముగాఁ గలవాఁడు, ఒక మన్వంతరమున నరుఁడను ఋషికిఁ బుత్త్రుఁడైనవాఁడు.

నారి—నరుని వశముచేసికొనునది = స్త్రీ

నారికాయ— అల్లె తాటి రాపిడివలన హస్తమునఁగలిగిన బొబ్బ.

నారికేళము—రంధ్రములచే నుదకమును త్రీల్చునది = కొబ్బరిచెట్టు.

నారీజీవుఁడు—తన భార్యను విటులకుఁ దార్చుటచే వచ్చిన ధనముచే జీవించువాఁడు.

నాల్గుకన్నులవేల్పు— చవుగంటి.

నాస్తికుఁడు— ఈ లోకముతప్ప పరలోకము లేదనెడివాఁడు, భగవంతుఁడు లేఁడనెడివాఁడు.

నాళీకాసనుఁడు—కమలాసనుఁడు.

నింగిమూలి— ఆకాశముయొక్క బిడ్డఁడు = వాయువు.

నింగిసిగ— ఆకసమునిండిన సిగ గల వాఁడు = శివుఁడు.

నికషాత్మజుఁడు—నికషయను రాక్షస స్త్రీకిఁ బుట్టినవాఁడు = నిర్ఋతి.

నికృతప్రజ్ఞుఁడు— దోషయుక్తమైన హృదయముగలవాఁడు = వంచకుఁడు.

నికేతనము— నివాసమునకు యోగ్యమైనది = గృహము.

నిక్కల—చూచినది యనుభవములోనికిఁ దెచ్చెడు కల.

నిక్కువీనులజక్కి— చూ. ఉచ్చైశ్శ్రవము.

నిగమము—నియతముగా పొందఁబడునది = వేదము.

నిఘంటువు— అర్థాదులను దెలుపు ప్రమాణగ్రంథము

నిటలాక్షుఁడు — నుదుటఁ గన్ను కల వాఁడు = శివుఁడు.

నిడు (దవెన్ను) పఁడు —పొడవయిన (వెన్నుగల) వాఁడు = సర్పరాజు.

నితం (బిని) బవతి— గొప్పపిఱుదులు కల స్త్రీవిశేషము.

నిధనము— ధనసంబంధము దీనియందు నివృత్తియగును = మరణము.

నిధీశుఁడు (నిధిపతి) నాథుఁడు— నవనిధులకు నధిపతి = కుబేరుఁడు.

నాగజిహ్విక— పాము నాలుక వలె నుండునది = మణిశిల.

నా(గ)(ఁ)సాని— నాగవల్లి నడపెడు ముత్తయిదువ.

నాఁగటిజోదు— నాఁగలి ఆయుధము గాఁగల యోధుఁడు = బలరాముఁడు.

నాగపాశము— సర్పాకారము గల త్రాఁడు = వరుణుని యాయుధము.

నాగపాశి—సర్పాకారముగల త్రాఁడు ఆయుధముగాఁగలవాడు=వరుణుఁడు

నాగబెత్తము—మంత్రపూతమై పొన్ను వేయఁబడిన పేముబెత్తము.

నాగభూషణుఁడు—సర్పములు నగలు గాఁగలవాఁడు = శివుఁడు.

నాగము— పర్వతమునందుఁ బుట్టినది = 1. ఏనుఁగు, పర్వతమునఁగాని, చందన తరువందుఁగాని పుట్టునది = పాదములచే సంచరింపనిది = 2 సర్పము, 3 మెత్తనగుటచేఁ గదలునది=సీసము.

నాగరుఁడు—పట్టణమునఁ గాఁపురముండు వాఁడు.

నాగలోకము— నాగులు నివసించెడు లోకము = పాతాళము.

నాగాంతకము, నాగాశనము— పాములను జంపునది = నెమలి, గరుడపక్షి, ఏనుఁగులనుజంపునది=సింహము.

నాగా(ంతకు) (శను)ఁడు— సర్పమును జంపి తినువాఁడు = గరుత్మంతుఁడు.

నాటకము— పూర్వచరిత్రముల ననుసరించిన వేషములుధరించి కథాంశమును నేత్రగోచరమగునట్లు నటించుట, దశరూపకములలో ఒకటి.

నాట్యము— నటుని యొక్క కర్మ. వివాహాది శుభకార్యములయందు స్వరరస ప్రధానమైన యాట.

నాడింధముఁడు— అగ్నిజ్వాలకొఱకుఁ గొలిమి నూఁదువాఁడు = అగసాలె.

నాడీజంఘుఁడు—కాడవంటి పిక్కలు గలవాఁడు=రాజధర్ముఁడను కొంగ.

నాడీదేహుఁడు—నాడులు మాత్రమే మిగిలినదేహముగలవాఁడు = భృంగి.

నాపితుఁడు— బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందుఁ బుట్టియు సంస్కరింపఁబడనివాఁడు, అంతటను వ్యాపింపనివాఁడు, మంగలి.

నాభిజన్ముఁడు—చూ. కమలజన్ముఁడు.

నామకరణము—బిడ్డకుఁ బేరుపెట్టుట.

నామధేయము—దీనిచేఁ బలుకఁబడును = పేరు.

నాయకుఁడు—1. శృంగార రసాలంబన పురుషుఁడు = 2. అధిపతి.

నాయిక— శృంగార రసాలంబన స్త్రీ.

నారదుఁడు— కలహప్రియుఁ డగుటచే నరసంఘమును భేదించువాఁడు=దేవర్షి, పితృదేవతల కెల్లప్పుడును నారము నిచ్చుచుండెడువాఁడు, నరసంబంధ

నర్మద—క్రీడ నిచ్చునది = ఒక నది.

నర్మసఖు(చివు)ఁడు — వేడుక చెలి కాఁడు = విదూషకుఁడు.

నలకూబరుఁడు—1. నలుని యొక్క రథావయవమువంటి రథావయవము కలవాఁడు, 2. నల మనగా కమలము, అందుఁ గీర్తింపఁబడునట్టిది = లక్ష్మి, ఆమెచేఁ గోరఁబడువాఁడు = కుబేర పుత్త్రుఁడు.

నల(నయ్యా) మేలిదొర—నల్లని శరీరము గల ప్రభువు = శ్రీకృష్ణుఁడు, శ్రీరాముఁడు మొ.

నలినేశయుఁడు—ప్రళయమున నీటిపై శయనించువాఁడు = విష్ణువు.

నలుమోముప్రోడ దేవర—చూ. తీవంచమోముల దిట్ట.

నలువ(ల్వ)— (నాలుగు + వా) నాలుగు ముఖములుగలవాఁడు = బ్రహ్మ

నలువ(చూలి)పట్టి—బ్రహ్మ మానస పుత్త్రుఁడు = నారదుఁడు.

నల్లవలువదాలుపు—నీలవస్త్రమును ధరించువాఁడు = బలరాముఁడు.

నలువ(జక్కి)తేజి—బ్రహ్మయొక్క వాహనము = హంస.

న(ల్వ)లువరాణి—బ్రహ్మదేవుని భార్య = సరస్వతి.

నల్లద్రావు(వాఁడు)డు—రక్తమును ద్రాగువాఁడు = రాక్షసుఁడు.

నల్లనయ్యరవాలు—శ్రీవిష్ణువున కాయుధమైనవాఁడు = గరుత్మంతుఁడు.

నల్లనైదువగేస్తు—చూ. కప్పుమైదువ పెనిమిటి.

నవ(చ్ఛిద్ర) ద్వారము—తొమ్మిది రంధ్రములు గలది = శరీరము.

నవనీతము (నవోద్ధృతము) } నవీనమైన పెరుఁగు నుండి తీయబడినది. = వెన్న.

నవోఢ—నూతనముగా వివాహమైన యాఁడుది. (పెండ్లికూఁతురు)

నష్టేంద్రియుఁడు—పోయిన పుంస్త్వము గలవాఁడు.

నసగూఁటి—కామోద్రేకము కలది = జారిణి (పుం, నసగొంటు).

నాంది—నాటకమునకుఁ బూర్వమునఁ జరిపెడు మంగళము, బ్రాహ్మణాశీర్వాదము (కావ్యాదిపద్యము).

నాఁగటి(వాలు)జోదు (నాఁగలివాల్జోదు) } నాఁగలిచే యుద్ధము చేయు యోధుఁడు = బలరాముఁడు.

నాఁపకుత్తుకదంట—విషము కంఠమునఁగల దిట్టరి = శివుఁడు.

నాకము—దుఃఖములేని లోకము.

నాకేశుఁడు—స్వర్గమునకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

నడుపుకాఁడు(కత్తె)—విటులకు విటకత్తెలను దార్చువాఁడు (నది) = విటు(రాలు)ఁడు.

నపుంసకుఁడు—పుంస్త్వము లేనివాఁడు = పేడి.

నప్త—పితృదేవతలు అధఃపతనము గాకుండఁ జేయువాఁడు = మునుమనుమఁడు, మనుమఁడు.

నభశ్చక్షువు—ఆకసమునకు కన్నువంటివాఁడు = సూర్యుఁడు.

నభశ్చరము—ఆకాశమున జరించునది = మేఘము, పక్షి.

నభసంగమము—ఆకాశమునఁ బోవునది = పక్షి.

నభస్వంతుఁడు—ఆకాశమున నుండువాఁడు = వాయువు.

నభోగజము—ఆకాశమున నేనుఁగు యొక్క రూపముగలది = మేఘము.

నభోమణి—ఆకాశమునకు మణివంటివాఁడు = సూర్యుఁడు.

నముచిసూదనుఁడు—నముచి యను రాక్షసుని సంహరించినవాఁడు = ఇంద్రుఁడు.

నరక(జిత్తు)వైరి—నరకుని జంపినవాఁడు = కృష్ణుఁడు.

నరకము—1. పాపులను దన సమీపమును బొందించునది, 2. నరులు దీనియందు మొఱపెట్టుదురు = ఒక లోకము.

నరకాంతకుఁడు—నరకాసురుని సంహరించినవాఁడు = శ్రీకృష్ణుఁడు.

నరపాలుఁడు—నరులను బాలించువాఁడు = రాజు.

నరయజ్ఞము—అతిథిపూజనము.

నరయానము—నరులచే మోయఁబడునట్టి వాహనము = పల్లకి.

నరవాహనుఁడు—మనుష్యుఁడు వాహనముగాఁ గలవాఁడు = కుబేరుఁడు.

నరసింగఁడు—హిరణ్యకశిపుని వధించుటకై సగము నరాకారమును, సగము సింహాకారమును ధరించినవాఁడు = శ్రీవిష్ణువు.

నరాంతకుఁడు—మనుష్యులను జంపువాఁడు = రాక్షసుఁడు మొ.

నరేంద్రుఁడు, } నరులకుఁ బ్రభువు =
నరేశ్వరుఁడు } రాజు.

నర్తకి—నృత్యము చేయునది = నటనకత్తె.

నర్త(కము)ప్రియము—నాట్యమునం దిష్టముకలది = నెమలి, ఏనుఁగు.

నర్తనప్రియుఁడు—నాట్యమునఁ బ్రీతి గలవాఁడు = శివుఁడు.

నర్మగర్భము—పరిహాసములోనఁ గల మాట

నర్మము—రత్యతిశయమును బొందించునది = స్త్రీపురుషుల పరస్పర పరిహాసము.

నక్షత్రము— నాశము పొందనిది = చుక్క.

నక్షత్రసూచకుఁడు— జ్యోతిష్యము చక్కఁగాఁ దెలియనివాఁడు.

నక్షత్రేశుఁడు— నక్షత్రములకుఁ బ్రభువు = చంద్రుఁడు.

నఖక్షతము— గిల్లుటచే చర్మముపయి నేర్పడిన గోటిగురుతు.

నఖరాయుధము— గోరు ఆయుధముగాఁ గలది = కోడి పులి, సింహము.

నఖవిషుఁడు— గోటియందు విషము కలవాఁడు = మనుష్యుఁడు.

నగధరుఁడు— పర్వతమును ధరించినవాఁడు = (కృష్ణావతారమున గోకులమును రక్షించుటకై గోవర్ధనమును చిటికెనవ్రేల నెత్తినవాఁడు) కూర్మమయి మందర పర్వతమును వీపున ధరించినవాఁడు = విష్ణువు.

నగము— గమనము లేనిది = పర్వతము.

నగవైరి— పర్వతమునకు శత్రువు = ఇంద్రుఁడు. (పర్వతములు జనపదములపైఁబడి నాశనముగావించుచుండుటచే నింద్రుఁడు వజ్రాయుధముచే వాని రెక్కలను నరకెనని పురాణగాథ.

నగాధిపుఁడు— పర్వతములకుఁ బ్రభువు = హిమవంతుఁడు.

నగౌక(స)ము— పర్వతము నివాసస్థానముగాఁ గలది = పక్షి, సింహము.

నగ్నిక— దిసమొల గల యాఁడుది, లజ్జించునది = సమర్తాడని పడుచు.

నటిని— నాట్యముచేసెడి స్త్రీ = నట్టువుని భార్య.

నటేశ్వరుఁడు (నటరాజు) — నటులకుఁ బ్రభువు = శివుఁడు.

నట్టుగు(వు)ఁడు— నాట్యము చేయువాఁడు.

నట్టు(వ)పులుఁగు, నట్టు(వ)పిట్ట— నాట్యముచేయు పక్షి = నెమలి

నడబావి— నడచి దిగునట్లు లోనికి మెట్లేర్పఁబడిన బావి.

నదము— 1. పశ్చిమముగాఁ బారెడునది, 2. విశేషముగా ధ్వనించునది = సముద్రము.

నదీమాతృకము— నదీజలములచేఁ బండెడు పైరుగల ప్రదేశము.

ననంద— ఎంత సేవచేసినను సంతసింపనిది = వదినె, మగనితోఁబుట్టువు.

ననఁబోఁడి— పువ్వువలె సుకుమారమయిన శరీరముగలయువతి.

ననవిలుకాఁడు— పువ్వు ధనుస్సుగా గలవాఁడు = మన్మథుఁడు.

ననవిలుకానన్న— మన్మథుని యన్న = బ్రహ్మ.

ననవిలుతుఁడు (ననవిల్తుఁడు) — చూ. ననవిలుకాఁడు.

ధూమ(కేతువు)ధ్వజుఁడు— పొగ చిహ్నముగాఁ గలవాఁడు = అగ్ని.

ధూమయోని— ధూమము యోనిగాఁ (కారణము) గలవాఁడు = మేఘుఁడు.

ధూర్జటి— భారమైన జటలు గలవాఁడు = ఈశ్వరుఁడు.

ధూర్వహము— బరువు మోయునది = ఎద్దు.

ధూళిజంఘము - బూడిదవన్నె పిక్కలు గలది = కాకి

ధూళిధ్వజుఁడు— పరాగము చిహ్నముగాఁ గలవాఁడు = వాయువు.

ధేనుకసూదనుఁడు— చూ. ధేనుకారి.

ధేనుకారి— ధేనుకాసురుని సంహరించినవాఁడు = బలరాముఁడు; (గార్దభాకారము ధరించి తాలవనమునందుండి మనుష్య భక్షణము సేయుచుండెడి వాఁడు)

ధేనువు — దూడకుఁ బాలుగుడుపు ఆవు.

ధైవతము—1. ఋద్ధిమంతులచే బాడఁబడుచున్నది, 2. నాభ్యాదిస్థానముల వలనఁ బుట్టునది = ఒక స్వరము.

ధౌరతికము—అస్కందితము కంటె నధికమైన చతురమయిన యొక యశ్వధారా విశేషము.

ధౌరేయము —బరువు మోసెడు జంతువు = ఎద్దు, ఒంటె మొ.

ధ్యానము— మనశ్చాంచల్యము లేక భగవంతుని దలఁచెడు యోగాంగము.

ధ్వజద్రుమము—ధ్వజాకారముగా నుండెడు చెట్టు = తాడిచెట్టు.

ధ్వజారోహణము—దేవళములో నుత్సవారంభమున ధ్వజమెత్తి చేయునొక కర్మము.

ధ్వాంక్షము— మాంసమును గాంక్షించునది = కాకి, కొక్కెర.

ధ్వాంతము—మార్గము గానరాక యిందు మొఱపెట్టుదురు = చీఁకటి.

నంగనాచి— దిట్టతనము గలిగియు వెలుపలకు నేమియుఁ దెలియనిదానివలె నటించునది.

నంజుడు(దిండి) మేపరి— మాంసమును దినువాఁడు = రాక్షసుఁడు.

నందకము— దేవతలను సంతోషపెట్టునది = విష్ణుని ఖడ్గము.

నందనము— సంతోష పెట్టునది = ఇంద్రుని యుద్యానవనము.

నందనుఁడు— సంతోషమును గలుగఁజేయువాఁడు = కుమారుఁడు.

నంద్యావర్తము— పడమటి దిక్కునఁ గాక మిగిలిన మూఁడు దిక్కులందును వాకిళ్లుగల రాజగృహము.

నక్తంచరము— రాత్రులందు సంచరించునది = గ్రుడ్లగూబ.

నక్తంచరుఁడు— రాత్రి భాగమున సంచరించువాఁడు = రాక్షసుఁడు, చంద్రుఁడు, దొంగ.

నక్షత్రమాల— 27 ముత్యములు గ్రుచ్చిన యొంటిపేట హారము.

ధర్మసంహిత—మన్వాది ధర్మశాస్త్రము = స్మృతి

ధర్మాధి(కారి)కృతుఁడు— న్యాయ విచారణచేయు నుద్యోగి.

ధర్మారణ్యము—ఋష్యాదులు నివసించు తపోవనము

ధర్మాసనము—న్యాయాధికారికూర్చుండుటకు యోగ్యమగు నధ్యక్షపీఠము.

ధవుఁడు—స్త్రీని గంపింపఁజేయువాఁడు = భర్త.

ధాత—సమస్తమును ధరించినవాఁడు = బ్రహ్మ.

ధానుష్కుఁడు—చూ. ధన్వి.

ధామకేశి — కాంతులు కేశములుగాఁ గలవాఁడు = సూర్యుఁడు.

ధామనిధి—కాంతులను ధరించువాఁడు = సూర్యుఁడు.

ధారాటము— శీఘ్రగమనము గలది = గుఱ్ఱము.

ధారాదత్తము—మంత్రోదక పూర్వకముగా దానముచేయఁబడినది.

ధారాధరము— నీటిధారను ధరించునది = మేఘము, ధారను (కత్తియందు) ధరించునది = ఖడ్గము.

ధార్తరాష్ట్రము—నల్లనిముక్కు, కాళ్లు గల తెల్లనిహంస.

ధార్తరాష్ట్రుఁడు—ధృతరాష్ట్రుని కొడుకు, సర్వవిశేషము.

ధావకుఁడు — బట్టలు శుద్ధిచేయువాఁడు = చాఁకలి.

ధిషణుఁడు—మంచిబుద్ధి గలవాఁడు = బృహస్పతి.

ధీమంతుఁడు— బుద్ధిగలవాఁడు = విద్వాంసుఁడు.

ధీర— వ్యంగ్యముగాఁ గోపమును బ్రకాశముచేయు నాయిక.

ధీరలలితుఁడు— చూ. చతుర్విధ నాయకులు.

ధీరశాంతుఁడు—చూ. చతుర్విధ నాయకులు.

ధీరాధీర—వ్యంగ్యావ్యంగ్యముగాఁ గోప ప్రకటనము చేసెడు శృంగార నాయికా విశేషము.

ధీరోదాత్తుఁడు - ధీరోద్ధతుఁడు— చతుర్విధ నాయకులు.

ధీసచివుఁడు—కార్యాలోచనమున సమర్థుఁడగు మంత్రి.

ధురంధరము-ధురీణము-ధుర్యము— భారమును వహించునది = ఎద్దు మొ.

ధుని— వాయువుచే కదలునది = ఏఱు.

ధురంధరుఁడు— భారమును వహించువాఁడు. (ధూర్వహుఁడు మొ.)

ధనదుఁడు— ధనము నిచ్చువాఁడు = కుబేరుఁడు, దాత.

ధనాధిపుఁడు— ధనమున కధిపతి = కుబేరుఁడు (పైఁడిఱేఁడు).

ధను(ర్ధరుఁడు)ష్మంతుఁడు-ధన్వి— ధనుస్సు కలవాఁడు = విలుకాఁడు.

ధమనుఁడు-కొలిమితిత్తి నూఁదువాఁడు.

ధమ్మిల్లము—శిరమునఁ గట్టఁబడిన వెండ్రుకల సమూహము = కొప్పు.

ధర—సమస్తమును ధరించునది=భూమి.

ధరణి(ణీ)ధరము— } భూమిని ధరించునది = పర్వతము.
ధరణీధ్రము— }

ధరణీధరుఁడు—భూమిని ధరించువాఁడు = విష్ణువు, ఆదిశేషుఁడు, రాజు.

ధరణీ(పతి)శ్వరుఁడు-భూమికి ప్రభువు = రాజు.

ధరణీసుతుఁడు-(విషువంశమునఁ బుట్టిన) భూదేవి కుమారుఁడు=అంగారకుఁడు, నరకాసురుఁడు.

ధరణీసురుఁడు—చూ. భూదేవుఁడు.

ధరాధరము—చూ. ధరణీధరము.

రామరుఁడు-భూలోకమున దేవతవలెఁ బూజ్యుఁడైనవాఁడు=బ్రాహ్మణుఁడు.

ధరిత్రి—విశ్వమును ధరించునది=భూమి.

ధర్మకర్త-1 ఆలయములందును, సత్రము లందును గల కార్యనిర్వాహకాధ్యక్షుఁడు, 2. ధర్మము చేసినవాఁడు, 3 ధర్మము చేయువాఁడు.

ధర్మచారిణి— ధర్మకార్యములయందు భర్తతోఁ జరించునది = ధర్మపత్ని.

ధర్మజుఁడు-యమధర్మరాజునకుఁ బుట్టిన వాఁడు = పాండవాగ్రజుఁడు.

ధర్మధ్వ(జుఁడు)జి—బయటికి భక్తిగల వానివలె నటించుచు హృదయమున భక్తిలేనివాఁడు=దాంభిక ధార్మికుఁడు.

ధర్మపత్ని—అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన భార్య.

ధర్మభాగిని—భర్తయొక్క పుణ్యములో భాగము పొందునది = భార్య.

ధర్మమూలము-ధర్మమును నిర్ణయించు ప్రధానప్రమాణము = వేదము.

ధర్మరాజు—సత్యము, అహింస మున్నగు ధర్మములకు రాజు = 1. బుద్ధదేవుఁడు, 2. పాండుపుత్త్రుఁడు, 3 అపరాధములకుఁ దగిన శిక్షలు విధించువాఁడు = యమధర్మరాజు.

ధర్మవాణిజకుఁడు- తాను పుణ్యకార్యములను జేయుగునని వర్తకునివలె జనులవలన లాభమును బొందువాఁడు.

ధర్మవైతంసికుఁడు—తాను దాతయని పేరుపొందుటకు అన్యాయార్జిత విత్తమును దానము చేయువాఁడు.

ద్విజిహ్వుఁడు—రెండు నాలుకలుకల వాఁడు = కొండెకాఁడు.

ద్వితీయ—యజ్ఞాధికారఫలమును గ్రహించునప్పుడు భర్తతోఁగూఁడ తాను రెండవది = భార్య.

ద్విధాగతి—నీటను, నేలను జరించునది = మొసలి, ఎండ్రి.

ద్విపదుఁడు—రెండుపాదములు కల వాఁడు = మనుష్యుఁడు.

ద్విపము—తొండము, నోరు వను రెంటిచేఁ బానము చేయునది = ఏనుఁగు.

ద్విభాషి—రెండు భాషలు తెలిసిన వాఁడు, భాషాంతరీకరణము చేయు వాఁడు, వ్యవహారము నడుపువాఁడు.

ద్విమాతృజుఁడు—ఇద్దఱు తల్లులు (గంగాపార్వతుల) కలవఁ బుట్టినవాఁడు = వినాయకుఁడు.

ద్విరదము—రెండుదంతములుగలది = ఏనుఁగు.

ద్విరసనము—పూర్వము అమృతము తొలఁకు దర్భలను నాకుటచే రెండుగా చీలిన నాలుకలు గలది = సర్పము.

ద్విరుక్తి—ఒకేపదమునురెండుమారులు చెప్పుట, ఒకానొక దోషవిశేషము, పునరుక్తి

ద్విరేఫము—భ్రమరమను తన పేరు నందు రెండు రేఫాక్షరములు కలది = తుమ్మెద, రేఫాకృతిగల రెండు తెక్కలు గిలది.

ద్విరేఫారి—తుమ్మెదకుశత్రువైనది = సంపెంగ.

ద్విశఫము—రెండుగాచీలిన డెక్కలుగలది = ఆవు మొ.

ద్విశీర్షుఁడు—రెండుతలలు గలవాఁడు = అగ్ని.

ద్విహల్యము(ద్విసీత్యము)—రెండు చాళ్ళు దన్నిన నేల.

ద్వీపము—ఇరు ప్రక్కలను నీరుగల భూభాగము = దీవి.

ద్వైతము—జీవాత్మ పరమాత్మలకు భేదము చెప్పెడు మతవిశేషము

ద్వైధీభావము—రెండురీతులుగలది = అటాయిటా యను సంశయము.

ద్వైపాయనుఁడు—ద్వీపము నివాసముగాఁ గలవాఁడు = వ్యాసుఁడు.

ద్వైమాతురుఁడు—(గంగా పార్వతులను) నిద్దఱు తల్లులు గలవాఁడు = గణపతి, జరాసంధుఁడు.

ద్వైమాత్రేయుఁడు, ద్వైమాతురుఁడు } చూ. ద్విమాతృజుఁడు.

ద్వ్యర్థి—రెండర్థములుగల కావ్యము (రాఘవపాండవీయము) మొ.

ద్వ్యష్టము— వెండి బంగారములను రెంటిని వ్యాపించునది.

ధనంజయుఁడు—రాజసూయ యాగ సందర్భమున దిక్కులరాజులను గెలిచి ధనమునుగొని వచ్చినవాఁడు = అర్జునుఁడు.

ద్రావకము—రసగంధక పాషాణాదులయందు యంత్రసహాయమునఁ దీయు ద్రవవిశేషము.

ద్రావిడప్రాణాయామము—మిక్కుటమగు శ్రమగల ద్రావిడుల యొక్క ప్రాణాయామమువలెఁ జిక్కుగల పనియొక్క రీతి.

ద్రుమామయము—చెట్టునకు వ్యాధి వంటిది = లక్క.

ద్రుపదము—కొయ్యతోఁ జేసినది = పాదుక, బొండకొయ్య.

ద్రుమనఖము—చెట్టునకు గోరువంటిది = ముల్లు

ద్రోణదుఘ—తూమెఁడు పాలు పితికెడి యావు.

ద్రోణముఖము—సుమారు 400 గ్రామముల మధ్యగల సుగ్రామము.

ద్రౌపది—ద్రుపదరాజుకుమార్తె = పాండవపత్ని.

ద్వంద్వము—రెంటియొక్క సమూహము = 1 స్త్రీ పురుషుల జంట, 2. ఉభయపదార్థ ప్రధానమగు నొక సమాసవిశేషము, 3. ఇద్దఱొకరితో నొకరు చేయు యుద్ధము.

ద్వయాతిగుఁడు, ద్వయాతీతుఁడు—రజస్తమో గుణముల నతిక్రమించిన వాఁడు.

ద్వాదశాంగుళము—12 అంగుళముల పరిమితిగలది = జేన.

ద్వాదశాక్షుఁడు—12 కన్నులు గలవాఁడు = కుమారస్వామి

ద్వాదశాత్ముఁడు—12 రూపములు గలవాఁడు = సూర్యుఁడు. చూ. పాం. కే. ప. ద్వాదశ సూర్యకళలు.

ద్వాపరము—కృత త్రేతాయుగములకు రెండిటికి బిమ్మట వచ్చునది = 8,64,000 సంవత్సరములు పరిమితిగల మూఁడవ యుగము.

ద్వారపాలకుఁడు—ద్వారము గాచు వాఁడు (ద్వార్స్థుఁడు)

ద్వికము—రెండుఁ గారములుగలది = కాకి, చక్రవాకము.

ద్విగువు—రెండు గోవులు గలవాఁడు.

ద్విగుణా(ద్వితీయా)కృతము—రెండుచాళ్ళు గన్నిన పొలము

ద్విజన్మము(ద్విజము)—రెండు పుట్టుకలు గలది = పక్షి, పల్లు, పాము.

ద్విజన్ముఁడు ద్విజుఁడు—రెండు జన్మములు గలవాఁడు = బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు వైశ్యుఁడు.

ద్విజ(పతి)రాజు—బ్రాహ్మణులకుఁ బ్రభువు = చంద్రుఁడు, గరుత్మంతుఁడు. శేషుఁడు.

ద్విజాతి—దేహోత్పత్త్యుపనయనాది సంస్కారములనెడి రెండు జన్మములు గలవాఁడు = బ్రాహ్మణుఁడు.

ద్విజిహ్వము—రెండు నాలుకలు గలది = సర్పము (ద్విరసనము).

దైత్యారి— రాక్షసులకు శత్రువు = శ్రీవిష్ణువు, దేవత.

దైవజ్ఞ—శుభాశుభముల తెలుఁగునది= సోదకత్తె.

దైవము— 1 జ్యోతిష్టోమాది యజ్ఞప్రారంభమున యథావిధిగాఁ దత్కర్మము నడపిన ఋత్విజుని నలంకరించి చేసెడు వివాహము, 2. పూర్వజన్మార్జిత కర్మము.

దైష్టికుఁడు— సమస్తమును దైవకృతమని నమ్మువాఁడు.

దొర (కు) (కోలు) సన్న్యాసి— నమ్మకముచే మోసపుచ్చి దొంగిలించుకొని పోవువాఁడు, డాంబికుఁడుగానున్న సన్న్యాసి.

దొరసాని—ప్రభుభార్య = రాణి.

దోరణపుసాటిరిక్క— ద్వారాకారముగానుండు నక్షత్రము=అనూరాధ.

దోషగ్రాహము— దోషమును గ్రహించునది = ఇందుగుచెట్టు.

దోషజ్ఞుఁడు—దోషము తెలిసినవాఁడు = విద్వాంసుఁడు, వైద్యుఁడు.

దోషాకరుఁడు—రాత్రిని కలుఁగఁజేయువాఁడు = (గురుపత్నీ సంగమాదిదోషములకు స్థానభూతమైన వాఁడు) చంద్రుఁడు.

దోషాచరుఁడు—రాత్రియందు సంచరించువాఁడు = చంద్రుఁడు, రాక్షసుఁడు, దొంగ.

దోహదము— ఆకాలమున బుష్పాదులు పుట్టుటకు స్త్రీలు చేసెడి పాదతాడనాదికము. చూ. సాంకేతికపదప్రకరణము.

దోహదవతి— వేవిళ్లుగల యాఁడుది.

దౌహిత్రాయణుఁడు— దౌహిత్రుని కొడుకు = మునిమనుమఁడు.

దౌహిత్రి— కుమార్తె యొక్క కూఁతురు = మనుమరాలు.

దౌహిత్రుఁడు— దుహిత యొక్క కొడుకు = మనుమఁడు.

ద్యుమ్నము—స్వర్గమునకైతము కోరఁబడునది = ధనము, బలము.

ద్యుమణి—ఆకాశమున మణివంటి వాఁడు = సూర్యుఁడు.

ద్యుస (త్తు - దు) ఁడు— ఆకసమున (స్వర్గమునఁ) నుండువాఁడు= సూర్యాదిగ్రహము, వేల్పు.

ద్యూత (కారుఁడు) కారకుఁడు— జూదమాడుటకై యొక గృహము నేర్పఱచుకొని యుండువాఁడు = జూదమాడువాఁడు.

ద్యూత(కృత్తు)కరుఁడు—చూ. పై

ద్యోతటిని— ఆకాశమందలి నది = మందాకినీ నది.

ద్రవ్యము—పొందఁదగినది = ధనము

ద్రాక్షారామము— 1. ద్రాక్షతోఁటలకు స్థానమైనది, 2. దక్షుయారామభూమి.

కలవాఁడు = ఋషి, విద్వాంసుఁడు, గెద్ద, ఎలుఁగుబంటి.

దృగాయుధుఁడు — ఫాల నేత్రము వలనఁ బుట్టిన చూపు ఆయుధముగాఁ గలవాఁడు = శివుఁడు.

దృగ్దీక్ష— చేప గ్రుడ్లను పెట్టి వానిని దిరిగి చూచిన బిడ్డలగును. అట్లే యుపదేశకాలమున గురువు శిష్యుని యుపరోక్ష సాక్షాత్కారబ్రహ్మ భావముకలవాఁడగునా కాఁడా యని వీక్షించుట.

దేవకీనందనుఁడు— దేవకిని సంతోష పెట్టువాఁడు = శ్రీకృష్ణుఁడు.

దేవతరువు— దేవలోకపు వృక్షము = కల్పవృక్షము.

దేవదత్తము— ఖాండవదహన సమయమున నగ్నిదేవునిచే నర్జునున కీయఁబడిన శంఖము.

దేవదాసి— దేవాలయములందు సేవ చేసెడు భోగస్త్రీ.

దేవదేవుఁడు—దేవతలకు దేవుఁడైన వాఁడు = శ్రీవిష్ణువు.

దేవమణి—దేవులలో శ్రేష్ఠుఁడు = శివుఁడు, గుఱ్ఱమునకు మెడయొద్దనున్న సుడి, దేవతల రత్నము = కౌస్తుభము.

దేవమాతృకము — వాననీటిచేఁ బండెడు పైరుగలభూమి, మేఘము మాతగాఁగల వర్షధారచే పండెడు దేశము.

దేవయానము—దేవతలు ప్రయాణము చేయు సాధనము = విమానము.

దేవరుఁడు—అన్నదమ్ములభార్యలతోఁ బరిహాసముచే క్రీడించువాఁడు, మగని తోఁబుట్టినవాఁడు = బావలే మఱఁది.

దేవలుఁడు— పూజించు నిమిత్తము దేవరను స్వీకరించువాఁడు, కూలికి దేవరను బూజించువాఁడు = అర్చకుఁడు.

దేవాజీ (వి) వుఁడు-కూలికయి దేవతను బూజించువాఁడు = పూజారి.

దేవానాంప్రియము— యజ్ఞాదులయందు దేవతలకుఁ బ్రియమైనది = మేఁక.

దేవవక్త్రము—దేవతలకు ముఖమైన వాఁడు = అగ్ని.

దేవవాహనుఁడు — దేవతలకు హవిస్సును గొనిపోవువాఁడు = అగ్ని.

దేవి—క్రీడించునది = పార్వతి, రాణి.

దేహదము—దేహమును శుద్ధిచేయునది = పాదరసము.

దైవ (జ్ఞ - విదు)ఁడు— శుభాశుభరూపమయిన జోస్యము నెఱుఁగువాఁడు = జోతిష్కుఁడు.

దైవాకరి— సూర్యపుత్త్రుఁడు = శని, యముఁడు, సుగ్రీవుఁడు, కర్ణుఁడు.

దై (తేయు) (త్యుఁ) డు— కశ్యపునకు దితియందుఁ గలిగిన సంతానము = రాక్షసుఁడు.

దైత్యగురుఁడు—రాక్షసుల గురువు = శుక్రాచార్యుఁడు.

దుర్గ(తండ్రి) కన్నయ్య—దుర్గాదేవి (పార్వతి)కిఁ దండ్రియైనవాఁడు = హిమవంతుఁడు.

దుసె(దునే)దారి—కత్తి చేతియందు ధరించువాఁడు = కూకఁడు.

దుబాసి—రెండవభాషలోనికి తర్జుమాచేయువాఁడు.

దుమగతికేతు— అరిష్టసూచకమైన నక్షత్రవిశేషము = తోకచుక్క.

దురధిగమము—కష్టముచేత (చదవఁ దగినది) బొందఁదగినది.

దురపుటొరెంపు దాసరితండ్రి)— కలహము ఆహారముగాఁగల విషు భక్తుఁడగు నారదునితండ్రి = బ్రహ్మ

దురాత్ముఁడు—చెడ్డమనస్సు కల వాఁడు = దుర్మార్గుఁడు.

దురారోహము-ఎక్కుటకు సాధ్యము గానిది = కొబ్బరచెట్టు, తాడిచెటు. ఎక్కరానిది = బల్లి, తొండ.

దురితము—దుర్గతిని పొందఁజేయునది = పాపము.

దురోదరము— దీనికై గిరికందరముల యుదర ప్రదేశము నాశ్రయింతురు = జూదము.

దుర్గ—క్లేశము నెఱుంగఁదగినది, వనాది దుర్గము నివాసముగాఁగలది=పార్వతి. (దుర్గుఁడను రాక్షసుని సంహరించి నది = చండిక)

దుర్గము— ప్రయాసముచేఁ బొందఁ దగినది = కోట.

దుర్దినము—మేఘములచేఁ గప్పఁబడిన సూర్యబింబముగల దినము. సూర్య దర్శన రహితమగుటచే దుష్టమైన దినము.

దుర్మరణము— విష భక్షణాదులచే గలిగెడు నస్వాభావిక మరణము.

దుర్వర్ణము—బంగారము కంటె నికృష్టమైన వర్ణముగలది = వెండి.

దుర్హృదుఁడు— దుష్టమైన హృదయము కలవాఁడు = శత్రువు.

దుశ్చ్యవనుఁడు— తన వజ్రాయుధ ముచే సాధింపఁబడని చ్యవనుని కల వాఁడు. (చ్యవనుని అశ్వినీదేవతల వలనఁ దన వార్ధక్యమును బోఁగొట్టు కొని వారలకు యజ్ఞభాగము నిప్పించెను. అందుల కింద్రుఁడు కోపించి వజ్రాయుధముచే చ్యవనుని జంపఁ బోయి స్తంభితహస్తుఁ డాయెనని పురాణ ప్రసిద్ధి)

దుహిత— ధనాదికమును హరించుటచే జననీ జనకులను విత్తశూన్యులనుగాఁ జేయునది = కొమార్తె.

దూతి-దీనిచేఁ గాముకీకాముకు లన్యోన్య విషయమై పరితపింపఁ జేయఁబడు దురు = గార్హపుడు కత్తె.

దూత్యము— దూతయొక్క భావము లేక క్రియ = రాయబారము.

దూర(దర్శి)దృష్కు— దూరాలోచన

దీపావళి— దీపముల సమూహము = నరకచతుర్దశి మర్నాటి పండుగ.

దీర్ఘ(కంఠ-గ్రీవ)ము—నిడుపాటి మెడకలది = ఒంటె, కొంగ.

దీర్ఘ(కేశ-రోమ)ము— పొడవైన వెండ్రుకలు గలది = ఎలుఁగు.

దీర్ఘజంఘము— నిడుపైన పిక్క కలది = బెగ్గురుపక్షి, కొంగ.

దీర్ఘ(జిహ్వా) రసనము— నిడువైన నాలుకలు కలది = పాము.

దీర్ఘతరువు—పొడుగైనచెట్టు = తాటిచెట్టు మొ.

దీర్ఘ(తుండ)ముఖ— పొడుగైన మొగము కల్గది = చుంచు.

దీర్ఘ(దృష్టి)దర్శి— ప్రత్యక్షముగాని విషయములను బుద్ధిచేఁ జూచు (నది) వాఁడు = విద్వాంసుఁడు, గ్రద్ద.

దీర్ఘదేహి—పొడుగైన దేహముకలది = పంకొక్కు.

దీర్ఘనిద్ర—శాశ్వతమైన నిద్ర = మరణము.

దీర్ఘసత్రము—పొడవైన ఆకులు గలది = 1. వెల్లగజ్జు, 2. కొబ్బరి మొ.

దీర్ఘపా(త్తు)దము—పొడుగైన పాదములు కలది = కొంగ, ఒంటె, మొ.

దీర్ఘ(పృచ్ఛ-వాల)ము— చమరీమృగము.

దీర్ఘపృష్ఠము— పొడుగైన వీపు గలది = పాము.

దీర్ఘ(సు)రతము— ఎక్కువ కాలము రతి గలది = కుక్క.

దీర్ఘగరదము—పొడుగైన కోఱలుగలది = అడవిపంది.

దీర్ఘసూత్రుఁడు— కార్యములను మిక్కిలిదీర్ఘముగా విచారించువాఁడు.

దీర్ఘాయువు— పెక్కేండ్లు బ్రతుకు (నది) వాఁడు = మార్కండేయుఁడు, కాకి, బూరుగుచెట్టు మొ.

దీవనబ్రాలు— ఆశీర్వాదార్థమై పసుపుగలిసిన బియ్యము = అక్షతలు.

దీర్ఘనాదము— నిడుపాటి ధ్వని గలది = కుక్క, కోడి, శంఖము.

దుంతరౌతు, దున్నపోతు— దున్నపోతునెక్కి స్వారీచేయువాఁడు = యముఁడు.

దుక్కివాలుదాలుపు— నాఁగలి యను నాయుధము ధరించినవాఁడు = బలరాముఁడు.

దుకూలము—కట్టుకొనుటకును, మీఁద వేసికొనుటకును రెండు విధములుగాఁ గప్పుకొనుటకు యోగ్యమైనది = వలిపట్టుచీర.

దుక్కి(కైదువు)వాలు— దున్నెడు సాధనము = నాఁగలి.

దుగమొగములవేల్పు—రెండుముఖములు గల దేవుఁడు = అగ్ని.

దినమణి—పగటిభాగమున మణివలె ప్రకాశించువాఁడు = సూర్యుఁడు.

దినాం(దివాం)తము—దినముయొక్క చివరిభాగము = సాయంకాలము.

దివము—ఇందు దేవతలు క్రీడింతురు = స్వర్గము.

దివస్పతి—స్వర్గమునకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

దివాంధము—పగటిపూట గ్రుడ్డిది = గుడ్లగూబ

దివా(దివస)కరుఁడు— చూ. దినకరుఁడు.

దివాకీర్తి—1. రాత్రిభాగమున క్షురకర్మ నిషిద్ధమగుటచేఁ బగలే పిలువఁబడువాఁడు=మంగలి, 2. పుణ్యకాలమగు పగటియం దుచ్చారణము లేనివాఁడు = చండాలుఁడు.

దివాభీతము—పగలుభయపడునది = గుడ్లగూబ.

దివాభీతుఁడు—పగటియందు భయపడువాఁడు = దొంగ.

దివిజాధిపుఁడు—దేవతలకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

దివిజుఁడు—స్వర్గమునఁబుట్టినవాఁడు= వేలుపు.

దివిషదుఁడు— స్వర్గమున నివసించువాఁడు = వేల్పు.

దివో(దివౌ)కసము— ఆకాశము నివాసముగాఁ గలది = పిట్ట.

దివో(దివౌ)కసుఁడు—స్వర్గమునివాసముగాఁ గలవాఁడు = వేల్పు.

దివ్యచక్షువు — జ్ఞానదృష్టికలవాఁడు, మంచికన్నులు కలవాఁడు.

దివ్యము— మహోవ్యవహారములయందు జయింపఁదగిన సత్యము, దివియందుఁ బుట్టినది.

దివ్యస్నానము—ఎండలో వాన కురియుచుండఁగా నందు శరీరమును దడపుకొనుట.

దిశ—1. అవకాశము నిచ్చునది 2. ప్రాగ్దిశాది భేదములచే వ్యపదేశింపఁబడునది = దిక్కు.

దిష్టాంతము— జీవితము యొక్క నాశము = చావు.

దిస(దిస్స)మొలవేల్పు—చూ. అంగమొల వేలుపు.

దీక్షాగురుఁడు(వు)—తత్త్వోపదేశము చేయువాఁడు.

దీక్షితుఁడు— సోమయాగమున దీక్ష వహించినవాఁడు (దీక్ష = యజ్ఞాది క్రియారంభమున ననుష్ఠింపఁ బూను కొనెడి యాచారనియమము)

దీప్తపింగళము—బంగారమువలె పచ్చని సటలు గలది = సింహము.

దీపారాధనము—దీపములను వెలిగించి ఇష్టదేవతలను బూజించుట.

రథగమనము గలవాఁడు = ఒక సూర్య వంశపు రాజు.

దశాశ్వుఁడు— తన రథమునకు పది గుఱ్ఱములు కలవాఁడు = చంద్రుఁడు.

దశాహము— మృతిపొందినవానికి బదియవరోజున చేయఁబడు శ్రాద్ధ కర్మము.

దసరా—ఆశ్వయుజ శు ౧ మి మొదలు ౧౦ మి వరకును గల దశరాత్రములు.

దహనుఁడు— సమస్తమును దహించు వాఁడు = అగ్నిదేవుఁడు.

దాంతుఁడు— బ్రహ్మచర్యాది తపః క్లేశము నోర్చువాఁడు = బహిరింద్రియ నిగ్రహము కలవాఁడు.

దాక్షాయణి— దక్షుని కుమార్తె, అశ్విన్యాది నక్షత్రములు, భూమి, సతీదేవి (గౌరి).

దాన(వు)(వేయు)లు— కశ్యపునకు దనువునందు పుట్టిన సంతతి = రాక్షసులు.

దానశౌండుఁడు—దానమునం దాసక్తి కలవాఁడు = దాత.

దాయాదుఁడు— దాయభాగము ననుభవించువాఁడు = జ్ఞాతి.

దార— భర్తను సోదరులనుండి విడఁదీయునది = భార్య.

దామోదరుఁడు—తులసిమాలిక యుదరమునఁ గలవాఁడు = విష్ణువు.

దార్ష్టాంతికము— దృష్టాంతములతోఁ గూడినది = ఉదాహరణము.

దాశరథి— దశరథుని పుత్త్రుఁడు = శ్రీరాముఁడు.

దాసరి—శిఖాయజ్ఞోపవీతములు, ధరింపని తిరుపమెత్తుకొనెడు విష్ణుభక్తుఁడు.

దాసుఁడు—బ్రాహ్మణునకు వివాహిత శూద్రకన్యయందుఁబుట్టి, సంస్కరింపఁబడినవాఁడు.

దాసేరుఁడు(దాసేయుఁడు)— దాసికి బుట్టినవాఁడు.

దాళువా—శరదృతువు మొదలుకొని నీటియాధారమునఁ బండెడు పల్లపు పంట (దాళవా, దాళవి).

దిగంబరుఁడు —దిక్కులు వస్త్రముగఁ గలవాఁడు = దిసమొలవాఁడు, శివుఁడు.

దిగ్బంధము—మంత్రముచే దిక్కులను బంధించుట.

దిగ్విజయము—సమస్త దిక్కులందును గల భూమండలము జయించుట.

దిధిషువు—మారుమనువు దానిని (వానిని) గోరువాఁడు (నది).

దినకరుఁడు-1. దినములను గలుగఁజేయువాఁడు, 2. పగలు జీవులను వ్యాపారవంతులనుగాఁ జేయువాఁడు = సూర్యుఁడు.

దిన(పతి)(మణి) —చూ. దినకరుఁడు.

దచ్చికాళ్ళ(యడుగుల) మెకము — చూ. అష్టపాదము.

దడిబియ్యము—రజస్వలయిన పడుచు విషయమై జరిగించెడునుత్సవవిశేషము.

దత్తపుత్రశోకము— దత్తుతీసుకొనిన కుమారుని మరణముకొరకయి శోకించుట. (అవసరములేనిదానిని తెచ్చిపెట్టుకొని దానికయి మనస్సును దుఃఖపెట్టుకొనుట.)

దత్తాత్రేయుఁడు — విష్ణు వంశమున నత్రిమహర్షికి అనసూయ యందుఁ గలిగిన పుత్రుఁడు.

దత్తుఁడు—ఒకరీయఁగాఁ బెంపఁబడు పుత్రుడు = ద్వాదశ పుత్రులలో నొకఁడు.

దనుజద్విషుఁడు } రక్కసుల శత్రువు
దనుజారి } = వేల్పు, విష్ణువు

దనుజ(వైరి)విరోధి—చూ. పై.

దనుజుఁడు—కశ్యపు-డు దనువను భార్యయందుఁ గలిగినవాఁడు = రాక్షసుఁడు.

దమము—బహిరింద్రియ నిగ్రహము, బ్రహ్మచర్యాది కేశముల నోర్చుట.

దమయంతి—తన యందముచే నితరులను దమించు (అణఁచు)నది = నలుని భార్య.

దయాళువు— దయచేరక్షించు స్వభావము గలవాఁడు.

దర్దరీకము— శబ్దముచే చెవులను బ్రకంపించునది = కప్ప, మబ్బు.

దర్దురము—చూ. దర్దరీకము.

దర్పకుఁడు— గర్వింపఁజేయువాఁడు, దుర్గతిని బొందువాఁడు = మన్మథుఁడు.

దర్పణము—దీనిచేత మంచి వేషాభిమానము గలిగి గర్వింతురు = అద్దము.

దర్భముద్రిక—దర్భముడిగల యుంగరము.

దర్వీకరము—తెడ్డువలెను పడగ కలది = సర్పము.

దశరూపభృత్తు—పదియవతారములు దాల్చినవాఁడు = విష్ణువు.

దర్శనము—అమావాస్యనాఁడు చేయఁదగిన ఇష్టి.

దశకంఠుఁడు (గ్రీవుఁడు)— పది కంఠములు కలవాఁడు = రావణుఁడు.

దశబలుఁడు—బుద్ధి, క్షాంతి వీర్యము, ధ్యానము, జ్ఞానము, కృప, శీలము, బలము, దానము, ఉపేక్ష అను పది బలములు గలవాఁడు = బుద్ధుఁడు.

దశనము— దీనిచేఁ (వరితల యధరమున) గొరుకుదురు = పన్ను.

దశముఖుఁడు—పది ముఖములు కలవాఁడు = రావణుఁడు.

దశా(ననుఁడు)స్యుఁడు—చూ. పై.

దశరథుఁడు— పది దిక్కులయందు

త్విషాంపతి—కాంతులకు ప్రభువు = సూర్యుఁడు.

దంటమోముల(దేవర) వేల్పు—రెండు ముఖములు గల ప్రభువు = అగ్ని.

దండకారణ్యము — ఇక్ష్వాకు వంశీయుఁడగు దండునిచేఁ బాలింపఁబడి, కుపితుఁడగు దేవేంద్రునిచే మృద్వర్షము కురిపింపఁబడుటవలన నరణ్యముగా మాఱినది.

దండ (పాణి) ధరుఁడు— కాలదండమును ధరించువాఁడు = యముఁడు.

దండనాయకుఁడు— సేనకు అధిపతి.

దండప్రణామము— దండము (కఱ్ఱ) వలె భూమిపైఁ వ్రాలి, నమస్కరించుట = నమస్కారము.

దండహస్తుఁడు—దండము హస్తమునఁ గలవాఁడు = యముఁడు, సన్న్యాసి, బ్రహ్మచారి, ద్వారపాలుఁడు.

దండవాలధి— దండమువంటి తోఁక గలది = ఏనుఁగు

దండాదండి-పరస్పరము దుడ్డుకఱ్ఱలతోఁ గొట్టుకొనుచుఁ బోరాడెడు ద్వంద్వయుద్ధము.

దండి—చూ. దండ (పాణి) ధరుఁడు.

దంతావళము (దంతి)— ప్రశస్తమైన దంతములు కలది = పెద్ద యేనుఁగు.

దంత్యము—దంతమునఁ బుట్టిన యక్షరము. ఌ ౡ త థ ద ధ న ల స. మొ.

దందశూకము— కుత్సితమైన దంశనము (కరచుట) కలది = సర్పము.

దంభము—గొప్పకై యజ్ఞయాగాది క్రతువులు ధర్మకార్యములు చేయుట.

దంష్ట్రి (దంష్ట్రాయుధము) — కోఱలు ఆయుధముగాఁ గలది = అడవిపంది.

దక్కి-సంపురాయుఁడు (స్వామి)— దక్షిణదిశ కధపతి = యముఁడు.

దక్షజాపతి—దక్షుకన్యలగుఅశ్విన్యాదుల భర్త = చంద్రుఁడు, 2. సతీదేవిభర్త = శివుఁడు, 3. ఆదిత్యాదుల భర్త = కశ్యపుఁడు.

దక్షాధ్వర (హరుఁడు) ధ్వంసి—దక్షుని యజ్ఞమును ధ్వంసముచేసిన వాఁడు = శివుఁడు, వీరభద్రుఁడు.

దక్షిణ—యజ్ఞము లోనగు వానియందు ఋత్విక్కుల కిచ్చెడు ధనాదికము.

దక్షిణాపథము— వింధ్యపర్వతము మొదలు సేతువువఱకుఁ గల దేశము.

దక్షిణాయనము— సూర్యుఁడు ఉత్తరమునుండి దక్షిణమునకుఁ బ్రయాణము చేయు కాలము. పుష్యమాస మందలి మకరసంక్రాంతి మొదలు ఆషాఢ మాసమునందలి కర్కాటక సంక్రాంతి వరకుఁగల కాలము.

దక్షిణుఁడు—అనేక నాయికలయందు సమముగాఁ బ్రవర్తించెడునాయకుఁడు.

త్రిమూర్తి—బ్రహ్మ విష్ణు, మహేశ్వరుల శరీరముల యంశము గలవాఁడు= దత్తాత్రేయుఁడు.

త్రియామ—మూఁడుజాములు గలది రాత్రి.

త్రిరాత్రకృచ్ఛ్రము—మూఁడుదినము లుపవసించుట

త్రిరాత్ర—మూఁడురాత్రులు బహిష్కరింపఁదగినది = ముట్టుది.

త్రిలింగము—శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వరములను శివలింగస్థానముల మధ్యదేశము (ఇందలి భాష తెలుఁగు).

త్రిలోకేశుఁడు—ముల్లోకములకుఁ బ్రభువు = శివుఁడు.

త్రిలోచనుఁడు—చూ. త్రినేత్రుఁడు.

త్రివర్గము—ధర్మార్థకామముల సమూహము.

త్రివిక్రముఁడు—మూఁడడుగుల దాన మిచ్చిన బలిని పాతాళమున కణఁగఁ ద్రొక్కుటకై మూఁడడుగులచే ముల్లోకముల నాక్రమించినవాఁడు = వామనరూపధారి యగు విష్ణువు.

త్రివిష్టపము—చూ. త్రిదివము.

త్రివేణీసంగమము—గంగ, యమున, సరస్వతు లను మూఁడునదులు కలియు చోటు.

త్రిశంకువు—కార్యము చేయుటచేతను, గురుధేనువును వధించుటచేతను, అప్రోక్షిత మాంసమును భక్షించుటచేతను త్రివిధములైన హృదయ శంకువులు గల యీతనికిఁ ద్రిశంకుఁడని వసిష్ఠునిచే నుంచఁబడిన నామము.

త్రిశూలధారి—మూఁడు మొనలు గల బల్లెమును ధరించినవాఁడు = శివుఁడు.

త్రిషవణస్నాయి—దినమునకు మూఁడు పర్యాయములు స్నానము చేయువాఁడు.

త్రిసంధ్యము—పూర్వాహ్ణ, మధ్యాహ్న, అపరాహ్ణసంధ్యల సమూహము.

త్రిసీత్యము (త్రిగుణాకృతము)—మూఁడుచాళ్లు దున్నినపొలము.

త్రిస్రోత—ముల్లోకములందును ప్రవహించు నది = గంగ.

త్ర్యంబకసఖుఁడు—ఈశ్వరునకు స్నేహితుఁడైనవాఁడు = కుబేరుఁడు.

త్ర్యంబకుఁడు (త్ర్యక్షుఁడు)—మూఁడుకన్నులు కలవాఁడు; ముల్లోకములకుఁ దండ్రి = ఈశ్వరుఁడు.

త్వక్‌క్షీర—వెదురువలనఁ బుట్టిన పాలు గలది = తవక్షీరి.

త్వష్ట—కొయ్యలను చెక్కువాఁడు = వడ్రంగి.

త్వాష్ట్రము—త్వష్టకు (వడ్రంగి) కి సంబంధించినది = మొదు.

త్రాడుదాలుపు—పాశము ధరించిన వాఁడు = వరుణుఁడు.

త్రింశత్పత్రము—ముప్పది రేకులు గలది = తెల్లగలువ.

త్రికూటము—ఇనుము, వెండి, బంగారముతోఁ గూడిన మూఁడు శిఖరములు గల పర్వతవిశేషము.

త్రిదండి—మనోదండ, వాగ్దండ, కర్మదండములను మూఁడుదండములు గల సన్న్యాసి.

త్రిదశాలయము—దేవతల నివాసస్థానము = స్వర్గము.

త్రిదశులు— 1. పుట్టుట, పెరుగుట, నశించుట యను మూఁడు అవస్థలు గలవారు, 2. ఎప్పుడు ముప్పదియేండ్ల వయస్సుగలవారివలె నుండువారు = వేల్పులు.

త్రిదివము—1. బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను దేవతలు నివసించునది, 2. మూఁడవలోకము = స్వర్గము.

త్రిదివుఁడు—మూఁడవ లోకమగు స్వర్గమున నుండువాఁడు = వేలుపు.

త్రిది(వౌకసుఁడు) వేశుఁడు— స్వర్గమునకుఁ బ్రభువు = ఇంద్రుఁడు (వేల్పు).

త్రిమ్యస్పృక్కు—మూఁ[...] ...లు గూడిన తిథి.

త్రినయనుఁడు } ఫాలనేత్రముతో
త్రినేత్రుఁడు } మూఁడు కన్నులు గల వాఁడు = శివుఁడు.

త్రిపథ(గ)గామిని—స్వర్గ మర్త్య పాతాళములయందుఁ బ్రవహించునది = గంగ.

త్రిపుండ్రము—నొసట నుంచిన విభూతి లోనగువాని మూఁడు రేఖలు.

త్రిపురదహనుఁడు—త్రిపురారి.

త్రిపురములు—మయునిచే నిర్మింపఁబడిన మూఁడు పురములు.

త్రిపురాంతకుఁడు, త్రిపురారి— మయ నిర్మితములగు త్రిపురములకు నాశకుఁడు=శంకరుఁడు. (విద్యున్మాలి, తారకాక్షుఁడు, కమలాక్షుఁడు అను తారకాసురుని పుత్త్రులు విష్ణువరమున కామగమనముగల మూఁడు (ఇనుము, వెండి, బంగారములతో) పురములను మయునిచేఁ జేయించుకొని, లోకము లన్నింటిని బాధించేయుచుండిరి. త్రిపురములు కలిసినచోఁ బ్రమాదము కలుగునని విష్ణువరము. బ్రహ్మాదులు వీరి బాధకుఁ దాళఁజాలక తమతేజమును శివునికిచ్చి వధింపుమనిరి. శివుఁడు భూమిని రథముగాను, సూర్యచంద్రులను చక్రములనుగాను, వేదములను గుఱ్ఱములనుగాను, మేరుపర్వతమును ధనుస్సుగాను, శేషుని నారిగాను, విష్ణువును బాణముగా[ను గ్ర]హించి తన తేజోమహిమచేఁ [పురము]ల నొక్కచోఁ జేర్చి, పాశుపతాస్త్రమున దహనమొనర్చెనని పురాణగాథ.



తొలి(తొలు)వేల్పు— దేవతలలో మొదటివాఁడు = బ్రహ్మ. (బ్రహ్మ శివుని దక్షిణాంగమువలన జనించెను. అప్పటికి విష్ణుని నాభినుండి కమల మొక్కటి మాత్రమే పుట్టియుండెనని శివపురాణము.)

తొలి(కట్టు)కొండ— సూర్యుఁ డుద యించుకొండ, ఉదయపర్వతము.

తొలివేల్పుపగతురు— రాక్షసుల శత్రువులు = దేవతలు.

తొలుకుడుపు— చూ. అన్నప్రాశన.

తొలు(కట్టు)గొండ— చూ. తొలి కొండ.

తొలు (పలుకు) (చదువు) లు— మొదటి చదువులు = వేదములు.

తొలు(తొలి)దివి— మొదటి ద్వీపము = జంబూద్వీపము.

తొలుపంది— ఆదివరాహ రూపమును ధరించిన వాఁడు = విష్ణువు. (హిరణ్యా క్షుఁడు భూమిని చాఁపఁగాఁజుట్టి సము ద్రమున దాఁగుకొనఁగా విష్ణువు ఆది వరాహమై రాక్షసుని జంపి తన కోఱలతో భూమండలమును పైకెత్తె నని పురాణగాథ.)

తొలురిక్క— మొదటి నక్షత్రము = అశ్విని.

తొలురిక్క నెల— అశ్వినీ నక్షత్రయు క్త పూర్ణిమతోఁగూడిన మాసము = ఆశ్వయుజము.

తొలుజంగమయ్య— మొట్ట మొదటి జంగము దేవర = శివుఁడు.

తోఁడేటికడుపుమేటి— చూ. వృకో దరుఁడు.

తోయ(జ)(భవ)(జాత)ము— చూ. అంబుజము.

తోయజాక్షి— తామర రేకులవంటి కన్నులు గల యాఁడుది.

తోయదము—చూ. అంబుదము.

తోయ(ని)ధి— చూ. అంబు (ని) ధి.

తోయరుహము—అంబురుహము.

తోయసూచకము— ఉదక ముండు టను సూచించునది = కప్ప.

తోలుదాలుపు— చర్మమును ధరించు వాఁడు = శివుఁడు.

తౌర్యత్రికము— నృత్తగీత విద్యల సమూహము.

త్యాజ్యము— దోషయుక్త మగుటచే విడువఁదగిన కాలము = వర్జ్యము.

త్రయి— ఋక్సామ యజుర్వేదముల సమూహము.

త్రయీతనువు— ఋక్సామయజు ర్వేద రూపమైన శరీరము గలవాఁడు = సూర్యుఁడు.

త్రసన = వేదాధ్యయనము చేయునపుడు నోటినుండి రాలెడు తుంపర = బ్రహ్మబింగువు.

తెలిమోముపక్కి—తెల్లనిముఖముగల పక్షి = గరుడపక్షి.

తెలియేరు(వాఁక)— తెల్లని నది = గంగ.

తెలివిలుతుఁడు— తెల్లని ధనుస్సుగల వాఁడు = మన్మథుఁడు.

తెల్ల(మల)గుబ్బలి— వెండితోఁ గూడిన దగుటచేఁ దెల్లనైన పర్వతము = కైలాసము.

తెల్లజక్కి— తెల్లనిగుఱ్ఱము = ఉచ్చైశ్శ్రవము.

తెల్లడాలుమెకము— తెల్లని వర్ణము గల మృగము = సింహము.

తెల్లనిదొర—తెల్లని రంగుగల ప్రభువు = బలరాముఁడు, శివుఁడు.

తొఁగ (నెచ్చెలి) మేలుతొఁగరాజు—చూ. కై.

తెల్లనిమయి(మై)దంట — తెల్లని శరీరము గల జెట్టి = బలరాముఁడు.

తెల్లయేనుఁగు—ఐరావతము.

తేటి(తెగదణి)యల్లెవాఁడు }
తేటియల్లెవింటిదొర }—
తుమ్మెదనారితోఁ గూడిన ధనుస్సు గల యోధుఁడు = మన్మథుఁడు.

తేనె(నియ)తిండి-తేనె యాహారముగాఁ గలది = తుమ్మెద.

తైజసావర్తని— బంగారు లోనగు వానిని కరఁగెడు మూస.

తొండపుదేవర—విఘ్నేశ్వరుఁడు.

తొండరూపురిక్క— తొండయొక్క రూపముగల నక్షత్రము = పుష్యమి.

తొగ(విందు)చెలికాఁడు— కలువలకు స్నేహితుఁడు = చంద్రుఁడు.

తొగరుముక్కు(మోము)పులుఁగు ఎఱ్ఱనిముక్కు (నోరు) గల పక్షి = చిలుక

తొగఱేఁడు, తొగలఱేఁడు— కలువలకుఁ బ్రభువు = చంద్రుఁడు.

తొగ(పగ)(దాయ)సూడు— కలువలకు శత్రువు = సూర్యుఁడు.

తొడపుట్టువు(బిడ్డ)— పరబ్రహ్మయొక్క తొడనుండి పుట్టినవాఁడు = శూద్రుఁడు.

తొడుకు(బాబారౌతు)సామి }
తొడుకుతత్తడిజోదు }—
ఎద్దు వాహనముగాఁ గలవాఁడు = శివుఁడు.

తొడలు లేనివాని సైదోడు— అనూరుని సోదరుఁడు = గరుడుఁడు.

తొడుకుసాహిణిమామ—వృషభవాహనుఁడగు శివుని మామ = హిమవంతుఁడు, దక్షుఁడు.

తొలక(ల్క)రి— చైత్ర వైశాఖములయందుఁ గురియు వర్షము.

తొలకరిసూడు—వర్షర్తువునందు శత్రుభావము కలది = హంస.

తూఁడువిలు (కాఁడు) తుఁడు—తామరతూఁడు నారిఁగా గల విల్లు కలవాఁడు = మన్మథుడు.

తూణీరము—బాణములచేఁ బూరింపఁ బడునది = అమ్ములపొది.

తూ(తు)బరుఁడు—యౌవనమున గడ్డమును, మీసమును రాని మగవాఁడు = అంతఃపురమును గాచువాఁడు.

తూరుపు (దణి) ఱేఁడు—తూర్పు దిక్కునకధిపతి = దేవేంద్రుఁడు.

తూలము—తూఁచఁబడునది, విప్పఁబడునది = దూది.

తృణగ్రాహి—తృణమును గ్రహించునది = ఇంద్రనీల మాణిక్యము.

తృణ(ద్రుమము) రాజము—గడ్డి జాతిలోని వృక్షము, తాడి చె.

తృణధ్వజము—ధ్వజాకారముగా నుండెడు తృణము = వెదురు.

తృణపూలి—దృష్టిదోష నివృత్తికై గడ్డితోఁ గట్టిన మనుష్యునిబొమ్మ.

తృణరాజాహ్వయము—తృణరాజము పేరుగలది = తాటిచెట్టు.

తృణాంజనము—తృణమందు బల్లివలె నుండునది = తొండ.

తృణావర్తము—తృణాదికమును సుడివలె గుండ్రముగాఁ ద్రిప్పి యెగురఁగొట్టునది = సుడిగాలి.

తృతీయాప్రకృతి—స్త్రీ పురుష భిన్నమైన నపుంసకప్రకృతి.

తెమ్మెర(కూన)కొడుకు—వాయుపుత్త్రుఁడు = భీముఁడు, ఆంజనేయుఁడు.

తెమ్మెరచెలి—వాయుదేవునకు స్నేహితుఁడు = అగ్ని.

తెరువుగాపరి—మార్గమునఁ గాచియుండునది = పులి.

తెఱగంటి—ఱెప్పలు లేకపోవుటచే తెఱపైన కన్నులు గలవాఁడు, వేలుపు దేవకాంత.

తెఱగంటి(వేలుపు)ఱేఁడు—దేవతలకుఁ బ్రభువు = దేవేంద్రుఁడు.

తెఱనోటిమెకము—విశాలమైన నోరుగల మృగము = సింహము.

తెర(మొగము) (వాయి)మెకము—విశాలమయిన మొగముగల మృగము = సింహము.

తెలిగాము—తెల్లని గ్రహము = శుక్రుఁడు.

తెలిదమ్మికంటి—తెల్లదామరలవంటి కన్నులుగలవాఁడు = విష్ణువు.

తెలిదీవిమన్నీఁడు—శ్వేతద్వీపమునకుఁ బ్రభువు = విష్ణువు.

తెలి(పిట్ట)పులుఁగు—తెల్లనిపక్షి = హంస.

తెలిమెకము—తెల్లని మృగము = సింహము.

తెలి(తెల్ల)మొదవు—తెల్లనియావు = కామధేనువు.

తీర్థవిధి— పుణ్యతీర్థములయందు వేదోక్తముగాఁ జేయుదు పితృకార్యాదికము.

తీవంచమోములదిట్ట— నాల్గు ముఖములు గల ప్రభువు = బ్రహ్మ.

తీక్ష్ణాంశువు—చూ. తిగ్మకరుఁడు.

తీక్ష్ణకంటకము—వాఁడిముండ్లు గలది = తుమ్మ, గారె, ఉమ్మెత్త

తీక్ష్ణగంధము—తీవ్రమైన గంధము గలది = తెల్లావ, వస, చిట్టేలకి.

తీక్ష్ణదంష్ట్రికము— వాఁడి కోఱలు గలది = పులి, చిఱుతపులి.

తుంటనాల్కపులుగు— చక్కెర తినెడు నాలుక గల పక్షి = చిలుక.

తుంటవి(ల్కాఁడు)ల్తుఁడు— చెఱకు తుంటవిల్లుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

తుట్టెపురుగు గుంపుదొంగ— క్షుద్రమైన సర్పసమూహమునకు శత్రువు = గరుత్మంతుఁడు.

తున్నవాయుఁడు— చినిఁగిన దానిని గూర్చువాఁడు = కుట్టుపనివాఁడు.

తుపాసి—ఒక భాషను మఱియొక భాషలోనికి మార్చువాఁడు.

తుమ్మెదకంటు—తుమ్మెదలకు శత్రువైనది = సంపెఁగపువ్వు.

తురం(గద్వేషము)గారి— గుఱ్ఱమును ద్వేషించునది = దున్న.

తుషారకరు(కిరణు)ఁడు — చూ. తుహినకరుఁడు.

తురంగ(మ)ము—త్వరగాఁ బోవునది = గుఱ్ఱము చిత్తరు.

తురంగవదనుఁడు— గుఱ్ఱపు ముఖము వంటి ముఖము గలవాఁడు = కిన్నరుఁడు.

తురఁగము—చూ. తురంగము.

తురాషాహుఁడు— శత్రువేగమును సహించువాఁడు = ఇంద్రుఁడు.

తులాపురుషము—తెలకపిండి, పచ్చివస్తువులు, మజ్జిగ, జలము, పిండి— వీని నొక్కొక్క దినము భుజించుచుఁ బిమ్మట మూఁడుదినము లుపవసించుట.

తులాభారము—తన యెత్తు బంగారమును దూఁచుకొని పంచిపెట్టుట.

తుల్యభాగ— తుల్యభాగుఁడను దానవశ్రేష్ఠునిచే శాపమునుండి యుద్ధరింపఁబడినది.

తుషారము— తాపము నొందినవానిని సంతోషపెట్టునది = మంచు

తుషా(రాద్రి)రగిరి— మంచుకొండ = హిమవత్పర్వతము.

తుషితుఁడు— ఎల్లప్పుడు సంతోషము నొందినవాఁడు = గణదేవతావిశేషము.

తుహినకరుఁడు— మంచువలె చల్లని కిరణములు గలవాఁడు = చంద్రుఁడు.

తుహినము— పద్మమును శిక్షించునది = మంచు, వెన్నెల.

తూఁడుదిండి— తామర తూఁడు ఆహారముగాఁ గలది = హంస.

తాల(ళ)ధ్వజుఁడు— తాడిచెట్టు జెండాగాఁ గలవాఁడు=1. బలరాముఁడు, 2 భీష్ముఁడు.

తాలు జిహ్వము— తాలువు (దౌడ) జిహ్వగాఁ గలది = మొసలి.

తావిమోపరి—గంధమును గొనిపోవు వాఁడు = వాయువు.

తావివిలుకాఁడు—పరిమళించెడు పుష్పములు ధనుస్సుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

తిగకంటి— (ఫాలనేత్రములోఁ గూడి) మూఁడు కన్నులుకలవాఁడు=శివుఁడు.

తిగకాళ్ళదేవర—మూఁడు కాళ్ళుగల దేవుఁడు = అగ్ని.

తిగప్రోలు (దాయ) వేఁటకాఁడు— చూ. త్రిపురాంతకుఁడు.

తిగ్మకరుఁడు— తీక్ష్ణములైన కిరణములు కలవాఁడు = సూర్యుఁడు.

తిథిప్రణి—తిథులను నడిపించువాఁడు= చంద్రుఁడు.

తిప్పదిమ్మరి—చూ. కోనద్రిమ్మరి.

తిమింగలము— తిమిని (నూఱుయోజనములు పొడవుగల చేఁప) మ్రింగెడు చేఁప.

తియ్యవి (లుకా) (ల్తు)ఁడు— చూ. చెఱకువిల్తుఁడు.

తిరునీరు—శైవులు నొసటనుంచుకొనెడు గోమయపిండ భస్మము = విభూతి.

తిరుమజ్జనము—భగవంతుని యభిషేకము.

తిరుమన్నుమణి—వైష్ణవులు ఫాలమున నుంచుకొను ధవళమృత్తిక.

తిరువారాధనము — వైష్ణవ పరిభాష యందు దేవతార్చనము.

తిలకము—నువ్వుగింజలవలె నుండునది = పుటుమచ్చ, బొటు.

తిలకాలకము— నువ్వులవలె నల్లగా నుండునది = పుట్టుమచ్చ.

తిలఘాతుకుఁడు— నువ్వులను పీడించి నూనెతీయువాఁడు= తెలుకులవాఁడు, తిలపీడుఁడు, తిలంతుదుఁడు. చూ. పై.

తిలయంత్రము—నువ్వులనుండి నూనె తీయు యంత్రము = గానుగ.

తిలోత్తమ — సుందోపసుందు లను రాక్షసుల వినాశముకొరకు మయునిచే లోకమునఁగల యొప్పులందెల్ల తిల ప్రమాణము నాహరించి చేయఁబడిన యొక స్త్రీ.

తివజడల రేయిద్రిమ్మరి— మూఁడు జడలుగల రాక్షసి = త్రిజట.

తీఁగబోఁడి(తీవబోఁడి)—తీఁగవలె మనోజ్ఞాంగలగు నాఁడుది.

తీఁగవిలు(తుఁడు)కాఁడు—తీఁగ విలుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

తాండవము—తండువను ఋషిచేఁ జెప్పఁబడినది (దీనిచే భూమి కొట్టఁబడును.) = పురుష నృత్యము.

తాతపనఁటివెల్లి– బ్రహ్మదేవుని కమండలువునందలి జలప్రవాహము=గంగ.

తాపనుఁడు—చూ. తపనుఁడు.

తాపసుఁడు–తపముచేయువాఁడు=ముని

తామరకంటి—చూ. తమ్మికంటి.

తామరచెలి—చూ తమ్మిచుట్టము.

తామరచూలి— శ్రీ విష్ణుని నాభికమలమునఁ బుట్టినవాఁడు = బ్రహ్మ.

తామరతూఁపరి–పద్మము బాణముగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

తామరపొక్కిలివాఁడు—చూ. కమలనాభుఁడు.

తామరసము–1. ప్రకృష్టమయిన రసము గలది, 2. శ్రమపడిన వారిచే నాస్వాదింపఁ బడినది, 3. ఉదకమునం దుండునది = పద్మము.

తామిస్రము–గాఢాంధకార మయమైన నరక విశేషము.

తామ్రచూడము–తామ్రవర్ణము(ఎఱుపు) గల మాంస విశేషము. శిరముపై నలంకారముగాఁగలది=కోడి.

తామ్రాక్షి—తామ్రము (రాగి) వలె నెఱ్ఱనైన నేత్రములు గలది = కోయిల.

తార— దీనిచే నావికులు తరింతురు = చుక్క.

తారక—అంధకారమును దాటించునది= కంటి నల్లగ్రుడ్డు.

తారకజిత్తు—
తార(కారి)కవైరి- } తారకాసురుని సంహరించిన వాఁడు = కుమారస్వామి.

తారకరాజశేఖరుఁడు— చంద్రమౌళి.

తారకానాథుఁడు-
తారకేశ్వరుఁడు — } దక్షపుత్రిక లగు అశ్విన్యాది (27) నక్షత్రములకు మగఁడు=చంద్రుఁడు.

తారకుఁడు— సంసార సాగరమునుండి తరింపఁజేయువాఁడు = భగవంతుఁడు.

తారాపతి— చూ. తారకానాథుఁడు. వాలి, సుగ్రీవుఁడు, గురుఁడు.

తారాపథము— నక్షత్ర మార్గము = ఆకసము.

తారాభూష—తారలు నగలుగాఁ గలది = రాత్రి.

తారేయుఁడు—1. ఇంద్ర పుత్రుఁడగు వాలికిఁ దారయను వానర కాంతయందుఁ బుట్టినవాఁడు = అంగదుఁడు. 2. బృహస్పతి (గురువు) భార్యయగు తారయందుఁ జంద్రునకుఁ బుట్టిన వాఁడు = బుధుఁడు.

తా(ల)ళకేతనుఁడు—చూ. తాళధ్వజుఁడు.

తమ్ములవిందు—చూ. తమ్మిచెలి.

తరంగిణి—అలలు కలది = నది.

తరక్షువు—దుమికి చంపునది = సివంగి.

తరణి—అంధకారమున నితని సహాయమునఁ దరింతురు = 1. సూర్యుఁడు, 2. నద్యాదికమును దాఁటించుటకు సమర్థమైనది = నావ.

తరళేక్షణ— చలించు కన్నులుగలది = ఆఁడుది.

తరిగట్టు తాలుపు— మందరపర్వత మనెడు కవ్వమును మూపుపై ధరించిన కూర్మావతార విష్ణువు.

తరిగట్టుత్రాడు— మందర పర్వతమునకు కవ్వపు త్రాడయినవాఁడు = ఆదిశేషుఁడు.

తరిగొండ— క్షీరసాగర మథనమునఁ గవ్వమైనకొండ = మందరము.

తరుణి—కన్యావస్థనుదాఁటిన 30 ఏండ్ల లోపు స్త్రీ = యౌవనవతి.

తరునఖము—చెట్లకు గోరువలె నుండునది = ముల్లు.

తర్జని—దీనిచే భయపెట్టఁ బడుదురు = జుట్టనవ్రేలు.

తర్పణము— దీనిచేఁ బితృదేవతలు తృప్తి బొందింపఁ బడుదురు = పితృదేవతలకైన యుదకదానము.

తలపుమాలి—చూ. చిత్తజుఁడు.

తలఁద్రాలు—వివాహకాలమునఁ గన్యావరులు దోసిళ్ళతోఁ దలలపైఁ బోసికొను బియ్యము.

తలయేఱు—శివునిశిరమున నుండెడునది = గంగ.

తలిరువిలు(కాఁడు)తుఁడు— హృదయమును గలఁతపెట్టెడు ధనుస్సుగలవాఁడు = మన్మథుఁడు.

తలిరుఁబో(ణి)ఁడి— చిగురువలె మనోజ్ఞాంగగు నాఁడుది.

తలిరు(ఁదిండి) మేఁతరి— చిగుళ్ళను దినునది = కోయిల.

తలిరువిలుతుఁడు— ఇగురువిల్తుఁడు.

తలోదరి— సూక్ష్మమైన యుదరము గల యాఁడుది = తన్వి.

తల్లితల్లి—తన తల్లియగు (గంగానదికి) (లక్ష్మికి) దల్లియగునది = 1. లక్ష్మి, 2 గంగ, 3 అమ్మమ్మ.

తాఁటదమ్ముఁడు— జీవనార్థము సన్న్యాసివేషమును ధరించినవాఁడు.

తాటి(పడగ) (టెక్కెము)(సిడము) వాఁడు—చూ. తాలధ్వజుఁడు.

తాటిసిక్కెనెల—(తాటిచెట్టు ఆకారముగల) జ్యేష్ఠా నక్షత్రముతోఁ గూడిన పున్నమ గల నెల = జ్యేష్ఠమాసము.

తాండవప్రియుఁడు— తాండవమునం దిష్టము గలవాఁడు = శివుఁడు.

తనూ(జాతుఁడు)జుఁడు — తనశరీరము నుండి పుట్టినవాఁడు = కుమారుఁడు.

తనూజము— శరీరమున మొలచునది = 1. ఱెక్క. 2. రోమము.

తనూనపాత్తు—శరీరము కదకుండ నిలుపునది = అగ్ని, చిత్రమూలము.

తనూరుహము—చూ. తనూజము.

తన్వి—కృశించిన శరీరముగల యాఁడుది = స్త్రీ.

తపనీయము—కాఁచుటకుఁ దగినది = బంగారు.

తప(పా)నుఁడు—తపింపఁ జేయువాఁడు = సూర్యుఁడు.

తపసికన్నాపప— అత్రిమహర్షియొక్క కంటినుండి పుట్టిన బిడ్డఁడు చంద్రుఁడు. (అత్రి తన భార్యతోఁ గ్రీడించుచుండఁగా వీర్యస్ఖలనకాలమున వాయువు ఆ వీర్యమును మూఁడు భాగములుగాఁ జేసెను. ఒక భాగము చెదిరి కంటఁ బడుటచే నందుండి బ్రహ్మయనుగ్రహమునఁ జంద్రుఁడు పుట్టెనని పురాణగాథ.)

తపోధనుఁడు—తపస్సు ధనముగాఁగలవాఁడు = ఋషి.

తప్తకృచ్ఛ్రము—3 రోజులు 6 పలముల వేడినీరును, 3 దినములు 3 పలముల వేఁడిపాలును, 3 రోజులు 1 పలమువంతున వేఁడినేయుఁ గాఁగ త్రాగి 3 దినములు శుష్కోపవాసముసేయుట.

తమ(స్వతి)స్విని —తమస్సు (చీఁకటి) కలది = రాత్రి.

తమోగువు—చీఁకటివలె నల్లనికాంతి కలవాఁడు = రాహువు.

తమోఽపహ(ఘ్ను)ఁడు— చీఁకటిని పోఁగొట్టువాఁడు = 1. సూర్యుఁడు, 2 చంద్రుఁడు, 3 అగ్ని.

తమోభిదము— చీఁకటిని భేదించునది = మెఱుఁగుఁడు పురుగు.

తమోమణి—చీఁకటియందు మణివలెఁ బ్రకాశించునది= మెఱుఁగుఁడు పురుగు.

తమ్మికంటి—పద్మములవంటి కన్నులు కల(ది)వాఁడు = స్త్రీ, విష్ణువు.

తమ్మిగద్దియదళవాయి—చూ. కమలాసనుఁడు.

తమ్మి(చుట్టము)చెలి— పద్మములకు జుట్టమైనవాఁడు = సూర్యుఁడు.

తమ్మిదొర—పద్మములకుఁ బ్రభువు = సూర్యుఁడు.

తమ్మి(పగతుఁడు)సూడు- తామరలకు శత్రువు = చంద్రుఁడు.

తమ్మిగద్దియబోఁటి—కమల మనెడు పీఠమున గూర్చుండుకాఁత = లక్ష్మి.

తమ్మిచక్కిలిగింత— కమలములకు గిలిగింతపెట్టువాఁడు = సూర్యుఁడు.

తమ్మిచూలి—కృష్ణుని నాభికమలమునఁ బుట్టినవాఁడు = బ్రహ్మ

తమ్ములపగవాఁడు (తమ్మిదాయ) చూ. తమ్మిసూడు.

జుట్టుఁబలుఁగు— శిరమున జుట్టుగల పక్షి = 1 నెమలి, 2. కోడి.

జుట్టుపిట్టతాలుపు— నెమలి వాహనముగాఁగలవాఁడు = కుమారస్వామి.

జేజేగిడ్డి—దేవతల యావు, కామధేనువు.

జేజేజేనియరదము— దేవేంద్రునకు వాహనమైనది = మేఘము.

ఝషకేతుఁడు—మొసలి ధ్వజముగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

ఝషాంకుఁడు—చూ ఝషకేతుఁడు.

టెంగణాసామి— పొట్టి ప్రభువు = వామనుఁడు, గణపతి.

టిట్టిభ(క)ము—టీటీయని కూయునది = తీతువు, లకుముకిపిట్ట.

డిండిమము—డిండిమ్మను ధ్వనిచేయునది = మద్దెలము.

డెందమ్ముగమూలి—మనస్సునఁ బుట్టినవాఁడు = మన్మథుఁడు.

తంతునాభము—1. దారము నాభియందుఁగలది, 2. నాభినుండి వచ్చు దారముచే గూఁడు కట్టుకొనునది = సాలెపురుఁగు.

తంతువాయము— తన నాభియందలి నూలుచే గూఁడు నేయునది = సాలెపురుఁగు.

తంతువాయుఁడు—దారముచే వస్త్రములు నేయువాఁడు = సాలెవాఁడు.

తగరు (బాబాసామి) రౌతు — మేక వాహనముగాఁ గలప్రభువు = అగ్ని.

తటా(డా)కము— జలముచేఁ గొట్టఁబడునది = చెఱువు.

తటిత్వంతము— మెఱపులు గలది = మేఘము.

తటిని— తటములు గలది = ఏఱు.

తడవులనిడుపడు— పురాతనపు సర్పము = ఆదిశేషువు.

తత్త్వజ్ఞుఁడు— పరమాత్మస్వరూపమును దెలిసినవాఁడు = జ్ఞాని.

తత్సమము— సంస్కృత ప్రాకృత సమమై తెనుఁగు విభక్తి ప్రత్యయముతోఁ గూడిన పదము

తద్దినము— మృతిబొందిననాఁటి దినము = ఆబ్దికము.

తద్భవము—సంస్కృత ప్రాకృతపదములనుండి పుట్టినది = వికృతి.

తనుత్రాణము—యుద్ధాదులందు శరీరమును దెబ్బలనుండి రక్షించునది = కవచము.

తనువారము— దేహమును దెబ్బలు తగులకుండునట్లు వారించునది = కవచము.

తనూ(జాత)జ(భవ)— శరీరమునుండి పుట్టినది = కూఁతురు.

(ఇంద్రుఁడు గౌతమునియింట తెల్లవాఱుజామున కోడియై కూసి గౌతముఁడు నదికిఁబోఁగా గౌతమవేషధారి యయి యహల్యను గూడెనని పురాణగాథ)

జమిలితల్లులబిడ్డ— గంగా పార్వతులను నిరువురుతల్లులకుఁ బుట్టుఁడయిన వాఁడు = వినాయకుఁడు.

జమిలిముక్కాలి— జంటలుగానున్న మూఁడు కాళ్ళు (ఆఱు) గలది = తుమ్మెద.

జమిలి ముక్కాలి విలుకాఁడు— తుమ్మెద నారిగాఁగల ధనుస్సు గలవాఁడు = మన్మథుఁడు.

జమిలిముత్తల— చూ. ఆఱుమోముల వేల్పు.

జమునగొంగ—యమునానదికి శత్రువయినవాఁడు = బలరాముఁడు. (ఇతఁడు గోపికలతో యమునకు స్నానమునకయి వెళ్ళెను బలరాముఁడు యమునను బిలిచెనుగాని రాలేదు. ఆ కారణమునఁ గోపించి "నిన్ను జీల్చెద"నని హలమును దివిచెను. అప్పటినుండి యీ యమున తెల్లబడెనని పురాణ గాథ.)

జమున తోఁబుట్టువు— యమునకు సోదరుఁడు = యముఁడు.

జమునసైదోడు—చూ.— పై.—

జమునయ్య— యముని తండ్రి = సూర్యుఁడు.

జముపగఱ—యముని శత్రువు = శివుఁడు. (కాలపాశముచే బాధింపఁబడుచున్న తన భక్తుఁడగు మార్కండేయుని రక్షించుటకు శివుఁడు త్రిశూలముచే యముని వక్షమునఁ బొడిచెనని పురాణగాథ)

జమునెక్కిరింత— జముని వాహనము = దున్న.

జల్లితోఁకమెకము—విరిసిన వెండ్రుకలు తోఁకయందుఁగల జంతువు = చమరీమృగము.

జాబిల్లియల్లుఁడు— చంద్రునకు మేనల్లుఁడైనవాఁడు = మన్మథుఁడు.

జాబిల్లిమేపరి—చంద్రుని మ్రింగువాఁడు=రాహువు. (దేవదానవు లమృతమునకై కలహించుచుండ విష్ణువు జగన్మోహిని యవతార మెత్తి వారిని పంక్తులుగాఁ గూర్చుండఁబెట్టెను. అమృతమును ముందు దేవతలపంక్తికిఁ బోయుచుండఁగా సింహిక కొడుకు దేవతలపంక్తిలోఁ జేరి యమృతపానము చేసెను. సూర్యచంద్రు లీ విషయమును జగన్మోహినితోఁ జెప్పఁగా నామె చక్రమున వాని శిరమును ఖండించెను. అమృతము ద్రాగిన నా రెండు మొండెములును రాహు కేతువులయి జీవించి సూర్యచంద్రులపైఁ బగ సాధించుచున్నారని పురాణగాథ.)

జాలంచలవిడిది— హంసల పంక్తికి నెలవైనది = 1. దేవగంగ, 2. మానస సరోవరము.

జైవాతృకుఁడు—1. చిరకాలము జీవించువాఁడు, 2. పైరులను జీవింపఁ జేయువాఁడు = చంద్రుఁడు.

జ్ఞానపాదము— సమస్తమును దనయిష్ట దేవతాస్వరూపముగా భావించి తద్భిన్నా యితరపదార్థము లేదని నిర్ధారణ చేసికొనుట.

జ్యోతిశ్చక్రము— సూర్య చంద్రాది గ్రహయుక్తనక్షత్రమండలము.

జ్యోత్స్నాప్రియము— తన కాహారమైన వెన్నెలయందుఁ బ్రీతికలది = వెన్నెల పులుఁగు.

జ్వలనుఁడు— మండెడి స్వభావము కల వాఁడు = అగ్నిదేవుఁడు.

జ్వాలాజిహ్వుఁడు— జ్వాలలు నాలుకలుగాఁ గలవాఁడు = అగ్ని.

జంటముక్కాలి—ఆఱుకాళ్లుగలది = తుమ్మెద.

జంటమోముల (దంట)వేల్పు— రెండుముఖములుగల దేవుఁడు= అగ్ని.

జంటమోముల (వేలుపు)సామి— రెండు ముఖములుగల దేవుఁడు=అగ్ని.

జములుముక్కాలి- జంట ముక్కాలి.

జక్కవ (రాయఁడు) ఱేఁడు— చక్రవాకములకుఁ బ్రభువు = సూర్యుఁడు.

జక్కవయంటు— చక్రవాకముల వియోగమును బోఁగొట్టి మిథునమును గూర్చువాఁడు = సూర్యుఁడు.

జక్కవ(కవవిప్పు) పగవాఁడు— చక్రవాకమిథునమును వేఱు చేయువాఁడు = చంద్రుఁడు.

జక్కవగొంగ—చక్రవాకములకు శత్రువు = చంద్రుఁడు.

జక్కిమోరవేలుపు—కిన్నరుఁడు.

జక్కులఱేఁడు—యక్షప్రభువు = కుబేరుఁడు.

జక్కుఱేనిచెలికాఁడు— కుబేరుని మిత్రుఁడు = శివుఁడు.

జగముకన్ను—చూ. జగచ్చక్షువు.

జగము చుటము— చూ. లోకబాంధవుఁడు.

జగముతల్లి—జగత్తునకుఁ దల్లియైనది = 1. లక్ష్మి, 2. పార్వతి.

జడదారి—చూ. జటాధారి.

జడదారికన్పాప- అత్రిమహర్షియొక్క కంటియందు బ్రహ్మాయంశమునఁబుట్టిన బిడ్డఁడు = చంద్రుఁడు.

జడదారిచెవి (బుగ్గ) యూట— చూ. జాహ్నవి.

జడదారి యింటికోడి—గౌతముని యింటికోడియైనవాఁడు = ఇంద్రుఁడు.

జాల్ముఁడు— ఆలోచింపక పని చేయు వాఁడు = నీచుఁడు, క్రూరుఁడు.

జాహ్నవి— జహ్నుమహర్షి చెవినుండి పుట్టినది = గంగ. (భగీరథుఁడు పితరులగు సగరుల పుణ్యలోక ప్రాప్తికయి గంగను పాతాళమునకుఁ గొనివచ్చుచుండగాఁ దారిలో జహ్ను మహర్షి యాశ్రమము మునిఁగిపోయెను. మహర్షి కోపించి గంగనంతను త్రాగి వైచెను. భగీరథునిచేఁ బ్రార్థింపఁబడి జహ్నువు గంగను తన చెవినుండి వదలెనని పురాణప్రసిద్ధి)

జింకగుఱ్ఱముపలంతి— జింక వాహనముగాఁ గల ప్రభువు = వాయువు.

జింక తా (ల్పు)ల్పరి—జింకను ధరించిన వాఁడు = శివుఁడు, చంద్రుఁడు.

జింకమావు దేవర— జింకవాహనము గలదేవుఁడు = వాయువు.

జింక (రవు) రౌతు- జింకనెక్కి తిరుగు వాఁడు = వాయువు.

జితేంద్రియుఁడు—జయింపఁబడిన యింద్రియములు గలవాఁడు.

జిష్ణుఁడు—జయించుశీలముగలవాఁడు = ఇంద్రుఁడు.

జిహ్మగము— వంకరగాను మెల్లగాను పోవునది = సర్పము.

జిహ్మమేహనము-మెల్లగా మూత్రము విడుచునది = కప్ప.

జిహ్వాపము—నాలుకచే పానము చేయునది = కుక్క, పిల్లి, పులి, ఎలుఁగు మొ.

జిహ్వామూలీయము- జిహ్వ ఉత్పత్తి స్థానముగాఁ గలది = క వర్ణమునకు ముందుంచెడు రెండరసున్నలు.

జీమూతము— దీనియందుదకము బంధింపఁబడును = మేఘము.

జీవంజీవము— సహచరముతోఁ గూడి జీవించునది = వెన్నెల పులుఁగు.

జీవ (న్మృతుఁడు) చ్ఛవము— బ్రతికియుండియుఁ జనిపోయిన వానితో సమానమైనవాఁడు.

జీవదుఁడు— 1. జీవమునిచ్చువాఁడు = వైద్యుఁడు, 2. ఉదకము నిచ్చువాఁడు = మేఘుఁడు.

జీవన్ముక్తుఁడు— జీవించియే సంసార బంధములను ద్రెంపి బ్రహ్మజ్ఞానపరుఁడై ముక్తినొందినవాఁడు.

జీవాంతకుఁడు— జీవము (ప్రాణము) అను అంతము చేయువాఁడు = పిట్ట వేఁటకాఁడు.

జీవితేశుఁడు—జీవితమునకుఁ బ్రభువు = 1. భర్త, 2. యముఁడు.

జేజే (ల) గట్టు— దేవతల విహార పర్వతము = మేరువు.

జేజే (ల) పట్టు—దేవతలనివాసస్థానము = స్వర్గము.

జేజేలపాలెము—చూ.— పై.—

జేజేలమానికము— దేవతల కోర్కెలను దీర్చెడు రత్నము = చింతామణి.

జలధిరశన—సముద్రము మొలనూలుగాఁ గలది = భూమి.

జలనిధి—జలములకు ముఖ్యస్థానము = సముద్రము.

జలప్లవము—నీటియందుఁ దేలియుండునది = నీటిపిల్లి.

జలము (ముక్కు)చము—జలమును విడుచునది = మేఘము.

జలరసము—జలమునందుండు రసము = శాకాదుల కుపయుక్తములగు వాని రసములలో నొకటియగు నుప్పు.

జలరాశి—జలసమూహము=సముద్రము.

జలవల్కలము— నీటిపై వస్త్రమువలె నుండునది = నాచు.

జలసూకరము—నీటియందు పందివలె నుండునది = మొసలి, నీటిపంది.

జలాశయము—జలములకు పానమైనది= 1. మడుగు 2. కొలను మొ.

జలూక—చూ. జలౌకసము.

జలేశయము—నీటనుండునది = చేప మొ.

జలౌకసము—జలము నివాసముగాఁ గలది = 1. జలగ, 2. చేప మొ.

జల్పాకుఁడు— నిరుపయోగములైన పెక్కుమాటలు పలుకువాఁడు.

జహ్ను (కన్య) తనయ— జహ్ను మహర్షి కూఁతురు = గంగ.

జాంబూనదము— మేరుపర్వతసమీపమున నున్న నేరేడుపండ్ల రసముచేఁ బాఱిన నదియందుఁ బుట్టినది = బంగారము.

జాతకర్మము—పుట్టినవానికి వెంటనే చేయు నొక కర్మవిశేషము.

జాతరూపము— ప్రశస్తమైనరూపము కలది = బంగారము.

జాతవేదుఁడు—1. ఇతనివలన వేదములు పుట్టినవి, 2. పుట్టిన ప్రతిదేహమందు నుండువాఁడు, 3. హిరణ్యము వీనివలనఁ బుట్టినది = అగ్నిదేవుఁడు.

జానపదము—జనులు నివసించెడు గ్రామాదికము.

జాబిల్లితాలుపు—చంద్రుని శిరమున ధరించినవాఁడు = శివుఁడు.

జామాత—పెండ్లామును వివాహార్థము గౌరవించువాఁడు = కూఁతుమగఁడు.

జాయ— ఈమెయందు భర్త పుత్రరూపమున జనించును = భార్య.

జాలపాదము— వలవంటిపాదముగలది= 1. బాతు, 2. హంస.

జాలము—జలమునందు వేయఁబడునది = వల.

జాలమత్స్యన్యాయము—వలలోఁ జిక్కిన చేప లోనుండి సమస్తమూఁ జూచుచుండును గాని బయటకు రాలేదను విధము.

జగన్నాథుఁడు—జగములకుఁ బ్రభువు = శ్రీవిష్ణువు.

జఘన్యజుఁడు—1. తనకంటె వెనుక పుట్టినవాఁడు, 2. పరబ్రహ్మయొక్క జఘనమునుండి పుట్టినవాఁడు = శూద్రుఁడు.

జటా(ధరుఁడు)ధారి—జడలను ధరించువాఁడు = శివుఁడు, ముని.

జటి—జడలు గల(ది) వాఁడు = 1. సన్న్యాసి, 2. జువ్విచెట్టు

జడుఁడు—ఇష్టానిష్ట సుఖ దుఃఖాదుల నెఱుంగక పరవశుఁడై (స్తబ్ధుఁడయి) యుండువాఁడు.

జన(యిత్రి)ని—కొడుకులను గనునది = తల్లి.

జనపదము—జనులు నివసించు ప్రదేశము.

జనార్దనుఁడు—1. సముద్రమధ్యమున నున్న జనులనెడు రాక్షసులను పీడించినవాఁడు, 2. ప్రళయకాలమున సర్వజనులను బాధించువాఁడు = శ్రీవిష్ణువు, 3. జనులను రక్షించువాఁడు.

జనుషాంధుఁడు—పుట్టినప్పటినుండియు గ్రుడ్డియైనవాఁడు.

జయంతుఁడు—1. శత్రువులను జయించువాఁడు, 2. సౌందర్యముచే నందఱను బరాభవించువాఁడు = ఇంద్రపుత్త్రుఁడు.

జయస్తంభము—విజయ జ్ఞాపకార్థమై వాటఁబడు స్తంభము.

జరద్గవము—పోయిన కన్నులు గల ముసలి యెద్దు.

జరాభీరువు—ముదుసలులయెడ భీతి నొందువాఁడు = మన్మథుఁడు.

జరాసంధుఁడు—జర యను రాక్షసిచే రెండు శరీరభాగములు సంధింపఁబడి శిశురూపమును దాల్చినవాఁడు = ఒక రాక్షసరాజు.

జలంధరుఁడు—మన్మథుని భస్మము చేయఁగా మిగిలిన శివుని ఫాలనేత్రానలము సముద్రమునఁబడి యీ రూపముగా నుదయించినవాఁడు.

జలకంటకము—నీటియందు శత్రువు వలె నుండునది = మొసలి.

జల(కేళి)క్రీడ—నద్యాదులయందు వినోదార్థమై పరస్పరము గావించుకొను చల్లులాట మొ.

జలచరము—నీటియందు సంచరించునది = 1. చేప, 2. మొసలి మొ.

జలజము—నీటియందుఁ బుట్టునది = పద్మము, ముత్యము మొ.

జలతస్కరుఁడు—జలమును ఆవిరూపముగాఁ దన వేడియైన కిరణములచే హరించువాఁడు = సూర్యుఁడు.

జలదము—జలమునిచ్చునది = మేఘము.

జలదస్యుఁడు—చూ. జలతస్కరుఁడు

జలధరము—జలమును ధరించునది = మేఘము

జలధి—జలములు దీనిచే ధరింపఁబడును = సముద్రము

చాఱలమెకము— శరీరమున చాఱలు గల మృగము = పెద్దపులి.

చుక్కలగమికాఁడు— దక్షపుత్రిక లగు నశ్విన్యాదినక్షత్రములకు భర్త = చంద్రుఁడు.

చుక్కల(దొఱ)ఱేఁడు— నక్షత్రములకుఁ బ్రభువు = చంద్రుఁడు.

| | |
|---|---|
| చుట్టలుగు<br>చుట్టు(కైదువు) వాలు | చూ. బటువు వాలు. |

చుట్టుఁగైదువజోదు—చుట్టు వాలు వారి, చక్రాయుధముకల యోధుఁడు = శ్రీమహావిష్ణువు.

చూపు(ల)గుఱ్ఱము — చూచుటకు సొగసుగనుండి పనికి నిరుపయోగమైనవాఁడు.

చౌగంటి—నాల్గు కన్నులు గల (ది) వాఁడు = శరభమృగము, అగ్ని.

చౌదంతి—నాల్గు దంతములు గలది = ఐరావతము.

చౌదంతి యెకిమీఁడు— ఐరావతమునకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

ఛలోక్తి—ఒకయుద్దేశ్యము మనస్సున నుంచుకొని చెప్పినదానికి అభిప్రాయాంతరమును భావించుకొని యుత్తరము చెప్పుట.

ఛాందసుఁడు— ఛందోరూప మయిన వేదమును జదివినవాఁడు, చదువుకొన్న మూఢుఁడు.

ఛాగముఖుఁడు—ఆఱు ముఖములలోఁ గడపటిదగు మేఁక మొగము గలవాఁడు = కుమారస్వామి.

ఛాగరథుఁడు—గొఱ్ఱె వాహనముగాఁ గలవాఁడు = అగ్నిదేవుఁడు.

ఛాత్రుఁడు—గురుని దోషములు గప్పి పుచ్చుశీలముగలవాఁడు = శిష్యుఁడు.

జంబాలిని—అడుసుగలది = ఏఱు.

జంబుకము— మాంసమును భక్షించునది = నక్క.

జంబూద్వీపము— గొప్ప జంబూ (నేరేడు) వృక్షముగలిగి మేరువునకు దక్షిణముననున్న యొకద్వీపము.

జంభారాతి—చూ. జంభారి.

జం(భ భేది) భారి—జంభాసురుని సంహరించినవాఁడు = ఇంద్రుఁడు. (ఇంద్రుఁడు విష్ణుని యుపదేశమున వజ్రాయుధమును విడిచి, అగ్నిదత్తాస్త్రములను విశ్వాసుల రథమును గ్రహించి, శమీరపుత్రుని సారథిగాఁ జేసికొని యుద్ధమున జంభాసురుని సంహరించెనని రామాయణము)

| | |
|---|---|
| జగచ్చక్షువు<br>జగముకన్ను | ప్రపంచమునకు నేత్రమువంటి వాఁడు = సూర్యుఁడు. |

జగత్ప్రాణుఁడు — జగమునకుఁ బ్రాణమువంటివాఁడు = సూర్యుఁడు.

జగద్వ్యాపి—ప్రపంచమును వ్యాపించియుండువాఁడు = దేవుఁడు.

చట్టుపురుగు— భూమిలోని శిలల క్రిందనుండు పురుగు = సర్పము.

చదరంగము — (చతురంగము) గజ తురగాది చతురంగబల సమన్వితమగు క్రీడావిశేషము.

చదలుకాపులు— స్వర్గమునవసించు వారు = వేల్పులు.

చదలుమానికము — ఆకాశమునందు మాణిక్యమువలెఁ బ్రకాశించు వాఁడు = సూర్యుఁడు.

చదువుల (దేవర) వేల్పు — వేదములు మొగమునుండి యావిర్భవించిన దేవుఁడు = బ్రహ్మ.

చదువుల పులుఁగు — చదువునేర్చు పక్షి = చిలుక.

చదలయేనుఁగు—స్వర్గమునందలి యేనుఁగు = ఐరావతము.

చదలు తేజి— స్వర్గమునందలి గుఱ్ఱము = ఉచ్చైశ్శ్రవము.

చదలుదొడుకు—స్వర్గమునందలి కామధేనువు.

చద(లువాఁక)లేరు— ఆకాశమునందలి నది = మందాకిని.

చయి (చై)పులసాకిరి—కర్మసాక్షి.

చలికాపు— వరాకాలమునఁ జలికిఁ బుటునది = కప్పం.

చలిగొండ— చల్లనిపర్వతము = హిమవంతము.

చలిదాయ— చల్లదనమునకు శత్రువు = సూర్యుఁడు.

చలివెలుఁగు— చల్లని కాంతి గల వాఁడు = చంద్రుఁడు.

చలువ(గట్టు)మల— చలిగొండ.

చలువజోతి—చూ. చలివెలుఁగు.

చలువగుఱ్ఱము—చాఁకలి చలువచేసిన బట్టలుమోయు వాహనము.

చలువఱేఁడు— చల్లని ప్రభువు = చంద్రుఁడు.

చాఁగరతనము— కోరికలు తీర్చెడు మాణిక్యము = చింతామణి.

చాటుబోటులబావ— అంతఃపురస్త్రీలకు బావయైనవాఁడు = సూర్యుఁడు.

చాయపట్టి—సూర్యునకు ఛాయాదేవియందుఁ బుట్టినవాఁడు = శని.

చాయ(పెనిమిటి) మగఁడు— ఛాయాదేవికి మగఁడు = సూర్యుఁడు. (సంజ్ఞాదేవి భర్తృతేజమునకుఁ దాళఁజాలక తన ఛాయను దీసి సూర్యునితోఁ గాపురము చేయున ట్లాజ్ఞాపించి పెనిమిటితోఁ జెప్పకయే పుట్టినింటి కరిగెనని పురాణగాథ.)

చీఁకటిగొంగ — (చీఁకటి గుండె దిగులు) చీఁకటికి శత్రువు = 1. సూర్యుఁడు, 2. చంద్రుఁడు.

చీఁకటితప్పు — చీఁకటియందుఁ జేసెడి తప్పుపని = జారత్వము మొ.

చీఁకటిదొంగ — చీఁకటిని హరించువాఁడు = సూర్యుఁడు.

చీఁకటిమిత్తి — చీఁకటికి మృత్యువైనవాఁడు = చంద్రుఁడు, సూర్యుఁడు.

చీఁకటివేరువిత్తు — చీఁకటిదొంగ.

చుచుందరి — వాసనగల యెలుక = చుంచు.

చెందొవ (విందు) చెలి — కలువల చుట్టము = చంద్రుఁడు.

చెట్ట (ద్రిమ్మరి)నట్టు — చెట్టు నివాసముగాఁ గలది = కోఁతి.

చెంగల్వ(నేస్తి)దొర — చూ. పై.

చెయువులసాకిరి — చేసిన పనులకు సాక్షియగువాఁడు = సూర్యుఁడు.

చెయ్యి(చే)గలమెకము — తొండము గల జంతువు = ఏనుగు.

చెఱకువిలుతు(కా)ఁడు — చూ. ఇక్షుధన్వుఁడు.

చెవులపోతు — పెద్ద చెవులుగల మృగవిశేషము = కుందేలు.

చేఁగలమెకము — తొండము గల మృగము = ఏనుఁగు.

చేఁగలవారు — ఈవి గలవారు = దాతలు.

చేటగోళ్ళబోటి — చేటలవంటి గోళ్లు గల స్త్రీ = శూర్పణఖ.

చేటచెవులమెకము — చేటలవంటి చెవులుగల జంతువు = ఏనుఁగు.

చేటచెవులవేల్పు — చేటలవంటి చెవులుగల దేవుఁడు = విఘ్నేశ్వరుఁడు.

చేటరిక్క — చేటయాకారము గల నక్షత్రము = విశాఖ.

చేతోభవుఁడు — మనస్సునఁ బుట్టువాఁడు = మన్మథుఁడు.

చైత్రరథము — చిత్రరథుఁడను గంధర్వరాజుచే నిర్మింపఁబడిన యుద్యానవనము.

చైత్రసఖుఁడు — వసంతునకుఁ జెలికాఁడు = మన్మథుఁడు.

చైలధావకుఁడు — బట్టలనుదుకువాఁడు = చాకలి.

చోరబుసుత — చేఁపపిల్లవంటి కన్నులు గల స్త్రీ, చేఁపపిల్ల.

చందమామపులుఁగు — చూ. చకోరకము.

చక్కెర (తిండి) పులుఁగు — చక్కెరతినెడి పక్షి = చిలుక.

చక్కెర విలుకాఁడు — చూ. చెఱకు విలుకాఁడు.

చిత్రకంఠము— నానావర్ణములు గల కంఠము గలది = నెమలి, పావురము.

చిత్రకాయము— నానావర్ణములు గల శరీరము గలది = చిఱుతపులి.

చిత్రగుప్తుఁడు— యమునియొద్ద పుణ్యపాపముల లెక్కలను వ్రాయువాఁడు.

చిత్రపక్షము— నానావర్ణములు గల ఱెక్కలుగలది = నెమలి, కముజు.

చిత్రపటన్యాయము— ముందు గీతలు గీచి పిదప వాని సహాయమున బొమ్మ తయారుచేయుట.

చిత్రబింబము— కామరూపముగల తొండ = ఊసరవెల్లి.

చిత్రభానువు(ఁడు)—వివిధ కాంతులు గల కిరణములు గలవాఁడు = సూర్యుఁడు, అగ్ని.

చిత్రరథుఁడు— సప్తాశ్వములు గలిగి యుండుటచేఁ బ్రసిద్ధమైన రథము గలవాఁడు = సూర్యుఁడు, ఒక గంధర్వుఁడు.

చిత్రవాలము— చిత్రవర్ణములు గల తోఁక గలది = పాలపిట్ట.

చిత్రశిఖండిజుఁడు—రంగురంగుల జటలుగల యంగిరసుని కొడుకు = బృహస్పతి.

చిత్రాక్షి— రంగురంగుల కన్నులు కలది = గోరింక.

చిదాకాశము— ఆకాశమువలె నిర్లేపమగు శుద్ధపరబ్రహ్మము.

చిదాభాసుఁడు— చిత్తు (పరబ్రహ్మము) యొక్క లక్షణములు లేకున్నను జిద్రూపముతోఁ దోఁచువాఁడు.

చిరంజీవి— చాలకాలము జీవించువాఁడు = కాకి, విష్ణువు, వేల్పు, బూరుగు.

చిరంజీవులు— చాలకాలము జీవించిన వారు = 1. అశ్వత్థామ, 2. బలి, 3. వ్యాసుఁడు, 4. హనుమంతుఁడు, 5. విభీషణుఁడు. 6. కృపుఁడు, 7. పరశురాముఁడు, 8. మార్కండేయుఁడు మొ.

చిరాయువు—గొప్ప ఆయుర్దాయము కల(ది)వాఁడు = 1. వేల్పు, 2. బూరుగు, 3. కాకి, చూ. పై.

చిలుకరౌతు—చిలుక నెక్కి తిరుగువాఁడు = మన్మథుఁడు.

చిలువతాలుపు—సర్పములను ఆభరణములుగా ధరించువాఁడు = శివుఁడు

చిలువ(మేఁతరి)తిండి— పాముల కాహారమైనది = 1. వాయువు, 2. కప్ప, పాము లాహారముగాఁ గలవాఁడు = గ్రుడుఁడు.

చిలువపానుపు — శేషశయనుఁడు.

చిలువమేఁత— పాముల కాహారమయినది = 1. వాయువు, 2. కప్ప.

చిలువఱేఁడు—సర్పరాజు = శేషుఁడు, వాసుకి.

చీఁకటిగాము-- చీఁకటివలె నల్లనయిన గ్రహము = రాహువు.

బంట్లు) అంగములు గల రాజసేన.

చతురంతయానము— నాలుగు కాళ్లుగల గమనసాధనము = పలకీ.

చతురాననుఁడు—నాలుగు ముఖములు గలవాఁడు = బ్రహ్మ.

చతుర్దంతము— నాలుగు దంతములు గలది = ఐరావతము.

చతుర్భుజుఁడు—నాలుగు భుజములు గలవాఁడు=శ్రీవిష్ణువు.

చతుర్ముఖుఁడు—చతురాననుఁడు.

చతుర్వర్గము—ధర్మార్థ కామమోక్షముల సమూహము.

చతుష్పథము—నాలుగు వీథులు కలియుచోటు = రాజమార్గము.

చతు(ష్పాత్తు)ష్పదము— నాలుగు కాళ్ళ జంతువు.

చతుష్పాణి—నాలుగు చేతులు కల వాఁడు=శ్రీ విష్ణువు.

చరణాయుధము— పాదము లాయుధముగాఁ గలది = కోడి.

చరాచరము—స్థావర జంగమాత్మకమైనది = జగము.

చరువు—అగ్నియందు వేల్వఁదగిన పక్వాన్నము లేక తదాధారపాత్రము.

చర్మ(చటి)పత్ర— తోలువంటి రెక్కలుగలది = గబ్బిలము.

చర్యాపాదము— భూలోకమునఁ గల దేవాలయములను దర్శించుటకయి సంచారము చేయుట.

చలదళము— ఎల్లప్పుడును గదలుచుండెడి ఆకులుగలది = రావిచెట్టు.

చాంద్రాయణము— చంద్రకళల వృద్ధిక్షయములననుసరించి దినమున కొక్కొక్క కబళము చొప్పున హెచ్చు తగ్గులుగా భుజించెడు వ్రత విశేషము.

చాతుర్మాస్యము— ఆషాఢ శుద్ధ పాద్యమి మొదలు కార్తిక శుద్ధ పాద్యమి వఱకునైన నాలుగుమాసములు ఋషీశ్వరు లాచరించెడి వ్రత విశేషము.

చామరము—చమరమృగము నకు సంబంధించినది = వింజామరము.

చామీకరము— చమీకరమను గనియందుఁ బుట్టినది=బంగారము.

చాముండి—రురుండను దానవుని జంపి చర్మమును ముండమును రెండుగాఁ జేసిన త్రికళయొక్క ఈశ్వర శక్తి.

చింతామణి —చూ. చాగరతనము.

చిగురాకుఁదిండి— చిగురుటాకు లాహారముగాఁగలది = కోకిల.

చిగు(రాకు)రువిలుకాఁడు }
చిగురుకైదువుజోదు } చూ. ఇగురువిల్తుఁడు

చిచ్చరకంటి—అగ్నిమయమైన ఫాల నేత్రము గలవాఁడు = శివుఁడు.

చిత్తజుఁడు— హృదయమునఁ బుట్టువాఁడు = మన్మథుఁడు.

**ఘోటకముఖుఁడు**— గుఱ్ఱపుముఖము కలవాఁడు = కిన్నరుఁడు.

**ఘోణి**— పెద్ద ముట్టె గలది = పంది, ఏనుఁగు, దోమ.

**ఘోరదర్శనము**— భయంకరమైన దర్శనము గలది = జెబ్బులి.

**ఘోషము**— దీనియందు గోవులు ఘోష పెట్టును = గొల్లపల్లె.

**చంచరీకము**— పుష్పములయందు సంచరించుచుండునది = తుమ్మెద.

**చం(డకరుఁడు)డాంశువు**— తీవ్రమైన కిరణములు కలవాఁడు = సూర్యుఁడు.

**చండిక**— చండుఁడను దనుజుని సంహరించినది = పార్వతి శరీరము నుండి పుట్టిన దేవి.

**చంద్రకాంతము**— చంద్రకిరణముల తాకుడుచే స్రవించునది = చలువరాయి, తెల్లకలువ.

**చంద్రముఁడు**— (శీతలత్వ శ్వేతత్వాది సాధర్మ్యముచే) కర్పూరములోఁ బోల్పఁబడువాఁడు = చంద్రుఁడు.

**చంద్ర (మౌళి) (చూడుఁడు) శేఖరుఁడు**— చంద్రుఁడు కిరీటముగాఁగలవాఁడు = శివుఁడు. (దక్షాధ్వర ధ్వంస కాలమునఁ గాలిక్రిందఁబడి నలిగి, చంద్రుఁడు శివుని ప్రార్థింపఁగా జాలి కలిగి శివుఁడు చంద్రుని శిరమున నుంచుకొనెనని పురాణప్రసిద్ధి.)

**చంద్రహాసము**— ప్రకాశమునఁ జంద్రుని నయితము (హసించు) తిరస్కరింపఁజాలినది = పెద్దకత్తి (చంద్రుని వెన్నెలవలెఁ బ్రకాశించునది)

**చంద్రుఁడు**— సంతోషింపఁ జేయువాఁడు.

**చకోర(క)ము**— చంద్ర కిరణములను ద్రాగి తృప్తి పొందునది = వెన్నెలపులుఁగు.

**చక్రధరము**— శ్రీకృష్ణుని చక్రాకారముగల పాదచిహ్నము శిరమున ధరించినది = కాళీయ సర్పము.

**చక్రధరుఁడు**— సుదర్శన చక్రమును ధరించినవాఁడు = శ్రీవిష్ణువు.

**చక్రపక్షము**— చక్రాకారములైన పక్షము (ఱెక్కలు) గలది = హంస.

**చక్రపాణి**— సుదర్శన చక్రము హస్తమునఁగలవాఁడు = శ్రీవిష్ణువు

**చక్రవాకము**— గుండ్రని దగుచేఁ జక్రశబ్దముతోఁ బిలువఁబడుచున్నది = జక్కవ పిట్ట.

**చక్రహస్తుఁడు**— చక్రి. చూ. చక్రపాణి.

**చక్రాంగము**— చక్రాకారములైన యంగములు గలది = చక్రవాకము.

**చక్షుశ్శ్రవము**— (కనువినికి) కండ్లతో వినునది = పాము.

**చతురంగము**— నాల్గు విధము అయిన (ఏనుఁగులు, గుఱ్ఱములు, శకటములు,

వాఁడు, 2. గోవులను పాలించువాఁడు = 1. గొల్ల, 2. కృష్ణుఁడు.

గోమాయువు—గోవులను మోసపుచ్చునది = నక్క.

గోముఖము— గోవుయొక్క ముఖము వంటి ముఖముకలది = మొసలి, దొంగత్రవ్విన కన్నము.

గోమేధికము— పసుపువన్నెగల రత్నవిశేషము.

గోరో(చ)నము— ఆవులకడుపులలోనుండి తీసెడి ఒకానొక వస్తువు.

గోలాంగూలము— ఆవులోఁకయొక్క యాకారముగల తోఁకగలది = కొండముచ్చు

గోవిందుఁడు—భూమినిగాని, గోవునుగాని, స్వర్గమునుగాని, వేదమునుగాని పొందెడివాఁడు=శ్రీవిష్ణువు.

గోశృంగోదకస్నానము— గోవుకొమ్మునందు నీరుపోసి గాయత్రిచే నూఱుమార్లభిమంత్రించి ఆ యుదకముతో స్నానముచేయుట.

గోష్పదము— గోవుయొక్క అడుగుకొలఁదిగల చోటు.

గోళకుఁడు— విధవకు ఱంకు మగనివలనఁ బుట్టినవాఁడు.

గౌరి—1. గౌరవర్ణముగలది = పార్వతి, 2. పదిసంవత్సరముల యీడుగల కన్య.

గ్రహణము—రాహువు పూర్వవైరానుబంధమున సూర్యచంద్రులను గబళించుటకయి గ్రహించుట.

గ్రామ(మృ)గము (సిం)హము— గ్రామమున సింహమువలెఁ దిరుగునది= కుక్క.

గ్రామ్యము— లక్షణవిరుద్ధమగు భాష. (వ్యాకరణసూత్రములచే సాధింపఁబడని గ్రంథప్రయోగానర్హమగు భాష.

గ్రాహము—ప్రాణులను గ్రహించి విడువనిది = మొసలి.

గ్రుడ్డుకానుపు— గ్రుడ్లను బెట్టునది = పాము, పక్షి మొ.

గ్రైవేయకము—గ్రీవమునకుఁ (మెడకు బెట్టుకొనెడి హారాదికము.

ఘంటాపథము— పదిబారలు వెడల్పుగలిగి కొలపరిమితిచెప్పు రాజమార్గము.

ఘటచక్రము— కుమ్మరి కుండలు చేయు సారె.

ఘనరసము— మేఘములయొక్క రసము = ఉదకము.

ఘనసారము— శీతల మగుటచే ఘనము వంటి సారముగలది = కప్పురము.

ఘనాఘనుఁడు—మేఘములకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

ఘూకము— ఘూయని కూయునది = గూబ.

ఘోటకము—భూమియందు పొరలునది = గుఱ్ఱము.

గుహాశయము—గుహాయందు నిద్రించునది = సింహము.

గుహుఁడు— తన సైన్యమును రక్షించుకొనువాఁడు = కుమారస్వామి.

గుహ్యకేశ్వరుఁడు—గుహ్యకులను దేవయోని విశేషులకుఁ బ్రభువు = కుబేరుఁడు.

గూఢజుఁడు—తల్లిదండ్రులు తెలియనట్టి రహస్యపుపుట్టుక కలవాఁడు.

గూఢపా(త్తు)దము—రహస్యమైన పాదములుగలది = పాము.

గూఢపురుషుఁడు— రహస్యముగా వార్తలను దెలిసికొనువాఁడు (గూఢచారుఁడు) = వేఁగులవాఁడు.

గూఢమైథునము— రహస్యముగా నుండెడు మిథునకర్మ (సంగమము) కలది = కాకి.

గృహకచ్ఛపము— గృహమునందుఁ దాఁబేలువలె నుండునది = 1. తిరుగలి, 2. సన్నెకల్లు.

గృహగోధిక—గృహమున నుడుమువలె నుండునది = బల్లి.

గృహబలి (భుక్కు) ప్రియము— ఇండ్లయందలి బలులను తినునది = కాకి, కొంగ, పిచ్చుక మొ.

గృహమణి— గృహమున మణివలెఁ బ్రకాశించునది = దీపము.

గృహమృగము—ఇంటియందుఁ దిరుగు జంతువు = పిల్లి మొ.

గైరికము— గిరియందుఁ బుట్టినది = జేగురు, బంగారు.

గైరేయము— చూ. గిరిజము.

గొప్పబొజ్జమెకము— పెద్ద కడుపుగల జంతువు = ఏనుఁగు.

గొప్పమెయిప్రోడ— స్థూలశరీరముగల దిట్టరి = వినాయకుఁడు.

గొప్పయడ్గుమెకము—పెద్దపాదములుగల మృగము = ఏనుఁగు.

గోచారము— సూర్యాది గ్రహముల యొక్క మేషాదిరాసుల యందలి సంచారము.

గోణముదారి—గోఁచిని ధరించినవాఁడు = సన్న్యాసి, బ్రహ్మచారి.

గోత్రభి(త్తు)దుఁడు—పర్వతముల రెక్కలను భేదించినవాఁడు = ఇంద్రుఁడు.

గోత్రము— భూమిని రక్షించునది = పర్వతము.

గోత్రుఁడు— గోవులను పాలించువాఁడు = గొల్ల.

గోదారణము—భూమిని దున్నునది = నాఁగలి.

గోదావరి—(తనచేఁ జంపఁబడెనని యపవాదము వచ్చిన) గోవును బ్రతికించుటకు గౌతమమునిచే శివజటాజూటము నుండి కొనిరాఁబడిన నది.

గోప(పాలు)ఁడు— 1. క్షత్రియునకు వివాహిత శూద్రకన్యయందుఁ బుట్టిన

రుద్రులజననమునకుఁగారణమైనవాఁడు, 4. బ్రహ్మ, విష్ణు, రుద్రులు తన స్వరూపముగాఁగల వాఁడు.

కేశాకేశి—జుట్టు జుట్టు పట్టుకొని పెనగులాఁడుచుఁ జేయు ద్వంద్వ యుద్ధము.

కేశుఁడు—ఉదకమునకుఁ బ్రభువు = వరుణుఁడు.

కేసరి—జూలు కలది = సింహము, గుఱ్ఱము.

కైటభ(భారి)భజిత్తు—కైటభుఁడను రాక్షసుని జయించినవాఁడు=విష్ణువు, శ్రీమహావిష్ణువు నీరమున శయనించి యుండ వతని చెవులనుండి మధు కైటభు లుదయించి గర్వితులై బ్రహ్మాదుల నెదుర్కొనిరి. బ్రహ్మప్రార్థనమున యోగనిద్రనుండి మేల్కొన్న విష్ణువు యుద్ధముచేసి "రాక్షసులారా! మీరు నాతో యుద్ధముచేయఁజాలరు. శరణువేఁడుఁ"డనెను. రక్కసులు గర్వమున "నీవును బోరలేవు. శరణు వేఁడిన వరమిచ్చెద" మనిరి. విష్ణువు "మీరు నా చేతిలోఁ జచ్చునట్లు వరమిం" డనెను. వారు చేయునది లేక నీరు లేనిచోటఁ జంపునట్లు కోరిరి. విష్ణువు జలమయమగు జగత్తునఁ దన యూరువులు పెంచి వానిపై రక్కసులఁ దునుమాడెను. వారి మేదస్సు తెగి పడుటచే భూమికి మేదిని యని పేరు కల్గెను.

కైలాసవాసి—కైలాస (వెండికొండ) మున నివసించువాఁడు = శివుఁడు.

కైవర్తుఁడు—జలమునందలి మత్స్యాదులను హింసించువాఁడు = జాలరి.

కైవల్యము—
విడిచిన య
యుండుట =

కొండ(రా)చూలి-
హిమవంతుని కుమ

కొండ్రతిమ్మరి—పర్వతములయందు సంచరించునది = కోఁతి.

కొండపగతుఁడు—దేశములపై బ్రాలి బాధకలుగఁజేసెడి పర్వతముల ఱెక్కలను వజ్రాయుధమున భేదించుటచే శత్రువైనవాఁడు = దేవేంద్రుఁడు (గట్టుదాయ).

కొండయల్లుఁడు—హిమవంతునికూఁతురగు పార్వతికి మగఁడు = శివుఁడు.

కొండ(రాయఁడు)ఱేఁడు—పర్వతములకుఁ బ్రభువు=హిమవంతుఁడు.

కొండవీటిజంగము—కైలాసపర్వతము పట్టణముగాఁగల భిక్షుకుఁడు = శివుఁడు.

కొక్కరవు(రా)తు—కొక్కు లేఁజి రౌతు, పందికొక్కుపై స్వారిచేయు వాఁడు = వినాయకుఁడు.

కొమ్మ(కొంకి)మెకము—(కొమ్మ త్రిమ్మరి) చెట్టుకొమ్మ నివాసముగఁ గల మృగము = కోఁతి.

కోకనదము—చక్రవాకములచేఁ గూయించునది=చెంగలువ, చెందమ్మి.

కోకవైరి—చక్రవాకముల శత్రువు = చంద్రుఁడు.

తెలుంగు

సే॰ు తెలుంగు

కృతస... —చేయఁబడిన సాప త్న్యము (సవతితనము) కలది = పెద్ద భార్య

కృతాంతుఁడు—చేయఁబడిన వినాశము కలవాఁడు = యముఁడు.

కృతార్థుఁడు—నెఱవేఱిన పనిగలవాఁడు

కృత్తివాసుఁడు—చూ. ఏనుఁగుతోలు దాలుపు.

కృపాచార్యుఁడు— కృపతోఁ గూడిన చిత్తముగల శంతనునిచేఁ బెంపఁబడినవాఁడు. (శరద్వంతుఁడు తపము చేయుచు ఇంద్రప్రేరితయగు సుందరిని చూచి కామపరవశుఁడై వీర్యస్ఖలనమును బొందెను. ఆ వీర్యము శరస్తంభమున ద్వివిధమై పడుటచే నందుండి కృపాచార్యుఁడును, కృపియును నుదయించిరని భారతకథ.

కృపి—కృపతోఁ గూడిన చిత్తముగల శంతనునిచేఁ బెంపఁబడినది.

కృపీటయోని—1. ఉదకము జననకారణముగాఁగలవాఁడు, 2. ఉదకమున నుత్పత్తి స్థానమైనవాఁడు = అగ్ని దేవుఁడు.

కృశానువు—తన్నంటినదానిని కృశింపఁజేయువాఁడు = అగ్ని.

కృశానురేతసుఁడు— అగ్నిరూపమైన వీర్యముగలవాఁడు, అగ్నియందుంచఁబడిన రేతస్సుగలవాఁడు = శివుఁడు.

కృషీవలుఁడు— భూమిని దున్ని బ్రతుకువాఁడు =వ్యవసాయదారుఁడు.

కృష్ణద్వైపాయనుఁడు—కృష్ణద్వీపమున నివసించువాఁడు = వ్యాసుఁడు.

కృష్ణవర్త్మ—చూ. కప్పు చెరవుజాడ.

కృష్ణసారము —నల్లని రంగుచే శ్రేష్ఠమైనది = లేడి.

కృష్ణాజినము—నల్లని యిఱ్ఱితోలు = దుప్పిచర్మము.

కృష్ణుఁడు—1. కృష్ణ (నలుపు) వర్ణము కలవాఁడు, 2. దైత్యులను మర్దించువాఁడు, 3. భక్తుల హృదయముల నాకర్షించువాఁడు = విష్ణుని యవతార విశేషము.

కెంపు(కంటి)కన్నులపులుఁగు— కెంపువలెఁ బ్రకాశించెడు కన్నులు గలది = కోయిల.

కెంపుగా(తు)ము—కెంపువలెఁ బ్రకాశించెడు గ్రహము = అంగారకుఁడు.

కెంజిగురువిల్తుఁడు— ఎఱ్ఱని చిగుళ్లు విల్లుగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

కేకరుఁడు—శిరస్సుమీపమున నేత్ర సంచారము చేయువాఁడు = మెల్ల కంటివాఁడు.

కేశవుఁడు—1. మంచి వెంట్రుకలు కలవాఁడు, 2. కేశి యను రాక్షసుని సంహరించినవాఁడు, 3. బ్రహ్మ

యుద్ధముచేసిన ప్రదేశము, పూర్వము కురుఁడనురాజుచే దున్నింపబడిన క్షేత్రము.

కులట— కట (సమూహము) కులము ననుసరించి పోవునది = జారిణి.

కులపాలిక—తల్లిదండ్రులచే నీయఁబడి పెండ్లిచేయఁబడిన స్త్రీ, వ్యభిచారము చేయక కులమును,మానమును గాపాడు స్త్రీ పతివ్రత.

కులమిత్రుఁడు—వైశ్యునకు శూద్రస్త్రీయందు జన్మించినవాఁడు.

కులాలుఁడు—మంటికొఱకు భూమిని ద్రవ్వువాఁడు = కుమ్మరి.

కులిశము— భూమిని స్వల్పముగాఁ జేయునది, పర్వతముల ఱెక్కలను ఛేదించి స్వల్పముగాఁ జేసినది=వజ్రాయుధము.

కువలయమిత్రుఁడు— కలువలకు స్నేహితుఁడు = చంద్రుఁడు, భూమండలమునకు స్నేహితుఁడు = రాజు.

కువలయేశుఁడు—కలువలకు రాజు = చంద్రుఁడు, భూమికిఁ బ్రభువు=రాజు.

కువలేశయుఁడు— ప్రళయకాలమున నీటఁ బరుండువాఁడు = విష్ణువు.

కుశుఁడు—వాల్మీకియొక్క మంత్రింపఁబడిన కుశోదకముచే మార్జనము చేయఁబడినవాఁడు = శ్రీరాముని కొడుకు.

కుశేశయము—నీటియందుండునది = తామర, సారసపక్షి.

కుసుంభరాగము-వెలుపలకు గొప్పగా గనఁబడి మనస్సున నేమియులేని యనురాగము.

కుసుమబాణు(శరు)ఁడు } చూ.
కుసుమాస్త్రు(యుధు)ఁడు } క్రింద

కుసుమేషు(ఁడు)వు— పుష్పములు బాణములుగాఁగలవాఁడు=మన్మథుఁడు

కుహనాసన్న్యాసి— అన్నాదులకై సన్న్యాసివేషాడంబరము కలవాఁడు.

కుహువు— చంద్రకళ కనబడనిది = అమావాస్య.

కుహూకంఠము
కుహూముఖము } కుహూ అను ధ్వని కంఠమునఁగలది = కోకిల.

కూఁతకైదువు—ధ్వనిచేయు ఆయుధము = శంఖము.

కూటస్థము— ఎల్లకాలము నొక్క రూపైయుండునది = ఆకాశాదికము.

కూర్మము—కుత్సితమగు (ఊర్ములు) గమనవేగముగలది = తాఁబేలు.

కృకలాసము—కంఠముతో ఆడునది= తొండ, ఊసరవెల్లి.

కృకవాకువు—తలయెత్తికూయునది = కోడి, నెమలి, తొండ.

కృచ్ఛ్రాతికృచ్ఛ్రము— పాపపరిహారార్థము 21 దినములు పాలు ద్రాగియుండుట.

కృతఘ్నుఁడు—చేసినమేలు మఱచువాఁడు.

కుక్షింభరి — తన కడుపును మాత్రమే నింపుకొనువాఁడు = లోభి.

కుచము — కాముకుని గోటిచేఁ గిల్లఁబడునది = చన్ను.

కుచేలుఁడు — చినిఁగిన లేక మాసిన వస్త్రము కలవాఁడు = కృష్ణసఖుఁడు, పేదవాఁడు.

కుజుఁడు — వరాహరూపమున నున్న విష్ణువువలన భూదేవికిఁ బుట్టిన కుమారుఁడు = నరకాసురుఁడు, శ్రీ మహావిష్ణువువలన భూదేవికిఁబుట్టినవాఁడు= అంగారకుఁడు.

కుటీచకుఁడు — గుడిసెలో నుండుట చేతనే తృప్తినొందు సన్న్యాసి.

కుటుంబిని — పోషింపఁదగిన పుత్త్ర భృత్యాగలుగలది = గృహయజమానురాలు.

కుట్టిని — 1. విటుని కుటుంబమును వ్యవహారణముచేఁ జెరచునది, 2. లంజెను విటునకుఁ దార్చునది = కుంటెనకత్తె.

కుట్టమితము — దంతపీడనాదులచేఁ గోపభావ మభినయించినను హృదయమున నత్యానందమును బొందెడి స్త్రీల శృంగారచేష్టావిశేషము.

కుడ్యము — పడునపుడు మ్రోయునది = గోడ.

కుతపము — ఎండచే భూమిని దపింపఁజేసెడి రెండు ఘడియల మధ్యాహ్నకాలము, దినము (పగలు) యొక్క 15 భాగములలో నెనిమిదవ భాగము.

కుతపుఁడు — భూమిని దపింపఁజేయువాఁడు = సూర్యుఁడు, అగ్ని.

కుదరము — 1. ముఖముచే భూమిని జీల్చునది = పంది, అడవిపంది, 2. భూమిని తన డెక్కలచేఁ జీల్చునది = గఱ్ఱము.

కుబేరుఁడు — కుత్సితమైన బేరము (శరీరము, 3 కాళ్ళు, 8 పళ్ళు, మెల్లకన్ను కలవాఁడు) కలవాఁడు = ఉత్తరదిక్పతి.

కుమారి — యవ్వన మంకురింపక పోవుటచే మన్మథుని నిరాకరించునది = కన్య.

కుమారుఁడు — ఎల్లప్పుడును బాలుఁడుగా నుండువాఁడు, కుత్సితులను సంహరించువాఁడు, భూమియందు మన్మథునివలె సుందరుఁడైనవాఁడు = కుమారస్వామి.

కుముఖము — కుత్సితమయిన ముఖము కలది = పంది.

కుముదము — భూమిని సంతోషిం (చు నది) పఁజేయునది = తెల్లకలువ.

కుముదబాంధవుఁడు — కలువలకు జుట్టమైనవాఁడు = చంద్రుఁడు.

కుముద్వతి — కుముదములు (కలువలు) కలది = సరస్సు, కలువకొాడ.

కురంగనాభము — కురంగముయొక్క నాభినుండి పుట్టినది = కస్తూరి.

కురుక్షేత్రము — కురుపాండవులు

కీచకము—గాలితాఁకున మ్రోగునది = వెదురు

కీరము—కీ యను శబ్దమును గ్రహించునది

కీర్తిశేషుఁడు—కీర్తిమాత్రము మిగిలినవాఁడు = చచ్చినవాఁడు

కీశము— వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు ప్రభువుగాఁ గలది = కోఁతి

కుంజరారి—తపోబల గర్వమున నమరులను బాధింప జొచ్చిన గజాసురుని సంహరించినవాఁడు = శివుడు

కుంజరాశనము— ఏనుగుల కాహారమైనది = రావిచెట్టు. ఏనుగు లాహారముగాఁ గలది = సింహము

కుంటిగాము—కుంటిగ్రహము = శని

కుండకీటుఁడు—1 చెడిపోయిన బ్రాహ్మణస్త్రీ కుమారుడు. 2 దాసిని గామించినవాడు

కుండకుఁడు—భర్తజీవించి యుండగా ఱ కుమగనివల్లఁ బుట్టినవాఁడు

కుండగోళకి— కుండలను గోఁకి కడుగువాఁడు = వంటవాడు.

కుండగోలదాలుపు—కమండలమును దండమును ధరించువాఁడు=సన్న్యాసి

కుండమార్పు—ఒక వస్తువు నిచ్చి వరునియొక్క వస్తువును గ్రహించుట. తమ కూఁతు నెవరి కుమారునకిచ్చిరో వారి కూఁతును తమ కుమారునికి వివాహము చేసికొనుట

కుండలి—కుండలాకారశరీరము కలది = సర్పము

కుందారము— భూమిని ద్రవ్వునది = పంది అడవిపంది

కుంభకర్ణుఁడు—ఏనుఁగుయొక్క కుంభస్థలప్రమాణము లగు చెవులుగలవాఁడు = రావణుని తమ్ముఁడు

కుంభకారుఁడు— కడవలను జేయువాఁడు = కుమ్మరి

కుంభ(యోని)సంభవుఁడు—

(కుటజుఁడు)—కుంభమునఁ బుట్టినవాడు = 1 అగస్త్యుఁడు 2 వసిష్ఠుఁడు 3 ద్రోణుడు (సూర్యవరుణులకు మార్గమున నూర్వశిని జూచుటచే వీర్యస్ఖలనమయ్యెను వారి శుక్లమును గ్రహించి యూర్వశి యొక కడవయం దుంచఁగా నందుండి యగస్త్య వసిష్ఠులు జనించిరని పురాణప్రసిద్ధి) (భారద్వాజమునికి ఘృతాచియను నప్సరసను జూచుటచే జిత్తము చలించి వీర్యస్ఖలనమయ్యెను దానినామె భాండమం దుంపఁగా నందుండి ద్రోణుఁ డుదయించెనని భారతము)

కుంభాభిషేకము— క్రొత్తగా గుడి కట్టించి ప్రతిష్ఠచేసిన విగ్రహమునకు గుంభమునందు దకము నించి మంత్రపూరితమైన యాజలముచేఁ జేయించెడు స్నానము

కుక్కుటము—కు కు అను శబ్దమును వక్రముగాఁ బలుకునది = కోడి

కుక్కురము—ఎముకలు మొదలగు వానిని దెచ్చుకొనునది = కుక్క

కావ్యము— కవియొక్క కర్మము = గ్రంథము, పద్యము మొ.

కావ్యుఁడు—కవియొక్క పుత్త్రుఁడు = శుక్రుఁడు.

కాశ్మీర(జ)జన్మము–కాశ్మీరదేశమునఁ బుట్టునది = కుంకుమపువ్వు.

కాశ్యపి—క్షత్త్రియకుమారణ జనిత పాప పరిహారార్థము యాగ సమయమునఁ బరశురామునిచేఁ గశ్యపునకు దానము చేయఁబడినది = భూమి

కాశ్యపుఁడు—కశ్యపబ్రహ్మ కుమారుఁడు = కణ్వమహర్షి.

కాసారము—జలము దీనియందుఁ బ్రవేశించును గావున బ్రోయునది = సరస్సు.

కాళరాత్రి— ప్రళయకాలమునందలి భయంకరమైన రాత్రి.

కాళింది— కళిందపర్వతమునఁబుట్టినది= యమునానది.

కాళిందీభేదనుఁడు— నాఁగలిచే యమునానదిని భేదించినవాఁడు = బలరాముఁడు.

కాళి—చండముండులపై దర్పించుటచేఁ బార్వతిముఖము నల్లనై, యందుండి ఖడ్గహస్తయై వ్యాఘ్ర చర్మాంబర ధారిణియైపుట్టిన దేవి.

కింకరుఁడు— స్వామికి సంబంధించిన యేపనినైనఁ జేయువాఁడు = బంటు.

కింక్షణుఁడు— ఒక క్షణము పోయిన నేమని తలఁచువాఁడు = సోమరి.

కింప(చాను)చుఁడు– కొంచెము వండుకొనెడివాఁడు = లోభి.

కింపురుషుఁడు— 1. అశ్వముఖమును నరశరీరమును గల దేవయోని విశేషము, 2. కుత్సిత పురుషుఁడు.

కింవదంతి—జనులాడుకొను సత్యాసత్య రూపమగు మాట.

కింశుకము—చిలుకముక్కువంటి పువ్వులు గలది = మోదుగ.

కిటి— ఇష్టమువచ్చినట్లు చరించునది = పంది.

కిన్నరుఁడు— అశ్వముఖము గలుగుటచే నేవగింపఁదగినవాఁడు, కొంచెము నరాకారము గలవాఁడు = ఒక దేవత.

కిన్నరేశుఁడు—కిన్నరులకుఁ బ్రభువు = కుబేరుఁడు.

కిరణమాలి— కిరణములు మాలలుగాఁ గలవాఁడు=సూర్యుఁడు

కిరాతుఁడు—మ్లేచ్ఛజాతులలో నెమలి పింఛము మొదలయినవి ధరించువాఁడు = చండాలుఁడు.

కిరీటి— కిరీటము గల (ది) వాఁడు = 1. అర్జునుఁడు, 2. కోడి.

కిలికించితము–రోషాశ్రుహర్షభీత్యాగుల సాంకర్యముగల స్త్రీల శృంగారచేష్టా విశేషము.

కిశోరుఁడు—ఎల్లప్పుడును యౌవనావస్థ కలిగి యుండువాఁడు = సూర్యుఁడు.

కారణశరీరము—పూర్వ జన్మార్జిత పుణ్యపాపకర్మసంచయము.

కార్తవీర్యుఁడు—కృతవీర్యుని కుమారుఁడు = వేయిబాహువులుగల యొక హైహయదేశపు రాజు.

కార్తస్వరము—కృతస్వరమను గనియందుఁ బుట్టునది = బంగారము.

కార్తికము—కృత్తికానక్షత్రయుక్త పూర్ణిమగల మాసము.

కార్తికేయుఁడు—షట్కృత్తికల కుమారుఁడు=కుమారస్వామి. (ముని పత్నులను జూచి కామ పీడితుఁడై అగ్ని యడవికిఁ బోఁగా నతనిభార్య స్వాహాదేవి గ్రహించి అరుంధతి తప్ప తక్కినమునిపత్నుల రూపములతో వచ్చి రమించి, యా వీర్యము నొక్కచో నుంచెను. అందుండి కుమారస్వామి పుట్టఁగా, షట్కృత్తికలు నా కుమారుఁడు నా కుమారుఁ డని పాలివ్వ వచ్చిరి. కుమారస్వామి ఆఱు ముఖములు ధరించి, యార్గురి యొద్దను పాలు ద్రాగుటచే నతనికిఁ గార్తికేయుఁడని పేరు వచ్చెను.)

కార్పటికుఁడు—చింపి కావిగుడ్డలు కట్టుకొనువాఁడు = కోమటి.

కార్ముకము—కర్మకారునిచేఁ జేయఁబడినది, యుద్ధకర్మకొఱకు సమర్థమైనది = ధనుస్సు.

కాఱుకొమ్ములమెకము—దట్టమైన కొమ్ములుగల మెకము = దుప్పి.

కాలకంఠము—చూ. నీలకంఠము.

కాలకంఠుడు—చూ. కఱంకరుఁడు.

కాలకము—తన స్థలమును నల్లగాఁ జేయునది = పుట్టుమచ్చ.

కాలకాలుఁడు— అంతకాంతకుఁడు.

కాలకూటము— 1. నీలవర్ణమునకు స్థానమైనది, 2. కాలుని (యముని) సయితము పీడించునది = విషము.

కాలకేయులు—కలకయందు మారీచునకుఁ గలిగిన 1400 దానవసంతతి

కాల(జ్ఞాని)జ్ఞము— కాలమును గుర్తించునది = కోడి.

కాలజ్ఞుఁడు—కాలమును దెలిసినవాఁడు = జ్యోతిష్కుఁడు.

కాలసూత్రము— గోహత్య చేసి ప్రాయశ్చిత్త మొనరింపనివాఁ డనుభవించెడు ఇనుప తంతులుగల నరకము.

కాలాంతకుఁడు—యముని సంహరించినవాఁడు = శివుఁడు.

కాలిపుట్టువు— పరబ్రహ్మపాదమునఁ బుట్టినవాఁడు = శూద్రుఁడు.

కాలుఁడు — ధర్మాధర్మములనుగాని, యాయుర్దాయమునుగాని లెక్కపెట్టువాఁడు = యముఁడు.

కావి(గోచిదారి) తాలుపు— కాషాయవర్ణముగల గోచిని ధరించువాఁడు = సన్న్యాసి.

కావేరి—కవేరుఁడను రాజర్షి కూతురు = అగస్త్యుని భార్య, ఒక నది, ఈమెలో నొకయంశములోపాము

కాఁక వెలుఁగు—వెచ్చని కాంతిగల వాఁడు = సూర్యుఁడు.

కాఁక(పుచ్ఛము)పక్షము—నలు పు చేతను, కదలికచేతను గాకి తెక్కల వలె నుండునది.

కాకపుష్టము—కాకులచేఁ బెంచఁ బడునది = కోయిల.

కాకము—కా యని యఱచునది=కాకి.

కాకోదరము —1. కుటిలగమనముగల యుదరము(పొట్ట)గలది, 2 కాకిపొట్ట వంటి పొట్టగలది = సర్పము.

కాకోలము—1. కొలఁదిగాఁ గలిసి యంతటను వ్యాపించినది, 2. కాకివలె నల్లని యాకారముగలది = విషము, కాకులలో స్థూలమైనది = మాలకాకి.

కాట్రేఁ(టిఁడే)ఁడు— శ్మశానమునకుఁ బ్రభువు = శివుఁడు.

కాత్యాయని— సగము ముదిసిన కావి చీరఁ గట్టిన విధవ, మోక్షమార్గము లెన్ని గలవని విచారించు కత్యాయుని గోత్రమునఁ బుట్టినది = పార్వతి.

కాదంబిని- ఇది కలిగినపుడు కదంబవృక్ష ములు పుష్పించును = మేఘమాల.

కాద్రవేయులు—కశ్యపునకుఁ గద్రువ యందుఁ బుట్టిన నాగులు.

కానరానడుగులమేటి—(కానరాని కాళ్ళయది) కనపడని యడుగులు గల వానిలో గొప్పది = సర్పము.

కానీనుఁడు—కన్యకుఁబుట్టినవాఁడు = 1. కర్ణుఁడు, 2. వ్యాసుఁడు మొ.

కాపిశాయనము—కపిశ పుష్పము నుండి తీసినది = కల్లు.

కామజిత్తు—ఇంద్రియ నిగ్రహమున (రూపమున) మన్మథుని జయించిన వాఁడు = శివుఁడు, కుమారస్వామి.

కామతాలము—కామ వికారమును బుట్టించునది = కోయిల.

కామదేవుఁడు—కామమును బుట్టిం చెడు దేవుఁడు = మన్మథుఁడు.

కామ (ధుక్కు) ధేనువు— కోరిన వస్తువుల నిచ్చెడి వేల్పుటావు.

కామపాలుఁడు—1. భక్తుల కోర్కు లను దీర్చువాఁడు, 2. కుమారుఁడగు మన్మథుని బాలించువాఁడు = బలరా ముఁడు.

కామరూపి—తన యిచ్చవచ్చిన రూప మును బొందినవాఁడు = రాక్షసుఁడు.

కామాంకుశము— మన్మథుని కంకుశ మైనది = గోరు.

కామారి—(పార్వతిపైఁ బ్రేమగలు టకుఁ దనపై బాణసంధానము చేసిన) మన్మథుని రూపుమాపినవాఁడు = శివుఁడు.

కాముఁడు—స్త్రీని గోరునట్లు చేయు వాఁడు = మన్మథుఁడు.

కాయజుఁడు—శరీరమునఁ బుట్టువాఁడు = మన్మథుఁడు.

తరికుండగా నుపయోగింపఁబడినది = పాలసముద్రము.

కలహాకంఠి— కలహమునందుఁ గన్ను గలది.

కలహ(శీల)కంఠి—కలహము కంఠము (మాట) నందు గలది.

కలహాంతరిత— ముందు ప్రియునిపైఁ గోపముచే విడిచి వెనుక పరితపించు నాయిక.

కలహాశనుఁడు / కలహభోజనుఁడు } చూ. అరికేరపుం దపసి.

కలా(ళా)నిధి—షోడశ కళలకు స్థానమయినవాఁడు = చంద్రుఁడు.

కలా(ళా)శాల—కళల (శాస్త్రములు) ను బోధించు బడి.

కలువకంటి— కలువ రేకుల వంటి కన్నులుగల యాఁడుది.

కలువ(రాయ)ఱేఁడు— కలువలకు రాజు = చంద్రుఁడు.

కలువ(దాయ)సూడు— కలువలకు శత్రువు = సూర్యుఁడు.

కలువవిందు / కలువనెచ్చెలి } కలువలకుఁజుట్టము = చంద్రుఁడు.

కల్పవృక్షము— కోరికలఁ దీర్చెడు దేవవృక్షము, దేవమందారము.

కల్పతరువు—కోర్కెలనిచ్చెడు దేవతా వృక్షము.

కల్మాషకంఠుఁడు—కలకంఠుఁడు.

కల్లోలిని—అలలు గలది = నది.

కవపులుఁగుదాయ— చక్రవాక మిథునమునకు శత్రువైనవాఁడు = చంద్రుఁడు. (చక్రవాక మిథునము సాయంకాలము మొదలు తెల్లవారు వఱకును గన్నులు కనఁబడకపోవుటచే గొప్ప వియోగబాధ నొందును.)

కవ్యము—పితృదేవతల కీయఁ దగిన యన్నము.

కవ్యవాహనుఁడు— పితృదేవతలకై ఇవ్వఁబడిన యన్నమును గొనిపోవువాఁడు = అగ్ని.

కవ్వంపుమలతరిత్రాడు—క్షీరసాగర మథనమునకై దేవాసురులచే గ్రహింపఁబడిన మందరపర్వతమునకుఁ గవ్వపుఁ ద్రాఁడైనవాఁడు = వాసుకి.

కవ్వడి— రెండుచేతులయందును వడి కలవాఁడు = అర్జునుఁడు.

కవ్వపు(ఁగొండ)మల— క్షీరసాగర మథనమునఁ గవ్వముగా గ్రహించిన కొండ = మంథనగిరి.

కాంచని— బంగారు వర్ణముగలది = పసుపు.

కాంతారము— ఎవ్వరిచేతను దరింప శక్యముకానిది = అడవి.

కాందిశీకుఁడు— శత్రుభయముచే దిక్కులు తెలియక పాఱినవాఁడు.

కాంస్యకారుఁడు—లోహపు పని చేయువాఁడు = కంచరి.

కబ్బురము—లోహాదులయందు శ్రేష్ఠ మగుటచే దర్పించునది = బంగారము

కర్మంది—కర్మందుడను ఋషిప్రోక్త సూత్రముల నధ్యయనము చేయు సన్న్యాసి

కర్మసాక్షి—జీవులు చేసెడు పుణ్య పాప కర్మములకు సాక్షియై యుండు వాఁడు = సూర్యుడు

కర్షకుఁడు—భూమిని దున్నువాఁడు = వ్యవసాయదారుఁడు

కర్షణి—కామోద్దీపనములవలనఁ బురుషుని దూరమున కీడ్చుకొని పోవునది = జారిణి

కఱకంఠుఁడు—(హాలాహలము ద్రావుటచే) నల్లనైన కంఠము కలవాఁడు = శివుడు

కఱకంఠుతలమానికము — శివుని శిరస్సున మాణిక్యమువలె నుండు వాఁడు = చంద్రుడు

కఱకంఠుతలయేఱు— శివుని శిరమునఁ గల నది = గంగ

కఱిదేజేయన్న—నల్లని దేవుడగు విష్ణునియన్న = ఇంద్రుఁడు

కఱిమెడదొర— మా నీలకంఠుడు

కఱివే(లుపు)ల్పు— నల్లనిదేవుఁడు = కృష్ణుఁడు యముఁడు విష్ణువు

కఱివేల్పుడాకన్ను— విష్ణుని ఎడమ కన్నైనవాఁడు = చంద్రుఁడు

కఱినెచ్చెలి—అర్జునునకు ముఖ్యస్నేహితుఁడు = శ్రీకృష్ణుఁడు

కలకంఠము—చెవికింపయిన కంఠధ్వని కలది = కోయిల పావురము హంస.

కలకంఠి— అవ్యక్తమధురమైన ధ్వని కలది = 1 స్త్రీ 2 కోయిల

కలధౌతము— కలుషము పోఁగొట్టఁబడినది = వెండి బంగారు

కలనఁజావరులతెన్ను— యుద్ధమునఁ జనిపోయినవారి యూర్ధ్వలోక ప్రాప్తికి మార్గమైనవాఁడు = సూర్యుఁడు (వీరమరణము నొందినవారు సూర్య లోకమును భేదించుకొనిపోయి వీర స్వర్గము నొందుదురని ధర్మశాస్త్రము)

కలనితపసితల్లి—కలహాశనుఁడగు నారదుని తల్లి = సరస్వతి.

కలపతాలుపు— కృషికై నాగేలును ధరించువాఁడు = శూద్రుడు.

కలభము – ఉదకమును బొందునది = ఏనుఁగుగున్న

కలవరము— అవ్యక్తమధురమైన ధ్వని గలది = గువ్వ

కలశజన్ముఁడు— కలశమందుఁ బుట్టిన వాఁడు = అగస్త్యుఁడు

కలశము—ఉదకమును దీసికొనునది = పాత్ర

కల(శాబ్ధి)శోదధి } అమృతము
కలశపాథోరాశి } మథించు కాలమున

కమలాక్షుఁడు —తామరలవంటి కన్నులు గలవాఁడు = విష్ణువు.

కమలాప్తుఁడు— పద్మములకు బంధువైన వాఁడు = సూర్యుఁడు.

కమలా (సన) లయ—పద్మము స్థానముగాఁ గలది = లక్ష్మి.

కమలాసనుఁడు—పద్మము పీఠముగాఁ గలవాఁడు = బ్రహ్మ.

కమలేశయుఁడు— కమలమునందుఁ బండుకొన్నవాఁడు = బ్రహ్మ.

కమలాక్షుఁడు—(తమ్మికంటి) తామరల వంటి నేత్రములు కలవాఁడు = విష్ణువు.

కమలోద్భవుఁడు— శ్రీవిష్ణుని నాభి కమలమునఁ బుట్టినవాఁడు = బ్రహ్మ (తమ్మిచూలి).

కమ్మ (విలుకాఁడు) (లుకి) ల్తుఁడు—మధురమైనచెఱకువిల్లుగాఁగలవాఁడు= మన్మథుఁడు.

కయ్యపుఁదిండి— కలహము ఆహారముగాఁ గలవాఁడు = నారదుఁడు.

కమ్మవిల్తునిమామ— మన్మథునకు మేనమామయైనవాఁడు= చంద్రుఁడు. (తల్లియగు లక్ష్మీదేవికిఁ దోడఁబుట్టినవాఁడు)

కరటి— పెద్ద గండస్థలములుగలది = ఏనుఁగు.

కరటుఁడు—పరలోకము లేదనువాఁడు = నాస్తికుఁడు.

కరణుఁడు—శూద్రస్త్రీకిని,వైశ్యునకును బుట్టినవాఁడు.

కరతోయ— పార్వతి పెండ్లి సమయమున జలధార పోయునపుడు శివుని కరమునుండి పుట్టిన నది.

కరభోరు—కరభము (మణికట్టుమొదలు చిటికెనవ్రేలు కొనవఱకుఁగల చేతి వెలుపలిభాగము) వంటి తొడలుగల యాఁడుది.

కరరుహము (కరజము)— చేతియందు మొలచునది = గోరు.

కరవాలము— చేతియందు వాలము (తోఁక) వలె నుండునది=కత్తి, బాకు.

కరి—కరము (తొండము)గలది=ఏనుఁగు.

కరువలిపట్టి—వాయుదేవునకు అంజనాదేవియందుఁ బుట్టిన కుమారుఁడు = హనుమంతుఁడు, కుంతియందుఁ బుట్టినవాఁడు=భీముఁడు. (కరువలి = గాలి, పట్టి = చూలి.)

కరువలి (చుట్టము) విందు— వాయువునకు బంధువు = అగ్ని.

కరువలిమేఁతరి — గాలిని భక్షించునది = పాము.

కర్ణుఁడు—సూర్యవంశమునఁ (కన్యాత్వభంగ భయమున) గుంతికిఁ గర్ణమునఁ బుట్టినవాఁడు.

కర్తరి—భరణి మూఁడు నాలుగు పాదములందును, కృత్తిక నాలుగు పాదములందును, రోహిణి మొదటి పాదమందును, సూర్యుఁడుండు కాలము.

ఆది తనచేతి కంటుకొనఁగా భైరవుండు విష్ణుప్రేరణమున వత్సరకాలము తన భ్రూమధ్యరక్తముచే ఆ కపాలమును తడిపి కాశిలో పాతిన ప్రదేశము.

కపాలసంధి—స. ఉభయులకును సమానబాధ్యతగలసంధి, పుఱ్ఱెయొక్కగాని కుండయొక్కగాని రెండుసమాన భాగములు, అన్నివిధముల సరిపోవునట్లు సంధిషరతులు రెండు పక్షముల కును సమానముగానున్న సంధి.

కపాలి— కపాలము (పుఱ్ఱె) భిక్షాపాత్రముగాఁగలవాఁడు = శివుఁడు.

కపోతతీర్థము— లంబకుఁడు కపోతమిథునమువలన బోధితుఁడై గౌతమియందు స్నాతుఁడై ముక్తుఁడైనతీర్థము.

కపోలము— భక్షించు సమయమునఁ జలించునది = దౌడ.

కప్పుఁగుత్తుకపులుఁగు- కంఠమునందు నలుపుగలపక్షి = నెమలి.

కప్పుఁగుతుకవాఁడు— నల్లనికంఠము గలవాఁడు = శివుఁడు.

కప్పుటేటిగొంగ— (నల్లని నది) యమునానదికి శత్రువైనవాఁడు = బలరాముఁడు.

కప్పుపైదమవ (పెనిమిటి) మగఁడు- నల్లనిస్త్రీయొక్క మగఁడు = శివుఁడు.

కప్పుఁదెరవు (జాణ) దారి—నల్లని మార్గము (పొగ) జాడగాఁ గలవాఁడు = అగ్ని.

కప్పుఁ (దెరువరి) ద్రోవరి— చూ. కప్పుఁదెరువుదారి.

కప్పుమల— దే. నల్లని పర్వతము = కాటుకకొండ.

కప్పుముత్తైదువ— నల్లని రూపముగల సుమంగలి = సరస్వతి.

కప్పుమేనిగాము— నల్లని శరీరముగల గ్రహము = శని.

కమండ (లము) లువు— ఉదకమును మధ్యమున ధరించునది = సన్న్యాసులు ధరించెడి మృణ్మయపాత్ర.

కమఠము— జలమునందు వసించునది, యజ్ఞారముకోరఁబడునది = తాఁబేలు.

కమల—కమలము హస్తమునందుఁ గలది = లక్ష్మి.

కమలజన్ముఁడు—శ్రీవిష్ణుని నాభికమలమున జనించినవాఁడు = బ్రహ్మ.

కమలజుఁ (జాతు)డు } చూ. కమలజన్ముఁడు.
కమలభవుఁడు }

కమలనాభుఁడు— (తమ్మిపొక్కిలి) పద్మము నాభి (బొడ్డు) యందుఁ గలవాఁడు = శ్రీమహావిష్ణువు.

కమలము— 1. జలము నలంకరించునది 2. జలముచే ధరింపఁబడునది = తామరపువ్వు, 3. దప్పికగొన్న వారిచేఁ గోరఁబడునది = ఉదకము.

కమలాకరము—. పద్మములకు నిలయమైనది = సరస్సు, తామరకొలను.

కత్తళీఁడు— కవచమును దొడిగినవాఁడు

కథ— కొంచెము సత్యమును కొంత కల్పనమును గల చరిత్రము

కదంబకము— కోలాహల రూపమునఁ గుత్సితముగా మోయునది = గుంపు

కదర్యుఁడు— కుత్సితుఁడైన ధనికుఁడు = పిసినిగొట్టు

కనకాక్షి— బంగారువికారమైన నేత్రములుగల యాఁడుది

కనకా(ద్రి)చలము— బంగరుకొండ = మేరువు

కనిష్ఠుఁడు— వయస్సుచే మిక్కిలి తక్కువైనవాఁడు = తమ్ముఁడు

కనీయుఁడు— కొద్దివయసువాఁడు = తమ్ముఁడు అధముఁడు

కనుము— మకరసంక్రమణమునకును మనుష్యుఁడు మరణించిన దినమునకును పశుబలి గావించిన జాతరకును మఱునాటిదినము

కనువినికి— కన్నులతో వినునది = సర్పము

కన్నులమ్రాను— కణుపులుగల చెట్టు = చెఱకు

కన్నులవిలుకాఁడు } చూ ఇక్షుధన్వుఁడు
కన్నులవిల్తుఁడు }

కన్నెఱికము— కన్యాత్వము వేశ్యకన్యా ప్రథమసంభోగము.

కన్య— కోరఁబడునది = మొదటి వయస్సునందున్న పెండ్లికాని పడుచు

కపర్దము— సుఖముచే నిండించునది = శివుని జటాజూటము

కపర్ది— కపర్దమను జటాజూటము గలవాఁడు = శివుఁడు

కపాలభృత్తు— కపాలమును గేలధరించినవాఁడు = శివుఁడు (బ్రహ్మవిష్ణువులు తమ యాధిక్యమును గూర్చి తగవులాడుచుండ శివుఁడువచ్చి పోరవలదనెను విష్ణువూరకుండెను గాని బ్రహ్మ పంచమశిరము శివుని దూషించెను శివుఁడు కాలభైరవుని సృజించి పంచమ శిరమును ఖండింపుమనెను కాలభైరవుని జూచి భీతిల్లిన బ్రహ్మ తన పంచమశిరము శివునియొద్ద ఒడుసట్లెను దానితో భిక్షాటనము చేయవలసినదిగను శివుని గోరెను శివుఁడు గీకరించినట్లు స్కాందపురాణ కథితము)

కపాలమాలి— పుఱ్ఱెలు దండలుగాఁ గలవాఁడు = శివుఁడు

కపిధ్వజుఁడు— ఆంజనేయుఁడు టెక్కముగా గలవాఁడు = అర్జునుఁడు.

కపాలమోక్షము— సన్యాసుల శవశిరస్సును టెంకాయలతోఁ బగలగొట్టుట

కపాలమోచనము— బ్రహ్మయొక్క పంచమశిరము ఖండించిన పాతకమున

కంటక(భక్షకము)భుక్కు — ముండ్లు తినునది = లొట్టియ

కంటివాలు — కన్నువలె గుండ్రమైన విష్ణుని యాయుధము = సుదర్శన చక్రము

కంటివినికిరి — పా. చక్షుశ్శ్రవము

కంఠీరవము — కంఠమున ధ్వనికలది = సింహము ఏనుగు పావురము

కంఠేకాలుడు — క్షీరసాగర మథనమునఁబుట్టిన హాలాహలమును మ్రింగుటచేఁ గంఠమున నలుపుగలవాఁడు = శివుఁడు.

కందర్పవిరోధి — మన్మథునకు శత్రువైనవాఁడు = 1 శంబరాసురుఁడు 2 శంకరుఁడు

కందర్పుఁడు — 1 కుత్సితమైనదర్పము గలవాఁడు 2 సుఖవంతులయందు గర్వించువాఁడు 3 బ్రహ్మపై దర్పించినవాఁడు = మన్మథుఁడు

కంసా(రి)రాతి — కంసునకు శత్రువు = శ్రీకృష్ణుఁడు

కకుద్మంతము — గొప్పమూఁపురము గలది = ఎద్దు (కకుత్తు = మూఁపురము)

కక్షము — చెవటచేఁ బీడింపఁబడు నది = చంక చేమగల నేల

చ్ఛపము — 1 పుచ్ఛము (తోఁక)చేఁ పానము చేయునది 2 జలప్రాయ ప్రదేశమును క్షుద్రజంతు భక్షణముచే రక్షించునది = తాఁబేలు

కటకము — పర్వతముచుట్టు నావరించి యుండునది = కొండచరియ

కటాక్షము — నేత్రముల వెలుపలి భాగమున వ్యాపించునది = కడగంటి చూపు

కడలి — కడలు (అలలు) గలది = సముద్రము

కడలికూఁతురు — క్షీరసముద్రమునఁ బుట్టినది = లక్ష్మి

కడలిబత్తలికదునేదారి — సముద్రము అమ్ముల పొదిగాఁగల శూరుఁడు = శివుఁడు

కడలియల్లుఁడు — సముద్రుని (కుమార్తెయగులక్ష్మికి మగఁడౌటచే) యల్లుఁడైనవాఁడు = విష్ణువు

కడలిరాపట్టి — పాలసముద్రుని కుమారుఁడు (ర్తె) 1 చంద్రుఁడు 2 లక్ష్మి

కడలి(మీఁగడ)వెన్న — పాల సముద్రమునఁ బుట్టిన వెన్న = 1 అమృతము 2 చంద్రుఁడు

కడలివెలఁది
కడలివెలఁదుక } సముద్రునిభార్య = గంగ

కడిదలుఁగు — గొప్ప ఆయుధము = సుదర్శనచక్రము

కణాదుఁడు — ధాన్యకణముల నేరి తెచ్చుకొని భక్షించుచు జీవించిన యొక ముని

ఔధ(స్యము)సము— ఊధస్సు (పొదుగు) నుండి పుట్టినవి = పాలు

ఔపచారము—ఒకదానియం దుండు ధర్మమును మఱియొకదానియం దారోపించుటవలనఁ గలిగినది

ఔపవాహ్యము— స్వారిచేయుటకుఁ దగినది = గుఱ్ఱము బండి రాజెక్కెడి యేనుఁగు రథము మొ

ఔపవిభక్తికము—విభక్తి ప్రత్యయములకు వెనుక నాగమాదేశరూపముగాఁ జేర్పబడు ఇ టి తి వర్ణములు

ఔపస్థికుఁడు—స్త్రీ సంగమాదికముచే ధనమును సంపాదించువాఁడు

ఔపానహ్యము—చెప్పలు తయారు చేయుట కుపయోగించునది = తోలు

ఔపాసనము—బ్రాహ్మణుఁడు చేయు నగ్న్యుపాసనము

ఔరభ్రికము—ఉరభ్రము (గొఱ్ఱె)ల సమూహము

ఔరభ్రము— గొఱ్ఱెకు సంబంధించినది = కంబళి

ఔరసి—తనకు ధర్మపత్నియందుఁ బుట్టినది = కూఁతురు

ఔరసు(స్యు)ఁడు—తనకు ధర్మపత్నియందుఁ బుట్టిన కుమారుఁడు

ఔర్ధ్వదేహము— ఊర్ధ్వదేహమునకు (మృతినొందినవానికి) సంబంధించినది = కర్మము

ఔర్ధ్వదే(దై)హికము—మరణానంతరమునఁ బొందిన యూర్ధ్వదేహమునుగూర్చి చేయఁబడు ఉత్తరక్రియ

ఔర్వము—ఔర్వునకు సంబంధించినది (ఔర్వుని కోపమువలనఁబుట్టినది) = బడబాగ్ని ఉర్వికి సంబంధించినది = పాంశులవణము

ఔర్వశేయుఁడు— మిత్రావరుణుల వీర్యమున నూర్వశికిఁ బుట్టినవాఁడు = 1 అగస్త్యుఁడు 2 పురూరవపుత్త్రుఁ డగు ఆయువు 3. వశిష్ఠుడు

ఔశీనరుఁడు— ఉశీనరునికొడుకు = శిబిచక్రవర్తి

ఔషధము— ఓషధులవలనఁ గలుగునది = మందు

ఔషరము— ఊషరక్షేత్రము (చవుటి నేల) నకు సంబంధించినది = చౌటియుప్పు

కంకణము—మ్రోయునది మౌక్తికాదులతోఁ గూడిన హస్తభూషణము.

కంకాళము—చర్మమాంస రహితమైన యస్థిపంజరము

కంచుకము—సర్పశరీరమును బంధించునది = పాముకుబుసము.

కంజజుఁడు—విష్ణుని నాభికమలమునఁ బుట్టినవాఁడు = బ్రహ్మ

కం(జము)జాతము— నీటియందుఁ బుట్టునది = తామర డు. చూ పై

కంజుఁడు—టియందుఁ బుట్టి గా కు = చంద్రుఁడు బ్రహ్మ

ఐంద్రలుప్తికుఁడు—ఇంద్రలుప్తరోగము (పేనుకొఱుకుట) వలన బట్టతలయైనవాఁడు.

ఐంద్రవాయవము—ఇంద్ర వాయువులు దేవతలుగాఁగల హవిరాదికము.

ఐంద్రాగ్నము—ఇంద్రుఁడును, అగ్నియు దేవతలుగాఁగల హవిరాదికము.

ఐకమత్యము—పలువు రొకే యభిప్రాయము గలిగియుండుట.

ఐతరేయము—ఇతరుఁడను మునివలన వచ్చినది = 1. ఒకానొక యుపనిషత్తు, 2. ఒకానొక యారణ్యకము, 3. ఒకానొక బ్రాహ్మణము.

ఐదుకైదువులజంత—చూ. పంచబాణుఁడు.

ఐరావతము—క్షీరసాగర మథనకాలమున సముద్రమునందుఁ బుట్టినది = ఇంద్రుని ఏనుఁగు.

ఐలబిలుఁడు—ఇలబిల యను నామె కొడుకు = కుబేరుఁడు.

ఐలుఁడు—శ్రీమహావిష్ణుని యంశమున భూదేవికిఁ బుట్టినవాఁడు = అంగారకుఁడు.

ఐహికము—భూలోక వ్యాపారాది.

ఒంటికంటిగాము—ఒకే కన్ను గల గ్రహము = శుక్రాచార్యుఁడు, వామనునకు బలిచక్రవర్తి మూఁడడుగుల నేల ధారపోయునపుడు ఝారీకొమ్మున నడ్డుపడి వామనుని దర్భచేఁ బొడువఁబడిన కారణమున నొక కన్నుపోఁగా నొక కన్నుమాత్రమే మిగిలిన గ్రహము = రాక్షసుల గురువు.

ఒంటి (పల్లుదొర)కొమ్ము (దేవర) వేలుపు—చూ. ఏకదంతుఁడు.

ఒంటిమ్రాఁకుల పెనుముప్పు—విడవిడిగానున్న వృక్షములను సమూలముగాఁ బెల్లగించువాఁడు = వాయుదేవుఁడు.

ఒడలిచూ(పులతేఁడు) పొడయుఁడు—శరీరముచేఁ జూడ సమర్థత గల ప్రభువు = ఇంద్రుఁడు.

ఒడిఁబ్రాలు—మంగళార్థము నూతన వధువుకు ఒడిలోఁ గట్టు బియ్యము.

ఒప్పులాఁడి—చక్కఁదనము గల యాఁడుది, సుందరి.

ఓకోదని—ఆశ్రయమును దినునది = చేను.

ఓషధీశుఁడు (ఓషధిపతి) } ఓషధులకుఁ బ్రభువు = చంద్రుఁడు.

ఓష్ఠ్యము—పెదవులయందుఁబుట్టునది = ప, ఫ, బ, భ, మ.

ఔత్తానపాది—ఉత్తానపాదునకుసునీతియందుఁబుట్టినకొడుకు = ధ్రువుఁడు.

ఔదరికుఁడు—స్వోదర పోషణమే ప్రయోజనముగాఁ గలవాఁడు.

ములకుఁ గల గోత్రజుఁడు = సమానోదకుఁడు

ఏకోదరుఁడు—ఒక తల్లి కడుపునఁ బుట్టినవాఁడు = సోదరుఁడు

ఏకోద్దిష్టము— ఒకని నుద్దేశించి చేయఁబడిన = శ్రాద్ధము

ఏచకంకటిచుక్క— వంకరమంచమువలె నుండెడు నుత్తరాషాఢ నక్షత్రము

ఏటిఱేఁడు—నదులకుఁ బ్రభువు = సముద్రుఁడు

ఏటుకాఁడు - బాణములు ప్రయోగించువాఁడు = విలుకాఁడు.

ఏడికవజీరు— ఇఱ్ఱి వాహనముగాఁ గలవాఁడు = అగ్నిహోత్రుఁడు

ఏడుకొండలరాయఁడు— ఏడుకొండలకుఁ బైనుండెడు దేవుఁడు = వెంకటేశ్వరుఁడు

ఏడుగుఱ్ఱాలజోదు— ఏడుగుఱ్ఱములు గల రథము నెక్కెడు యోధుఁడు = సూర్యుఁడు

ఏణతిలకుఁడు—ఏణము (పెద్దకన్నులు గల నల్లయిఱ్ఱి) చిహ్నముగాఁ గలవాఁడు = చంద్రుఁడు

ఏనికదిండి—ఏనుఁగు ఆహారముగాఁ గలది = సింహము

ఏనుఁగు(దాయ)గొంగ—ఏనుఁగునకు శత్రువు = సింహము.

ఏనుఁగుతోలుదాల్పు—గజాసురుని చర్మమును ధరించినవాఁడు = శివుఁడు (తోలుదాల్పు) గజాసురుఁడు తపోబల గర్వమున నమరులను బాధింపఁగా శిక్షించుటకు శివుఁడు వచ్చెను గజాసురుఁడు శివునితో దేవా నీచేతిలో నేను మరణించినపిదప నాదు చర్మమును ధరించి కృత్తివాసుఁడని పేరొందుమని కోరెను శివుఁడంగీకరించెనని పురాణప్రసిద్ధి

ఏనుఁగుమొగ(ము దేవర)మయ్య— ఏనుఁగుముఖముగల దేవుఁడు = వినాయకుఁడు

ఏనుఁగుమొగముసామి—చూ పై.

ఏనుఁగురాకాసిగొంగ— గజాసురునకు శత్రువైనవాఁడు = శివుఁడు. చూ ఏనుఁగుతోలుదాల్పు

ఏనుగుల(గొంగ)(దాయ)(సూడు) ఏనుఁగులకు శత్రువు = సింహము

ఏఱులమగఁడు— నదులకుఁ బ్రియుఁడు = సముద్రుఁడు

ఏఱువాక—ఏటేటనుఁ జేయు దుక్కి యొక్క ప్రారంభము

ఏఱుదొర, ఏర్లఱేఁడు } నదులకుఁ బ్రభువు=సముద్రుఁడు

ఐందవము—చంద్రునకు సంబంధించినది = వెన్నెల వ్రతము మొ.

ఐంద్రజాలికుఁడు-ఇంద్రజాలముచేయువాఁడు=మాయావి మోసకాఁడు

పతివ్రత తనభర్తకుఁ దానొక్కతెయే భార్యయైనది = సవతి లేనిది

ఏకపత్నీవ్రతము—ఒకేభార్య భర్తతో కాలము గడపెడు వ్రతము

ఏకపాదిక—పక్షులొక్క కాలిమీదనే నిలిచియుండుట

ఏకపిం(గు)గళుఁడు—పార్వతి శాపమున పింగళవర్ణమయిన యెడమకన్నులవాఁడు = కుబేరుఁడు

ఏకపిండుఁడు—సమానమగు దేహము గాని శ్రాద్ధమునందీయఁదగిన పిండము గాని కలవాఁడు = సపిండుఁడు

ఏకభుక్తము—పగలు రెండుజాములు దాటిన తరువాత నొక్కపూట మాత్రమే తినుట

ఏకముఖము—ఒక వయిపునకే యున్న ముఖము కలది = మండపము మొ

ఏకరాత్రము—ఒక్కరాత్రిలోనంతము చేయ వగు కర్మము = వ్రతాది

ఏకవాదము—ఒకచేతితో వాయింపఁబడునది = 1 డిండిమవాద్యము 2 బ్రహ్మకంటె వేరుగామిచే సర్వమును నొక్క బ్రహ్మమే యని ప్రతిపాదించు వేదాంతుల యద్వైతవాదము

ఏకవిలోచనము—ఏకదృష్టి

ఏకవృక్షము— నాలుగు క్రోసుల లోపల నొక్క చెట్టుతక్క రెండవ చెట్టులేని స్థలము.

ఏకశఫము—రెండుపాయలుగాఁ జీలియుండని డెక్కఁగలది = గాడిద గుఱ్ఱము మొ

ఏకశృంగము—ఒక కొమ్ము గలది = ఖడ్గమృగము

ఏకశేషము—విగ్రహవాక్యమున ననేక పదములు గలిగి సమసించునపుడు ఒక పదముమాత్రమే శేషించు సమాస విశేషము (పితరుఁ- మాతాపితరుఁ).

ఏకాంగము — నిరుపమానమైన యవయవము గలది=1 బుధగ్రహము 2 అంగారకగ్రహము 3 శరీరావయవములలో నుత్తమమైన యవయవము = శిరస్సు

ఏకాంగులు— వివాహ సంబంధముచే నేకశరీరము గలవారు = దంపతులు

ఏకాంగి—ఒంటరిగా నుండెడువాఁడు = భగవద్భక్తుఁడు సన్న్యాసి

ఏకాంతి—ఏకాగ్రచిత్తము కలవాఁడు = భగవద్భక్తుడు

ఏకా(క్షి)క్షము—చూ. ఏకదృక్కు.

ఏకాగ్రుఁడు—తెలియఁదగిన యొక్క వస్తువుకలవాడు=ఏకాగ్రచిత్తుఁడు

ఏకాదశద్వారము—పదునొకండు ద్వారములు గలది (తలయందు 7. బొడ్డుతోఁగూడి క్రిందివి 3 శిరస్సునందలి బ్రహ్మరంధ్రము 1 మొత్తము 11) శరీరము

ఏకాహగమము—ఒకనాఁటి ప్రయాణముచేఁ జేరఁదగిన గ్రామాదికము.

ఏకోదకుఁడు—సమానజలము కలవాఁడు ఏడవతరమునుఁడి పదునాల్గవ తరము

పాదములు గల జంతువు = శరభమృగము

ఎన్నెమ్మ — పురిటిలోఁ బిల్లలను బీడించెడి భూతవిశేషము

ఎమ్మెలాఁడి — విలాసములు గల యాఁడుది

ఎఱచిదిండి — మాంస మాహారముగాఁ గలవాఁడు = రాక్షసుఁడు

ఎఱ్ఱనివేలుపు — ఎఱుపురంగు గల దేవుఁడు = 1 అగ్ని 2 అరుణుఁడు 3 సూర్యుడు

ఎలదాయరక్కసుఁడు — శత్రుభయంకరుఁడని చెప్పెడు బిరుదు విశేషము

ఎలదాయసింహుఁడు — శత్రువులనెడు గజములకు సింహము వంటివాఁడని చెప్పెడు బిరుదు విశేషము

ఎలనాగ — యౌవనముగల యాఁడుది

ఎలుకరౌతు — ఎలుక నెక్కువాఁడు = విఘ్నేశ్వరుఁడు.

ఏకకుండలుఁడు — ఒకే కుండలము కలవాఁడు = 1 కుబేరుడు 2 బలరాముఁడు 3 శేషుఁడు

ఏకచరము — ఒంటరిగాఁ దిరుగునది = ఖడ్గమృగము అడవిపంది

ఏకజన్ముఁడు — ముఖ్యమైన జన్మగలవాఁడు = 1. రాజు 2 ఉపనయనరూపజన్మము లేనివాఁడు = శూద్రుఁడు

ఏకదండి — శిఖాయజ్ఞోపవీతాది శూన్యుఁడై యేకదండమును ధరించు సన్యాసి

ఏకదంతుఁడు(ష్ట్రుఁడు) — కుమారస్వామిచే నొకదంతము పెఱికివేయఁబడుటచే నొకదంతము కలవాఁడు = విఘ్నేశ్వరుఁడు

ఏక(దృష్టి)దృక్కు — సర్వము నేకము (బ్రహ్మము) గాఁ జూచువాఁడు = 1 బ్రహ్మజ్ఞాని 2 ఒకేకన్నుకలవాఁడు ఇ) = 1 శుక్రాచార్యుడు 2 కాకి (వామనునకు భూమండలమును ధారపోయుటకు సిద్ధముగానున్న బలియొక్క జారిచెంబులో శుక్రాచార్యుఁ డడ్డుపడెను వామనరూపవిష్ణువది గ్రహించి తన వేదర్భతోఁ బొడువగా శుక్రుని యొకకన్నుపోయెనని పురాణ ప్రసిద్ధి (కాకాసురుఁడు దండకారణ్యముననున్న సీత యొక్క స్తనము ఫలభ్రాంతిచేఁ బొడువఁగా భార్యకుఁ గలిగించిన యాపదకు శ్రీరాముడు కోపించి వానిపై దృణము మంత్రించి వదలెను కాకాసురుడు ముల్లోకములను అస్త్రము వెంబడింపఁగాఁ బరుగిడి బ్రహ్మాదుల నందరను శరణు గోరియు వ్యర్థము కాఁగాఁ దిరిగివచ్చి శ్రీరామునే శరణు పొందెను శ్రీరాముని యనుగ్రహమున నా యస్త్రము ఒకకన్నును గ్రహించి ప్రాణములు విడిచిపెట్టెనని పురాణ ప్రసిద్ధి)

ఏకదేవుఁడు — ముఖ్యుఁడయిన దేవుఁడు = శివుడు కేశవుఁడు.

ఏకపత్ని — ఒకఁడే పతిగాఁ గలది =

ఋ(శ్య)ష్య కేతనుఁడు— ఋశ్యము ఒక జాతిమృగి టెక్కెముగా గల వాఁడు = (మన్మథసుఁడు) అనిరుద్ధుఁడు

ఋశ్యదము— మనుఁబోతులను బట్టుటకై త్రవ్విన గొయ్యి

ఋషభతరము— బరువు మోయుటకుఁ దగిన ప్రాయము రాని ఎద్దు = చిన్నగిత్త

ఋషభ (కేతనుఁడు) ధ్వజుఁడు— ఋషభము ధ్వజముగా గలవాఁడు = శివుడు

ఋషభి— మీసము మొదలగు పురుష చిహ్నములుగల స్త్రీ

ఋషిపంచమి— సప్తర్షుల నుద్దేశించి చేయఁబడు వ్రతముగల భాద్రపదశుక్ల పంచమి

ఋషియజ్ఞము— వేదాధ్యయన రూపమగు బ్రహ్మయజ్ఞము.

ఋష్యశృంగుఁడు— శిరమున ఋష్యమృగముయొక్క శృంగము (కొమ్ము) వంటి శృంగము గలవాఁడు (విభాండక మహర్షికి ఋష్యమృగి యందుఁ బుట్టినవాఁడు శాంతను బెండ్లాడి దశరథునిచేఁ బుత్రకామేష్టి చేయించినవాఁడు)

ఎండ(ఱేఁడు)దొర— ఎండకుఁ బ్రభువైనవాఁడు = సూర్యుఁడు

ఎండమావులు— మట్ట మ[...] కాలమున మైదానమున[...] గనఁబడు సూర్య[...]చ్ఛాయలు = మృగతృష్ణ

ఎంగ్రిమేఁతరి— ఎంగ్రదకాయలను దినునది = నక్క

ఏకకంటిరథము— ఒకే చక్రము కల రథము = సూర్యరథము

ఎక్కటిబవరము— ఒకనితో నొకఁడు చేయు ద్వంద్వయుద్ధము

ఎక్కుడుమెకము— గొప్పమృగము = ఏనుఁగు

ఎక్కుబావి— ఎక్కుటకు మెట్లుగల బావి = దిగుడుబావి

ఎగుబోద— టెక్కలు మొలచి యెగిరెడు వయసువచ్చిన పక్షిపిల్ల

ఎడకారు— మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసములోపల పండెడు నకాలపు పంట

ఎత్తుగీతము— సీసపద్యమునకు ననుబంధముగావచ్చు గీతపద్యము

ఎత్తులకెకిమీఁడు— పిశాచగణములకుఁ బ్రభువు = ఈశ్వరుఁడు

ఎదచూలి— హృదయమునఁ బుట్టువాఁడు = వాయువు మన్మథుఁడు.

ఎదమచ్చగలసామి— వక్షస్థలమున శ్రీవత్సమనుపుట్టుమచ్చగలదేవుఁడు = విష్ణువు

[...]తడిజోద— చూ. వృషభ[...]ధ్వజుఁడు

[...]మెకము— ఎనిమిది



పడిన శుక్లము గలవాఁడు = సనకాది భీష్ముఁడు ఈశ్వరుఁడు

ఊర్ధ్వలోకము—భూలోకమునకుఁ బైలోకము = స్వర్గము

ఊర్ధ్వవర్త్మము— భూలోకమునకుఁ బైనుండెడు మార్గము = 1 వాయు మార్గము 2 ఆకాశము

ఊర్ధ్వశాయి-వెలికిల బరుండువాఁడు= 1 బాలుడు 2 శివుడు

ఊర్ధ్వస్రోతస్సు—జలాదులను వేళ్ళ మూలమునఁ బైకి దీసికొనునది=వృక్షలతాది

ఊర్మిళ-మగనిని విడిచియున్నయాఁడుది = లక్ష్మణుని భార్య

ఊర్మిమాలి—తరంగములు మాలఁగా గలది = సముద్రము

ఊర్వశి—చూ. ఉర్వశి

ఊర్వష్ఠీవము—తొడల యొక్కయు మోఁకాళ్ళయొక్కయు సముదాయము

ఊషరజము— చవుటి నేలయందుఁ బండించిన యుప్పు

ఊష్మకము—వేఁడిమిగల కాలము = వేసంగి

ఊసరవెల్లి— మూఁడు రంగులు గల ముదురుతొండ

ఋక్షరాజు— నక్షత్రములకుఁ బ్రభువు = చంద్రుఁడు ఎలుగుగొడ్లలో శ్రేష్ఠుఁడు=జాంబవంతుఁడు.

ఋజుకాయుఁడు— ఋజువైన శరీరము కలవాఁడు = కశ్యపముని

ఋజుగము—తిన్నగాఁ బోవునది = బాణము

ఋణాంతకుఁడు—తన నుపాసించుటచే ఋణవిముక్తి చేయువాఁడు = అంగారకుఁడు

ఋణార్ణము—అప్పుతీర్చుటకై చేయఁబడిన మఱియొక యప్పు

ఋతంభరుఁడు-సత్యమును బాలించువాఁడు = పరమేశ్వరుఁడు

ఋతధాముఁడు— సత్యలోకము వైకుంఠము నివాసముగాఁ గలవాఁడు

ఋతధ్వజుఁడు—సత్యము ధ్వజముగాఁ గలవాఁడు = శివుఁడు ఒక ఋషి

ఋతుకాలము —ఋతువైనది మొదలు గర్భధారణకు యోగ్యమైన పదునాఱు రాత్రుల కాలము

ఋతుప్రాప్తము— ఫలయోగ్య కాలమున మాత్రమే లభించినది=వృక్షము

ఋతుస్నానము—ఋతుమతి నాల్గవ దినమున శుద్ధికొరకుఁ జేయు స్నానము

ఋత్విజుఁడు—ధనము పుచ్చుకొని యజమానిచే యజ్ఞముచేయించువాఁడు

ఋభుక్షము—దేవతలకు నివాసయోగ్యమైనస్థానము = స్వర్గము

ఋభుక్షుఁడు—వజ్ర స్వర్గములు కలవాఁడు = ఇంద్రుఁడు.

దీధి(తి) వెచ్చని కిరణములు కలవాఁడు = సూర్యుఁడు

ఉష్ణవారణము—ఎండను వారించునది = గొడుగు

ఉష్ణాంశువు—చూ ఉష్ణరశ్మి

ఉష్ణాగమము—ఉష్ణమధికముగానుండు ఋతువు = గ్రీష్మఋతువు

ఉష్ణీషము— వేడితగులకుండఁ జేయునది = తలపాగా 2 కిరీటము

ఉష్ణీషి— ఉష్ణీషము (పాగావలెనుండు జటాజూటము) కలవాఁడు = శివుడు

ఉష్ణోపగమము—చూ ఉష్ణాగమము

ఊటమెకము—దృఢమైన మృగము ఊరెడు నీటియందు ప్రేమగల మృగము = పంది

ఊధస్యము— పొదుగునఁ బుట్టినది = పాలు

ఊపకలాఁడు-వ్యర్థసంభాషణము చేయువాఁడు

ఊరఁబంది—ఊరియందుఁ దిరుగుపంది

ఊరఁబిచ్చుక— ఊరియందుఁ దిరుగు పిచ్చుక

ఊరజోగి—ఊరియందుఁదిరుగుసన్న్యాసి

ఊరవ్యుఁడు—బ్రహ్మయొక్క తొడనుండి పుట్టినవాఁడు = కోమటి.

ఊరుఁగాయ—ఉప్పులో నూరవేయఁబడిన మామిడికాయ లోనగునది

ఊరుజన్ముఁడు } ఊరుజుఁడు చూ
ఊరుసంభవుఁడు } ఊరవ్యుఁడు

ఊరుదఘ్నము—తొడలోతు (గలది) వరకు వచ్చునది = నీరు మొ

ఊర్ణనాభము— నాభియందు ఊర్ణ (అరఁటి మున్నగువానినార) వంటి దారములు గలది = 1 సాలెపురుగు 2 ఐదుబ్రేళ్లను కొంచెము వంచి కొనలు కలుపకుండఁ బట్టినయభినయ హస్తవిశేషము

ఊర్ణనాభి—బొడ్డున అరఁటినారవంటి దారముగలది = సాలెపురుగు

ఊర్ణాయువు-ఉన్నిగలది=1 పొట్టేలు 2 సాలెపురుగు 3 కంబళి

ఊర్ధ్వకాయము— నాభి మొదలు శిరోగ్రము వఱకుఁగల యొడలి పైభాగము

ఊర్ధ్వచరణము— ఊర్ధ్వముఖముగానున్న పాదములుగల జంతువు చూ అష్టపాదము

ఊర్ధ్వచరణుఁడు—కాళ్లు పైకెత్తి(నవాఁడు) తపస్సుచేయుఋషి

ఊర్ధ్వదేహము—మరణమునకుఁ బిమ్మట గల దేహము

ఊర్ధ్వనయన (లోచన) ము — శిరస్సుపై నేత్రము కలది = శరభమృగము

ఊర్ధ్వ (స్రోతసుఁడు) రేతసుఁడు— అధపతనము లేకపోవుటచే స్తంభింపఁ

ఉన్మజ్జకుఁడు—నీళ్ళు మొదలగువాని యందు దేహము గొంతులోతున నీళ్లలోనుండి తపస్సుచేయు ఋషి

ఉన్మత్తక—(ఉన్మాదము) తినినచో ఉన్మాదము (పిచ్చి)ను కలిగించునది = ఉమ్మెత్త

ఉన్మత్తగంగము—ఉన్మాదము పొందినదివలెఁ బ్రవహించెడు గంగ గల యొకానొక దేశము

ఉన్మ(దితుఁడు)త్తుఁడు— మిగుల మదించినవాఁడు వెఱ్ఱియెక్కినవాఁడు

ఉన్మదిష్ణువు—ఉన్మాదము స్వభావముగాఁ గలవాఁడు భూతావేశాదులచే నొడలెఱుంగనివాఁడు

ఉన్మనస్కుఁడు—ప్రియమైనవస్తు వెప్పుడు కలుగునాయని త్వరతో గూడిన మనస్సు కలవాఁడు

ఉపకంఠము — కంఠ సమీపమును పొందునది = దగ్గఱ

ఉపకథ —ఒక కథలో నప్రధానముగా వచ్చు మఱియొక కథ

ఉపకనిష్ఠక— చిటికెనవ్రేలు ప్రక్కనున్నది = అనామిక (ఉంగరపు వ్రేలు)

ఉపకార్యోపకారక భావము— ఉపకారముపొందువానికిని జేయువానికిని గల పరస్పరసంబంధము

ఉపకుర్వాణుఁడు—ఉపకారము చేయువాఁడు స్వాధ్యాయ గ్రహణము వఱకు బ్రహ్మచర్యము నడపి తరువాత గురుదక్షిణ యిచ్చి స్నాతకవ్రతమాచరించి గృహస్థాశ్రమమునఁ బ్రవేశింప బోవు బ్రహ్మచారి

ఉపకూప జలాశయము- నూతియొద్దఁ బశువులు నీరుద్రాగుటకై కట్టినతొట్టె

ఉపక్రోష్ట—నిందించునది ఓండ్ర పెట్టునది = గాడిద

ఉపగాత—తోడుగాఁ బాడువాఁడు, యజ్ఞమున నుద్గాత యొద్ద గానము చేయు నొకానొక ఋత్విజుఁడు

ఉపగురువు—గురువువలె నుపదేశాదులు చేయువాఁడు

ఉపచాయ్యము— యజ్ఞమునం దగ్ని ధారణార్థము యిటుకలు మొదలగు వానిచే నిర్మింపఁబడిన స్థలవిశేషము.

ఉపచారము —ఒక దానియందు ధర్మమును మఱియొక దానియం దారోపించుట

ఉపజీవకుఁడు—ఒకరి నాశ్రయించి జీవించువాఁడు = భృత్యుఁడు

ఉపజ్ఞ—ఆద్యజ్ఞాన విషయ మగునది, మొట్టమొదట కనిపెట్ట బడినది

ఉపదర్శకుఁడు —కార్యమును లోపములు లేకుండునట్లు కనిపెట్టి చూచువాఁడు = ద్వారపాలకుఁడు, సాక్షి.

ఉపద్రష్ట— క్రతువులయందు జరిగించెడు కర్మకాండమున గుణదోషము

ఉదగద్రి— ఉత్తరదిక్కునందలి పర్వతము = హిమాలయము

ఉదధి—ఉదకమును ధరించునది = సముద్రము

ఉదధిమేఖల— సముద్రము మొలనూలుగాఁ గలది = భూమి

ఉదయనీయ—యజ్ఞాంతమందు చేసెడి ఇష్టి

ఉదరత్రాణము— కడుపు ఱొమ్ము మొదలగుచోట ధరించెడి యినుప కవచము

ఉదరశయము—గర్భమున బోరగిలి పరుండునది = శిశువు

ఉదరసర్వస్వుఁడు— తన పొట్ట నింపుకొనుటయే ముఖ్యముగా భావించువాఁడు

ఉదరి(కుఁడు)— పెద్ద కడుపుగలవాఁడు = విఘ్నేశ్వరుడు

ఉదర్చి—పైకెగయు జ్వాలలు గలది (వాఁడు) =1 అగ్ని 2 మన్మథుఁడు 3 శివుఁడు

ఉదవాప్యుఁడు— పితృదేవతలకు నదక తర్పణముచేయు జ్ఞాతి

ఉదవాసము— జలమునఁ దపస్సు కొరకై నిలిచియుండుట.

ఉదవాహము — నీటిని మోయునది = మేఘము పాత్రము మొ

ఉదానము—శబ్దాదుల నూర్ధ్వ ముఖముగాఁ దెచ్చు కంఠగతవాయువు

ఉద్ఘాటము—సరకులపై సుంకము పుచ్చుకొను చోటు = ఘాటీ

ఉద్దాలపుష్పభంజిక— ఉద్దాలపుష్పములను భంగము గావించెడు ఒక యాట

ఉద్ధరణి— ఆచమనాది సమయములందు నీరు చేతిలోఁ బోసికొనుటకుఁ దగిన లోహసాధనవిశేషము

ఉద్ధగువు— తాకట్టుపెట్టి తీసికొను వడ్డీలేని ముప్పు

ఉద్బిలము— కన్నమునుండి పైకి వచ్చునది = ఎలుక

ఉద్భి(ద)జ్జము—భూమిని బీజమును భేదించుకొని పుట్టునది = తరు గుల్మ లతాది

ఉద్యోగి—వ్యాపారము కలవా డు

ఉద్వయస్కుఁడు— వయస్సు మించినవా డు = ముదుసలి

ఉద్వహుఁడు—వంశాదికమును క్షయము నొందకుండ నుద్ధరించువాఁడు = పుత్త్రుఁడు

ఉద్వాసనము— విగ్రహాదులయందు నావాహనముచేసిన దేవతను బూజావసానమున స్వస్థానమునకుఁ బంపుట ఇంటినుండి కాని పురమునుండి కాని వెడలఁగొట్టుట

ఉన్నతానతము — మెరక పల్లముగా నుండునది = విషమప్రదేశము

పంచసాక్షి మోపిననేరమును బరిహరించుకొనుటకు ముద్దాయి తెచ్చుకొను సాక్షి

ఉత్తరస్ఫుటితము— యోనియందుఁ జేయు చుంబనము

ఉత్తరాధికారి—యజమానుఁడు మరణించిన పిదప నతనిసొత్తునకు స్వామ్యము కలవాఁడు = దాయాదుడు

ఉత్తరాయణము— సూర్యుఁ డుత్తర దిక్కుగాఁ బ్రయాణముచేసెడి ఆఱు నెలల కాలము (మకరసంక్రాంతి మొదలు కర్కాటకసంక్రాంతివఱకుఁ గల కాలము)

ఉత్తుషము— వేచుటవలనఁ బోయిన పొట్టుగలది = పేలాలు

ఉత్థానైకాదశి— శ్రీమహావిష్ణువు నిద్రనుండి లేచెడి ఏకాదశి

ఉత్పచిష్ణువు— పచనము చేయునది పైగండి పండెడు స్వభావముకలది = తృణాది

ఉత్పలి—ఉత్పలము (కలువ లు గలది = సరస్సు

ఉత్పవనము—ద్రవద్రవ్యముల శుద్ధికై దర్భలతోఁ జేయు నొకానొక సంస్కారము

ఉత్పాదకము— భయమును పుట్టించునది=శరభమృగము (దీనికి సామాన్య మృగములకువలె నాలుఁగు కాళ్ళును వీఁపుమీఁద నాలుఁగు కాళ్లును ఊర్ధ్వ నేత్రమును గలవు)

ఉత్పాదశయము—కాళ్ళు పైకిఁబెటుకొని పండుకొనునది=తీతువుపిట్ట

ఉత్ప్రాసము— మనస్సు నొచ్చునట్లు పలికెడు సపహాస్యవచనము.

ఉత్సంగిుఁడు— సంగము విడిచినవాఁడు = సన్న్యాసి

ఉత్సర్గ్య— పొర్లుటకుఁ దగిన స్థితిలో నున్న యావు

ఉత్సవసంకేతులు—వివాహ సంబంధములు లేక విచ్చలవిడిగా స్త్రీలను బురుషులను వర్తించు నొక పర్వతీయ జాతివిశేషము

ఉదంతము— ఉదయించిన నిశ్చయము గలది = వృత్తాంతము

ఉదక్రియ—పితృదేవతాదులకుఁ గావించు జలాదితర్పణము

ఉదకపరీక్ష— వివాహాదులందు లౌకిక ప్రమాణములు దొరకనిచోఁ జేయఁదగు దివ్యప్రమాణ భేదము

ఉదకము — ద్రవమై యుండునది = జలము

ఉదక్ప్రవణము— ఉత్తర దిక్కున కభిముఖమైనది ఉత్తర మార్గగతికి హేతువైనది = యజ్ఞము మొ

ఉదక్య— నాల్గవ దినమున నుదకశుద్ధికి నర్హురాలు = బహిష్ఠ ముట్టుది

ఉదక్యము—జలము నపేక్షించునది=వరి.

# విజ్ఞప్తి

భాషాభిమానులారా !

"విద్యార్థి కల్పతరువు" అను యీ నైఘంటికపాత్రమం దాంధ్రభాషాసర్వస్వ మిమిడియుండి ప్రస్తుత విద్యార్థిసముదయంబున కత్యంతోపయుక్తమై వారల కాపాదించుక్లిష్టసమస్యాపూర్వక సందియ విషయజాతంబు నివారక మాటలో వలనుపడు నీ గురుస్థానీయంబగు 'కల్పతరువు' కల్పతరువే.

మఱియు నాంధ్రభాషా సాంకేతికపదజాలంబెల్ల నిం దకారా ద్యనుక్రమణికతోసహా ప్రత్యంశము వ్యాకరణాంశములతోసహా బహు చక్కగాఁ బొందుపరుపబడి యచ్చొత్తించబడినది.

కేవల మాంధ్రభాషాయోష కనుంగుబిడ్డలని పేర్గాంచు ప్రతి యాంధ్రునికడ నుండదగిన నుత్తమోత్తమ దృశ్య శ్రవ్య కావ్య ప్రబంధ లక్ష్యలక్షణ విషయయుతంబగు గ్రంథరాజము.

కనుక విద్యార్థిలోకంబెల్ల నియ్యదందుకొని తద్భాషా సము పార్జనాసక్తచిత్తులరై విద్వత్కవిపండితస్థాన మంది సాహిత్యరంగ మలంకరించుటలో నీ నిఘంటుకుఁ దుల్యమైన దెద్దియులేదని చెప్ప నగును. ఆంధ్రభాషాభిమానులు, ఉపాధ్యాయులు, విద్యార్థులును ఈ 'కల్పతరువు' ను గైకొని మా యీ యుద్యమమున కత్యంతము నేయూతనిచ్చి మా కృషి ఫలవంత మొనర్తురుగాత.

— ప్ర కా శ కు లు.

శ్రీ మహాగణాధిపతయే నమః

# చతుర్థముద్రణ పరిచయ వాక్యములు

విద్యార్థికల్పతరువు పాఠకమహాశయుల కొక విన్నపము. కల్పతరువు రెండవ ముద్రణముయొక్క ప్రతులు చెల్లుబడియై దాదాపు పదిసంవత్సరముల కాలమైనది. నవలలు, నాటకములు, కథలు, బుఱ్ఱకథలు, ప్రహసనములు, భావగీతములు మున్నగువానిపై నభిరుచి మెండుగాఁ గలిగియున్న యిక్కాలమున క్రొత్తఫక్కిని వ్రాసిన చౌచౌ ప్రకరణములుగల యీ యసమగ్ర నవీన నైఘంటికగ్రంథము ప్రజాదరణపాత్ర మగునో లేక నాశ్రమ వమ్మగునోయని సందియమందుచు వచ్చితిని గాని తొల్లిటి ప్రసిద్ధపత్రికల సుముఖాభిప్రాయములు, విద్యాశాఖాధికారుల యభినందనపత్రములు, పండితోపాధ్యాయసోదరుల యాదరాతిశయములు, విద్యార్థికోటుల యపార భక్తిప్రపత్తులు తొంటి యభిప్రాయమును మార్చినవి. దాదాపు పది సంవత్సరములనుండి గ్రంథము కొఱకు విధివిరామములేక వచ్చుచుండిన వేలకొలఁదియుత్తరముల యొత్తిడిని జూచిన నాకు భాషాసేవకులగు నాంధ్రసోదరుల యమూల్యాదరాభిమానములఁ జూఱగొనెనని యొకవంక సంతోషమును, పునర్ముద్రణమునకు తగుసహకారము ప్రకాశకులలో లేకపోయెఁగదా యని మఱొకవంక కించయుఁ గల్గుచు వచ్చెను.

ఆర్. వెంకటేశ్వర్ అండ్ కంపెనీవారు తిరిగి మూఁడవ ముద్రణము చేయుదుమని చెప్పుచునే కొన్నిసంవత్సరముల కాలము జాగుచేసిరి. అప్పుడప్పుడు కొందఱు ఉత్సాహపూరితులైన పుస్తకవ్యాపారులు వచ్చి కల్పతరువును ముద్రించుట కధికారము లిమ్మని కోరుచువచ్చిరిగాని, ప్రసిద్ధులగు కంపెనీయజమానుల కివ్వవలెనని సంకల్పించుకొన్న కారణమున ఉపేక్షించుచు వచ్చితిని. శబ్దార్థదీపిక యను మా యాంధ్రకోశమును బ్రచారమునకై గొని పోయిన సందర్భమున వేంకట్రామ అండ్ కో, వారి బ్రాంచి మానేజర్లు పలుమార్లు శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారితో సంప్రదించవలసినదిగా నాకు సలహాలిచ్చుచు వచ్చిరి.

ఒకానొక సమయమున ఏలూరు వెళ్ళినపుడు విద్యార్థికల్పతరువు తృతీయ ముద్రణము విషయమై శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారి తోడను, వారి పుత్రులు శ్రీ వేంకట్రామయ్యగారితోడను ముచ్చటించి వారి యామోదమును బడసితిని. శ్రీ పంతులుగారి యాంతరంగిక మిత్రులు సహృదయులు నగు శ్రీ పాలంకయ్యగారు సైతము పుస్తకముపైఁగల తమ సదుద్దేశ్యమును దెలిపి

ప్రోత్సాహమిచ్చుచు శ్రీ పంతులుగారి గ్రంథప్రకటనోద్దేశ్యమును బలపఱచిరి. విస్తృతమైన ప్రచారము గావించుటకు వీలుగా కాపీరైటు హక్కులు దమ కిచ్చుటయే మంచిమార్గమని భాషాపోషకులగు శ్రీ పంతులుగారు చెప్పఁగా నట్లేయని యంగీకరించితిని.

ఈ గ్రంథమును 1930 వ సంవత్సరమునుండి వ్రాయుచుఁ బ్రకటించుచు 1952 సంవత్సరాంతమువఱకు సవరణలు చేయుచునేయుంటిని. ప్రతిసంవత్సరము ఉపాధ్యాయపదవికి 6 మాసములు చొప్పున సెలవుపెట్టి పనిచేయుచు నిటీవల సంవత్సరముక్రిందట ఈ గ్రంథము కారణముగా రాజమండ్రి మ్యూనిసిపల్ హైస్కూలులోని పండితపదవికి స్వస్తి చెప్పుకొంటిని. రూపాంతరములు, జాతీయములు, కావ్యనాటక ప్రకరణములు, రసప్రకరణము, గుణదోష పరిచ్ఛేదము వగైరా పెక్కుపరిచ్ఛేదముల నీ తృతీయముద్రణమునఁ జేర్చుటే కాక, ప్రతిపరిచ్ఛేదమునందును క్రొత్తవిషయములను జతపర్చుచు వచ్చితిని. అయినను కొన్ని విధిగాఁ జేర్చవలసిన ప్రకరణములు మిగిలియుండుటచే నట్లును రెండవ భాగముగా 600 పుటలు గల మఱియొక ప్రతిని గూర్పక తప్పదని తలఁచితిని. భాషాపోషకులలో తలమానికము వంటివారగు శ్రీ వేంకట్రామ అండ్ కో., వారు 2 వ భాగమును సయితము మనతికాలములోనే ప్రకటింపఁగలరని యాశించుచున్నాను.

ఈ గ్రంథము కూలంకషమైన యుభయభాషా జ్ఞానము, చిరంతనపరనపాఠనానుభవము, సమస్త ప్రామాణిక గ్రంథావలోడనదక్షత, అసమాన లోకజ్ఞానసంపదగల విజ్ఞులచే వ్రాయబడఁదగియున్నదయ్యు నల్పజ్ఞుఁడనగు నాచేఁ బ్రయత్నింపఁబడుట కేవల సాహసమూలకము అయినను 'నసాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి' యను పెద్దలసూక్తి ననుసరించి తలకు మించినపనిలోఁ జొరపడితిని.

కాన నాయీ ప్రయత్నములో లోపములు దొర్లకపోలేదు. సర్వజ్ఞులెవ్వరుందురు? లోగడ నీ గ్రంథముయొక్క హక్కులన్నియు శ్రీ వేంకట్రామ అండ్ కో., వారి కిచ్చినప్పుడే దీని సంస్కరణ రూపమైన భావ్యభివృద్ధి బాధ్యత శ్రీ పంతులుగారికి విడచితిని.

ఈ గ్రంథసంకలనమున నాకుపకరించిన ఛందో వ్యాకరణాలంకారాది లక్షణగ్రంథములు, ఆంధ్ర గీర్వాణ భాషలలోని పెక్కు నిఘంటువులు, తదితర ప్రమాణగ్రంథముల నన్నిటిని నిచ్చట గ్రంథవిస్తరభీతిచే నుదహరింపక ఆ యా గ్రంథకర్తల పట్ల త్రికరణశుద్ధిగా నా కృతజ్ఞతను దెలుపుకొను చున్నాను.

విద్యార్థికల్పతరువు ప్రచారములోనికి వచ్చిననాఁటినుండి నేఁటివఱకు సోదరాంధ్రోపాధ్యాయులు, కవిపండితప్రకాండులు, విద్యాశాఖాధికారులు మున్నగువారు గ్రంథమువిషయమయి తామిచ్చిన యెన్నెన్నో యమూల్యాభిప్రాయములనుగాని, సలహాలనుగాని యిటఁ జేర్పనందులకుఁ గినియకుందురని నమ్ముచు వారికి నా కృతజ్ఞతాపూర్వకవందనశతంబుల నర్పించుచున్నాఁడను.

విద్యార్థి కల్పతరువుయొక్క హక్కులనుగ్రహించి గ్రంథమును బ్రచారములోనికిఁ దీసికొనివచ్చుటకు శక్తివంచనలేక సర్వవిధముల పాటుపడుచు దీని చతుర్థముద్రణము కావించిన శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారికిని, శ్రీ వేంకట్రామయ్య పంతులుగారికిని, వారి ఆత్మీయులకును ఇతోధికమయిన భాషాసేవచేసి స్థిరమైన యశము నార్జించుటకు ఆయురారోగ్యభాగ్యముల నొసంగునట్లు సర్వేశ్వరుని సర్వదా ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

గ్రంథరచయిత.

# —:సంజ్ఞా వివరణము:—

ఉ- ఉదా - ఉదాహరణము
ఏ-నిఘం - ఏకాక్షరనిఘంటువు
కావ్య - కావ్యప్రకరణము
కృ - కృత్తులు
గు. దో. - గుణదోషపరిచ్ఛేదము
చూ - చూడు
ఛం - ఛందస్సు
జం. ప. - జంటపదములు
జా - జాతీయములు
తద్ధి - తద్ధితములు
తత్స - తత్సమము
దే - దేశ్యము
నాట - నాటకప్రకరణము
నాయ - నాయకప్రకరణము
నానా - నానార్థములు
పర్యా - పర్యాయపదము
పారి - పారిభాషికపదము
ప్రా - ప్రాసము
ప్ర - ప్రకృతి
య - యతి
ర. ప్ర. - రసప్రకరణము
రూ - రూపాంతరము
వి. కల్ప. - విద్యార్థికల్పతరువు
వై - వైకృతము
వ్యాక - వ్యాకరణము
వ్యుత్ప - వ్యుత్పత్త్యర్థము
శక. రే. - శకటరేఫములు
సం. జా. - సంస్కృతజాతీయము.
సంజ్ఞా - సంజ్ఞాపరిచ్ఛేదము
సంధి - సంధిపరిచ్ఛేదము
సం - సంస్కృతము
సమా - సమాసము
సాంకే - సాంకేతికపదములు
సూ - సూత్రము

# విషయసూచిక


| ప్రకరణముల పేర్లు | | పుటల సంఖ్య |
|---|---|---|
| 1. పారిభాషిక పదములు | ... | 1 - 85 |
| 2. పారిభాషిక పదానుక్రమణిక | ... | 86 - 96 |
| 3. పర్యాయపదములు | ... | 97 - 135 |
| 4. పర్యాయపదానుక్రమణిక | ... | 136 - 141 |
| 5. నానార్థములు | ... | 142 - 220 |
| 6. వ్యుత్పత్త్యర్థములు | ... | 221 - 464 |
| 7. వికృతి ప్రకృతులు | ... | 465 - 496 |
| 8. ప్రకృతి వికృతులు | ... | 497 - 521 |
| 9. తెనుఁగు జాతీయములు | ... | 522 - 540 |
| 10. సంస్కృత జాతీయములు | ... | 541 - 544 |
| 11. జంట పదములు | ... | 545 - 556 |
| 12. ధ్వన్యనుకరణములు | ... | 556 - 559 |
| 13. ద్వంద్వపదములు | ... | 559 - 561 |
| 14. ఉపమానోపమేయములు | ... | 562 - 564 |
| 15. ఏకాక్షర నిఘంటువు | ... | 564 - 569 |
| 16. రూపాంతరములు | ... | 570 - 612 |
| 17. వ్యాకరణ సంగ్రహము (పరిచ్ఛేదములు) | ... | 613 - 646 |
| 18. అర్ధబిందు విధాయక ప్రకరణము | ... | 647 - 649 |
| 19. సిద్ధార్థానుస్వారపదముల పట్టిక | ... | 649 - 650 |
| 20. శకటరేఫ పదముల పట్టిక | ... | 651 - 653 |
| 21. గుణదోషపరిచ్ఛేదము | ... | 653 - 656 |
| 22. ఛందఃపరిచ్ఛేదము | ... | 656 - 665 |
| 23. నాయక ప్రకరణము | ... | 665 - 668 |
| 24. కావ్య ప్రకరణము | ... | 668 - 671 |
| 25. నాటక ప్రకరణము | ... | 672 - 678 |
| 26. రసప్రకరణము | ... | 679 - 682 |
| 27. ఆంధ్రాంగ్ల వైయాకరణ పరిభాష | ... | 683 - 686 |

శ్రీ ర స్తు

# విద్యార్థికల్పతరువు

## పారిభాషిక పదములు



## అం

అంగపంచకము— 1. ఉపాయము, సహాయము, దేశకాల విభజనము ఆపదకుఁ బ్రతిక్రియ, కార్యసిద్ధి. 2. పంచాంగములు — తిథి వారము నక్షత్రము, యోగము కరణము. 3 శరీరాంగములు—కరములు చరణములు, ఉరము, లలాటము, భుజములు 4. కన్యాదానాంగములు — వాగ్దానము, ఫలదానము, కన్యాసంవరణము, కన్యాదానము, నిరీక్షణము.

అంజనత్రయము- నీల, రస, పుష్పాంజనములు.

అంజనపంచకము— సౌవీరాంజనము, రసాంజనము, స్రోతాంజనము, పుష్పాంజనము, నీలాంజనము

అంజనములు — నారికేళ, వీరభద్ర, నీల,గరుడ కపోత, కర్పూర ప్రబోధ, బాలసూర్యోదయ, భైరవ, విజ్ఞాన ప్రకాశ, దివ్య, హారిద్ర మాయ నేత్రామృత, సౌవీరాంజనములు.

అంతఃకరణచతుష్టయము—మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

అంతఃకరణ చతుష్టయ విషయములు—మనస్సునకు- సంకల్పము, బుద్ధికి - నిశ్చయము, చిత్తమునకు - చింతనము, అహంకారమునకు - అహంభావము.

అంబాత్రయము — మూకాంబ, జ్ఞానాంబ, భ్రమరాంబ.

అక్షరగ్రహనిర్ణయము— అ మొదలు అం వరకుసూర్యుఁడుఅధిష్ఠానగ్రహము - క వర్గమునకు అంగారకుఁడు- చ వర్గమునకు బుధుఁడు - ట వర్గమునకు శుక్రుఁడు-త వర్గమునకు బృహస్పతి-ప వర్గమునకు శని - యాదులకు చంద్రుఁడు.

అక్షరజాతులు—అ మొదలు ణ వరకు బ్రాహ్మణజాతి యక్షరములు- త వర్గు, పవర్గు ర వ, ఇవి క్షత్రియజాతివి - య ల శ ష స హ ఇవి వైశ్యజాతివి- ళ క్ష ఱ ఇవి శూద్రజాతివి.

అక్షిత్రితయము— కంచి కామాక్షి, మధుర మీనాక్షి, కాశీవిశాలాక్షి.

అగ్నిచతుష్టయము— (ఆయుర్వేదౌషధములు వండుటకు వలసినవి (1) దీపాగ్ని, కమలాగ్ని, మందాగ్ని, గాఢాగ్ని) (అసలము, కుకూలము, ఛగలము, వత్సము) (2) బడబాగ్ని, జఠరాగ్ని, గృహాగ్ని, వైద్యుతాగ్ని, (వైద్యుతాగ్నికి బదులుగా కొందరు దావాగ్నిని పఠింతురు).

అగ్నిపంచకము— బుద్ధి, ఉదానము,

చక్షువు, రూపము పాతము (1) (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము, సభ్యము, అసభ్యము) (2) పూర్వాగ్ని, దక్షిణాగ్ని, పశ్చిమాగ్ని ఉత్తరాగ్ని, సూర్యుడు (3) జఠరాగ్ని దావాగ్ని, బడబాగ్ని, గృహాగ్ని, వైదికాగ్ని.

అగ్నిపీఠశక్తులు—(9) పీతా- శ్వేతా- అరుణా- కృష్ణా- ధూమ్రా- తీవ్రా - స్ఫులింగినీ- రుచిరా- జ్వాలినీ- శక్తులు

అగ్నిహోత్రునిజిహ్వలు—1 కరాలి, ధూమిని, శ్వేత లోహిత నీలలోహిత సువర్ణ, పద్మరాగ, (7), 2 కాళి కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ స్ఫులింగిని, విశ్వరూపి (7)

అగ్నులు— గార్హపత్యము ఆహవనీయము, దక్షిణము, నిర్మంథ్యము, వైద్యుతము, శూరము, సంవర్తము లౌకికము, జారరము, విషకము, క్రవ్యాత్తు, క్షేమవంతము, వైష్ణవము, దస్యుమంతము బలదము శాంతము పుష్టము విభావసువు జ్యోతిష్మంతము భరతము, భద్రము శిష్టకృత్తు వసుమంతము, క్రతువు, సోమము, పితృమంతము, అంగిరస్సు (27)

అజ్ఞానదాయకములు— క్రోధము హింస, అభోజ్యభోజనము, అసత్యవాదము, అసత్ప్రలాపము, పరనారీపరత్వము, శఠత్వము, అనాచారము, అకార్యకరణము (9)

అజ్ఞానభూమికలు—బీజాగ్ర- జాగ్ర- మహాజాగ్ర- జాగ్రత్స్వప్న- స్వప్న- స్వప్నజాగర - సుషుప్తులు.

అద్భుతరస వ్యభిచారిభావములు— చూ వ్యభిచారిభావములు.

అధికరణపంచకము— 1 విషయము (విచారణ చేయదగినది) 2 విశయము (అందు కలిగెడు సంశయము) 3. పూర్వపక్షము (కాదని ఖండించుట) 4 సిద్ధాంతము (అగునని నిర్ధారణ చేయుట) 5 సంగతము లేక సంగతి. (పరస్పరానుకూల్యము చూపుట)

అధోలోకములు—అతల - వితల - సుతల - తలాతల - రసాతల - మహాతల - పాతాళములు (7)

అనుబంధచతుష్టయము —అధికారి, విషయము సంబంధము ప్రయోజనము.

అనుమానపంచకము — నామము, జాతి, గుణము ద్రవ్యము క్రియ

అప్సరసచతుష్టయము— రంభ ఊర్వశి మేనక తిలోత్తమ.

అప్సరసలు— ఊర్వశి, మేనక రంభ, ఘృతాచి, తిలోత్తమ చిత్రరేఖ, మోహిని, మదన, కాంతిచంద్రిక, కుమారి మొదలగు.

అభావచతుష్టయము— ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావ, అత్యంతాభావములు. (4)

అభిచార తంత్ర షట్కము— మారణ, మోహన, స్తంభన విద్వేషణ, ఉచ్చాటన, వశీకరతంత్రములు.

అభ్యాంతభక్తులు— సద్భక్తి, వైష్ణవ భక్తి, అవదానభక్తి, అనుభవ భక్తి, ఆనందభక్తి, సమరసభక్తి.

అయధార్థానుభవములు— సంశయ, విపర్యయ-తర్కములు.

అయనద్వయము— ఉత్తరాయణము, దక్షిణాయనము.

అరిషడ్వర్గము — కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము.

అర్జుననినామములు — అర్జునుఁడు, ఫల్గునుఁడు, పార్థుఁడు, కిరీటి, శ్వేతవాహనుఁడు, భీభత్సుఁడు, విజయుఁడు, కృష్ణుఁడు, సవ్యసాచి, ధనంజయుఁడు, నరుఁడు మొ॥

అర్థద్వయము—వాచ్యార్థము, లక్ష్యార్థము.

అర్థపంచకము—జీవము, ఈశ్వరుఁడు, ఉపాయము, పురుషార్థము, విరోధము.

అవస్థాచతుష్టయము — జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, మోక్షము, (బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము)

అవస్థాత్రయము-జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ (సాంఖ్యావస్థలు) అనాగత,అభివ్యక్త, తిరోభావావస్థలు.

అవస్థాదశకము— దర్శనము, మనస్సంగము, సంకల్పము, జాగరము, కార్శ్యము, అరతి, అలజ్జ, ఉన్మాదము, మూర్ఛ, మరణము.

అవస్థాద్వాదశకము— అవస్థాదశకము, జ్వరము, సంతాపము.

అవస్థాపంచకము— 1. ఔత్సుక్యము, ప్రయత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము. 2. అవిద్య, అస్మితము, రాగము, ద్వేషము, అభినివేశము. 3. ఉన్మత్త, మదన, సమ్మోహన, సంతాప, వశీకరణ అవస్థలు.

అవస్థాషట్కము- పుట్టుట, ఉండుట, పెఱుగుట, మాఱుట, క్షీణించుట, నశించుట. (6)

అవస్థాష్టకము— కౌమారము (5 సం॥) పౌగండము (10 సం॥) కైశోరము (15 సం॥) బాల్యము (16 సం॥) తారుణ్యము (25 సం॥) యౌవనము (50 సం॥) వృద్ధత్వము (70 సం॥) వర్షీయస్త్వము (90 సంవత్సరములు)

అవస్థాసప్తకము- గర్భ, జన్మ, బాల్య, యౌవన, జరా, మరణ, నరకములు.

అశ్వగమనములు — అస్కందితము, ధోరితకము, రేచితము, వల్గితము, ప్లుతము.

అశ్వవిశేషములు - ఇంద్రాయుధము, మల్లికాక్షము, శోణము, శ్రీవృక్షకి, హారితము, హలహలము, హేమము (7)

అష్టఆయుర్వేదాంగములు— శల్యము, శాలాక్యము, కాయచికిత్స, భూతవిద్య, కౌమారభృత్యము, అగదతంత్రము, రసాయన తంత్రము, వాజీకరణతంత్రము.

అష్టకర్మములు- 1. సేద్యము, వర్తకము, దుర్గము, ఏనుఁగులను బట్టుట, పాతరలెత్తుట, గనిత్రవ్వుట, పన్నుతీయుట, గాలిచినచోట్ల జనులను గాపుంచుట, 2. స్నానము, సంధ్య, జపము, హో

మము, స్వాధ్యాయము దేవపూజనము, అతిథ్యము వైశ్వదేవము. (3) వశ్య మారణ స్తంభన ఉచ్చాటన ఆకర్షణ విద్వేషణ మోహన, భీషణ కర్మలు మంత్రశాస్త్రగతములు.

అష్టకవర్గువులు— కాకోళి క్షీరకాకోళి, వృద్ధి, మహావృద్ధి మేద, మహామేద, జీవకము, ఋషభకము

అష్టకష్టములు-దాస్యము దారిద్ర్యము, భార్యలేకుండుట, స్వయంకృషి, యాచనము, యాచకులకు లేదనుట, అప్పుపడుట, ప్రయాణము చేయుట.

అష్టకాలలీలలు— నిశాంతలీల, ప్రాతర్లీల పూర్వాహ్ణలీల మధ్యాహ్నలీల, అపరాహ్ణలీల సాయంలీల ప్రదోషలీల నిశాలీల

అష్టక్షీరములు— ఏనుఁగు లొట్టిపిట్ట, గుఱ్ఱము ఆవు, గేదె మేక, గొఱ్ఱె స్త్రీ (పై చెప్పినవాని పాలు)

అష్టగంధములు- కర్పూరము, కస్తూరి, పునుఁగు జవ్వాజి అగరు, పన్నీరు అత్తరు శ్రీగంధము.

అష్టగణపతులు— 1 లక్ష్మీగణపతి 2. క్షిప్రగణపతి, 3 సిద్ధిగణపతి 4. చింతామణిగణపతి 5 శక్తిగణపతి, 6 ఉచ్ఛిష్టగణపతి, 7. ఏకాక్షర గణపతి 8. కుమారగణపతి.

అష్టగురువులు—వర్ణమాల నభ్యాసము చేసినవారు, ఉపనయనమున గాయత్రి నుపదేశించినవారు వేదాధ్యయనము చేయించినవారు, శాస్త్రాభ్యాసకులు, పురాణేతిహాసాదులను జెప్పువారు, శైవ వైష్ణవ మత సంప్రదాయములను బోధించినవారు టక్కు టమార గజకర్ణ గోకర్ణ ఇంద్రజాల మహేంద్రజాలాది విద్యల నుపదేశించినవారు, బ్రహ్మజ్ఞానోపదేశము చేయువారు.

అష్టచండీశక్తులు— చండి, ప్రచండి, ఉగ్రచండి, చండోగ్ర, చండనాయిక, అతిచండ, చాముండి చండవతి.

అష్టచికిత్సాంగములు — శల్యము, అగదతంత్రము శాలాక్యము, కాయ చికిత్స భూతవిద్య కౌమారభృత్యము, రసాయనతంత్రము వాజీకరణము.

అష్టతీర్థములు—వేదము, వైకుంఠము, వరాహము పద్మము, పరాశరము, కుశము, పలాశము కల్యాణము

అష్టదిక్కులు—తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైఋతి పడమర, వాయవ్యము ఉత్తరము, ఈశాన్యము

అష్టదిక్పాలకుల ఆయుధములు— వజ్రము శక్తి దండము కుంతము, పాశము ధ్వజము ఖడ్గము త్రిశూలము.

అష్టదిక్పాలకుల పట్టణములు— అమరావతి, తేజోవతి సంయమిని, కృష్ణాంగన శ్రద్ధావతి,గంధవతి అలక, యశోవతి (ఈశ్వరుని పట్టణముగా 'యశోవతి కి మారు' 'కైలాసము''ను కొందరు గ్రహింతురు)

అష్టదిక్పాలకుల భార్యలు— శచీదేవి, స్వాహాదేవి, శ్యామలాదేవి, దీర్ఘాదేవి, కాళికాదేవి, అంజనాదేవి, చిత్రరేఖాదేవి, పార్వతీదేవి.

**అష్టదిక్పాలకుల వాహనములు** - ఐరావతము తగరు మహిషము, గుఱ్ఱము, మొసలి, లేడి నరుఁడు వృషభము.

**అష్టదిక్పాలకులు**—ఇంద్రుఁడు అగ్ని, యముఁడు నిర్ృతి, వరుణుఁడు వాయువు కుబేరుఁడు ఈశానుఁడు

**అష్టదిగ్గజములభార్యలు**— అభ్రము కపిల పింగళ, అనుపమ తామ్రపర్ణి శుభ్రదంతి అంగన అంజనావతి.

**అష్టదిగ్గజములు**—ఐరావతము పుండరీకము వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము సుప్రతీకము

**అష్టదిగ్గజకవులు**—అల్లసాని పెద్దన నంది తిమ్మన, ధూర్జటి, మాదయగారి మల్లన అయ్యలరాజు రామభద్రుఁడు, పింగళిసూరన, తెనాలిరామకృష్ణుఁడు, రామరాజభూషణుఁడు

**అష్టధాతువులు**— హస్తమందలి నాడులు 2 పాదాశ్రితనాడులు 2 కంఠాశ్రితనాడులు 2 నాసిక కిరుపార్శ్వము లందుండు నాడులు 2

**అష్టధాతువులు**—బంగారు, వెండి, రాగి, ఇనుము తగరము సత్తు, సీసము, కంచు చూ సాంకేతికపదములు.

**అష్టధూపద్రవ్యములు**— గుగ్గిలము, వేపాకు, వస, చెంగల్వకోష్టు, కరక్కాయ ఆవలు, యవలు నేయి

**అష్టనాగులు**— అనంతుఁడు వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు,కులికుఁడు పద్ముఁడు మహాపద్ముఁడు, కర్కోటకుఁడు.

**అష్టన్యాయసభాంగములు**— చట్టము ప్రాడ్వివాకుఁడు న్యాయసభ్యుఁడు కరణము సాక్ష్యుఁడు, బంగారు, నీరు, నిప్పు

**అష్టపంచాక్షరీ మంత్రభేదములు**— మూల స్థూల సూక్ష్మ శక్తి అఘోర, ప్రణవ నియత ప్రసాదపంచాక్షరులు.

**అష్టపాశములు**— పశుపాశము భవపాశము బంధపాశము, మోహపాశము ఆశాపాశము కర్మపాశము, దుఃఖపాశము కేశపాశము

**అష్టపురములు** — జ్ఞానేంద్రియములు (5) కర్మేంద్రియములు (5) అంతఃకరణ చతుష్టయము పంచప్రాణములు, పంచభూతములు, కామము కర్మ, జ్ఞానము.

**అష్టప్రకృతులు**—అవ్యక్తము, బుద్ధి, అహంకారము పంచతన్మాత్రలు

**అష్టప్రమాణములు**— ప్రత్యక్షము, అనుమానము ఉపమానము, శబ్దము, అర్థాపత్తి అనుపలబ్ధి సంభవము, ఐతిహ్యము (శబ్దమునకు మారుగా ఆగమము ను కొందరు గ్రహింతురు)

**అష్టబంధము**—(శివలింగప్రతిష్ఠకు సంబంధించినది) లక్క, సజ్జరసము, మైనము, కురువిందము, గుగ్గిలము గైరికము, బెల్లము నూనె (వైవాని సంపుటి)

**అష్టబిల్వములు**—పంచ బిల్వములు, 6 శమి (జమ్మి) 7 ఆమలక (ఉసిరిక), 8 దూర్వ (గరిక)

**అష్టభూతులు**— అణిమ మహిమ, గరిమ, లఘిమ ప్రాప్తి,ప్రాకామ్యము,

ఈశత్వము, వశిత్వము, చూ. అష్టసిద్ధులు.

అష్టభైరవులు — 1 రురుఁడు, 2 చండుఁడు, 3సంహారుఁడు,4 ఉన్మత్తుఁడు, 5 కపాలి, 6 భీషణుఁడు, 7 కాలుఁడు, 8 ఆనందుఁడు (విద్యారాజ, కామరాజ, నాగరాజ, స్వచ్ఛందరాజ, లంబిత రాజ, దేవరాజ, ఉగ్రరాజ, విఘ్నరాజ భైరవులు.)

అష్టభోగములు— అన్నము, వస్త్రము, గంధము, పుష్పము, శయ్య, తాంబూలము, స్త్రీ, గానము, (నిధి, నిక్షేప, జల, పాషాణ, అక్షీణ,ఆగామి సిద్ధ, సాధ్యములు.)

అష్టమంగళములు—సింహము, ఎద్దు, ఏనుఁగు, కలశము,వ్యజనము,వైజయంతి, భేరి, దీపము, (బ్రాహ్మణుఁడు, గోవు, అగ్ని, బంగారు, నేయి, ఆదిత్యుఁడు, జలము, రాజు.)

అష్టమదములు— అన్నమదము, అర్థమదము, స్త్రీమదము, విద్యామదము, కులమదము, రూపమదము, ఉద్యోగమదము, యౌవనమదము.

అష్టమహిషులు— రుక్మిణి, సత్య, జాంబవతి, మిత్రవింద, భద్ర, సుదంత, కాళింది, లక్షణ.

అష్టముద్రలు—ధేను, పరశు, మృగి, అభయ, గోధన, జ్ఞాన, లింగ, నిర్వాణ ముద్రలు.

అష్టమూత్రములు— ఆవు, గేదె, మేక, గొఱ్ఱె, ఆఁడేనుఁగు, ఆఁడులొట్టి పిట్ట, ఆఁడుగుఱ్ఱము, ఆఁడుగాడిదల మూత్రము.

అష్టమూర్తులు — పంచభూతములు, సూర్యచంద్రులు, పురుషుఁడు ("పురుషుఁడు" అనుదానికి మారు "అంతర్యామి" నికొందరు గ్రహింతురు.)

అష్టమూలములు—అడ్డసరము, గన్నేరు, తిప్పతీఁగె, తులసి, పర్పాటకము, చేదుపొట్ల, విష్ణుక్రాంతము, చిట్టాముట్టి.

అష్టయజ్ఞద్రవ్యములు—రావి, మేడి, జువ్వి, మఱ్ఱి (వీని సమిధలు) నువ్వులు, ఆవలు, పరమాన్నము, నేయి.

అష్టయాత్రాస్థలములు— 1 హరిద్వారము, 2 ద్వారక, 3 మధుర, 4 బృందావనము, 5 గోకులము, 6 జగన్నాథము, 7 ఉడిపి, 8 తిరుపతి.

అష్టలక్ష్ములు—ధన, ధాన్య, జయ,బల, ధైర్య, రాజ్య, మోక్ష, సంపల్లక్ష్ములు.

అష్టవర్గము—కృషి, వాణిజ్యము, కథ ముధ, దుర్గము, సేతుబంధనము, కన్యాదానము, వరాదానము, శూన్యనివేశనము.

అష్టవర్షపర్వతములు— హిమాచలము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగి, మాల్యవంతము, గంధమాదనము.

అష్టవసువులు—ఆపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు,అనలుఁడు,ప్రభాసుఁడు.

అష్టవాయువులు—గోగంధనము, వాసంతము, చారము, కించులుకము, ఇరిం

గణము, ఝుంఝు, చూషకము, వాత్య

అష్టవిద్యేశ్వరులు— 1 అనంతుఁడు, 2 సూక్ష్ముఁడు 3 వోత్తముఁడు 4 ఏక నేత్రుఁడు 5 ఏకరుద్రుఁడు 6 త్రిమూర్తి 7 శ్రీకంఠుఁడు 8 శిఖండి.

అష్టవిధగజమదములు —దానము - చెక్కిళ్ళఁబుట్టునది, సీధువు-కన్నులఁ బుట్టునది సాగరము-చెవులఁబుట్టునది, శీకరము-తొండము చివరఁ బుట్టునది శిక్యము - చనుమొదలఁబుట్టునది మదము- మేహనముఁబుట్టునది, ఘర్మము- హృదయమునఁ బుట్టునది, మేఘము- చరణములఁ బుట్టునది

అష్టవిధగంగలు— 1 భాగీరథి 2 యమున, 3 కృష్ణవేణి 4 గోదావరి 5 సరస్వతి 6 నర్మద, 7 సింధు 8 కావేరి (1 భాగీరథి 2 అలక 3 ధవళి 4 కాళి, 5 మందాకిని, 6 నందాకిని, 7 పిండారి, 8 జాహ్నవి)

అష్టవిధ గృహస్థకర్మములు—
1 స్నానము, 2 సంధ్య 3 జపము 4 హోమము, 5 స్వాధ్యాయము 6 దేవతార్చన, 7 అతిథిసత్కారము 8 వైశ్వదేవము.

అష్టవిధ ఛందోగణములు— య, ర, త, భ, జ, స, మ-నగణములు. స, య, త-బ్రాహ్మణకులము, జ ర క్షత్రియకులము, భ-వైశ్యకులము, మ శూద్రకులము, స-అంత్యకులము.

అష్టవిధతిర్యక్కరణబంధములు—
సముద్గతము, పరివర్తితము, సమాంగకము, అభిత్రికము, సంపుటము, వేణుకాఖ్యము, కుక్కుటము, మానితము.

అష్టవిధదృష్టులు— చూ దృష్టిభేదములు

అష్టవిధధూపములు— మహాధూపము, యక్షకర్దమ ప్రాజాపత్య విజయ శీతారి, కర్పూరకల్యాణ అమృత, సుగంధ ధూపములు

అష్టవిధనాయికలు— 1 ప్రోషిత భర్తృక-పతి దేశాంతరమునకుఁ బోయియుండఁగా వ్యాకులపడునది 2 ఖండిత-ప్రియునియందు పరస్త్రీసంగమచిహ్నలను జూచి యీర్ష్యను బొందునది. 3 కలహాంతరిత-భర్తనవమానించిపిమ్మటఁ దాపపడునది. 4 విప్రలబ్ధ-సంకేత స్థలమునఁ బ్రియునిగానక వంచింపఁబడి రాయబార మంపునది 5 వాసకసజ్జిక-ప్రియుఁ డిప్పుడు రాఁగలఁడని పడకగది నలంకరించునది. 6 స్వాధీనపతిక - చెప్పినట్లువిని కోరినట్లుజలుపు మగఁడు గలది 7 అభిసారిక-తన్నలంకరించుకొని నాయకునిగూర్చి సంకేతస్థానమునకుఁబోవునది. 8 విరహోత్కంఠిత - సంకేత స్థలమునకుఁ బ్రియుఁడు రాఁడాయెననివిరహముచేఁజింతించునది.

అష్టవిధప్రమాణములు— ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము ఆగమము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము.

అష్టవిధబంధములు—దయ, జుగుప్స, మోహము, భయము, సంశయము, కులము, బలము, శీలము.

అష్టవిధభక్తులు—భాగవతవాత్సల్యము, భగవత్పూజానుమోదము, భగవదర్చనము, భగవద్విషయమున నదంభము,

భగవత్కథాశ్రవణేచ్ఛ, స్వర నేత్రాంగ వికారము, సంతతభగవదను స్మరణము, అమాంస భక్షణము.

**అష్టవిధమంత్ర ప్రయోగములు**- వశ్య, మారణ, స్తంభన, సమ్మోహన, ఉచ్చాటన, ఆకర్షణ, భీషణ భేదములు.

**అష్టవిధయోగాంగములు**- యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి.

**అష్టవిధలోహములు**— బంగారు, వెండి, రాగి, తీక్ష్ణలోహము, ముండలోహము, కాండలోహము, తగరము, సీసము.

**అష్టవిధవివాహములు**- బ్రాహ్మము, సదాచారముగల వరుని వస్త్రాదులచే నలంకరించి పూజించి చేసెడు కన్యాదానము. 2 దైవము-జ్యోతిష్టోమాది యజ్ఞ ప్రారంభమున యథా విధిగఁ దత్కర్మనడపిన ఋత్విజుని అలంకరించి చేయువివాహము. 3 ఆర్షము-దర్మార్థము వరునివలన గోమిథునము ను దీసికొనికన్యనిచ్చి యథాశాస్త్రముగాఁ జేయు వివాహము. 4 ప్రాజాపత్యము-వరునిచే-"నేను అన్యాశ్రమస్థుఁడనుగాక గృహస్థాశ్రమమునుండి ధర్మమాచరించెద" నని చెప్పించి కన్యాదానము చేయుట. 5 రాక్షసము - బలాత్కారముగా మొఱపెట్టు కన్యను దీసికొనివచ్చి చేసికొనెడు వివాహము. 6 ఆసురము -కన్యయొక్క తల్లి దండ్రులకును గన్యకును యథాశక్తి ద్రవ్యమిచ్చి యథేచ్ఛగాఁ జేసికొన పరిణయము. 7 గాంధర్వము-వధూవరులుఅన్యోన్య ప్రేమచేఁ జేసికొను వివాహము. 8 పైశాచము-నిద్రించియుండఁ, త్రాగి మైమఱచియు, శీలము సంరక్షించుకొనఁ బరాకుపడి యున్నదానిని సంభోగేచ్ఛచే రహస్యముగాఁ జేసికొను వివాహము (ఈ వివాహములలో మొదటి నాలుగు బ్రాహ్మణులకుఁ బ్రశస్తములు. గాంధర్వ రాక్షసములు క్షత్రియులకును, ఆసురము వైశ్యశూద్రులకును ప్రశస్తములు-పైశాచిక మందరకును నింద్యము.)

**అష్టవిధశోభనములు**— సింహము, ఏనుఁగు, ఆఁబోతు, పూర్ణకలశము, వింజామరము, టెక్కెములు, వాద్యములు, దీపములు (ఇవి రాజులయలంకారములు).

**అష్టవిధ సాత్త్వికభావములు** — స్తంభము, స్వేదము, రోమాంచము, స్వరభంగము, వేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, ప్రళయము.

**అష్టవిధాయములు**—1 ధ్వజాయము, 2 ధూమాయము, 3 సింహాయము, 4 శ్వానాయము, 5 ఋషభాయము, 6 ఖరాయము, 7 గజాయము, 8 కాకాయము.

**అష్టశక్తులు**—సరసిజాలయ, సావిత్రి, సర్వభద్ర, విమల, పద్మ, మహాదేవి, విలసదీశి, జాహ్నవి.

**అష్టశిపగంధములు**— 1 చందనము, 2 అగరు, 3 కర్పూరము, 4 ఉశీరము, 5 చెంగల్వకోష్టు, 6 తమాలము, 7 దళము, 8 కుంకుమము.

అష్టసిద్ధులు— అణిమ - (అణురూప ప్రాణులందుపరమాణురూపముగ నుం డుట) మహిమ-(విరాడ్రూపముగ నం డుట)గరిమ - (బ్రహ్మాండాదులకంటె బరువుగా నుండుట ) లఘిమ - (దూది వలెఁ దేలికగాయుండుట) ప్రాప్తి - (వలయు వస్తువుల లభింపఁజేసికొనుట) ప్రాకామ్యము - (ఆకాశసంచారము) ఈశత్వము - (సమస్తమునకునధికారియై యుండుట) వశిత్వము - (సమస్తభూత జాలమును లోఁబఱచుకొనుట )

అష్టస్థానపరీక్ష-దేహస్పర్శము రూప పరీక్ష శబ్దపరీక్ష, జిహ్వాపరీక్ష, నేత్ర పరీక్ష పురీషపరీక్ష మూత్రపరీక్ష నాడీపరీక్ష.

అష్టస్వరగతులు— ఫలిత వక్రిత స్ఫుటిత జ్వలిత ధ్వంసమాన సుషుప్తి అస్తమయ గతులు

అష్టాంగపూజ— మగ్గు, సుగంధము, అక్షతలు పుష్పములు, ధూపము దీపము, ఉపహారము, తాంబూలము.

అష్టాంగములు— కరములు 2 పాద ములు 2 భుజములు 2 ఱొమ్ము, లలాటము 2 ఈశ్వర కారణము ఈశ్వరస్థూల కారణము ఈశ్వర సూక్ష్మకారణము, ఈశ్వరమహాకార ణము జీవకారణము, జీవ స్థూలకార ణము జీవ సూక్ష్మకారణము, జీవ మహాకారణము అని వీనిని ప్రణవార్థ ప్రతిపాదనకై ఉపనిషత్తులలో అష్టాంగ చతుష్పాదమని చెప్పఁబడినది.

అష్టాంగయోగములు — యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యా నము, ధారణము సమాధి

అష్టాగ్నులు— అగ్ని, జాతవేదుఁడు సహోజుఁడు అజరాప్రభుఁడు వైశ్వా నరుఁడు నర్యాపసుఁడు పంక్తిరథుఁడు విసర్పిరుఁడు (దీపాగ్ని కమలాగ్ని గాఢాగ్ని దావాగ్ని తుషాగ్ని భగ నాగ్ని వానిజాగ్ని వత్సలాగ్ని)

అష్టాదశ కావ్యదోషములు—అప్ర యుక్తము, (కవులు ప్రయోగింపనిది) అపుష్టార్థము (ప్రస్తుతోపయోగము లేనిది) నేయార్థము (తనకే సంకేత మైనది) అసమర్థము (అప్రసిద్ధమైనది), నిరర్థకము (వ్యర్థపదపూర్ణము) గ్రా మ్యము (వ్యాకరణసంబద్ధము కాని భాష) చ్యుత సంస్కారము (వ్యా కరణ సంస్కారము లేనిది) గూఢా ర్థము (వెల్లడికాని యభిప్రాయము కలది) అన్యార్థము (అవసరములేని యర్థము నిచ్చునది) అశ్లీలము (ఉచ్చ రింపరానిది) అప్రతీతము (జనప్రసిద్ధి లేని శాస్త్రాదిక వాక్యము) అప్ర యోజకము ( ప్రయోజనములేనిది ) క్లిష్టము (దూరాన్వయము) సందిగ్ధము ( సంశయగతము ), విపరీతధీప్రదము ( విరుద్ధార్థకరము ) అవిమృష్టవిధే యాంశము (అప్రస్తుత వర్ణనము) పరుషము (శ్రవణకఠోరము) - ఇవి అర్థదోష ములు.

అష్టాదశజాతులు—బ్రహ్మ క్షత్రియ, వైశ్య శూద్ర వ్యావహారిక, గోరక్ష క, శిల్పక పంచాణ కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక వస్త్ర చ్ఛేదక, చర్మకార, తిలఘాత, లుబ్ధక,

చండాల మాతంగజాతులు

**అష్టాదశతీర్థములు**—అంతర్గంగ పాప నాశని, ప్రథమబ్రహ్మ ఛాయామల్లి కార్జున, వేదసంగమేశ్వర గణికాసిద్ధే శ్వర మోక్షేశ్వర, భుజంగ బ్రహ్మ నారాయణ, మణికర్ణిక ప్రయాగమా ధవ సోమసిద్ధేశ్వర దేవద్రోణ నాదా తుంగ సంగమ కలకలేశ్వర నాగ భోగేశ్వర, శుక్లేశ్వర అగ్నేశ్వర మహాతీర్థములు

**అష్టాదశదానములు**– తులాపురుషము హిరణ్యగర్భము, బ్రహ్మదండము, స్వ ర్ణము పంచలాంగలము, స్వర్ణధేనవు భూగోళము కనక పర్వతము, కామ ధేనువు కల్పవృక్షము రజతపర్వతము, సహస్రధేనువు, సాలంకృతహేమ వృషభము సాలంకృత లక్ష్మీప్రతిమ, సాలంకృత సప్తాచలము, సప్తసము ద్రము, గజము, స్వర్గచ్ఛాయ.

**అష్టాదశ దేవతాగణములు**— అమ రులు, సిద్ధులు, సాధ్యులు గరుడులు కిన్నరులు కింపురుషులు గంధర్వులు యక్షులు విద్యాధరులు భూత పిశాచ, రుద్ర, మనిగణములు ఉరగులు, తుషి తులు, దైత్యులు, భాస్వరులు, గుహ్య కులు

**అష్టాదశద్వీపములు**— రమ్యకము, రమణకము, ద్వారక, సింహళము, కై వల్యము, మలయము, అశ్వభద్రము, కేతుద్వీపము, మాల్యవంతము పుష్క రము, ఋషభము రైవతము, నిమ్లో చనము, నియామ్యము, పారావారము, చోరకృతము, మాల్యద్వీపము.

**అష్టాదశ ధాన్యములు**— యవలు, గోధుమలు, వరి నువ్వులు, కొఱ్ఱలు, ఉలవలు, మినుములు, పెసలు చిఱు సెనగలు అనుములు చామలు ఆవలు, గవేధుకములు, నివ్వరిధాన్యము, కంది లు, సతీనకములు, సెనగలు, చీన ధాన్యము.

**అష్టాదశ నాటికలు**—నాటిక త్రో టిక, గోష్ఠి సట్టకము నాట్యరాస కము, ప్రస్థానకము, ఉల్లాప్యము, కావ్యము, ప్రేంకణము, రాసకము, సంలాపకము, శీగదితము, శిల్పకము, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణిక, హల్లీ సకము, భాణికము.

**అష్టాదశ పదార్థములు**— నాదము, శృతి, స్వరము గ్రామము మూర్ఛన, తానము, వర్ణము అలంకారము, గమ కము జాతి రాగము గానము భాష, భాషాంగము విభాష, అంతర్భాష, ఉపాంగము, క్రియాంగము.

**అష్టాదశ పర్వములు**— ఆది, సభా, ఆరణ్య విరాట,ఉద్యోగ భీష్మ ద్రోణ, కర్ణ శల్య సౌప్తిక, స్త్రీ శాంతి అను శాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు.

**అష్టాదశ పురాణములు**— మత్స్య, మార్కండేయ భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ బ్రాహ్మ, బ్రహ్మవైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వారాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ స్కాందములు, శ్లో మద్వయం భద్వయం చైవ బ్రత్రయం, వచతుష్ట

యం అ, నా ప లిం, గ, కూ, స్కాని పురాణాని పృథక్పృథక్

**అష్టాదశ మూలములు**— అష్టమూలములు, దశమూలములు కలిసినవి

**అష్టాదశ వర్ణనములు**— నగరము సముద్రము ఋతువు చంద్రోదయము, అర్కోదయము ఉద్యానము, సలిల క్రీడ, మధుపానము రతోత్సవము విప్రలంభము, వివాహము, పుత్రోత్పత్తి, మంత్రము, ద్యూతము ప్రయాణము, నాయకాభ్యుదయము, శైలము, యుద్ధము.

**అష్టాదశ విద్యలు**— చతుర్దశవిద్యలు, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము.

**అష్టాదశ వివాదస్థానములు**—ఋణమును సకాలములో నీయకుండుట, ఒకరియొద్ద సొమ్ముదాచుట, హక్కులేని యాస్తినమ్ముట ఉమ్మడివ్యాపారము, దానముచేసి తిరిగి పుచ్చుకొనుట, కూలి మొదలగునవి యివ్వకుండుట నియమము నుల్లంఘించుట, క్రయ విక్రయముల యెడ మాట తిరిగిపోవుట, పశుపాలకుని తోడి సంబంధము, సరిహద్దులవిషయము, పరదూషణము, కొట్టుట, దొంగతనము, బందిపోటు, స్త్రీలను జెరపట్టుట, స్త్రీ పురుషుల పరస్పర ధర్మములయేర్పాటు, దాయభాగము, సర్వవిధద్యూతములు.

**అష్టాదశ స్మృతులు**— మను దక్ష, యమ, బృహస్పతి శంఖలిఖిత, పరాశర, యాజ్ఞవల్క్య, విష్ణు, అత్రి, అంగిరస, సంవర్త శాతాతప, ప్రాచేతస, హారీత, ఆపస్తంబ, గౌతమ, ఉశనస, ఆశ్వలాయన స్మృతులు.

**అష్టాదశోపపురాణములు**— ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దౌర్వాస నందీయ, నారసింహ, నారదీయ పారాశర, అంగీరససంహిత, భృగుసంహిత, మారీచ మానవ, వాశిష్ఠ లింగ, వారుణపురాణములు.

**అష్టాదశోపరూపకములు**— నాటిక, త్రోటకము గోష్ఠి సట్టకము, నాట్యరాసకము ప్రస్థానము, ఉల్లాప్యము, కావ్యము ప్రేంఖణము రాసకము, సంలాపకము, శ్రీగదితము, శిల్పకము విలాసిక, దుర్మల్లిక, ప్రకరణిక, హల్లీసము, భాణిక.

**అష్టశాబ్దికులు** — (వైయాకరణులు) ఇంద్రుడు చంద్రుడు, కాశకృత్స్నుడు, ఆపిశలి, శాకటాయనుడు, పాణిని, అమరుడు, జైనేంద్రుడు.

**అష్టానందములు**— 1 బ్రహ్మానందము (నిద్రావస్థవంటి యానందము) 2 వాసనానందము (పూర్వజన్మవాసనచే గల్గు ఆనందము, 3 ఆత్మానందము (వస్తుసమృద్ధివలనఁ గలుగు ఆనందము) 4 విద్యానందము (విద్యాజ్ఞానముల వలనఁ గలుగు ఆనందము) 5 అద్వైతానందము (తనకంటె అధికుఁడులేఁడని యానందించుట) 6 విషయానందము (ఇంద్రియ జనితానందము) 7 సహజానందము (కార్యసిద్ధివలనఁ గలుగు ఆనందము) 8 యోగానందము (సంపదవలనఁగలుగు ఆనందము).

అష్టాభిసారికల సంకేతస్థానములు— పొలము, ఉద్యానవను, పడినగుడి, కుంటెనగత్తెయిల్లు, అడవి, పూఁదోట,వల్లకాడు, నదీతీరము. (లేదాచీఁకటికమ్మిన ప్రదేశ మేదైనను.)

అష్టామ్లవర్గములు— 1 నిమ్మ, 2 గజనిమ్మ, 3 మాదీఫలము, 4 చింత, 5రేగు, 6 వాక, 7 చుక్కకూర, 8 పుల్లచెంచలికూర.

అష్టారూఢములు— లగ్నా రూఢము (పదము), కోశారూఢము, వాహనారూఢము, మంత్రారూఢము, దారారూఢము, భాగ్యారూఢము, నృపారూఢము, ఉపపదము (అరూఢమునకు బదులుగా అన్నిఁటి చివరను పదము చేర్చి వాడుకొనవచ్చును.)

అష్టార్ఘ్యములు— పెరుఁగు, తేనె, నెయ్యి, అక్షతలు, గఱిక, నువ్వులు, దర్భ, పుష్పములు. (జలము, పాలు, కుశాగ్రములు, పెరుఁగు, నేయి, బియ్యము, యవలు, తెలావాలు.)

అష్టావధానము— చతురంగము, కవిత్వము, లేఖనము, పఠనము, గణితము, సంగీతము, యుక్తిచెప్పుట, వ్యస్తాక్షరి.

అష్టావరణములు— సప్తావరణములు, ప్రకృతి.

అష్టైశ్వర్యములు— దాసీజనము, భృత్యులు, పుత్త్రులు, మిత్త్రులు,బంధువులు, వాహనము, ధనము, ధాన్యము. 2. ఇతరులకు ద్రవ్య మిచ్చు నటుల పనులు కల్పించుట, పరుల ఐశ్వర్యము జూచి ఓర్చుకొనియుండుట, ఇతరుల కర్మముల నంగీకరించి నడిపించుట, దుర్మార్గమునకు భయపడుట, ఇతరులకు సంతోషము వచ్చునటుల పనులుచేయత్వరపడుట, ఇతరుల కోరికను నెరవేర్చుట, సదామేలు చేయుట, పరుల దుఃఖమునకు దుఃఖించుట.

అస్త్రములు— వాయవ్య, నారాయణ, బ్రహ్మ,వైష్ణవ, నాగ, ఆగ్నేయ, మేఘ, కౌబేర, మానవ,యమ,గంధర్వ,ఇంద్ర, పాశుపత, రౌద్ర, బ్రహ్మశిరోనామక, మోహన, వజ్ర,జృంభక, శబ్దభేది, గారుడ, వైద్యాధర, పైనాక, దండ, వారుణ, ఐషీక, కంకణ, కంకాల, కౌందర్ప, కాపాలక్రౌంచ, గభస్తి,వందన, పైశాచ, ప్రమథ, శిఖర, సత్య, సోమాస్త్రములు మె.

ఆకాశతత్త్వపంచకము— జ్ఞానము, మనస్సు, బుద్ధి,చిత్తము,అహంకారము.

ఆకాశపంచకము— జ్ఞానము, సమానము, శ్రోత్రము, శబ్దము, వాక్కు.

ఆతతాయులు— అగ్నిదుఁడు, గరదుఁడు, శస్త్రధారి, ధనాపహర్త, క్షేత్రాపహర్త, భార్యాపహర్త.

ఆత్మధర్మములు— నిర్వికారత్వము, అసంగత్వము, నిత్యత్వము, స్వప్రకాశత్వము,అద్వితీయత్వము,పరిపూర్ణత్వము.

ఆత్మసప్తావస్థలు— అజ్ఞానము, ఆవరణము,నిక్షేపము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, దుఃఖనివృత్తి, తృప్తి.

ఆమ్లపంచకము— 1 రేఁగు, దానిమ్మ, చింత, పులిచింత, పుల్లప్రబ్బలి,2నిమ్మ, నారింజ,పుల్లప్రబ్బ,చింత,మాదీఫలము

ఆయుధములు— బాణము, ఖడ్గము, తోమరము, స్తోమము, సృగము, చేరి, శక్తి, యష్టి, భిండివాలము, పరిఘము, పరశ్వథము,గద,ప్రాసము, ముద్గరము, ముసలము, శూలము, పాశము,చక్రము, ముసుండి, వజ్రము,దండము, హలము, అశని, కుంతము, అరిష్టము, క్రకచము, పరశువు, శంఖువు, తోత్రము, వేణువు, త్రిశూలము, కుసూలము. (32)

ఆరోగ్యసూత్రములు — వేళకు భుజించుట, మితముగా భుజించుట, ఆఁకలితో నుపవసింప కుండుట, మంచిగాలి పీల్చుట, శుభ్రోదకము త్రాగుట, శరీరమును పరిశుభ్రము చేసికొనుట, అవసరమగు నిద్రనుబొందుట, చింతలేకుండుట, ఇంద్రియ నిగ్రహము.

ఆలుకభేదములు—కాష్ఠ,శాఖ, హస్తి, పిండ, మధ్య, రక్తోలుకములు.

ఆవరణసప్తకము—
చూ. సప్తావరణము.

ఆశ్రమచతుష్టయము—
చూ. చతురాశ్రమములు.

ఇంద్రియపంచకము- చూ. కర్మేంద్రియపంచకము, జ్ఞానేంద్రియపంచకము.

ఇంద్రియములు—జ్ఞానేంద్రియములు 5. కర్మేంద్రియములు 5.

ఇంద్రియవిషయములు— గంధము, రూపము, రసము, స్పర్శము, శబ్దము.

ఇష్టాపూర్తములు- అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదానుపాలనము, ఆతిథ్యము, వైశ్వదేవము, (ఇష్టము) వాపీకూపతటాకాదులు, దేవతాయనము, అన్నప్రదానము, ఆరామము (పూర్తము).

ఈతిబాధలు—అతివృష్టి, అనావృష్టి, శలభము, మూషికము, శుకము, అత్యాసన్నలగురాజులు. (కొందరు "శుకము, అత్యాసన్నులగు రాజులు" అనవానికి మారు 'నిజరాజబాధ, పరరాజబాధ' లను గ్రహింతురు).

ఈశ్వరత్రయము—విరాట్టు, హిరణ్యగర్భుఁడు, అవ్యాకృతుఁడు.

ఈశ్వరముఖపంచకము—
ఈశానము, తత్పురుషము,వామదేవము, సద్యోజాతము, అఘోరము.

ఈశ్వరసామర్థ్యద్వయము—
స్వరూపము, అరూపము.

ఉగ్రగంధద్వయి—
ఓమము, నల్లఓమము.

ఉదకపంచకము—చిత్తము,ప్రాణము, జిహ్వ, రసము, గుహ్యము.

ఉన్మాదములు—దేవ,దానవ,గంధర్వ, కిన్నర, యక్ష, అగ్నిష్వాది, పితృోన్మాదములు, గురు, ప్రేత, గుహ్య, వృద్ధ, భూత, సిద్ధ, జలాధిదైవత, పిశాచ,నాగ, బ్రహ్మరాక్షస, రాక్షస, కూశ్మాండగ్రహ, కృత్య, భేతాళోన్మాదములు.

ఉపచారపంచకము—స్నానము, పూజ, నైవేద్యము,ప్రదక్షిణము,నమస్కారము, 2. గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము.

ఉపపాండవులు— ప్రతివంద్య శ్రుత సోమ శ్రుతకీర్తి శతానీక, శ్రుతసేనులు.

ఉపరత్నములు— సూర్య కాంతము, చంద్రకాంతము, స్ఫటికము, హర్య క్షము, కాచము.

ఉపరసములు— గంధకము గైరికము, కాసీసము కాంక్షికము హరిదళము, మణిశిల, తాళకము, అంజనము, కంకుష్ఠము.

ఉపవాయువులు—(5) నాగము - వాక్కునందుండునది, కూర్మము - కంటి రెప్పలందుండునది కృకరము - నేత్రములయందుండునది, దేవదత్తము-కంఠ ద్వారమునయుండునది ధనంజయము - హృదయమున నుండునది.

ఉపవేదచతుష్టయము— ఆయుర్వేదము (బ్రహ్మ, అశ్వినీదేవతలు ధన్వంతరి మొ. కర్తలు) ధనుర్వేదము-(విశ్వామిత్రుఁడు కర్త. దీనిని బ్రహ్మవలన నుపదేశము పొందెను) గాంధర్వ వేదము-(భరతమునికర్త) అర్థవేదము-అధర్వణ వేదసారము. (ఇందుఁగల శిల్ప పాక, నీతి, అశ్వశాస్త్రాదుల కనేకులు కర్తలు)

ఉపాంగచతుష్టయము— మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము ధర్మ శాస్త్రము.

ఉపాంగషట్కము— (నాట్యశాస్త్రము) కన్నులు, కనొబొమలు, ముక్కు, పెదవి చెక్కిళ్లు గడ్డము.

ఉపాయచతుష్టయము— సామ, దాన, భేద, దండములు.

ఉపాయసప్తకము— చూ సప్తోపాయములు.

ఊర్ధ్వలోకసప్తకము— భూలోక, భువర్లోక స్వర్గలోక, మహాలోక జనోలోక, తపోలోక, సత్యలోకములు.

ఊర్మిషట్కము— బుభుక్ష, తృష్ణ, శోకము, మోహము, జర, మరణము.

ఋణగ్రహణోపాయములు— ధర్మము వ్యవహారము, ఛలము, ఆచరితము, బలము.

ఋణత్రయము—దేవఋణము, పితౄణము, మనుష్యఋణము.

ఋతుషట్కము—వసంతర్తువు, గ్రీష్మర్తువు వర్షర్తువు శరదృతువు, హేమంతర్తువు, శిశిరర్తువు

ఋత్విక్చతుష్టయము-హోత ఉద్గాత అధ్వర్యువు, బ్రహ్మ, (వీరిలోనొక్కొక్కనికి ముగ్గురుసహాయ ఋత్విజులుకలరు) బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుఁడు, ప్రతిప్రస్థాత పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, ఆగ్నీధ్రుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు ఉన్నేత. (12)

ఋషిభేదములు—మహర్షులు - (వ్యాసాగలు), పరమర్షులు - (భేలాదులు), దేవర్షులు-(కణ్వాగులు), బ్రహ్మర్షులు-(వసిష్ఠాదులు) శ్రుతర్షులు - (సుశ్రుతాదులు), రాజర్షులు-(ఋతుపర్ణ, విశ్వామిత్రాదులు), కాండర్షులు-(జైమిన్యాదులు)

ఏకవింశతిపత్రములు— మాచి, బృహతి, బిల్వ, దూర్వ, దుత్తూర, బదరి,

అపామార్గ తులసి చూత, కరవీర విష్ణుక్రాంత దాడిమి దేవదారు మరువక సిందువార జాజి గండలి శమి అశ్వత్థ, అర్జున అర్కపత్రములు

**ఏకవింశతి ప్రజాపతులు**— బ్రహ్మ స్థాణువు మనువు దక్షుఁడు భృగువు ధర్ముఁడు యముఁడు మరీచి అంగిరసుఁడు అత్రి పులస్త్యుఁడు పులహుఁడు క్రతువు వసిష్ఠుఁడు పరమేష్ఠి సూర్యుఁడు, సోముఁడు కర్దమప్రజాపతి క్రోధుఁడు అర్వాకుఁడు ప్రీతుఁడు.

**ఏకవింశతి మహాదోషములు**— పంచాంగశుద్ధి సూర్య సంక్రమణము, కర్తరి షష్ఠాష్టరిఃఫగచంద్రుఁడు ఉదయాస్తశుద్ధి వారజనితదుర్ముహూర్తము గండాంతము క్రూరగ్రహషడ్వర్గము, భృగుషట్కము కుజాష్టమము దంపత్యష్టమలగ్నము రాశివిషఘటిక కునవాంశము వారజనితము ఖర్జూరచక్రసమాంఘ్రిభము గ్రహణోత్పాతము, క్రూరగ్రహవిద్ధ నక్షత్రము క్రూర సంయుతము అకాలగర్జితవృష్టి, వ్యత్రప నిర్గమాది మహాపాతము, వైధృతి

**ఏకవింశతిస్థానకములు**—సంహతము, సమపాదము స్వస్తికము వర్ధమానము, సంద్యావర్తము చతురశ్రము పార్ష్ణివిద్ధము, పార్ష్ణి పార్శ్వగతము, ఏకపార్శ్వగతము, ఏకజానుకృతము పరావృత్తము, పృష్ఠోద్ధానతలము, ఏకపాదము బ్రాహ్మము వైష్ణవము శైవము, గారుడము, వృషభాసనము, సమసూచికము, విషమసూచికము చండసూచికము.

**ఏకవింశత్యవతారములు**— బ్రహ్మ, యజ్ఞ వరాహ, నారద నరనారాయణ కపిల, దత్తాత్రేయ, సుయజ్ఞ, ఋషభ పృథు మత్స్య, కూర్మ, ధన్వంతరి మోహిని, నృసింహ వామన పరశురామ వ్యాస శ్రీరామ బలరామ శ్రీకృష్ణ, బౌద్ధావతారములు

**ఏకాంగసాధకులు**—పరీక్షిత్తు శ్రవణమువలనను శుకుఁడు కీర్తనమువలనను, ప్రహ్లాదుఁడు స్మరణమువలనను, లక్ష్మి పాదసేవవలనను, పృథువు అర్చనము వలనను అక్రూరుఁడువందనమువలనను, అర్జునుఁడు సఖ్యమునను, బలి ఆత్మనివేదనమువలనను దరించిరి.

**ఏకాదశకరణములు**—బవ బాలవ, కౌలవ, తైతుల గరజి వణజి భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కిమస్తుఘ్నము- కరణములు

**ఏకాదశ పాపశ్రేణివిభాగము**— హింస లేక ద్వేషము, నిష్ఠురత క్రౌర్యము లేక కుటిలత్వము చిత్తవిభ్రమము మిధ్యావ్యవహారము గుర్వవజ్ఞ, లాంపట్యము, స్వార్థసర్వస్వత అపావిత్ర్యము, అశిష్టాచారము, జగన్నాశకార్యము.

**ఏకాదశ శరీరద్వారములు**— నాసారంధ్రములు (2) శ్రోత్రద్వారములు (2) నేత్రద్వారములు (2) ముఖద్వారము (1) నాభిద్వారము (1) గుద గుహ్యాంగద్వారములు (2)

**ఏకాదశరుద్రులు**— అజైకపాదుఁడు అహిర్బుధ్న్యుఁడు త్వష్ట రుద్రుఁడు, హరుఁడు, త్ర్యంబకుఁడు, వృషాకపి,

శంభుఁడు కపర్ది మృగవ్యాధుడు, శర్వుఁడు, (కశ్యపబ్రహ్మవలన సురభి యందు జన్మించినవారు) (మతాంతరము) అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట రుద్రుఁడు, హరుఁడు శంభుఁడు త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు

ఏకాదశేంద్రియములు —జ్ఞానేంద్రియములు (5) కర్మేంద్రియములు (5), మనస్సు (1)

ఐదాయులు— వడ్రంగి, కమ్మరి అగసాలె, కంచరి తాపీపనివాఁడు

ఐశ్వర్యషట్కము —చూ. షడ్వైశ్వర్యములు

ఓఘచతుష్టయము— కామము, భవము, దృష్టి అవిద్య

ఔషధభేదములు—దీపన, పాచన, దీపనపాచన అనులోమన సంశమన, స్రంసన భేదన, రేచన వమన లేఖన, గ్రాహ్య, స్తంభన, రసాయన, వాజీకరణ, ధాతువృద్ధి, శుక్రోత్పత్తి సూక్ష్మ వ్యవాయి, వికాసి, మదన, ప్రమథి, అభిష్యంది, ప్రాణహర ఔషధములు.

కంటకత్రియము— (ఆయుర్వేదమున) వాకుడు, నేలమునగ, పల్లేరుచెట్టు.

కంటకారీత్రయము— (ఆయుర్వేదమున) వాకుడు, రేవటిదూలకోవిల నెల్లిచెట్టు.

కటుచాతుర్జాతకము— (ఆయుర్వేదమున) ఏలకులు, ఆకుపత్రి దాల్చిన చెక్క, మిరియాలు.

కథాత్రయము— తర్కశాస్త్రము) వాదము - నిజము తేలుటకై తర్కించుట వితండము - స్వపక్షస్థాపనకై పరపక్షమును ఖండించుట జల్పము- స్వపక్షస్థాపనము నిమిత్తముకాక పరవాద ఖండనమే ప్రధానముగతర్కము.

కన్యాదానాంగములు—వాగ్దానము, ఫలదానము కన్యాసంవరణము, కన్యాదానము నిరీక్షణము.

కరణములు—బవ బాలవ కౌలవ, తైతుల, గరజి, వణజి, శకుని భద్ర, చతుష్పాత్తు నాగవము,కిమస్తుఘ్నము.

కరుణరసవ్యభిచారిభావములు — దైన్యము, చింత, గ్లాని నిర్వేదము, జడత స్మృతి, వ్యాధి. (7)

కర్తృత్రయము—జీవ, ఈశ్వర, ప్రత్యక్కర్తలు

కర్తృపంచకము—బ్రహ్మ (సృష్టి), విష్ణువు (స్థితి), రుద్రుఁడు (లయము), మహేశ్వరుఁడు (తిరోధానము) సదాశివుఁడు (అనుగ్రహము).

కర్పూరములు—(15 రకములు) ఘనసార, భీమసేన, ఈశావాస, ఉదయభాస్కర, కమ్మ ఘుటిక, తురుదాహ, తుషార హిమరస హారతి, శుద్ధ హిక్కరి పోతాశ్రయ పోతాశకర్పూరములు.

కర్మచండాలురు—దూషకుఁడు, క్రియాశూన్యుఁడు, నికృష్టుఁడు, దీర్ఘకోపనుఁడు (ఈ నలుగురికంటె జాతిచండాలుఁడుత్తముఁడు)

కర్మచతుష్టయము— కృచ్ఛ్రము - (దానవ్రతాదికము) చాంద్రాయణము (చూ వ్యుత్పత్తి), నిత్యకర్మానుష్ఠానము (విధివిహితమైననిత్యకర్మలనొనర్చుట), నైమిత్తిక కర్మానుష్ఠానము — ఆ యా పర్వతిథులు మొ. కాలముల కర్తవ్యకర్మల నొనర్చుట.

కర్మత్రయము— (1) నిత్యము నైమిత్తికము, కామ్యము- (2) ప్రారబ్ధము, సంచితము, ఆగామి-(3) పుణ్య పాప మిశ్రకర్మలు.

కర్మద్వయము-నిత్యము నైమిత్తికము, లేదా వైదికము, లౌకికము

కర్మపంచకము— ఉత్క్షేపణము, అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము.

కర్మఫలభేదములు—సంచితము, ప్రారబ్ధము, ఆగామి.

కర్మషట్కము— చూ. షట్కర్మలు.

కర్మసాక్షులు-సూర్యుఁడు, చంద్రుఁడు, యముఁడు, కాలము, పృథివి, జలము, తేజస్సు వాయువు ఆకాశము.

కర్మేంద్రియపంచకము— వాక్కు, పాణి,పాదము, పాయువు, గుహ్యము.

కర్మేంద్రియపంచకవిషయములు- నోటికి వమనము, చేతులకు దానము, కాళ్ళకు గమనము, శిశ్నమునకు ఆనందము, గుదమునకు మలవిసర్జనము

కల్పత్రయము — బ్రహ్మ, వరాహ, పద్మకల్పములు.

కల్పసూత్రములు— (బోధాయనాది సూత్రములు)-బోధాయనము, ఆపస్తంబము, సత్యాషాఢము, ద్రాహియాయణము, అగస్త్యము, శాండిల్యము, ఆశ్వలాయనము, శాంభవీయము, కాత్యాయనము - (2) వైఖానసాది సూత్రములు - వైఖానసము, శౌనకీయము భారద్వాజము, అగ్నివైశ్యము, జైమినీయము, వాధూలము, మాధ్యందినము, కౌండిన్యము, కాషీతకము

కవిత్రయము—నన్నయభట్టు, తిక్కన, ఎఱ్ఱాప్రగడ (ఆంధ్రభారత కవులు)

కవిసప్తకము — వివేకి, వాచకుఁడు, రాచకుఁడు ఆర్థికుఁడు, శిల్పకుఁడు, భూషణార్థి, మార్దవానుగతుఁడు

కశ్యపబ్రహ్మభార్యలు - దితి, అదితి, దనువు, అరిష్ట, సురస, ఖస, సురభి, వినత, తామ్ర, క్రోధవశ, ఇర, కద్రువు, ముని.

కషాయమూలములు — చూ. దశకషాయమూలములు.

కళాస్థానములు— చూ. షోడశ కళాస్థానములు.

కారకపంచకములు— చూ కర్మేంద్రియ పంచకము.

కారణశరీరజ్వరములు— స్వపరజ్ఞానశూన్యత్వము, అజ్ఞానముచే నష్టప్రాయత్వము, ఆగామిదుఃఖ బీజవాసనాస్థితి.

కాలమానములు—మనుష్యమానము, దేవమానము, బ్రహ్మమానము (3).

కాలములు— వర్తమానము భూతము భవిష్యత్తు తద్ధర్మము (3)

కావ్యత్రయము—రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము

కావ్యపంచకము— కావ్యత్రయము కిరాతార్జునీయము (భారవి) శిశుపాల వధము (మాఘము)

కావ్యవృత్తిచతుష్టయము— కైశికి ఆరభటి, భారతి సాత్వతి.

కాళిదాసత్రయము— 1 కావ్యత్రయము - (రఘువంశ కుమారసంభవ, మేఘసందేశములు) 2. నాటకత్రయము - (అభిజ్ఞాన శాకుంతల విక్రమోర్వశీయ,మాళవికాగ్నిమిత్రములు) 3 బాణత్రయము (పుష్పబాణవిలాస ఋతుసంహార, భామినీ విలాసములు)

కిరాతాది చతుర్గణము — (ఆయుర్వేదము) నేలవేము, తిప్పతీఁగ తుంగముస్తె శొంఠి

కురుక్షేత్ర వనసప్తకము - కామ్యక-అదితి-వ్యాస - ఫలకీ - సూర్య-మధు-సీతావనములు.

కృచ్ఛ్రములు- కృచ్ఛ్రాతికృచ్ఛ్రము, చాంద్రాయణము, తప్తకృచ్ఛ్రము, త్రిరాత్రకృచ్ఛ్రము పరాకకృచ్ఛ్రము ప్రాజాపత్యకృచ్ఛ్రము, సాంతపన కృచ్ఛ్రము పాదకృచ్ఛ్రము, త్రిపాద కృచ్ఛ్రము.

కృష్ణమిత్రులు— శ్రీదాముఁడు, సుదాముఁడు, దాముఁడు, వసుదాముఁడు, సుబలుఁడు, సుగంధుఁడు వీరభానుఁడు, సూర్యభానుఁడు చంద్రభానుఁడు, వసుభానుఁడు రత్నభానుఁడు, మధుమంగళుఁడు.

కేశపంచకము — (బౌద్ధము) కామ, క్రోధ గర్వ అవివేక అహంకారములు.

కేశవనామములు — కేశవ నారాయణ, మాధవ గోవింద విష్ణో, మధుసూదన త్రివిక్రమ వామన శ్రీధర హృషీకేశ పద్మనాభ దామోదర, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ అధోక్షజ, నారసింహ అచ్యుత జనార్దన, ఉపేంద్ర హరే శ్రీకృష్ణ

కొంకణసప్తకము — కేరళ తులు, గోరాష్ట్ర, కర్ణాటక వరాట, బర్బర, కొంకణదేశములు.

కోశపంచకము— అన్నమయ ప్రాణమయ మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములు.

క్లేశపంచకము— అవిద్యాక్లేశము — నేను జీవుడనని నిర్ణయించుట అభినవక్లేశము — సంసారమున ననురాగము విడువకుండుట ఆసక్తిక్లేశము — విషయాభిలాషనుండి మనస్సును దప్పించుకొన నేరకుండుట రాగక్లేశము - ధనాశగల్గి యుండుట ద్వేషక్లేశము - ఉదరపోషణమునకై పరుల నాశ్రయించి వారిని దూషించుట.

క్రతుచతుష్టయము — ప్రథమచష్టామము, ద్వితీయోక్థ్యము, తృతీయాతిరాత్రము, జ్యోతిష్టోమము.

క్షార త్రయము— సర్జక్షారము, యవ

క్షారము, వెలిగారము.

క్షారద్వయము— సర్జక్షారము, యవక్షారము.

క్షేత్రములు-ఏనుఁగులయొక్క హస్తము, వదనము, దంతము, శిరము, నయనము, కర్ణము, గ్రీవము, గాత్రము, ఉరము కాయము, మేఢ్రము.

ఖండపంచకము—ఆసియా ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా, యూరప్

గంధర్వులు—హాహా హూహూ మొ కశ్యపుని సంతతివారు.

గంధాష్టకములు—జాపత్రి, లవంగములు, దాల్చినచెక్క, ఏలకులు, నాగకేసరములు, మిరియములు, కస్తూరి, ఆకుపత్రి, చూ. అష్టశివగంధములు.

గజజాతులు— భద్రము, మందము, మృగము వీనిమానభేదమున అరాళము, అత్యరాళము, మధ్యము కనిష్ఠము, వామనము అను నామములు కలవు

గజభేదములు—పిష్టకము, వ్యాళము, పూతనము మాతృకము, మాయుకము, పంచమంగళము మొ

గరమాపంచకము—రేలపండు తుంగముస్తెలు, కరక్కాయ కటుకరోహిణి, పిప్పలిమూలము.

గర్వితల భేదములు— రూపగర్విత, యౌవనగర్విత విద్యాగర్విత, నిరూఢగర్విత, ప్రేమగర్విత

గవ్యపంచకము— 1. గోమూత్రము, 2. గోమయము, 3. గోఘృతము, 4. గోదధి 5. గోక్షీరము. (వరుణుఁడు గోమూత్రమందున, అగ్ని గోమయమందును వాయువు పెఱుగునందును, చంద్రుఁడుపాలయందును, సూర్యుఁడు నేతియందునునుండుటచే పంచగవ్యము సర్వదేవతామయ మనఁబడును)

గాంధారగ్రామగతమూర్ఛనలు - నంద, విశాల, సుముఖి, చిత్ర చిత్రవతి, సుఖ ఆలాపము.

గాత్రజచేష్టానుభావములు— (11) లీల విలాస విచ్ఛిత్తి విభ్రమ, కిలికించిత మోట్టాయిత, కుట్టమిత చకిత, బిబ్బోక లలిత విహృతములు.

గాయత్రీముద్రలు— (24) సుముఖ, సంపుట, వితత, విస్తృత ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ పంచముఖ, అధోముఖ షణ్ముఖ, వ్యాపిక అంజలి, శకట, యమపాశ గ్రథిత షణ్ముఖ, ప్రలంబ, ముష్టిక, మత్స్య కూర్మ, వరాహ, సింహాక్రాంత, మహాక్రాంత, ముద్గర, పల్లవముద్రలు

గిరిపంచకము- (జైనయాత్రాస్థలములు) సుమేరు అర్బుద గిరినాళ, శత్రుంజయ చంద్రగిరి శిఖరములు

గిరిమూలపంచకము- (ఆయుర్వేదము) రేల, గ్రంథిపత్ర, తుంగముస్తలు, చేదుపొట్ల కరక్కాయ

గుణములు— చూ. దశవిధగుణము లు చతుర్వింశతి గుణములు పంచగుణములు షడ్గుణములు త్రిగుణములు, ద్విగుణములు.

గురుపంచమూలములు— మారేడు వేరు దుందిలపు వేరు, గుమ్మడు వేరు, కలిగొట్టువేరు, కూరనెల్లి వేరు.

గ్రహణద్వయము—సూర్య, చంద్ర గ్రహణములు.

గ్రీవాభేదములు—సుందరి, తిరశ్చీన, పరివర్తిత, ప్రకంపిత

చండాలభేదములు—కిరాతుఁడు శబరుఁడు, పులిందుఁడు మొ.

చంద్రగణములు-నగగ, నహ, సలల, భల,భగురు మలఘు, సవ, సహ, తల, రల, నవ, నలల రగ తగ మొ.

చతురంగములు— రథ, గజ, తురగ, పదాతులు, స్థూల, సూక్ష్మ కారణ, మహాకారణ దేహములు. ఒక యాట లోని యంగములు.

చతురలంకారములు— వస్త్రములు, ధూపలు మాల్యములు అనులేపనములు.

చతురవస్థలు— చూ పరమాత్మ యందలి చతురవస్థలు

చతురామ్లములు—(ఆయుర్వేదమున) ఆమ్లవేతసము, వృక్షామ్లము, నిమ్మ గజనిమ్మ

చతురాశ్రమములు—1 బ్రహ్మచర్యము, 2 గార్హస్థ్యము 3 వానప్రస్థము, 4 సన్న్యాసము.

చతురుపాయములు— 1 సామము, 2 దానము 3 భేదము, 4 దండము.

చతురూషణములు—శొంఠి, పిప్పలి, మిరియాలు, పిప్పలిమూలము.

చతుర్జాతకములు—1 ఏలకులు, 2 లవంగచెక్క, 3 లవంగపత్రి, 4 నాగకేసరము.

చతుర్దశ చాటువులు— ముక్తము (1 పద్యము) లోక్యము (3 పద్య), వారధిమాల(4పద్య), పంచరత్నములు (5 పద్య), వారణమాల (8 పద్య) నవరత్నములు (9 పద్య), అవతారమాల (10పద్య) రుద్రమాల (11పద్య) భాస్కరమాల (12 పద్య), శశికళ (16 పద్య), మనుమాల (14 పద్య), పురాణమాల (18 పద్య), గాయత్రీమాల (24 పద్య) నక్షత్రమాల (తారావళి)-(27 పద్య).

చతుర్దశ న్యాయశ్రేణీవిభాగము— క్షమ, కృతజ్ఞత సత్యకథనము ఆర్జవము అస్తేయము అపరిగ్రహము దయ, వైరాగ్యము, సచ్ఛాస్త్ర సమ్మానము, తీర్థభ్రమణము (సద్విచారము),శిష్టాచారము, ఇజ్య అధికారనిష్ఠ.

చతుర్దశభువనములు— సప్త అధోలోకములు, సప్త ఊర్ధ్వలోకములు.

చతుర్దశ మనువులు—స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ తామస రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణిక, దక్షసావర్ణిక, బ్రహ్మసావర్ణిక, రుద్రసావర్ణిక ధర్మసావర్ణిక, రౌచ్య, భౌచ్య మనువులు

చతుర్దశ విద్యలు— ఋగ్వేదము, యజుర్వేదము సామవేదము, అథర్వణవేదము, శిక్ష,వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంస, న్యాయము, పురాణము, ధర్మ

శాస్త్రము.

**చతుర్దశేంద్రియములు**— కర్మేంద్రియములు (5), జ్ఞానేంద్రియములు (5), అంతఃకరణ చతుష్టయము (4)

దశేంద్రియములు: శబ్ద, స్పర్శ, రూప రస, గంధములు — (పాఠాంతరము కర్మేంద్రియ పంచకము, జ్ఞానేంద్రియ పంచకము, విషయపంచకము, వాయు పంచకము, అంతఃకరణ చతుష్టయము, (మతాంతరము) అష్టప్రకృతులు, షోడశ వికారములు.

**చతుర్యుగములు**—
1 కృతయుగము (17,28,000 సం॥),
2 త్రేతాయుగము (12,96,000సం॥),
3 ద్వాపరయుగము (8,64,000 సం॥),
4 కలియుగము (4,32,000 సం॥).

**చతుర్లవణములు**— సైంధవము, సౌవర్చము, బిడ, సముద్రలవణము.

**చతుర్వర్గములు**— (చతుర్భద్రము) - చూ. చతుర్విధపురుషార్థములు.

**చతుర్వింశతిగుణములు**— (తార్కిక మతానుసారము) రూప, రస, గంధ, స్పర్శ, సంఖ్యా, పరిమాణ, పృథక్త్వ, సంఖ్యా, విభాగ, పరత్వ, అపరత్వ, గురుత్వ, ద్రవ్యత్వ, స్నేహ, శబ్ద, బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, ధర్మ, అధర్మసంస్కారములు, (కావ్య మతానుసారము) శ్లేష, ప్రసాదము, సమత్వము, మాధుర్యము, సుకుమారత, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి, ఉదాత్తత, ఓజస్సు, సుశబ్దత, ప్రేయస్సు, ఔర్జిత్యము, విస్తరము, సమాధి, సూక్ష్మత, గాంభీర్యము, సంక్షేపము, భావికము, సమ్మితత్వము, ప్రౌఢి, రీతి, ఉక్తి, గతి.

**చతుర్వింశతి తత్త్వములు**—పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, వేను కటిమూడింటికి కారణమైనవి క్షేపశ

**చతుర్వింశత్యవతారములు**—యజ్ఞ, వరాహ, సుయజ్ఞ, కపిల, దత్తాత్రేయ, కుమార, నరనారాయణ, ధ్రువ, పృథు, ఋషభ, హయగ్రీవ, మత్స్య, కూర్మ, నృసింహ, హరి, వామన, హంస, ధన్వంతరి, పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణ, వ్యాస, బౌద్ధ, కల్క్యవతారములు. (24)

**చతుర్వింశతిబలులు**— ధర్మ, అధర్మదేవతలు, ఉదక, వనస్పతి, రక్షోదేవజనులు, గృహ్యా, అవసాన, అవసానపతులు, సర్వభూతములు, కాముఁడు, అంతరిక్షము, దివి, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఇంద్రుఁడు, బృహస్పతి, ప్రజాపతి, బ్రహ్మ, స్వధాపితరులు, రుద్రుఁడు.

**చతుర్విధకవిత్వములు**—చిత్ర, ఆశు, బంధ, గర్భ కవిత్వములు.

**చతుర్విధకవులు**— 1 కవీశ్వరుఁడు, 2 గమకుఁడు, 3 వాది, 4 వాచ్యుఁడు,

**చతుర్విధ క్షీరములు**— ఆవు, గేదె, మేక, గొఱ్ఱెల పాలు.

**చతుర్విధ గణితములు**— 1 సంకలనము, 2 వ్యవకలనము, 3 గుణకారము, 4 భాగహారము.

**చతుర్విధ నాయకులు**— ధీరోదాత్తుఁడు (గొప్పబలము, సుఖదుఃఖముల యందు నిశ్చలత్వము, దయ గర్వరాహిత్యము గలవాఁడు) ధీరోద్ధతుఁడు -(దర్పము, మాత్సర్యము తీవ్రకోపము, ఆత్మస్తుతి మాయ సులభక్రోధము కలవాఁడు) ధీరలలితుఁడు-(నిశ్చింత కళల యందలి యాదరణము, భోగలాలసత్వము గలవాఁడు) ధీరశాంతుఁడు-(ధైర్యము, ప్రశాంతి మనోనిర్మలత్వము గలవాఁడు)

**చతుర్వింశతి పైత్యములు**— అవర్ణ, విదగ్ధ సూర్యావర్త కామల అమ్ల రక్త స్వేద ఉన్మాద, పుండరీక భుజంగ కరపాద శీత మూర్ఛ మధుర, కుసుమ క్రోధ భ్రంశ,శిర క్షుధ తృష్ణ దుర్భాష చర్మ దుర్గంధ మదనములు.

**చతుర్విధ గద్యకావ్యములు**— 1 ముక్తకము (సమాసరహితము) 2 వృత్తగంధి (వృత్తిభాగములతోఁగూడినది) 3 ఉత్కలికాప్రాయము (దీర్ఘ సమాసాఢ్యము) 4 చూర్ణకము (అల్ప సమాసకము)

**చతుర్విధ జన్మలు**— అండజములు, స్వేదజములు, జరాయుజములు ఉద్భిజ్జములు.

**చతుర్విధతృప్తులు**–దుఃఖాభావతృప్తి, సర్వకామావాప్తితృప్తి, కృతకృత్యత్వతృప్తి ప్రాప్తప్రాప్యత్వతృప్తి.

**చతుర్విధపదములు** — యౌగికము, రూఢము, యోగరూఢము, -యౌగికరూఢము చూ. పదచతుష్టయము

**చతుర్విధ పరీక్షలు**— అశ్వ, గజ భూ, రత్న పరీక్షలు.

**చతుర్విధ పురుషజాతులు**- పాంచాలుడు కూచిమారుడు భద్రుడు దత్తుడు.

**చతుర్విధ పురుషార్థములు**— ధర్మము, అర్థము, కామము, మోక్షము.

**చతుర్విధ ప్రళయములు**— నిత్యము, ప్రాకృతము, నైమిత్తికము, ఆత్యంతికము. (కొందరు ప్రాకృతము" నకు మారుగా మహాప్రళయము' ను పఠింతురు)

**చతుర్విధ ప్రీతులు**— అభిమానప్రీతి, విభవప్రీతి, సదృశప్రీతి విషయప్రీతి.

**చతుర్విధ బైరాగులు**— మర్కట, కపట, అస్థిర ఔపాధిక బైరాగులు.

**చతుర్విధ బౌద్ధపక్షములు**— సత్, అసత్ సదసత్, సదసద్విలక్షణము.

**చతుర్విధ బౌద్ధములు**— 1 యోగాచారము 2 సౌత్రాంతికము, 3 మాధ్యమికము 4 వైభాషికము

**చతుర్విధ బ్రహ్మచారులు**— 1 గాయత్రీ బ్రహ్మచారి 2 ప్రాజాపత్య బ్రహ్మచారి 3 వైదిక బ్రహ్మచారి 4 నైష్ఠిక బ్రహ్మచారి.

**చతుర్విధబ్రహ్మవేత్తలు**— బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

**చతుర్విధభగవదనుభవములు**— 1కర్మప్రధానీభూతానుభవము, 2 జ్ఞానప్రధానీభూతానుభవము, 3 కర్మజ్ఞానో

భయ ప్రధానీభూతానుభవము, 4 కేవలానుభవము.

చతుర్విధ మంత్రయోగములు— అజప జప క్రియా స్మరణ రూప యోగములు

చతుర్విధ మహావాక్యములు— 1 అహంబ్రహ్మాస్మి 2 ప్రజ్ఞానంబ్రహ్మ 3 అయమాత్మాబ్రహ్మ 4 తత్త్వమసి

చతుర్విధముక్తులు— 1 సామీప్యము 2 సాలోక్యము, 3 సారూప్యము 4 సాయుజ్యము.

చతుర్విధ యోగాభ్యాసములు— మంత్ర లయ హఠ రాజయోగములు.

చతుర్విధ రథికులు— 1 అతిరథుడు, 2 సమరథుడు, 3 మహారథుడు 4 అర్థరథుఁడు

చతుర్విధరాజవిద్యలు— ఆన్వీక్షికి త్రయి వార్త దండనీతి

చతుర్విధ విరోధానుభవములు— పరేశస్వరూప స్వస్వరూప స్వధర్మ స్వరూప, ఫలస్వరూప, విరోధానుభవములు

చతుర్విధ వృత్తులు— కృషి, పాశుపాల్యము వాణిజ్యము సేవ — (2) కైశికి, ఆరభటి, భారతి సాత్వతి (ఇవి కావ్యవృత్తులు)

చతుర్విధ వృద్ధులు— కాయిక, కాలిక, కారిత, చక్రవృద్ధులు.

చతుర్విధ వేదస్వరములు— ఉదాత్త అనుదాత్త స్వరిత ప్రచయములు.

చతుర్విధ (వైరాగ్యములు)

శాంతులు— దుఃఖాభావము సర్వకామ్యావాప్తి కృతకృత్యత, ప్రాప్యత్వప్రాప్తి

చతుర్విధ శుశ్రూషలు — స్థానశుశ్రూష- (గురుని గృహారామక్షేత్రపశు ధనధాన్యాగలను రక్షించుట), అంగశుశ్రూష - (గురుని అభ్యంగన స్నాన పాదసంవాహ నాదికముచే సంతుష్టి పఱచుట) భావశుశ్రూష— (గురువే దైవము, తల్లితండ్రియని మనస్సున భావించుట) ఆత్మశుశ్రూష - (గురునకిష్టములగు పదార్థములను దెచ్చి హాని హృదయసంతుష్టి చేయుట)

చతుర్విధ శృంగారనాయకులు— 1 అనుకూలుఁడు (ఒకే నాయికయందు విశేషానురాగము గలవాఁడు) 2 దక్షిణుఁడు - (అనేక నాయికలయందు వైషమ్యము లేక స్నేహభావమున నుండువాఁడు) 3 ధృష్టుఁడు - (వ్యక్తమైన పరకాంతా గమనము గలవాఁడయ్యు నిర్భయముగా సంచరించువాఁడు) 4 శఠుఁడు - (రహస్యమునందు అప్రియము నాచరించువాఁడు).

చతుర్విధ సన్న్యాసులు— 1 కుటీచకుఁడు- (త్రిదండధారి) 2 బహూదకుఁడు- (త్రిదండధారి) 3 హంసుఁడు (ఏకదండధారి) 4 పరమహంసుఁడు- (దండాది శూన్యుఁడు)

చతుర్విధ సమాజగతానుశీలనములు—సద్గోష్ఠి మహోత్సవము, వైష్ణవ జగత్సమృద్ధి, వైష్ణవసంసారపత్తన నిర్యా

ణము జీవులకు వైష్ణవ ధర్మోపదేశ ప్రయత్నము

చతుర్విధ స్పర్శలు— మృదు, కఠిన, ఉష్ణ శీతలములు.

చతుర్విధాభినయములు —
1 ఆంగికము 2 వాచికము, 3 ఆహా ర్యము, 4 సాత్త్వికము.

చతుర్విధాగ్నులు —
1 భౌమాగ్ని (భూమియందుండు)
2 అభిందనాగ్ని (నీటిబుగ్గలందుండు),
3 ఔదర్యాగ్ని (జఠరమునందుండు),
4 ఆకరజాగ్ని (రత్నలోహాదులందుండు)

చతుర్విధానుభవములు-ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి శాబ్దము.

చతుర్విధానుభవహేతువులు—
1 ప్రత్యక్షము, 2 అనుమానము, 3 ఉప మానము, 4 శబ్దము.

చతుర్విధాభావములు— 1 ప్రాగ భావము, 2 ప్రధ్వంసాభావము, 3 అత్యంతాభావము 4 అన్యోన్యా భావము.

చతుర్విధాభినయములు— 1 ఆంగి కము 2 వాచికము, 3 ఆహార్యము, 4 సాత్త్వికము.

చతుర్విధావస్థలు— చూ. అవస్థా చతుష్టయము.

చతుర్విధాహారములు — భక్ష్యము, లేహ్యము, చోష్యము పానీయము. (నమలి తినఁదగినది నాకి తినఁ దగిన తేనె మొ. పీల్చి తిను ఫలాది కము, త్రాగఁదగిన పానకము మొ)

చతుర్వ్యూహములు— (పరమేశ్వరుని రూపములు) వాసుదేవ, ప్రద్యుమ్న అనిరుద్ధ సంకర్షణులు (మనోబుద్ధిచిత్తా హంకారములు పై నామములతో నొప్పును)

చతుర్వేదములు— 1 ఋగ్వేదము - (21 శాఖలు గలది) 2 యజుర్వేదము - (101 శా) 3 సామవేదము-(1009శా) 4 అథర్వణవేదము (9 శా)

చతుష్కళలు— ఆవాప, నిష్క్రామ, విక్షేప ప్రవేశములు, (నిశ్శబ్దమార్గ మున) ధ్రువ శమ్య తాళ సన్నిపాత, ములు (సశబ్దమార్గమున)

చతుష్పాదములు— (1) భ్రూమధ్య ము కంఠము హృదయము, నాభి (2) అవిద్యాపాదము సువిద్యాపాదము ఆనందపాదము తురీయపాదము, (3) జాగ్రత,స్వప్నము సుషుప్తి తురీయము

చతుష్షష్టికళలు— (64) ఇతిహాసము, ఆగమము, కావ్యము అలంకారము, నాటకము గాయకత్వము కవిత్వము, కామశాస్త్రము దురోదరము, దేశ భాషా లిపిజ్ఞానము, లిపికర్మము, వాచ కము అవధానము స్వరశాస్త్రము శాకు నము, సాముద్రికము రత్నశాస్త్రము, రథాశ్వగజకౌశలము మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము గంధవాద ము, ధాతువాదము ఖనివాదము, రస వాదము, జలవాదము, అగ్నిస్తంభము, ఖడ్గస్తంభము, జలస్తంభము, వాక్ స్తంభము, వయస్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము, కాలవంచ

నము, పరకాయ ప్రవేశము, పాదుకా సిద్ధి, వాక్సిద్ధి, ఐంద్రజాలికము, అంజనము, దృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్రౌషధాదిసిద్ధి, చోరకర్మము, చిత్రక్రియ, లోహక్రియ, అశ్మక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మక్రియ, అంబరక్రియ, అదృశ్యకరణము, దూతీకరణము, వాణిజ్యము, పాశుపాల్యము, కృషి, ఆసవకర్మము, ప్రాణిద్యూత కౌశలము.

చతుస్సమములు- చందనము, అగరు, కస్తూరి, కుంకుమ.

చరపంచకము—ఖేచరులు (దేవతలు, పక్షులు), భూచరులు (మనుష్యాదులు), వనచరులు (మృగాగలు), జలచరులు (మత్స్యాగలు), ధీచరులు (దేవతలు, జ్ఞానులు).

చర్యాపాదచతుష్టయము — చర్యాపాదము (భువిగలసమస్తదేవాలయములనుదర్శించుటకై సంచారముచేయుట) క్రియాపాదము - (ఇష్టదేవతల నారాధించుకొనుట), యోగిపాదము - (తన ఇష్టదేవతలను ధ్యానించుకొనుట), జ్ఞానపాదము - (సమస్తము తన యిష్టదేవతాస్వరూపముగా భావించి తద్వినాయితర పదార్థము లేదని నిర్ధారణ చేసికొనుట).

చాటుప్రబంధములు— 1 సద్గతి, 2 బద్ధళి, 3 విద్ధళి, 4 ఉత్ఫుల్లకము.

చాతుర్భద్రకములు— కౌంరి, అతివస, తుంగముస్తలు, తిప్పతీఁగె, (నేలవేము, కౌంరి, తుంగముస్తలు, తిపప తీగె).

చాతుర్మాస్యలు—ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజములు.

చాతుర్మాస్య హావిర్యజ్ఞములు— వైశ్వదేవ, వరుణప్రఘాస, సాకమేధ, సునాశీరములు.

చాతుర్యము లేక సంభవింపనివి— దేశాటనము, పండితమిత్రత, వారాంగన, రాజసభా ప్రవేశము, అనేక శాస్త్రార్థ విలోకనము.

చిత్తినికిఁ బ్రియతిథులు — విదియ, చవితి, పంచమి, షష్ఠి, అష్టమి. దశమి ద్వాదశి.

చిత్రమూలత్రయము—నల్ల, తెల్ల, ఎఱ్ఱచిత్రమూలములు.

చిత్రవస్త్రావస్థలు—ధౌతము, ఘట్టితము, లాంఛితము, రంజితము.

చిరంజీవి సప్తకము— 1 అశ్వత్థామ, 2 బలి, 3 వ్యాసమహర్షి, 4 హనుమంతుఁడు, 5 విభీషణుఁడు, 6 కృపాచార్యులు, 7 పరశురాముఁడు.

చైతన్య సప్తకము— చూ. సప్తవిధ చైతన్యములు.

ఛందస్సులు—ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి.

జంగమములు— ఉద్భిజ్జములు (మొలకలెత్తునవి - వృక్షాదులు), స్వేదజములు (చెమట వలనను, భూమితేమ వలనను బుట్టినవి - నల్లులు, దోమలు మొ॥ అండజములు (గ్రుడ్లనుండి పుట్టునవి - సర్పాదులు) జరాయుజములు (మావిలోఁ బుట్టునవి - మృగాదులు)

జంగమ విషములు— తేలు, జెఱ్ఱి, పాము, కుక్క, నక్కకాటులవిషము.

జంతు సామాన్యధర్మములు— ఆహారము, నిద్ర, భయము, మిథున కర్మము.

జకారపంచకము:— 1 జనని, 2 జన్మభూమి 3 జాహ్నవి 4 జనార్దనుఁడు, 5 జనకుఁడు.

జగన్నియామకపంచదేవతలు— 1 వాయువు, 2 సూర్యుఁడు, 3 అగ్ని, 4 ఇంద్రుఁడు, 5 మృత్యువు.

జలభేదములు—వాననీరు, సముద్రపునీరు, నదియందలినీరు, ఊఁట నీరు, నూతినీరు.

జాతుల విచారణము— బ్రహ్మముఖమున బ్రాహ్మణులును, బాహువులయందు క్షత్రియులును, ఊరువులయందు వైశ్యులును, పాదములయందు శూద్రులును జనించినట్లు పురాణప్రసిద్ధము. మఱికొందఱు జాతులు వృత్తులనుబట్టి వచ్చినవందురు.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతేద్విజః వేదపాఠంతు
విప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః.

జీరకద్వయము- జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ.

జీవపంచమూలములు— జీవకము, ఋషభకము, మేధ, మహామేధ, కాకోళి, (పిల్లిపీచర, పెద్దగమ్మడి,పాలకూర. జీవకము, వృషభకము)

జీవనిర్జీవ వ్యాధితనక్షత్రములు— సూర్యుఁడున్న నక్షత్రము మొదలు 7 నక్షత్రములు నిర్జీవములు. వానియందు సాహిత్యవిద్య ఆరంభింపరాదు. అటుపై 12 నక్షత్రములు సజీవములు. ఇవి మంచివి. మిగిలిన 8 నక్షత్రములు వ్యాధితములు. ఇవి మంచివి కావు.

జ్ఞానచతుష్టయము — శ్రవణము, చింతన, నిశ్చయము, నిష్ఠ.

జ్ఞానత్రయము— సంజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు. చూ. త్రివిధజ్ఞానములు.

జ్ఞానసాధన గ్రంథములు — వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, శాస్త్రములు, బ్రహ్మసూత్రములు. భగవద్గీత మొ.

జ్ఞానసాధనములు— (1) శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధి, శ్రద్ధ. (2) శ్రవణము, మననము, నిధి, ధ్యానము.

జ్ఞానేంద్రియపంచకము — త్వక్కు, చక్షువు, రసన, శ్రోత్రము, ఘ్రాణము.

జ్ఞానేంద్రియ విషయములు— త్వక్కు (చర్మము) నకుస్పర్శ, చక్షువు (కన్ను)నకు రూపము, రసన(నాలుక)కు రుచి, శ్రోత్రము (చెవి) నకు శబ్దము, ఘ్రాణము (ముక్కు) నకు గంధము.

జ్యేష్ఠాత్రయము— జ్యేష్ఠమాసములో

బుట్టిన జ్యేష్ఠానక్షత్రజాతకునకు జ్యేష్ఠ కన్యకను వివాహము చేయరాదు. 2 జ్యేష్ఠానక్షత్రజనితులకు జ్యేష్ఠమాసమున వివాహము కూడదు. 3 జ్యేష్ఠ (మొదటి) కన్యకకు జ్యేష్ఠ (మొదటి) కుమారునకును జ్యేష్ఠమాసములో వివాహము చేయరాదు. (వధూవరులిరువురును జ్యేష్ఠులే అయినచో జ్యేష్ఠ మాసమున వివాహము కూడదనట)

జ్యోతిష సిద్ధాంతములు— పరాశర, గర్గ, బ్రహ్మ, సూర్య వ్యాస, వసిష్ఠ, అత్రి, కాశ్యప, నారద, మరీచి, మను, అంగీరస, రోమక (లోమశ) పౌలిశ, చ్యవన, యవన, భృగు, శౌనక (సోమ) సిద్ధాంతములు. ఇటీవల శ్రీపతి, సత్యాచార్యుఁడు, వరాహమిహిరులు, గౌతముఁడు, కాళిదాసుఁడు, జైమిని, వేములవాడ భీమకవి,యవనాచార్యుఁడు మొ బ్రాసిరి.

తండ్రులు— తన్నుఁగన్నవాఁడు ఉపనయనము చేసినవాఁడు, చదువుచెప్పినవాఁడు, విపత్తునఁ గాపాడినవాఁడు, అన్నముపెట్టి పోషించినవాఁడు. (5)

తాపత్రయము— 1 ఆధ్యాత్మికము (తనదేహేంద్రియాదులకుఁ గలిగిన ఆధివ్యాధులచే దుఃఖించుట) ఆధి భౌతికము (తనకంటె నితరులైన భార్యాపుత్త్రులకు సంభవించిన యాధివ్యాధులకును, సర్ప వృశ్చికాది బాధలకును బరితపించుట) 3 ఆధి దైవికము (లోకమునకుఁ గలిగిన యత్యాతప, అనాతప, అతివృష్టి, అతి వాయువు మొ॥ వానివలని దుఃఖమును దనపైఁ బెట్టుకొనుట).

తామసవృత్తులు— మోహము, భయము, వివాదము, సుఖదుఃఖానుభవము.

తారాబలములు— జన్మతార, సంపత్తార, విపత్తార, క్షేమతార, ప్రత్యక్తార సాధనతార, నైధనతార, మిత్రతార, పరమమైత్రతార (9)

తాళదశప్రాణములు— కాలము, మార్గము, క్రియ, లింగము, జాతి, గ్రహము, కల లయ, యతి,ప్రస్తారము 10

తాళపంచకము— చతురశ్రము, త్రిశ్రము, మిశ్రము, ఖండము, సంకీర్ణము.

తిక్తపంచకము— 1 బిల్వము 2 చేఁగు పొట్ల 3 ములక, 4 తిప్పతీఁగె, 5అడ్డసరము.

తిథులు— పాడ్యమి, విదియ తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి అష్టమి, నవమి, దశమి, ఏకాదశి ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పౌర్ణిమ, (అమావాస్య).

తుషితులు— తోషుఁడు ప్రతోషుఁడు, సంతోషుఁడు, భద్రుఁడు, శాంతి, నిడస్పతి, కవి,విభుఁడు,వహ్ని,సుదేవుఁడు, లోచనుఁడు (ఆకూతి పుత్త్రిఁడగు యజ్ఞుఁడు, అతని సోదరియగు దక్షిణయు వీరి తల్లిదండ్రులు)

తృణపంచమూలములు— 1 వరి, 2 దర్భ, 3 జనపదంటు, 4 చెఱకు, 5 కామంచిగడ్డి.

త్రయోదశగుణములు— రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము,మోహము, మదము, మాత్సర్యము,

ఈర్ష్య, అసూయ, దర్పము, దంభము, అహంకారము.

త్రికంటములు—వాకుడు అగ్నిదమని, శేవటిదూలగోవిల.

త్రికటుకములు, త్రియూషములు—శొంఠి, పిప్పలి, మిరియాలు.

త్రికరణములు—1మనస్సు, 2వాక్కు, 3 కాయము.

త్రికర్మములు— పుణ్యకర్మము (వేదోక్తవిధచే జేయఁబడునది), పాపకర్మము, (విధి తప్పిసంచరించువారిచే నాచరింపఁబడునది), మిశ్రకర్మము, (విధ్యవిధులచేఁ జేయఁబడునది)

త్రికాలము లు— చూ. కాలములు. (ప్రాత ర్మధ్యాహ్న సాయంకాల ము లు)

త్రికూటములు—వాగ్భవ, కామరాజ, శక్తికూటములు.

త్రిక్షారములు— స్జ్జాక్షార, యవాక్షార - వెలిగారములు.

త్రిగంధములు— ఏలకులు, జాపత్రి, దాల్చినచెక్క.

త్రిగుణములు— 1 సత్త్వము, 2 రజస్సు, 3 తమము.

త్రిజాతములు—1 ఏలకులు, 2 లవంగ చెక్క, 3 లవంగపత్రి.

త్రిదండములు—మ నో ద ం డ ము, వాగ్దండము, కర్మదండము.

త్రిదోషములు—1 వాత, పిత్త, శ్లేష్మములు, 2 అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము.

త్రిపత్రములు— లవంగపత్రి, జాజిపత్రి, తాళిసపత్రి.

త్రిపదార్థములు—(అ ద్వై త ము న) ఈశ్వరుఁడు, ఆత్మ, ప్రకృతి, (ద్వైతమున) ఆత్మ, పరమాత్మ, జడము.

త్రిపుటములు — 1 జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు. 2 కర్తృ కారణ కార్యములు. 3 ద్రష్టృ దర్శన దృశ్యములు.

త్రిపుణములు— తాళకము, పల్లేరు, బటాణీలు.

త్రిపురాసురులు— (తారకాసురుని కుమారులు) 1 విద్యున్మాలి, 2 తారకాక్షుఁడు, 3 కమలాక్షుఁడు.

త్రిపురుషము— పితృ, పితామహ, ప్రపితామహులు.

త్రిఫలములు— 1 కరక, తాడి, ఉసిరికలు, 2 ద్రాక్ష, కాశ్మర్య, ఖర్జూరములు. 3జాజి, లవంగ, పూగఫలములు.

త్రిమతములు— చూ. మతత్రయము.

త్రిమదములు— విద్యామదము, ధనమదము, కులమదము (తేనె, శర్కర, నేయి.)

త్రిమూర్తులు—1 బ్రహ్మ, 2 విష్ణువు, 3 మహేశ్వరుఁడు.

త్రిలక్షణములు— 1 జహల్లక్షణ, 2 అజహల్లక్షణ, 3 జహదజహల్లక్షణము.

త్రిలవణములు—1 సైంధవము, 2 సౌవర్చము, 3 బిడాలవణము.

త్రిలింగములు— 1 శ్రీశైలము, 2దక్షారామము, 3 కాళేశ్వరము (తారక, మహాకాళ, హాటకలింగములు). (2) 1. ఇష్టలింగము, 2. ప్రాణలింగము, 3. భావలింగము. (3) 1 గురులింగము, 2. జంగమలింగము, 3. శివలింగము, చూ. లింగత్రయము.

త్రిలోకములు—1 స్వర్గము, 2 మర్త్యము, 3 పాతాళము లేదా 1 భూలోకము, 2 భువర్లోకము, 3 సువర్లోకము.

త్రివర్గము— 1 ధర్మము, అర్థము, కామము, 2సత్త్వము, రజస్సు తమము, 3 క్షయము, స్థానము, వృద్ధి.

త్రివిధ అభ్యాస యోగములు — ప్రాకృతము, వైకృతము, కుంభకము.

త్రివిధ కర్మములు — సంచితము- జీవుఁడు ప్రతి జన్మయందును ఆర్జించుచు రాగా గుట్టలుగాఁబడిన పుణ్యపాపకర్మల సమూహము; ప్రారబ్ధము- జీవుని సంచితమునుండి ఈశ్వరుఁడు ఈ జన్మమున నీ పుణ్యపాపకర్మ లనుభవింపుమని పంచిపెట్టుట, ఆగామి— జీవుఁడు తాను ధరించి యుండెడు శరీరముద్వారా మరణకాలపర్యంతము చేసిన పుణ్యపాప కర్మముల సమూహము శరీరమును విడచినతోడనే వెనుకటిజన్మములయందు అనుభవింపఁగా మిగిలినవానితోఁ గలియుట, 2 నిత్యకర్మ - సంధ్యావందనాదికము, నైమిత్తికకర్మ - శ్రాద్ధాదికము, కామ్యకర్మ - పుత్రేష్టి మొ॥ (3) పుణ్యకర్మ, పాపకర్మ, మిశ్రకర్మ.

త్రివిధ కారణములు— నిమిత్త, సమవాయ, అసమవాయ కారణములు.

త్రివిధ కావ్యములు—గద్యమయము, పద్యమయము, ఉభయమయము,

త్రివిధ క్రియలు —మణిమంత్రౌషధములు (తపము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము).

త్రివిధ గతులు — ఊర్ధ్వ, మధ్య అధోగతులు

త్రివిధజపములు — 1 వాచకము, 2 ఉపాంశువు, 3 మానసికము.

త్రివిధ జీవావస్థలు — 1 విశ్వత, 2 తైజసత, 3 ప్రాజ్ఞత.

త్రివిధ జీవులు— 1 విశ్వుఁడు, 2 తైజసుఁడు, 3 ప్రాజ్ఞుఁడు.

త్రివిధ జ్ఞానప్రతిబంధకములు — 1 సంశయము, 2 అసంభావన, 3 విపరీత భావన.

త్రివిధ జ్ఞానములు— 1 సంజ్ఞానము, (పద పదార్థజ్ఞానము), 2 విజ్ఞానము, (పద పదార్థజ్ఞానాంతరమునఁ గలిగిన యభిప్రాయవిశేషము), 3 ప్రజ్ఞానము- (బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము). ప్రపంచశాస్త్ర, బ్రహ్మ జ్ఞానములు. 1 పతిజ్ఞానము, (ఓంకారమునందలి అకారమును పతిగా గుర్తించుట) 2 పాశజ్ఞానము, (ఓంకారమందలి ఉకారమే జగద్రూపపాశమని గుర్తించుట) 3 పశుజ్ఞానము (ఓంకారమందలి మకారమే జీవరూప పశువుగా గుర్తించుట).

త్రివిధ తాదాత్మ్యములు — కర్మజన్య, సహజ, భ్రాంతిజన్యములు.

త్రివిధ దానములు— 1 పిండ ప్రదానము-(తండ్రి తాతముత్తాతలకుఁ జేయునది) 2 లేపప్రదానము-(ముత్తాతతండ్రి, ముత్తాత తాత, ముత్తాత ముత్తాతలకు పిండప్రదానమున చేతులకంటుకొనిన మెతుకులదానము), 3 ఉదకదానము-(ముత్తాత ముత్తాతపైన యేడుతరముల వారికి యిచ్చుదానము). 4 ఉత్తమ, మధ్యమ, అధమ దానములు.

త్రివిధ దీక్షలు— వేధ, మను, క్రియా దీక్షలు (2) సమయ, విశేష, నిర్వాణ దీక్షలు.

1. దృగ్దీక్ష— (చేప గ్రుడ్లనుపెట్టి వానిని దిరిగిచూచిన బిడ్డలగును. అట్లే యుపదేశకాలమున గురువు శిష్యుని అపరోక్ష సాక్షాత్కార బ్రహ్మభావము కలవాఁడగునా కాఁడా యని వీక్షించుట.)

2. స్పర్శదీక్ష— (పక్షులు గ్రుడ్లను బెట్టి వానిని ఱెక్కలచే నాచ్ఛాదనము చేసియుండిన నవి బిడ్డలగును. అట్లే గురువు తన్నాశ్రయించిన శిష్యుని శరీరమును హస్తముచే నిమురుట).

3. వాగ్దీక్ష—(భ్రమరముమంటి-గోనుండి పురుగును దీసికొనిపోయి దాని చెవిలోఁ గూసికూసి తన రూపమువలెఁ జేసికొనునట్లు గురువు బోధచేసి శిష్యుని దనవలెఁ జేసికొనుట).

త్రివిధ నాడులు— 1 ఇడానాడి (ఇది కైలాసగిరి) 2 పింగళనాడి (ఇదిమంథరగిరి) 3 సుషుమ్నానాడి (ఇది మహామేరువు), (2) 1 వాతము 2 పైత్యము 3 శ్లేష్మము.

త్రివిధ నాయికలు— 1 ముగ్ధ (ఉదయించుచున్న యౌవనమును, లజ్జయు గల స్త్రీ), 2 మధ్య (సగము వీడిన లజ్జ గల యౌవనవతి) 3 ప్రౌఢ(సిగ్గువిడిచిన సంపూర్ణయౌవనవతి).

త్రివిధ పరమేశ్వరపరికరములు— అధికార, భోగ, లయ పరికరములు.

త్రివిధ పరమేశ్వరలక్షణములు— 1 సత్తు, 2 చిత్తు, 3 ఆనందము.

త్రివిధ పితృదేవగణము— వసు, రుద్ర, ఆదిత్యగణములు.

త్రివిధ ప్రకృతిగతానుశీలనములు— దేశగత, కాలగత, ద్రవ్యగతములు.

త్రివిధ ప్రకృతులు— పర, అపర, పరాపర.

త్రివిధ ప్రతిబంధములు — భూత, భావి, వర్తమానములు.

త్రివిధ ప్రసాదములు— 1 శుద్ధము, (గురుభుక్తశేషము), 2 సిద్ధము (ఈశ్వర భుక్తశేషము) 3 ప్రసిద్ధము (భగవద్భక్తుల భుక్తశేషము).

త్రివిధ ప్రాణాయామములు— పూరకము, కుంభకము, రేచకము.

త్రివిధ బుద్ధులు— సాత్త్విక, రాజస, తామసములు.

త్రివిధ బౌద్ధమత ధర్మములు— బుద్ధం, బోధం, సంఘం, శరణం గచ్ఛామి.

త్రివిధ భక్తులు— 1 బాహ్యము, (పరోక్షజ్ఞానమునకు), అనన్యము (అపరోక్షజ్ఞానమునకు), 3 ఏకాంతము (నిశ్చయజ్ఞానమునఁ గలుగు నిత్యానందమునకును కారణము లగును)

త్రివిధ భగవదనుభవములు— స్వరూపగత శక్తిగత, క్రియాగత, భగవదనుభవములు.

త్రివిధ మండలములు— సూర్య చంద్రాగ్ని మండలములు.

త్రివిధ మనోయోగములు— హఠ, లంబికా, రాజయోగములు.

త్రివిధ మాయలు — 1. అవిద్య, 2. ఆవరణ, 3 విక్షేపము.

త్రివిధ ముక్తులు— 1. క్రమముక్తి, 2. జీవన్ముక్తి, 3. విదేహముక్తి.

త్రివిధ యోగాభ్యాసకులు— 1. ఆరురుక్షులు 2 ఆరురోహులు, 3. ఆరూఢులు

త్రివిధ యోగశాస్త్రగ్రంథులు- బ్రహ్మ విష్ణు రుద్రగ్రంథులు.

త్రివిధ రతులు—1 మందవేగము, 2. మధ్యవేగము, 3. చండవేగము.

త్రివిధ రసాభాసలు—1 భార్యాభర్తలలో నొకరికిమాత్రమే యనురాగము గలిగి యుండుట, 2. తిర్యఙ్మ్లేచ్ఛగత శృంగారము, 3. కాంతకు బహునాయకాసక్తి.

త్రివిధ రాజయోగములు—1. సాంఖ్యము, 2. తారకము, 3 అమనస్కము.

త్రివిధ రీతులు — వైదర్భి, గౌడి, పాంచాలి.

త్రివిధ లక్ష్యలక్షణములు - లక్షణదోషములు— చూ. లక్షణత్రయము, లక్ష్యత్రయము.

త్రివిధ లక్ష్య లక్ష్యార్థములు— అతివ్యాప్తి, అవ్యాప్తి అసంభవము.

త్రివిధ వాసనలు — 1 లోకవాసన, 2. శాస్త్రవాసన, 3. దేహవాసన.

త్రివిధ విరక్తులు— 1. ఐహికము, 2 ఆముష్మికము, 3. మిశ్రమము.

త్రివిధవీరరసములు— యుద్ధ, దాన, దయా వీరరసములు.

త్రివిధ వ్యాధులు — వాత, పిత్త, శ్లేష్మములు.

త్రివిధ శక్తులు — ప్రభు మంత్రోత్సాహములు. లేదా ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు.

త్రివిధ శరీరములు— (1) వ్యష్టి, సమష్టి, కారణశరీరములు. (2) స్థూల, సూక్ష్మ, కారణశరీరములు.

త్రివిధ శాస్త్రగంథములు— (1) ప్రభుసమ్మితములు (వేదశాస్త్రాదికము) (2) మిత్రసమ్మితములు (పురాణేతిహాసములు) (3) స్త్రీ సమ్మితములు (కావ్య నాటకాలంకారములు). (2) సాంఖ్యము, పాతంజలీయము, వేదాంతము.

త్రివిధ సంగీతస్థాయులు— మంద్ర, మధ్య, తారకములు.

త్రివిధ సంస్కారములు—1 వేగము, 2. భావన, 3. స్థితస్థాపకము.

త్రివిధ సమాసములు—1. సాంస్కృతికము, 2. ఆచ్ఛికము, 3. మిశ్రమము.

త్రివిధ సూత్రములు — 1. జైమిని సూత్రములు, (కర్మకాండము-పూర్వమీమాంస), 2. బ్రహ్మసూత్రములు, (వ్యాసకృతములు - ఉత్తరమీమాంస), 3 మతసూత్రములు (ఆపస్తంబ, ఆశ్వలాయన, కాత్యాయన కర్తృకములు).

త్రివిధ స్త్రీలు—1.తృప్త, 2. అతృప్త, 3. తృప్తాతృప్త.

త్రివిధస్థానములు—నాభి, హృదయ, భ్రూమధ్యములు.

త్రివిధ స్వరములు— 1. ఉదాత్తము, అనుదాత్తము,స్వరితము 2. హ్రస్వము, దీర్ఘము, ప్లుతములు.

త్రివిధాత్మలు—గౌణ,మిథ్య, ముఖ్యాత్మలు.

త్రివిధాద్వైతములు— భావాద్వైత, క్రియాద్వైత, ద్రవ్యాద్వైతములు.

త్రివిధాధారములు —ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకము.

త్రివిధానందములు—బ్రహ్మానందము, వాసనానందము, విషయానందము.

త్రివిధాలంకారములు—శబ్దనిష్టములగు అనుప్రాసాదులు, అర్థనిష్టములగు ఉపమాదులు. శబ్దార్థనిష్టములగు పునరుక్తవదాభాసాదులు.

త్రివిధేంద్రియములు - జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతరింద్రియములు (మనోబుద్ధ్యహంకారములు)

త్రివిధేచ్ఛలు-1. స్వేచ్ఛ, 2. పరేచ్ఛ, 3. అనిచ్ఛ.

త్రివిధేషణములు - దారేషణ, (భార్య మొదలగు స్త్రీలయందలి యాశ), పుత్రేషణ (కుమారులయందలియాశ), ధనేషణ (ద్రవ్యమందలి యాశ).

త్రివిధోత్పాతములు— 1 దివ్యము, 2. అంతరిక్షము, 3 భౌమము.

త్రివృత్తులు— 1. శాంత, ఘోర, మూఢ, వృత్తులు. 2. వైరాగ్య, ఉపశాంతి, వివేకవృత్తులు. 3 మనో, వివేక, అఖండాకార వృత్తులు.

త్రిసంధ్యలు — ప్రాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్ణము.

త్రిసమములు- కరక, శొంఠి,తిప్పతీఁగె.

త్రిస్థానములు— నాభి, హృదయ, భ్రూమధ్యములు (యోగశాస్త్రము).

త్రేతాగ్నులు-1. జఠరాగ్ని, దావాగ్ని, బడబాగ్ని, 2 ఆహవనీయము, దక్షిణాగ్ని గార్హపత్యము, 3. పావకుఁడు, పవమానుఁడు, శుచి (వీరు వసిష్ఠశాపమున శిఖండికిఁ బుట్టినవారు)

త్వక్పంచకము— మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, ప్రబ్బచెట్ల బెరడు.

దండనత్రయము— 1. వధించుట, 2. ధనము హరించుట, 3. పీడించుట.

దండవ్యూహములు—ప్రకోదరము, దృఢకేశము, శ్వావత్తు, శ్వావత్కుక్షి, ప్రతిష్ఠము, సుప్రతిష్ఠము, ధ్యానము, విజయము, సంజయము, విశాలము, అవిజయము, సూచి, స్థూణాకర్ణము, చమూముఖము, రథాస్యము, వలయము, దుర్జయము.

దంతక్షతములు—ఉచ్ఛూనకము కోల చర్చితము, ఖండాభ్రకము, ప్రవాళ మణి, బిందుకము, మణిబిందుమాలిక మూఢకము.

దంతరోగములు —దాలనము క్రిమి దంతము, దంతహర్షము, కరాళము దంతచాలనము, దంతశర్కర అధితము, శావదంతము, దంతభేదము, కలిపా కము. (10)

దశకషాయమూలములు - నల్లఉప్పి, తెల్లఉప్పి, కోలాకుపున్న, ముయ్యాకు పున్న, చిత్రమూలము, సీతాఫలము, చేదుపొట్ల, వావిల, వరగోకి నేల ఉసిరిక.

దశకుమారులు—1 రాజవాహనుఁడు, 2. మంత్రగుప్తుఁడు, 3. మిత్రగుప్తుఁడు, 4 ప్రమతి 5. విశ్రుతుఁడు, 6. ఉప హారవర్మ, 7. అపహారవర్మ, 8. పుష్పో ద్భవుఁడు, 9. అర్థపాలుఁడు 10 సోమ దత్తుఁడు.

దశక్షారములు-1. మునఁగ, 2. ముల్లంగి దుంప, 3. మోదుగ, 4. చింత, 5. అల్లము, 6. చిత్రమూలము,7. వేఁప, 8. గుమ్మడు, 9. ఉత్తరేణి, 10. వాకుఁడు.

దశదానములు— 1. గోదానము, 2. భూదానము, 3. తిలదానము, 4. హిరణ్యదానము. 5. ఆజ్యదానము, 6. వస్త్రదానము, 7. ధాన్యదానము, 8. గుడదానము, 9. రౌప్యదానము, 10. లవణదానము.

దశదిశలు-8 అష్టదిక్కులు, 9. ఊర్ధ్వ దిశ, 10. అధోదిశ.

దశదేవతాభేదములు — నవదేవతా భేదములు+భూతములు.

దశప్రజాపతులు — నవబ్రహ్మలు, వాయుదేవుడు.

దశప్రళయములు-వృత్తి, అవస్థ, శరీర, మను, బ్రహ్మ, విష్ణు, రుద్ర మహే శ్వర, సదాశివ, విరాట్పురుషప్రళయ ములు.

దశప్రాణములు — (సంగీతశాస్త్రము)- కాల, మార్గ, క్రియ, గ్రహ, జాతి, లఘు, లయ, కళ, అంగ, యతి ప్రాణములు.

దశబలములు—1. బుద్ధి, 2 క్షాంతి, 3. వీర్యము, 4. ధ్యానము, 5. జ్ఞానము, 6. కృప, 7. శీలము, 8. బలము, 9. దానము, 10. ఉపేక్ష.

దశభాస్కరక్షేత్రములు - వారణాసి, పుష్పగిరి కాంచి, నివృత్తి, అలంపురి, శ్రీశైలము, విరూపాక్షము, శ్రీరామ సేతు, గోకర్ణ, దశభాస్కర క్షేత్ర ములు.

దశమూత్రములు— ఏనుఁగు, దున్న, ఒంటె, ఆవు, మేక, గొఱె, గుఱ్ఱము గాడిద, స్త్రీ, పురుషుల మూత్రములు.

దశ మూలములు — 1. చిన్నములక, 2. పెద్దములక, 3. నక్కతోఁకపొన్న, 4. ముయ్యాకుపొన్న, 5. పల్లేరు, 6. మారేడు, 7. కూరవెల్లి, 8. గుమ్ముడు, 9. దుందిలము, 10. కలిగొట్టు.

దశ రంధ్రములు — నాసికారంధ్రములు 2, నేత్రములు 2, కర్ణములు 2, మూత్రద్వారము 1, మలద్వారము 1, వాక్కు 1, బ్రహ్మరంధ్రము 1. మఱియు స్త్రీలకు స్తనరంధ్రములు 2 ను, గర్భమార్గమున 1 యు అధికముగాఁ గలవు.

దశ రూపకములు — 1. నాటకము - (ప్రఖ్యాతమితివృత్తము. ధీరోదాత్తుఁడు నాయకుఁడు-వీర శృంగారరసములలో నొకదానికి మాత్రమే ప్రాధాన్యము), 2. ప్రకరణము - (ఉత్పాద్య మితివృత్తము. ధీరశాంతుఁడు నాయకుఁడు. శృంగారరసమునకుమాత్రమే ప్రాధాన్యము), 3. భాణము (ఉత్పాద్య మితివృత్తము. ధూర్తవిటుఁడునాయకుఁడు. శృంగారవీరరసముల సూచనా మాత్రపారత), 4. ప్రహసనము (కల్ప్యమితివృత్తము. పాషండ ప్రభృతులు నాయకులు. హాస్యరసప్రధానము)5.డిమము-(ప్రఖ్యాత మితివృత్తము. ధీరోద్ధతులగు దేవగంధర్వపిశాచాదులు 16 గురు నాయకులు), 6. వ్యాయోగము - (ప్రఖ్యాతమితివృత్తము. ధీరోద్ధతుఁడు నాయకుఁడు. వీరరసప్రధానము), 7 సమవాకారము - (దేవాసురాదులు 12 గురు నాయకులు. ఇతివృత్తము కల్పితమును, ప్రసిద్ధమును గావచ్చును. వీరరస ప్రధానము), 8 వీథి-(కల్పిత మితివృత్తము. నాయకుఁడు ధీరోద్ధతుఁడు, శృంగార రసమునకు సూచనామాత్రపారత), 9. అంకము - (ప్రఖ్యాతమితివృత్తము. నాయకుఁడు ప్రాకృతజనుఁడు. కరుణరసము ప్రధానము), 10. ఈహామృగము (మిశ్రమితివృత్తము. నాయకుఁడు ధీరోదాత్తుఁడు. శృంగారరసమునకు ఆభాసత్వము).

దశ లకారములు — (వ్యాకరణ శాస్త్రము) లట్, లిట్, లుట్, ల్ఌట్, లేట్, లోట్, లఙ్, లిఙ్, లుఙ్, ల్ఌఙ్.

దశవిధ కావ్యగుణములు— శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సుకుమారత, సమత, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజను, సమాధి.

దశవిధ గమకములు — 1. ఆరోహణము, 2. అవరోహణము, 3. ఢాలు, 4. స్ఫురితము, 5. కంపితము, 6. ఆహతము, 7. ప్రత్యాహతము, 8. త్రిపుశ్చము, 9. ఆందోళనము, 10. మూర్ఛన.

దశవిధ గుణములు— కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, దంభ, దర్ప, ఈర్ష్యా, అసూయలు.

దశవిధ తాళప్రాణములు— కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము.

దశవిధ ధాతువులు— భ్వాది, అదాది, జుహోత్యాది, దివాది, స్వాది, తుదాది, రుధాది, తనాది, క్ర్యాది, చురాది.

దశవిధ నాడులు — 1. ఇడానాడి - (చంద్రనాడి) (ఇది ముక్కునకు ఎడమ భాగమున నుండును. శివుఁడుఅధిదేవత), 2.పింగళనాడి-(సూర్యనాడి)ముక్కునకు

కుడిభాగమున నుండును, విష్ణు వధి దేవత), 3. సుషుమ్న నాడి-(అగ్ని నాడి) (ముక్కు మధ్యభాగమున నుండును, బ్రహ్మ అధిదేవత), 4. గాంధారినాడి- (కుడి నేత్రమందుండును, ఇంద్రుఁ డధి దేవత), 5. అస్తినినాడి-(నాలుకయందు ను, వామ నేత్రమందును ఉండును వరుణుఁ డధిదేవత), 6. పుషానాడి - (కుడిచెవియం దుండును, దిగ్దేవత అధి దేవత), 7. పయస్విని నాడి - (ఎడమ చెవియందుండును, బ్రహ్మ అధిదేవత). 8. అలంబసనాడి - (ఇది శిశ్నమున నుండును, అగ్ని అధిదేవత) 9. లకుహ నాడి-(గుదస్థానముననుండును, భూమి అధిదేవత), 10. శంఖినీనాఁడి- (నాభి స్థానముననుండును, చంద్రుఁడధిదేవత).

దశవిధ నాదములు—1 జలనాదము, భేరీనాదము,మృదంగనాదము, ఘంటా నాదము, కౌహాళనాదము, కింకిణీ నాదము, వేణునాదము, భ్రమరనాద ము, ఓంకారనాదము, శంఖనాదము. (2) (చిణి, చిణిచిణీ, శంఖ, వేణు, వీణా, తాళ, ఘంటా, భేరి, మృదంగ, మేఘ నాదములని కొందఱి మతము.)

దశవిధ నామాపరాధములు—
1. సాధునింద, 2. శివాది దేవతలు భగ వంతునికంటె స్వతంత్రులని చెప్పుట, 3. గుర్వవజ్ఞ, 4. వేదశాస్త్రాదుల నింద, 5. హరినామ స్మరణయందు నిర్లక్ష్య భావము, 6. హరినామమునకు అర్థాం తరకల్పనము చేయుట, 7. హరినామ బలముచే పాపకార్యము లొనరించుట, 8. హరినామముతో నితర శుభకర్మలకు సమత్వము జెప్పుట, 9. శ్రద్ధలేనివారికి నామోపదేశము చేయుట, 10 నామ మహత్త్వము విన్నను నామమునఁ బ్రీతి లేకపోవుట.

దశవిధ నియమములు— 1. తపము, 2. సంతోషము, 3. ఆస్తికత్వము, 4. దానము, 5. భగవదర్చన, 6. వేదాంత శ్రవణము, 7. లజ్జ, 8. మతి, 9. జపము, 10. వ్రతము.

దశవిధ నిషిద్ధాచారములు—
1. బహిర్ముఖజనసంగము,2.అనుబంధము 3. మహారంభాద్యుద్యమము. 4. బహు గ్రంథకళాభ్యాసము, 5. వ్యాఖ్యాన వాదము, 6.కార్పణ్యము,శోకాదులకు వశీభూతుండగుట, 7. అన్యదేవతల నవ మానపఱచుట, 8. సకలభూతములకు నుద్వేగము కలిగించుట, 9. సేవాప రాధ నామాపరాధములు, 10. భగ వంతునిగాని, భాగవతుని గుఱించి గాని చేయు నిందకు అనుమోదన ప్రేరణలు.

దశవిధ పాపములు— చూ. పాపదశకము.

దశవిధ పుణ్యకర్మములు- 1. పరోప కారము, 2 గురుజనసేవ, 3. దానము, 4. అతిథ్యము, 5. పావిత్ర్యము, 6. మహోత్సవము, 7. వ్రతము, 8.పశు పాలనము, 9. జగద్వృద్ధి, 10. న్యాయా చరణము.

దశవిధ ప్రళయములు— 1. వృత్తి, 2. అవస్థ, 3. శరీర, 4. మను,5. బ్రహ్మ, 6. విష్ణు, 7. రుద్ర, 8. మహేశ్వర, 9. సదాశివ, 10 విరాట్పురుష ప్రళయ ములు.

దశవిధ బాణాగ్రములు —1. ఆరాముఖము, 2. ద్విభల్లకము, 3. వత్సదూతము, 4 కర్ణికము,5. కాకతుండము, 6. క్షురప్రము, 7. గోపుచ్ఛము, 8. అర్ధచంద్రము, 9. సూచీ ముఖము, 10. భల్లము.

దశవిధబ్రహ్మకళలు—సృష్టి, బుద్ధి, స్మృతి, మేధ, కీర్తి, లక్ష్మి, ధృతి, స్థితి, స్థిర, సిద్ధికళ.

దశవిధ బ్రాహ్మణులు - పంచగౌడులు, పంచ ద్రావిడులు.

దశవిధమన్మథావస్థలు—చూచుట, మనస్సంగమము, తలంపు, జాగరము కృశించుట, అన్యవస్తు విముఖత్వము, సిగ్గు లేమి, ఉన్మాదము, మూర్ఛ, చావుకు తెగించుట.

దశవిధ రుద్రకళలు—తీక్ష్ణ, రౌద్రి, భయ, నిద్ర, తంద్రి క్షుత్తు, క్రోధిని, క్రియ, ఉద్గారిణి, మృత్యుకళ,

దశవిధ విష్ణుకళలు—జర, పాలిని, శాంతి, ఈశ్వరి, రతి, కామిక, వరద, హ్లాదిని, ప్రీతి, దీర్ఘ.

దశవిధ శాస్త్రలక్షణములు—
1. స్వరము, 2. వర్ణము, 3. పదము, 4. ధాతువు, 5. కృత్తులు, 6. తద్ధితములు, 7. కారకము, 8. సమాసము, 9. సంధి, 10. సంజ్ఞ.

దశవిధసంస్కారములు —1. గర్భాధానము, 2.పుంసవనము 3 సీమంతము, 4. జాతకర్మ, 5 నామకరణము, 6.అన్నప్రాశనము, 7. కర్ణవేధ, 8. కేశఖండనము, 9. అక్షరస్వీకరణము, 10. ఉపనయనము.

దశవిధసద్గుణములు — 1. సత్యము పలుకుట, 2. మంచిమాటలాడుట, 3.హితములుచెప్పుట, 4. ప్రయోజనముగాc బలుకుట (ఇవివాక్సద్గుణములు) 5. తీర్థయాత్రలు సలుపుట, 6తపస్సుచేయుట, 7. దానము నిచ్చుట (శారీరక సద్గుణములు) 8. సద్భక్తి, 9. నిరాశ, 10. తపశ్చింత (మానసికసద్గుణములు).

దశవిధాగ్నికళలు—ధూమ్రము, అర్చి, జ్వలిని, జ్వాలిని, విస్ఫులింగిని, సుశ్రీ, స్వరూపము, కపిల, హవ్యవాహనము, కవ్యవాహనము.

దశావతారములు — 1. మత్స్య, 2. కూర్మ, 3 వరాహ, 4 నారసింహ, 5. వామన, 6 పరశురామ,7. శ్రీరామ, 8. బలరామ, 9. బౌద్ధ, 10. కల్క్యవతారములు.

దశోపనిషత్తులు—ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు.

దహనపంచకము—నల్లజీడి, చిత్రమూలప్రయోగము మహిసాక్షియంటించుట, యగ్నిచే వాతపెట్టుట, తేలు కుట్టుట.

దానద్వయము—తాను గా నిచ్చుట, ఇతరులచేత నిప్పించుట.

దానపంచకము— సంప్రాప్తము, ఉత్సర్గము, సంప్రాప్త ధనోత్సర్గము, స్వయంగ్రాహము, ప్రతిమోక్షము.

దానములు—తనకుంగల ధనమంతయు నిచ్చుట, ఎక్కడనేని ధనము తీసి

కొన్నచో దానికిఁ దానుకూలుఁడై యుండుట, అపూర్వవస్తువులనిచ్చుట, ఒకనిధనముఁ బుచ్చుకొనఁ బ్రవర్తింపఁ జేయుట, అప్పుతీర్చుట.

దానవులు— కశ్యపునకుఁదనువునందుఁ గలిగిన సంతతి. వీరు నూర్గురు. ద్విమూర్ధుఁడు, శంకుకర్ణుఁడు, హయశిరుఁడు, అయోముఖుఁడు, శంబరుఁడు, కపిలుఁడు, వామనుఁడు,మారీచి, మఘవంతుఁడు, ఇల్వలుఁడు,స్వమణుఁడు,విక్షోభనుఁడు, కేతువు, కేతువీర్యుఁడు, శతహ్రదుఁడు,మహాబలుఁడగుతారకుఁడు, వైశ్వానరుఁడు,పులోముఁడు, విద్రావణ మహాశిరుఁడు, స్వర్భానువు, వృషపర్వుఁడు, విప్రజిత్తిమొ॥స్వర్భానువునకుఁ బ్రభయుఁ, బులోమునకుశచియు హయశిరునకుపదానవియు, వృషపర్వునకు శర్మిష్ఠయుఁ బుత్రికలు. పులోమ కాలకలు వైశ్వానరునకుఁ బుత్రికలై మారీచునకు భార్యలైరి. పులోమయంగుఁగలిగినవారుపౌలోములు (60,000). కాలకయందుఁ గల్గిన సంతతి కాలకేయులు (1,400). వీరు హిరణ్యపుర నివాసులు.శతహ్రదునకుమూఁకుఁడు, హుండుఁడుకల్గిరి. సుందునివలనఁదాటకయందు మారీచుఁడుకల్గెను. సంహ్రాదునకు గొప్ప తపఃఫలులగు నివాతకవచులనఁబడు(3,00,00,000) మూఁడు కోట్లమందిరాక్షసులుపుట్టిరి. వీరు మణిమతీపుర నివాసులు.

దివ్యపంచకము— 1. తులాదివ్యము, 2. అగ్నిదివ్యము, 3. జలదివ్యము, 4. విషదివ్యము, 5. కోశదివ్యము.

దివ్యవనములు—మేరువున కుత్తరమున నందనము, తూర్పునఁ జైత్రరథము, దక్షిణమున గంధమాదనము, పశ్చిమమున వైభ్రాజమును కలవు.

దీపక పంచకము— కసివెంద, చిత్రమూలము, వామము, అజామోదము, జీలకఱ్ఱ.

దీప్యక షట్కము—కుంకుమ పూవు, గ్రంధితగరము, చిత్రమూలము,జీలకఱ్ఱ నిమ్మ, మయూరశిఖ.

దుఃఖ భాగులు—ఈర్ష్యాళువు, జుగుప్సావంతుఁడు, నిస్సంతోషి, క్రోధనుఁడు, నిత్యశంకితుఁడు, పరభాగ్యోపజీవి.

దుఃఖ ద్వయము—వ్యాధి దుఃఖము, ఆధి దుఃఖములు.

దుర్గ చతుష్టయము— పర్వత, వన, ప్రాకార, సముద్ర దుర్గములు.

దుర్గాత్రయము— నల్లసుగంధి, వీలి చెట్టు, కోయిల దింతెన.

దుర్లభ్యములు— ప్రియ వచనములతోడిదానము,గర్వరహితమైన జ్ఞానము, క్షమాసహితమైన శౌర్యము, త్యాగయుక్తమైన విత్తము.

దుష్టచతుష్టయము —దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు, శకుని.

దూతీచతుష్టయము—1. పారిక, 2. చతురిక, 3. సహసంచారిక, 4. దూతిక.

దృష్టిభేదములు-- సమము (ఱెప్పపాటు లేకుండునట్లుచూచుట), ఆలోకితము.(త్వరగా కనుబొమ్మలను చక్రా

కారముగాఁ ద్రిప్పి వ్యక్తముగాఁ జూచుట), సాచి - (దృష్టిస్వస్థానమందే నిలిచి కడకంటివఱకుఁ జలనక్రమమున చలించుట), ప్రలోకితము - (చూపులు రెండుప్రక్కలకడవఱకు కదలించుట), నిమీలితము (సగముకన్ను దెఱచుట), ఉల్లోకితము -(దృష్టిని పైకి ప్రసరింపఁ జేసి క్రిందికి వంచుట), అనువృత్తము - (అతిశీఘ్రముగా క్రిందు మీఁదుగాఁ జూచుట) అవలోకితము (క్రిందుగాఁ జూచుట) (8)

దేవతరువులు— మందారము, కల్పవృక్షము, పారిజాతము, సంతానము, హరిచందనము.

దేశములు— అంగ, వంగ, కళింగ, కర్ణాటక, కేరళ, కామరూప, గౌడ, వనవాస, కుంతల, కొంకణ, మగధ, సౌరాష్ట్ర, మాళవ, లాట, చోట, వరాట, శబర, కుకుర, కురు, అవంతి, పాండ్య, మద్ర, సింహళ, ఘూర్జర, పారసీక, మిథిల, పాంచాల, శూరసేని, గాంధార,చాళుక్య,హైహయ, తౌళవ, సాల్వ, పుండ్రక, ప్రాగ్జ్యోతిష మత్స్య, చేది, బర్బర, నేపాళ, గౌళ, కాశ్మీర, కన్యాకుబ్జ, విదర్భ, ఖురసాణ, మహారాష్ట్ర, కోసల, కేకయ, అహిచ్ఛత్ర, త్రిలింగ, ప్రయాగ, కరహాటక, కాంభోజ, భోజ, చోళ, హూణ, కాశీ దేశములు.

దేశ్యక్రియలు— ధ్రువకము, సర్పిణి, కృష్యము, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాకము, పతిత.

దేహత్రయము— స్థూల, సూక్ష్మ కారణదేహములు.

దేహసప్తాశయములు—వాత, పిత్త, శ్లేష్మ, రక్త, ఆమ, పక్వ, మూత్రాశయములు. (స్త్రీలకు గర్భాశయము స్తన్యాశయము ఎక్కువగానుండును).

దోషములు — (అలంకారిక దోషములు) అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయోజనము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము, అన్యార్థము, అప్రతీతము, అవిమృష్టవిధేయాంశము, విరుద్ధమతికృత్తు, అశ్లీలము, పరుషము.

దోహదములు— అశోకమునకుఁ బాదతాడనము,బొగడకుముఖసీధువు,గోరంటకు ఆలింగనము, బొట్టుగునకు వీక్షణము, మామిడికి గరస్పర్శము, సంపెంగకు ముఖరాగము, కొండగోగునకు సల్లాపము, వావిలికి ఊర్పు, మోరటికిఁ బాట, సురపొన్నకు నవ్వు మొ॥

ద్రవపంచకము— గురివెంద, వెలిగారము, తేనె, నేయి, బెల్లము.

ద్రవ్యావస్థాపంచకము— సమస్త ద్రవ్యములును, రస,గుణ,వీర్య, విపాక, ప్రభావములను నైదవస్థలు కలిగి యుండును.

ద్రావకద్వయము—1. గంధక ద్రావకము, 2. పెట్లుప్పు ద్రావకము.

ద్వంద్వములు—మంచి చెడ్డలు, పాపపుణ్యములు, తప్పొప్పులు, ఇహపరములు, ఉచ్చనీచములు,రాత్రింబవళ్లు, తల్లిదండ్రులు, న్యాయాన్యాయములు, సంకోచవికాసములు, సుఖదుఃఖములు,

నామరూపములు, ఆరోపాపవాద ములు.

ద్వాదశకూటము— 1. దినము, 2. గణము, 3. మాహేంద్రము, 4. స్త్రీ దీర్ఘము, 5. యోని, 6. రాశి, 7. రాశ్యధిపుఁడు, 8. వశ్యము, 9. రజ్జువు, 10. వేధ, 11. వర్ణకూటము, 12. నాడీకూటము.

ద్వాదశ జ్యోతిర్లింగములు— 1. సోమనాథము, 2. మల్లికార్జునము, 3. మహాకాళము, 4. ఓంకారము, 5. వైద్యనాథము, 6. భీమశంకర లింగము, 7. రామేశలింగము, 8. నాగేశలింగము, 9. విశ్వేశలింగము, 10. త్ర్యంబకలింగము, 11. కేదార లింగము, 12. ఘుసృణేశలింగము.

ద్వాదశ దానములు— 1 ఔషధ దానము, 2. విద్యాదానము, 3. అన్న దానము, 4. పంథాదానము, 5. ఘట్ట దానము, 6. గృహదానము, 7. ద్రవ్య దానము, 8. కన్యాదానము, 9. కూప తటాకాదుల మూలమున జలదానము, 10. మార్గస్థ వృక్షములవలన ఛాయా దానము, 11. ఉపయుక్తస్థలములందు దీపదానము, 12. వస్త్రదానము.

ద్వాదశ భావములు— 1. లగ్నము, 2. ధనభావము, 3. భ్రాతృభావము, 4. సుఖభావము, 5. పుత్త్రిభావము, 6. శత్రుభావము, 7. కళత్రభావము, 8. ఆయుర్భావము, 9. పితృభావము, 10. రాజ్యభావము, 11. లాభభావము, 12. వ్యయభావము.

ద్వాదశ మలములు — శ్రోవ్వ, శేతస్సు, నెత్తురు, మెదడు, మూత్రము, విష్ఠ (మలము), గులిమి, గోరు, తెమడ, కన్నీరు, కంటిపుసి, చెమట (కొందఱు చీమిడి పదమూఁడవ మలమందురు.)

ద్వాదశ మండలములు— 1. అరి 2. మిత్రుఁడు, 3. మిత్ర మిత్రుఁడు, 4. అరిమిత్ర మిత్రుఁడు, 5. పార్ష్ణిగ్రాహుఁడు, 6. ఆక్రందుఁడు 7. ఆక్రందాసారుఁడు, 8. పార్ష్ణి, 9. గ్రాహాసారుఁడు, 10. విజిగీషుఁడు, 11. మధ్యముఁడు, 12. ఉదాసీనుఁడు.

ద్వాదశ లవణములు-1. కాల్కేరియా ఫ్లోర్, 2. కాల్కేరియా ఫాస్, 3. కాల్కేరియా సల్ఫ, 4. ఫెర్రం ఫాస్, 5. కాలీమూర్, 6. కాలీఫాస్, 7. కాలీసల్ఫ, 8. మెగ్నీషియాఫాస్, 9. నేట్రంమూర్, 10. నేట్రంఫాస్, 11. నేట్రంసల్ఫ, 12. సైలీషియా. (ఈ ద్వాదశలవణ చికిత్సలు డాక్టరు విల్‌హెల్మ్ హెన్‌రల్ ష్యూస్లరు 19 వ శతాబ్దమున కనుగొనెను)

ద్వాదశ సత్వాలు — దేవ, మనుజ, నాగ, యక్ష, గంధర్వ, పిశాచ, కాక, వానర, గార్దభ, ముని, రాక్షస, కిన్నర సత్వాలు.

ద్వాదశ సరోవరములు— మందర, అచ్ఛోద, లోహింద, మానస, శైలోద, బిందుసార, శయాన, విష్ణుపాద, చంద్రప్రభ, పయోద, ఉత్తరమానస, రుద్రకాంత సరస్సులు.

ద్వాదశ సూర్యకళలు — తపిని, తాపిని, ధూమ్ర, మరీచి, జ్వాలిని,

రుచికల, సుషుమ్న, భోగద, విశ్వకల, బోధిని, ధారణి, క్షమ.

ద్వాదశాదిత్యులు— 1. ఇంద్రుఁడు, 2. ధాత, 3. పర్జన్యుఁడు, 4. త్వష్ట, 5. పూష, 6. అర్యముఁడు, 7. భగుఁడు, 8. వివస్వంతుఁడు, 9. విష్ణువు, 10. అంశుమంతుఁడు, 11. వరుణుఁడు, 12. మిత్రుఁడు, (కశ్యపునకదితియందుఁ గలిగిన తుషితు లనఁబడు దేవతలు.)

ద్వాదశావస్థలు — 1. చక్షుః ప్రీతి, 2. మనస్సంగము, 3. సంకల్పము, 4. ప్రలాపము, 5. జాగరము, 6. కార్శ్యము, 7. అరతి, 8. లజ్జాత్యాగము, 9. సంజ్వరము, 10. ఉన్మాదము, 11. మూర్ఛ, 12. మరణము.

ద్వాదశాళ్వారులు — పొయిఘ, పూదత్త, పేయ, పెరియ, నమ్మ, తిరుమంగ, తిరుమడిశ, తొండరడిప్పొడి, మధురకవి, నాథముని, కులశేఖర, తిరుప్పాణి యాళ్వారులు.

ద్విగుణములు— స్వతంత్రము, అస్వతంత్రము.

ద్విముఖములు - 1. గండభేరుండపక్షి, దుందుభము.

ద్విలవణములు — 1. సైంధవము, 2. సౌవర్చము.

ద్వివిధ జ్ఞానములు — 1. పరోక్షము (భగవంతుని దన కంటె నన్యునిగా భావించి యుపాసించుట) 2. అపరోక్షము (తానే పరమాత్మగానుండుట) మఱియొకవిధమైనవి- 1. వృత్తిజ్ఞానము, 2. స్వరూప జ్ఞానము.

ద్వివిధ భగవదనుభవములు— మహిమజ్ఞానరూపానుభవము, 2. కేవల జ్ఞానరూపానుభవము.

ద్వివిధ మార్గములు—1. ధూమాది మార్గము (ఇష్టాపూర్తకర్మములుచేయువారు ధూమాది మార్గమున చంద్రలోకమును బొందుదురు.) 2. అర్చిరాది మార్గము (వైరాగ్యోపశాంతి వృత్తులు గలవారు ఈ మార్గమున సూర్యలోకమును బొందుదురు). ఈ మార్గము వైకుంఠ కైలాసాదులకుఁ బోవును.

ద్వివిధ యోగములు—1. సగుణయోగము (భగవంతుని పాదము మొదలుకొని శిరస్సుపర్యంతము సకలావయవములు గలవాఁడనియుఁ, గిరీట కుండల కేయూరాది దివ్యాభరణ సహితుఁడని యు ధ్యానించుట.) 2. నిర్గుణ యోగము (భగవంతుఁడు నామరూప రహితుఁడని ధ్యానించుట).

ద్వివిధవాదములు— అధ్యారోపము, అపవాదయుక్తి (సంవాదము, వివాదము).

ద్వివిధ వృత్తులు— 1. సంకల్పము, (మనస్సునందు ముందుగాఁ దోచినది), 2. వికల్పము-(పిమ్మట సంకల్పమునకు వ్యతిరేకముగాఁ దోఁచినది.) మఱియొకవిధమైనవి - 1. అన్వయవృత్తి, 2. వ్యతిరేకవృత్తి.

ద్వివిధ సంగీతము— 1. మార్గము, 2. దేశి.

ద్వివిధ సృష్టులు—1. యుగపత్సృష్టి (ఆకాశాది పంచభూతములను బ్రహ్మ

విష్ణు, సూర్యాది గ్రహములను, ఏక కాలమునసృష్టించుట), 2. క్రమసృష్టి (బ్రహ్మాదుల వలనఁ గ్రమముగా సృష్టించుట). మఱియొక విధమైనవి- 1. ఈశ్వరసృష్టి, 2. జీవసృష్టి.

ద్వివిధాత్మలు—1 జీవాత్మ (అంతః కరణము-ప్రతిబింబము - అధిష్ఠానము - దేహత్రయము-అజ్ఞానము- అధ్యాసము అనెడి ఆఱింటితోఁ గూడినది.) 2 పరమాత్మ (సర్వాధిష్ఠానపరబ్రహ్మము).

ద్వివిధాయుధములు- 1 అస్త్రములు, 2 శస్త్రములు.

ద్వివిధాఽవిద్యలు— 1 మూలావిద్య (ఈశ్వరునియందుఁ గలిగినది.) 2తూలావిద్య (జీవునియందుండెడి అవిద్య).

ధనగతులు—1 దానము, 2 భోగము, 3 నాశము.

ధనదాయాదులు— 1 ధర్మము, 2 అగ్ని, 3 నృపుఁడు, 4 తస్కరుఁడు.

ధనిష్ఠా పంచకము—ధనిష్ఠ, శతభిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

ధనుర్వేదాంగములు-చారి, స్థానము, న్యాసము, ప్రవిచారము, సౌష్ఠవము, కరణము, వ్యాయామము, మండలము, గతి, ఆసనము. (10)

ధమనులు— నాభినాశ్రయించి యుండెడి రసవాహినులనుబోలు నాడులు వాతమును బూరించునటులఁజేయుటచే నవి ధమనులనఁబడును. 10 అధోగాములు, 10 ఊర్ధ్వగామినులు, 4 తిర్యక్కుగాఁ బ్రసరించునవిగ నుండును.

ధర్మదేవతాచతుష్టయము— అహింస, సత్యము, దయ, శాంతి.

ధర్మద్వయము—సన్యాస, గార్హస్థ్యములు.

ధర్మపంచకము — జాతి, ఆశ్రమ, మత, దేశ, గుణధర్మములు.

ధాతువులు—అకర్మకములు (శ్లో. వృద్ధి క్షయ భయ జీవితమరణం లజ్జాసత్తాస్థితి జాగరణ॥ శయన క్రీడారుచిదీప్త్యర్థం ధాతుగణంతమకర్మకమాహుః). సకర్మకములు (పూర్వోక్తములగు అకర్మక భిన్నధాతువులు.) లడాదులు (లట్, లిట్, లుట్, లృట్, లేట్, లోట్, లఙ్,విధిలిఙ్, ఆశీర్లిఙ్, లుఙ్,లృఙ్.) లోహములు (సువర్ణము Gold, రౌప్యము Silver, తామ్రము, Copper, వంగము Tin, సీసకము Lead, అసదము Zinc, లోహము Iron).

ధాన్యపంచకము—1. మారేడు పిందెలు, 2. వట్టివేరు, 3. ధనియాలు, 4. శొంఠి, 5. తుంగముస్తెలు.

ధూపదశాంగములు — వట్టివేళ్ళు, మంచిగంధము, గుగ్గిలము, మహిసాక్షి, కర్పూరము,అగరు, కచ్చూరము, తుంగముస్తెలు, సాంబ్రాణి, ఆవునేయి - ఈ పది సమభాగములుగల చూర్ణము.

ధ్యానచతుష్టయము— పదస్థ, పిండస్థ, రూపస్థ, రూపాతీతధ్యానములు.

నక్షత్రభేదములు— (ఆకాశచక్రమునందలి రాజులకు ఉత్తరమునసున్న నక్షత్ర సమూహము 25 రాసులుగా విభ

జింపఁబడియున్నది.) -బృహదృక్షము, లఘుఋక్షము, కాళీయము, వృషపర్వుఁడు,ధూతపము, ఉత్తరముకుటము, శౌరి, స్వరమండలము, రాజహంస, శర్మిష్ఠ, యయాతి, సారథి, భుజగధారి, సర్పము,శరము,గరుడుఁడు, శార్ఙ్గపాణి, అశ్వముఖము, ఉచ్చైశ్శ్రవము, దేవయాని, త్రిభుజము, కరభము, విశ్వకద్రువు, జంబుకము, హృదయము, (దక్షిణముననున్న నక్షత్రసమూహము 18 రాసులుగా విభజింపఁబడినది.)—తిమింగలము, మృగశీర్షము, ఖగోళము, యమున, శశము, బృహల్లుబ్ధకము, లఘులుబ్ధకము, నౌక, వాసుకి, చషకము, ధ్వాంక్షము, నరాశ్వము, వృకము, పీఠము, దక్షిణము, కుటము, దక్షిణమత్స్యము, శృంగాశ్వము, పారావతము, స్వస్తికము.

నక్షత్రములు—(27) అశ్వని (గుఱ్ఱపుఁజుక్క), భరణి (యోనివంటిచుక్క), కృత్తిక (మంగలకత్తి రూపురిక్క), రోహిణి (బండిరిక్క), మృగశిర (జింకతల చుక్క), ఆర్ద్రి (పగడపురిక్క), పునర్వసు(పాదరిండ్లచుక్క), పుష్యమి (తొండరూపు రిక్క), ఆశ్రేష (అసిలేరురిక్క), మఖ (జన్నపు రిక్క), పుబ్బ (పుబ్బరిక్క), ఉత్తర (ప్రాగ్దురిక్క), హస్త (కైచాటుచుక్క), చిత్త (ముత్తెపుసవతురిక్క), స్వాతి (కరువలిరిక్క) విశాఖ (చాటురిక్క), అనూరాధ (చెలిమిచుక్క), జ్యేష్ఠ (తాటిరిక్క), మూల (అంకుసంబుమాద్రిరిక్క), పూర్వాషాఢ (నీటిరిక్క), ఉత్తరాషాఢ (ఏచకంటిరిక్క), శ్రవణము (కరివేల్పురిక్క), ధనిష్ఠ (మద్దెలరూపురిక్క), శతభిషము (నీటిరేని రిక్క), పూర్వాభాద్ర (ఎనిమిదికాళ్ళ చుక్క), ఉత్తరాభాద్ర (ముక్కంటిచుక్క), రేవతి (మీనురూపుచుక్క), అభిజిత్తు (బొమ్మచుక్క), నక్షత్రము కలదందురు.

నఖక్షతములు—వర్ధిష్ణుత, అనువినుత, మృదుత, ఉజ్జ్వలత, నిరేఖత, స్ఫుటత, (అర్ధచంద్రము,ఘురితము, ఉత్పలపత్రము, ఆచ్ఛురితకము, ఊరువు, కంఠము, కక్షము).

నదులు—అనుతప్త,శిఖి, విపాశ, త్రిదివ, క్రముపు, అమృత,సుకృతలు (ఇవిజంబూద్వీపమందలి మహానదులు), శ్రోణి, తోయ, నితృష్ణ, చక్ర, శుక్ర, విమోచని, నివృత్తిలు (ఇవి శాల్మల ద్వీపమందలి మహానదులు); ధూతపాప, శివ, పవిత్ర, సమ్మతి, విద్యుత్తు, మహి, చాన్యలు (ఇవి కుశద్వీపమందలి మహానదులు); గౌరి, కుముద్వతి, సంధ్య, రాత్రి, మనోజవ, ఖ్యాతి, పుండరీకలు, (ఇవిక్రౌంచద్వీపమందలి మహానదులు); సుకుమారి, కుమారి, నలిని, రేణుక, ఇక్షువ, ధేనుక,గభస్తులు (ఇవిశాకద్వీపమందలి మహానదులు; పుష్కరద్వీపమున నదులులేవు.)

గంగ, గోదావరి, కృష్ణ, కావేరి, తపతి, నర్మద, సింధు, సువర్ణముఖి, యమున,బ్రహ్మపుత్ర,మహానది, ఉత్తరపినాకిని, పాలారు, దక్షిణపినాకిని, తామ్రపర్ణి, ఐరావతి (ఇవి హిందూదేశమందలినదులు); థేమ్సు (ఇంగ్లండులో నది); లోయర్, రైన్, సీన్, రోన్, పో, డేన్యూబ్, వాల్గా, డెన్యేపర్, (ఇవి యూరప్ ఖండమందలి

నదులు); ఓబి, యెనిసి, లీనా, అమూర్, హో యాంగ్ హో, యాంగ్ టి సిక్యాంగ్, మేకాంగ్, ఐరావతి, టైగ్రిస్, యూఫ్రెటీస్ (ఇవి ఆసియా ఖండమందలి నదులు); నైల్, నైజర్, కాంగో, జాంబిసి (ఇవి ఆఫ్రికా ఖండములోనివి) సెనిగాల్, ఆరెంజ్, కొలరెడో, మిస్సోరి, మిస్సిసిపి, ఓహియో, సెంట్ లారెన్సు, అమెజాన్, యూకన్, నెల్సన్, ఫ్రేజర్, ఒరినాకో, పెరిక్వే, ఉరుగ్వే (ఇవి అమెరికా ఖండములోనివి) ముర్రే, డార్లింగు మొ. (ఇవి ఆస్ట్రేలియా ఖండమున గలవు).

నరకములు (18) —కూటసాక్షి, పక్షపాతి, అసత్యవాది, భ్రూణహంత, గోఘ్నుఁడు, ఉచ్ఛ్వాసనిరోధకుఁడు, మొ. రౌరవనరకము నొందుదురు; సురాపానము చేయువాఁడు, బ్రహ్మహంత, సువర్ణహర్త, వారికి స్నేహితుఁడైన వాఁడును సూకరనరకమునఁ బడుదురు; క్షత్త్రియులను, వైశ్యులను, రాజభటులను వధించువాఁడును, సోదరితో సంగమించువాఁడును, గురుతల్పగుండును, తప్తలోహనరకమును బొందుదురు; కోడలినిగాని, కుమార్తెనుగాని కూడువాఁడు మహాజ్వాల నరకమునఁ బడును; పరదూషకుఁడును, గురువు నవమానించువాఁడును, వేదదూషకుఁడును, వేదవిక్రయుఁడును, పొందరాని స్త్రీని బొందువాఁడును, శబల మను నరకము నొందుదురు. మర్యాదా హీనుఁడును, చోరుఁడును విమోహమునఁ బడుదురు; దేవబ్రాహ్మణులను, పితరులను ద్వేషించువాఁడు కృమిభక్ష్యమను నరకమునఁ బడును; దుష్టుల నాశించి యాగాదులు చేయువాఁడు కృమీశ నరకమునఁ బడును; పితృదేవతలను, దేవతలను, అతిథులను సత్కరింపక భుజించువాఁడు లాలాభక్ష్యమను నరకమునఁ బడును. శరకర్తయు, వేధకుఁడును, రంధ్రాన్వేషకుఁడును, ఖడ్గాది యుద్ధసాధన కర్తయు విశసన మను నరకమునఁ బడుదురు; పట్టరాని దానము పట్టువాఁడును, అనర్హులచే యాగములచేయించువాఁడును, తెలియకయే జ్యోతిశ్శాస్త్రము తెలిసినట్లు నటించువాఁడును అధోముఖమను నరకమునఁ బడుదురు; ఒంటరిగా మృష్టాన్నభోజనము చేయువాఁడును, లక్క, పాదరసము, మాంసము, ఉప్పు, నువ్వులు, విక్రయించువిప్రుండును, కృమిపూయమను నరకమును బొందుదురు; నాటకోపజీవియు, చేపలుపట్టువాఁడును, కుండలయందన్నము తినువాఁడును, విషము పెట్టువాఁడును కుట్టుపనివాఁడును, తన భార్య వ్యభిచారమువలన జీవించువాఁడును, పర్వములందు స్త్రీలతో సంగమించు వాఁడును, ఇండ్లకు నిప్పుపెట్టువాఁడును, మిత్రఘ్నుఁడును, శకునములు చెప్పువాఁడును, గ్రామపురోహితుఁడును, రుధిరాంధ మను నరకమునఁ బడుదురు; కల్లునమ్మువాఁడును, గ్రామములను నాశనము చేయు వాఁడును, తేనెపట్టులను దీయువాఁడును, వైతరణీనరక

మునఁ బడుదురు; రేతఃపానము చేయు వాఁడును, మర్యాద నతిక్రమించి వర్తించువారును, శౌచములేనివారును, మోసముచే జీవించువారును, కృచ్ఛ్ర మను నరకమును బొందుదురు; అనవసరము గాఁ జెట్లనునఱకువారు అసిపత్రవన మను నరకమునఁ బడుదురు; గొఱ్ఱెల మందలను జెంచువారును, వేటగాండ్రును, వహ్నిజ్వాల మను నరకమునఁ బడుదురు, వ్రతలోపము చేయువారును, స్వాశ్రమభ్రష్టుఁడును సందంశ మను నరకమును బొందుదురు; పగటి వేళను, స్వప్నముల యందును, రేత స్ఖలనము గావించు బ్రహ్మచారియు, పుత్రులచేఁ జదివింపఁబడు తండ్రులును శ్వభోజనమునఁ బడుదురు.

నవకావ్యగుణములు:— 1. శ్లేష, 2. మాధుర్యము, 3. సౌకుమార్యము, 4. సమత, 5. అర్థదీపనము, 6. ఔదార్యము, 7. కాంతి, 8. ఓజస్సు, 9. సమాధి.

నవ ఖండములు:—1. భరతఖండము, 2. ఇంద్రఖండము, 3. పురుఖండము, 4. గభస్తిఖండము, 5. నాగఖండము, 6.తామ్రఖండము, 7.వారుణఖండము, 8. సౌమ్యఖండము, 9. గంధర్వఖండము (పురుఖండమునకు "చరుఖండ" మనియు నామ్నాయము.)

నవ గ్రహములు :— 1. సూర్యుఁడు, 2. చంద్రుఁడు, 3. అంగారకుఁడు, 4. బుధుఁడు, 5. బృహస్పతి, 6.శుక్రుఁడు 7. శని, 8. రాహువు, 9. కేతువు.

నవచక్రములు:—1. త్రైలోక్యమోహనము, 2. సర్వాశా పరిపూరకము, 3. సర్వసంక్షోభణము, 4. సర్వసౌభాగ్యదాయకము, 5. సర్వార్థసాధకము, 6. సర్వరక్షాకరము, 7. సర్వరోగహరము, 8. సర్వసిద్ధిప్రదాయకము, 9. సర్వానందదాయకము. (ఇవి శ్రీచక్రము లోనివి).

నవ తత్త్వములు:—1. జీవ, 2. అజీవ, 3. అస్రవ, 4. బంధ, 5. సంవర, 6. నిర్జరి, 7. మోక్ష, 8. పుణ్య, 9. పాప తత్త్వములు.

నవతాళాంగములు :— ద్రుతము, అనుద్రుతము, లఘువు, గురువు, కాకపాదము, ప్లుతము, విరామము, శేఖరము, లఘుశేఖరము.

నవ దేవతాగణములు — ఆదిత్య, విశ్వదేవ, వసు, తుషిత, భాస్వర, అనిల, మహారాజిక, సాధ్య, రుద్రగణములు.

నవ దేవతాయోనులు— 1 విద్యాధరులు, 2 అప్సరులు. 3 యక్షులు, 4. రాక్షసులు, 5. గంధర్వులు, 6.కిన్నరులు, 7. పిశాచులు, 8. గుహ్యకులు, 9. సిద్ధులు.

నవ ద్రవ్యములు-1. పృథివి, 2.అప్పు, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము, 6. కాలము, 7. దిక్కు, 8. ఆత్మ, 9. మనస్సు.

నవధాన్యములు— 1. వడ్లు 2. ఉలవలు, 3. పెసలు, 4. మినుములు, 5. నువ్వులు, 6. గోధుమలు, 7. అనుములు, 8. కందులు, 9. సెనగలు.

నవ నిధులు— 1. మహాపద్మము, 2. పద్మము, 3. శంఖము, 4. మకరము, 5. కచ్ఛపము, 6. ముకుందము,

7. కుందము, 8 నీలము, 9 వ ము. (ఖర్వ)

**నవబ్రహ్మలు**— (1) మరీచి, భరద్వాజుఁడు, ఆంగీరసుఁడు పులస్త్యుఁడు, పులహుఁడు, కృతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, వామదేవుఁడు (భరద్వాజ, వామదేవులకు మారుగా 'అత్రి భృగువు' లను గ్రహింతురు కొందరు ) (2) బాల, కుమార, అర్క, వీర, విశ్వ, తారక, గరుడ, స్వర్గ, పద్మ బ్రహ్మలు.

**నవభక్తులు**— 1 పరీక్షిత్తు, 2 నారదుఁడు 3 ప్రహ్లాదుఁడు, 4 భార్గవి, 5 పృథుఁడు 6 అక్రూరుఁడు 7 గరుత్మంతుఁడు 8 ధనంజయుఁడు, 9 బలిచక్రవర్తి.

**నవ రంధ్రములు**— నేత్రములు 2, శ్రోత్రములు 2, నాసారంధ్రములు 2, ముఖరంధ్రము 1, మలమూత్రవిసర్జన రంధ్రములు 2

**నవ రత్నములు**— 1. వజ్రము, 2. వైడూర్యము, 3 గోమేధికము, 4. పుష్యరాగము, 5. మరకతము, 6. మాణిక్యము, 7. నీలము, 8. ప్రవాళము, 9. ముత్యము.

**నవరసములు**— శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, బీభత్స, భయానక, రౌద్ర, శాంత రసములు.

**నవ వర్షములు**— భద్రాశ్వము, అష్ట వర్షములు. చూ. నవఖండములు.

**నవవిధ దశలు**—రవి, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతు దశలు.

**నవవిధప్రేమోదయావస్థలు**— 1. శ్రద్ధ, 2 సాధుసంగము, 3. భజనక్రియ 4 అనర్థనివృత్తి 5. నిష్ఠ, 6. రుచి, 7. ఆసక్తి, 8 భావము, 9 ప్రేమ.

**నవవిధభక్తులు**—1 శ్రవణము, 2. కీర్తనము, 3. స్మరణము, 4 పాదసేవనము, 5. అర్చనము, 6. వందనము, 7. దాస్యము, 8. సఖ్యము, 9. ఆత్మ నివేదనము.

**నవవిధ భావుక లక్షణములు** — 1. క్షాంతి. 2. అవ్యర్థకాలత్వము, 3. విరక్తి, 4 మానశూన్యత, 5. ఆశాబంధము, 6 సముత్కంఠత, 7 నిరంతర నామగానాసక్తి, 8. కృష్ణగుణాఖ్యానాసక్తి 9 కృష్ణ వసతిస్థలప్రీతి.

**నవవిధ మంత్రాంగములు**— 1. ఋషి, 2 ఛందము, 3. దైవతము, 4 శక్తి, 5. బీజము, 6. కీలకము, 7. వినియోగము, 8. అంగన్యాసవిధి, 9. హృదిన్యాసవిధి

**నవవిధరతిధ్వనులు** —1. హుంకృతి, 2 సీత్కృతి 3 ఉత్కృతి 4 ఫూత్కృతి, 5. కృశితము 6. రోదనము 7 స్తనితము 8 మణితము, 9 ఘూత్కృతి

**నవవిధసంబంధములు** —పితృపుత్ర, రక్ష్యరక్షక, శేషిశేష భర్తృభార్యా, జ్ఞాతృజ్ఞేయ, స్వస్వామి, శరీరశరీర, ఆధారాధేయ, భోక్తృభోగ్యసంబంధములు.

**నవవిధ స్థాయీభావములు**— 1. రతి, 2. ఉత్సాహము, 3. శోకము, 4. అచ్చెరువు, 5. నవ్వు, 6 భయము, 7. జుగుప్స, 8. శమము, 9. రోషము.

నవవిధస్నాతకులు — సంతానము కొఱకుఁ బెండ్లి చేసుకొనదలఁచి ధనమును యాచించువాఁడు, తనధనమును యాగాదులందు బ్రాహ్మణుల కిచ్చి దరిద్రుఁడై ధనమును గోరువాఁడు, యజ్ఞార్థముధనమును యాచించువాఁడు, గురుదక్షిణకొరకు ధనమును కోరువాఁడు, బాటసారి, రోగి, ఆలుబిడ్డల పోషణమునకై ధనమును యాచించువాఁడు, బీదల యన్నదానము నిమిత్తము యాచించువాఁడు, వేదపఠనమునకై వలయు సౌకర్యములు కోరువాఁడు.

నవవ్యాకరణములు —1. పాణినీయము 2. కలాపము, 3. సుపద్మము, 4. సారస్వతము, 5. ప్రాతిశాఖ్యము, 6. కుమారవ్యాకరణము, 7 ఐంద్రము, 8. వ్యాఘ్రభౌలికము, 9. శాకటాయనము.

నవారణ్యములు — సైంధవ, దండక, నైమిశ, కురు, జాంగల, ఉత్పలావృత, జంబూమార్గ, పుష్కర, హిమాలయ పర్వతారణ్యములు.

నాగసహస్రకము — (కశ్యపునకుఁ గద్రువయందుఁగల్గిన సహస్ర సంఖ్యాకమగు సంతతి) శేష, వాసుకి, తక్షక, ఐరావత, మహాపద్మ, కంబళ, అశ్వతర, శంఖ, కర్కోటక, ధనంజయ, మహానీల, ఐలాపత్ర, మహాకర్ణ, ధృతరాష్ట్ర, బలాహక, కుహర, పుష్పదంష్ట్ర, దుర్ముఖ, సుముఖ, శంఖపాల, కపిల, నహుష, మణి, శంఖ రోమాదులు.

నాటికలు — చూ. అష్టాదశనాటికలు.

నాదములు — చూ. దశవిధనాదములు.

నామనక్షత్రములు—

| | |
|---|---|
| చూ, చే, చో, ల | —(అశ్విని) |
| లీ, లూ, లే, లో | —(భరణి) |
| అ, ఈ, ఊ, ఏ | —(కృత్తిక) |
| ఓ, వా, వీ, వూ | —(రోహిణి) |
| వే, వో, కా, కి | —(మృగశిర) |
| కూ, ఖ, ఙ, ఛా | —(ఆర్ద్ర) |
| కే, కో, హా, హీ | —(పునర్వసు) |
| హూ, హే, హో, డా | —(పుష్యమి) |
| డీ, డూ, డే, డో | —(ఆశ్లేష) |
| మా, మీ, మూ, మే | —(మఖ) |
| మో, టా, టీ, టూ | —(పుబ్బ) |
| టే, టో, పా, పీ | —(ఉత్తర) |
| పూ, ష, ణా, ఢా | —(హస్త) |
| పే, పో, రా, రీ | —(చిత్త) |
| రూ, రే, రో, తా | —(స్వాతి) |
| తీ, తూ, తే, తో | —(విశాఖ) |
| నా, నీ, నూ, నే | —(అనూరాధ) |
| నో, యా, యీ, యూ | —(జ్యేష్ఠ) |
| యే, యో, బా, బీ | —(మూల) |
| బూ, ధా, భా, ఢా | -(పూర్వాషాఢ) |
| బే, బో, జా, జి | —(ఉత్తరాషాఢ) |
| జూ, జే, జో, ఖా | —(శ్రవణం) |
| గా, గీ, గూ, గే | —(ధనిష్ఠ) |
| గో, సా, సీ, సూ | —(శతభిషము) |
| సే, సో, దా, దీ | —(పూర్వాభాద్ర) |
| ద, శా, ఝా, థా | -(ఉత్తరాభాద్ర) |
| దే, దో, చా, చీ | —(రేవతి) |

నాయకచతుష్టయము- అనకూలుడు. దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు (ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు.)

నాయక చతుష్టయ సఖులు—
విటుఁడు, విదూషకుఁడు పీఠమర్దుఁడు, చేటుఁడు.

నాయికాత్రయము— 1. స్వీయ, 2. పరకీయ, 3. సామాన్య, (స్వీయ నాయికలు త్రివిధము) ముగ్ధ, మధ్య, ప్రౌఢ, (పరోఢ, కన్య యని పరకీయ నాయిక ద్వివిధము) ఱెముగ్గురు నాయికలును ప్రత్యేకము. ఉత్తమ, మధ్య మాధమభేదముచేఁ త్రివిధములగుదురు.

నాయికాష్టకము — చూ. అష్టవిధ నాయికలు.

నారీతీర్థములు— సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భారద్వాజ, సౌరభేయి, వంద, సమీచి, బుద్బుద, లత అను అప్సర స్త్రీలు శాపవశమున మొసళ్లై అర్జునునిచే శాపవిమోచనము కావింపఁబడిన ఘట్టములు.

నాశ్యపంచకము — అవిద్య, అస్మిత, అనురాగము, అభినివేశము, ద్వేషము.

నిద్రాకాలప్రమాణములు—
4 సం ల వారికి 12 గంటలనిద్ర కావలెను; 7 సం ల వారికి 11 గం; 9సం ల వారికి 10 గం. 16 సం ల వరకు.

నియమపంచకము — 1. శౌచము, 2. సంతోషము, 3. తపస్సు, 4. స్వాధ్యాయము, 5. ఈశ్వరప్రణిధానము.

నిర్గుండీద్వయము — 1. నల్లవావిలి, తెల్లవావిలి.

నివాతకవచులు—సంహ్రాదుఁడు గొప్పతపమువలనఁ బొందిన మూఁడు కోట్ల (3,00,00,000) రాక్షసులు. (మణిమతీపుర నివాసులు) వీరినర్జునుఁడు సంహరించెను.

నిశ్శబ్దక్రియలు—ఆవాపము, విక్షేపము, విక్షేపము, ప్రవేశము.

నెలలు—1. చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశీర్షము, పుష్యము,మాఘము, ఫాల్గుణము. 2. జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రియల్, మే, జూన్, జూలై, ఆగష్టు, సెప్టెంబరు,అక్టోబరు, నవంబరు, డిసెంబరు.

నైతికజ్ఞాన భేదములు—రాజనీతి, (Politics),దండనీతి (Penal code) వణిఙ్నీతి(Laws of Trade); ప్రయోజన విజ్ఞానము (Utilitarianism); శ్రమవిభాగము (Division of Labour శరీరనీతి(Rules of Health)సంసార నీతి (Socialism) జీవననీతి (Rules of Life),భావసాధనము (Training & development of feelings).

పంచకంచుక తత్త్వములు— కాల, విద్యా,కలా, నియతి, రాగతత్త్వములు.

పంచకంచుకములు—రాగ, నియతి, కాల,విద్యా, కళాతత్త్వ కంచుకములు.

పంచకన్యలు—1. అహల్య, 2. ద్రౌపది, 3 సీత, 4. తార, 5. మండోదరి.

పంచక రహితము— మాసాది తిథులును, అశ్విన్యాదినక్షత్రములును, ఆదివారాది వారములును, మేషాదిలగ్నములును కలిపి మొత్తముచేసి 9 చే భాగింపఁగా, శేషము-1. మృత్యుపంచ

కము, 2. అగ్నిపంచకము, 4. రాజపంచకము, 6.చోరపంచకము, 8. రోగపంచకము. ఈ 5 పంచకములు అన్ని శుభకార్యములంగు నువర్జింపవలయును. తక్కిన 3-5-7-9 శేషములుగల 4 పంచకములయందును సర్వశుభకార్యములు చేయవచ్చును.

పంచకర్మలు— (తర్కము), ఉత్క్షేపణ, అవక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనములు.

పంచకషాయము— వస, మాంసరోహిణి, చేదుపొట్ల, ప్రియంగు, నింబ- వీనిని కషాయముగాఁ జేయుట.

పంచకూలకషాయము— పిప్పళ్ళు, పిప్పలిదుబ్బులు, శేవ్యము, చిత్రకము, శొంఠి—వీని కషాయము.

పంచకృత్యములు— సృష్టి, స్థితి, లయము, అనుగ్రహము, తిరోధానము.

పంచకోలములు—1. శొంఠి, 2 చవ్యము, 3. మోడి, 4. పిప్పళ్ళు, 5. చిత్రమూలము.

పంచక్రియలు-1. ఉక్తి, 2. ఆదానము, 3. గమనము, 4. విసర్గము, 5. ఆనందకము.

పంచక్షారములు—యవ, మోదుగ, గంటె, నువ్వు, మొక్కపుచెట్టు.

పంచక్షీరవృక్షములు— మఱ్ఱి, రావి, జువ్వి, మేడి, గంగరావి.

పంచక్షేత్రములు—1. శ్రీశైలము, 2. కాశి, 3. కేదారము, 4. శ్రీకాళహస్తి, 5. పట్టిసము. (పంచ శివలింగక్షేత్రములు).

పంచగంగలు—1. కావేరి, 2. తుంగభద్ర, 3 కృష్ణవేణి, 4. గౌతమి, 5. భాగీరథి.

పంచగణము— నేలమునగ, పల్లేరు, వాకుడు, కోలాకుపొన్న, ముయ్యాకుపొన్న.

పంచగుణములు—సత్వము, రజస్సు, తమస్సు, శుద్ధసత్వము, అతీతము.

పంచ గౌడులు— ఉత్కల, మైథిల, కనోజ, కన్యాకుబ్జ, సారస్వతులు.

పంచఛిద్ర తిథులు—1. చవితి, 2. షష్ఠి, 3 అష్టమి,4.ద్వాదశి, 5.చతుర్దశి.

పంచ జ్ఞానములు-మతి, శ్రుతి, అవధి, మనస్సు, కైవల్యము.

పంచ తంత్రములు-1. మిత్రలాభము, 2. మిత్రభేదము, 3. సంధివిగ్రహము, 4. లబ్ధనాశము, 5. అసంప్రేక్ష్య కారిత్వము.

పంచతన్మాత్రలు — శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు.

పంచ తిక్తములు— వేప, తిప్పతీఁగ, అడ్డసరము, చేదుపొట్ల, వాకుడు.

పంచ తిథులు—(కృష్ణ పక్షమున) పాడ్యమి, విదియ, తదియ, చతుర్థి, పంచమి.

పంచ తీర్థములు — అమృత, తప్త, రామ, సీతా, సూర్యకుండములు. (పారాంతరమున-సౌభద్ర, పౌలోమ, భారద్వాజ,కారంధమ, ప్రసన్నములు.

పంచతురంగములు- మల్ల, మయూర, వ్యాఘ్ర, వానర, ఋషభగతులు.

పంచ త్యాజ్యములు—మాస, వార, నక్షత్ర, యోగ, లగ్న రాశిత్యాజ్యములు.

పంచ త్వక్కులు — రావి, మఱ్ఱి, జువ్వి, మేడి, మామిడి - వీనిపట్టలు.

పంచదశ ప్రకరణములు — ప్రత్యక్తత్త్వవివేకము, పంచభూత వివేకము, పంచకోశవివేకము, ద్వైతవివేకము, మహావాక్య వివేకము, చిత్రదీపము, తృప్తిదీపము, కూటస్థదీపము, ధ్యానదీపము, నాటకదీపము, బ్రహ్మానంద మందు యోగానందము, బ్రహ్మానంద మందు ఆత్మానందము, అద్వైతానందము, విషయానందము.

పంచదశ యోగాంగములు—

యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము,దేహసామ్యము, దృస్థితి, ప్రాణాయామము, అధ్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి.

పంచదైవతములు — 1. బ్రహ్మ, 2. విష్ణు. 3. మహేశ్వరుఁడు, 4. రుద్రుఁడు, 5. సదాశివుఁడు.

పంచద్రావిడులు—1. మహారాష్ట్రులు, 2. ఆంధ్రులు, 3. ద్రావిడులు, 4. కర్ణాటకులు, 5. ఘూర్జరులు.

పంచనదములు— భూతపాప, కిరణానది, ధర్మనది, గంగ, యమున.

పంచనింబలు- వేపబెరడు, వేపాకు, వేపపూవు, వేపకాయ-వేఱుపట్ట.

పంచనియమములు-శౌచము, తపము, సంతోషము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము.

పంచపక్షిశాస్త్రము - (ఈ శాస్త్రము పంచపక్షుల యాధారమున ఫలములు చెప్పును.) 1. డేగ, 2. గుడ్లగూబ, 3. కాకి, 4 కోడి, 5. నెమలి.

పంచపదార్థములు—మాంసకృత్తులు, పిండిపదార్థములు, క్రొవ్వుపదార్థములు, ఉప్పుపదార్థములు, నీరు.

పంచపర్వములు - 1. కృష్ణపక్షాష్టమి, 2. కృష్ణపక్షచతుర్దశి, 3. అమావాస్య, 4. పూర్ణిమ, 5. సంక్రమణము.

పంచపల్లవములు- అశ్వత్థ, ఉదుంబర, వట, చూత, ప్లక్షములు. పుణ్యాహవాచన వ్రతాదులందు కలశలలో నుంచదగినవి.

పంచపాండవులు— ధర్మజ, భీమ, అర్జున, నకుల, సహదేవులు.

పంచపాశములు — మల, మాయా, కర్మ, బిందు, తిరోధాన పాశములు (ఆణవ, కార్మిక, మాయా, బైందవ, నిరోధ శక్తిపాశములు.)

పంచపిత్తములు — చేఁప, పంది, మేక, దున్న, నెమలి - వీనిచేదుకట్లకు పేరు.

పంచపూర్వవాదములు-పంచలక్షణి, వ్యధికరణము, సిద్ధాంత లక్షణము, అవచ్ఛేదకత్వనిరుక్తి, పక్షత.

పంచప్రకరణములు- 1. సంగ్రహము, 2. న్యాయబోధిని, 3. దీపిక, 4. నీలకంఠీయము, 5. ముక్తావళి, (తార్కిక గ్రంథములు).

పంచప్రయాగములు— కర్ణ, రుద్ర, నంద, విష్ణు, దేవ ప్రయాగలు.

పంచప్రళయములు—దైనందిన, బ్రహ్మ, ఆత్యంతిక, నిత్య, నైమిత్తిక ములు.

పంచబదరీనారాయణములు— బదరి, ఆదిబదరి, యోగబదరి, వృద్ధ బదరి, భవిష్యద్బదరీనారాయణములు.

పంచబలములు— బల, అతిబల, నాగ బల, రాజబల, మహాబల - ఇవి వృక్షములు - వీనినే పంచబలమూలములు - బలాపంచమూలములు అందురు.

పంచబీజములు— పెద్దదోస, చిన్న దోస, దాడిమ, తామర, దూలగొండి విత్తులు (మతాంతరమున ఆవాలు, అజామోదము, జీలకఱ్ఱ, నువ్వులు, గసగసాలు.)

పంచబ్రహ్మ మంత్రములు— సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన మంత్రములు.

పంచభక్ష్యములు— భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, పానీయములు.

పంచభద్రములు— తిప్పతీగ, పర్పాటకము, తుంగదుంప, నేలవేము, శొంఠి.

పంచభూతజములు— 1. పృథ్వి, (ఎముకలు, చర్మము, మాంసము, నరములు, రోమములు) 2. ఉదకము (నెత్తురు, మూత్రము, ఇంద్రియము, కళ్ళె, మెదడు) 3. అగ్ని - (ఆకలి, దాహము, నిద్ర, ఆలస్యము, స్త్రీల కూటమి), 4. వాయువు - (కదలుట, నడచుట, త్వరపడుట, సిగ్గు, భయము) 5. ఆకాశము- (కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము.)

పంచభూత బీజాక్షరములు— వాయుబీజాక్షరములు - (అ, ఆ, ఏ, క, చ, ట, త, ప, య, ష); అగ్నిబీజములు-(ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ర, థ, ఫ, ర, స); భూబీజములు-(ఉ, ఊ, ఓ, గ, జ, డ, ద, బ, ల, హ);ఉదకబీజములు- (ఋ, ౠ, ఔ, ఘ, ఝ, ఢ, ధ, భ, వ, శ); ఆకాశబీజములు-(ఌ,ౡ,అం, ఙ, ఞ, ణ, న, మ, ళ, క్ష).

పంచభూతములు — పృథ్వి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము.

పంచభూతద్వయము — పంచీకృత, అపంచీకృతములు.

పంచభృంగములు — దావరుడంగి, వావిలి, జమ్మి, గంజాయి,తాళిసపత్రి.

పంచభ్రమలు —(1) భేద, కర్తృత్వ, సంగ, వికార, సత్యత్వభ్రమలు. (2) దేహాత్మ, తరుపాషాణాది, మిథ్యాత్మ, దేవతా, కర్మభ్రమలు.

పంచమజభాషలు—కైశికి, శ్రావణ, తానోద్భవ, ఆభీరి, ఘూర్జరి, సైంధవి, దాక్షిణాత్య, ఆంధ్రి, మాంగళి,భావని.

పంచమలములు— ఆణవమలము - (పరబ్రహ్మమునుగూర్చి అపుడపుడుగలైదు

జ్ఞానమును మఱుఁగుపఱచునది); కార్మిక మలము-(గురువుబోధించినపరమార్థము నందు బుద్ధిచొరనీయనిది); మాయిక మలము -(పరతత్త్వజ్ఞానవాసన సెప్పుడును గలుగనీయనిది); మాయేయమలము - (పాపకార్యములందు మాత్రమే బుద్ధిని జొన్పునది) తిరోధానమలము-(పరబ్రహ్మ మనిత్యమను బుద్ధినిగల్గించి జననమరణాది దుఃఖములను గలుగఁజేయునది.)

**పంచమహాపాతకములు** — స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీగమనము, మహాపాతక సహవాసము.

**పంచమహాయజ్ఞములు**- దేవయజ్ఞము (దేవతాతృప్తికొఱకు అగ్నియందు హవిరాదికముచే హోమముచేయుట); పితృయజ్ఞము (పితృదేవతాప్రీతికై స్వధాకారయుతముగాఁదర్పణముచేసి ద్విజులకు భోజనము పెట్టుట); భూతయజ్ఞము.(వైశ్వదేవానుష్ఠానమునకుఁ బిమ్మట బహిర్దేశమున భూతతృప్తికొఱకు బలియిచ్చుట); మనుష్యయజ్ఞము (శక్తికొలది అతిథులకు అన్నమిడుట); బ్రహ్మయజ్ఞము (ఒక ఋక్కునుగాని, యజుస్సునుగాని, సామమును గాని శక్తికొలఁది నిత్యము నభ్యసించుట).

**పంచమహాశబ్దములు**—ఘన, వితత, సుషిర, వంది, మాగధశబ్దములు.

**పంచమాతలు** — 1. [illegible] 2. అన్నభార్య, 3. [illegible] 4. భార్యను [illegible]తల్లి, 5. తను గన్నతల్లి.




**పంచమార్గములు** —కపిమార్గము (కోఁతిపిల్లలు తమ తల్లి యెచ్చటకుఁ బోయినను వదలక పట్టుకొన్నరీతిగ నుపాధ్యాయునిశిష్యులువదలకుండుట); విహంగమార్గము(పక్షి తన గ్రుడ్లను బెట్టి దానిఱెక్కలచే మూసియుంచుటవలన నవి పిల్లలైనట్లు గురువు శిష్యులను విడనాడక వృద్ధిలోనికిఁదెచ్చుట); మార్జాలమార్గము (పిల్లి తన పిల్లలను నోటఁ గఱచుకొని యెల్లచోటులకుఁ దీసికొనిపోవునటుల ఆచార్యుఁడు తాఁబోవుచోట్లకుశిష్యులనుగొనిపోవుచు వృద్ధికిఁ దెచ్చుట); మీనమార్గము (చేఁప గ్రుడ్లనుబెట్టి వానిని దిరిగిచూడఁజూడ నవి యభివృద్ధి నొందినట్లు ఆచార్యుఁ డప్పుడప్పుడు వచ్చి వృద్ధికిరావలెనని కటాక్షించుచుండుట); కూర్మమార్గము (తాఁబేలు ఒక స్థలమున గ్రుడ్లుపెట్టి మఱియొక స్థలమునకుఁ బోయి వాని ననవరతము తలఁచుచుండఁగా వృద్ధికి వచ్చినట్లు గురువు తన శిష్యులను అప్పుడప్పుడు తలఁచుచుండుట.)

**పంచముఖ పరబ్రహ్మమువలనఁ బంచభూతములు గల్గినవిధము**—
1. ఈశాన్యముఖమువలన ఆకాశము (పరమాత్మ), 2. తత్పురుషముఖము వలన వాయువు (జీవాత్మ), 3. అఘోరముఖమువలన అగ్ని (అగ్నిదేవుఁడు,) 4. వామదేవముఖమువలన ఉదకము (చంద్రుఁడు), 5. సద్యోజాతముఖము వలనఁ బృథివి (సూర్యుఁడు) కలిగెను.

**[illegible]ముద్రలు**—1. భూచరి (ధ్యాన[illegible] నాసాగ్రమున లక్ష్యముంచునది) 2. ఖేచరి (భ్రూమధ్యమున దృష్టి

నిలుపుట), 3. మధ్యమ (పైరెంటికిని మధ్య లక్ష్యముంచుట), 4. శాంభవి (బొటనవ్రేళ్ళచే చెవులను, అనామిక లచే ముక్కును, మధ్యవ్రేళ్ళచే నేత్రములను మూసి, నాదములను వినుచుఁ జిత్కళలను దర్శించుట), 5. షణ్ముఖి (రెండు బొటన వ్రేళ్ళచేత చెవుల రంధ్రములను మూసికొని నాదములను వినుట )

పంచమృతజీవులు-1. కవి, 2. త్యాగి, 3. వీరుఁడు, 4. న్యాయప్రభువు, 5. దాత.

పంచయజ్ఞములు—1. వేద పఠనము, 2. వైశ్వదేవము, 3. అతిథి పూజ, 4. పితృతర్పణము, 5. భూతబలి, (1. దేవయజ్ఞము, 2. పితృయజ్ఞము, 3. భూతయజ్ఞము, 4. బ్రహ్మయజ్ఞము, 5. మనుష్యయజ్ఞము - అని కొందరు.)

పంచయానములు—1. సంధ్యాయానము, 2. ప్రసంగయానము, 3. విగృహ్యాయానము, 4. సంభూయ యానము, 5. ఉపేక్ష్యయానము.

పంచరుద్రములు - (నమకచమకములు) అథర్వశిఖ, కైవల్య, కాలాగ్ని, శ్వేతాశ్వతర రుద్రములు.

పంచలవణములు—1. సైంధవము, 2. సౌవర్చము, 3. బిడాలవణము, 4. సముద్రలవణము, 5. కాచలవణము.

పంచలింగక్షేత్రములు—జంబుకేశ్వరమున జలలింగము, అరుణాచలమున అగ్నిలింగము, చిదంబరమున ఆకాశలింగము, తిరువ్వాల్యూరున పృథివీలింగము, కాళహస్తిలో వాయులింగము.

పంచలోహములు—1. బంగారు, 2. వెండి, 3. ఇత్తడి. 4. కంచు, 5. ఇనుము.

పంచవకారములు—వంశము, వపువు, వాక్కు, వస్త్రము, విభవము (పురుషుల కర్తలక్షణములుగల 5 పదములలోని ప్రథమాక్షరములు.)

పంచవటములు—మారేడు, రావి, మఱ్ఱి, అశోకము, మేడి.

పంచవల్కలములు — మఱ్ఱి, జువ్వి, రావి, మేడి, అమ్లవేతసము.

పంచవింశతి తత్త్వములు — చతుర్వింశతి తత్త్వములు, పురుషుఁడు.

పంచవిధజ్ఞానములు — ఇంద్రియార్థ, నైతిక, ఈశ్వర, బ్రహ్మ, శుద్ధజ్ఞానములు.

పంచవిధనరజీవనములు - నీతిశూన్య, కేవల నైతిక, సేశ్వర నైతిక, సాధన భక్త, భావభక్తజీవనములు.

పంచవిధఫలానుభవములు—వికర్మ, అకర్మ, కర్మ, జ్ఞాన, భక్తి ఫలానుభవములు.

పంచవిధబద్ధజీవులు— పూర్ణవికచిత, వికచిత, ముకుళిత, సంకోచిత, ఆచ్ఛాదిత చేతనములు.

పంచవిధమనోగతానుశీలనములు—స్మృతి, ధ్యానము, శరణాపత్తి, దాస్యము. జిజ్ఞాస.

పంచవిధ ముఖ్యభక్త్యంగములు—శ్రీమూర్తిని సేవించుటయందలి ప్రీతి, రసికులవలన శ్రీభాగవతార్థమును

వినుట; అనుకూలురతోడిస్నేహమును, తనకంటె శ్రేష్ఠులగు సాధులతోడి సంగమునుజేయుట, నామసంకీర్తనము; వ్రజవాసము.

పంచవిధరతులు— 1. శుద్ధారతి, 2. ఛాయారతి, 3. ప్రతిబింబితరతి, 4. జడరతి, 5. కపటరతి.

పంచవిధవైధభక్తి— శరీరగత, మనోగత, ఆత్మగత, ప్రకృతిగత, సమాజగతానుశీలనములు.

పంచవిధశుద్ధజ్ఞానములు— 1. పరేశానుభవము, 2.స్వానుభవము, 3.స్వధర్మానుభవము, 4. ఫలానుభవము, 5. విరోధానుభవము.

పంచవిధసేవాపరాధములు— సాధ్యమత యత్నాభావము, అవజ్ఞ, అపవిత్రత, విశ్వాభావము, గర్వము.

పంచవైద్యకర్మలు—విరేచనము చేయించుట; వమనము చేయించుట, ఓషధీనస్యమును పీల్పించుట, నిరూహము, అనువాసన.

పంచశక్తులు—శక్తిత్రయము, ఆదిశక్తి, పరాశక్తి.

పంచసంగీతజాతులు—దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్యజాతులు.

పంచసంజ్ఞాకృతులు—చతురశ్ర, అర్ధచంద్ర, త్రికోణ, షట్కోణ, వర్తులాకారములు.

పంచసంస్కారములు— 1. తాపము, 2. పుండ్రము, 3. నామము, 4. మంత్రము, 5. వైష్ణవేష్టి.

పంచసమాసములు—1. అవ్యయీభావము, 2.తత్పురుష, 3.బహువ్రీహి, 4. ద్వంద్వము, 5. సామాన్యము.

పంచసరోవరములు—బిందు, పంపా, మానస, పుష్కర, నారాయణసరస్సులు.

పంచసస్యములు— వరిధాన్యము, నువ్వులు, పెసలు, యవలు, తెల్లావలు.

పంచసూక్తములు— శ్రీ, పురుష, భూ, నీళా, మన్యుసూక్తములు.

పంచసూతకములు— జాత, మృత, రజః, ఉచ్ఛిష్ట, జాతిసూతకములు. 2. మధుపాన, అనృత, దేవలకస్పర్శ, యూపస్తంభస్పర్శ, శవదర్శన సూతకములు.

పంచసూత్రములు— 1. సంకల్పము, 2.మార్జనము, 3.వరుణసూక్తము, 4.అఘమర్షణము, 5. స్నానాంగతర్పణము, (2) 1. ఆపస్తంబీయము, 2. ఆశ్వలాయనీయము, 3. కాత్యాయనీయము, 4.బోధాయనీయము,5.వైఖానసీయము.

పంచసూనములు— ఖండిని (కూరగాయలు మున్నగువానిని దఱుఁగుట); పేషిణి (నూఱుట); చుల్లి (ప్రొయ్యియందు నిప్పును రగులవేయుట); ఉదకుంభి (నీటికడవ లుంచుట); మార్జని (అలుకుట, చిమ్ముట మొ.) వీనివలనఁ గలుగుపాపమును బరిహరించుకొఱకుఁ బంచయజ్ఞములు చేయుదురు.

పంచహేత్వాభాసలు— 1. సవ్యభిచారము, 2. విరుద్ధము, 3. సత్ప్రతిపక్షము, 4. అసిద్ధము, 5. బాధితము.

పంచాంగములు— తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము.

పంచాకాశములు—(చూ.) 1.ఆకాశ పంచకము, 2. చిత్తాకాశ, పరాకాశ, మహదాకాశ, తత్త్వాకాశ, సూర్యాకాశములు.

పంచాక్కరలు— 1. మహాక్కర, 2. మధ్యాక్కర, 3. మధురాక్కర, 4. అంతరాక్కర, 5. అల్పాక్కర.

పంచాక్షరములు—న, మ, శి, వా, య.

పంచాగ్నులు—చూ. అగ్నిపంచకము. 1. జ్ఞానాగ్ని (ఆత్మయందు), 2.కాలాగ్ని -(పాదములయందు), 3.క్షుధాగ్ని-(నాభియందు), 4.శీతాగ్ని (హృదయమునందు), 5. కోపాగ్ని - (నేత్రములయందు) నుండును.

పంచాచారములు—లింగాచార, సదాచార, శివాచార, గణాచార, భృత్యాచారములు.

పంచానధ్యయనములు— పాడ్యమి, అష్టమి, చతుర్దశి, పౌర్ణమి, అమావాస్య.

పంచామృతములు— ఉదకము, పాలు, పెరుగు, నేయి, తేనె.

పంచాయతన దేవతలు— ఆదిత్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుఁడు, మహేశ్వరుఁడు.

పంచారామములు—1. ద్రాక్షారామము, 2. భీమారామము, 3. సర్పారామము, 4. అమరారామము, 5. కొమరారామము

పంచావయవములు— ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయనము, నిగమనము.

పంచావికములు- మేకయొక్క-పాలు, పెరుగు, నేయి, మూత్రము, పెంటికలు.

పంచీకరణము— 1. అంతఃకరణము, సమానవాయువు, శ్రోత్రేంద్రియము, శబ్దము, వాగింద్రియము; 2. మనస్సు, వ్యానవాయువు, త్వగింద్రియము, స్పర్శము, పాణీంద్రియము; 3. బుద్ధి, ఉదానవాయువు, చక్షురింద్రియము, రూపము, పాదేంద్రియము; 4 చిత్తము, ప్రాణవాయువు, రసనేంద్రియము, రసము, ఉపస్థేంద్రియము; 5. అహంకారము, అపానవాయువు, ఘ్రాణేంద్రియము, గంధము, పాయ్వింద్రియము.

పంచేంద్రియములు- చూ. ఇంద్రియ పంచకము.

పంచోత్తరవాదములు— సామాన్య నిరుక్తి, సవ్యభిచారము, సత్ప్రతిపక్షము, అసిద్ధము, బాధ.

పంచోపనిషత్తులు— నారాయణ, బ్రహ్మ, తైత్తిరీయ, గార్గ, వరాహములు.

పండుగలు— సంవత్సరాది పాడ్యమి, భానువిదియ, అక్షతృతీయ, నాగులచవితి, ఋషిపంచమి, సుబ్బరాయఁడు షష్ఠి, రథసప్తమి, కృష్ణాష్టమి, శ్రీరామనవమి, విజయదశమి, భీష్మైకాదశి, క్షీరాబ్ది ద్వాదశి, శని త్రయోదశి, అనంత పద్మనాభచతుర్దశి, వ్యాసపౌర్ణమి, దీపావళి అమావాస్య,

సంక్రాంతి మొ.

పక్షద్వయము—1. శుక్లపక్షము, 2. కృష్ణపక్షము.

పట్టణములు— (చరిత్ర ప్రసిద్ధములగు హిందూదేశమునందలి ముఖ్యపట్టణములు) కలకత్తా, బరోడా, పాట్నా, రాణీగంజ్, ఢక్కా, బొంబాయి, చిటగాంగ్, అలహాబాద్, బనారస్, ఆగ్రా, కాన్పూర్, ఆలీఘర్, లాహోర్, ఢిల్లీ, అమృతసరస్సు, కాశ్మీరము, పెషావర్, హైదరాబాద్, జయపురము, ఉదయపురము, బెంగుళూరు, సికింద్రాబాదు, అమరావతి, నాగపూర్, గ్వాలియర్, ఇండూర్, సూరత్, అహమదాబాదు, గోవా, మార్మగోవా, కటకము, జగన్నాథము, కరాచి, రంగూన్, మాండలే, జబల్పూర్, మద్రాసు, తిరుపతి, రాజమహేంద్రవరము, విశాఖపట్టణము, కాకినాడ, మైసూరు, బెజవాడ, మచిలీపట్టణము, విజయనగరము.

పదచతుష్టయము—1. తత్సమము, 2. తద్భవము, 3. దేశ్యము, 4. గ్రామ్యము.

పదదోషములు— అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయోజకము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము, అన్యార్థము, అప్రతీతకము, అవిమృష్టవిధేయాంశము, విరుద్ధమతికరము, అశ్లీలము, పరుషము.

పదద్వయము—1. కళలు, 2. ద్రుతప్రకృతికములు.

పరభక్షకులు—మక్షికము, మశకము, వేశ్య, మూషకము, యాచకుఁడు, గ్రామణి, గణకుఁడు.

పరమభాగవతోత్తములు—
ప్రహ్లాదుఁడు, నారదుఁడు, పరాశరుఁడు, పుండరీకుఁడు, వ్యాసుఁడు, అంబరీషుఁడు, శుకుఁడు, శౌనకుఁడు, భీష్ముఁడు, రుక్మాంగదుఁడు, అర్జునుఁడు, వసిష్ఠుఁడు, విభీషణుఁడు మొ.

పరమాత్మయందలి చతురవస్థలు— చిత్తు, అంతర్యామి, సూత్రాత్మ, విరాట్టు.

పరలోకములు, వానియధిపతులు— దేవలోకము - దేవేంద్రుఁడు, బ్రహ్మలోకము (సత్యలోకము) - బ్రహ్మదేవుఁడు, కైలాసము - ఈశ్వరుఁడు, వైకుంఠము - శ్రీమహావిష్ణువు.

పరిత్యాజ్యపంచకము— రూపరాగము, అరూపరాగము, గర్వము, ఔద్ధత్యము, అవిద్య.

పరుషములు— క, చ, ట, త, ప లు.

పర్వతములు— గోమదము, చంద్రపర్వతము, నారదగిరి, దుందుభి, సోమకము, సుమనఃపర్వతము, వైభ్రాజము (ఇవి జంబూద్వీపమందలి మహాపర్వతపంక్తులు మర్యాదాపర్వతములై యున్నవి) కుముదము, ఉన్నతము, వలాహకము, ద్రోణగిరి, కంకము, మహిషము, కకుద్మంతము (ఇవి శాల్మలద్వీపమునందలి కులపర్వతములు) విద్రుమము, హేమశైలము, ద్యుతిమంతము, పుష్టిమంతము, కుశేశయము, హరి, మందరము (ఇవి కుశద్వీపము

నందలి కులపర్వతములు), క్రౌంచము, వామనము, అంధకారకము, దేవ వ్రతము, ధమము, పుండరీకవంతము, దుందుభి (ఇవి క్రౌంచద్వీపమునందలి కులపర్వతములు), ఉదయగిరి, జల ధారము, రైవతకము, శ్యామము, అంభోగిరి, ఆస్తికేయము, కేసరి (ఇవి శాకద్వీపమునందలి కులపర్వతములు), మానసోత్తరము (ఇది పుష్కరద్వీపము నందలి వర్షపర్వతము).

మేరువునకు తూర్పున శాంతవం తము, చక్రకుంభము, కురలి, మాల్య వంతము, వైకంకము అను కేసరపర్వ తములును, దక్షిణమున త్రికూటము, శిశిరము, పతంగము, రుచకము, నిష ధము అను కేసర పర్వతములును; పశ్చిమమునశిఖివాసము, వైడూర్యము, కాపిల్యము, గంధమాదనము, జానుధి అను కేసర పర్వతములును; ఉత్తర మున శంఖకూటము, ఋషభము, హంసము, నాగము, కాలంజరము అను కేసరపర్వతములును గలవు. (జఠరదేవ కూటములు, గంధమాదన కైలాసము లు, నిషధపారియాత్రములు, త్రిశింగ జానుధులు మర్యాదాపర్వతములు.)

**పాండవులఅజ్ఞాతవాసనామములు**— కంకుభట్టు - (ధర్మరాజు), వలలుఁడు- (భీముఁడు), బృహన్నల -(అర్జునుఁడు) దామగ్రంధి - (నకులుఁడు), తంత్రీపా లుఁడు - (సహదేవుఁడు), మాలిని - (ద్రౌపది.)

**పాకత్రయము**—1.నారికేళము, 2.కదళి, 3. ద్రాక్ష.

**పాకపరికరములు**—(ఉప్పుతో తొమ్మిది) బియ్యము, పప్పు, కూర, నేయి, మిరప, చింతపండు, పోపుసామాను, కట్టెలు, ఉప్పు.

**పాదతలరేఖలు** — (సాముద్రికము) ధ్వజ, వజ్ర, అంకుశ, ఛత్ర, చామర, శంఖ, పద్మ, కలశ, మత్స్య, కుండల మాలరేఖలు.

**పాపదశకము**-1. అసత్యోక్తి, 2. దోషా రోపణోక్తి, 3. కఠినోక్తి, 4. నిష్ఫ లోక్తి, 5. చౌర్యకరణము, 6. దుష్కా ర్యకరణము, 7. దుష్కార్యాపేక్ష, 8. పరభార్యాపేక్ష, 9. పరద్రవ్యా పేక్ష, 10. జీవహింస.

**పాపసప్తకము**— 1. దురహంకారము, 2. అర్థలోభము, 3. కామము, 4. వైష మ్యము, 5. కోపము, 6. సోమరితనము, 7. అరిష్టకరమైన స్వేచ్ఛ.

**పితృదేవగణత్రయము**—వసు, రుద్ర, ఆదిత్యగణములు.

**పిప్పలీద్వయము**—1. పిప్పలి, 2. గజ పిప్పలి.

**పీఠభూములు**— మా సి టా, నెజ్, ఇరాన్, డక్కన్, టిబెట్టు, మెక్సికన్, లోరెంటియన్, కొలరెడో, మెట్టో గ్రాసో, బ్రెజిల్ మొ.

**పుటములు**—మహాపుటము,గజపుటము, వరాహపుటము, కుక్కుటపుటము, గోవరపుటము, కుంభపుటము, దీప పుటము, సూర్యపుటము, భూపుటము, ధాన్యపుటము మొ.

పుణ్యక్షేత్రములు—అజంత, అమరావతి, అయోధ్య, అలహాబాదు, అలంపురి, అహోబిలము, ఉదకమండలము (ఊటి),ఓంకారము, ఉజ్జయిని(అవంతి) ఎల్లోరా, కంచి, కలకత్తా, కన్యాకుమారి, కోటిఫలి, కాశి, కాశ్మీరము, (శ్రీనగరము) శ్రీకాళహస్తి, గోకర్ణము, కుంభకోణము, కురుక్షేత్రము, కొల్లాపురము, కేదారము, గంగోత్రి, గయ, గోకుల, గోలకొండ, చిదంబరం, చెన్నపట్టణము, చిత్రకూటము, జంబుకేశ్వరము. జగన్నాథము, (పూరి) జనార్దనము, ఝాన్‌సి, ఢిల్లీ. డెహ్రిడూన్, దర్భశయనము, ద్రాక్షారామము, ద్వారక, నవద్వీపము, తిరుపతి, తిరువన్నామలి (అరుణాచలం) తిరువల్లూరు, తంజావూరు, త్ర్యంబకం, నాసిక, పండరీపురము, పక్షితీర్థము, పాపనాశనము, ప్రయాగ, పాటలీపుత్రము, పిరాపురము, పల్లని,పూనా, బదరీనారాయణము(బదరికాశ్రమము) బరోడా, బ్రహ్మకపాలము, బృందావనము, బెజవాడ, బెంగుళూరు, బొంబాయి, భువనేశ్వరము, భద్రాచలము, పుష్కరము, పర్ణశాల, పంచవటి, పుష్పగిరి, నైమిశారణ్యము, మధుర, మధురాపురి (మట్రా), మంగళగిరి, మహాబలేశ్వరము, మహాబలిపురము, మాతృగయ, సిడ్‌పూర్, మాయవరం, మైసూరు, మహానంది, రామేశ్వరము, రాజమహేంద్రవరము, లక్నో (లక్ష్మణపురి), వరంగల్, వేదాద్రి, వైద్యనాథము, శ్రీకూర్మము, శ్రీరంగము, శ్రీశైలము, శృంగేరి, సింహాచలము, సుబ్రహ్మణ్యము, సాక్షిగోపాలము, షియాలి, హంపి (విరూపాక్షము), హరిద్వారము మొదలగునవి.

పుత్రులు—ఔరసుఁడు - భార్యయందుఁ దనకుఁ బుట్టినవాఁడు, క్షేత్రజుఁడు - ఏదే నొకకారణముచే సంతానవిచ్ఛిత్తి కలుగఁగాఁ బెద్దలయనుజ్ఞచేఁ దనభార్యయందు దేవరుఁడు లోనగువారికిఁ బుట్టిన కొడుకు,దత్తుఁడు-దత్తు తీసికొన్నవాఁడు, కృత్రిముఁడు - గుణజ్ఞుఁడని యభిమానించి పెంచుకొన్న కొడుకు, గూఢోత్పన్నుఁడు - భార్యయిందుఁ దనకుఁ దెలియకుండ అంకుమగని ఁ బుట్టినకొడుకు, అపవిద్ధుఁడు - తల్లిచేఁ గాని, తండ్రిచేఁగాని, యుభయులచే గాని విడువఁబడగా దెచ్చి పెంపఁబడినవాఁడు, కానీనుఁడు - తనభార్య యందఁ గన్యాత్వమున రహస్యముగా నితరునకుఁ బుట్టిన కొడుకు, సహోఢజుఁడు - గర్భిణిగానుండఁ [illegible]సికొని, దెలియకకాని వివాహము చేసికొన్న భార్యయందు బుట్టిన కుమారుఁడు, క్రీతుఁడు - తల్లిదండ్రులయొద్ద వెల యిచ్చి తీసికొన్నకొడుకు, పౌనర్భవుఁడు-పునర్భువునందుఁ బుట్టినకొడుకు, స్వయందత్తుఁడు - తల్లిదండ్రులు లేక కాని, వారిచే నకారణముగ విడువఁబడికాని స్వయముగ నేను నీకుఁ బుత్రుఁడ నయ్యెదనని వచ్చిన కొమరుఁడు, జ్ఞాతిరేతుఁడు - జ్ఞాతికొడుకు, (వీరిలో మొదటి యార్గురును, బంధువులు, దాయాదులు నగుదురు. వెనుకటి యార్గురును బంధువు లగుదురుగాని, దాయాదులు కారు.)

పునర్నవాత్రయము — 1. గలిజేరు, 2. గుంట గలిజేరు, 8. ఎఱ్ఱగలిజేరు.

పురాణ పంచలక్షణములు— 1. ప్రళయము, 2 సృష్టి, 3. వంశము, 4. మనువర్ణనము, 5. ఈశానుచరితము (శ్రీహరి లీలావతారవర్ణనము), వృత్తి, రక్షణము, సంస్థ, హేతువు, అపాశ్రయము.

పురుషజాతులు— 1. శశి, వృషభ, తురగజాతులు, 2. భద్రుఁడు, దత్తుఁడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు.

పురుషలు — చూ. వ్యాకరణ ప్రకరణము.

పూర్వవాదములు—పంచలక్షణి, వ్యధికరణము, సిద్ధాంత లక్షణము, అవచ్ఛేదకత్వ నిరుక్తి, పక్షత.

పృథివ్యాది పంచతత్త్వములు— 1. పృథివి - 8 గడియలు, 2. అప్పు - 4 గడియలు, 3. తేజస్సు - 6 గడియలు, 4. వాయువు - 5 గడియలు, 5. ఆకాశము - 7 గడియలు, మొత్తము 30 గడియలు, (ఆదివారము మొదలు బుధవారము వఱకుఁ బృథివ్యాదిగాఁ జరించును. గురు, శుక్ర, శనివారములందు ఆకాశము మొదలుగాఁ జరించును. ఈ 5 ను వరుసగా సంపద, శుభము, ఆర్తి, రోగము, దారిద్ర్యమునిచ్చును.)

పృథివీపంచకము—1 అహంకారము, 2. అపానము, 3. ఘ్రాణము, 4 గంధము, 5. గుదము.

పైత్యములు—(24) అవర్ణ, వివర్ణ, సూర్యావర్త, కామల, ఆమ్ల, రక్త, స్వేద, ఉన్మాద, పుండరీక, భుజంగ, కరపాద, శీత, మూర్ఛ, మధుర, కుసుమ, క్రోధ, భ్రంశ, శిరః, క్షుధ, తృష్ణ, దుర్భాష, చర్మ, దుర్గంధ, మదనములు.

ప్రకాశనాశ హేతువులు— అర్థనాశము, మనస్తాపము, గృహమందలి దుశ్చరితము.

ప్రకోపత్రయము—(బౌద్ధము) కాయ, వాక్, మనః ప్రకోపములు.

ప్రతిబంధకపంచకము— (బౌద్ధము) కామ, ద్రోహ, స్త్యాన, అసత్ప్రవర్తన, సంశయములు.

ప్రేతపంచకము— బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు, ఈశ్వరుఁడు, సదాశివుఁడు. (ప్రేత = ఎప్పటికిని నాశము లేక యుండునది.)

ప్రత్యక్ష హేతువులు— సంయోగము, సంయుక్తసమవాయము, సంయుక్తము, సమవేత సమవాయము, విశేషణ విశేష్యభావము.

ప్రారబ్ధత్రయము— ఇచ్ఛా, అనిచ్ఛా పరేచ్ఛా, ప్రారబ్ధములు.

ప్రాసభేదములు— చూ. వ్యాక. ప్రక.

బంధకవిత్వము— గోమూత్రిక, ఛత్ర, గుచ్ఛ, కుండలినాగ, కంకణ, మర్దల, ఖడ్గ, చక్ర, అష్టదళపద్మ, సర్వతోభద్ర, మాలికాదిబంధములు.

బంధములు—చూ. అష్టవిధబంధములు, దశవిధ బంధములు —

ఉత్తానకరణ, తిర్యక్కరణ, స్థితకరణ, ఉద్ధితకరణ, వ్యానకరణ, గ్రామ్య, నాగరక, ఉత్ఫుల్లక, విజృంభిక, ఇంద్రాణిక, ఇంద్రక, పార్శ్వసంఘటిత,

ఉత్థానసంఘటిత, పీడిత, వేష్టిత, వాడ వాఖ్య, ఉద్భగ్న, ఉరస్ఫుట,అంగార్ధ నిపీడిత, జృంభక, ప్రసారిత, వేణు విదారక, కూలచిత, మార్కటక, ప్రేంఖాయిత, పద్మాసన, అర్ధపద్మాసన, బంధురిత, నాగపాశ, సమ్యాయన, కూర్మ, పరివర్తిత, నిపీడన, సమపాద, త్రివిక్రమ, వ్యోమపద, స్మర చక్ర, అవిదారిత, సౌమ్య, అజృంభిత, నౌకా, ధనుర్బంధ, కరపాద, పాచీముఖ, అర్ధచంద్ర, ఉపాంగ, సముద్గత, పరివర్తన, సమాంగక, అభిత్రిక, సంపుటిత, వేణుదారణ, కుక్కుట, మానిత, యుగపద, విమర్దిత, ఘట్టిత, సమ్ముఖ, ప్రస్ఫుట, ఉద్గ్రీవ, జఘన, జానుపూర్వి, హరివిక్రమ, కీర్తి, ద్వితల, పార్శ్వవేష్టిత, ధృత, నిపీడిత, విఘాతక, చటకవిలసిత, వరాహఘాతక, జాప్స, వృషాభిఘాత, ధేనుక, గజ, మార్జాల, పురుషాయిత భ్రామర, ఉద్గత, సంఘాటక, ఉపపద, మందపీడిత, కుందవరాహ బంధములు (రతిబంధములు 84)

బలములు— (మంత్రి ప్రభృతులు)- మిత్రబలము, భృత్యబలము, ఆటవికబలము.

బాణాగ్రములు — (10) ఆరాముఖ, ద్విభల్లక, వత్సదూత, కర్ణిక, కాకతుండ, క్షురప్ర, గోపుచ్ఛ, అర్ధచంద్ర, సూచీముఖ, భల్ల బాణాగ్రములు.

బాలగ్రహములు—స్కంద, విశాఖ, స్వపితృ, నైగమేష, శకుని, శీతపూతన, ముఖమండనిక, పూతన, అంధపూతన, రేవతి, శుష్క రేవతి.

బాలరోగములు— వాతజము, పిత్తజము, శ్లేష్మజము, దంతోద్భేదము, దంతఘాతము, దంతశబ్దము, అకాలదంతము, అహిపూతనము, ముఖపాకము, ముఖస్రావము, గుదపాకము, ఉపశీర్షకము, పార్శ్వారుణము, తాలుకంఠము, విచ్ఛిన్నము, పరిగర్భికము, దౌర్బల్యము, గాత్రశోషము, శయ్యామూత్రము, కుకూణకము, రోదనము, అజగల్లి మొ.

బాలాదిపంచస్వరములు - క మొదలు క్ష వఱకుఁగల 35 అక్షరములకు బాలస్వరము, కుమారస్వరము, రాజ్యస్వరము, వృద్ధస్వరము, మృతస్వరము వరుసగా 7 అక్షరముల కొకటి చొప్పునఁ గలవు. (ఒక్కొక్క స్వరమున కాఱేసి గడియలవంతున బాలస్వరము తూర్పునను, కుమారస్వరము దక్షిణమునను, రాజ్యస్వరము పశ్చిమమునను, వృద్ధస్వర ముత్తరమునను, మృతస్వర మీశాన్యమునను లేయింబవలు ప్రకాశించుచు సంతోషము, ధనలాభము, రాజ్యలాభము, శరీరపీడ, అధికక్లేశము అను 5 ఫలముల నిచ్చును. కావున లక్షణకవి యగువాఁడు స్వరనిర్ణయ మెఱింగి ఏ దిక్కున స్వరమున్నదో యా దిక్కునఁ గూర్చుండి కవిత్వము రచించినఁ గృతిపతి కాయు రారోగ్య భాగ్యములు గలుగును.)

బిరుదులు—రావు-ఇది రాజపుత్రులు, చిత్రకారులు, మరాటీలు, ముచ్చెవాండ్రు, బలిజలు, వహించినది; ఆచార్య-దీనిని వైష్ణవులు, పంచాననంవారు, కర్ణాటక మహారాష్ట్రమధ్వులు

వహింతురు; పిళ్ళ - అహంపడియారు, మాలలు, అరవగొల్లలు వహింతురు. అయ్య - చాత్తాద శ్రీవైష్ణవులు, బ్రాహ్మణులు, జంగములు, వీరశైవులు, దేవాంగులు ఈ బిరుదమును వహింతురు. కొన్నిచోట్ల కోమట్లకును చెల్లును. నాయఁడు-బలిజలు, తెలగాలు, తెలుగువెలమలు, కమ్మవారు, తెనుంగుగొల్లలు, తెనుఁగు దాసీపుత్త్రులు వీరిపై బిరుదమునఁ బఱగుదురు; అయ్యర్-దాక్షిణాత్యులగు శ్రీవైష్ణవులు, బ్రాహ్మణులు, జంగములు, వీరశైవులు, పై బిరుదమునకుఁబాత్రులు. అయ్యంగారు-వైష్ణవులకును, చాత్తాద వైష్ణవులకును, పట్టుసాలెవారికినిఁ బై బిరుదు గలదు. రాజు - నియోగిబ్రాహ్మణులు, క్షత్రియులు, భట్టువారు పై బిరుదమును వహింతురు. మొదలారు - అరవవెలమలును, కైకోలవారును, అరవదాసీపుత్త్రులును పై బిరుదమును బొందుదురు. ఖండర్, నాయకర్, పడైయాచ్చి, శమ్మట్టి, పిళ్ళ, ముదలార్ — ఈ బిరుదములు దక్షిణమున నగ్నివంశస్థులనెడు పల్లెవాండ్రకుఁ జెల్లును. రెడ్డి - బలిజలకును, పశ్చిమదేశ మాధ్వికార్లకును జెల్లును. మఱియు పంటకాపు, పాకనాటికాపు, మోటాటికాపు, మురికినాటికాపు, దేసూరుకాపు మొ. రెడ్డినామము కలదు. శ్రేష్ఠి (సెట్టి)-కోమట్లు, బేరులు, బలిజలు, కుమ్మరులు, లింగబలిజలు, నాటుకోటవారు, సాలెవారు, గొండ్లవారు, ఉప్పరవారు, కుమ్మరవారు, ఒడ్డెవారు, బెస్తవారు, జనపవారు-వీరికిని, గొన్నిచోట్ల దేవాంగులకును బైబిరుదము లుచెల్లును ఉడయార్ అహంపడియారులకును, అరవకుమ్మర్లకును జెల్లును. పత్తరు-స్వర్ణకారులకును, కుమ్మరులకును జెల్లును. కీదారి, కోనాన్, పిళ్ల ఇవి అరవగొల్లలకుఁ గలవు. నైనార్ అరవజైనులకుఁ జెల్లును. మేస్త్రీ - వడ్రంగులకును, తాపీపని చేయువారికిని, చాకలివారికిని జెల్లును. మూర్తి - భట్రాజులకును, సిద్ధులవారికిని జెల్లును. నాయర్ - మలయాళమున శూద్రులకుఁ గలదు. వీరిలో కిరియత్తిల్ నాయర్ అను జాతివార కలరు. శర్మ, శాస్త్రి మొ. బ్రాహ్మణులు వహింతురు. వర్మ-రాజులకును, గుప్త - వైశ్యులకును, దాస-శూద్రులకును జెల్లును. (ఈ బిరుదులు అతి ప్రాచీనకాలమున జాతినిఁబట్టి యుండెడిది. ఈ నాడు శర్మ, శాస్త్రివంటివి తక్క తక్కినవి సర్వసామాన్యమైనవి.)

బిల్వపంచకము —తులసి, మారేడు, వావిలి, ఉత్తరేణు, వెలగపత్రులు.

బిల్వాష్టకము—పంచబిల్వములు, జమ్మి, గలిక, ఉసిరిక పత్రులు.

బీజాక్షరములు — వాయు బీజాక్షరములు 10, అగ్నిబీజాక్షరములు 10, భూమి బీజాక్షరములు 10, జలబీజాక్షరములు 10, గగనబీజాక్షరములు 10.

బుద్ధిత్రయము—చూ. త్రివిధబుద్ధులు.

బుద్ధిద్వయము— స్మృతి రూపబుద్ధి, అనురూపబుద్ధులు.

బుద్ధిభేదములు —(6) పండ, మేధ,

చార్వి, గృహీతి, శ్రౌతి, చత్వరి.

బుద్ధులగుణములు—శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహము, అపోహము, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము.

బ్రహ్మకల్పము — 7 యుగములు = 1 మన్వంతరము; 14 మన్వంతరములు= 1 కల్పము; 2 కల్పములు=బ్రహ్మకు ఒకరోజు; ఇట్టి 30 రోజులు=బహ్మకు 1 మాసము; ఇట్టి 12 మాసములు = బ్రహ్మకు 1 సంవత్సరము; 108 సం॥ రములు = బ్రహ్మయొక్క ఆయుర్దాయము; బ్రహ్మజీవితము = పరబ్రహ్మమునకు 1 నిమేషకాలము.

బ్రహ్మద్వయము— పరబ్రహ్మము, శబ్దబ్రహ్మము.

బ్రహ్మస్వరూపత్రయము— 1. సత్యత్వము 2.జ్ఞానము 3.ఆనందము.

బ్రాహ్మణములు—తైత్తిరీయ, శతపథ, ఋగ్వేద, సామవేద, యజుర్వేద, అధర్వ, ఐతరేయ, కౌషీతకి (శాంఖాయన) మంత్ర, కృష్ణయజుర్వేద, శుక్లయజుర్వేద (శతపథము), అంతర్యాములు.

బ్రాహ్మణద్వయము—పామరులు, పండితులు.

బ్రాహ్మణుల నవధర్మములు— శమము, దమము, తపస్సు, శౌచము, ఓర్పు, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము.

భక్తులు—చూ. త్రివిధభక్తులు, నవవిధభక్తులు.

భగవద్గుణషట్కము—1. ఐశ్వర్యము, 2. వీర్యము, 3. యశము, 4 శ్రీ, 5. జ్ఞానము, 6. వైరాగ్యము.

భరతశాస్త్రప్రక్రియలు— (6) తాండవము, నటనము, నాట్యము, లాస్యము, నృత్యము, నర్తనము.

భాగ్యహేతుచతుష్టయము— కనకము, రజితము, బుద్ధి, మిత్రుఁడు.

భారతపర్వములు— (18) ఆది, సభా, అరణ్యక, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మాసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు.

భావనాత్రయము—1. కర్మభావన, 2. బ్రహ్మభావన, 3. ఉభయభావన.

భాషలు— సంస్కృతము, ఆంధ్రము, ఆంగ్లము, హిందీ, కన్నడము, తురకము, మలయాళము, అరవము, మహారాష్ట్రము, పారశీకము, బంగాళీ, కోయ, ఓఢ్రము మొ॥

భాషావిభాగములు—1. తత్సమము, 2. తద్భవము, 3. దేశ్యము, 4. గ్రామ్యము.

భూతపంచక గుణములు— 1. గంధము, 2. రసము, 3. రూపము, 4. స్పర్శము, 5. శబ్దము.

మండలత్రయము— సూర్య, చంద్ర, అగ్నిమండలములు.

మండల సప్తకము—కండర, జీర్ణ, రక్తప్రసరణ, శ్వాస, బహిష్కార్య, నాడీ

మండలములు — శరీరసంబంధమైనవి; చూ. సప్తమండలములు.

**మంత్రభేదములు**– స్తుతము, స్తోమము, గ్రహము, స్తోభము.

**మతత్రయము**—1. వైష్ణవము, 2.మాధ్వము, 3. స్మార్తము. (ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము.)

**మతద్వయము**—ఆస్తికము, నాస్తికము.

**మతములు**—సాంఖ్య, సేశ్వరసాంఖ్య, పాణిని, చార్వాకము, విరోచన, లోకాయిత, హిరణ్యగర్భ, వాచస్పతిమిశ్ర, మీమాంసక, వైశేషిక, అక్షపాద, భాట్ట, ప్రాభాకర, రాధావల్లభ, హరిదాసు, ఉదాసీన, మాలక్‌దాస, ధామక్, ఆనంద, మీరాబాయి, కబీర్, వీరశైవ (లింగాయత), పాశుపత, శైవ, శివాద్వైత, సమ్మేళితశైవ, మహావ్రతి, శివసమవాది, ఐక్యవాది, సంక్రాంతివాది, ప్రవామేశ్వరవాది, అవికారవాది, ఊర్ధ్వశైవ, అనాదిశైవ, ఆదిశైవ, మహాశైవ, గుణశైవ, క్రియాశైవ, చతుష్పాదశైవ, శుద్ధశైవ, యోగి, అభినవగుప్తాచార్య, చైతన్య, వల్లభ, వల్లభాచార్య, మహానుభావ, ఆర్య, దివ్యజ్ఞాన, బ్రాహ్మ, లౌకైక, శాక్తేయ, బౌద్ధ, మాధ్యమిక, యోగాచార, సౌత్రాంతిక, వైభాషిక, జైన, అర్హత, పారసీక, గ్రీకు, రోమక, స్కాండినేవియా, మెక్సికో, తార్తార, జపాన్, సయాం, పెరువియన్, కనడా, పెగు, ఫిలిప్పియన్, మలాకా, సుమేత్రా, జావా, లప్పంజీ, సింహళ, మలయ, లాప్లాండర్, విస్సినిపి, ఫ్లోర్డియన్, కొరబి, గినియా, బెనిస్, అద్రా, కొంగో, అంగోలా, అరకాన్, కాఫ్రియన్, కౌమ్స్చాట్కన్, తాయిసా, ఐగుప్త, మహమ్మదీయ, యూధ, క్రీస్తు, యాదవ, భాగవత, మనస్సాక్షి. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, తెన్ వడకల మతములు మొ॥ వీని వివరములు సర్వార్థసాగరము గ్రంథమున జూడనగును.

**మధ్యమగ్రామగత మూర్ఛనలు**– సౌవీరి, హారిణాశ్వ, కలోపనత, శుద్ధమధ్య, మారి, పౌరవి, హృష్యక. (7)

**మననపంచకము**— (బౌద్ధము) శ్రద్ధ, స్మృతి, వీర్యము, సమాధి, ప్రజ్ఞ.

**మన్మథబాణపంచకము**—1. అరవిందము, 2. అశోకము, 3. చూతము, 4. నవమల్లిక, 5. నీలోత్పలము.

**మన్మథావస్థలు**— (12) చూ. ద్వాదశావస్థలు.

**మన్మథునివింటినారులు**—తుమ్మెదయల్లె-దీనిబాణములు కలువ, తామర, మల్లెపూలు; చిగురుటల్లె - దీని బాణ. నల్లకలువ, అరంటి, మొల్లపూలు; తూడునూలునారి- దీని బాణ. మంకెన, అశోక, మల్లెపూలు; కురువేరు దంటనారి - దీని బాణ. పాదిరి, పొగడ, సంపంగిపూలు; వెన్నెలనారి-దీని బా. మొదలి జొన్న, దిరిసెనము, మొగలి పూలు.

**మరీచికాద్వయము**—1. మిరియాలు, 2. తెల్ల మిరియాలు.

**మర్మస్థానములు**—శరీరమున 107 జీవాధారములగు మర్మస్థానములు గలవు. (శార్ఙ్గధర మతప్రకారము

మాంసమర్మములు 11, సిరా మర్మములు 41, స్నాయు మర్మములు 27, అస్థిమర్మములు 8, సంధిమర్మములు 20)

మల్లబంధశతకము — హస్తము, కత్తెరి, బోరగిలవేసిముంచుట, నిపాతనము, పాదస ఘర్షణము, వ్యతిరేకముగా మార్చుట, పృష్టము, సమీకరణము, మోషణము, ఊపు, ఉద్ధారణము, గుల్ఫ శృంఖల, గ్రీవాతాడనము, నిమజ్జనము, ప్రత్యామర్షము, వ్యతిరేకముగా నూపుట, చుట్టుచుట్టుట, కూర్పరాకర్షణము, కూర్పరాపనయనము, బధిరము, బాహ్యము, అవతారణము, చరణశృంఖల, కౌన్యాన్యో, కూర్పరాపూరణము, ఉత్తానపాతనము, ఆకస్మికోపవేశనము, కక్షప్రవేశము, ఆకస్మికనిపాతనము, గార్దభనిపాతనము, ఆగ్రహము, ఆకస్మికోపవేశనము, ప్రతిశృంఖల, చతుర్దిశావరణము, విస్మారణము, వెనుకకుజొట్టుట, పాదతాడనము, పృష్ఠనిబంధనము, అవగాహనము, శిరోబంధనము, ద్విగుణబంధనము, కక్షము, శాతనిపాతనము, చతురంగము, వామపాదన్యాసము, అవలగ్నాకర్షణము, బధిరము, కబంధపూరణము, పరివేషము, బడి, శ్రవము, ముంపు, పరికేషము, చరణపరివేషము, కకుప్పరివేషము, బహిర్వ్యా, బధిరము, వక్షత్యాగము, ఉరో నిరోధము, ముక్కునొక్కుడు, జానువిన్యాసము, ఉరోభగ్నము, నాసికా నిరోధము, వామపాద తాడనము,. నిర్బంధము, పరివేషము, ఉయ్యేల, రజకధావనము, ప్రవేశము, హస్తాకర్షణము, చతుశ్చరణబంధము, చరణశృంఖల, గజశృంఖల, అపనుదపాదము, కక్షము, సవ్యపాద తాడనము, వ్యతిరేక గజశృంఖల, కక్ష నిపీడనము, వ్యతిరేక ద్విపశృంఖల, ప్రతికూలబంధము, కరతాడనము, దిశావరణము, పరివేషణము పృష్ఠ నియాతనము, ఉద్ధూతపాదము, సింహాసనము, డోల, చరణవినిమయము, కక్షన్యాసము, ఏకము, భ్రమణము, అర్ధకంకాళము, ఒంటికుంటి, నిహింసనము, పార్శ్వాకర్షణము, గజచంద్రుడు, ప్రకోష్ఠ పీడనము, పాదద్వయాకర్షణము. (చూ. కుస్తీ మల్లయుద్ధబోధిని.)

మసూరికాభేదములు— వాత, పిత్త, పిత్తశ్లేష్మ, వాతపిత్త, వాతశ్లేష్మ, సన్నిపాత, త్వగ్గత, రక్తజ, మాంసజ, మేదజ, అస్థి, మజ్జ, శుక్రధాతువు మొ॥

మహాప్రబంధ వర్ణనలు—(27) — విప్రలంభము, ద్యూతము, అద్భుతము, రణము, మద్యపానజ వికారము, సూర్యోదయము, సూర్యాస్తమయము, వివాహము, గృహప్రవేశము, కుమారోదయము, సాగరము, శైలము, మృగయ, వనము, అరణ్యము, మంత్రము, విజయము, మన్యాశ్రమము, దండయాత్ర, జార సంవాదము, నాయక గుణవర్ణనము, చంద్రోదయము, చంద్రాస్తమయము, మేఘము, నిశ, గ్రీష్మర్తువు, వంశావతారము.

మహారసములు—అభ్రకము, వైక్రాంతము, మాక్షికము, విమలము, శిలాజిత్తు, మైలతుత్తము, చపలము, కఫరి.

మహావాక్యచతుష్టయము— శ్రుతి 1. ప్రజ్ఞానంబ్రహ్మ(ఋగ్వేదము, ఐత

రేయోపనిషత్తు), 2. అహం బ్రహ్మాఽస్మి (యజుర్వేదము, బృహదారణ్యకోపనిషత్తు), 3. తత్త్వమసి (సామవేదము, ఛాందోగ్యోపనిషత్తు), 4. అయమాత్మా బ్రహ్మ (అథర్వణవేదము).

మాయారూపములు—అసత్యత్వము, జడత్వము, దుఃఖము.

ముద్రలు— సుముఖము, సంపుటము, వితతము, విస్తృతము, ద్విముఖము, త్రిముఖము, చతుర్ముఖము, పంచముఖము, షణ్ముఖము, అధోముఖము, వ్యాపకాంజలికము, శకటము, యమపాశము, గ్రథితము, సమ్ముఖోన్ముఖము, ప్రలంబము, ముష్టికము, మత్స్యము, కూర్మము, వరాహకము, సింహాక్రాంతము, మహాక్రాంతము, ముద్గరము, పల్లవము, (24); సురభి, జ్ఞాన, చక్ర, యోని, కూర్మ, పంకజ, లింగ, నిర్యాణ ముద్రలు (8).

మూత్రకృచ్ఛ్రములు — వాతము, పిత్తము, శ్లేష్మము, సన్నిపాతము, శుక్రము, విట్టు, ఘాతము, అశ్మరి.

మృగములు పట్టువలలు — ఎల్లుకవల, ఏదువల, కుందేటివల, దొడ్డివల, పందివల, లేడివల, సవదండవల.

మృత్తికాత్రయము—1. కంకుష్ఠము, 2. గైరికము, 3. సౌరాష్ట్రికము.

మేళకర్తలనామములు —కనకాంగి, రత్నాంగి, గానమూర్తి, వనస్పతి, మానవతి, తానరూపిణి, సేనాపతి, హనుమత్తోడి, ధేనుక, నాటకప్రియ, కోకిలప్రియ, రూపావతి, గాయకప్రియ, వకుళాభరణము, మాయామాళవగౌళ, చక్రవాకము, సూర్యకాంతి,హాటకాంబరి, ఝంకారధ్వని, నటభైరవి, కీరవాణి, ఖరహరప్రియ, గౌరీమనోహరి, వరుణప్రియ, మారరంజని, చారుకేశి, సరసాంగి, హరికాంభోజి, ధీరశంకరాభరణము, నగానందిని, రాగప్రియ, రాగవర్ధని, గాంగేయభూషిణి, వాగధీశ్వరి, శూలిని, శుద్ధమధ్యమము, షాళగ, జలార్ణవము, ఝుల్లవరాళి, నవనీతము, పావని, లఘుప్రియ, గవాంభోజి, భవప్రియ, శుభపంతువరాళి, షడ్విధ మార్గిణి, సువర్ణాంగి, దివ్యమణి, ధవళాంబరి, రామనారాయణి, కామవర్ధని, రామప్రియ,గమనశ్రమ, విశ్వాంబరి, శ్యామలాంగి, షణ్ముఖప్రియ, సింహేంద్ర మధ్యమము, హేమవసంత, ధర్మావతి, నీతిమతి, కాంతామణి, వృషభప్రియ, లతాంగి, వాచస్పతి, మేచకకల్యాణి, చింతామణి, సుచరిత్రము, జ్యోతిస్స్వరూపిణి, ధాతువర్ధని, నాసికాభరణము, కోసలము, రసికప్రియ మొ.

మోహచతుష్టయము —లజ్జా,విభవ, కరుణా, నిజమోహములు.

మౌనత్రయము — 1. వాఙ్మౌనము (వాక్కును నియమము చేసికొనుట); 2 అక్షమౌనము (పదునాలు గింద్రియములను విషయాదులందుఁ జొరనీయక పరబ్రహ్మమందే లగ్నము చేయుట); 3. కాష్ఠమౌనము (మూలబంధోడ్యాణజాలంధరబంధములచేతను బద్ధాసనాదులచేతను శరీరమును నిలుపుకొనుట.)

యంత్రములు-భారమితి(Barometer) -వాయుపీడనము కొలుచుటకును, పర్వ

తములఎత్తును, గనులలోతును,తుపాను గాలి మొదలగువాని రాకను తెలిసి కొనుటకుపయోగించునది. తాపమాపని (థర్మామీటర్)-శీతోష్ణముల హెచ్చు తగ్గులను గనపఱచు సాధనము. దిక్సూచి (Mariner's Compass)-నావికులు సముద్రముపైఁ బ్రయాణము చేయు నపుడు ఉత్తర దక్షిణదిశలను జూపుచు వారికి సహాయముచేయు యంత్రవిశేషము. దూరదర్శిని (Telescope):- దూరమందుండు నక్షత్రములు, గ్రహములు, శత్రుసైన్యములు మొదలగు వానిని జూచుట కుపయోగపడునది. సూక్ష్మదర్శిని (Microscope) - రక్తకణములు, ఆకులలోని చిన్నచిన్నభాగములు, సూక్ష్మక్రిములు మొదలగు అతి సూక్ష్మవస్తువులను పెద్దవిగాఁ గనపఱచు సాధనము. ఛాయాగ్రాహకయంత్రము (Camera) —ప్రతిబింబమును స్పష్టముగాఁ దయారుచేయు యంత్రము. ధ్వనిస్థాపని (Gramophone).—ఒకరు పాడినపాటనుగాని,ధ్వనినిగాని అనుకరించు యంత్రము. అశరీరవాణి(Radio)-తంతిసహాయము లేక మిగులదూరమున జరుగుచుండిన యుపన్యాసములనుగాని, పాడినపాటనుగాని వినుటకుపయోగించుసాధనము. విద్యుద్వేగజనని (Dynamo):-మిగుల బలముగల విద్యుచ్ఛక్తిని తయారు చేయు యంత్రసాధనము. విద్యుచ్ఛక్తి మాపకము (Voltameter) - నీటిలో విద్యుచ్ఛక్తిని బ్రసరింపఁజేసి, అందలి ప్రాణవాయువుయొక్కయు, ఉదజనియొక్కయు పాళ్ళను దెలుపునది.

విద్యుచ్ఛక్తిమాపని(Galvanometer) :- ఒక వస్తువునందు విద్యుచ్ఛక్తి ప్రసరించుచున్నదియు, లేనిదియు తెలియఁజేయు యంత్రవిశేషము. తారావార్తాయంత్రము (Telegraph) - తంతి ద్వారా వార్తను దెలియఁజేయు యంత్రము. అయస్కాంతము (Magnet) - ఇనుపవస్తువుల నాకర్షించు సాధనము. యక్షిణీదీపము (Magic lantern) - ఒకవస్తువుయొక్క పెద్దదిగాఁ జేయఁబడిన ఆకారమును దెరపైఁ దలక్రిందుగా గనపరచు యంత్ర విశేషము. వాయువిమానము (Aeroplane) — భూమికి పైన గాలిలో ప్రయాణము చేయుటకు అనువగు సాధనవిశేషము. ఆవిరియంత్రము (Steamer):—సముద్రాదులందు సుఖముగ ప్రయాణము చేయుట కనువగునది. చలనశకటము (Motor car):—జంతు సహాయము లేక భూమిపై మిగుల వేగముగఁ బ్రయాణముచేయుట కనువగు యంత్రశకటము. ధూమశకటము(Train) — రాక్షసబొగ్గుయొక్క ఆవిరిసహాయమున పట్టాలపై నొక్కమాఱుగ ననేకులు ప్రయాణము చేయుటకు సౌకర్యముగల పొగబండి. విద్యుచ్ఛక్తి(Electricity).—దీని మూలమున దీపసౌకర్యములే కాక వివిధములగు పనులకు సహాయములు జరుగుచున్నవి. ఘనత్వమాపకము (Hydrometer) —పాలయొక్క శ్రేష్ఠా శ్రేష్ఠత్వమును దెలిపెడు సాధనము. ఉత్పీడనయంత్రము (Brahma Press).— దూది బస్తా

లను చిన్నవిగా అణచుట కుపయోగించుసాధనము. నీటిపంపు (Water pump) —నీటిని లోతునుండి మెరకకు తెచ్చుట కుపయోగపడునది. థర్మాస్ఫ్లాస్కు (Thermos Flask) - వేడివస్తువులను 34 గంటలవరకు చల్లారకుండునట్లు చేయుటలో నుపయోగపడు సాధనము. విద్యుత్పాత్ర(Battery) - విద్యుద్ఘట సహాయమున అవసరములయందు ఒకచోటునుండి మఱియొకచోటునకు చీకటిలో చేతఁగొనిపోవుట కనువగు చిన్నవిద్యుద్దీపము. శబ్దవాహకతారాయంత్రము (Telephone) — కొన్ని వందలమైళ్ళదూరము వఱకు ఒకరితోనొకరు మాట్లాడుట కుపకరించునది. సూక్ష్మశ్రవణయంత్రము (Microphone) - కొన్నివేల మైళ్ళ దూరమువఱకు పరస్పరము మాట్లాడుట కుపయోగించుయంత్రసాధనము. బహురూపదర్శకము(Kaleidoscope) - అఱువది డిగ్రీల కోణములో రెండద్దము లమర్చి మధ్యభాగమున నొక వస్తువునుంచి చూచిన, మఱియైదుప్రతిబింబములు కనఁబఱుచునది. సూక్ష్మవస్తుమాపకము(Micrometer) — ఉష్ణగ్రతచే లోహములందుఁగలిగిన సూక్ష్మపరిమాణాధిక్యమును దెలిపెడు యంత్రము. ఆర్ద్రతామాపకము (Hygrometer.)— గాలియందలి తుషారాంకమును, దానియొక్క ఒత్తుడుశక్తిని కనుగొను యంత్రవిశేషము.

యక్షగానపంబంధము—కథాసందర్భము, చక్రవాళము, తారావళి, బిరుదావళి, భోగావళి.

యక్షప్రశ్నలు—

1. సూర్యుని నడపునదెద్ది?- బ్రహ్మము.
2. సూర్యుని సేవించువా రెవరు?— దేవతలు.
3. అతఁడు దేనిచే నస్తమించును?— ధర్మునిచే.
4. అతని కాధారమెయ్యది?-సత్యము.
5. మనుజుఁడు దేనిచే శ్రోత్రియుఁ డగును? — వేదముచే.
6. అతఁడు దేనిచే మహిమనొందును?- తపస్సుచే.
7. వానికి సాయపడునదేది?- ధైర్యము.
8. అతఁడు దేనిచే బుద్ధిమంతుఁడగును?- బుధసేవ వలన.
9. భూదేవుఁడు దేవత్వము నెట్లు పొందును? — అధ్యయనమున.
10. అతనికి సాధుత్వాసాధుత్వ మెట్లు సంభవించును? - నిరంతర వ్రతాచరణమున సాధుత్వమును, శిష్టాచారభ్రష్టత్వమున నసాధుత్వమును సంభవించును.
11. అతఁడు మానుషుఁ డెట్లయ్యెను? - మృత్యుభయమున.
12. జీవన్మృతుఁ డెవఁడు? - దేవాతిథి పితృసేవకాదులకుఁ బెట్టక తిను వాఁడు.
13. భూమికంటె భారమైన దెద్ది? — జనని.
14. ఆకసముకంటెఁబొడవెద్ది? - తండ్రి.

15. వాయువుకంటె వేగముగల దెద్ది? - మనస్సు.

16. తృణముకంటె దట్టమైన దేది ?— చింత.

17. నిద్రించినను గన్నుమూయని దేది?- చేప.

18. జన్మించియుఁ బ్రాణములేని దేది? - గ్రుడ్డు.

19. రూపమున్నను హృదయము లేని దేది ?—రాయి.

20. అనవరతము వేగముగల దేది ? - నది.

21. మార్గస్థునకు - రోగపీడితునకు - గృహస్థునకు - మృతినొందినవానికి బంధువు లెవ్వరు ? — సార్థము - వైద్యుడు - మంచిభార్య- సుకర్మము వరుసగాఁ జుట్టములు.

22. ధర్మమున కాధార మేది ? - దాక్షిణ్యము.

23. కీర్తి కాశ్రయ మేది? — దానము.

24. దేవలోకమునకు మార్గ మేది ? — సత్యము.

25. సుఖమున కాధార మేది ? — శీలము.

26. నరున కాత్మ యేది ? - కుమారుఁడు.

27. అతనికి దైవికబంధు లెవ్వరు ? — భార్య.

28. అతని జీవనాధార మేది ?-మేఘము.

29. అతఁడు దేనివలన సంతసించును ? - దానమువలన.

30. ధర్మములలో నుత్తమ మేది ? - అహింస.

31. ఎప్పుడును దృప్తిగాఁ బొడియుండున దేది? - యాగకర్మ.

32. దేని నిగ్రహమున సంతోషము కలుఁగును ? మనోనిగ్రహమున.

33. ఎవరితోఁ జేసిన సంధి శిథిలము కాదు ? - సుజనులతో.

34. లోకమునకు దిక్కెది?-సత్పురుషులు.

35. అన్నోదకములు వేనియం దుద్భవించును ? - భూమ్యాకాశములందు.

36. ఏది నిజమైనవిషము ?-విప్రధనము.

37. శ్రాద్ధవిధికి కాలమేది ?-బ్రాహ్మణాగమనసమయము.

38. మనుజుఁడు దేనిని విడచి సర్వజనాదరణీయుఁడు, శోకరహితుఁడు, ధనవంతుఁడు, సుఖవంతుఁడు నగును ? - క్రమముగా గర్వమును, క్రోధమును, లోభమును, దృష్ణను విడిచిన యెడల.

39. ఎట్టివాఁడు పురుషశబ్దవాచ్యుఁడు ? - కీర్తిమంతుఁడు.

40. సర్వధని యనఁదగువాఁ డెవఁడు ? - ప్రియాప్రియములు, సుఖదుఃఖములు సమముగా నెంచువాఁడు.

యజ్ఞపంచకము—
చూ. పంచయజ్ఞములు.

యతిభేదములు— స్వరయతులు, వ్యంజనాక్షరవిరతులు,ఉభయవసులు, ప్రాసవిక్రాంతులు.

యతులు—సరస, సంయుక్త, వర్గ, దేశీయ, ఎక్కటి, పోలిక, చక్కటి, అనుస్వార, స్వర, యూవడి, ఋవడి,

మావడి, ప్రభు, విభాగ, సౌభాగ్య, ప్రాస, భిన్న, ప్రాది, అభిన్న, అభేద్య వృద్ధి, నిత్యసమాన, ప్లుత, ఆదేశ, వికల్ప, కాకు, రివ్వడి, అఖండ, ఉభయ, యశ వర్గయతులు.

యమకభేదములు— ఆది, అంత్య, మధ్య, ఆదిమధ్యాంతస్వరయమకములు.

యమములు— అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము.

యవాద్వయము—1. తెల్ల ఆవాలు, 2. నల్ల ఆవాలు.

యాగములు— అశ్వమేధము, రాజసూయము, విశ్వజిత్తు, పుత్రకామేష్టి, సత్ర సర్పయాగములు మొ.

యుద్ధములు—ప్రకాశ, కూట, పార్ష్ణి యుద్ధములు.

యోగములు— (1) విష్కంభము, ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్యము, శోభనము, అతిగండము, సుకర్మము, ధృతి, శూలము, గండము, వృద్ధి, ధ్రువము, వ్యాఘాతము, హర్షణము, వజ్రము, సిద్ధి, వ్యతీపాత్తు, వరీయాన్, పరిఘము, శివము, సిద్ధము, సాధ్యము, శుభము, శుక్లము, బ్రహ్మము, ఐంద్రము, వైధృతి, (2) బుధాదిత్య, అధి, శోమదుర్మి, మాలిక, మాల కేసరి, చంద్రమంగళ, శనిచంద్ర, శ్రీమంత యోగములు, విపరీతరాజ యోగము, ఛాదక, వేధక, బంధక, ప్రతిబంధక యోగములు. (జాతకమునకు సంబంధించినవి. ఇంకను 1800 నాసభయోగములును మఱియుఁ జాంద్రయోగములును గలవు.) (3) మంత్ర, హఠ, లయ, రాజయోగములు.

యోగ యమాంగములు— సత్యము, దయ, క్షమ, ధృతి మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచము.

యోగాంగములు— చూ. అష్టవిధ యోగాంగములు.

రతిపంచకము—చూ. పంచవిధరతులు.

రతులు— అశ్వారతి, ఏకాదశారతి, కుంభారతి, గరుడారతి, పంచారతి, పురుష మృగారతి.

రథిక చతుష్టయము—అతిరథ, మహారథ, సమరథ, అర్ధరథులు. (మహారథునికి మారుగా 'మధ్యరథుని' కొందఱు పఠింతురు.)

రసములు—1. లాలాజలము; 2. మధుర రసము; 3. జఠరరసము, 4. పైత్య రసము 5. అంత్రరసము.

రసవిశేషములు— శృంగారము, హాస్యము, కరుణ, రౌద్రము, వీర రసము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము.

రసాదులు— పాదరసము, గంధకము, ఇంగిలీకము, అభ్రకము, మణిశిల, తాళకము, స్రోతాంజనము, టంకణము, రాజావర్తము, చుంబకము, స్ఫటికము, కాసీసము, రసకము, ముదారసింగు (వీనిని ఉపరసములందురు).

రసాధిదేవతలు—హరి, శక్ర, యమ, బ్రహ్మ, వినాయక, రుద్ర, మహాకాల, శర్వరీంద్ర, పరబ్రహ్మములు.

రసోత్పత్తులు — శృంగారమునుండి హాస్యమును, రౌద్రమునుండికరుణయు, వీరరసమునుండి అద్భుతమును, బీభత్స మునుండి భయానకమునుకలుగుచున్నవి. (శృంగార తిలక గ్రంథము)

రాగ కాలనిర్ణయము — దేశాక్షి, దేవగాంధారి, ఖాండి, ధన్యాసి, మారువ, దేవక్రియ, మందాళి, గౌరి, భూపాల రాగములు - (రాత్రి 3 గం. మొదలు 6 గం); కురంజి, సాహుళి, ఘంటా రవ, రామక్రియ, బిళహరి, మలహరి, ముఖారి, యమున, శేగుప్తి, భైరవి రాగములు-(ఉ. 6 గం.); మేఘరంజి, సారంగ, భల్లాతి, మధ్యమావతి, దేశి, నీలాంబరి, మంగళ, దేశిక, శ్రీరా గములు - (ప. 9 గం. మొ. 12 గం); మోహన, కల్యాణి, కాఫి, ఘూర్జరి, శంకరాభరణము, పూరి, వసంత రాగ ములు - (ప. 12 గం. మొ. 3 గం); నారాయణి, హిందోళి, సౌరాష్ట్రి, తోడి, రామని, గౌరి, వరాళి, పంతు వరాళి, ఉసేని, మాళవి, లలిత రాగ ములు-(ప. 3గం. మొ. 6 గం); వేళా వళి, కాంభోజి, సావేరి, బేగడ, పున్నాగ, నాటరాగములు - (సా. 6 గం. మొ. 9 గం.); గుండక్రియ, మనోహరి, మంగళకైశిక, కేదార, ఆహిరి, అసావేరి, బంగాళ, బౌళిరాగ ములు - (రా. 9 గం. మొ. 12 గం); జోగిని, చిత్రవేళ, కర్ణాట, సురట, మంజరి రాగములు - (రాత్రి 12 గం. మొ. 3 గం. వఱకు పాడదగినవి)

రాగద్వేషాదులు- రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము, దర్పము, అహంకారము.

రాగములు, జాతులు — భైరవి - (దేవక్రియ, మేఘరంజి, కురంజి); భూపాలము - (బిలహరి, మలహరి, ఖాండి), శ్రీరాగము - (హిందోళి, భల్లాతి, సాహుళి); ఫలమంజరి-(దేశి, ముఖారి, లలిత), వసంత-(రామక్రియ, వరాళి, గౌళ), మాళవి-(గండక్రియ, ఘూర్జర, బౌళి) బంగాళము-(కల్యాణి, ఆహిరి, సావేరి); నాట - (ఘంటా రవము, కాంభోజి, శంకరాభరణము); కుండలీకరణములలోనివి (24) న స్త్రీ రాగములు. మిగిలిన 8 ని పురుష రాగములు. (స్త్రీరాగముల భర్తలు.)

రాజకీయపంచాంగములు — కర్మా రంభోపాయము, దేశకాల విభాగము, పురుషద్రవ్యసంపత్తి, వినిపాత ప్రతీ కారము, కార్యసిద్ధి.

రాజపక్షీయులు — 7. మూలబలము, మిత్రబలము, సమాశ్రితుఁడు, సంబంధ జుఁడు, కార్యసముద్భవుఁడు, భృత్యుఁ డు, ఉపచారగృహీతుఁడు.

రాజసవృత్తులు—పేరాస, స్నేహము, రాగము, లోభము మొ.

రాజ్యపాలనాంగములు— ప్రభువు, మంత్రము, ధనాగారములు, దుర్గములు, సైన్యములు, రాష్ట్రములు (ప్రజలు-

మిత్రులగు భూపతులు.

రాజ్యమంత్రాంగ పంచకము — సహాయకులు, సాధనోపాయములు, దేశకాల విభాగములు, విపత్ప్రతి క్రియలు, రక్షణ.

రామాయణ కాండములు—బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండములు.

రాశ్యధిపతులు— సింహమునకు సూర్యుఁడు, కర్కాటమునకుఁ జంద్రుఁడు, మేష వృశ్చికములకు అంగారకుఁడు, కన్యామిథునములకు బుధుఁడు, ధనుర్మీనములకు బృహస్పతి, వృషభ తులలకు శుక్రుఁడు, మకరకుంభములకుశని.

రాసులు—మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.

రేవుస్థలములు—వేన్కోవర్, సెంట్ ఫ్రెన్సిస్కో, న్యూ ఆర్లియన్సు, న్యూయార్కు, మాంట్రియాల్, హాలిఫాక్సు, పేరా, మానోస్, రయోడి జనీరో, బెనోస ఎయిర్సు, వాల్ప రైజో, లివర్పూల్, సౌథేంప్టన్, గ్లేస్గో, ఎడిన్‌బర్గు, లండన్, హేవర్, ఏమ్స్టర్డామ్, హేంబర్గ, స్టాక్‌హోం, కోపెన్‌హేగన్, లెనిన్‌గ్రాడ్, బెర్గెన్, లిస్‌బన్, మార్సైల్సు, నేపుల్సు, అలెగ్జాండ్రియా, వెన్నిస్, ఏడెన్, బొంబాయి, మద్రాస్, కొలంబో, కలకత్తా, రంగూన్, సింగపూర్, హాంగ్‌కాంగ్, షాంగ్‌హాయి, యోకహామా, కేప్‌టౌన్, పోర్టుఎలిజబెత్, డర్బాన్, బైరా, జాంజిబార్, మార్షస్, ఫర్మేంటిల్, ఎడిలైడ్, మెల్బోరన్, సిడ్నీ, బ్రిస్బేన్, డార్విన్, హోబర్టు, వెల్లింగ్టన్, ఏంక్లాండ్, మసులిపటం, కాకినాడ, వైజాగ్.

రోమకూపములు —మానవదేహమున (35000000) మూడుకోట్ల ఏబదిలక్షల రోమకూపములు గలిగి స్థూలసూక్ష్మ నాడులకు ముఖములై, వానినుండి స్వేదబిందువులు స్రవించుచుండును.

రోహిణీద్వయము — 1. కటుక రోహిణి, 2. సితరోహిణి.

లక్షణచతుష్టయము — వృత్తి, రీతి. శయ్య, పాకము.

లక్షణాత్రయము — 1. జహల్లక్షణ, 2. అజహల్లక్షణ, 3. జహదజహల్లక్షణ; 1 అతద్వ్యావృత్తి లక్షణము, 2. తటస్థ లక్షణము, 3 స్వరూప లక్షణము.

లక్ష్యత్రయము—1. అంతర్లక్ష్య, 2. మధ్యలక్ష్య, 3. బాహ్యలక్ష్యములు.

లఘుపంచమూలములు— 1. చిన్నములక, 2. పెద్దములక, 3. కోలపొన్న, 4. నేలపొన్న, 5. పల్లేరువేళ్లు.

లవణములు — (లవణపంచకము) చూ. పంచలవణములు.

లింగచతుష్టయము — ఇష్టలింగము, ప్రాణలింగము, భావలింగము, ఆత్మలింగము.

లింగత్రయము—1. పుంలింగము, 2. స్త్రీలింగము, 3. నపుంసకలింగము.

చూ. త్రిలింగములు.

లింగషట్కము— 1. ఉపక్రమము, 2. ఉపసంహారము, 3. అభ్యాసము, 4. అపూర్వత, 5. అర్థవాదము, 6. ఫలము; 7. ఉపపత్తి, (లౌకికముగా కొందరు "ఉపపత్తి"ని తగ్గించి మొదటి ఆరింటిని గ్రహింతురు. వేదమున ఉపక్రమ, ఉపసంహారములను రెండింటిని ఒక లింగముగానే గ్రహించి "ఉపపత్తి"ని కలుపుకొని ఆరులింగములుగా నెన్నుదురు) (2) ఆచార, ప్రసాద, గురు, జంగమ, శివ, మహాలింగములు.

లోకద్వయము— ఇహలోకము, పరలోకము.

లోహత్రయము— బంగారు, వెండి, రాగి.

లోహములు— బంగారము, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము, అల్యూమినము, రాగి, సీసము, పాదరసము, ప్లాటినము, తగరము మొ.

వచనత్రయము— 1. ఏకవచనము, 2. ద్వివచనము, 3. బహువచనము, (2) 1. నిజము చెప్పుట, 2. కీర్తి చెప్పుట, 3 నిందించుట.

వచనద్వయము— సువచనము, దుర్వచనము.

వన్నెలు— తెలుపు, ఎఱుపు, నలుపు, ఆకుపచ్చ, పసిమి.

వయోఽవస్థలు— బాల (1 మొ. 16 సం.), యౌవన (16 మొ. 30 సం); ప్రౌఢ (30 మొ. 50 సం.), లోల (50 మొ. 100 సం.).

వర్గత్రయము—చూ. త్రివర్గము, 1. తండ్రి 2. తాత, 3. ముత్తాత.

వర్ణసంజ్ఞలు— మాతృకలు, వర్ణములు, లిపులు, వ్రాలు.

వర్తమాన ప్రతిబంధము—విషయాసక్తిరూపముగలది, బుద్ధిమాంద్యము, కుతర్కముచేయుట, ఆత్మకుఁ గర్తృత్వాది ధర్మయుక్తత్వజ్ఞాన లక్షణమందు యుక్తిరహిత నిశ్చయము.

వర్షపర్వతములు - హిమాచలము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగి, మాల్యవంతము, గంధమాదనము.

వర్షములు— భారత, కింపురుష, హరి, రమ్యక, హిరణ్మయ, ఉత్తర, కురు, కేతుమాల, ఇలావృత వర్షములు.

వస్తుద్వయము—దృక్కు, దృశ్యము.

వస్తువులు—సత్తు, చిత్తు, ఆనందము, నామము, రూపము, (వస్తువిభాగము—ఆత్మ-తచ్ఛేషము- ఉపేక్షావిషయము-ద్వేషవిషయము.)

వాక్యదోషములు— శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తియుతము, వ్యాకీర్ణము, వాక్యసంకీర్ణము, వాక్యగర్భితము, భిన్నలింగము, భిన్నవచనము, న్యూనోపమము, అధికోపమము, భగ్నచ్ఛందము, యతిభ్రష్టము, అశరీరము, అరీతికము, విసర్గలుప్తము, అస్థానసమాసము, వాచ్యవర్జితము, సమాప్త

౦ పునరాత్తము, సంబంధవర్జితము, పత త్ప్రకర్షణము, అధికపదము, ప్రక్రమ భంగము మొ.

వాక్యద్వయము— అవాంతర వాక్యములు, మహావాక్యములు.

వాద్యచతుష్టయము— తత, అనద్ధ, సుషిర, ఘనములు.

వాయుపంచకము— 1. మనస్సు, 2. వ్యానము, 3. త్వక్కు, 4. స్పర్శము, 5. పాణి.

వాయువులు—1. ప్రాణవాయువు (Oxygen), బొగ్గుపులుసు వాయువు (Carbon-dioxide), నత్రజని (Nitrogen), ఉదజని (Hydrogen) 2 ప్రాణము (ఇది హృదయము నుండియు, నాసికనుండియు వెలువడుచుండును); అపానము ఇది పొత్తి కడుపునకు దిగువనుండి మలమూత్రాదులను బయలు వెడలింపజేయును; వ్యానము (ఇది శరీరమునం దంతటను వ్యాపించియుండును); ఉదానము (ఇది కంఠముననుండి మాటలాడ వీలు గలుగఁ జేయును); సమానము: (ఇది అన్నాశయమున జఠరాగ్నికి సమీపమున నుండును.)

వారములు— ఆదివారము (భానువారము), సోమవారము (ఇందువారము) మంగళవారము (భౌమ(జయ)వారము), బుధవారము (సౌమ్యవారము), లక్ష్మీవారము (గురువారము), శుక్రవారము (భృగువారము), శనివారము (మంద (స్థిర) వాసరము)

వాసనాత్రయము— చూ. త్రివిధ వాసనలు.

వాసనాద్వయము— శుద్ధవాసన, మలినవాసనలు

•

వింశతిముద్రలు— (యోగశాస్త్రములు) మహాముద్ర, నభోముద్ర, ఉడ్యాణబంధ, జాలంధరబంధ, మహాబంధ, మహావేధ, ఖేచరీ, విపరీతకరణి, యోని, వజ్రోళి, శక్తిచాల, తటాక, మండూక, శాంభవీ, అశ్వినీ, పాశినీ, కాక, మతంగినీ, భుజంగినీ ముద్రలు.

విధులు—నియమము, పరిసంఖ్య, అపూర్వవిధులు.

విప్రలంభకారణ చతుష్టయము— 1.ఈర్ష్య, 2. విరహము, 3. అభిలాష, 4. ప్రవాసము.

విభక్తులు—చూ. వ్యాకరణ ప్రకరణము.

విరోధరసములు— శృంగార బీభత్సములు, వీరభయానకములు, రౌద్రాద్భుతములు, హాస్యకరుణములు.

విలుకాండ్రనిలుకడలు— ఆలీఢము (కుడికాలు ముందుకుఁ జాచి ఎడమకాలువెనుకకుంచుట), ప్రత్యాలీఢము- (ఎడమకాలు ముంగుకుఁజాచి కుడికాలు వెనుకకుఁ బెట్టుట), సమపదము-(రెండుకాళ్లు సరిగానిల్పుట), విశాఖము-(రెండు కాళ్ల నడుమ జానెడెడము గలుగ నిలుచుట), మండలము - (పాదయుగ్మము గుండ్రముగా నుండులాగున నిలుపుట.)

విశ్వేదేవతలు—వసుబంధులు, క్రతుదక్షులు, కాలకాములు, ధురివిరోచనులు, పురూరవాద్రవులు.

విషభేదములు — స్థావర, జంగమ, కృత్రిమ విషములు.

విష్ణుపంచాయుధములు— 1. శంఖము, 2. చక్రము, 3. కౌమోదకము, 4. నందకము, 5. శార్ఙ్గము.

వృత్తిత్రయము—1. సమాస, 2.తద్ధిత 3. కృద్వృత్తులు.

వృత్తులు— సాత్త్వికము, రాజసము, తామసము,ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి.

వేదాంగములు-1. శిక్ష (పాణినికర్త), 2. వ్యాకరణము (పాణిని), 3. ఛందము (పింగలముని), 4. నిరుక్తము (యాస్కముని), 5.జ్యోతిషము (ఆదిత్యాదులు), 6. కల్పము (ఆశ్వలాయన, కాత్యాయన, ఆపస్తంబ, బోధాయన, వైఖానస, ద్రాహ్యాయన, భారద్వాజ, సత్యాషాఢ, హిరణ్యకేశి మొ. కర్తలు.)

వైదికకర్మలు — యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహ, గర్భాధాన, పుంసవన, సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల, ఉపనయన, ప్రాజాపత్య, సౌమ్య, ఆగ్నేయ, వైశ్వదేవ, గోదాన, సమావర్తన, వివాహ, పితృమేధములు.

వైనతేయులు — కశ్యపునకు వినత యందుఁ గలిగిన సంతతి, అరుణుఁడు (సూర్యసారథి), గరుడుఁడు (విష్ణుని వాహనము).

వ్యభిచారిభావములు — నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తివిబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము,మరణము,త్రాసము, వితర్కము.

శంకరాచార్యసంప్రదాయస్థులు- సరస్వతి, పురి, భారతి, పద్మ, తీర్థ, ఆశ్రమి, వన, అరణ్య, పర్వత, సాగరాదులు.

శక్తిత్రయము—(1) ప్రభుశక్తి,మంత్రశక్తి, ఉత్సాహశక్తి, (2) ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి.

శతావరి పంచమూలములు— పిల్లిపెసర, పెసర, గలిజేరు, ముత్తవపులగము, ఆముదపుచెట్టు.

శబ్దక్రియలు — ధ్రువము, శమ్యము, తాళము, సన్నిపాతము.

శబ్దభేదములు—వాచక, లక్షక, వ్యంజకములు.

శబ్దవృత్తులు—అభిధ, లక్షణ, వ్యంజన.

శబ్దాలంకారములు— ఛేక, వృత్తి లాటానుప్రాసములు.

శమాదిషట్కము—1. శమము- (అంతరింద్రియనిగ్రహము), 2. దమము - (బాహ్యేంద్రియ నిగ్రహము), 3.ఉపరతి-(విహితకర్మలను జ్ఞానవిధిచేఁ గ్రమముగావిడిచిపెట్టుట) 4.తితిక్ష-శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగు

ద్వంద్వములయెడ సమబుద్ధిగలిగి యుండుట), 5. శ్రద్ధ - (గురుబోధ, వేదాంతశాస్త్రము, పరమాత్మ మొ. వానియందు విశ్వాసము గలిగి యుండుట); 6. సమాధానము - (సద్గురూపదేశములగు మహావాక్యములను శాస్త్రములందుఁ జూచి మనస్సంతుష్టి నొందుట )

శరీరాంగములు— కరణములు, చరణములు, ఉరము, లలాటము, భుజములు.

శిరోభేదములు—సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోళితము, ధుతము, కంపితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, పరివాహితము.

శీలపంచకము—(బౌద్ధము) అహింస, సత్యభాషణము, సురాపాన వర్జనము, తత్త్వవస్త్వపరిగ్రహము, పరధన పరకాంతా విముఖత.

శుంఠీద్వయము—1. శొంఠి, 2. అగరుశొంఠి.

శ్రుతిభేదములు—తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవతి, దయావతి, రజని, రక్తిక, రౌద్రి, క్రోధ, వజ్రిక, ప్రసారిణి, ప్రతి, మార్జని, క్షితి, రక్త, సందీప, ఆలాపి, మదంతి, రోహిణి, రమ్య, ఉగ్ర, క్షోభిణి, (సంగీతసంబంధములు).

షట్కర్మలు—యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహములు.

షట్కాలములు—ప్రాతః, సంగమ, మధ్యాహ్న, అపరాహ్న, సాయాహ్న, ప్రదోషకాలములు. (ప్రదోషకాలమునకు మారుగా కొందరు అర్ధరాత్రి కాలమును గ్రహింతురు.)

షట్కౌశికములు—1. త్వక్కు, 2. రుధిరము, 3. అస్థి, 4. మాంసము, 5. మజ్జ, 6. స్నాయువు.

షట్చక్రవర్తులు—1.హరిశ్చంద్రుఁడు 2. నలుఁడు, 3. పురుకుత్సుఁడు, 4.పురూరవుఁడు,5.సగరుఁడు, 6.కార్తవీర్యుఁడు.

షట్శాస్త్రములు— 1. తర్కము, 2. వ్యాకరణము, 3. ధర్మము, 4. మీమాంస, 5. వైద్యము, 6.జ్యోతిషము, (వైద్య జ్యోతిషములకు మారుగా అలంకార నీతిశాస్త్రములను కొందరు గ్రహింతురు.)

షట్పదార్థములు—ద్రవ్య,గుణ,కర్మ, సామాన్య, విశేష, సమవాయములు. (జైనమతసిద్ధాంతమునఆత్మ,పరమాత్మ, లోకము, కాలము, వేదము, కర్మము.)

షట్సంస్కారములు—(అగ్నిహోత్రమున) తాపనము, పవిత్రీకరణము, అభిద్యాపనము, ఉత్పవనము, సంప్లవము, సమిధలు.

షడంగములు —అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము. (చూ. వేదాంగములు.)

షడధ్వములు—వర్ణాధ్వ, పదాధ్వ, మంత్రాధ్వ, తత్త్వాధ్వ, భువనాధ్వ, కలాధ్వములు.

షడభిజ్ఞలు—1. దివ్యదృష్టి, 2. దివ్యశ్రోత్రము, 3.పూర్వనివాసానుస్మృతి,

4. పరచిత్తజ్ఞానము, 5. అప్రత్యక్షవిష యజ్ఞానము, 6. వియద్గమనా గమన వ్యూహాది లక్షణమైన బుద్ధి

షడూర్మ్యులు—1 బుభుక్ష, 2. తృష్ణ, 3. శోకము, 4. మోహము, 5. జర, 6. మరణము.

షడ్గుణములు-1. సంధి 2. విగ్రహము, 3. యానము, 4. ఆసనము, 5. ద్వైధీ భావము, 6. సమాశ్రయము, (వాత్స ల్యము, భవశోషణము, ఉదారత్వము, అభయప్రదానము, ఆపత్కాల సంర క్షణము, అక్షయపదము అను నీ యారు గుణములును విష్ణుదేవునివని కొందరందురు)

షడ్గుణైశ్వర్యములు 1.మాహాత్మ్యము, 2. ధైర్యము, 3. యశస్సు, 4. శ్రీ, 5. జ్ఞానము, 6. వైరాగ్యము.

షడ్జగ్రామగతమూర్ఛనలు— తారమాద్ర, రజని, ఉత్తరాయత, శుద్ధషడ్జ, మత్సరకృత్తు, అశ్వక్రాంత, అధిరుగ్గత.

షడ్రసములు—1. కషాయము (వగరు) 2. మధురము (తీపి), 3. లవణము (ఉప్పు), 4. కటువు (కారము), 5. తిక్తము (చేదు), 6. ఆమ్లము (పులుపు).

షడ్వర్గులు — 1. రాశి, 2. హోర, 3. ద్రేక్కాణము, 4. నవాంశము, 5. ద్వాదశాంశము, 6. త్రింశాంశము.

షడ్విధజ్యోతిష గ్రహబలములు— 1. దిక్కు, 2. దృక్కు, 3. చేష్ట, 4. స్థానము, 5. కాలము, 6. నైసర్గి కము.

షడ్విధప్రత్యయములు— ప్రస్తార, అధ్వ, నష్టలబ్ధి, సంఖ్య, ఉద్దిష్ట, లగ క్రియాప్రత్యయములు.

షడ్విధ వాదములు— సత్ఖ్యాతి, అసత్ఖ్యాతి, అనిర్వచనీయఖ్యాతి, అన్యథాఖ్యాతి, ఆత్మఖ్యాతి, అఖ్యాతి వాదములు.

షడ్విధవికారములు— 1. పుట్టుట, 2. పెరుగుట, 3. ముదియుట, 4. చిక్కుట, 5. చచ్చుట, 6. గర్భనరక స్థితి.

షడ్విధవేదాంతవాది మతములు— భాస్కరీయ, శబ్దబ్రహ్మవాద, క్రీడా బ్రహ్మవాద ద్వైత, శుద్ధాద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతములు.

షడ్విధ సమాధులు— అంతశ్శబ్దాను విద్ధము, అంతర్దృశ్యాను విద్ధము, బాహ్యశబ్దానువిద్ధము, బాహ్యదృశ్యా నువిద్ధము, అంతర్నిర్వికల్పకము, బాహ్యనిర్వికల్పకము.

షడ్విధ స్త్రీధనము—1. శుల్కము- కన్యను వెలకమ్ముకొనుట, 2. అధ్య గ్నికము-అగ్నిసన్నిధానమున బందు గులచే గన్యకీయబడు ఆభరణాదికము, 3. అధ్యావాహనికము — సారెగా గన్యకీయబడు ధనము, 4. అన్వాధేయి కము-వివాహమునకు బిమ్మట బందు గులచే నీయబడుసొత్తు, 5. ప్రీతిదత్తము- భర్తవలన ప్రీతిపూర్వకముగా నివ్వ బడిన ధనము, 6. అధివేదనికము — మఱియొకభార్యను బెండ్లాడుచు భర్త మొదటియామెకు సంతోషపూర్వక ముగా నిచ్చు నాస్తి.

షడ్విధ హాసములు — 1. స్మితము, (కొలఁది నేత్రవికాసము, అధరచలనము కలది); 2 హసితము (దంతములు ప్రకటింపఁబడిన నగవు); 3. విహసితము (మధురస్వరయుక్తము); 4. అవహసితము (అంస, శిరఃకంప సమేతము); 5. అపహసితము (బాష్పయుక్తము); 6. అతిహసితము (శరీరకంపయుక్తము).

షడ్విధాత్మగతానుశీలములు— 1. సఖ్యము, 2. ఆత్మనివేదనము, 3. భగవంతునికొఱకు సమస్త కర్మాచరణము, 4. అవసరమగునంతవఱకు విషయస్వీకారము, 5. భగవంతునికై సర్వభోగవర్జనము, 6. సాధుమార్గానువర్తనము.

షడ్విధైశ్వర్య గుణములు— 1. ఉత్పత్తి, 2 లయము, 3. ప్రాణుల రాకడ, 4. వానిపోకడ, 5. విద్య, 6. అవిద్య.

షడ్విధైశ్వర్యములు- 1. ఐశ్వర్యము, 2. ధైర్యము, 3. కీర్తి, 4. తేజస్సు, 5. జ్ఞానము, 6. వైరాగ్యము.

షణ్మతములు— 1. శైవము, 2. వైష్ణవము, 3. శాక్తము, 4. గాణాపత్యము, 5. సౌరము, 6. కపాలము.

షష్ఠాష్టకములు — 1. మీనతులలకు, 2. మిథున వృశ్చికములకు, 3. వృషభ ధనుస్సులకు, 4. మకర సింహములకు, 5. కుంభ కటకములకు, 6. కన్యా మేషములకు.

షోడశకర్మలు— 1. గర్భాధానము, 2. పుంసవనము, 3. సీమంతము, 4. జాతకర్మము, 5. నామకరణము, 6. అన్నప్రాశనము, 7. చౌలము, 8. ఉపనయనము, 9. ప్రాజాపత్యము, 10. సౌమ్యము, 11. ఆగ్నేయము, 12. వైశ్వదేవము, 13. గోదానము, 14. సమావర్తనము, 15. వివాహము, 16. అంత్యకర్మ.

షోడశకళాస్థానములు—తల, ఎదురు ఱొమ్ము, చేతులు, కుచములు, తొడలు, నాభి, నుదురు, కడుపు, పిఱుదు, వీపు, చంకలు, మర్మస్థానము, మోకాళ్ళు, పిక్కలు, పాదములు, బొట్టనవ్రేలు.

షోడశచంద్రకళలు — అమృత, మానద, పూష, తుష్టి, సృష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత.

షోడశనిత్యలు—కామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్న, భేరుండ, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి, శివదూతి, త్వరిత, కులసుందరి, నిత్య, నీలపతాక, విజయ, సర్వమంగళ, జ్వాలామాలిని, చిత్ర, మహానిత్య.

షోడశపదార్థములు-(తర్కశాస్త్రము) ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండ, హేత్వాభాస, ఛల, నిగ్రహస్థానములు.

షోడశమహాదానములు—గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్య, కన్య, దాసి, శయ్య, గృహ, అగ్రహార, రథ, గజ, అశ్వ, ఛాగ, మహిషీదానములు.

షోడశమహారాజులు—1. గయుఁడు, 2. అంబరీషుఁడు, 3. శశిబిందువు, 4. అంగుఁడు, 5. పృథువు, 6 మరుత్తు, 7. సహస్రార్జునుఁడు, 8. పరశురాముఁడు, 9. శ్రీరాముఁడు 10. భరతుఁడు, 11. దిలీపుఁడు,12. నృగుఁడు. 13.రంతిదేవుఁడు, 14. యయాతి, 15. మాంధాత, 16. భగీరథుఁడు.

షోడశయాజకులు — 1. బ్రహ్మ, 2. ఉద్గాత, 3. హోత, 4. అధ్వర్యుఁడు, 5. బ్రాహ్మణాచ్ఛంసి, 6. ప్రస్తోత, 7. మైత్రావరుణుఁడు, 8. ప్రతిప్రస్థాత, 9. హోత, 10. ప్రతిహర్త, 11. అచ్ఛావాకుఁడు, 12. నేష్ట, 13. ఆగ్నీధ్రుఁడు, 14. సుబ్రహ్మణ్యుఁడు, 15. గ్రావస్తుత్తు, 16. ఉన్నేత.

షోడశసంధులు —(16) కపాల, ఉపహార, సంతాన, సంగత, ఉపన్యాస, ప్రతీకార, సంయోగ, పురుషాంతర, అదృష్టపురుష, ఆదిష్ట, ఆత్మాదిష్ట, ఉపగ్రహ, పరిక్రియ, ఉచ్ఛిన్న, పరభూషణ, స్కంధోపనయ సంధులు.

షోడశోపచారములు — 1. ఆవాహనము, 2. ఆసనము, 4. పాద్యము, 3. అర్ఘ్యము, 5. ఆచమనీయము, 6. స్నానము, 7. వస్త్రము,8. యజ్ఞోపవీతము, 9. గంధము, 10. పుష్పము, 11. ధూపము, 12. దీపము, 13. నైవేద్యము, 14. తాంబూలము, 15 నమస్కారము, 16. ప్రదక్షిణము.

సంఖ్యామానము — ఏకము, దశము, శతము, సహస్రము, దశసహస్రము, లక్ష, దశలక్ష, కోటి, దశకోటి, శతకోటి, అర్బుదము, న్యర్బుదము, ఖర్వము, మహాఖర్వము, పద్మము, మహాపద్మము, క్షోణి, మహాక్షోణి, శంఖము, మహాశంఖము, క్షితి, మహాక్షితి, క్షోభము, మహాక్షోభము, నిధి, మహానిధి, పర్వతము, అత్యంతము, పరార్థము, అనంతము, సాగరము,అవ్యయము, అచింత్యము, అమేయము, భూరి, మహాభూరి.

సంగపంచకము—రాగ,ద్వేష, మోహ, గర్వ, దృష్టులు.

సంచారి భావములు — నిర్వేదము, శ్రమము, దైన్యము, జాడ్యము, గ్లాని, త్రాసము, శంక, ఆర్తి, రోషము,గర్వము, ఆవేగము, ధృతి, స్మృతి, చాపలము, ఉగ్రత, అవహిత్థ, త్రప, విషాదము, మదము, ఔత్సుక్యము, మతి, నిద్ర, మోహము, మృతి, బోధము, ముదము, అలస్యము, వితర్కము, సుషుప్తి, అసూయ, చింత, ఉన్మాదము, అపస్మృతి. (33)

సంధిపంచకము— 1. ముఖము, ప్రతిముఖము, గర్భము, సావమర్శము, ఉపసంహృతి, (2) అచ్సంధి, ప్రకృతిభావసంధి, హల్సంధి, విసర్గసంధి, స్వాదిసంధి.

సంధిప్రయోజనములు— వివక్షితార్థ ప్రతిపాదనము, గోప్యార్థగోపనము, ప్రకాశార్థ ప్రకాశనము, అభినయ రాగ సమృద్ధి, చమత్కారిత్వము, ఇతివృత్త విస్తరము.

సంధి భేదములు — చూ. వ్యాకరణ ప్రకరణము.

**సంవత్సరములు**—ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాది, విక్రమ, విషు, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్తు, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖి, హేవిళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ, శుభకృతు, శోభకృతు, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృతు, పరీధావి, ప్రమాదీచ, ఆనంద, రాక్షస, నల, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ.

**సత్త్వరజస్తమోవేళలు** — సోమ, గురువారములందు ఉదయాది సత్త్వవేళ; అంగారక శుక్రవారములందుదయాది రాజసవేళ; రవి, బుధ, శనివారములయందుదయాది తామసవేళ; శనివారమునాఁడు లగ్నమొకటికి 4 ఘడియలు. తక్కిన వారములయందు లగ్నము 1 కి $3\frac{3}{4}$ ఘడియ.

**సనాద్యంతధాతువృత్తులు** — సన్, క్యచ్, కామ్యచ్, క్యఙ్, క్యష్, ఆచార క్విప్, నిచ్, యఙ్, యక్, ఆయఙ్, ఈయఙ్, ణిఙ్.

**సప్తకవులు** — 1. వివేకి, 2. వాచకుఁడు, 3. రాచికుఁడు 4. అర్థి, 5. శిల్పకుఁడు, 6. భూషణార్థి, 7. మార్దవానుగతుఁడు.

**సప్తకళలు**—1.మాంసము, 2. రక్తము 3 మేదస్సు, 4. యకృత్ ప్లీహములు, 5. నరములు. 6. జఠరాగ్ని, 7. శుక్రము (శరీర సంబంధమైనవి )

**సప్తకులపర్వతములు** —(1) ఉదయ, అస్త, హిమ, వింధ్య, మేరు, త్రికూట; లోకాలోకపర్వతములు; (2) మహేంద్రము, మలయము, సహ్యము, మాల్యవంతము, ఋక్షము, వింధ్యము, పారియాత్రము.

**సప్తగంగలు**—గంగ, గౌతమి, కావేరి తామ్రపర్ణి, సింధు, సరయూ,నర్మదలు. (పాఠాంతరమున) — నళిని, హ్రాదిని, పావని సీతాచక్షువు, సింధువు,భాగీరథి.

**సప్తతత్త్వములు**— జీవము, అజీవము, అస్రవము, బంధము, సంవరము, నిర్జరము, మోక్షము. 1. సత్యము, 2. బ్రహ్మము, 3. నృత్యాది విలంబిత మానము, 4. చేతస్సు, 5. వస్తువు, 6. స్వభావము, 7. సత్త్వాదిగుణము.

**సప్తతాళములు** — ధ్రువ, మఠ్య, జంపె, త్రిపుట, అట, ఏకతాళములు.

**సప్తదశ పదార్థములు** — పంచప్రాణములు (5), పంచజ్ఞానేంద్రియములు (5), పంచకర్మేంద్రియములు (5), మనస్సు, బుద్ధి.

**సప్తదోషములు** — స్త్రీ సంగమ, విషమ, విషమశీత, శీతజిహ్వాక, రక్తజిహ్వాక, శ్వేతజిహ్వాక దోషములు.

**సప్తద్వీపములు** — 1. జంబూద్వీపము (1. లక్షయోజనములు), 2ప్లక్ష(2.లక్షల యో.), 3. శాల్మల (4. లక్షల యో.)

4. కుశ (8 లక్షలయో.) 5. క్రౌంచ (16 లక్షల యో.) 6. శాక (32 లక్షల యో.) 7. పుష్కర (64 లక్షలయో.)

సప్త ధాతువులు— 1. బంగారు, 2. వెండి, 3. రాగి, 4 ఇనుము, 5.తగరము, 6 సత్తు, 7. సీసము. (2) 1. శుక్లము, 2 శోణితము, 3. మాంసము, 4 ఎముక, 5. చర్మము, 6. చీము, 7. మెదడు.

సప్త నదులు—1. అశ్వ, 2. మంజుళ, 3. కంప, 4. హరిద్ర, 5. విరజ, 6. క్షీర, 7. వేగవతి. (2) 1. గంగ, 2. యమున, 3. సరస్వతి, 4. గోదావరి, 5. కృష్ణ, 6. నర్మద 7. కావేరి.

సప్త పదార్థములు — 1. ద్రవ్యము, 2. గుణము, 3. కర్మము, 4. సామాన్యము, 5.విశేషము, 6. సమవాయము, 7. అభావము.

సప్త పుణ్యక్షేత్రములు–1. అయోధ్య 2. మధుర, 3. మాయ, 4. కాశి, 5. కాంచి, 6. అవంతిక, 7.ద్వారవతి.

సప్త ప్రకృతులు— చూ. సప్తాంగములు (రాజ్యాంగములు).

సప్త బ్రహ్మలు- 1. మరీచి, 2. అత్రి, 3. అంగీరసుఁడు, 4. పులస్త్యుఁడు, 5. పులహుఁడు, 6 క్రతువు, 7.వసిష్ఠుఁడు.

సప్త మండలములు- వాయు, వరుణ, చంద్ర, సూర్య, నక్షత్ర, అగ్ని, జ్యోతిర్మండలములు.

సప్త మరుత్తులు — 1. ఆవహుఁడు, 2. వివహుఁడు. 3. సంవహుఁడు, 4. అతివహుఁడు, 5. అనువాహుఁడు, 6. పరీవాహుఁడు, 7 వాహుఁడు.

సప్త మహర్షులు —1. మేధాతిథి, వసువు, సత్యుఁడు, జ్యోతిష్మంతుఁడు, ద్యుతిమంతుఁడు, సవనుఁడు, హవ్యవాహనుఁడు (దక్షసావర్ణికమనువుకాలపు) 2. ద్యుతి, తపస్వి, సుతపుఁడు, తపోమూర్తి, తపోధనుఁడు,తపోనిధి, తపోద్యుతి, (రుద్రసావర్ణికమనువు కాలము వారు); 3. మరీచి,అత్రి,అంగీరసుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు,వసిష్ఠుఁడు, (స్వాయంభువమనువు కాలము వారు), 4. ఔర్వ,వసిష్ఠపుత్ర, స్తంబ, కశ్యప, పాణ, బృహస్పతి, దత్త,చ్యవనాత్రులు, (స్వారోచిష మ.) 7 గురువాసిష్ఠులును,ఊర్జులును (హిరణ్యగర్భులు) ఉత్తమ మన్వంతరమున మహర్షులు; 5. పృథుఁడు, కావ్యుఁడు, అగ్ని, జహ్నుఁడు, ధాత, కపీవంసుఁడు, అకపీవంసుఁడు (తామసమనువు కా.); 6. యదుధ్రుడు, వేదశిరుఁడు, హిరణ్యరోముఁడు, పర్జన్యుఁడు, ఊర్ధ్వబాహుఁడు, సత్యనేత్రుఁడు, దేవబాహుఁడు (రైవతమనువు కా.); 7 భృగుఁడు, నభుఁడు, వివస్వంతుఁడు, సుధాముఁడు,విరజుఁడు అతినామఁడు, సహిష్ణుఁడు (చాక్షుషమనువు కా.); 8. వసిష్ఠ, అత్రి, గౌతమ, కశ్యప, భరద్వాజ, జమదగ్ని, విశ్వామిత్రాదులు, (వైవస్వతమనువుకా);9.రామ వ్యాస, ఆత్రేయ, దీప్తిమంత, బహుశ్రుత, భరద్వాజ, ద్రోణి, (అశ్వత్థామ); 10. గౌతమ, అజర, శరద్వంత, కౌశిక, కాశ్యప, ఔర్వులు, (సూర్యసావర్ణిక మనువుకాలమునమహర్షులు కాఁగలరు)

**సప్త మాతృకలు** — (1) బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ. (2) కాళి, కాళిక, ఉద్ధత, హావిమ, శారిక, ఆర్య, వైధాత్రి.

**సప్త మూలపదార్థములు**— 1. చర్మము, 2. నాడులు, 3. క్రొవ్వు, 4. మాంసము, 5. అస్థులు, 6. ఉపాస్థులు, 7. స్నాయువులు.

**సప్త మేఘములు**— సంవర్త, ఆవర్త, పుష్కలావర్త, ద్రోణ, కాళ, నీల, మహాకాళ మేఘములు.

**సప్త లౌకికాగ్నులు**-ప్రదాహ్యాగ్ని, అభ్యాదాహ్యాగ్ని, శవాగ్ని, సూతకాగ్ని, విద్యుదగ్ని, ఉత్తపనాగ్ని, కపాలాగ్ని.

**సప్త వర్షములు**—1. భారత, 2. ఇలావృత, 3. రమ్యక, 4. హైరణ్యక, 5. కురు, 6. భద్రాశ్వ, 7. కేతుమాలవర్షములు.

**సప్త వింశతి తత్త్వములు**— షడ్వింశతి తత్త్వములు, ఈశ్వరుఁడు. (27)

**సప్తవిధ చైతన్యములు**-1. శుద్ధచైతన్యము (పరబ్రహ్మము), 2. ఈశ్వరచైతన్యము (పరమాత్మ) 3 జీవచైతన్యము (జీవసాక్షియైన ప్రత్యగాత్మ), 4. ప్రమాతృచైతన్యము (అంతఃకరణవృత్తితోఁ గూడినది), 5 ప్రమాణచైతన్యము (ప్రతివస్తువును ఇది అదియను లోక వ్యవహారజ్ఞానముచే నిర్ణయించుట), 6. ప్రమేయ చైతన్యము (ప్రమేయవస్తువులను దెలిసి వాని వానియందుఁగల నామరూపములను నిరసింపఁగా శేషించినది) 7 ఫల చైతన్యము (ఎఱుఁగబడిన వస్తువులభించుట.)

**సప్తవిధజ్ఞానభూమికలు** - 1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానసి, 4. సత్త్వాపత్తి, 5. సంసక్తినామిక, 6. పదార్థభావన, 7. తురీయము. (2) బీజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రస్వప్నము, స్వప్నము, స్వప్నజాగరము, సుషుప్తి.

**సప్తవిధప్రాణులు**—1. పుణ్యప్రాణులు (దేవదానవాదులు), 2. మిశ్రప్రాణులు (మానవులు), 3. వృక్షజాతులు (తరు గుల్మలతాదులు), 4. జలచరజాతులు (మత్స్యకూర్మాది), 5. పశుజాతులు (చతుష్పాద జంతువులు), 6. పక్షిజాతులు (ఱెక్కలచే నెగురునవి). 7. క్రిమిజాతులు (చిన్న పురుగులు).

**సప్తవిధములగుబుద్ధి**— 1. పండ - తత్త్వము తెలిసికొనఁదగినది, 2. మేధ-వినినవానిని మరువకుండుట, 3. చార్వి-ఊహాపోహాలుగలది, 4. చత్య-విషయమును గూర్చి పలుమారు వినుటకు విసుగులేనిది, 5. గృహీతి - చెప్పిన దానిని గ్రహించునది, 6. శ్రౌతి-గురుశుశ్రూషాదికమునం దోర్పుగలది, 7. ప్రతిభ-ప్రజ్ఞానుభవముతో విషయబోధనము చేయఁగలది.

**సప్తవిధరూపములు** — 1. శుక్లము, 2. నీలము, 3. పీతము, 4. రక్తము, 5. హరితము, 6. కపిశము, 7. చిత్రము.

**సప్తవిధవాణులు**—1. సంస్కృతము, 2. ప్రాకృతము, 3. పైశాచికము, 4. అప

భ్రంశము, 5. లలితము, 6. మాగధము, 7. గద్యము (అంతరార్థము - మేధ, ధృతి, శ్రుతి, ప్రజ్ఞ, బుద్ధి, యశము, క్షమ)

సప్తవిధవాయువులు—1. ఆవహము, 2. ప్రవహము, 3. సంవహము, 4. ఉద్వహము, 5. నివహము, 6. పరివహము, 7. పరావహము.

సప్తవిధశరీరగతానుశీలనములు— శ్రవణగత, కీర్తనగత, ఆఘ్రాణగత, దర్శనగత, స్పర్శగత, స్వాదుగత, అంగగతానుశీలనములు.

సప్తవ్యసనములు — 1. స్త్రీ, 2. జూదము, 3. పానము, 4. వేఁట, 5. వాక్పారుష్యము, 6. తగని వెచ్చము, 7. కఠినదండము.

సప్తసంతానములు—1. తనయుఁడు, 2. తటాకము, 3. కావ్యము, 4. నిధానము, 5. ఆలయము, 6. వనము, 7. భూదేవ స్థాపనము. ('తనయుఁడు'' అనుదానికిమారుగా "సత్రప్రతిష్ఠ"ను కొందరు గ్రహింతురు)

సప్తసముద్రములు— 1. లవణ సముద్రము, (2 లక్షల యోజనములవిస్తీర్ణము) 2. ఇక్షుసముద్రము (4 లక్షల యో. వి.) 3. సురాసముద్రము (8 లక్షల యో.వి.) 4. సర్పిసముద్రము (16 లక్షల యో.వి.) 5. దధిసముద్రము (32 లక్షల యో.వి.) 6. క్షీరసముద్రము (64 లక్షల యో.వి.) 7. జలసముద్రము (128 లక్షల యో.వి.)

సప్తసరస్వతీనదులు— కాంచనాక్షి, 2. విశాలానది, 3 మనోరమ, 4.ఓఘవతి, 5.సురేణునది, 6.భీమలోద, 7.సుప్రభ.

సప్తసాగరయాత్ర— 1. గౌతమి (యానాం, నీలపల్లిగ్రామములమీఁదుగా ప్రవహించిసముద్రమునఁ గలుసునది); 2 వసిష్ఠ(అంతర్వేదివద్ద), 3.వైనతేయము (బెండమూరులంకవద్ద) 4. తుల్యభాగ (చొల్లంగివద్ద), 5. ఆత్రేయగోదావరి (కోరంగివద్ద), 6. భారద్వాజ గోదావరి, విశ్వామిత్ర, గోదావరి (రామేశ్వరంవద్ద) 7. జమదగ్ని గోదావరి.

సప్తసారస్వతములు—1. సుభద్ర, కనకాక్షి, విశాల, సురతన్వ, ఓఘమాల, సువేణి, విమలోదకరూపములగు సప్తాకారములతోఁ బోయి గౌరవింపఁ బడిన సరస్వతి, 2. బ్రహ్మయాగము, నైమిశారణ్యమున మునులు గావించిన సత్రయాగము, గయునిక్రతువు ఉద్దాలకుని యాగము, వసిష్ఠునిసప్తతంతువు, గురుని సవనము, బ్రహ్మ యజ్ఞము. (పై యాగములకు 7 సారులు కామినీ రూపమునఁ బోయిన సరస్వతి.)

సప్తసోమయజ్ఞములు —అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము.

సప్తస్వరములభార్యలు— 1. ష - (గంధర్వస్త్రీ), 2 ఱ-(కిన్నరస్త్రీ) 3. గ-(యక్షస్త్రీ) 4 మ - (కింపురుషస్త్రీ), 5. ప - (నాగస్త్రీ), 6. ధ - (సురస్త్రీ), 7. ని - (రాక్షసస్త్రీ).

సప్తస్వరములు—1. షడ్జము, 2. ఋషభము, 3. గాంధారము, 4. మధ్యమము, 5. పంచమము, 6. ధైవతము, 7. నిషాదము.

**సప్తస్వరవాహనములు**— 1. స-హంసవాహనము, 2. రి-సింహవాహనము, 3. గ-గండభేరుండవాహనము, 4. మ - జింకవాహనము, 5. ప-సాళువవాహనము, 6. ధ-చిలుకవాహనము, 7. ని-గోరింక వాహనము.

**సప్తస్వరాధిదేవతలు**—1. స-అగ్ని, 2. రి - బ్రహ్మ, 3. గ - సరస్వతి, 4. మ-ఈశ్వరుఁడు, 5. ప-శ్రీహరి, 6. ధ-వినాయకుఁడు, 7. ని-భాస్కరుఁడు.

**సప్త హావిర్యజ్ఞములు**— ఆగ్నేయధేయము, అగ్నిహోత్రము, దర్శపౌర్ణమాస్యములు, చాతుర్మాస్యహావిర్యజ్ఞములు, ఆగ్రాయణేష్టి, విరూఢ పశుబంధనము, సౌత్రామణి.

**సప్తాంగములు**— 1. కవీశ్వరులు, 2. విద్వాంసులు, 3. పౌరాణికులు, 4. పూర్వకథలుచెప్పువారు, 5. స్తోత్రపారకులు, 6. హాస్యకారులు,7.గాయకులు(సభాసప్తాంగములు), 2. స్వామి, అమాత్యుఁడు, సుహృదుఁడు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము (రాజ్యాంగములు).

**సప్తావరణములు**- 1. పృథివి, 2. అప్పు, 3. తేజము, 4. వాయువు,5.ఆకాశము, 6. అహంకారము, 7. మహత్తత్వము.

**సప్తాశయములు**— (పురుషదేహమందలివి)శ్లేష్మ, ఆమ, అగ్ని, పవమాన, మల, మూత్ర, జవ, రక్తాశయములు. (ఇంతియకాక, స్త్రీలకు ఉదరమున గర్భాశయము, వక్షస్థలమున క్షీరాశయమును గలవు.)

**సప్తోపాయములు**— 1. మంత్రము, 2. ఔషధము, 3. ఇంద్రజాలము, 4. సామము, 5. దానము, 6. భేదము, 7. దండము.

**సముద్రములు**— బాల్టిక్, ఉత్తర మెడిటరేనియన్,ఏడ్రియాటిక్,ఎజీన్, నల్ల, కాస్పియన్, ఎఱ్ఱ, అరేబియా, పచ్చసముద్రము, జపాన్, కారిబీన్, బేరింగ్, దక్షిణమధ్యధర, ఫసిఫిక్, అట్లాంటిక్, ఆర్కిటిక్, అంటార్కిటిక్, హిందూమహాసముద్రములు.

**సముద్రమథనజములు**—అమృతము, ఐరావతము, సుర, అమృతకలశతోడి మహాలక్ష్మి, ఘృతాచి, రంభ, మేనక, చిత్రరేఖ, మోహిని, మదన, కాంతి, చంద్రిక, కుమారి యను నప్సరసలు, అష్టనిధులు, ఉచ్చైశ్శ్రవము మొ నవి. 7 తెల్లని గుఱ్ఱములు, కనకదండము, కామధేనువు, కల్పవృక్షము, సూర్యకాంతమణి, శ్యమంతకమణి, కౌస్తుభమణి, దేవదత్తశంఖము, పుష్పకవిమానము, నందిఘోష మను రథము, హాలాహలము మొ.

**సరస్వతి హస్తాలంకారములు**— అక్షమాల, శుకము, కమలము, పుస్తకము.

**సరస్వతీ స్తనద్వయము**— 1. సంగీతము, 2. సాహిత్యము.

**సరస్సులు**—జినీవా, ఏరల్, బ్కాల్కష్, బైకాల్, ఛాడ్, విక్టోరియా, టాంగనీకా, న్యాసా, విన్నిపెగ్, గ్రేట్ స్లేవ్, గ్రేట్ బీర్, సాల్టులేక్,

సుపీరియర్, మిచిగాన్, ఈరీ, హ్యూరన్, ఒంటారియో, టిటికాకా, ఆలగాస్, ఐర్ మొ మేరువునకుఁజుట్టు 'అరుణోదయము, మహాభద్రము, అసితోదము, మానసము' అను దివ్య సరస్సులు కలవు.

సరళపంచకము—గ, జ, డ, ద, బ. (ఇవి మృదూచ్చారణ కలవి.)

సర్గములు—మహత్, అలంకార,భూత, ఇంద్రియ, దేవ, తమో, వనస్పత్యాది, తిర్యక్, మనుష్యసర్గములు.

సాత్త్వికభావములు—స్తంభము,ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథు, అశ్రువు, వైస్వర్యము.

సాధకుల పంచావస్థలు—శ్రవణ, వరణ, స్మరణ, ఆపన, ప్రాపవదశలు.

సాధనచతుష్టయము—1. నిత్యానిత్య వస్తువివేకము, 2. ఇహాముత్రఫలభోగ విరాగము, 3. శమాదిషట్కము, 4. ముముక్షుత్వము.

సాధారణ రసములు—కంపిల్లము, గౌరిపాషాణము, నవాసారము,గవ్వలు, అగ్నిజార, గిరిసిందూర, ఇంగిలీక, మృదారుశృంగులు.

సాధ్యులు—మనుఁడు, హనుమంతుఁడు, విష్ణువు,ధర్ముఁడు,నారాయణుఁడు మొ॥

సింధుశాఖలు— ఏడెన్, పెరిషియన్, మేనార్, సయాం, గినియా, కాలిఫోర్నియా, మెక్సికో, సెంట్‌లారెన్సు, కార్పెంటేనియా మొ॥

సిద్ధిత్రయము—ప్రభావ, మంత్ర ఉత్సాహసిద్ధులు.

సిద్ధులు—(18) అణిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, మహిమ, ఈశత్వము వశిత్వము, సర్వజ్ఞత్వము, దూరదర్శిత, దూరశ్రవణము, పరకాయప్రవేశము, వాక్సిద్ధి, కల్పవృక్షత్వము, ప్రభుత్వము, సంహారకత్వము, అమరత్వము, సర్వాగ్రత్వము, సర్వకామావసానత్వము.

సుహృద్గుణములు— శుచిత్వము త్యాగము, శౌర్యము, సుఖదుఃఖ సామాన్యము, దాక్షిణ్యము, స్నేహము, సత్యవర్తనము.

సూక్ష్మనాడులు— మానవ దేహమున (3,50,00,000) మూఁడుకోట్ల యేఁబది లక్షల స్థూలసూక్ష్మనాడులు గలవు. అందు 1,072 స్థూలములు; మిగిలినవి సూక్ష్మములు.

సూక్ష్మాంగవివరము — పంచప్రాణములు, పంచజ్ఞానేంద్రియములు, పంచ తన్మాత్రలతో మనోబుద్ధులు గూడిన సమాధిలక్షణము, సూక్ష్మశరీరము.

సూర్యగణములు— న, హ గణములు. (హ=గలము, న=3 లఘువులు).

సూర్యపార్శ్వవర్తులు—సూర్యుఁడు దైత్యులకు వరమివ్వక విఘ్నముచేయుటకు రుద్రాగ్నియములు క్రమముగ దండుఁడు, పింగళుఁడు, మాఠరుఁడు, అను నామములతో సమీపమున వర్తింతురు.

నగ—అలంకారము, ఆభరణము, కలాపము, పరిష్కారము, ప్రతిసరము, భాండము, భూషణము, తొడవు, రవణము, సొమ్ము.

నడుము—అవలగ్నము, కౌను, ప్రోథము, మధ్యమము, లేఁగౌను.

నది — ఆపగ, నిర్ఝరిణి, తరంగిణి, ప్రవాహిని, శైవలిని, తటిని, ద్వీపవతి, స్రవన్తి, ధుని, స్రోతస్విని, నిమ్నగ, అధ్వగ, అబ్ధివధువు, తరణి, తలోద, సరిత్తు, సాగరగామిని, వరద, వాఁక, నదము, ఝరి, హైమవతి, కడలి వెలఁది, కూలంకష.

నమస్కరించు—కేల్మోడుచు, కొలుచు, ఎఱఁగు, చేమోడ్చు, చేతులు ముకుళించు, ప్రణమిల్లు, నమించు, అయిదు పదిచేయు.

నమస్కారము—గిడిగిడి, నతి, జోత, దండము, జోహారు, మ్రొక్కు, చేమోడ్పు, చెంగనాలు, జేజే, ప్రణతి, ప్రణామము, వందనము, గొబ్బిళ్లు, జాగిలి, టెంకణము, దీవెనకోల.

నర్మదానది —రేవ, సోమోద్భవ, మేఖలకన్యక.

నలుపు—కృష్ణము, లాసితము, శ్యామము, కాలము, శ్యామలము, మేచకము, కప్పు, కఱ, కఱే, నల్ల.

నల్లి — ఉత్కుణము, ఉద్దంసము, కిటిభము, మత్కుణము, రక్తాంగము, నెత్తురుత్రాగు పురుగు.

నాఁగలి—కుంతలము, గోకిలము, లాంగలము, సీరము, హలము, దుక్కివాలు.

నాచు—కుంభిక, కావారము, కుంభి, కుంభీకము, కుత్ర్ణము, కుష్ఠహారి, గాంగేయము, గృష్టి, ఘృష్టి, జంబాలము, జర్జరము, జలకేశము, జలనీలి, జలవల్కలము, జలాంచలము, నీలిక, ఒదర, మంజులము, వారాహి, వారి చత్వరము, వారిపర్ణి, వారిమూలి, వితున్నము, విష్వక్సేనప్రియ, వ్యవక, శేవలము, శైవలము, శైవాలము, నీటి పాఁచి, తీఁగపాఁచి.

నాట్యము— తాండవము, నర్తనము, నటనము, నృత్యము, నృత్తము, లాస్యము.

నానావర్ణసంకరము — చిత్రము, కిమ్మీరము, కల్మాషము, శబలము, కర్బురము.

నామధేయము—ఆఖ్య, అభిఖ్య, ఆహ్వయము, అభిధానము, నామము, పేరు.

నారి—అరి, అల్లెత్రాడు, గొన(యి)ము, గుణము, జ్యా, మౌర్వి, శింజిని.

నారింజ— నాగరంగము, నారంగము, నారదము, నాదేయి, భూమిజంబుక, ఐరావతము, ఐరావణము, కంటకి, దశశరము, కిమ్మీరము, కిర్మీరము, గంధపత్రము, గంధాఢ్యము, గోధూమము, చక్రాధివాసి, గోరక్షము, చోళకి, చోలనము.

నాలుగు—అబ్ధి, సాగరము, చత్వారి, వనరాశి, యుగము, అంబుధి, వార్ధి, గతి, జలధి, నీరధి.

నింద—అవర్ణము, ఆక్షేపము, నిర్వాదము, నిందనము, పరీవాదము, అపవాదము, ఉపక్రోశము, గర్హణము, దూఱు, సెగ్గింపు, అపదూఱు, అధిక్షేపము.

నిచ్చెన—ఆరోహణము, అధిరోహిణి, తాప, నిశ్రేణి.

నిడుపు—ఆయతము, ఆయామము, ఆరోహము, దైర్ఘ్యము, విస్తృతము, నిడుద, నిడివి, పొడు(గు)వు.

నిద్ర—శయనము, స్వాపము, స్వప్నము, సంవేశము, నిదుర, నిద్దుర, కునుకు, కూర్కు, కనుమోడ్పు.

నిమ్మ—ఐరావతము, పారేవతము, రుద్రాక్షము, రైవతకము, ఈడ, ఎఱ్ఱకిత్తిలి, కరుణము, కొకఫలము, క్షుద్రామ్ల, గంభీరము, గిలము, జంబిరము, జంబీరము, జంభీరము, జంభము, జంభరము, జంభలము, జహువు, దంతశరము, లకుచము.

నిర్‌ఋతి—రాక్షసుఁడు, కొణపుఁడు, క్రవ్యాత్తు, అస్రపుఁడు, ఆశరుఁడు, రాత్రించరుఁడు, కర్బురుఁడు, నికషాత్మజుఁడు, యాతుధానుఁడు, పుణ్యజనుఁడు, యాతు, రక్కసి, పొలదిండి, రేద్రిమ్మరీడు, సోకుమూకలదణి.

నీచము—అధమము, అవమము, అవద్యము, అణకము, అర్వము, ఉత్కృతము, కుపూయము, కుత్సితము, ఖేటము, క్షుల్లకము, గర్హ్యము, చేలము, జఘన్యము, న్యక్షము, నికృష్టము, ప్రతికృష్టము, యాప్యము, రేఫము.

నూయి—ప్రహి, అంధువు, ఉదపానము, కూపము, బావి, నుయి, నుయ్యి, నూఁయి, చలమ, దొరవు

నెమలి—మయూరము, బర్హిణము, హరి, బర్హి, నీలకంఠము, భుజంగభుక్కు, సారంగము, శిఖావలము, శిఖి, కేకి, మేఘనాదాలాపి, నట్టవపులుఁగు, జొట్టుపులుఁగు, నమ్మి, నెమ్మి.

నేయి—ఆజ్యము, అమృతము, ఘృతము, జీవనము, బభ్రువు, వాజము, నెయ్యి, సర్పి, హవిస్సు, చమురు.

నేర్పరి—ప్రవీణుఁడు, నిపుణుఁడు, అభిజ్ఞుఁడు, విజ్ఞుఁడు, నిష్ణాత, శిక్షితుఁడు, వైజ్ఞానికుఁడు, కృతముఖుఁడు, కృతి, కుశలుఁడు, జాణ, దంట, దిట్ట, ప్రోడ, వలతి, వెరవరి.

న్యాయము—అర్థము, అభినీతము, అభ్రేషము, ఔపయికము, కల్పము, దేశరూపము, ధర్మము, న్యాయ్యము, భజమానము, యుక్తము, లభ్యము, సమంజసము, సారము, తగవు.

పంక్తి—అలి, ఆళి, ఆవళి, ఘట, ఛాయ, ధార, పరంపర, పాళి, ప్రవృత్తి, ప్రవాహము, బంతి, వరుస.

పండుకొను—పన్నుండు, పండు, పవ్వడించు, పరుండు, పవ్వళించు, అత్తిల్లు, శయనించు, తెన్నుండు.

పందికొక్కు—మూషి(ష)కము, ఆఖువు, ఉందురము, ఖానకము, గర్తాటము, గృహభూదారము, దీర్ఘదేహి, రోమశము, కొక్కు, మూసకము, ఇవి.

పక్షి— ఖగము, విహంగము, విహగము, విహంగమము, విహాయసము, శకుంతము, శకుని, శకునము, ద్విజము, పతత్రము, పత్రి, పతగము, అండజము, నగౌకసము, వాజి, వికిరము, విష్కిరము, గరుత్మంతము, నభసంగమము, గువ్వ, పక్కి, పిట్ట, పులుఁగు.

పగలు— పవలు, దివసము, దినము, ఘస్రము, అహము, వాసరము.

పడక— ఔశీరము, తలిమము, తల్పము, పఱపు, పాన్పు, మెత్త, శయనము, శయ్య, శిరము, సెజ్జ.

పడుచుది— యౌవనవతి, జవరాలు, కొమరాలు, జవ్వని.

పదునైనది— క్షుతము, ఖరము, తీక్ష్ణము, నిశితము, శాతము, కఱకైనది, చుఱుకైనది, తెగువైనది.

పద్మము— తామరపువ్వు, నళినము, అరవిందము, మహోత్పలము, సహస్రపత్రము, కమలము, శతపత్రము, పుండరీకము, నాళీకము, కుశేశయము, పఙ్కేరుహము, తామరసము, సారసము, సరసీరుహము, బిసప్రసూనము, రాజీవము, పుష్కరము, తమ్మి, అమ్భోరుహము, సారంగము, శ్రీపర్ణము.

పని— ఆస్పదము, కరజము, కర్మ, కర్మము, కృత్యము, క్రియ, వ్యాపారము, ఒంజలి, చెయ్వు, చేఁత, చె(యిద)య్దము, చెయిది.

ల్లు— రదనము, దశనము, దన్తము, రదము, కోర.

పరాధీనుఁడు— పరతన్త్రుఁడు, పరవన్తుఁడు, నాథవన్తుఁడు, అధీనుఁడు, నిఘ్నుఁడు, ఆయత్తుఁడు, అస్వచ్ఛందుఁడు, గృహ్యకుఁడు.

పరిమళము— సువాసన, వలపు, తావి, కమ్మన, కంపు, సుగంధము, ఆమోదము, సౌరభము.

పరిహాసము— క్రీడ, ద్రవము, నర్మము, పరీహాసము, పరివాసనము, ఎగతాళి, గేలి, నవ్వు, పరియాచకము.

పరుగు— ద్రవము, ధావనము, ప్రధావనము, పరువు, వీటి, కదలిక.

పర్యాయము— అవసరము, తడవ, తూకు, తూరి, తేప, పరి, పారి, మఱి, మాఱు, విడుత.

పర్వతము— మల, గట్టు, తిప్ప, మెట్ట, కొండ, గుబ్బలి, మహీధ్రము, శిఖరి, క్ష్మాభృత్తు, అహార్యము, ధరము, అద్రి, గోత్రము, గిరి, గ్రావము, అచలము, శైలము, శిలోచ్చయము, మరువు, పత్రి, చికురము, ఇలతాలు.

పలుకఁబడినది— ఉక్తము, భాషితము, ఉదితము, జల్పితము, ఆఖ్యాతము, అభిహితము, లపితము.

పల్లేరుచెట్టు— గోక్షురకము, పలంకషము, వనశృంగాటము, శ్వదంష్ట్రి, గోకంటకము, ఇక్షుగంధము, స్వాదుకంటకము.

పసుపు— పీత, గౌరము, హరిద్ర, శివ, ఉమ, అళది, హళది, కాంచని.

పాపము— పంకము, కిల్బిషము, కల్మషము, కలుషము, వృజినము, అంహము, అఘము, దురితము, గష్కృతము, ఓఘము, దోషము, దోసము, పాప్మము, ఏనస్సు, అంకము, ఆగము.

పాపి— నృశంసుఁడు, ఘాతుకుఁడు, క్రూరుఁడు, పాపుఁడు.

పాలు—అవదోహము, ఊధస్యము, ఔధస్యము, క్షీరము, గోరసము, దుగ్ధము, పయస్సు, పుంసవనము, పేయము, మదువు, సుధ, పంకము, పాఁడి, పాయి, పోసనము, పోసనాలు.

పార్వతీదేవి— ఉమ, కాత్యాయని, గౌరి, కాళి, హైమవతి, ఈశ్వరి, శివ, భవాని, రుద్రాణి, శర్వాణి, సర్వమఙ్గళ, అపర్ణ, పార్వతి, దుర్గ, మృడాని, చండిక, అంబిక, ఆర్య, దాక్షాయణి, గిరిజ, మేనకాత్మజ, నారాయణి, ధేనుక, భార్గవి, శారద, జయ, గట్లరాయనిపట్టి, ముక్కంటి వెలఁది, ఏనుగులగొంగ తత్తడినెక్కు దంట, సామిసామేను జేకొన్నచాన.

పావురము— కలకంఠము, కలరవము, కపోతము, పారావతము, పారువము, పావురాయి.

పిచ్చుక— కలవింకము, చటకము, నీలకంఠము, పిట్ట, పిచ్చుక.

పిడుగు— అశని, నిర్ఘాతము, భిత్తిక, వజ్రము, సారంగము, హీరము.

పిఱికి— తస్నువు, త్రస్తుఁడు, భీరు(కు)ఁడు, భీలుకుఁడు, భీరువు, కోచ, పంద, వెఱపరి.

పిఱుఁదు—కటకము, కకుద్మతి, కళత్రము, నితంబము, శ్రోణి.

పిల్లి— ఓతువు, బిడాలము, మార్జారము, పృషదంశకము, ఆఖుభుక్కు, మార్జాలము, చీలి.

పిసినిగొట్టువాఁడు—లోభి, కదర్యుఁడు, కృపణుఁడు, క్షుద్రుఁడు. లుబ్ధుఁడు, కింపచానుఁడు, మితంపచుఁడు.

పీఠిక— విషయసూచిక, అవతారిక, అనుక్రమణిక, భూమిక, తొలిపలుకు.

పుట్టుక—ఉత్పత్తి, ఉద్భవము, జననము, జని, జన్మము, జన్యము, జాతము, ధామము, ప్రసవము, భవము, భావము, భూతి, పుట్టువు, బాము.

పుట్టుమచ్చ— జటులము, తిలకము, కాలకము, తిలకాలకము, పిప్లువు, పులుగు.

పుణ్యము—కుశలము, ధర్మము, వృషము, శ్రేయము, సుకృతము.

పురము— పురి, నగరము, పత్తనము, పట్టణము, స్థానీయము, నిగమము, పట్టము, పట్నము, పట్టనము, పత్తనము, ఖమ్, పేట, ప్రోలు, విషయము.

పురీషము—అవస్కరము, ఉచ్చారము, కల్కము, గూథము, వర్చస్కము, వర్చస్సు, విట్టు, విష్ఠ, శకృత్తు, శమలము.

పుఱ్ఱె— కపాలము, కరకము, కరోటి, కర్పరము, తలపాల, పు(నక) న్క్ర, పుచ్చె, పుఱియ, ఒఱ్ఱియ.

పుష్పమాల— సరము, ఎత్తు, దండ, సరి, పుష్పదామము.

పుష్పము— సుమనసము, ప్రసూనము, కుసుమము, సుమము, పువ్వు, పువు, పూ, విరి, అలరు.

పుస్తకము— గ్రంథము, కోశము, సంపుటము, పొత్తము, వహి.

పూర్వజన్మార్జితశుభాశుభకర్మము— దైవము, దిష్టము, భాగధేయము, భాగ్యము, నియతి, విధి.

పెండ్లి— వివాహము, ఉపయమము, పరిణయము, ఉద్వాహము, ఉపయామము, పాణిపీడనము, పరిగ్రహము, నిర్వేశము, పాణిగ్రహణము.

పెదవి— వాతెర, మోము, అధరము, ఓష్ఠము, బింబము, మోవి, వాతెఱ.

పెద్దకత్తి— ఖడ్గము, నిస్త్రింశము, చన్ద్రహాసము, అసి, ఇష్టి, కౌక్షేయకము, మండలాగ్రము, కరవాలము, కృపాణము.

పెద్దపులి— శార్దూలము, ద్వీపి, వ్యాఘ్రము, పుండరీకము, వ్యాళము, పృదాకువు, పసిదిండి, మెకముల దిండి, చారలమెకము, మువ్వన్నెగల మెకము, బెబ్బులి, పులి.

పెరుగు— క్షీరజము, దధి, కలుపు, తయిరు, తైరు, పెరువు.

పేను— అండమసి, ఇంద్రలుప్తము, ఓకణము, ఓకోదని, ఓకణి, కిటిభము, ఉద్దంశము, ఉత్కుణము, కేశకీటము, పాశి, యూకము, ఐక్షు, ఈరు, ఈపి, అంటులు, అంట్లు.

పొందఁబడినది— లబ్ధము, ప్రాప్తము, విన్నము, భావితము, ఆసాదితము, భూతము.

పొట్టివాఁడు— ఖర్వుఁడు, నీచుఁడు, హ్రస్వుఁడు, వామనుఁడు, గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట, గుజ్జు, టింగణా, తింగణా, గిడ్డ, గిఱక.

పొడి— చూర్ణము, క్షోదము, తునురు, నుగ్గు, నఱుము, పరుము, పిండి.

పోవు— ఏగు, అరుగు, గమించు, చను, నిర్గమించు, పనివిను, వెడలు, వేంచేయు.

పోషించు— ఏలు, ఓము, పెంచు, ప్రోచు, మనుచు, సంతరించు.

పౌరుషము— కడిమి, గండు, బీరము, మగఁటిమి, మగతనము, విక్రమము.

ప్రధానుఁడు— ప్రముఖుఁడు, ప్రవేకుఁడు, అనుత్తముఁడు, ఉత్తముఁడు, ముఖ్యుఁడు, వర్యుఁడు, వరేణ్యుఁడు, ప్రబర్హుఁడు, అనవరార్ధ్యుఁడు, అగ్రుఁడు, ప్రాగ్రహరుఁడు, ప్రాగ్ర్యుఁడు, అగ్ర్యుఁడు, అగ్రీయుఁడు, అగ్రియుఁడు.

ప్రబ్బలి— అభ్రపుష్పము, రథము, వానీరము, విదులము, వేతసము, శీతము, పరివ్యాధము, నాదేయ, అంబువేతసము.

ప్రయాణము—గమనము, గమము, ప్రస్థానము, యాత్ర, ప్రవ్రజ్య (అభి నిర్యాణము).

ప్రవాహము—ధార, నిట్ట, వేగము, స్రోతస్సు, నీటిపాఱుదల.

ప్రాతఃకాలము—ప్రత్యూషము, అహర్ముఖము, కల్యము, ఉషస్సు, ప్రత్యుషస్సు, ప్రభాతము, ప్రత్యూష.

ప్రాఁతది—పురాణము, ప్రతనము, ప్రత్నము, పురాతనము, చిరంతనము.

ప్రాప్తి—అధిగమము, ఆరాధనము, నిర్వేశము, ప్రతిపత్తి.

ప్రియము—అనుఁగు, అర్మిలి, ఇంపు, ఇష్టము, కూర్మి, గాదిలి, గారవము, గారాము, చెల్మి, నెయ్యము, పేర్మి, ప్రేముఁడి, మక్కువ, ముద్దు, హితము.

ప్రేమ—అనురక్తి, అనురాగము, అభిమానము, ఆబంధము, ప్రణయము, రాగము.

బంగారము—స్వర్ణము, సువర్ణము, హిరణ్యము, కనకము, హేమము, హాటకము, తపనీయము, శాతకుమ్భము, గాంగేయము, భర్మ, కర్బురము, చామీకరము, జాతరూపము, మహారజతము, కాంచనము, రుక్మము, కార్తస్వరము, జాంబూనదము, అష్టాపదము, పసిఁడి, బంగరు, బంగారు, పైఁడి, పొన్ను, జాళువా, పుత్తడి, కడాని, మేలిమి, కుందనము, అణి, అపరంజి, మేలిమి, ఉదిరి, కలధౌతము.

బండి—అనస్సు, కణిచి, కుబ్రము, కూబరి, కూవరి, చంకరము, చక్రపాదము, చక్రి, నేత్రము, స్యందనము, తేరు, అరదము.

బండికన్ను—బండికలు, బండికల్లు, చాయమేకు, చిలుక, చీల, జంజడ, అక్షము, అక్షాగ్రకీలము, అణి, ఆణి, అధిష్ఠానము, అరి, ఉపధి, కుండము, కేశవాయుధము, రథాంగము.

బంధువులు—చుటాలు, బందువులు, చుట్టలు, విందలు, బంధుగులు, చుట్టములు.

బకము—కహ్వము, కొక్కెరాయి, కొక్కు, కొక్కెర, కొంగ, వక్కు, బకోటము, జలపాదము, పరద, బాతు, వగ్గటము.

బలదేవుఁడు—బలభద్రుఁడు, ప్రలంబఘ్నుఁడు, అచ్యుతాగ్రజుఁడు, రేవతీరమణుఁడు, రాముఁడు, కామపాలుఁడు, హలాయుధుఁడు, నీలాంబరుఁడు, రౌహిణేయుఁడు, తాలాంకుఁడు, ముసలి, హలి, సంకర్షణుఁడు, సీరపాణి, కాళిందీభేదనుఁడు, బలుఁడు, ల్లవలువదాల్పు, తెల్లనిమయిదంట, వెన్నదొంగయన్న, ముక్కివాలుదాలుపు, తాటిపడగవాఁడు.

బలము—ఆయతి, ఉక్కు, ఓజస్సు, కుశలము, తేజస్సు, దార్ఢ్యము, దిట్ట, ద్రవిణము, ధిష్ణ్యము, పరాక్రమము, పౌరుషము, ప్రాణము, ప్రభవము, విక్రమము, శుష్మము, శక్తి, శౌర్యము, సత్వము, స్థామము.

బల్లి—ముసలి, గృహగోధిక, గౌళి, పల్లి,

బాణపుములికి—నాళి(ళీ)కము, ఫలము, అలుఁగు, అల్గు, చిఱుకు, ములికి, ముల్కి, సెల.

బాలుఁడు — కొండొక (కొండిక) వాఁడు, చిన్న, రింగణా, పిన్న, పసివాఁడు, బాలిశుఁడు, మాణవకుఁడు.

బుద్ధి— మనీష, ధిషణ, ధీ, ప్రజ్ఞ, శేముషి, మతి, ప్రేక్ష, ఉపలబ్ధి, చిత్తు, సంవిత్తు, ప్రతిపత్తి, జ్ఞప్తి, చేతన, ప్రత్యయము, ప్రజ్ఞానము, మేధ.

బుద్ధుఁడు— అక్షరచణుఁడు, అద్వయవాది, అర్కబంధువు, కనిష్ఠగుఁడు, కలిశాసనుఁడు, ఖసముఁడు, గోష్పేశుఁడు, గౌతముఁడు, జినుఁడు, తథాగతుఁడు, తమోవహుఁడు, త్రిశరణుఁడు, తీర్థకుఁడు, దశభూమీశుఁడు, దాశార్హుఁడు, ద్వాదశాక్షుఁడు, ధర్మచక్షుఁడు, పంచజ్ఞానుఁడు, భగవంతుఁడు, మహాబలుఁడు, మహాబోధి, మాయాదేవీ సుతుఁడు, మారజిత్తు, లోకజిత్తు, శాక్యముని, శాక్యసింహుఁడు, శౌద్ధోదని, శ్రీఘనుఁడు, శ్వేతకేతుఁడు, షడభిజ్ఞుఁడు, దశబలుఁడు, సమంతభద్రుఁడు, సర్వజ్ఞుఁడు, సమదర్శి, సర్వార్థసిద్ధుఁడు, సుగతుఁడు.

బుధుఁడు— బోధనుఁడు, సోమజుఁడు, హేముఁడు, సౌమ్యుఁడు, విజ్ఞుఁడు.

బురద—అసలు, రొంపి, అడుసు, కర్దమము, పంకము, జంబాలము, నిషద్వరము.

బృహస్పతి—సురాచార్యుఁడు, గీష్పతి, ధిషణుఁడు, గురువు, జీవుఁడు, ఆంగిరసుఁడు, వాచస్పతి, చిత్రశిఖండిజుఁడు, ఆర్యుఁడు, సూరి, వాగీశుఁడు, వచసాంపతి మొ.

బోయవాఁడు— మృగవధాజీవుఁడు, మృగయుఁడు, లుబ్ధకుఁడు, వ్యాధుఁడు, శబరుఁడు.

బ్రహ్మచారి— ఉపనీతుఁడు, వటువు, వడువు, వర్ణి.

బ్రహ్మదేవుఁడు — ఆత్మభువు, సురజ్యేష్ఠుఁడు, పరమేష్ఠి, పితామహుఁడు, హిరణ్యగర్భుఁడు, లోకేశుఁడు, స్వయంభువు, చతురాననుఁడు, ధాత, అబ్జయోని, ద్రుహిణుఁడు, విరించి, కమలాసనుఁడు, స్రష్ట, ప్రజాపతి, వేధ, విధాత, విశ్వసృట్టు, విధి, శతానందుఁడు, శతధృతి, పక్కిడాల్వేలుపు, పొక్కిలి పసిబిడ్డఁడు, అంచతేజీనెక్కియాడురౌతు, నొసల్వ్రాయు దేవర, చదువులవేలుపు, జన్నిగట్టు, తెలిదమ్మిగద్దియ గొలువుండు రాయఁడు, నిక్కపు జగమేలు నేర్పుకాఁడు, కడుపు బంగారు బొక్కసముఁజేసిన మేటి, పోరోగిరము తిండిపోతుతండ్రి, నలువ, తమ్మిచూలి, నలుమొగంబుల వేల్పు, వేల్పుపెద్ద, పలుకువెలఁది మగఁడు, తాత మొ.

బ్రాహ్మణుఁడు— ద్విజుఁడు, అగ్రజన్ముఁడు, భూదేవుఁడు, విప్రుఁడు, భూసురుఁడు, పాఱుఁడు, పుడమివేల్పు, బాపఁడు, జన్నిగట్టు, బాడబుఁడు మొ.

భగవంతుఁడు — దయ్యము, దేవర, దేవుఁడు.

భయానకరసము— భైరవము, దారుణము, భీషణము, భీష్మము, ఘోరము, భీమము, భయానకము, భయంకరము, ప్రతిభయము.

భర్త— ఈశ్వరుడు, ధవుడు, నాథుడు, పతి, ప్రియుడు, మగడు, వరుడు, వల్లభుడు.

భస్మము—అంగారకము, ఉల్క, క్షారము, భసితము, భూతము, భూతి, రక్ష, కరక, నిగులు, నివ్వలు, నీరు, పదను, బుగ్గి, బుసి, బసుమము, బూడిద(దె), బూతి(ది), విబూది, వెలిమిడి (వెల్మిడి), ప్రేల్మిడి.

భార్య— పత్ని, పాణిగృహీతి, ద్వితీయ, సహధర్మిణి, జాయ, దార, ఆలు, పెండ్లాము, రాణి, ఇల్లాలు, కళత్రము, జని, వధువు, క్షేత్రము.

భీతి— దరము, త్రాసము, భయము, సాధ్వసము, వెఱపు, ఎద, వెఱ, అలుకు, ఉద్వేగము, భీ, ఓజ, జగులు, అదరు, బెదరు.

భుజించుట— మెసవు, మెసగు, ఆరోగించు, మొనరుచు, మెక్కు, తిను, కుడుచు, ఆరగించు, సాపడు, నమలు.

భూమి— అచల, అనన్త, విశ్వంభర, రస, స్థిర, ధరిత్రి, ధరణి, క్షోణి, జ్యా, కాశ్యపి, క్షితి, సర్వంసహా, వసుమతి, వసుధ, ఉర్వి, వసుంధర, గోత్ర, కు, పృథివి, పృథ్వి, క్ష్మ, అవని, మేదిని, మహి, విపుల, గహ్వరి, ధాత్రి, ఇల, కుమ్భిని, క్షమ, జగతి, రత్నగర్భ, భూతధాత్రి, అబ్ధిమేఖల, పంటవలంతి.

భోగస్త్రీ— వేశ్య, గణిక, వారస్త్రీ, రూపాజీవ, వేల్పుబానిస, వెలయాలు, వేశ్యకత్తె, లంజె, భోగముచాన, వెల్లాటకత్తె, పడుపుచెలి, ఆటచేడియ, గడుసుకత్తె, భోగిని, నటి, గ్రామణి, బంధుర, రోచెలువ.

భోజనపాత్ర— తట్ట, కంచము, హరివాణము, పళ్ళెరము, తళిగ, తెలె.

భోజనము — ఆహారము, ఘాసము, జగ్ధి, జేమనము, నిఘసము, నిఘాసము, న్యాదము, భోగము, లేప(న)ము, లేహ(న)ము.

మంగలి-అంతావసాయి, క్షురి, గ్రామణి, దివాకీర్తి, నాపితుడు, మండె.

మంచు— అవశ్యాయము, నీహారము, తుషారము, తుహినము, హిమము, ప్రాలేయము, మహిక, మిహిక, హిమిక, హేమ, ఇవము, వలి.

మంత్రి— అమాత్యుడు, ప్రెగడ, ప్రెగ్గడ, నియోగి.

మజ్జిగ— మార్జిక, మోరట, రసాయనము, మోరి, మోరు, తక్రము, చల్ల, అరిష్టము, కాలశేయము, గోరసము, ఘనరసము, ఘోలము, ఘోళము, దండాహతము, మథితము, కచ్చరము, కటురము, ప్రన్యజము.

మత్తుడు—ఉత్కటుడు, క్షీబుడు, శౌండుడు.

మనుష్యుఁడు—మానుషుఁడు, మర్త్యుఁడు, మనుజుఁడు, మానవుఁడు, నరుఁడు, పంచజనుఁడు, పురుషుఁడు, పూరుషుఁడు, ? నుఁడు మొ॥

మన్మథుఁడు— మదనుఁడు, మారుఁడు, ప్రద్యుమ్నుఁడు, మీనకేతనుఁడు, కందర్పుఁడు, దర్పకుఁడు, అనంగుఁడు, కాముఁడు, పంచశరుఁడు, స్మరుఁడు, శంబరారి, మనసిజుఁడు, కుసుమేషువు, అనన్యజుఁడు, పుష్పధన్వుఁడు, రతిపతి, మకరధ్వజుఁడు, ఆత్మభువు, శృంగారయోని, శ్రీపుత్త్రుఁడు, శూర్పకారాతి, బ్రహ్మసువు, ఋష్యకేతువు, విశ్వకేతువు, అలరువిల్తుఁడు, కన్నుల విల్తుఁడు, కమ్మవిలుకాఁడు, చక్కెర వింటివాఁడు, చెఱకువిల్కాఁడు, కెంజిగురువిల్తుఁడు, వెడవిల్తుఁడు, పచ్చవిల్తుఁడు, ఇంచువిల్లుదాలుపు, తుంటవిలుకాఁడు, తియ్యవిల్కాఁడు, జమిలిముక్కాలి నారివిలుకాఁడు, చౌవంచ ములుకులు గల దంట, రాచిల్క నెక్కెడు రాయరౌతు, మీను మొసలి సిడెంబుల మేటి, చందమామ యల్లుఁడు, వలరాజు, మరుఁడు, లచ్చికొడుకు, కంతుఁడు.

మరణము — పంచత, కాలధర్మము, ప్రళయము, త్యజము, అస్తము, నాశము, మృత్యువు, నిధనము, దీర్ఘనిద్ర, హింస, ప్రమీలనము, కాలము.

మఱుఁగు—అంతరము, అంతర్థ, అంతర్ధి, అపవారణము, అపిధానము, అచ్ఛాదనము, తిరోధానము, పిధానము, వ్యవధ.

మఱ్ఱిచెట్టు— కర్మజము, కాంచనము, క్షీరద్రుమము, క్షీరము, క్షీరి, జటి, ధ్రువము, నంది, న్యగ్రోధము, పాదరోహము, బహుపాత్తు, బహుపాదము, యక్షావాసము, రక్తఫలము, రోహి, వటము, వనస్పతి, విటపి, క్షీరకాష్ఠ, గుటిక.

మహిషము— లులాయము, వాహద్విషము, కాసరము, సైరిభము, దుంత, ఎనుబోతు, జము నెక్కిరింత, దున్న.

మాంసము — పిశితము, తరసము, పలలము, క్రవ్యము, ఆమిషము, కుల్యము, ఎఱచి, పొల, పొలసు, నంజుఁడు, ఈరువు.

మాట— ఉక్తి, గోవు, పలుకు, భారతి, భాషితము, లపనము, లపితము, వక్తవ్యము, వచనము, వ్యాహారము, ఇడ, ఇర, ఇల.

మామిడి— ఆమ్రము, అంబరీషము, ఆమ్రాతకము, ఆమ్రము, కామవల్లభము, కామశరము, కామాంగము, కీరేష్టము, కోకిలానందము, కోకిలావాసము, గంధబంధువు, చామరపుష్పము, చూతము, మాకందము, రసాలము, అంబాళము, అంబష్ఠ, ఆమ్లపాటలము, ఆమ్రాతకము, కపిచూడ, కపిచూతము, కపీతనము, టంకము, పీతనము, బృహద్బీజము, రక్తపుష్పము.

మారేడుచెట్టు— బిల్వము, బిలువము, శాండిల్యము, శైలూషము, శ్రీఫలము, శ్రీపదము, మాలూరము, శ్రీప్రియము, లక్ష్మీప్రదము, లక్ష్మీప్రియము.

మార్గము— అయనము, ఋతి, సృతి

ఎంథ, వర్త్మము, అధ్వము, పదవి, త్రోవ, దారి, తెన్ను, తెరువు, తెర్వు, వీధి, జాడ, తెరఁగు, తెఱవు, తెరువువ, రస్తా, నడవ, సరవి, కంత, కంత్ర.

మార్గస్థుఁడు— అధ్వగుఁడు, అధ్వనీనుఁడు, అధ్వన్యుఁడు, ఇత్వరుఁడు, తెరువరి, దారి నడచువాఁడు, పాంథుఁడు, బాటసారి.

మాలవాఁడు—చండాలుఁడు, ప్లవుఁడు, మాతంగుఁడు, దివాకీర్తి, జనంగముఁడు, నిషాదుఁడు, శ్వపచుఁడు, అన్తేవాసి, చాండాలుఁడు, పుల్కసుఁడు, అంత్యజుఁడు, హరిజనుఁడు.

మిడుత— దివ్వెయార్పు, మిడత, చీరకము, పతంగము, శలభము.

మిరియము— ఊషణము, కోలకము, కృష్ణము, మరీచము, వేల్లజము.

ముంగిస — కోటీరము, కౌశికము, పింగళము, నకులము, ముంగి, వంచకము.

ముందు— తొలి తొల్లి, తొలుత, పూర్వము, మందర, మును (పు).

ముక్కు— ఘ్రాణము, గన్ధవహ, ఘోణ, నాస, నాసిక, నశ్య, ముకు.

ముఖము— వక్త్రము, ఆస్యము, వదనము, తుణ్డము, ఆననము, లపనము, ప్రతీకము, మొగము, మోర, మోము, వాయి, మూతి.

ముత్యము— ఆణె, కువలము, చినుకు, పాణె, ముక్తహిమము, ముక్తాఫలము, మౌక్తికము, బూస, సారంగము.

మునగచెట్టు— శోభాంజనము, శిగ్రువు, తీక్ష్ణగంధకము, అక్షీబము, మునగచెట్టు, మోచక.

మురికి—కసటు, కల్మషము, చిలుము, పుల్ల, మలము, మయిల, మలినము, మాపు, మాలిన్యము.

ముసలివాఁడు—ప్రవయుఁడు, స్థవిరుఁడు, వృద్ధుఁడు, జీనుఁడు, జీర్ణుఁడు, జరఁడు, దశమీస్థుఁడు, ముది, ముగుదఁడు, ముదుసలి.

మూఁడు—వహ్ని, రాముఁడు, శిఖి, అగ్ని, పావకుఁడు, దహనుఁడు, అనలము, శంకరాక్షి, పురి, లోకము, శ్రేణి, కాలము, త్రయము, గుణము.

మూఢుఁడు—అజ్ఞుఁడు, మూర్ఖుఁడు, యథాజాతుఁడు, వైధేయుఁడు, బాలిశుఁడు, మందుఁడు, జడుఁడు, అజ్ఞకుఁడు, పృథగ్జనుఁడు.

మెడ —అఱ్ఱు, కుతుక, గుత్తిక, కుత్తుక, గొంతు, గొంతుక, పీక (ప్రేక, పేకి), కంఠము, కంధరము, కంధి, కుహరము, కంబువు, గళము, గాత్రము, గ్రీవము, నిగర్ణము, ప్రగ్రీవము మొ॥

మెత్తనిది—సుకుమారము, కోమలము, మృదులము, మృదువు.

మెఱుపు—శంప, శతహ్రద, విద్యుత్తు, సౌదామిని, చపల, చంచల, తటిత్తు, హ్రాదిని, ఐరావతి, క్షణప్రభ.

మేక—చూ. మేషము.

మేఘము— మొగులు, అంబుదము, అంభోదము, అభ్రము, అంబుభృత్తు, కంధరము, కజ్జలము, కమలాసనము, క్షరము, ఖచరము, ఖద్యోతము, ఖద్యోతము, ఖతమాలము, గగనధ్వజము, ఘనము. జలదము, జలధరము, జలమసి, జలముచము, జీమూతము, తటిత్వతి, తటిత్వంతము, తోయదము, దర్దురము, ధారాధరము, ధూమయోని, నభము, నభోగజము, నీరదము, పయోధరము, పారణపారణము, బలాహకము, ముదిరము, వనదము, వలాహకము, వాతరథము, వారివాహము, వ్యోమధూమము, స్తనయిత్నువు, గాలిగూడు, జాలుదొడుగు, నీటితాలుపు, నీటిమోఁపరి, నీరుతాలుపు, జేజేతేనియరదము, పయిరులుసుఱు, మబ్బు, మించుదారి, మొగిలు, మొయిలు.

మేడ— ఉపకారిక, ఉపకార్య, ఉప్పరిగ, పుటము, నగరు, రాజసదనము, సజ్జ, సౌధము.

మేర— అవధి, ఎల్ల, కర, క్రమము, గడి, కాష్ఠ, ధారణ, నియమము, ప్రమాణము, మరియాద, సంధ్య, సంస్థ, స్థితి, సీమ.

మేరుపర్వతము— మేరువు, సుమేరువు, హేమాద్రి, రత్నసానువు, సురాలయము, భద్రము, వేలుపుగొండ, పసిఁడిగట్టు, జేజేలగట్టు.

మేషము— అజము, అతిరోమశము, అవిధురము, అల్పాయువు, ఉరణము, ఉరభ్రము, ఊర్ణము, ఊర్ణాయువు, ఏడకము, ఛగలము, ఛాగము, తగరము, దేవానాంప్రియము, పర్ణభోజనము, జాలబాహ్యము, లంబకర్ణము, శివాప్రియము, అగ్నితత్తడి, ఇరుదలతేజి, ఏడిక, చింబోతు, తగరు, పొట్టేలు, మేఁకపోతు, అమిషం.

మొద్దు— ధ్రువము, మొరడు, మోటు, మోడు, మ్రోడు, శంకువు, స్థాణువు.

మొలక— అంకురము, నిసువు, మొక్క, మొటిక, మొట్టిక, మోసు, మోటిక, మోసు.

మొసలి— అంబుగజము, అంబుమర్కటము, అసిదంష్ట్రము, కుంభి, క్షీరశుక్లము, కుంభీరము, గిలగ్రాహము, గ్రాహము, జలకంటకము, జలకపి, జిలజిహ్వము, జలసూకరము, జలసూచి, ఝషము, ఝషాశనము, నక్రము, మకరము, హ్రదగ్రహము, కడలిరాతత్తడి, మరునిడాలు, కంటకము.

మోక్షము— ముక్తి, కైవల్యము, నిర్వాణము, శ్రేయము, అమృతము, అపవర్గము.

యజ్ఞము— సవము, సవనము, అధ్వరము, యాగము, సప్తతంతువు, మఖము, క్రతువు, హవము, మన్యువు.

యమునానది— కాళింది, సూర్యతనయ, శమనస్వస.

యముఁడు— జముననయిదోఁడు, పెతరులసామి, జముఁడు, ప్రొద్దుకొమరుఁడు, గుదెతాల్పు, పోతుజక్కినెక్కియాడెడు బలురౌతు, దక్షిణంపుసామి, కాలుఁడు, ధర్మరాజు, పితృపతి,

సమవర్తి, పరేతరాట్టు, కృతాంతుఁడు, యమునాభ్రాత, శమనుఁడు, యమరాట్టు, దండధరుఁడు, శ్రాద్ధదేవుఁడు, వైవస్వంతుఁడు, అంతకుఁడు.

యవ్వనము — యౌవనము, పరువము, ప్రాయము, జవ్వనము, పాయము.

యుద్ధము— ఆయోధనము, జన్యము, ప్రధనము, ప్రవిదారణము, మృధము, ఆస్కందనము, సంఖ్యము, సమీకము, సాంపరాయికము, సమరము, అనీకము, రణము, కలహము, విగ్రహము, సంప్రహారము, అభిసంపాతము, కలి, సంస్ఫోటము, సంయుగము, అభ్యామర్దము, సమాఘాతము, సంగ్రామము, అభ్యాగమము, ఆహవము, సముదాయము, సమితి, సంయత్తు, ఆజి, సమిత్తు, యుధము, పెనుకువ, జగడము, కయ్యము, బవరము, కలను, చివ్వ, ఆలము, పోట్లాట, అని, దురము, పోరు.

యోధుఁడు—అతిరథుఁడు, అస్త్రజీవి, ఆరభటుఁడు, ఉష్ణుఁడు, ఊొమ్మలుఁడు, త్రీపకుఁడు, పత్తి, పదాతి, పగ్గుఁడు, పాదాతికుఁడు, యోధ, భటుఁడు, కాలరి, కాల్బంటు, జోదు, బంటు, సిపాయి మొ.

రంధ్రము— కుహరము, సుషిరము, వివరము, బిలము, ఛిద్రము, నిర్వ్యథనము, రోకము, శ్వభ్రము, వప, సుషి, కలుఁగు, బొఱియ, లాగ, బొక్క.

రక్షింపబడినది—త్రాతము, త్రాణము, రక్షితము, అవితము, గోపాయితము, గుప్తము.

రజితము—వెండి, దుర్వర్ణము, రూప్యము, ఖర్జూరము, శ్వేతము.

రథము—అరదము, తేరు, నేత్రము, శతాంగము, స్యందనము.

రమించుట— వ్యవాయము, గ్రామ్యధర్మము, మైథునము, నిధువనము, రతము, మన్మథసంగరము, విషయము, హిండనము, శృంగారము, రహస్సు.

రాక్షసులు— అసురులు, దైత్యులు, దైతేయులు, దనుజులు, దానవులు, శుక్రశిష్యులు, పూర్వదేవులు, రక్కసులు, సురద్విషులు, పుణ్యజనులు, సోఁకుమూకలు.

రాగి—తామ్రకము, శుల్బము, మ్లేచ్ఛముఖము, ద్వ్యష్టము, వరిష్ఠము, ఉదుంబరము, ఔదుంబరము.

రాజాంతఃపురము — అవరోధనము, శుద్ధాంతము, అవరోధము.

రాజు— ఇనుఁడు, ఇంద్రుఁడు, ఎకిమీఁడు, ఏలిక, ఒడయఁడు, గురువు, గోపతి, గోపాలుఁడు, జనపాలుఁడు, క్ష్మాభృత్తు, తుపాసి, దుసేదారి, నృపుఁడు, పబువు, పార్థివుఁడు, భూపాలుఁడు, భూపుఁడు, భూరమణుఁడు, మన్నీఁడు, మన్నియ, మన్నియఁడు, మన్నెరాయఁడు, మహీక్షితుఁడు, రా, ఱేఁడు, రాయలు, సామి.

రాత్రి—నిశ, నిశీథిని, త్రియామ, క్షణద, క్షప, విభావరి, తమస్విని, రజని, యామిని, తమి, శర్వరి, అసుర, శ్యామ, నూపు, రే, రేయి, రాతిరి.

రావిచెట్టు— అమలము, అశ్వత్థము, కపీతనము, కుంజరాశనము, కుంభజము, కృష్ణావాసము, కేశవా(లయ-వాస)ము, క్షీరద్రుమము, గజభక్షకము, గజాశనము, గుహ్యాపుష్పకము, చలదళము, చైత్యద్రుమ, చైత్యము, చైత్రపాదము, దీర్ఘాయువు, నారాయణము, పవిత్రకము, పిప్పలము, ప్లక్షము, బోధిద్రుమము, మంగళ్యము, రోహి, వనస్థ, వహ్నిగర్భకము, వృక్షాదనము, శ్రీవృక్షము, కంబూమ, క్రముకము, లూదము, తూలము, పూగము, బ్రహ్మచారి, బ్రహ్మణ్యము, బ్రహ్మదారువు, యూపము.

రాహువు— తమస్సు, స్వర్భానుఁడు, సైంహికేయుఁడు, విధుంతుదుఁడు, భుజగుఁడు, ఖండపరశువు, కృష్ణవర్త్మ, గ్రహము, తలగాము.

రెండు—అక్షి, చక్షువు, కరము, నేత్రము, లోచనము, బాహువు, కర్ణము, పక్షము, దృష్టి, ద్వయము, యుగ్మము, అంబకము, నయనము, ఈక్షణము.

రెట్టింపు— ద్విగుణము, ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెంట, రెట్టి, ఇనుమడి, దువ.

లంజకత్తె— పుంశ్చలి, ధర్షణి, బంధకి, అసతి, కులట, ఇత్వరి, స్వైరిణి, పాంసుల, చెడిపె, లంజకాఁడి, చెడ్డతొయ్యలి, వెలిచెవులగనినది, జఱభి, జాఱిణి, జార, వెలిచూరవరి.

లాయి—పాషాణము, ప్రస్తరము, గ్రావము, ఉపలము, అశ్మ, శిల, దృషత్తు, వజ్రము, కల్లు, గుండు.

ఱెక్క — ఎఱక, గరుత్తు, గఱి, చట్టుపఛదము, ఛదనము, తనూరుహము, పక్షము, నెఱి, ప(త)త్రము, వాజము.

లక్క— లాక్షము, రాక్షము, రక్షము, జతువు, అలక్తము, ద్రుమామయము, జతూక, జమూక, జతుక.

లక్ష్మీదేవి—పద్మాలయ, పద్మ, కమల, శ్రీ, హరిప్రియ, ఇందిర, లోకమాత, మా, రమ, మంగళదేవత, భార్గవి, మాయ, మాధవి, లోకజనని, క్షీరసాగరకన్యక, లచ్చి, కలుముల జవరాలు, పచ్చవిల్తుని తల్లి, కరివేల్పు నిల్లాలు, తల్లితల్లి, తొతతల్లి, కడలి కూఁతురు, సిరి, లిచ్చిపడతి, తమ్మియింటి గటిత, మరుతల్లి, నెలచెలియలు.

లవంగపుచెట్టు— త్వక్కు, పత్రము, ఉత్కటము, భృంగము, చోదము, చోచము, దేవకుసుమము, వరాంగకము, శ్రీసంజ్ఞము.

లేఁడి— అజినయోని, ఇణి, కందలి, కురంగము, గోకర్ణము, చమూరువు, చీనము, న్యంకువు, పృషతము, ప్రియకము, మృగము, రంకువు, రురువు, రోహితము, వాతాయువు, వృజినము, శంబరము, సమూరువు, సారంగము, హరిణము.

వంకరయైనది— అరాళము, వృజినము, జిహ్మము, ఊర్మిమంతము, కుంచితము, నతము, ఆవిద్ధము, కుమలము, భుగ్నము, వేల్లితము, వక్రము, క్ష్వేడము, నెఱి (డొంక) యయినది.

వంటవాఁడు— సూపకారుఁడు, వల్లవుఁడు, ఆరాళికుఁడు, ఆంధసికుఁడు,

సూదుఁడు, ఓదనికుఁడు, గుణుఁడు, పాచకుఁడు, బానసుఁడు.

వంశము—సంతతి, గోత్రము, జననము, కులము, అన్వయము, వంగడము, వంగసము, ఆన్వాయము.

వచించు—అను, నుడువు, వక్కాణించు, ఆడు, చెప్పు, వివచు, వాక్రుచ్చు, పలుకు, భాషించు.

వజ్రాయుధము—హ్రాదిని, వజ్రము, కులిశము, భిదురము, పవి, శతకోటి, దంభోళి, అశని, స్వరువు, గోవు.

వరుణపాశము—నాగపాశము, నాగము, పాఁపతూపు, పాపరము.

వరుణుఁడు—ప్రచేతసుఁడు, పాశి, నీటిఱేఁడు, యాదసాంపతి, అప్పతి, ప్రాచేతసుఁడు, ప్రచేతుఁడు, పడమటిదొర, వల్లెత్రాడుతాల్పు, నీళ్ళరాయఁడు, ఏఁటిబోఁటిమగల యెకిమీఁడు, నీటియొడయఁడు, అపాంపతి, మొయిలుఱేఁడు, మేఘాధిపతి, జడిసామి, మొసలిరౌతు.

వర్తకుఁడు—వైదేహకుఁడు, సార్థవాహుఁడు, నైగముఁడు, వాణిజుఁడు, వణిజుఁడు, పణ్యాజీవుఁడు, ఆపణికుఁడు, క్రయవిక్రయకుఁడు.

వలె—ఇట్లు, బలె, పోలె, వంటి, ఉద్ది, ఈడు, తుల, సమానము, జత, సరి, తుల్యము, సదృశము, సంకాశము, నీకాశము, నిభము, మిత్రము, బంధువు, చుట్టము.

వస్త్రము—పుట్టము, దువ్వలువ, చీరె, చీర, కోక, వలువ, ఆచ్ఛాదనము, వాసము, చేలము, వసనము, అంశుకము, అంబరము, కశిపువు, పటము, గింటెము.

వానకోయిల—చాతకము, సారఙ్గము, స్తోకకము.

వాయుదేవుఁడు—శ్వసనుఁడు, స్పర్శనుఁడు, మాతరిశ్వుఁడు, సదాగతి, పృషదశ్వుఁడు, గంధవహుఁడు, గంధవాహుఁడు, అనిలుఁడు, ఆశుగుఁడు, సమీరుఁడు, నభస్వంతుఁడు, మారుతుఁడు, మరుత్తు, జగత్ప్రాణుఁడు, సమీరణుఁడు, వాతుఁడు, పవనుఁడు, పవమానుఁడు, ప్రభంజనుఁడు, ప్రకంపనుఁడు, అతిబలుఁడు, ఝంఝావాతుఁడు, నీటితాత, గాలి, కరువలి, తెమ్మెర, ఈఁద, వలి, మరుతేరు.

విగ్రహము—ప్రతిమానము, ప్రతిబింబము, ప్రతిమ, ప్రతియాతనము, ప్రతిచ్ఛాయ, ప్రతికృతి, అర్చ, ప్రతినిధి.

విఘ్నేశ్వరుఁడు—వినాయకుఁడు, ద్వైమాతురుఁడు, గణాధిపుఁడు, ఏకదన్తుఁడు, హేరంబుఁడు, లంబోదరుఁడు, గజాననుఁడు, ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు, పనిచెఱుపులదొర, చేటచెవుల వేల్పు, వంకర తొండమువాఁడు, ఏనుఁగుమొగంబు దేవర, పాపజందెముల మేటి, గరికపూజల మెచ్చు గబ్బివేల్పు, మ్రొక్కువారలపనుల్ చక్కఁజేసెడు సామి, ముక్కంటి పండులమెక్కుడుదిండీఁడు, ముక్కంటి గారాబు ముద్దుపట్టి, పెద్దకడుపు

వేల్పు, పిళ్ళారి, కొక్కుతేజిరౌతు, గుజ్జువేల్పు, ఒంటికొమ్ముదేవర, వెనకయ్య మొ.

విటుఁడు—కోడెకాఁడు, వనుపుకాఁడు, బుజాగు, మిండఁడు, మిండగీఁడు, మనుపుకాఁడు.

విడువఁబడినది—త్యక్తము, హీనము, విధుతము, సముజ్ఝితము, ధూతము, ఉత్సృష్టము.

విద్వాంసుఁడు—విపశ్చిత్తు, విదుఁడు, దోషజ్ఞుఁడు, సుధి, కోవిదుఁడు, బుధుఁడు, ధీరుఁడు, మనీషి, ప్రాజ్ఞుఁడు, సంఖ్యావంతుఁడు, పణ్డితుఁడు, కవి, ధీమన్తుఁడు, సూరి, కృతి, కృష్టి, లబ్ధవర్ణుఁడు, విచక్షణుఁడు, దూరదర్శి.

విపత్తు—ఆపద, ఆపత్తు, బెడఁద, దెస, చేటు, అంకిలి, చేట్పాటు, గొడవ, అత్రము, కీడు, అంగలార్పు, గోరము, దోసము, ఇడుము, అంగద, అనయము, సంగరము, సంపరాయము, కెత, కస్తి.

విల్లు—అస్త్రము, ఇష్వాసము, కార్ముకము, కోదండము, చాపము, ధనువు, ధన్వము, ధర్మము, విలు, సింగాణి, సింగిణి.

విశాలము—పఱపు, పల్లవము, భూరి, ప్రాయము, విగ్రహము, వితానము, విప్పు, విస్తారము, విరివిడి, వ్యాసము, (విశేషణార్థమున) ఉరు, తతము, పృథు(వు), పృథులము, పృథ్వి, బృహత్తు, మహత్తు, విసృతము, విస్తృతము, విపులము, విశంకటము.

విష్ణువు—నారాయణుఁడు, కృష్ణుఁడు, వైకుంఠుఁడు, విష్టరశ్రవసుఁడు, దామోదరుఁడు, హృషీకేశుఁడు, కేశవుఁడు, మాధవుఁడు, స్వభువు, దైత్యారి, పుణ్డరీకాక్షుఁడు, గోవిన్దుఁడు, గరుడధ్వజుఁడు, పీతామ్బరుఁడు, అచ్యుతుఁడు, శార్ఙ్గి, విష్వక్సేనుఁడు, జనార్దనుఁడు, ఉపేంద్రుఁడు, ఇంద్రావరజుఁడు, చక్రపాణి, చతుర్భుజుఁడు, పద్మనాభుఁడు, మధురిపువు, వాసుదేవుఁడు, త్రివిక్రముఁడు, దేవకీనందనుఁడు, శౌరి, శ్రీపతి, పురుషోత్తముఁడు, వనమాలి, బలిధ్వంసి, కంసారాతి, అధోక్షజుఁడు, విశ్వంభరుఁడు, కైటభజిత్తు, విధుఁడు, శ్రీవత్సలాంఛనుఁడు, గదాగ్రజుఁడు, ముంజకేశుఁడు, దాశార్హుఁడు, దశరూపభృత్తు, సోమమూకల గొంగ, చుట్టుకైదువ జోదు, పచ్చవిల్తుని తండ్రి, లచ్చిమగఁడు, పులుఁగుతత్తడిరౌతు, వలమురితాలుపు, వెన్నుఁడు, కరివేల్పు, వెన్నదొంగ, నునుగాడ్పుదిండిపానుపునఁ బండెడు మేటి, బ్రహ్మదేవుతండ్రి, తమ్మికంటి, పదివేసములసామి, పసిఁడి పుట్టము తాల్పు, కత్తినెచ్చెలి, తరిగట్టుదారి, ఆలకాపరి, వ్రేతలమేలువాఁడు, పాలకడలల్లుఁడు, పక్కిడాలు ఱేఁడు, రేయుఁబవలునుజేయుకందోయివాఁడు, మామమామ మొ.

వీరుఁడు—ఎక్కటి, కలి, దిట్ట, తెంపరి, పోటరి, బిరుదు, బంటు, మేటి, మనసరి, మిడిమానిసి, మొనగాడు, వడికాఁడు, వాడిమగఁడు, ధీరుఁడు.

వృత్తాంతము—చరిత్రము, ఉదన్తము, ప్రవృత్తి, వార్త.

వృషభము:— లులాయము, వాహద్విషము, కాసరము, సైరిభము, ఆలపోతు, బసవఁడు, గిబ్బ, అఁబోతు, గిత్త, ఎద్దు, కోడె.

వెండి:—కలధౌతము, ఖర్జూరము, దుర్వర్ణము, నిష్కము, రజతము, రూప్యము, శుక్లము, శ్వేతము.

వెండ్రుకలు:— అంగజములు, అలకములు, కచములు, కుంతలములు, కేశములు, కురులు, చపలములు, చికురములు, సెలుకలు, సెలులు, వాలములు, శిరోరుహములు.

వెదుకఁబడినది— అన్వేషితము, గవేషితము, అన్విష్టము, మార్గితము, మృగితము, వెదుకఁ (అరయ) బడినది.

వెదురు—వంశము, త్వక్సారము, త్వచిసారము, కర్మారము, తృణధ్వజము, శతపర్వము, యవఫలము, వేణువు, మస్కరము, తేజనము, కంటకము.

వెనుక— పిదప, తర్వాత, పదపడి, పిమ్మట, మునుపు, ముందు, మునుమున్ను, తొలి, తొల్లి, తొలుత.

వెఱ్ఱివాఁడు— అపస్మారి, ఉన్మత్తుఁడు, తిక్క, వెంగలి, వెంబరవిత్తు, వెకలి, వెడఁగు, వీఱిఁడి, వేఁదుఱు.

వేగము—శీఘ్రము, త్వరితము, లఘువు, క్షిప్రము, అరము, ద్రుతము, సత్వరము, చపలము, తూర్ణము, అవిలంబితము, ఆశు, చెచ్చెర, వేగిరము, త్వర, సరగ, వేగ, వైళము, వెసము, వడిగ, గ్రక్కున, గ్రద్దన, గ్రన్నన, గొబ్బున, దిగ్గున.

వేడి—ఆవి, ఉక్క, ఉడుకు, ఉబ్బ, ఉష్ణము, ఖరము, ఘర్మము, చుఱుకు, తపము, తేజస్సు, నిదాఘము, ప్రతాపము, సంజ్వరము, సంతాపము, సెగ, తెక, తాపము, సెక.

వేగులవాఁడు— అపసర్పుఁడు, చరుఁడు, చారుఁడు, గూఢపురుషుఁడు, పడవాఁడు, ప్రణిధి, యథార్హవర్ణుఁడు, వేగరి, వేగువాఁడు, వేగు.

వేదము—ఆమ్నాయము, ఋషి, ఛందస్సు, తొంటిబాస, తొలిపలుకు, నిగమము, ప్రాఁబలుకు, ప్రామినుకు, ప్రాఁజదువు, మినుకు.

వేఁపచెట్టు—అరిష్టము, సర్వతోభద్ర, హింగునిర్యాస, మాలకము, పిచుమందము, పిచుమర్దము, నింబ.

వైద్యుఁడు—వెజ్జు, జైవాతృకుఁడు, మందరి, దోషజ్ఞుఁడు, భిషక్కు, భిషజుఁడు, రోగహారి, అగదంకారుఁడు.

వైశ్యుఁడు—ఊరవ్యుఁడు, ఊరుజుఁడు, అర్యుఁడు, భూమిస్పృశుఁడు, విశుఁడు, గుప్త, కోమటి, బచ్చు, శేరి, సెట్టి.

శంఖము—అబ్జము, కంబువు, కూఁత, కైదువు, చిందము, దరము, బూరగొమ్ము, వలమురి, శుక్తి, సంకు.

శత్రువు— రిపువు, వైరి, సపత్నుఁడు, ద్విషత్తు, ద్వేషణుఁడు, దుర్హృదుఁడు, ద్విట్టు, విపక్షుఁడు, అహితుఁడు, అమిత్రుఁడు, దస్యుపు, శాత్రవుఁడు, శత్రవుఁడు, అభియాతి, పరుఁడు, అరాతి, ప్రత్యర్థి, పరిపంథి, భ్రాతృవ్యుఁడు, అసహనుఁడు, ద్వేషి, జిఘాంసువు,

ప్రతిపక్షుఁడు, విరోధి, అసుహృత్తు, ప్రత్యవస్థాత.

శని—మన్దుఁడు, పఙ్గుఁడు, కాళుఁడు, ఛాయాపుత్త్రుఁడు, అసితుఁడు, అర్కజుఁడు, సౌరి, శనైశ్చరుఁడు, సూర్యపుత్త్రుఁడు మొ.

శపథము—ప్రతిజ్ఞ, ప్రతిన, పణము, పరిగ్రహము, ప్రత్యయము, ప్రమాణము, బాధము, సంగరము, సంధ్య, సత్యము, సమయము, ఆన, ఒట్టు, బాస, బిరుదు, శపనము.

శయ్య—మెత్త, సెజ్జ, సజ్జ, ప్రక్క, పక్క, పఱుపు, పానుపు, పడక.

శరభమృగము—అష్టపాత్తు, అష్టపదము, ఊర్ధ్వపాదము, ఊర్ధ్వలోచనము, అడివపు మెకము, ఏనుఁగుల గొంగనూడు, చవుగంటి, చౌగంటి, దచ్చికాళ్ళమెకము, దచ్చియడుగుల మెకము, మీగండ్లమెకము, సింగపుఁగొంగ.

శరము—పృషత్కము, బాణము, విశిఖము, అజిహ్మగము, ఆశుగము, కలంబము, మార్గణము, పత్త్రి, రోపము, ఇషువు, అమ్ము, కోల, ములికి, తూఁపు.

శరీరము—కళేబరము, గాత్రము, వపుస్సు, సంహననము, వర్ష్మ, విగ్రహము, కాయము, దేహము, మూర్తి, తనువు, మే, మెయి, మేను, ఒడలు, మై, మయి.

శర్కర—ఉపల, కలకండ, కండచక్కెర, ఖండశర్కర, నవాతు, పంచదార, పులకండము, రసాల, సికత, సిత.

శిల—పాషాణము, ప్రస్తరము, గ్రావము, ఉపలము, అశ్మము, దృషత్తు, ఱాయి, ఱా, కలు.

శిశువు—పోతము, పాకము, అర్భకము, డింభకము, పృథుకము, శాబకము, బిడ్డ, నిసుఁగు, నిసువు, పిల్ల, పాప, కుఱ్ఱ, బుడుత, చిఱుత, పాపు, కూన.

శుక్రుఁడు—దైత్యగురువు, కావ్యుఁడు, ఉశనసుఁడు, భార్గవుఁడు, కవి, భృగువు, అప్సుజుఁడు, సితుఁడు మొ.

శుభము—శ్వఃశ్రేయసము, శమ్, శివము, అరిష్టము, రిష్టము, భద్రము, కల్యాణము, మఙ్గళము, భావుకము, భవికము, భవ్యము, కుశలము, క్షేమము, శస్తము, లగ్గు, బాగు, మేలు, లెస్స.

శుభ్రము—అభ్రకము, తెలుపు, తెల్లనిది, ప్రకాశించునది, నిర్మలము, నైర్మల్యము, స్వచ్ఛము, అచ్ఛము, ఒక గ్రహప్రయోగము.

శూద్రుఁడు—అవరవర్ణుఁడు, వృషలుఁడు, జఘన్యుఁడు, జఘన్యజుఁడు.

శూన్యము—ఆకాశము, అవకాశము, రోదసి, మేఘపథము, మొయిలుదారి, గగనము, అంతరిక్షము, మరుత్పథము.

శ్రమ—అలయిక, బడలిక, అలపు, సేద, వడ, అలసట.

శ్లేషవాచకము—శాదూలు, వ్యాఘ్రము,

సింహ, శరభ, వృషభ, పుంగవ, వరాహ, తల్లజ, ఇంద్ర, చంద్ర, తిలక, వర, రత్నాది శబ్దములు, కన్నాకు, తలకట్టు, మేలుబంతి మొ.

సంతుష్టుఁడు—హృష్టుఁడు, మత్తుఁడు, తృప్తుఁడు, ప్రహ్లన్నుఁడు, ప్రముదితుఁడు, ప్రీతుఁడు.

సంతోషము—ముదము, ప్రీతి, ప్రమదము, హర్షము, ప్రమోదము, ఆమోదము, సమ్మదము, ఆనందము, శర్మ, శాతము, సుఖము, హాళి, కౌతుకము, ఎలమి, వేడుక, సెమ్మి, సంతసము, ఇంపు, సొంపు, అలరు.

సంపద—సిరి, లచ్చి, కలిమి, విభూతి, భూతి, ఐశ్వర్యము, శ్రీ, లక్ష్మి, భగము, పదతి.

సంశయము— అనుమానము, ఆతంకము, త్రుటి, శంక, ద్వాపరము, యంత్రకము, సందియము, సందేహము.

సతతము - సంతతము, ఎప్పుడు, ఎడపక, ఉడుగక, ఎల్లప్పుడు, నిచ్చ, నిచ్చలు, సదా, అనవరతము, నిరతము, రతము, అజస్రము, ఎడతెగనిది.

సత్యము-నిజము, నిక్కువము, నిక్కము, తథ్యము, ఋతము, యాథార్థము, నిలుకడము, యథాతథము.

సభ—సమజ్య, పరిషత్తు, గోష్ఠి, సమితి, సంసతి, ఆస్థాని, ఆస్థానము, ఓలగము, కొలువు, సదము, ప్రతిశ్రయము.

సమస్తము—విశ్వము, అశేషము, నిశ్శేషము, సర్వము, కృత్స్నము, నిఖిలము, అఖిలము, సమగ్రము, సకలము, అఖండము, పూర్ణము, సంపూర్ణము, అనూనము, అవికలము, అభిన్నము, పుష్కలము.

సమానము—సమము, తుల్యము, సదృక్షము, సదృశము, అన్యము, సాధారణము, ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాద్రి, మాదిరి, ఉద్ది, జత, తరము, పురుడు.

సమీపము—నికటము, ఆసన్నము, సన్నికృష్టము, సనీడము, సదేశము, అభ్యాశము, అభ్యాసము, సపథము, సమర్యాదము, సవేశము, ఉపకణ్ఠము, అన్తికము, అభ్యర్ణము, అభ్యగ్రము, ఆభీశము, దండ, చేరువ, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద,దగ్గర, కురంగట, దగ్గర, కురంట, అండ, పజ్జ.

సముఖము—ముందట, ముందల, ఎదుట, మ్రోల, మంగల, సమక్షము.

సముద్రము— అబ్ధి, అకూపారము, పారావారము,సరిత్పతి,ఉదన్వన్తుఁడు, ఉదధి, సింధువు, సరస్వన్తుఁడు, సాగరుఁడు, అర్ణవము, రత్నాకరము, జలనిధి, యాదఃపతి, అపాంపతి, అప్పతి, పాథఃపతి, పాథోధి, పాథోనిధి, మున్నీరు, కడలి, సంద్రము.

సమూహము—నివహము, వ్యూహము, సందోహము, విసరము, వ్రజము, స్తోమము, నికరము, వ్రాతము,వారము, సంఘాతము, సంచయము, సముదాయము, సముదయము, సమవాయము, సంహతి, బృందము, నికురుంబము, కదమ్బకము, వితానము, ప్రకరము, మణ్డ

లము, చక్రవాళకము, పటలము, చక్రము, జాలము, జాలకము, బారు, దండు, దళము, తుటుము, గుమి, కూటు, కూటువ, పదువు.

సరస్వతీదేవి—వాగధిదేవత, బ్రాహ్మి, భారతి, భాష, వాక్కు, వాణి, పలుకుల వెలఁది, పొత్తము మత్తో, నలువ (రాణి) పడఁతి, కలుములపైఁదలి కోడలు.

సర్పము—పృదాకువు, భుజగము, భుజంగము, భుజంగమము, ఆశీవిషము, విషధరము, చక్రి, వ్యాళము, శరీసృపము, కుణ్డలి, గూఢపము, చక్షుశ్రవము, కాకోదరము, ఫణి, దర్వీకరము, దీర్ఘపృష్ఠము, దన్దశూకము, బిలేశయము, ఉరగము, పన్నగము, భోగి, జిహ్వగము, పవనాశనము, లేలిహానము, ద్విరసనము, వ్యాళము, కుంభీనసము, సారంగము, హరి, పాము, నిడుపఁడు, పడగదారి, గాలిమేఁతరి, విషదారి, కానరానికాళ్ళయది, చిల్వ, వీనులకంటి, పుట్టదిట్ట, పుట్టకాపరి.

సన్న్యాసి—భిక్షువు, పరివ్రాట్టు, కర్మన్ది, పారాశరి, మస్కరి, బోడితపసి, కావిపుట్టగోచులసామి, ఇల్లుబాసి తిరుగు, జడదారి, యతి, ముని, మౌని.

సాటి—ఎన, ఉద్ది, కల్పము, జత, జోక, జోడు, తరము, తుల, తుల్యము, దినుసు, దీటు, దొర, ధర్మము, పాటి, పురుడు, పోలిక, ప్రకారము, ప్రతి, మాదిరి, మాఱు, సమము, సదృక్షము, సదృశము, సమానము, సాధారణము.

సారంగము—ఇఱ్ఱి, జింక, లేడి, కురంగము.

సారథి—నియంత, యంత, ప్రాజిత, సూతుఁడు, క్షత్త, సవ్యేష్ఠుఁడు, దక్షిణస్థుఁడు, రథకుటుంబి.

సాలెపురుగు—లూత, తన్తువాయము, ఊర్ణనాభము, మర్కటము, అష్టపదము, దట్టుపురువు.

సాలెవాఁడు—తంతువాయుఁడు, కువిన్దుఁడు, నేఁతగాఁడు, దేవాంగి.

సింహము—పెడదమోము మెకము, జడలమెకము, ఏనుఁగులగొంగ, మెకముల కొలముసామి, తెల్లడాలుమెకము, తెరనోటిమెకము, సింగము, బొబ్బమెకము, మృగేంద్రము, పఞ్చాస్యము, పంచాననము, హర్యక్షము, కేసరి, హరి, కణ్ఠీరవము, గజఘ్రుఘ, పిఙ్గదృష్టి, మృగాధిపము.

సిగ్గు—మన్దాక్షము, హ్రీ, త్రప, వ్రీడ, లజ్జ, నాన, సిబ్బితి, పుచ్చటిక, పుచ్చడిక, బొసుకు, పుయిలోట.

సివంగి—తరక్షువు, మృగాదనము, సివ్వఁగి.

సీత—కుమారి, భూమిజ, ధరణిజ, జనకజ, జానకి, నాఁగటిచాలు పేరియతివ, చాలుపేరింటి పూఁబోఁడి.

సుదర్శనము—చుట్టువాలు, సుడివాలు, వట్రువాలు, బటువువాలు, వేయంచులవాలు, పదినూఱంచులవాలు, బల్లువాలు, చక్రము, చక్రాయుధము, కంటివాలు, కడిదపుఁగు, గుదుసుకైదువు, గుణుగువాలు, చుట్టుగైదువ,

బటువుకైదవ బటువడిదము, బటువు
గత్తి వేమొనలలుఁగు (ల్గు) సుడికత్తి
సుడియడిదము, చుట్టలుఁగు (ల్గు) అరి,
ఆయుధేంద్రము

సున్దరము— చక్కనిది రుచిరము,
చారు సుషమము, సాధు, శోభనము,
కాన్తము మనోహరము, రుచ్యము,
మనోజ్ఞము, మంజు, మంజుళము,
వామము హారి రమణీయము, శాలి,
మనోరమము, తిప్పనైనది, తియ్యనైనది,
తిన్ననైనది బాగైనది నాణెమైనది
విన్నాణమయినది, మానయినది,
లెస్సయినది పిన్ననైనది చెన్నైనది,
నలువయినది, చెల్వైనది పొసఁగినయది
ఒనరినయది, చొక్కటమయినది
చక్కనిది, సొగసైనది సొంపయినది,
సొంపైనది, కొమరయినది గొనబయినది
తోరమయినది, సింగరమయినది,
మేలైనది, మెచ్చైనది మురువుగలది,
ఒప్పయినది

సూర్యుఁడు—సూరుఁడు, అర్యముఁడు,
ఆదిత్యుఁడు, ద్వాదశాత్ముఁడు, దివా
కరుఁడు, భాస్కరుఁడు అహస్క
రుఁడు, బ్రధ్నుఁడు, ప్రభాకరుఁడు,
విభాకరుఁడు, వివస్వంతుఁడు సప్తా
శ్వుఁడు, హరిదశ్వుఁడు, ఉష్ణరశ్మి
వికర్తనుఁడు అర్కుఁడు, మార్తాం
డుఁడు, మిహిరుఁడు, అరుణుఁడు,
పూషణుఁడు ద్యుమణి, తరణి,
మిత్రుఁడు, చిత్రభానుఁడు, విరో
చనుఁడు, విభావసువు, గ్రహపతి,
త్విషాంపతి అహర్పతి, భానుఁడు,
హంసుఁడు, సహస్రాంశుఁడు
తపనుఁడు సవిత, రవి, కర్మసాక్షి,
జగచ్చక్షువు, అంశుమాలి, త్రయీ
తనువు, ప్రద్యోతనుఁడు దినమణి
ఖద్యోతుఁడు, లోకబాన్ధవుఁడు
సురోత్తముఁడు, ధామనిధి
పద్మినీవల్లభుఁడు, హరి
తమ్మివాల్గంటి మగఁడు, పోరనీల్గెడు
మొనగాండ్రు పోవుదారి, జగము
చుట్టము, జమునయ్య, జగముకన్ను
వెన్నుని వలకన్ను, వేఁడివేలుపు
ప్రొద్దుతోకల రాయిడికాఁడు, పవలు
చేయు వేలుపు పచ్చగుఱ్ఱాలవజీ
రుఁడు, వేఁడివెలుఁగు రేవెల్గుజోడు
జంటూరుమేనులసామి, చీఁకటిగొంగ
ఎఱ్ఱనివేలుపు ఇనముసూడు, చదలు
మానికము, ప్రాఁజదువులఁ జెట్టియ
ఏడుగుఱ్ఱముల తేతెక్కనోడు
మువ్వేలుపులయెక్క, ప్రొక్కుల
దేవర, గాముల ఱేఁడు జక్కవల
ఱేఁడు, వేయిచేతుల ఱేఁడు, వెలుఁగుల
యొకిమీఁడు, చైవులసాకిరి, చాయ
మగఁడు మింటితెరువరి, హేళి.

సేన—ధ్వజని, వాహిని పృతన అనీ
కిని, చమువు వరూధిని, బలము
సైన్యము, చక్రము, అనీకము, మొన
కటకము, దండు, దళము, ధాత్రి
నాగు, వీడు.

సేవకుఁడు—ఉపాసకుఁడు కింకరుఁడు
కుర్వంతుఁడు, దాసుఁడు, పరిచార
కుఁడు భటుఁడు, భృత్యుఁడు అడి
యరి, నవుకరు, పనివాఁడు, కొలువు
కాఁడు గులాము, డింగరీఁడు, డింగ
రుఁడు, బంటు, బంట్రోతు, బాని
సీఁడు, లెంక, లేఁక, వరవు, వర
వుఁడు

సొమ్ము— ఆభరణము, అలంకారము
పరిష్కారము, విభూషణము, మణి,

నము, భూషణము, తొడవు, రవ
ణము.

సోమరి— అలసుఁడు, ఆలస్యుఁడు, అనషుఁడు, తుందపరిమృజుఁడు, మందుఁడు, శీతకుఁడు స్వైరుఁడు.

స్త్రీ—యోషిత, అబల, యోష నారి సీమంతిని వధువు ప్రతీపదర్శిని, వామ, వనిత, మహిళ అంగన, భీరువు, కామిని, వామలోచన ప్రమద, మానిని కాన్త లలన, నితమ్బిని, సున్దరి రమణి, రామ, కొమ్మ, కాల్గంటి, పొలఁతుక, ముద్దియ, మగువ వాల్గంటి, సుదతి పడఁతి, మచ్చకంటి, అతివ, యుంగ్గలి ఇంతి లొయ్యలి, నవల కలువకంటి నాతి పూబోఁణి, చిగురాకుబోఁడి, పైదలి మెఱుగుబోణి ముద్దుల గుమ్మ పొన్ని కొమ్మ, ప్రోయాలు, ఉవిద, తీఁగబోఁడి, చేడియ ఇంచుబోఁడి అన్నువ వెలఁది బోణి బోటి చాన తెఱవ వెలఁదుక, లేమ, చెలువ, ఎలనాగ, చిగురుకలకొలికి, తలిరుబోఁడి అలరుబోఁడి నెలఁత, పొలఁతి నెలఁతుక, యోషిత్తు ఆఁడుది.

స్నేహము—ప్రేమ, ప్రియము, హార్దము, సాంగత్యము, మైత్రి, నెయ్యము, నేస్తము, నేయము నెయ్యమి నెమ్మి, నెమ్మిక పొందు, మాలిమి

స్వతంత్రుఁడు—ప్రావృతుఁడు, స్వైరి స్వచ్ఛందుఁడు, నిరవగ్రహుఁడు.

స్వర్గము— ఖము, త్రిదివము, త్రిదశాలయము, త్రివిష్టపము, దివము, దివి, నాకము, వినువ్రోలు వేగంటి కచ్చేరి వేల్పువెంకి.

హంస— శ్వేతగరుత్తు చక్రాంగము, మానసౌకము మానసౌకసము, నల్వ తేజి పాలును నీరును వేర్పఱుచు పుల్గు అంచ, తెలిపిట్ట

హనుమంతుఁడు—హనుమానుఁడు, ఆంజనేయుఁడు వాయునందనుఁడు, వాయుపుత్రుఁడు, అనుమంతిగాఁడు, అనుమఁడు పవనతనయుఁడు, మారుతి, మారుతాత్మజుఁడు గాడ్పుచూలి.

హిమవత్పర్వతము— హిమవతము, అద్రిరాజము, చలిమల, వలిమల, దుగ్గికన్నయ్య, వలిదిబ్బ శీతనగము, ముక్కంటిమామ.

హృదయము—ఎద ఎడ, ఎడ్ద, ఎడ్ద డెందము, మది ఎడద ఉల్లము, చిత్తము, చేతము, హృదయము, స్వాన్తము, మానసము, మనస్సు ఇచ్చ తలఁపు

# పర్యాయపదానుక్రమణిక

అంకుశము
అంగడి
అంగారకుఁడు
అంగీకరింపఁబడినది
అంగీకారము
అంతఃపురము
అంతెయము
అందము
అందె
అగరువు
అగసాలివాఁడు
అగస్త్యుఁడు
అగ్నిజ్వాల
అగ్నిదేవుఁడు
అగ్రము
అజ్ఞానము
అడవి
అడవిపంది
అడుగుకొనువాఁడు
అతిశయము
అద్దము
అధికము
అధికారము
అనుకూలించుట
అనూరుఁడు
అన్న
అన్నము
అపరాధము
అప్పు
అభిజనము
అభిప్రాయము
అభీష్టము
అమావాస్య
అమృతము
అమ్ములపొది
అయిదు
అరఁటిచెట్టు
అరుఁగు
అర్జునుఁడు
అల
అల్పుఁడు
అవమానము
అశ్వవిశేషములు
అశ్వినీదేవతలు
అసత్యము
అహంకారము
ఆఁకలి
ఆఁబోతు
ఆకాశగంగ
ఆకాశము
ఆకు
ఆజ్ఞ
ఆట
ఆటంకము
ఆముదపుచెట్టు
ఆలు
ఆలస్యము
ఆశ్వాస(న)ము
ఆసక్తి
ఇంగువ
ఇంద్రజాలము
ఇంద్రధనుస్సు
ఇంద్రునిభార్య
ఇచ్ఛ
ఇతరము
ఇత్తడి
ఇనుము
ఇప్పకల్లు
ఇల్లు
ఇసుక
ఈఁగ
ఈఁటె
ఈర్ష్య
ఈశ్వరుఁడు
ఉంగరము
ఉడుము
ఉత్తరేణి
ఉత్సవము
ఉదకము
ఉపవనము
ఉపాధ్యాయుఁడు
ఉపాయము
ఉప్పు
ఉభయపార్శ్వములు
ఉమియూట
ఉమ్మెత్త
ఉలుము
ఉలిమిరి
ఉసిరిక
ఊడ
ఊడుగు
ఊయల
ఋషి

ఎండ
ఎడబాటు
ఎత్తైనది
ఎద్దు
ఎనిమిది
ఎముక
ఎఱుపు
ఎలుక
ఎలుఁగుగొడ్డు
ఎల్లప్పుడు
ఏఁడాది
ఏకాంతము
ఏట్రింతపక్షి
ఏను
ఏడుపు
ఏనుఁగు
ఏలువాఁడు
ఐదువరాలు
ఐదవరాలు
ఐరావతము
ఒంటె
ఒకటి
ఒట్టు
ఒడ్డు
ఒరగల్లు
ఓర్పు
ఔషధము
కంచు
కంబళి
కటుకరోహిణి
కట్టఁబడినది
కడవ
కడుపు
కత్తి
కదలింపఁబడినది
కదలునది
కన్నీరు
కన్ను
కన్య
కపటము
కప్ప
కప్పము
కరుణ
కర్పూరము
కలువ
కల్లు
కవచము
కవ్వము
కస్తూరి
కళ్ళెము
కాంతి
కాకి
కామధేనువు
కాముకుఁడు
కావ్యము
కిరణము
కిరీటము
కీర్తి
కుంకుమపువ్వు
కుంటెనకత్తె
కుందేలు
కుంపటి
కుక్క
కుబేరుఁడు
కుమారస్వామి
కుమారుఁడు
కుమార్తె
కుమ్మరి
కులము
కూలి
కెంపు
కేతనము
కేతువు
కొంగ
కొప్పు
కొలది
కొబ్బరి
కొమ్మ
కోడి
కోఁతి
కోపము
కోయిల
కోరిక
కౌఁగిలి
క్రొత్తది
క్షత్రియుఁడు
క్షమ
గంగానది
గంధము
గంప
గగుర్పాటు
గట్టిది
గడ్డి
గబ్బిలము
గరుత్మంతుఁడు
గర్వము
గాడిద
గుఱ్ఱము
గూబ
గొఱ్ఱె
గొల్లవాఁడు
గోదావరినది
గోరు
గోవు
గ్రహణము

గ్రామము
గ్రుడ్డివాఁడు
చంద్రుఁడు
చంపుట
చక్రవాకము
చాతకపక్షి
చారుఁడు
చింతపండు
చిమ్మట
చిలుక
చీఁకటి
చీమ
చీర
చుంచు
చూచుట
చెక్కిలి
చెట్టు
చెమట
చెఱకు
చెఱసాల
చెఱువు
చెలికత్తె
చెవి
చేఁప
చావు
జందియము
జగము
జంట
జల్లెడ
జవ్వనము
జారినది
జిల్లేఁ
జీడి
జూదరి
జ్యోతిష్కుఁడు

టెక్కెము
డేగ
తండ్రి
తగరము
తడిసినది
తమ్ముఁడు
తరంగము
తల
తలవెండ్రుక
తల్లి
తాంబూలము
తాఁబేలు
తాఁడిచెట్టు
తిను
తిరస్కారము
తిరుగు
తుంగముస్తలు
తుమ్మెద
తెలుపు
తేలు
తొండ
తొమ్మిది
తోఁడేలు
త్రాడు
త్రాసు
దయావంతుఁడు
దయ్యము
దాడిచేయు
దానము
దారిద్ర్యము
దాసి
దాహము
దిక్కు
దీపము
దుఃఖము

దున్నపోతు
దూడ
దేవకాంత
దేవతలు
దేవదారు
దేవేంద్రుఁడు
దేశము
దొంగ
దోమ
ద్రాక్ష
ధనము
ధనుస్సు
ధృతి
ధేనుసమూహము
ధ్వని
నక్క
నక్షత్రము
నఖక్షతము
నగ
నడుము
నది
నమస్కరించు
నమస్కారము
నర్మదానది
నలుపు
నాగలి
నాట్యము
నానావర్ణసంకరము
నల్లి
నాచు
నామధేయము
నారి
నాలుక
నాలుగు
నింద

నిచ్చెన
నిడుపు
నిద్ర
నిర్వృతి
నీచము
నూయి
నెమిలి
నేయి
నేర్పరి
న్యాయము
పంక్తి
పండుకొను
పందికొక్కు
పక్షి
పగలు
పడక
పడుచుది
పదునైనది
పద్మము
పని
పరాధీనుఁడు
పరిమళము
పరిహాసము
పరుగు
పర్యాయము
పర్వతము
పలుకఁబడినది
పల్లు
పల్లేరుచెట్టు
పసుపు
పాపము
పాపి
పార్వతి
పాలు
పావురము
పిచ్చుక
పిడుగు
పిఱికి
పిఱుఁదు
పిల్లి
పిసినిగొట్టువాఁడు
పీఠిక
పుట్టుక
పుట్టుమచ్చ
పుణ్యము
పురము
పురీషము
పుత్త్రి
పుష్పమాల
పుస్తకము
పూర్వజన్మార్జితకర్మము
పెండ్లి
పెదవి
పెద్దకత్తి
పెద్దపులి
పెరుగు
పేను
పొందఁబడినది
పొట్టివాఁడు
పొడి
పోవు
పోషించు
పౌరుషము
ప్రధానుఁడు
ప్రయాణము
ప్రవాహము
ప్రాతఃకాలము
ప్రాఁతది
ప్రాప్తి
ప్రియము
ప్రేమ
బంగారము
బండి
బండికన్ను
బంధువులు
బకము
బలదేవుఁడు
బలము
బల్లి
బాణపుములికి
బాలుఁడు
బుద్ధి
బుద్ధుఁడు - బుధుఁడు
బురద
బృహస్పతి
బొట్టు
బోయవాఁడు
బ్రహ్మచారి
బ్రహ్మదేవుఁడు
బ్రాహ్మణుఁడు
భగవంతుఁడు
భయానకరసము
భర్త
భస్మము
భార్య
భీతి
భుజించుట
భూమి
భోగస్త్రీ
భోజనపాత్ర
భోజనము
మంగలి
మంచు
మంత్రి
మజ్జిగ

మత్తుఁడు
మత్స్యము
మనుష్యుఁడు
మన్మథుఁడు
మరణము
మఱుఁగు
మఱ్ఱిచెట్టు
మహిమము
మాంసము
మాట
మామిడి
మారేడుచెట్టు
మార్గము
మార్గస్థుఁడు
మాలవాఁడు
మిడత
మిరియము
ముందు
ముక్కు
ముఖము
ముత్యము
మునగచెట్టు
ముఱికి
ముసలివాఁడు
మూఁడు
మూఢుఁడు
మెడ
మెత్తనిది
మెఱుపు
మేక
మేఘము
మేడ
మేర
మేరుపర్వతము
మేషము

మొద్ద
మొలక
మొసలి
మోక్షము
యజ్ఞము
యమునానది
యముఁడు
యవ్వనము
యుద్ధము
యోధుఁడు
రంధ్రము
రక్షింపఁబడినది
రజతము
రథము
రమించుట
రాక్షసుఁడు
రాగి
రాజాంతఃపురము
రాజు
రాత్రి
రావిచెట్టు
రాహువు
రెండు
రెట్టింపు
ఱంపటాలు
ఱాయి
ఱెక్క
లక్క
లక్ష్మీదేవి
లవంగపుచెట్టు
లేడి
వంకరయైనది
వంటవాఁడు
వంశము
వధించు

వజ్రాయుధము
వరుణపాశము
వరుణుఁడు
వర్తకుఁడు
వల
వస్త్రము
వానకోయిల
వాయుదేవుఁడు
విగ్రహము
విఘ్నేశ్వరుఁడు
విటుఁడు
విడువఁబడినది
విద్వాంసుఁడు
విపత్తు
విల్లు
విశాలము
విష్ణువు
వీరుఁడు
వృత్తాంతము
వృషభము
వెండి
వెంద్రుకలు
వెదకఁబడినది
వెదురు
వెనుక
వెట్టివాఁడు
వేగము
వేఁడి
వేఁపచెట్టు
వేగులవాఁడు
వేదము
వైద్యుఁడు
వైశ్యుఁడు
శంఖము
శత్రువు

శని
శపథము
శయ్య
శరభము
శరము
శరీరము
శర్కర
శిల
శిశువు
శుక్రుఁడు
శుభము
శుభ్రము
శూద్రుఁడు
శూన్యము
శ్రమ
శ్లేషవాచకము
సంతుష్టుఁడు
సంతోషము
సంపద
సంశయము
సతతము
సత్యము
సభ
సమస్తము
సమానము
సమీపము
సముఖము
సముద్రము
సమూహము
సరస్వతి
సర్పము
సన్న్యాసి
సాటి
సారంగము
సారథి
సాలెపురుగు
సాలెవాఁడు
సింహము
సిగ్గు
సివంగి
సీత
సుదర్శనము
సుందరము
సూర్యుఁడు
సేన
సేవ
సేవకుఁడు
సొమ్ము
సోమరి
స్త్రీ
స్నేహము
స్వతంత్రుఁడు
స్వర్గము
హంస
హనుమంతుఁడు
హిమవత్పర్వతము
హృదయము



# నానార్థములు

అంకము—స. నాటకమున నొక భాగము, ఒడి, అంకె, యుద్ధము, చిహ్నము, సంఖ్య, భూషణము, ఒకదానియందు వేఱొకదాని నారోపించుట (రూపకము), చిత్రయుద్ధము, సమీపము, మంత్రము, భుజాంతరము, స్థానము, బుద్ధి, అపరాధము.

అంకిలి—దే. ఆపద, తాలుమూలమందలి కీలు, మర్మము, కీలకము, భంగము, నాశము, నిరోధము, విఘ్నము, వ్యాకులము, కలత.

అంకురము—స. మొలక, జలము, రక్తము, రోమము, మొగ్గ.

అంగజము—స. కామక్రోధాది, మదము, నెత్తురు, వెంట్రుక, రోగము.

అంగద—దే. ఆఁకలి, కుతూహలము, ఉత్సాహము, మనోవ్యథ, ఉపద్రవము. స. దక్షిణదిక్కునందలి ఆఁడేనుఁగు, (ఁడు) ఒక వానరుఁడు, (ము) బాహుపురి, కేయూరము, ఆపద, దుఃఖము.

అంగము—దే. విధము, అందము. స అవయవము, దేశనామము, భాగము, శరీరము, సహకారాది గ్రంథాదికము, (వేదాంగములవంటివి), అప్రధాన విషయము, ప్రత్యయపూర్వస్థ శబ్ద భాగ విశేషము, అఱు, ముఖాదిపంచ సంధుల అంతర్భాగము, లగ్నము, హృదయము, సమీపము, తాళప్రాణ భేదము, ఉపాయము.

అంగారవల్లి—స. చిఱుతేఁకు, కానుగు, బండిగురివెంద, గురిజ.

అంగుళము—స. బొటనవ్రేలు, వ్రేలు, అష్టయవప్రమాణము, అడుగులోఁ బండ్రెండవ భాగము.

అంట—దే. కుట్టుడాకు, అనుట, అడ, శరీరము, చెట్టునకు పైనుండుతోలు, గుంపు.

అంటు—దే. తాఁకు, ముట్టు, మైల, బాంధవ్యము, స్నేహము, తగులుకొను, రతిసంగమము, ఆశ్రయించు, పట్టుకొను, కలియు, పొందు, చెందు' మర్దనచేయు, లభించు, నాటుకొను, కలుగు, వెంట్రుకలచిక్కు, పేనుగ్రుడ్డు, చెట్టుకొమ్మనువంచి భూమిలో పాతుటవల్లనైన మొక్క, ముట్టు (ఆర్తవము), మిత్రుఁడు.

అండజము—స. చేఁప, పక్షి, పాము, తొండ, బల్లి, ఊసరవెల్లి, గ్రుడ్డువల్ల పుట్టినది.

అండము—స. గ్రుడ్డు, వృషణము, రేతస్సు, కస్తూరిజనించు తిత్తి.

అంతము—స. అలవాటు, నిశ్చయము, చావు, నాశము, సమీపము, అతి మనోహరమైనది, ఆకారము,

ముందుభాగము, మధ్య ప్రదేశము, పారము, హృదయము, కడపటిది.

అంతరము—స. ఎడము, ఇతరము, తారతమ్యము, మధ్యప్రదేశము, కప్పుకొను వస్త్రము, స్వకీయము, కనబడకుండుట, విశేషము, మర్యాద, అవసరము, దానికొఱకు, వేఱొకటి, సమానము, మనస్సు, దశ, భేదము, పరమాత్మ, రంధ్రము, సమయము, వెలుపల.

అంతశయ్య—స. స్మశానము, మరణము, భూశయ్య, చితి, పాడె.

అంతస్తు—త. మిద్దె, తారతమ్యము, ఒకటిపై నొకటిగానున్న కట్టడము, కక్ష్య.

అంతస్థములు—స. య, ర, ల, వ,లు.

అంతేవాసి—స. శిష్యుఁడు, సమీపముననున్నవాఁడు, మాలవాఁడు, పొలిమేరకడ నుండువాఁడు.

అందు—దే. పొందు, తాకు, పడయు, అక్కడ, ఒక ప్రత్యయము.

అందుకము—స.అందె,సుకెల,ఏనుఁగు, సంకెల.

అందువు—స. సంకెల,ఏనుఁగు సంకెల, అందె, అందుగుచెట్టు.

అంధము—స. చీఁకటి, గ్రుడ్డిది, అంధునిజేయునది, నీరు, నష్ట ద్రవ్య లాభాదికము తెలుపురాశి.

అంబరము—ఆకాశము, వస్త్రము, పాపము, అనుస్వారము, వ్యసనము, దూది, అభ్రకము, గంధద్రవ్యము.

అంబరీషుఁడు—స. బాలుఁడు,శివుఁడు, విష్ణువు, సూర్యుఁడు, ఒకరాజు, (ము) తృణము, వర్షము, యుద్ధము, మంగలము, ఇప్పచెట్టు.

అంబిక—స. తల్లి, కాశీరాజు కుమార్తె, పార్వతి, మేనమామభార్య, మేనత్త, కటుకరోహిణిచెట్టు.

అంశుమంతుఁడు—స. ధనవంతుఁడు, ఒకరాజు(దిలీపుని తండ్రి), సూర్యుఁడు.

అంసము—స. మూపు, పాలు, పంపకము.

అకరణి—స. ఆశాభంగము, చేయనిది, స్వాభావికము, పాపము, తిట్టు, తప్పిపోవుట.

అక్కజము— త. ఆశ్చర్యము, అశక్యము, అధికము.

అక్కర (ఱ)— దే. ప్రయోజనము, లోపము, ప్రేమ, కష్టము, కోరిక, అనురాగము, చెలిమి, శ్రద్ధ, కార్యము, అవసరము.

అక్షము—స. తాండ్ర, బండి, రుద్రాక్షపూస, పదునాఱు మొదలైన మాషములయెత్తు, ధనాదినిమిత్తమైన కలహము, ఎలుఁగుబంటి, కత్తులసాన, నారికేళపు మొవ్వ, బండి యిరుసు, సొగటాల పాచిక, జూదము, బండి కల్లు, బ్రహ్మజ్ఞత్వము, కణత క్రింది భాగము, ఊక, తులాదండము, సర్పము, వ్యాపించుట, ఆత్మ, కేశము, ఇంద్రియము, సౌవర్చలలవణము, మైలతుత్తము.

అక్షరము—స. పరబ్రహ్మము, అక్కరము, నాశములేనిది, గగనము, ఒక కాలమానము, నీరు, కత్తి, ఓంకారము,

మాఱని ముక్తి, ధర్మము ప్రకృతి, తపస్సు యజ్ఞము.

అక్షోభము— స కలత లేకపోవుట, ఏనుగును గట్టు స్తంభము.

అగదము—స. రోగములేనిది, పలుక నిది ఆయుర్వేదమున విషాదులకు విరుగుడు చెలుపు భాగము మందు ఆరోగ్యము

అగము—స. కదలలేనిది, సప్తసంఖ్య వసనాభి చెట్టు పర్వతము, పాము

అగస్తి— స. అగిసెచెట్టు అగస్త్య వంశస్త్రీ ఒక నక్షత్రము అగస్త్యుఁడు.

అగ్రము— స. చివర ఆధారము గుంపు ఊర్ధ్వము, ఫల పరిమాణము అధికఫలము, ఆలంబనము, సమీపము మొదటిది, ముఖ్యము, ఎదురు

అఘాయువు— స పాము, కాకి, చామరము, కత్తి, పాపస్వభావము, పాపస్వభావము కలవాఁడు ఎల్లప్పుడును పాపము చేయువాఁడు

అచలము—స పర్వతము, మేకు, చలింపనిది, వస్త్రపు చెఱగు, లోకము, చిదాకాశము.

అచ్చు— త. ముద్ర, శుద్ధము, సాలెవాని పనిముట్టు ఆదర్శము, కరువు, గుర్తు, పద్ధతి, స్పష్టము, నిజము, పాచిక, తగినది, ఇరుసుప్రమాను, పూచీపడు, ప్రతిబింబము.

అజితుఁడు—స బ్రహ్మ, విష్ణువు శివుఁడు, జయింపఁబడనివాఁడు, బుద్ధుఁడు.

అజిరము—స. అంగణము, కప్ప, గాలి దేహము శబ్దాదివిషయము నద్రమను సూర్యధాటి తెల్లవట్టివేరు తెప్ప.

అజుఁడు—స. బ్రహ్మ విష్ణువు శివుఁడు, మన్మథుఁడు చంద్రుఁడు జీవుఁడు, భగవంతుఁడు ఒక ఋషి, సూర్య వంశపు రాజు

అజ్జ—దే పాదము, నేస్ప, అడుగు జాడ, పాదప్రమాణముగల నేల, తగినది, సమయము, బలి.

అటమట—దే దుఃఖము, మోసము, అసత్యము, వ్యర్థము

అట్టము—స వంటకము, వంటచెఱకు మేడవెనకటియిల్లు, వధ, హింస శుష్కమైనది పట్టువస్త్రము, మేడ, వేషము అతిశయము, వెల్లువ, త. వేద కాండము.

అట్టెడ—దే. తట్ట జల్లెడవంటి తడిక, వంతెన, గోనెసంచి, పాలికట్ట కోట లోని భాగము.

అణువు—స చిరువడ్లు అల్పము రేణువు

అతర్కణము—త. నేరము, దుర్మార్గము, శూన్యాంశము, మట్టుమీరిన కార్యము.

అతిగంధము—స. ఎక్కువ పరిమళము గలది, గంధకము

అత్యయము—స. అతిక్రమము, చేటు, జోహారు, అపరాధము, మనఃపీడ,

పాపము, కష్టము, శిక్ష, దుఃఖము లేకపోవుట, . ముగింపు, మరణము, దోషము.

అద్రి— స. పర్వతము, వృక్షము, సూర్యుఁడు, సప్తసంజ్ఞ.

అధిష్ఠానము— స. బండికన్ను, అధికారము, రాజ్యము, పట్టణము, ధాన్యాగారము, ఆరోపణము, వ్యవస్థాకరణము, విచక్షణను, వర్తకము, ఆక్రమించుట, ప్రభావము.

అధ్వము— స. త్రోవ, చతుష్పథము, కాలము, దూరము, ప్రయాణము, ఆకసము, ఉపాయము, సాధనము, వేదశాఖ, మకామము, నిద్రయందు శత్రువులు పైఁబడుట.

అనంగము— స. ఆకాశము, హృదయము.

అనంత— స. భూమి, పార్వతి, ఒకటి, ఆకాశము, అంతులేని సంఖ్య, వాయవ్య దిక్కు, దూలగొండిమొక్క, అంతులేనిది, నిత్యము, విష్ణుశంఖము, మేఘము, అభ్రకము, శ్రవణానక్షత్రము, ముక్తి, పరబ్రహ్మము, తిప్పతీఁగ, గఱిక, ఉసిరికచెట్టు.

అనంతుఁడు— స. శేషుఁడు, విష్ణువు, తుదలేనివాఁడు, వాసుకి, మేఘుఁడు.

అనయము— స. అశుభము, నీతిలేనిది, దురదృష్టవంతము, పాచికలతో ఆడు ఆట, ఆపద, దురదృష్టము, ద్యూతాది వ్యసనము, అపరాధము, దే. ఎల్లప్పుడు, మిక్కిలి, పలుమారు, కేవలము, తప్పక.

అని— దే. యుద్ధము, సేన, అన్ని, ప్రకారము తెలుపునవి, అల్లికమొదలు, తలఁచుటను, కారణమును, ప్రసిద్ధి, పలికి.

అనీకము— స. యుద్ధము, సేన, గుంపు.

అనుఁగు— దే. ముఖ్యుఁడు, స్నేహితుఁడు, ప్రియురాలు, సహాయుఁడు, ప్రేమ, ప్రీతి, మొదటిది, ఇంపు.

అనుగలము— త. అనుకూలము, సహనము, సహాయము.

అనువు— దే. ఉపాయము, నేర్పు, సామర్థ్యము, వశము, అవకాశము, అనుకూలము, యుక్తము, విధము.

అనూకము— స. కులము, కార్ముకము, సాధనము, సమ్మతి, వంశము, వెన్నముక, పూర్వజన్మము, స్వభావము.

అన్నువ— దే. అల్పము, భార్య, చిన్నది, దుర్బలుఁడు, ఆఁడుది.

అన్నెము— త. ఇతరము, పాపము, అన్యాయము.

అపక్రమము— స. క్రమభంగము, పరుగెత్తుట, తప్పటడుగు వేయుట, యుద్ధమునుండి పాఱుట.

అపదేశము— స. కపటము, ఖ్యాతి, పదము, గుఱి, మిష, నీచస్థానము, వచించుట, కారణము, నెపము, నిమిత్తము.

అపభ్రంశము— స. అపశబ్దము, భాషావిశేషము, జాఱుట.

అపరము—స. ఇతరము, గజపృష్ఠభాగము, అల్పార్థము, చివరిది, సమీపమందుండునది, క్రిందిది, మీఁదిది.

అపరాజిత—స. పార్వతి, ఒక మంత్రవిద్య, ఈశాన్యము, ఒకయోగిని, విష్ణుక్రాంతము, తక్కోల, బ్రాహ్మి, నల్ల నేలగుమ్మడు.

అపరాజితుఁడు—స. జయింపఁబడనివాఁడు, శివుఁడు, విష్ణువు, ఏకాదశరుద్రులలో నొకఁడు.

అపరాధము—స. దండుగ, దండన, నేరము, నెరసు.

అపవర్గము—స. మోక్షము, ముగింపు, దానము, నెఱవేఱుట, విడుచుట, కార్యము.

అప్పళించు—త. చఱచు, గ్రహించు, కప్పు, పట్టుకొను, క్రమ్ము, రాచు, తమకించు, అద్దు, మెత్తు, తుడుచు, తాఁకు.

అబ్జము—స. తామర, కర్పూరము, నీటఁబుట్టినది, నూఱుకోట్లు, ఉప్పు, శంఖము, ఎఱ్ఱగన్నేరు, కల్పవృక్షము, నీరు ప్రబ్బలి, ముస్త.

అబ్దము—స. వత్సరము, అద్దము, కొండ, తుంగ, మేఘము, ఘటము, దుగ్గము.

అభిఖ్య—స. పేరు, కీర్తి, శోభ, చెప్పుట, తుల్యలక్షణ.

అభిజనము—స. ఆకరము, కులము, బిరుదము, స్తోత్రము, కీర్తి, జన్మదేశము, వంశపారంపర్యముగ వచ్చుచిహ్నము, పరిజనులు, గోత్రము.

అభినివేశము—స. చొరవ, గ్రహణము, పట్టుదల, బలవంతము, అభిప్రాయము, తాత్పర్యము, శ్రద్ధ, ప్రేమ, అభిలాష.

అభిమానము—స. గర్వము, ప్రేమము, జ్ఞానము, పగతీర్చుకొనుట, మానము, సంరక్షణ, హింస, ప్రార్థన.

అభియోగము—స. ఎదుర్కొనిపోయి ఆక్రమించుట, దాడి, పూనిక, శాపము, శపథము, అమృతస్రావము, పాండిత్యము, ఆసక్తి, అడ్డగించుట, అవమానము, సుధాద్రవము, అపకీర్తి, అపవాదము, వ్యాజ్యము.

అభీకుఁడు—స. శివుఁడు, కవి, ఉత్సాహము కలవాఁడు, ప్రియుఁడు, రాజు, నాథుఁడు. నిర్భయుఁడు, కాముకుఁడు, దుష్టుఁడు, విటుఁడు.

అభీషువు—స. కిరణము, పగ్గము.

అభ్రము—స. ఆకాశము, స్వర్గము, సున్న, కర్పూరము, రెల్లుగడ్డి, ఒక ధాతువు, ధూమజాత నిర్జలమేఘము, కాంతియుతము, బంగారము, మబ్బు, అభ్రకము.

అమృతము—స. సుధ, నేయి, పాలు, మజ్జిగ, మధురము, మోక్షము, ఉదకము, మృతిలేనిది, స్వర్గము, సోమరసము, యజ్ఞశేషద్రవ్యము, చావులేకుండఁజేయునది, స్వాదుపదార్థము, విషహారి, ఒకయోగము, అయాచిత

లభ్యవస్తువు, సూర్యుని ఒక కిరణము, యతి సంప్రదాయ జ్ఞానార్థచిహ్నము, ఆహారము, బంగారు, పాదరసము, విషము, ప్రకాశము, వసనాభి, పరబ్రహ్మము.

అమ్మవారు—దే. స్త్రీదేవత, పూజ్యురాలైన స్త్రీ, స్ఫోటకము, స్ఫోటకరోగాధిష్ఠానదేవత.

అయనము—స. మార్గము, మోక్షము, అర్ధవత్సరము, గతి, సైన్యవ్యూహప్రవేశద్వారము, స్థానము, సూర్యుని దక్షిణోత్తర దిశలపోక.

అయ్య—త. తండ్రి, పూజ్యుఁడు, వాత్సల్యార్థకము, ప్రశ్నార్థకము.

అయ్యవారు—దే. పూజ్యుఁడు, ఉపాధ్యాయుఁడు.

అరిందముఁడు—స. శత్రుఘాతుకుఁడు, సూర్యుఁడు, గరుత్మంతుఁడు, యుద్ధమున భీతిలేనివాఁడు.

అరిష్టము—స. కీడు, పురిటిల్లు, మజ్జిగ, దేశోపద్రవము, కాకి, వెల్లుల్లి, కల్లు, కుంకుడు చెట్టు, రాపులుఁగు, వేపచెట్టు, అశుభము, మరణ చిహ్నము, రాగి, హింసింపఁబడనిది, ఉపద్రవరహితమైనది, శుభము.

అరుణము—స. ఎఱుపు, కాంతి, రాగి, కపిలవర్ణము, సంధ్యారాగము, కుష్ఠరోగము, ధ్వనిరహితమైనది, బంగారు, కుంకుమము, సిందూరము, కుమ్కుమద్రవ్యము, క్షత్రియవర్ణము, సాయంకాలపు మబ్బు.

అరుణుఁడు—స. సూర్యుఁడు, సూర్యసారథి, అనూరుఁడు.

అరోచకము—స. రుచింపకుండుట, ప్రకాశింపనిది, అసహ్యము, ఒకరోగము, ఆఁకలి లేమి.

అర్కము—స. స్ఫటికము, తెలుపు, జిల్లేడు, రాగి.

అర్కుఁడు—స. సూర్యుఁడు, ఇంద్రుఁడు, అన్న.

అర్జునము—స. బంగారు, నెమిలి, తెలుపు, వెండి, కంటివ్యాధి, ఒక చర్మవ్యాధి, తెల్లనిది, ఏఱుమద్ది, కసవు.

అర్థము—స. శబ్దార్థము, శబ్దాది విషయము, కారణము, ధనము, అప్రవృత్తి, న్యాయము, కార్యము, పదార్థము, అక్కఱ, యాచన, విధము, వ్యవహారము, రాజ్యపరిపాలనా తంత్రము, తిరోగమించుట, ఒక పురుషార్థము, మృత్పాషాణాది వస్తువు.

అర్థి—స. కోరిక, వాది, యాచకుఁడు, ఇష్టము, స్నేహము, ఆసక్తి, భక్తి, పోట్లాడువాఁడు, యక్షసేవకుఁడు, అనుసరించి బ్రతుకువాఁడు, సేవకుఁడు, ధనవంతుఁడు.

అర్యముఁడు—స. సూర్యుఁడు, పితృదేవతలలో నొకఁడు, ద్వాదశాదిత్యులలో నొకఁడు.

అర్యుఁడు—స. కోమటి, ప్రభువు, అంతఃపురపు కావలివాఁడు, పూజ్యుఁడు.

అటు—త. సగము, భేదము, కొలత, మోసము, కీడు, చింపి దే. సంశయము, చినుగు గది.

అట్టు—దే. కంఠము, పశువుల మెడ వంపు, ముందుభాగము, ఉపకంఠము, సమీపము.

అలక—స కుబేరుని పట్టణము, కేశము ముంగురు

అలము —దే శీఘ్రము చుట్టుకొను, కౌఁగిలించు, ఒత్తు పూయు, ఆక్రమణము, శాకవిశేషము, కలుపుగడ్డి, స తేలుకొండి, అరిదళము.

అలుక—దే కోపము, ద్రోహచింత, సన్నము, తేలిక.

అవగీతము—స. ప్రసిద్ధమైన నింద, కార్యము, వికృతముగాఁ బాడుట వికృతముగాఁ బాడఁబడినది, దూరఁ ఒడినది, చెప్పఁబడినది, పలుమారు చూడఁబడినది, వాదములేనిది, గొప్ప రాజ్యము.

అవఘుళము—దే. వ్యాపనము, అకృత్యము, అసాధ్యము, శక్తి, సామర్థ్యము, హెచ్చు.

అవటము—స. రంధ్రము, గొయ్యి, కంఠకక్ష్యాది నిమ్న ప్రదేశము, వంచన, దున్నినభూమి, నూయి, పక్షిపిల్ల.

అవతారము—స. జన్మము, నీళ్ళరేవు, కోనేలు, దాఁటుట, ప్రవేశము, శరీరము, వసంతము, దిగుట.

అవదాతము—స. మనోజ్ఞము, తెల్లనిది, పచ్చనిది తెల్లన, పచ్చన, స్వచ్ఛము శ్రేష్ఠము ఖండింపఁబడినది

అవష్టంభము—స ఆశ్రయము, గర్వము, ప్రయత్నము, ప్రారంభము, అడ్డు పూఁత, సమీపము, కుండ, బంగారము నిశ్చేష్టత్వము.

అవసరము—స సమయము అవకాశము, కురియుట, తర్కసంగతి, ప్రస్తావము మంత్రభేదము, రహస్యాలోచనము, ఆవశ్యకము, నైవేద్యము, అగత్యము విశ్రాంతి.

అవస్కరము—స. రథాంగము, మలము, గూఢము, గుదము పాదుక, గుర్మస్థానము.

అవిధి—స. సంకటము, అక్రమము, ధర్మశాస్త్ర విరుద్ధము, కష్టము.

అవ్యక్తుఁడు—స. విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు, మూర్ఖుఁడు పరమాత్మ.

అవ్యథ—స. కరకచెట్టు, మెట్టతామర, సొంటి, దుఃఖములేమి, సర్పము.

అవ్యయము—స. శుభము, శాశ్వతము, మారనిది, పరబ్రహ్మము సమస్తము, ఒకలెక్క, వ్యయము లేనిది, ఒక శబ్దసంజ్ఞ

అవ్వ—త తల్లి, తల్లితల్లి, తండ్రితల్లి, పూజ్యురాలు, వృద్ధస్త్రీ.

అశ్మంతము—స ప్రొయ్యి, క్షేత్రము, అశుభము, మరణము హద్దులేనిది.

అసలు—దే. బురద, మూలధనము, అధికము.

**అసిపత్రము**—స. కత్తియొఱ, చెఱకు, ఒక నరకము.

**అసుర**—స. వేశ్య, రాక్షసుఁడు, ఒక రాశి, రాత్రి.

**అసురము**—స. ఏనుఁగు, మాలకాకి.

**అస్త్రము**—స. బాణము, ఆయుధము, యజ్ఞప్రయోజ్యమైన ఒక మంత్రము, కత్తి, విల్లు.

**అస్రము**—స. కన్నీరు, నెత్తురు, బాధ, కోణము, కేశము.

**అహి**—స. పాము, సీసము, శత్రువు, వజ్రాయుధము, భూమి, ఆశ్లేష, వృత్రాసురుఁడు, సూర్యుఁడు.

**అహిద్విషము**—స. నెమిలి, గరుడపక్షి, ముంగిస.

**అహిభుక్కు**—స. నెమిలి, ముంగిస, గరుడుఁడు.

**అళి**—స. తుమ్మెద, తేలు, వృశ్చికరాశి, కోయిల, కాకి, కలు, నిర్మలాంతఃకరణుఁడు, ఆనకట్ట, నొసటి యెముక, పంక్తి, చెలికత్తె, సమూహము.

**అలీకము**—స. అప్రియము, బొంకు, నుదురు, ఆకసము, బాణము, శుకమైథునము, నొసలు, పరిహాసము.

**ఆగ్రహము**—స. కోపము, పట్టుదల, ఆక్రమించుట, నిగ్రహము, ఆసక్తి, తీసికొనుట, నిర్బంధము, అనుగ్రహము, అపేక్ష, ఆక్రమము, గ్రహణము.

**ఆజి**—స. యుద్ధము, క్షణకాలము, చదునగునేల, అనిరుద్ధుఁడు.

**ఆడంబరము**—స. గజఘీంకారము, డంబము, తూర్యారావము, సంతోషము, ప్రారంభము, తొందరపాటు, ఉఱుము, పక్ష్మకేశము, డింభము.

**ఆత్మ**—స. మనస్సు, పరమాత్మ, బుద్ధి, దేహము, జీవుఁడు, ధైర్యము, స్వభావము, ప్రయత్నము, గాలి, నేత్రాది దశేంద్రియములు, తనకు సంబంధించినది.

**ఆత్మభువు**—స. బ్రహ్మ, మన్మథుఁడు, శివుఁడు, విష్ణువు, బుద్ధి, కుమారుఁడు, కూఁతురు.

**ఆభాసము**—స. లేనిదున్నట్లుతోఁచుట, ప్రతిబింబము, వాస్తవరహితముగా ఒకటి మఱియొకదానివలె కనఁబడుట, పోలిక, ప్రకాశము.

**ఆమోదము**—స. సంతోషము, సమ్మతి, పరిమళము.

**ఆయతనము**—స. గృహము, సానము, యజ్ఞమొనర్చుచోటు, దేవాలయము, బౌద్ధాలయము, దేవతరువు.

**ఆయతి**—స. నిడుపు, సంగమము, శక్తి, పని, నిగ్రహము, ఋషి, దినము, లోఁబడినవాఁడు, మర్యాద, ఆదాయము, ప్రభావము, రాఁగలకాలము.

**ఆరభటి**—స. నేర్పు, ఒక కావ్యవృత్తి, ప్రోఁత.

**ఆరాధనము**—స. పూజ, వంట, మాట, ప్రాప్తి, సంసిద్ధి, సంతోషించుట.

ఆర్తి—స. పీడ, బాధ, మనోవ్యధ, రోగము, ఆపద, కీడు, వింటికొన.

ఆఱు—దే. ఒక సంఖ్య, నశించు, తగ్గు, ఎండు.

ఆరోహణము—స. ఎక్కుట, నిచ్చెన, మెట్టు, నాట్యరంగము, ఎత్తుట, మొలకెత్తుట.

ఆరోహము—స. ఎక్కుట; స్త్రీల పిఱుఁదు, మొలకెత్తుట, ఊడ, ఒక పరిమాణము, ఎత్తు, నిడుపు.

ఆలి—స. శ్రేణి, చెలికత్తె, తుమ్మెద, గుంపు, ఆనకట్ట, శుద్ధాంత రంగము గలది, వృశ్చికరాశి, కాకి, కోయిల, కల్లు, నొసటిరేఖ, తేలు (దే.) హీనము, గేలి, పెండ్లాము.

ఆవరణము—స. ఆచ్ఛాదనము, ఇంటి చుట్టునుండు ప్రదేశము, రక్షించు కొనుటకు సాధనము, అడ్డు, డాలు, మూఁత.

ఆవర్తము—స. గుఱ్ఱపుసుడి, నీటిసుడి, శరీరమందలి సుడి, గాలి సుడి, పాదము యొక్క వల్లె, ఒక మణి, ఆలోచనము, సందేహము, మాక్షిక ధాతువు, గుండ్రముగా తిరుగుట, లోహాదులను కరగించుట, ఆవర్తకమను మేఘము.

ఆవాపము—స. విత్తుట, చెట్లపాదు, నిమ్నోన్నతభూమి, గాజు, మురుగు, ముఖ్య హోమము, గోనె, గంప, గరిసె, బాధపెట్టుట, పరరాష్ట్రచింత, ఓడహాలి, వ్యధ, మంగలిపని.

ఆవాహనము—స. ఆహ్వానము, మంత్రములతోఁ బిలుచుట, దైవశక్తిని విగ్రహాదులయందుఁ బ్రవేశింపఁ జేయుట.

ఆవి—స. ముట్టుది, గర్భిణి, కనిపించినది, ప్రసవవేదన, దే. ఆవిరి, తాపము, పంటలకు పట్టు ఒక చీడ, శ్వాస.

ఆశ—స. ఉక్కు, కోరిక.

ఆశయము—స. అభిప్రాయము, మనస్సు, పడకయిల్లు, జంతువులను బట్టుటకు త్రవ్వు గొయ్యి, చెలువు, నిధి, ఆధారము, విశ్రాంతి.

ఆశీస్సు—స. ఆశీర్వాదము, పాము కోఱ, స్తోత్రముచేయుట, ఇచ్ఛ, మంచిపని, హితముకోరుట.

ఆశుగము—స. గాలి, బాణము.

ఆశ్రమము—స. బ్రహ్మచర్యము మొ॥ యతి సంప్రదాయ భేదజ్ఞా వార్థ చిహ్నము, నానిపల్లె, పర్ణశాల, మఠము, అడవి, గుడిసె, పాఠశాల.

ఆశ్రయము—స. ప్రాపు, ఇల్లు, ఆధారము, సహాయము, సమీపము, సంబంధము.

ఆశ్రవము—స. అంగీకారము, ప్రతిజ్ఞ, వాగ్దానము, ఒడంబడిక, తప్పు, క్లేశము.

ఆషాఢము—స. ఒకమాసము, మలయపర్వతము, బ్రహ్మచారి ధరించెడు మోదుగకోల.

ఆసనము—స. పీఁట ఏనుఁగుమూఁపు, చాఁప, యోగాసన విశేషము, దేశకాల పరిస్థితుల ననుసరించి దండెత్తకుండుట, ఏదియు నక్కఱగలేకపోవుట, వేగిసచెట్టు, స్వస్తికాద్యాసనము.

ఆస్కందము—స. యుద్ధము, తిరస్కారము, ఇంకుట ఎక్కుట హింసించుట, అశ్వగతి విశేషము, మీఁదఁబడుట, అదుముట, అనాదరము, ముట్టడి

ఆస్తరణము—స. ఆసనము, ఎఱ్ఱకంబళి, ఏనుఁగుపై పఱచు కంబళి, పఱుపు పఱచినది.

ఆస్థ—స. ఉనికి, ప్రయత్నము, ఆదరము, ప్రతిజ్ఞ, ఊత, అనుభవించుట, తాత్పర్యము, పూర్వ మనుభవించిన దానిని మరల కోరుట, కోరిక, లక్ష్యము, ఆస్థానము.

ఆస్పదము—స. ఉనికి, చోటు, లగ్నదశమ స్థానము, ఉచ్చస్థితి, కార్యము, వంశము.

ఆస్రవము—స క్లేశము, తప్పు, ప్రవహించుట, లాలాజలము, క్షతము, అన్నము ఉడుకునప్పటి నురుగు.

ఆళి—స. పంక్తి, చెలికత్తె, తేలు, నిర్మలమైన మనస్సుగలది (చూ. ఆలి.)

ఇంద్రుఁడు-స. దేవేంద్రుఁడు, శ్రేష్ఠుఁడు, ఇంద్రుఁ డనఁబడు నాదిత్యుఁడు, ప్రభువు, శేషుఁడు, ఈశ్వరుఁడు,

ఇడ—స. ఒకనాడి, బుధుని పెండ్లాము, నేల, వాక్కు, దుర్గ, స్వర్గము హవిరన్నము, ప్రేగు పురోడాశపాత్రము ఆవు

ఇనుఁడు—స. సూర్యుఁడు, ప్రభువు, సంపన్నుఁడు, పోషకుఁడు, భర్త.

ఇబ్బంది—దే. కష్టము, మిక్కిలి నిర్బంధము మూర్ఖుఁడు, పెద్దపులికిని చిఱుతపులికిని పుట్టినపులి అని కొందరు, అడవిపందికిని ఊరపందికినిబుట్టిన పంది అని కొందరు.

ఇమ్ము—దే. ఇంపు, స్థానము, ఉపాయము, అనుకూల్యము, సుఖము, యుక్తము, విశాలము, నష్టము, అవకాశము, ఆశ్రయము, గృహము.

ఇర—స. సరస్వతి, ఉదకము, భూమి, కల్లు, నేతిధార, సేనాముఖము మాట.

ఇష్టము—స. యజ్ఞము, యథేచ్ఛము, వాంఛితము, ఈఁబడినది, ఇటుక, యజింపఁబడినది ఉపనయనాది సంస్కారము అతిథ్యాది విహితకృత్యము, ప్రియమైనది, పూజింపఁబడినది.

ఇళ—స. ఆవు, మాట, భూమి, బుధుని భార్య (చూ. ఇడ)

ఈఁగు—దే ఓడు, చనిపోవు, అలయు, చొచ్చు తీర్చు దాఁగు, తొలగించు.

ఈఁదు—దే ఈఁదుట, దాఁటు, ఈఁతచెట్టు, తడి, చలఁదనము, వాయువు.

ఈడేఱు—దే. వృద్ధిపొందు, సిద్ధించు ప్రథమ రజస్వలయగు.

ఈశ్వరుఁడు—స. ప్రభువు, శివుఁడు పరమాత్మ, ధనవంతుఁడు, మన్మథుఁడు భర్త, శక్తుఁడు, శ్లేషవాచకము.

ఉక్కు—దే. శౌర్యము, ఒకలోహము, గట్టితనము, గాలిలేక కలిగెడితాపము, పొగరు, వేగము, క్రూరము, నశించు.

ఉగ్గడించు—త. చెప్పు, మ్రోఁగు, పలుకనారంభించు.

ఉచ్చము—స. పొడవు, ఎత్తు, గ్రహగతియొక్క పైభాగము.

ఉత్కర్షము—స. అతిశయము, పైకిలాగుట, శ్రేష్ఠత్వము, అభివృద్ధి, డంబము, సంతోషము.

ఉత్క్రోశము—స. నలుపు, ఎఱుపైన ముక్కు కాళ్ళు గల హంస, కాకి, లకుముకిపిట్ట, గోరువంక, దీర్ఘకోపము, అధిక రోదనము, చాటుట, ఆర్తకంఠధ్వని.

ఉత్తరము—స. జాబు, ఒక దిక్కు, మీఁదిది, దాపటిది, దాఁటు, ఒక అలంకారము, అగ్ని, సమాధానము, శ్రేష్ఠము.

ఉత్థానము—స. లేచుట, నాటకాంగభేదము, బంధనము, పొయ్యి, కోరిక, యుద్ధము, పదార్థము, మలోత్సర్జనము, ముగింపు, ముంగిలి, పుస్తకము, బయలుదేరు, ఇల్లు, సైన్యము, సంతోషము, ప్రయత్నము, ఉన్నతి.

ఉత్పలము—స. కలువ, నల్లకలువ, చెంగలువకోష్టు, నల్లసుగంధిపాలచెట్టు, పిడక, కాకిమూఁత, పాతాళము, కాల్చుటకై మాంసమునకు గ్రుచ్చిన యినుపకడ్డీ, మాంసములేనిది.

ఉత్సర్గము—స. త్యాగము, విచ్చలవిడిగాఁ దిరుగవిడుచుట, గుదము, వృద్ధిపొందుట, హింస, కీడు, న్యాయము, కోరిక, పొడవు, దాన పంచకములో నొకటి.

ఉత్సాహము—స. సంతోషము, ప్రయత్నము, బలము, కోరిక, పట్టుదల, ప్రభుశక్తి, ధైర్యము, దారము, వీరరస స్థాయీభావము, ఒక వృత్తము, సౌఖ్యము.

ఉదకము—స. నీరు, కలువ, మొల్ల, యోనిమూల ప్రదేశము, పంచామృతములలో నొకటి.

ఉదాత్తము—స. వేదోచ్చారణలో నూర్ధ్వస్వరము, ఒక అలంకారము, అధికము, పెనుమద్దెల, ఎత్తైనది, ఈవి, గౌరవము కలది, ధారాళము.

ఉదుంబరము—స. రాగి, గడప, మేడిచెట్టు, పూలగురివెందచెట్టు, వానప్రస్థాశ్రమభేదము, కర్షమను మానవిశేషము, కుష్ఠము.

ఉద్ఘాటనము—స. భేదనము, ఏతము, ఎత్తుట, తెఱచుట, చెప్పుట, తాళముచెవి.

ఉద్వర్తనము—స. నలుఁగుఁ బిండి, అతిక్రమించిన నడతకలది, దొరలుట, నలఁగుపెట్టుట, వృద్ధి, విలేపనము, ఒరపిడి, ఎగయుట.

ఉద్వాహనము— స. పెండ్లియాడుట, భరించుట, పైకెఁ బట్టుకొనుట:

ఉపకారిక—స. ఉపకారము చేసెడు స్త్రీ నీరుపోసి పిసికినపిండి, ఉక్కుఱ రాజగృహమందునుపకరించునది డేరా, రాజుల విడిదియిల్లు.

ఉపక్రమము—స ప్రారంభము, గురుముఖమున అనుపూర్విగా వేదముఁజదువుట, రోగప్రతిక్రియ చతురుపాయములు, అమ్ముట, భూమిక,విక్రమము, ఎత్తుగడ, మంత్రులను బరీక్షించుట

ఉపచారము—స. సేవ, పూజించుట, మర్యాదగా మాటాడుట వసంత ఋతువు, ఉపకారము, ప్రార్థన, వ్యవహారము, సమీపించుట, అన్యజన సంతోషార్థమైన అసత్యము నమస్కారము, చిఁత్స, పుష్పముల నిచ్చుట, లంచము, ఒకవస్తువునందలి ధర్మమును మఱియొక వస్తువునం దారోపించుట.

ఉపధానము—స. తలగడ, స్నేహము, విశేషము, ప్రీతి, ఉంచుట, విషము.

ఉపపత్తి—స. కారణము, పుట్టుక, యుక్తి యోగ్యత ప్రతిపాదించుట, సంపూర్ణము సాహాయ్యము, వృత్తాంతము, సమాధి సంపద, దృష్టాంతము.

ఉపల—స రత్నము, రాయి, తిరుగటి పైరాయి, పాత్రము, మబ్బు ఇసుక, శర్కర.

ఉపసర్గము—స. ఉత్పాతము, ఎఱుపు చిగురు, గ్రహణము, దశ్శకునము, దయ్యముపట్టుట, పదమునకు ముందు వచ్చు ప్రత్యయము, హాని.

ఉపసము—స. సమీపమున నున్నది, మధ్యభాగము సాయంకాలము, మగ గుఱి, గుదము, స్థితి ఆఁడుగుఱి, ఆసనము, ఒడి, కటి.

ఉపస్పర్శము—స. తాఁకుట,స్నానము, ఆచమనము.

ఉపాధి— స. ధర్మచింత, కారణము, కపటము మిష జాడ, విశేషణము, కుటుంబపోషకము.

ఉపాధ్యాయుఁడు—స. చదువు చెప్పువాఁడు పురోహితుఁడు, వేదము చెప్పువాఁడు

ఉపాసన(ము)—స పూజ మర్యాద, పీఁట, శరాభ్యాసము, హింస, మననము, సేవ

ఉఱుము—దే గర్జనము, గర్జించు వీరహుంకారము, ఉడుము.

ఉమ—స. పార్వతి, కీర్తి, శాంతి, కాంతి పసుపు బ్రహ్మవిద్య, అగిసె.

ఉష్ణము—స. వేఁడిమి, వేసవికాలము, ఎండ, నిప్పు, ఒక నరకము, నీరుల్లి, నేర్పు గలది జ్వరము, కారము.

ఊతి—స. రక్షణము, కుట్టుట, ఆట, ఒక దేవత, ఒక ధ్వని, కుట్టుకూలి, నేయుట, అనుభవించుట, దయ, కోరిక.

ఊరు— దే. లోపలనుండి (ద్రవము) పైకివచ్చు జనించు వృద్ధినొందు, నాను, గ్రామము, పుట్టు.

ఊర్ణాయువు—స. పొట్టేలు, కంబళి, సాలెపురుగు.

ఊర్మి—స. తరంగము, వస్త్రపు ముడుత, ప్రవాహము, నొప్పి, వరుస, తహతహలాడు, వస్త్రపు కుచ్చెళ్ళ గుంపు, పీడ, వక్రము, ఒక సంఖ్య, ఉమ్మి, వలిత్రయము, కాంతి, వేగము.

ఊర్మిక—స. అల, ఉంగరము, బట్ట ముడుత, వేడుక, సంగీత ధ్వని విశేషము, చిటికెన వ్రేలు, భృంగ ఝుంకృతి, వస్తువుపోయినప్పటి చింత (మా. ఊర్మి).

ఊష్మము—స. ఆవిరి, వేసఁగి, గర్వము, కన్నీరు, ఎండ, ఉక్క, శ, ష, స, హ లలో నొకటి.

ఋక్షము— స. ఎలుఁగుగొడ్డు, ఒక చెట్టు, ఒక పర్వతము, మేషాది రాశి, నక్షత్రము, గ్రుచ్చఁబడినది.

ఋతము— స. సత్యము, ఉదకము, శిలోంఛవృత్తి, ప్రకాశింపజేయఁబడినది, రతికూజితము, సత్ప్రవర్తన, ప్రాప్తము, ముక్తి, ప్రాప్తి, పరబ్రహ్మము, జన్నము, పూజింపఁబడినది.

ఋతువు—స. రెండునెలల కాలము, మాసము, ఆర్తవము, ప్రకాశము, సూర్యుఁడు, చిలుక, అలు.

ఋషభము— స. ఒక స్వరము, ఎద్దు, మదించిన యేనుఁగు, చెవి రంధ్రము, సూకరవాలము, మొసలితోక, ఒక జన్నము, ఒక వృత్తము, ఒక సామము, ఒక ఓషధి, ఒక రాశి, శ్రేష్ఠ వాచకము, తిరుమల, నక్షత్రము.

ఋషి—స. ముని, దేవత, జ్ఞానాధికుఁడు, దిగంబరుఁడు, వెలుఁగు, వేదము.

ఎగ్గు—దే. కీడు, దుశ్శకునము, చెఱుపు, నింద, అవమానము, నేరము, దోషము, అనాదరము. ప్రార్థనము.

ఎడ—దే. దూరము, మధ్యప్రదేశము, అవకాశము, విచ్ఛిత్తి, తెఱపి, సమయము, రాయబారము, అనుకూలము, వియోగము, ఇతరము, ఎక్కడ, వ్యవహారము, అల్పము, వ్యర్థము, ఎడము, హృదయము, భేదము, సంధి, విఘ్నము, అడ్డు, యౌవనముగలది, వైవేద్యము, చోటు.

ఎత్తు—దే. దయ్యము, యుక్తి, యత్నము, పూలదండ, చదరంగపు బెత్తు, ఔన్నత్యము, ఉత్థానము, నిర్గమించు, వెళ్లు, దొంగిలించు, ఉద్ధరించు, గ్రహించు, వెలికితీయు, భాషించు, మోయు, నకలుచ్రాయు, గంధము తీయు, పరుగెత్తుటకు యత్నించు, దండెత్తుటకుయత్నించు, సమర్పించు, అమర్చు, రాఁబట్టు, త్రాగు, బరువు, పోలిక, విటి విటునకిచ్చు ధనము, మాట్లాడ యత్నించు.

ఎదురు— దే. ఎదురొక్కను, మారు, సరి, విరోధి, వలపుకత్తె, ఇతరుఁడు, సమ్ముఖము.

ఎఱుక—దే. సోదె, పరిచయము, తెలివి, గుఱుతు.

ఎల— దే. సాక్షి, అభినవము, ఎడమ, లేఁతదగు, స్వల్పముగ, యౌవనము గలది.

ఏకము—స. ఒకటి, ఒంటరి, కేవలము, అన్యము, సమానము, సత్యము, స్వల్పము, సరిలేనిది, ముఖ్యము, శ్రేష్ఠము.

ఏడ్తెఱ—దే. పరాక్రమము, అతిశయము, పట్టుదల, కాంతి, త్వరితము, యుద్ధము.

ఏపు—దే. ఆధిక్యము, మదము, గర్వము, విలాసము, పద్ధతి, వృద్ధి.

ఐద్దాయులు—దే. ఐదు వృత్తులు. (వడ్రంగి, కమ్మరి, కంసాలి, కంచరి, తాపి)

ఐరావతము—స. ఇంద్రుని యేనుఁగు, నారింజ, రేగు, పాము, సముద్రజము, ఇంద్రధనుస్సు, రాజమేఘము, అల్లనేరేడు, మెఱపు.

ఒడ్డు—దే. పందెము వేయు, తీరము, వ్యూహము, పూనిక, విశాలము, ఉంచు.

ఒత్తు—దే. దట్టమగు, అదుము, కాళ్లు పిసుకు, త్రోయు, ఆక్రమణము, మెత్త, బలాత్కరించు, సవరించు, బాధ, అధికము, శంఖమూదు.

ఒఱపు—దే. అందము, రీతి, నేర్పరితనము, కల్పన, ఉపాయము, యుక్తము, పెద్దది, యోగ్యత, దృఢము, తాపము, శౌర్యము.

ఓజస్సు—స. తేజము బలము, శస్త్రాది కౌశలము, కావ్యగుణములలో నొకటి. ధాతుపుష్టి, తెలివి, ఆకాశము, గర్వము, ఉత్సాహము, యత్నము, కిరణము, ఎండ.

ఔదుంబరము—స. రాగి, ఉదుంబరమునకు సంబంధించినది, ఒక కుష్ఠరోగము, ఒక వీణ, మేడిచెట్టు.

కమ్—స. శిరము, నీరు, ఆకాశము, సుఖము.

కంకణము—స. స్త్రీలు హస్తమునకు ధరించు నగ, జలబిందువు, భూషణము, శిరోభూషణము, ఒక జలపక్షి, రాపులుఁగు, తోరము.

కంకము—స. రాబందు, మహోత్పలము, కఠినము, హృదయంగమము, గ్రద్ద.

కంకుఁడు—స. కపటబ్రాహ్మణుఁడు, రాజు, కిరాతుఁడు, యముఁడు, కంకభట్టు, క్రూరుఁడు, మనోహరుఁడు.

కంచుకము—స. చొక్కా, ఱవిక, పాముకుబుసము, అకసము, తెల్లవస్త్రము, పొట్టు, కవచము.

కంచుకి—స. ద్వారపాలకుఁడు, విటుఁడు, యవలు, సెనగలు, అగరుచెట్టు, భటుఁడు, పాము, ఓషధి, కవచధారి.

కంజము—స. తామరపువ్వు, అమృతము, వెంట్రుక.

కంటకము—స. రోమాంచము, ముల్లు, కాకి, వెదురు, సూదిమొన, పరుషోక్తి, మొసలి, కార్యాలయము, మత్స్యాదులయెముక, బాణాగ్రము, నొప్పి, తప్పిదము, బాధకరము.

కంటకి—స. గొఱ్ఱె, చేఁప, మాతులుంగము. కళ్లెము, నారింజ, చండ్రచెట్టు.

**కంఠము**—స. మెడ, మర్మస్థానము, కంఠధ్వని, దగ్గర, ఉమ్మెత్త.

**కందము**—స. కురుపు, మేఘము, మూఁపురము, నీరుల్లి. యోనిరోగభేదము, తామరదుంప, చెట్టువేరు, కందదుంప, ఒక వృత్తము, దుబ్బు.

**కందరము**—స. అల్లము, కొండబిలము, పర్వతపార్శ్వము, అంకుశము, అంకురము, బెజ్జము.

**కందళము**—స. క్రొత్తమొలక, అవ్యక్తమధురధ్వని, గ్రహణము, నింద, ఒకఅరఁటి, కందదుంప, భూషణము, పుట్టె, పోరు, బంగారము.

**కందువ**—దే. సంకేతస్థానము, జాడ, ఋతువు, సంఘము, ప్రతిజ్ఞ, నేర్పు. చమత్కారము, ప్రదేశము, సామర్థ్యము, ఛలోక్తి, మాయ, వింతైనది.

**కంబళము**—స. కంబళి, ఒక సర్పము, ఉత్తరీయము, నీరు, అంగవస్త్రము, గంగడోలు, చీరపేను, ఒక యిఱ్ఱి, కంబళిపురుగు.

**కంబువు**—స. ఏనుఁగు, శంఖము, లెక్క, కంఠము, నత్తగుల్ల, కడియము.

**కకుత్తు**—స. ఎద్దుమూపురము, శ్రేష్ఠము, ముఖ్యము, పిఱుదు, రాజచిహ్నము.

**కకుభము**—స. దిక్కు, కాంతి, అందము, సంపెంగపువ్వు, దండ, చిత్రకంబళము, మద్దిచెట్టు, రాగభేదము, శిఖరము, ఊపిరి.

**కక్ష**—స. కచ్చ, పోటీ, చుట్టుగోడ, ఒడ్డాణము, నడుము, తీఁగె, మొలనూలు, సాటి, ఆక్షేపము, గది.

**కక్షము**—స. చంక, పాద, బురదనేల, గడ్డి, అంతఃపురము, రథాంగము, మణికట్టు, ఎనుము, ఏనుఁగు నడుమునకు గట్టువారు, కట్టుబట్ట వెనుకకొంగు, నీటితో నిండిననేల, పాపము, ప్రక్క, ప్రహారిగోడ, ఎండినయడవి.

**కక్ష్య**—స. దంతక్షతస్థాన విశేషము, చంక, త్రాసున తూచెడు తూనిక, ఆఁడుదాని మొలనూలు, వసారా, వ్రేలు, తొట్టికట్టు, కందువా, కుచ్చిళ్ళు, కత్తి.

**కచ్ఛము**—స. దోవతికొంగు, గోఁచి, చెమ్మనేల, ఓడయంగము, తీరము, వనము, పార్శ్వము, అడవి, మగగుఱ్ఱి, ఆఁడుగుఱ్ఱి, అల, నందిచెట్టు, చుక్కాని, తాఁబేటిచిప్ప, తాఁబేటికాలు, కంటితెప్పలు, ఒక దేశము.

**కటకము**—స. కొండనడుము, పిడికిలి, ఏనుఁగుదంతమునకు వేయు పొన్ను, శిబిరము, కొండచఱియ, పట్టణము, రాజధాని, చాఁప, కంకణము, పిఱుఁదు, ఉప్పు, సేన, ఇల్లు, దండయాత్ర

**కటము**—స. ఏనుఁగు చెక్కిలి, మొల, శ్మశానము, కణత, చాఁప, పిఱుదు, అతిశయము, గడ్డి, విషము, సమయము, పాడె, ఒట్టు, ఓనుఁగు.

**కటాహము**—స. బాన, కప్పెర, తాబేటివెన్నుచిప్ప, ఒక దీవి, ప్రారంభము, తప్పెట, అప్పుడే కొమ్ములు వచ్చుచున్న గేదెదూడ, చెవులుగల గంగాళము, ఒక నరకము, శిఖరము, ఆఁబడ్డ, పప్పు, పాములవాని తంత్రము.

కటి — స. మొల, పిఱుఁదు పిప్పలిమోడి మేఁకలను గోయుతావు ఏనుఁగు ఏనుఁగు చెక్కిలి, ఒకహస్తక్షేత్రము.

కటువు — స. కారము, ఉష్ణరసము, ఇష్టము, సువాసనకలది, పాడై అకార్యము, కటుకరోహిణి, ఇంపుకానిది, వాసన, వల్లావ, కోపము.

కట్టనము — దే. బంధనము, వస్త్రము కావుక.

కట్టు — దే. వస్త్రధారణము. మిత, నిర్బంధము, స్నేహభావము, ఆరోపించు, కలిఁగించు, నిర్మించు, దేశకాలభాగము, చెల్లించు, విధించు ఋతువు, పశువులు గర్భముధరించు, మంత్రించు, ఉడికిన పప్పువస్తువులలోని ద్రవము.

కడ — దే. దిక్కు, స్థలము, గతి, వేళ, ఇతరము, దూరము, మరణము, సమీపము, అంత్యము, ప్రక్క.

కడచు — దే. చచ్చు, గతించు, నశించు, అతిక్రమించు అధికమగు, హెచ్చు, దాటు.

కడిఁది — దే. అధికము, అశక్యము, ఆపద, కఠోరము, దుర్లభము, శూరత్వము, కఠినము

కణము — స. బాణము, వరిపండు, చిన్నకొలత, నీటిబొట్టు, చంక, కొంచెము, కణత, కణిక, బొట్టు, గోధుమ నూక, నూక, మిక్కిలి సూక్ష్మమైనది, నడిమిద్రేఁగు మొ

కత్తెర — దే. కృత్తికానక్షత్రము, కత్తిరించెడి ఆయుధము, భరణి మూఁడు నాలుగు పాదములయందును కృత్తికయందును రోహిణి మొదటి పాదమందును సూర్యుఁ డుండుకాలము కక్కీయఁబడినపేరు

కథ — స. కత, పూర్వకథ, చెప్పుట, ఒకజాతిగద్య గ్రంథము గౌరి మహిమ్మతీ పురము.

కదంబము — స. సమూహము, తెల్ల ఆవాలు, కైదువు బాణము, తొడిమ, పీఁచు, కడిమిచెట్టు కలంబము, పిండి.

కదళి — స. అరఁటి చొక్కా, కవచము, అల్పదాహముకలది, బూరుగుచెట్టు దొండచెట్టు, టెక్కెము, జింక.

కనకము — స. బంగారము, ఉమ్మెత్త, చంపకము, కోవిదారము, వల్లాగలు, నాగకేసరము, కృష్ణచందనము, మోదుగ.

కన్నియ — త. పెండ్లికాని పడుచు, కుమార్తె, స్త్రీ, క్రొత్త, చిన్న, ఒకరాశి.

కన్ను — దే. నేత్రము, జాడ, చూపు, బండిచక్రము, నెమిలిపురికన్ను, వల యందలి రంధ్రము, వంతెనయొక్క ద్వారము, మద్దెలయొక్క నీలమండపము, వెదురు, చెఱకు మున్నగువాని గనుపుక్రిందగుంట.

కన్య — స. పడుచు, కుమార్తె, స్త్రీ, దుర్గ, వేశ్య, కలబంద, చిన్న, ఒకరాశి.

కపాలము — స తలపుఱ్ఱె, భిక్షాపాత్రము, గిన్నె, గుంపు, గ్రుడ్డుపైచిప్ప, కుండ మున్నగువానిపెంచిక, పాము, వజ్రము, ఒకకుష్ఠరోగము.

కపి—స. వానరము, సూర్యుఁడు, ఏనుఁగు, పంది, ఉసిరికచెట్టు, పింగళ వర్ణము, విష్ణువు.

కపిల—స. ఆగ్నేయదిశయందలి యాఁడేనుఁగు, పుల్లావు, రేణుక యను గంధద్రవ్యము, కినిమిసుపండు, ఒకయిత్తడి, ఒక జలజంతువు, విద్యుత్తు, చిల్ల, ఒక లోహము.

కప్పు—దే. కమ్ము, ఇంటిపై కప్పు, నలుపు, చీఁకటి, పండ్లకు వేసికొను నల్లరంగు, దంతక్షతము, వ్యాపించు, బంధించు, వస్తువుయొక్క పైభాగము, మూఁతవేయు.

కమరము—స. భిక్షాపాత్ర, కుబేరుని కత్తి, వెదురుమొలక, వాద్యపుకుండ, తాఁబేటియెముక, పొట్టిది, తాఁబేలు.

కమలము—స. తామర, రాగి, ఉదకము, ఔషధము, కడుపులో కుడి ప్రక్కనుండు మాంసవిశేషము, ఎఱ్ఱతామర, కత్తియొర, ఒకానొకజింక.

కమ్మ—దే. పత్రిక, కర్ణభూషణము, వర్ణవిశేషము, రుచి భేదము, శాఖావాళము, మట్ట, తాటియాకు, ప్రియమైనది, వాసనకలది, అందమైనది.

కర(ం)కము—స. లోపల నేమియు లేని బొండ్లపు చిప్ప, కమండలువు, కరకపక్షి, చేయి, దానిమ్మచెట్టు, గరికముంత, తాంబూలపుపెట్టె, ఎముకలగూఁడు, వక్కలాకుల తిత్తి, పుట్టె.

కరండము—స. కత్తి, తేనెపెర, కన్నెలేడి, నువ్వులు, బరిణె.

కరటము—స. కాకి, కుంకుమపువ్వు, గోదురుకప్ప, మారేడుచెట్టు, వాద్యభాండము. ఏనుఁగు చెక్కిలి, పనికిమాలిన బ్రతుకు, ఒకానొక ధ్వని, శ్రాద్ధకర్మము.

కరణము—స. లెక్కగాఁడు, సాధనము, ఆసనము, శరీరము విదల్చుట, నాట్యవిశేషము, హేతువు, హృదయము, ధ్యానము, రథబంధము, పాట, పంచాంగములలోనొకటి, క్రియావిశేషము, క్షేత్రము, శరీరము, ఇంద్రియము, వ్రాయఁబడిన పత్రము, పొలము, జాతివిశేషము, పరమాత్మ.

కరము—స. హస్తము, కప్పము, తొండము, వడగల్లు, హస్తనక్షత్రము, చిమ్ముట, హింస, అన్నము, ముద్ర, ఇంద్రధనుస్సు, మేఘము, కిరణము.

కరళము—స. వెన్నముక, భయంకరము, కురూపియైనది, విశాలమైనది, గొప్పది.

కరాళము—స. నల్లగగ్గెర, వెన్నముక, సర్జరసము, ఒక నరకము, పొడవైనది, భయంకరము, నాలుక, భయానకరసము, వంకరైనది.

కరి—స. ఏనుఁగు, ఎనిమిది, కోతి, దే. నిదర్శనము, సాక్షి, హద్దు, నియమము.

కరుణము—స. నవరసములలో నొకటి, వృక్ష విశేషము, జాలిపుట్టించునది, దీనత్వము, నిమ్మచెట్టు, దయ, దుఃఖము.

కర్కటము—స. ఎండ్రకాయ, ఇక్షువు, కర్కార, నాఁగుదోస, బూరుగుకాయ, కర్కాటకరాశి, రతిబంధము, తామర దుంప, ముల్లు, మొగ్గువైపు త్రాసుకఱ్ఱ కొన, రాబందు, ఒక వృక్షము, అభినయ హస్తవిశేషము.

కర్కము—స. అద్దము, ఎండ్రకాయ, పీత, కుండ, తెల్లగుఱ్ఱము, అగ్ని, తెల్లనిది, మంచిది, చతుర్వర్ణములలో నొకటి.

కర్కశము—స. చెఱకు, దృఢము, కత్తి, రత్నదోషము, కనికరములేని, కంపిల్లవృక్షము, భూమి సరిహద్దులకై జరుగు దెబ్బలాట.

కర్ణిక—స. తొండము, చెవిదుద్దు, నడిమి వ్రేలు, తొడపుకొన, గెల, తామర దుద్దు, విటకత్తె.

కర్పరము—స. భిక్షాపాత్రము, తల పుఱ్ఱె, పెద్దకాఁగు, వెన్నముక, మందడ, కడవ, నిప్పు, పెనము, మరక, శస్త్ర భేదము.

కర్బురము—స. జలము, బంగారము, దోసము, పాపము, సిందూరము, ఆకసము, చిత్రవర్ణము.

కర్మ—స. పని, ఆఱు, సాధనము, శిల్పము, జన్మము, పాపము, పుణ్యము, యాతన, దురదృష్టము, క్రియయొక్క ఫలము నొందునది.

కల—స. చంద్రునిలోఁ బదునాఱవ భాగము, అవ్యక్తమధురము, ఒకపాలు, బలము, స్త్రీరజస్సు, సమకూర్పు, విద్య, అందము, రేతస్సు, కడ్డి.

కలకంఠము—స. కోకిల, పావురము, హంస, అవ్యక్త మధురధ్వని.

కలమము—స. వరిపైరు, లత్తుక, మొలక, ఇరువదియేండ్ల యేనుఁగు, నల్లగుఱ్ఱము, వ్రాసెడు కలము.

కలంకము—స. గుర్తు, నింద, ఇనుప చిట్టెము.

కలము—స. రేతస్సు, అజీర్ణము, అవ్యక్త మధురధ్వని, (దే) కలుష గంధము, ఓడ, లేఖిని.

కలశము—స. పాత్ర, కవ్వము, గోపుర శిఖరము.

కలాదుఁడు—స. అగసాలె, చందమామ, విద్య చెప్పినవాఁడు, మేనమామ, మేనమామ కొడుకు, జ్ఞాతి, రాహువు, కఠినచిత్తుఁడు, కేతువు.

కలాపము—స. నెమిలిపురి, బాణముల పొది, ఒక కళ, ఒక కాలము, జ్ఞానము, మోక్షము, చేయుట, రెండు కాళ్ళతో మూఁడు మాటలు నృత్య మొనర్చుట, అలంకారము, సమూహము, ఒడ్డాణము.

కలాపుఁడు—స. అగసాలె, చంద్రుఁడు, సూర్యుఁడు, శిల్పి.

కలి—స. కయ్యము, యుగములలో నొకటి, తాండ్ర, కుంటివాఁడు, శూరుఁడు, కల్లిము, మొగ్గ (దే) పులియఁబెట్టిన కడుగునీరు, కడుగు.

**కల్కము**— స. కపటము, పాపము దశవిధ మలములలో నేదియే నొకటి, చూర్ణము, దురాలోచన, చెడుతలంపు

**కల్పన**— స. ఏర్పాటు వాక్యరచన, తలంపు, యుక్తి, అలంకరించు, ఏనుఁగును సిద్ధముచేయుటకుఁ గట్టిన త్రాడు, చేయుట, ఛేదించుట, మగ్గము లేని దున్నట్లు చెప్పుట.

**కల్పము**— స ప్రళయము, బ్రహ్మ దినము, శాస్త్రము, సమానమైనది వ్రతకల్పము, నిబంధనము, చికిత్స, వేదాంగము, విధానము, ఆశయము, కల్పవృక్షము, ఒక మద్యము, నిశ్చయము, యుక్తము.

**కల్మషము**—స. చిత్రవర్ణము, నలుపు, అలచందలు, పాపము, కోపము, నలుపు, అధికముగాగల తెలుపు.

**కల్యము**—స. చతురత్వము, ఆరోగ్యము, కల్లు, వేకువ, చెవిటి, నిన్న, లగ్నము, ఉపాయము, మూఁగ హితవచనము.

**కల్యాణము**—స. మంగళము, అక్షయము, బంగారు, పరిణయము.

**కల్ల**—దే. పరుషవచనము, హాని, కటువ ఆసత్యము, తప్పు, మోసము.

**కవి**—స. కావ్యకర్త, శుక్రుఁడు వాల్మీకి పండితుఁడు, సూర్యుఁడు ఋషి, బ్రహ్మము, కళ్లెము.

**కశేరువు**—స. గజవిశేషము, నడుమటి చుక్క, ముస్తె వెన్నెముక జంబూ ద్వీపమందలి నది, బంగారము తృణ కందము

**కషాయము**-స వగరు, కాచినసారము, చందనాదుల పూఁత, ఎఱుపు కలిసిన తెలుపు పోఁక, మ్రానిబంక, పరిమళము సీసము, ఉపద్రవము ఎఱుఁగుట, చెట్లబంక బాధ, విప్లవము, ఎఱ్ఱనిది

**కషము**— స. దుఃఖము శ్రమము, పాపము, శక్యముకానిది, హానికరము, బాధ.

**కసరు**—దే కోపించు, వానగాలి, సిగ్గు తిట్టు, చలించు.

**కళ**—స. ముప్పది కాష్ఠల కాలము, చంద్రునిలోఁ బదునాఱవ భాగము, స్త్రీ రజస్సు, రాగము, శిల్పము ఆలింగనము, చదువు, సంధానము, భారము, పురుష రేతస్సు, అజీర్ణము, అవ్యక్త మధురధ్వని వడ్డీ, అందము, విద్య, (దే. నకారమంతమందు లేని పదము, రెమ్మ, మూర్ఛ)

**కళాయి**—దే. గంగాళము, పాత్రలకుఁ బూయు తగరపుఁబూఁత.

**కాంచనము**—స. బంగారు, కాంతి, అరిదళము, ధనము, బంధనము, మట్టి, పొన్న, సంపెంగ, మేడి, ఉమ్మెత్త, పసుపు, కింజల్కము.

**కాండము**—స. గ్రంథభాగము, ఉదకము, తక్కువ, ఏఱుదాఁటు తెప్ప

బలము, గణుపు, స్తంభము, దండము, గర్వము, గుత్తము, నిర్జనదేశము, పొగడ్త, బాణము, సమూహము, కాడ, ఆకుయొక్క యీనె, పరిపోఁచ, బోదె, సమయము, దండము, ఏకాంతము, గుత్తము, దారము, సమిధ, మ్రాను, కాకి, దొండ, ఎలుక.

కాఁక—దే. జ్వరము, తాపము, తపము, కోపము, వేఁడి.

కాఁగు—దే. తపించు, కోపించు, పెద్ద బాన.

కాఁచు—దే. రక్షించు, కావలి కాయు, కాఁగఁజేయు, కవిరి, కాయ కాఁచు, ఓర్పువహించు.

కాఁపు—దే. గృహస్థు, పాలికుఁడు, శూద్రుఁడు, కాఁపురము, చదరంగపు బెత్తు.

కా(కి)కణి—స. నాలుగు మినపగింజల ఎత్తు, పాదుక, ఇరువదిగవ్వలు, ఒక గవ్వ, ఒక గజములో నాలుగవవంతు, మూఁడు పైసలు, పంద్రెండు అణాల యెత్తు.

కాకోలము—స. విషభేదము, మాల కాకి.

కాదంబము—స. మధురముగాఁ బలుకు హంస, కోకిల, కడపచెట్టు సంబంధమైనది, సమూహసంబంధమైనది, బాణము.

కాదంబరి—స. కల్లు, ఒకవచన కావ్యము, గోరువంక, ఆఁడుకోయిల, సరస్వతి, మదజలము.

కాపటికుఁడు—స. మోసకాఁడు, స్తోత్రము చేయువాఁడు, ఇంద్రజాలికుఁడు, అన్యులమర్మము లెఱింగిన వాఁడు, కూరదినుసులు తినుట విధించు వాఁడు, విద్యార్థి.

కామిని—స. కామముగలది, బదనిక, సుందరి, కల్లు, మ్రానిపసుపు.

కాయము—స. సమూహము, స్వభావము, గుఱి,మనుష్య (బ్రహ్మ) తీర్థము.

కారణము—స. సాధనము, హేతువు, పని, తండ్రి, ఇంద్రియము, వధము, ఉద్దేశము.

కారు—దే. జ్యేష్ఠమాసము మొదలు నాలుగేసి నెలలకాలము, వర్షర్తువు, ఆదను, నలుపు, అడవి, ముదిమి, ఊషరక్షేత్రము, కోరకము, కాలము, దున్ననిది.

కార్ముకము—స. విల్లు, శస్త్రము, వెదురు, పెద్దవేఁప, తెల్లతుమ్మ, కులము.

కాఱు—దే. స్రవించు, రాలు, అజ్ఞానము, పరుషము, పట్టకాఱు, దట్టము, వ్యర్థవచనము, అజ్ఞాపనము, కట్టు.

కాలము—స. సమయము, నలుపు, చావు, ఎఱ్ఱచిత్రమూలము, తాడి.

కాలిక—స. పార్వతి, ద్రౌపది, నెలవడి తేలుకొండి, కల్లు, చీఁకటి, ఆఁడు కాకి, నలుపు, మేఘములగుంపు, యోగిని, మాంసము, నూగారు, పొగబంతి, బంగారునందలి దోషము, క్రొత్త మబ్బు, వెల్లఁబాటు, తేలు, పాలలోని పురుగు, పాటకాయ, కాళికాదేవి.

కాలుఁడు—స. యముఁడు, దేవగణ విశేషము, శివుఁడు, శని

కాహళము—స. కోఁడి, శబ్దము (చప్పుడు), ఎండినది, దుష్టము, పిల్లి, పక్షి, అతిశయము, కష్టము, అవ్యక్త వాక్యము, పామరోక్తి, ఒక వాద్య విశేషము.

కాళి—స. పార్వతి, నల్లజీలకఱ్ఱ పాల పురుగు, నల్లని క్రొత్త మబ్బు నల్ల సిరా, నల్లనైన యాఁడుది, వ్యాసుని మాత,అగ్నిజిహ్వ, సూర్యుఁడు, భ్రూకుటి, దూషణము, యమునిచెల్లెయలు, తేలుకొండి, ఆదిశక్తులలో నొకతె, బొగ్గు, రాత్రి మొ.

కిరీటి—స. అర్జునుఁడు, కోడి.

కిల్బిషము—స. పాపము, నల్లత్రాచు విషము, రోగము, అపరాధము.

కిశోరము—స. సాలెపురుగు, గుఱ్ఱపు పిల్ల, సీతచందనము, తైలపర్ణి, విడువఁబడినది, పిల్ల.

కిశోరుఁడు—స.బాలుఁడు సూర్యుఁడు.

కీడు—దే. అపకారము, మాలిన్యము, తగనిది, ఆపద, తప్పు, అశుభము.

కీర్తి—స. యశస్సు, చెప్పాట, ధ్వని, దీప్తి, బురద, తేట, తావు, విస్తారము, అనుగ్రహము, ఐశ్వర్యము.

కీలాలము—స. అమృతము, అన్నము, పశువు, నెత్తురు, నీరు.

కీలు—త. మర్మము, సీల, ముడి, పద్ధతి, మఱి, నల్లనిరంగు, ఉపాయము, కపటము.

కుంజము—స. పొదరిల్లు, ఏనుఁగు కొమ్ము, కొండ కంటిక్రింద మొదలు, చెక్కిళ్ళ పార్శ్వము.

కుంఠము—స. మొక్కవోయిన ఆయుధము, పిడుగు, పొరపాటు, వజ్రము పాము ఖర్వము.

కుండలి—స. తిప్పతీఁగె, కుబేరుఁడు, గొండ్లి ,పాము, నెమిలి, నీటిఱేఁడు వరుణదేవుఁడు గుండ్రనిది, దేవకాంచనము, యజ్ఞముచేసినవాఁడు.

కుంతలము—స. వెండ్రుక, జవము, నాఁగలి, పాము, కుంతాయుధము, యవలు, ఒకదేశము.

కుందము—స. మొల్ల, కుబేరుని నిధి, బండికన్ను, సానపట్టునది, పుష్పము

కుంభము—స ఏనుఁగు కుంభస్థలము, ఏనుఁగుగండస్థలము, అన్న పురాశి ప్రాణాయామభేదము, వేయి ఫలములు, కడవ, బల్యాన్నము, పరిమాణ విశేషము, గుగ్గిలము, ఒకరాశి.

కుంభసంభవుఁడు—స. అగస్త్యుఁడు ద్రోణుఁడు.

కుంభి—స. వంటపాత్ర, వాము, టేకుచెట్టు, ఏనుఁగు, కుమ్మరి, మొసలి, చిన్నగుమ్మడు, కలిగొట్టు, నీరుప్రబ్బ, గుగ్గిలము.

కుంభిని—స. భూమి, ఆఁడేనుఁగు.

కుక్కుటము—స కోఁడి గంపపులుఁగు,

కపటము, కుక్క, మిణుఁగురులు, ఒక తిర్యక్కరణ బంధము, ఒకానొక ఆసనము, అగ్నికణము, గుర్వు.

కుటి—స. చెట్టు, శరీరము, ఇనుము, కలు, కుటిలహృదయుఁడు, ఆయుధపు టంచు, గుడిసె, నీరుమోసెడి దాసి, వివిధవర్ణముల పూలగుత్తి.

కుట్టు—దే. అనూయ, చెవికి బెజ్జము కుట్టుట, ఆకులుకుట్టు, గుడ్డలకుట్టు, వల్లి, దోమ, చీమ, తేలు, మొ. నవి కుట్టుట, బూషిదె.

కుతపము—స. పగలు 15 భాగములు కాగా ఎనిమిదవ భాగము, ఆవు, సూర్యుఁడు, పదియారు ఏండ్ల యేనుఁగు, వాద్యము, కంబళి, దర్భ, చిన్నపిడ్డె, నువ్వు, చెకుతపము.

కుతపుఁడు— స. తోడఁబుట్టినవాని కొడుకు, సూర్యుఁడు, బ్రాహ్మణుఁడు, అతిథి, అగ్ని, కూఁతురుకొడుకు.

కుదురు—దే. అమరు, నిలుకడ, కుంపటి, కుండలక్రింద నుంచు సాధనము, పొదు. వంశము, ప్రాపు.

కుబుసము—దే. పాము పైపొర, చొక్కా, తలుపు.

కుమారము—స. బంగారము, చిలుక, గుఱ్ఱము, ఉలిమిరిచెట్టు, అవురుగడ్డి.

కుమారి—స. కుమార్తె, పెండ్లికాని పడుచు, పార్వతి, సీత, కలబంద, చేమంతి, నల్లపిచ్చుక, ఒకనది, జంబూ ద్వీపము, చిన్నగోరంట.

కుమారుఁడు— స. కుమారస్వామి, బాలుఁడు, యువరాజు, మంత్రి, అశ్వ పాలకుఁడు, జయంతుఁడు.

కుముదము—స. ఎఱ్ఱతామర, తెల్లకలువ, బ్రహ్మజట యను ఓషధి, నిర్ఋతి దిక్కునందలి యేనుఁగు, కనుగ్రుడ్డు చుట్టునుండు తెల్లని భాగము, ఒకానొక పాము, నిర్జలభూమి, పీనుఁగు, గాలి, శివుని శంఖము.

కురువిందము—స. ఎఱ్ఱని కెంపు, అద్దము, ఇంగిలీకము, కాచలవణము, నిడుముస్తె, మినుము.

కులము—స. జాతి, ఇల్లు, దేశము, చేఁతి పొట్లు, శరీరము, వంశము.

కులాయము—స. పక్షిగూడు, శరీరము, సాలెగూడు, పానము.

కువలయము—స. కలువ, భూవలయము, నల్లగలువ, మోసపు కడియము.

కుసుంభము—స. బంగారు, కమండలువు, కుంకుమపువ్వు, ఒకచెట్టు.

కుసుమము—స. పూవు, రజస్సు, నేత్ర రోగము, ఫలము.

కుహనము—స. ఎలుక, పాము, మాయ, ఈర్ష్యగలది, ఒకరకము కుండ, ఉండ, గాజుగిన్నె.

కుహరము—స. గుహ, తొఱ్ఱ, బెజ్జము, ఇంటిమాయు, ఇంద్రజాలాది మాయ, మొగము, కంఠధ్వని, కుత్తుక, దగ్గఱ, తెల్లతుమ్మ.

కూటము—స. కపటము, ప్రోగు,

అమ్మ, కొలువు, చావడి, శిఖరము, బొంకు, ఇల్లు, ఆకాశాదికము, కలుగోల, ఇనపగుడియ, గారడి, ఏనుపు, సమ్మెట, కూటయంత్రము, పుట్టము, కూడుట, దోషము.

కూపము—స. నూయి, చెలమ, ఓడకొయ్య, పిఱుఁదులమీఁది గుంట, బెజ్జము.

కూర్చము—స. దర్భపిడికిలి, కనుబొమల మధ్యము, కపటము, పెరిగిన మీఁగడ్డములు, జెండా కుచ్చులు, నెమలిపింఛము, మెచ్చు, కఠినము, దంభము.

కూలము—స. ఒడ్డు, గుంట, దిబ్బ, కొండకొమ్మ, సైన్యము వెనుక భాగము, కొలఁకు.

కృచ్ఛ్రము—స. వ్రత విశేషము, దుఃఖము, పాపము, బాధ.

కృతాంతము—స. చావు, పాపము, అదృష్టము. సిద్ధాంతము, శనివారము, భరణి.

కృపణము—స. నీచము, బీద, పురుగు, లోభియైనది.

కృష్ణము—స. ఇనుము, మిరియము, దోషము, కాకి, కోయిల, నిప్పు, మబ్బు, పాశము, సీసము, చిత్రవర్ణము గల యిఱ్ఱి, జీలకఱ్ఱ, నీలాంజనము, నలుపురంగు, కాలాగరు, ఒకపక్షము, దున్న, ఏనుఁగు, శూద్రజాతి, నల్లనిది.

కృష్ణుఁడు—స. విష్ణువు, వసుదేవుని పుత్త్రుఁడు, వ్యాసుఁడు, అర్జునుఁడు.

కేతనము—స. గుఱుతు, టెక్కెము, గృహము, చేయుట, దేహము, ధనుస్సు, పిలుచుట, భాగ్యము, బుద్ధి, కోరిక, ఆకృతి.

కేతువు—స. అగ్ని, గుర్తు, కిరణము, ధూమకేతువు, ఒక గ్రహము, ముఖ్యుఁడు, ప్రకాశము, టెక్కెము.

కేదారము—స. వరిమడి, కొండ, ఒక పర్వతము, పాగయొక్క కుదురు.

కేసరము } కేశరము } —స. విషవిశేషము, నాగకేసరము, పొగడ, పున్నాగము, ఇంగువ, వింజామరము, గుఱ్ఱపు మెడమీఁద వెండ్రుక, లవంగపువ్వు.

కేసరి—స. సింహము, గుఱ్ఱము, పున్నాగము, శ్రేష్ఠుఁడు, నాగకేసరము, హనుమంతుని తండ్రి, మాదీఫలము.

కేళాకూళి—త. క్రీడాసరస్సు, జలయంత్రము, మడుగు.

కేళి—స. పరిహాసము, ఆట, పుడమి, ప్రాతదొంగ.

కైపు—దే. మత్తు, ఉద్రేకము, అందము, కపటము, విధము.

కైరవుఁడు—స. జూదరి, పగవాఁడు, మోసకాఁడు.

కొప్పరము—దే. శిఖరము, ఔన్నత్యము, మూపు, వికసించినది.

కొమ్మ—దే. చిమ్మనగ్రోవి, ఏనుఁగు దంతము, శిఖరము, పందికోఱ, పల్లకి బొంగు, పసుపుకొమ్ము, పశువులకొమ్ము,

ఉత్సాహము బలము శాఖ, ఊఁదెడి వాద్యము.

కొఱ—దే. ప్రయోజనము, ఒకచేఁప, కొఱఁత, కార్యము, ప్రయోజకము.

కొసరు—దే కోరిక, ప్రార్థనము సంకో చము, విజృంభించు, వస్తువును కొన్న దానిపై పెచ్చుట, పొగడిక.

కోకము—స. చక్రవాకము తోఁడేలు, కొంగ, బల్లి, కప్ప, ఈఁదు, కొండ గోఁగు చెట్టు.

కోడె—దే. విటుఁడు, తరుణము కోడె దూడ.

కోణము—స. ఒక మూల, అంచు, దుడ్డుకోల, ఆయుధధార, దున్న పోతు, గోఁచి, వాద్యవిశేషము, శని గ్రహము, కుజగ్రహము, వాద్యశాల, ఒకానొక జ్యోతిషసంకేతము.

కోపు—దే వైపు వింటికొన, రీతి, కల్లు, నిమిత్తము, అందము, నాట్యము, తీర్పు, కడ్డి బలపపుపుల్ల, ఆట, నమస్కారము, సమయము.

కోలము—స. రేఁగుపండు, పంది, ఎలుక, సొంటి, తెప్ప, కౌఁగిలి, ఒడి, తలపుటె, నఖము, చిప్ప.

కోశము—స. కత్తియొఱ, జాజికాయ, బెరడు బొక్కసము, ముక్కము, మొగ్గ గర్భము గృహము, మేఘము, పుస్తకము, గ్రుడ్డు, కొట్టు (గది), మగగుఱి, అఁడుగుఱిలోపలి భాగము (పెసరమొదలైనవాని), పొట్టు, నెమిలి పింఛమాలము, శాస్త్రము, దేహము, సౌందర్యము, యోని, సప్తాంగము లలో నొకటి.

కౌతుకము—స. సంతోషము శుభము, కార్యములందుఁజేతికిధరించు తోరము, పండుగ స్త్రీ పురుషుల పరిహాసము, పెండ్లి కోరిక, ఉత్సవము విలివ్యాసము, భోగకాలము గానాదులు, దేవేంద్ర వి రథము

కౌపీనము—స. గోఁచి, అకార్యము, పాపము, స్త్రీపురుషులగుఱి, కదలుట, వ్యాపము, ఎఱుపు.

కౌమారము—స. బాల్యము నకు బిమ్మటియవస్థ మెత్తనిది, బాల్యము.

కౌలీనము—స. గుహ్యము, అకార్యము, యుద్ధము, గుహ్యము, లోకాప వాదము, పశుపక్షిమృగాదుల పందెపు జగడము, సత్కులమునఁ బుట్టుట.

కౌశికుఁడు—స. పాములవాఁడు, కుమ్మరి వాఁడు విశ్వామిత్రుఁడు, ఇంద్రుఁడు, నిఘంటువు వ్రాసినవాఁడు.

క్రమము—స. అడుగుపెట్టుట, పాదము, మార్గము, వేదపఠన విశేషము, వరుస, బలిమి.

క్రముకము—స. పోకపండు, తమ్మ లము, ఎఱ్ఱలొద్దుగు, గంగరావి, కార్పాసము, ప్రత్తికాయ.

క్రిమి—స. పురుగు, సాలెపురుగు, లక్క

క్రియ—స.ధాత్వర్థము, చేష్ట, శ్రాద్ధము, ప్రాయశ్చిత్తము, చికిత్స, పని,

ఆరంభము, పూజ, శిక్ష, ఉపాయము, శైదు, వేడుక, మేషరాశి.

క్రోవి—స తామరనాళము, సస్యాది నాళము, కరవకము, ఊదుక్రోవి, తుపాకి, బుద్ధి, మూస.

క్లేశము—స. దుఃఖము, ఆశలేమి, జగడము, వ్యథ, యత్నము.

క్షత్త—స శూద్రస్త్రీయందు క్షత్రియునకుఁ బుట్టినవాఁడు, క్షత్రియ కాంతయందు శూద్రునకు జనించిన వాఁడు, బ్రహ్మ, సారథి, రోఁకలి, చేప, దూత, మృతుఁడు, అవినీతుఁడు, శంకరుఁడు, ద్వారపాలకుఁడు మఱది వలనఁ బుట్టిన సంతానము, దాసీ పుత్త్రుఁడు

క్షమ—స ఓర్పు, భూమి, గాఁ, సమర్థము, ఇష్టము, ప్రియము.

క్షయము—స రోగవిశేషము ప్రళయము, గృహము, నష్టము, కుటుంబము, తక్కువ.

క్షరము—స ఉదకము, మేఘము, నశించునది.

క్షామము—స. కరవు సన్నము, బలహీనము.

క్షారము—స. ఉప్పు, కారము, గాజు, భస్మము, గాజుమన్ను, వెలిగారము.

క్షితి—స. భూమి, ఉనికి, చిటికివేయు నంతకాలము, సంఖ్యావిశేషము, ఇల్లు, నాశము, కాలభేదము, శ్రుతిభేదము.

క్షీరము—స. పాలు, నీరు, వటము, పాలపిట్ట, పాలసముద్రము, తీఁపు.

క్షుద్ర—స. తేనెటీఁగ, ఈఁగ, నాట్యస్త్రీ వెలయాలు, పులిచింత, వాకుడు మొక్క అంగహీనయగు ఆఁడుది, దొమ్మరిది

క్షురము—స. మంగలికత్తి, గిట్ట, బాణము, చురకత్తి ఏనుఁగుపల్లేరు, కుందుటెల్లు

క్షుల్లకము—స. నత్తగుల్ల, పేద, నీచము.

క్షేత్రము—స. భార్య, వరిమడి పుణ్యస్థానము, శరీరము, గణితశాస్త్ర విశేషము, మనస్సు ఉపవాసము సారవంతమగు భూమి, సిద్ధస్థానము ఆఁడు గుఱ్ఱ గోడ.

క్షేపము—స. చిమ్ముట, త్రుళ్లు దూఱు, పూఁత, గర్వము, ప్రేరణము, తిరస్కారము, అలస్యము, గుత్తి వికల్పము

క్షేమము—స. సేమము, చండయను గంధద్రవ్యము, గరుడుఁడు తుమ్మ.

క్షోణి—స. భూమి, ముంజదర్భల మొలత్రాడు, నల్లజీలకఱ్ఱ సంఖ్యా విశేషము.

క్షౌమము—స. నారచీర, పట్టు వస్త్రము, కోటవాకిలిమీఁదియిల్లు.

ఖండపరశువు—స. శివుఁడు, పరశురాముఁడు, వెల్లవేయువాఁడు, రాహువు, ఒక లేహ్యము, విఱిగిన దంతముగల యేనుఁగు, వజ్రమువంటిమేను.

ఖండము—స. ముక్క, పగులు, ఒక భాగము, రత్నదోషము, పులకండము, తొమ్మిది

ఖంబు—ఆకాశము స్వర్గము, అభావము, పరిమడి, సుఖము, నక్షత్రము, పట్టణము బిలము గరుత్మంతుఁడు కత్తి, ఓర్పు శివసన్నిధి, శంఖధ్వని బిందువు, తెలివి, ఇంద్రియము (చూ. ఖము.)

ఖగము—స. పక్షి, బాణము, సూర్యాది గ్రహములు, దేహము, గాలి.

ఖము—స. ఆకాశము, స్వర్గము, సుఖము, ఇంద్రియము, పురము, జ్ఞానము, బిందువు, హర్షము, గ్రహము, అభావము, పరిమడి. (చూ. ఖంబు)

ఖరము—స. గాడిద, వేఁడిమి, వాడిమి, ఎండుపోఁక, తేన, దేవతాడి.

ఖర్జూరము—స. ఒకచెట్టు, తేలు, వెండి హరిదళము శ్లేష్మము.

ఖల్లము—స. తోలు, పల్లము, వాన కోయిల వస్త్రభేదము

గంజము—స. తిరస్కారము, సంత ధాన్యపుకొట్టు, నివాసము, గని, బండారము.

గండకము—స. ఖడ్గమృగము,జోస్యము, విఘ్నము, చేఁపపిల్ల, సంఖ్యావిశేషము, గుఱుతు, పర్వతమునుంచి జారినరాయి, ఉపాయము, అర్ధ చంద్రాకారమైన తలగడ.

గండము—స. ఏనుఁగు చెక్కిలి, చెక్కిలి, గుండ్రాయి, గర్వము, నక్షత్రగత దుష్టభాగము, గుఱుతు, హయభూషణము పుండు, పొక్కు నీటి బుగ్గ, అపాయము, ఉపాయము

గంధమాదనము—స. ఒక పర్వతము, మదపుటేనుఁగు, ఒకానొకకోఁతి, మగతుమ్మెద, గంధకము, కొమ్మ.

గంధము—స. వాసన, గర్వము, స్వల్పము గంధకము.

గణము—స. ప్రమథులు సమూహము, సేనావిశేషము, జాతి, సమాజము, గుంపు, లెక్క, ఛందస్సులో నొక సంకేతము.

గతి—స. పోక, గండి, ఉపాయము, ఎల్లప్పుడు రక్తము కారువ్రణమార్గము, చందము, తెలివి, బాల్యములోనగుదశ, ప్రయాణము.

గది—స. గద ధరించినవాఁడు, విష్ణువు, రోగి, (దే) ఇంటిలోపలి యఱ

గబ్బి—త. గర్వపోతు, ధీరుఁడు, గొప్పది, కుక్కపేరు, కపటము.

గర్భము—స. కడుపు, కడుపులోని పిండము సమూహము, కుక్రము, బీజము, సారము, బిలము, నదిమధ్యభాగము, లోనిగది, బిడ్డ పనస పండులొక్క, అగ్ని, అన్నము. కొలిమితిత్తి, ఒకానొక నాటకసంధి, ఇంటిలోపలియిల్లు.

గవురు, గారు—దే. కపటము, —బాకా, ఏనుఁగు, బల్లి, పార్వతి.

గవ్యము—స. ఆవుపాలు మొ అల్లె త్రాడు భార్య, పసువులు మేయు పొలము, ఒక రాగద్రవ్యము పసువులు.

గహనము—స. గుహ, అడవి వగ, చారశక్యముకానిది, పూర్వమీమాంసా శాస్త్రము, దుఃఖము, జలము దోషము, కష్టము.

గహ్వరము—స. అడవి కొండగుహ వగ, కపటము, ఏడ్పు, నీరు, రహస్యము, పొదరిల్లు, రంధ్రముతో గూడినది.

గాంగేయము—స. బంగారు ఉమ్మెత్త తుంగముస్త, తామరదుంప,

గాంధర్వము—స. దినసప్తమాంశము, ఒక వివాహము గుఱ్ఱము.

గాఢము—స. అధికము, లాభేచ్ఛ, లోతులేనిది, అడుగుభాగము.

గాము—త సూర్యాదిగ్రహము, పిశాచము.

గిట్ట—దే. బాణము, డెక్క, పసువుల కాలిగోరు.

గిరిజము—స శిలాజిత్తు, కాకిబంగారము, లోహము అభ్రకము, కొండ యందుఁ బుట్టినది, ఇనుము.

గిరీశుఁడు—స. శివుఁడు,హిమవంతుఁడు, బ్రహ్మ.

గుండు— దే. మగగుఱ్ఱము, పర్వతము, వగలలో పొదుగుతాయి, గుండ్రాయి, ఫిరంగిగుండు.

గుణము—స విశ్వార్యాది, నారి, దారము, ఇంద్రియము రూపరసగంధాది గుణము, సత్త్వాది సంధి విగ్రహాది, త్యాగాది, ఉపసర్జనము, సుంకము తెలుపు నలుపు మొ. త్రాడు స్వభావము, విద్య దయ, అప్రధానము.

గుణుఁడు—స. వంటవాఁడు, భీముఁడు

గుహ్యము—స. స్త్రీ పురుషుల మర్మస్థానము, రహస్యము, తాఁబేలు దాఁచఁదగినది.

గురువు—స. ఉపాధ్యాయుఁడు, తండ్రి, బృహస్పతి, కులముపెద్ద తాత, పినతండ్రి, అన్న, అలుమగల తండ్రి, పురోహితుఁడు, మేనమామ, రక్షకుఁడు నిషేక వివాహాదులు చేయించువాఁడు, వేదము చదివించు వాఁడు, బరువు ఉత్తమమైనది, అధికమైనది, రాజు, మీమాంసకుఁడు, ముసలితనము లేనిది, ఒక తాళాంగ భేదము.

గుఱి—దే. గుఱుతు, నమ్మకము, ఉపాయము, మచ్చ, హద్దు, లక్ష్యము, నిర్ణయము, దృష్టాంతము, గడువు, అభిప్రాయము, ఆఁడుగుఱి, మగగుఱి.

గుల్మము—స. బోదెలోని చెట్టు, రోగవిశేషము, సేనా విశేషము పొద, నీళ్ళరేవు సేనావరణము, రాజమార్గము, సైన్యరక్షణము, గంపు, నాభి, కోట, మొ. కుండ, గుల్మమను చేప.

గృహిణి—స. భార్య, కఱుఁదురీఁగ.

గొడ్డు—దే. సంతతిలేనిపశువు శూన్యము, గొడ్రాలు

గొబ్బిళ్ళు—దే నమస్కారము బాలికల క్రీడావిశేషము, ధనుర్మాసము నందు బాలికలు ముంగిలివాకిటనుంచు గోమయపు ముద్దలు.

గోకర్ణము— స. కణుఁజు మృగము, లొడితెడు పరిమాణము, ఆవు చెవి యాకారము గలిగి చారుమొదలైనవి వడ్డించుటకుయోగ్యమగుపాత్ర, కంచర గాడిద, పాము.

గోత్రము—స.వంశము, సంతతి, ప్రశంసింపఁదగిన జ్ఞానము మబ్బు, గొడుగు, వరిమడి, కొండ, చక్రము, భూమి, వేశ్యా గృహము, పేరు, ధనము, మార్గము అడవి, బలిమి.

గోపతి—స. ఆఁబోతు, రాజు, ఇంద్రుఁడు, దిక్పాలకుఁడు, సూర్యుఁడు, శివుఁడు, నపుంసకుఁడు, చంద్రుఁడు, నిప్పు బ్రహ్మ విష్ణువు.

గోముఖము—స. అలంకుట, మొసలి వాద్యవిశేషము, వక్రముగల గృహము, మైపూఁత, దొంగలు గోడకుపెట్టు ఒక విధమైన కన్నము, సురంగవిశేషము, ఆవుమొగము.

గోల—దే. ముగ్ధుఁడు, ముగ్ధ, ఆర్తధ్వని, కలకలము, (స) గుండ్రని నీటికాగు, చెండు, పిరా, మణిశిల, గోదావరి, దుర్గ, చెలికత్తె, మండలాకారము, అనుభవరాహిత్యము, స్త్రీ.

గోవిందుఁడు—స. కృష్ణుఁడు, గోపాలకుఁడు, బృహస్పతి, బ్రహ్మ, ఇంద్రుఁడు, రాజు,పరమాత్మ, మనస్సు మొ ఇంద్రియముల నడపు అంతర్యామి.

గోవు—స. ఆవు, కన్ను, బాణము, దిక్కు, వాక్కు, భూమి, సరస్వతి, గుఱి, చూపు ఎద్దు, స్వర్గము, కిరణము చందమామ సూర్యుఁడు, వజ్రాయుధము, యజ్ఞము, వెండ్రుక, పగ్గము, అల్లెత్రాడు, నీరు, అర్జునుఁడు, ఒకముని, తేజస్సు.

గౌరవము—స. గొప్పతనము, బరువు, మర్యాద, అర్థగాంభీర్యము.

గౌరి— స. దుర్గ, సమర్తాడనికన్యక, పదేండ్లపడుచు పసుపు నగ్నకన్య, గోరోజనము వరుణుని యిల్లాలు, ఇంగువ, నేల, రాత్రి నది, సరస్వతి, భాషాంగము.

గ్రంథి—స. కంతి కణుపు వంకర, గుంపు కౌటిల్యము, గ్రంథములు కలవాఁడు గ్రంథములు చదువువాఁడు, దగ్గ, దారపుముడి, రథాభరణము, వంకరగడియ

గ్రహము—స. సూర్యాది గ్రహము, గ్రహణము, నిర్బంధము, దయ, ఒక సంగీతాంశము, పట్టుదల, నవసంఖ్య, అనుగ్రహము, గ్రహించుట, పిశాచాదికము, ఒక యజ్ఞపాత్రము, యుద్ధ ప్రయత్నము, తొమ్మిది, తొందరపాటు, రాహుగ్రహము.

గ్రామము— స. ఊరు, సంగీత స్వర సమూహము, సంగీత స్వరము, మైథునము, సమూహము.

గ్రాసము—స. గడ్డి, ఆహారము, గ్రహణము, మ్రింగుట, గ్రహణముపట్టిన భాగము.

ఘటము—స. కుండ నారికేళపు బొంద్వ, ఏనుఁగు కుంభస్థలము, పాడునూయి, ఊపిరి లోన స్తంభించుట, శిఖరము, నీలాటిరేవు గరగ, రేవుస్థలము.

ఘటిక—స. గడియ, 24 నిమేషముల కాలము, బలపము, ఒక విద్యాసంస్థ, పాలితాయి, చీలమండబుడిపి, తెప్ప.

ఘట్టము—స. తీరము మెట్లుగలనీళ్ళరేవు, విషయము, చిక్కుగల సంగతి, కుంకము మొ. తీయుచోటు, చలింపఁజేయుట, ఒత్తిడి, వనగిరి ప్రాయదేశము, రామాయణాదులలోని ప్రశస్తమగు కథాభాగము.

ఘనము—స. తుంగముస్తె మబ్బు గొప్పది కంచుతాళముల వాద్యము, నాట్యవిశేషము శరీరము సమ్మెట, తగరము చెట్టుపైతోలు, అభ్రకము, తోడుకొన్న పెరుగు నడిమిభాగము, అగ్నిజనితమేఘము, ఏనుఁగుపాదమునఁ బుట్టుమదము, వేదపఠనమునం దొక నియమము, సమూహము కాఠిన్యము, శక్తి ఇనపదుడ్డు దట్టమైనది.

ఘనాఘనము—స. కురిసెడుమేఘము, మదపుటేనుఁగు, ఒరపిడి, పర్వతము, సంపద, కవాటము, దట్టము.

ఘర్ఘరము—స. గుడ్లగూబ, వాకిలి, ధ్వని, కదలుచున్న నీటిమోత, ఒక వదము, హాస్యము, ఊఁకవిప్పు, తెర, నవ్వు, ఆనందము కొండదారి, ఉలుము.

ఘర్మము—స. ఎండ, వేడిమి, చెమట, ఏమి గులకు లోమ్ముకుఁబుట్టుమదము, దినము, ఆవిరి, గ్రీష్మర్తువు.

ఘాతము—స. బాఁము దెబ్బ హత్య, శక్తి, గణితమంద లబ్ధము, నలుచదరపు గుంట, దోపిడి సైధ. తార, అశుభము, కోసేరు.

ఘోషము—స. గొల్లపల్లె, గోసమూహము ఉలుము వదంతి ఇంచు ఎలుక అక్షరోచ్చారణ బాహ్యప్రయత్నము, దోమ.

చండి—స. పార్వతి కోపముగలది, ప్రేమగలది, చంపునట్టి స్త్రీ.

చక్రము—స. ఆయుధవిశేషము, నీటిసుడి తూము, కయ్యము, లోహము, ధనము, శలయాకార వ్యూహము, బండికల్లు గుంపు, దండు, రాష్ట్రము, కుమ్మరి సారె, రాజ్యము, గానుగ, సాలిగ్రామ చిహ్నము, చక్రవాక పక్షి, గ్రామసమూహము.

చపల—స. మెఱపు, లక్ష్మి అంకుటాలు, పిప్పలి, ఒక వృత్తము, పర్వతజనితమైన శిఒకానొకధాతువు, ఒకానొక కంద.

చపలము—స. కోఁతి, చలువతాయి, చోరక మను గంధద్రవ్యము, కామంచి గడ్డి, శీఘ్రము, కదలునది, నిలుకడలేనిది, వడికలఁది, పాదరసము, చేప, క్షణము, జొట్టు.

చరణము—స. భుజించుట, తిరుగుట,

సద్వర్తనము, విష్ణుచక్రము, కాంతి, ముంగిలి, పాదము, వేరు సంస్కారముచేసిన నేల కులము, వేదభాగము, చర్చ.

చికురము—స వెంట్రుక, కొండ, పాము బల్లి ముంగిస, చుంచెలుక, కదలునది, చలించునది, ఒకవృక్షము.

చిక్కు—దే. కృశించు, నశించు మెలిక, సందేహము, తక్కు, తగులు దొంతు, మిగులు సంకటము, మెలి.

చిత్రము—స. చిత్తరువు, అనేకవర్ణములు కలది తిలకము, మనోహరము, పదచమత్కారము, ఆశ్చర్యము, పాము, అదృశ్యరసము, ఆట, ఆకసము ఒక కుష్ఠరోగము, ఒక కావ్యము, అలంకార భేదము.

చిత్రభానువు—స సూర్యుఁడు, అగ్ని.

చిలుకు—దే చిందు, ప్రసరించు మీఁటు, ఊఁటు సన్నగావర్షించు, చల్లు, తలుపుగొండెము, త్రచ్చు బాణము కొలికి, నాగెరుయొక్క పైభాగము.

చెఱఁగు—దే కొంగు, అంచు, దిక్కు

చెలువు—దే. అందము, విధము, మనోహరము.

చే—త. హస్తము, తొండము, అధీనము, తృతీయావిభక్తిప్రత్యయము.

చేలము—దే. గడ్డ, వస్త్రము, సెవిలి (ఫింఛపు) కన్ను, పిరుదె లేవి, అధరము.

చైత్యము—స. గుడి, భవనము, సభ, జ్ఞానము, శిశువు సొద, బౌద్ధాలయము, రచ్చచెట్టు, యాగశాల.

చాలు—దే. ధార, సవృద్ధి దున్నుసమయమున నాఁగటిచాలుచే నేర్పడిన రేఖ, ఓపు, సంవత్సరము, వరుస

చుక్క—త. శుక్రుఁడు, నక్షత్రము, బొట్టు, నీరు మొదలైన ద్రవపదార్థముల బిందువు, పుల్లప్రబ్బలి.

చుట్టు—దే. నాలుగు ప్రక్కలను, కాలియుంగరము చుట్టుగాఁజుట్టు, చుట్టుదారి.

చొక్కు—దే పరవశమగు, మూర్ఛ, మత్తుమందు, మోహము ఎండినది, నాయికా నాయకుల ప్రేమ

ఛందస్సు—స పద్యము, వేదము, ఇచ్ఛ స్వేచ్ఛాసంచారము, ఊరడించుట, ఒక శాస్త్రము.

ఛత్రభంగము— స. రాజ్యనాశము, అస్వాతంత్ర్యము, రాజాజ్ఞనతిక్రమించుట, వైధవ్యము, ప్రభునాశనము, స్వేచ్ఛ.

ఛవి—స. కాంతి, రంగు, చర్మము, కిరణము.

ఛాయ— స. నీడ, ప్రతిబింబము, సూర్యుని భార్య, కొంచెము, కాంతి, చీకటి, వరుస, పరిపాలనము, మైపూతగల శరీరము, పార్వతి, పోలిక, లంచము, జాడ.

జంబువు—స నేరేడుపండు, ఒక నది నక్క, ఒక ద్వీపము.

జఘనము—స. మడికట్టు, మొల, పిఱుఁదు, తప్పు, స్త్రీలక్షణాంగము లలో నొకటి.

జఘన్యము—స. మగగుఱి, తోఁక, గొరిసె, వెనుకటిది, దూఱఁదగినది.

జన్యము—స యుద్ధము, వీధిజగడము, జనహితము, అంగడి, నింద, దేశము, దేహము, జాతి, పుట్టుక.

జయ—స. దుర్గ, పార్వతి, చెలికత్తె, అష్టమి, తదియ, త్రయోదశి, కరక, నెల్లి, అరఁటి, పోమెద, బౌద్ధదేవి, ఒక సంవత్సరము, ఒక దీవన.

జయంతుఁడు—స. ఇంద్రుని కొడుకు, కాకాసురుఁడు, భీముఁడు, శివుఁడు, చంద్రుఁడు, కుమారస్వామి.

జలము—స. నీరు, జడము, కురువేరు, ఎఱ్ఱతామర, ఎఱ్ఱకలువ, మూత్రము.

జాంబూనదము—స. బంగారము, ఉమ్మెత్తచెట్టు.

జాతి—స. వర్ణము, ఛందస్సు, సంతానము, తనకు విరుద్ధమైనమాట, అలంకారము, పుట్టుక, సామాన్యము, జాజికాయ, ప్రాయ్యి, దినుసు, ఉసిరిక, మాలతి, ఇంగిలీకము.

జాలము—స. కిటికి, జల్లిమాత్రము, వల సమూహము, మొగ్గ, కపటము, మాయ, కడపచెట్టు.

జిక్క—దే. గట్టము, తిరుగలి.

జినుఁడు—స. బుద్ధదేవుఁడు, విష్ణువు, పూజ్యుఁడు, ముసలివాఁడు, జయించువాఁడు.

జీబు—దే. కోక, పీఁచు, దట్టము, చౌరకర్మముకానిది. సమూహము, అడవి, జేబు.

జీమూతము—స. మబ్బు, కొండ, ఏనుఁగు, సంపదలిచ్చునది, దేవతాశము, చేఁతబీర.

జీవము—స. ప్రాణము, పరమాత్మస్వరూపము, తత్త్వము, బ్రతుకు, బ్రతుకుతెరువు, జంతువు.

జీవనము—స. బ్రతుకు, బ్రతుకుతెరువు, ప్రాణము, నీరు, నేయి, వెన్న, గాలి, మజ్జ.

జైవాతృకుఁడు—స. చంద్రుఁడు, వైద్యుఁడు, కృషీవలుఁడు, కొడుకు, బక్కవాఁడు, చిరజీవి.

జ్ఞాతి—స. సమానగోత్రుఁడు, దాయాదుఁడు, జనకుఁడు.

జ్ఞాని—స. జోస్యుఁడు, జ్ఞానము కలవాఁడు, కోడి

జ్యా—స. వింటిత్రాడు, తల్లి, భూమి.

జ్యాని—స. హాని, వృద్ధత్వము, పాతవడుట, నది.

జ్యేష్ఠ—స. బల్లి, పెద్దది, దరిద్రము, మేలిమి, మిగుల ముసలితనము, హంస, పెద్దమ్మ, ఒక నెల, ఒక నక్షత్రము

జ్యోతి—స. ప్రకాశము, ధనము, కొడుకు, చంద్రుఁడు, ఒక దేవ వృక్షము, జ్యోతిశ్శాస్త్రము, దేవలోకము, నక్షత్రము, సూర్యుఁడు, అగ్ని, కన్ను.

జడ—త. పెంద్రుకలయల్లిక, గంజాయి, జాలు.

జోరు—దే. పాడ్యము, సౌందర్యము, జత, విధము, ఉత్సాహము, మొత్తము, స్వాధీనము, తగినది, అధికము, స్వరూపము

ఝూరు—స. సెలయేఱు, వాగాడంబరము, కోపము, అందము, తేళ్ళపుట్ట.

టంకము—స. వెలిగారము, కోపము, కత్తిమొర, మోకాలు, స్తంభమధ్య ప్రదేశము, పిక్క, తొలుమలచు ఉలి, గద్దలి గడ్డపాఱ, నల్లమామిడి, గర్వము నల్లవెలగ.

టెంకి—దే. గృహము, స్థానము, చెలువ, తాటియాకులకు బెజ్జము వేయు సాధనము.

డం(బు)బము—త. పటాటోపము, ప్రతిష్ఠ, గర్వము, కపటము, విధము, గవ్వ, ధనము, అసత్యము, 4 పైసలు.

డింబము—స. డమరము, పక్షిగ్రుడ్డు, భయము, ఊపిరితిత్తి, ఆముదపు చెట్టు, కలకలము, మొగ్గ, పూగుత్తి.

డింభము—స. శిశువు, ఆడంబరము, అజ్ఞాని.

తంత్రము — తంతు, స్వరాష్ట్ర చింత, హేతువు, ప్రధానము, సిద్ధాంతము, ఔషధము, యజ్ఞప్రయోగము, శాస్త్రము, సైన్యము, మగ్గము, నూలి పడుగు, కుటుంబవ్యాపారము, వ్యాకరణశాస్త్రము.

తగవు—దే. న్యాయము, జగడము, తగినది, తీర్పు, మేలు, పద్ధతి, వ్యాజ్యము, శుభములందు కుమార్తెకిచ్చుబహుమతి.

తటము—స. ఒడ్డు, వరిమడి, పల్లము, దిగంతము, కొండచరియ, స్థలము, పాలము.

తడవు—దే. వెదకు, ప్రస్తావముచేయు, రక్షించు, నిమురు, ఆలస్యము, సంపాదించు, తాకు, తలఁచు, తిట్టు, వచించు, కొనియాడు, కాలము, చిరకాలము.

తత్త్వము—స. యథార్థస్థితి, పరమాత్మ, హృదయము, స్వభావము, వస్తువు, ఆలస్యముగా చేయఁబడు నృత్యాదులు, ఇరువదియైదు, ఆకారము, ఒకవాద్యము, సారాంశము.

తపము—స. వేసవి, ఒకలోకము, శిశిరఋతువు, మాఘమాసము, తపస్సు, పక్షి, జ్వరము, ధర్మము, చాంద్రాయణవ్రతము, వేడిమి, అగ్ని, ఒక కల్పము.

తమము—స. చీఁకటి, దుఃఖము, రాహువు, తమోగుణము, దైన్యము, మోహము, చిహ్నము, తక్షస్థలము, ధూళి, స్త్రీరజస్సు, పాపము, అజ్ఞానము, నరకము.

తమి—స. రాత్రి, చీఁకటి, పసపు దే. త్వర, వేడుక ఆసక్తి పారవశ్యము మోహము.

తమోఘ్నుఁడు — స నిప్పు, సూర్యుఁడు చంద్రుఁడు, బుద్ధుఁడు, శివుఁడు, విష్ణువు.

తరణి—స. ఓడ, దాటుట, సూర్యుఁడు ఏడు కిరణము రాగి సముద్రము, పిన్నగోరంట, చేమంతి

తరము—దే. పురుషాంతరము, తెగ, పద్ధతి, పోలిక, సామ్యము, మానము శక్యము, దినుసు వరుస, (స) దాటుట, పడవ, పడవకోవు నిప్పు చెట్టు, వడి, బలము.

తరి—స. ఓడ పొగ, మబ్బు, అవస్థ, భూమి, బట్టలపెట్టె, (దే) కవ్వము సమయము మథనము, ఓడతెడ్డు.

తరీషము—స సముద్రము స్వర్గము, పని, వృత్తి అలంకారము వ్యవసాయము, సరుకు, సంవత్సరము, ఏడు పిడక, పడవ.

తర్కము — స. ఊహ, కారణము, కోరిక ఒకశాస్త్రము, అధ్యాహారము, కర్మ వాదము, అక్క, సందేహముతోఁ గూడిన యూహ.

తటి—దే. సమయము. సమీపము, త్రాడు మొ॥ వాని యొత్తుడురేఖ, అల.

తల—దే శిరస్సు కేశములు, పూనిక, కొన, ఎత్తు, ధీరత్వము, ముందుభాగము, మొత్తము మొదలు, వ్యవహారము కాలము గుంపు, స్థానము, పక్షము.

తలము—స. అడవి, చల్లనిది, గుంట, చాఁచినవ్రేళ్లుగల అరచేయి, చేయి గోధ రూపము పసుపు చెంపదెబ్బ జేవ బాణములు తగులకుండ చేతికి తొడుగుకొను ఉడుముతోలు, కారణము స్వరూపము, పాతాళము, క్రిందిభాగము కాలంసేతుల క్రింది భాగము తాడిచెట్టు, సమప్రదేశము, కత్తిపిడి

తలిమము—శ. దూదిపఱుపు, మేలుకట్టు ఖాతికట్టినపు నేల, మహో హారము సమూహము వ్యాసవు భూమి కత్తి.

తల్పము—స. పఱుపు, భార్య మేడ వెనుకటియిల్లు కోటకత్తళముపై కట్టినగృహము ఒక పడక అన్నము, ఓడముందరిభాగము సమురము.

తాఁకు—దే. యుద్ధమునకు డీకొను, కృశించు, విసువు గాయము అంటు.

తాత—ః దయ, తండ్రి (త) బ్రహ్మ (దే) తండ్రితండ్రి బ్రహ్మ, అధికుఁడు, తల్లితండ్రి.

తామరసము—స. బంగారము ఉమ్మెత్త, రాగి తామర.

తామసము— స. తమోగుణముకలది, అంధకారముకలది, అంధకారసంబంధమైనది గుడ్లగూబ, కోపము పాము, అజ్ఞానము ఆలస్యము, దుష్టము, చీఁకటి

**తామసి**—స. చీఁకటి, పార్వతి, పాము, దుర్మార్గుఁడు నిద్ర, ఒక నరకము, క్రోధి, కటిక చీఁకటిగల రాత్రి

**తార**—స. వాలిభార్య, బృహస్పతి భార్య నక్షత్రము, కంటి నల్లగ్రుడ్డు, బుద్ధనిభార్య, సుగ్రీవుని భార్య, ఓంకారము.

**తారకము**—స. కన్ను, నక్షత్రము, కంటి నల్లగ్రుడ్డు ఓంకారము, కంటిపాప, ముత్యము, తరిఁపఁజేయునది, తెప్ప.

**తారము**—స. వెండి నదియొడ్డు నక్షత్రము, కంటిపాప, మ్రోఁత, పులుగడిగిన ముత్యము.

**తార్క్ష్యుఁడు**—స. విష్ణువు, గరుత్మంతుఁడు, అనూరుఁడు.

**తాలము**—స. తాడిచెట్టు, అఱచేయి, చప్పట, జేన, తగరము, కంచుతోఁ జేసిన వాద్యపుచిప్ప బీగము కత్తిపిడి, ఒక వాయిద్యపుకుండ, కదలిక, హరిదళము, ఇల్లు యక్షధూపము.

**తావలము**—దే. ఆధారము, అవకాశము, సామ్యము, స్థిరమైనది, స్థానము, గృహము, రక్షకము.

**తాళకము**—స. హరితాళము, పర్వత ధాతువిశేషము, తొగరిమన్ను, తాళక భస్మము, చిన్నబీగము.

**తిన్న**—దే. మనోహరము, యుక్తము, ఋజువు, స్వస్థము, సౌమ్యము.

**తిరుగు**—దే. తిరుగుట, అపజయము పరిభ్రమించు, పరివేష్టించు.

**తిలకము**—స. ఒకచెట్టు, బొట్టు, నల్ల గుఱ్ఱము, ఒక రోగము కుడిప్రక్కనుండు మాంసఖండము, సౌభాగ్యమను లక్షణము, పుట్టుమచ్చ శ్రేష్ఠము.

**తీక్ష్ణము**—స. తీంద్రము, విషము ఇందుప్పు యుద్ధము గాజుప్పు, కారము, మిరియము మరణము, ఆయుధము, నిప్పు, ఇనుము, వాడియైనది, చుఱుకైనది.

**తీరము**—స. దఱి, తగరము.

**తీర్థము**—స. పుణ్యోదకము, పుణ్యనది, ఘట్టము, నూతివద్ద నుండెడుతొట్టి, పుణ్యక్షేత్రము, జలము, యజ్ఞము, శాస్త్రము, పాత్రము, ఉపాయము, యోని, పుణ్యవనము, స్త్రీ రజస్సు, ఉపాధ్యాయుఁడు, మార్గము, మంత్రి, ఆధారము, అజ్ఞ.

**తీవరుఁడు**—స. చేఁపలు బట్టువాఁడు, సముద్రుఁడు, వేటకాఁడు.

**తీవ్రము**—స. అధికము, మిక్కిలివేఁడి కలది, చేదు కలది, కష్టము, విశాలమైనది, భయదము, కారముకలది.

**తుంగము**—స. కొండ, శిఖరము, ఖడ్గమృగము. ముఖ్యము, పొడవైనది, పొన్నచెట్టు, కొబ్బరి.

**తుండము**—స. తొండము, పక్షిముక్కు, నోరు గజహస్తము, మొగము, పందిమూతి.

తూఁగు—దే. ఊఁగు, నడచు, కూరుకు, చలించు.

తూలము—స. గింగరావిచెట్టు, దూది, ఆకాశము.

తూలిక—స. చిన్న ఈఁక, వత్తి, మూస, కలము, చిత్తరువు వ్రాసెడు సాధనవిశేషము, దూదిపఱుపు.

తెగ—దే. గుంపు, పక్షము, ప్రక్క, అల్లెత్రాడు, జాతి, రీతి, పొడవు, ఖండితముగా, నిశ్శేషముగా.

తెట్టు—త. తేనెపెర, తృణకాష్ఠాది భారము, రాసి.

తెరలు—దే. తొలఁగు, బయలుదేరు, కలఁగు, చచ్చు, సలసలమరగు, అభిప్రాయభేదము.

తెలివి—దే. దేహాత్మాది భేదజ్ఞానము, ప్రకాశము వివేకము, వికాసము, కాంతి, ప్రసన్నత, నిదురలేచుట, తెలుపు.

తెల్లనిదొర—శివుఁడు, బలరాముఁడు.

తేజము—స. ప్రకాశము, పరాక్రమము, ప్రభావము, వేఁడి, జ్వాలయొక్క అగ్రము, పంచభూతములలో నొకటి, బలము, అందము, ధైర్యము, సారము, అగ్ని, అశ్వగమనవేగము, విత్తము, బంగారము, మెదడు, వీర్యము, అన్నము, పందికోఱ, వెన్న, నీరు, ధర్మము, ఆతురత.

తేట—దే. నిర్మలము, ప్రసన్నము, విధము, విశదము, సౌందర్యము, నీరుమజ్జిగ.

తేలు—దే. నీటిపైసంచరించు, నీళ్లలో క్రీడించు, స్నానముచేయు, మోసపోవు, ఆనందించు, మైమఱచు, పొడచూపు, వృశ్చికము.

తొలి—దే. పూర్వము, తొఱ్ఱి, రంధ్రము.

తోఁపు—దే. ఎఱుపు, ఉపవనము, చీమిడి, వస్త్రము, ఎఱ్ఱబట్ట, వ్యక్తమగు, జనించు, సంకల్పము, ఆలోచన, చెట్లగుంపు, బూరెలతోఁపు.

తోయము—దే. విధము, తడవ, పరివారము, సమయము, వింతవస్తువు. (స) పూర్వాషాఢ, ఉదకము.

తోరణము—స. బహిర్ద్వారము, మామిడాకులదండ, కంఠము, బారు.

తోరము—వై. వ్రతసూత్రము, అధికము, బలిష్ఠము, స్థూలము, మంజులము, సౌందర్యము.

త్రపువు—స. తగరము, సీసము.

త్రయి—స. ఋక్సామయజుస్సమూహము, దుర్గ, ఒకవిద్య, మూఁటిసమూహము, మంచిమనస్సుగల యాఁడుది.

త్రాడు—దే. పేనినదారము, కిరణము, పాశము, మంగళసూత్రము.

త్రిధాముఁడు—స. అగ్ని, విష్ణువు, శివుఁడు, యముఁడు, వ్యాసుఁడు, విఘ్నేశ్వరుఁడు.

త్రుటి—స. కొంచెము, అల్పకాలము, పొరబాటు, సంశయము.

దంట—దే. నేర్పరి, జంట, ప్రౌఢస్త్రీ.

దండ—దే. సమీపము, ప్రాపు, ప్రక్క, (త) బాహువు, హారము.

దండకము—స. వృత్తవిశేషము, చెట్టు, బోదె, మహారాష్ట్రము, శిక్షించునది, మాయ, విస్తారము, ముత్యాలహారపు పేట, దూలము, అరణ్యవిశేషము.

దండము—స. చతురుపాయములలో నొకటి, దుడ్డు, ఒక వ్యూహము, ఒక గ్రహము, చిలుక, పూలదండ, ఒడలు, మూల, శిక్ష, కవ్వము, గర్వము, బార, దండుగ, గుఱ్ఱము, వధము, సమూహము, కప్పము, జతి, దండు, పీడనము, తోఁకతెగిన ఎద్దు, జొన్నలోనగు నొక కఱ్ఱ.

దండి—స. ఒక కవి, పిండమును పట్టినరోగము, తెలగపిండి, పట్టణము, దండముగలవాఁడు, ద్వారపాలకుఁడు, యముఁడు, (దే) శౌర్యము, అధికము, సమృద్ధి, ప్రతాపము.

దంతము—స. పల్లు, పొదరిల్లు, ఏనుఁగుదంతము, కొండనడుము, ముప్పదిరెండు, కొండదరియ, కోఱ, పొడవుతాయి.

దంభము—స. డంబము, మోసము, గర్వము, దుర్మార్గము, పాపము, మిష, వజ్రాయుధము.

దంశము—స. అడవియీఁగ, ఒక దోమ, దున్నపోతు, ములగచెట్టు యుద్ధమునకు సన్నద్ధమగుట, కాటు, కవచము, దోషము, ఖండించుట.



దక్షిణము—స. కుడిదిక్కు, మర్యాద కలది, దానముతరువాత నిచ్చెడు దక్షిణ, నేర్పుకలది, మనోహరమైనది.

దక్షుఁడు—స. ఒకబ్రహ్మ, ఒకానొక ముని, శరీరముదాచరిబంటు, శివుఁడు, సమర్థుఁడు, నేర్పరి, నవబ్రహ్మలలో నొక బ్రహ్మ.

దబ్బిలి—దే. ధూర్తుఁడు, ?గడను, బాధ.

దబ్బ—దే. చెప్పు, అబద్ధము, మూర్ఖుఁడు, వచనము, చఱచుటలో నగు వాని ధ్వన్యనుకరణము.

దమము—స. ఓర్పు, బురద, దండో పాయము, ఇంద్రియనిగ్రహము.

దయ్యము-దే. పిశాచము, దేవుఁడు, విధి.

దరము—స. భయము, శంఖము, గుంట, చీమలపుట్ట, ఇంచుక.

దరి—స. గుహ, గట్టు, (దే) దగ్గఱ, మేఱ.

దర్వి—స. చిన్నగరిటె, పాముపడగ.

దర్శనము—స. చూపు, అద్దము, ధర్మము, శాస్త్రము, తెలివి, కానుక, సాక్షాత్కారము, రంగు, జన్నము, కల, దశ లేక ద్వాదశావస్థలలో నొకటి.

దవము—స. దావాగ్ని, రోగము, అగ్ని, గుఱ్ఱము, అడవి.

దశ—స. అవస్థ, ప్రభుత్వము, వత్తి, అదృష్టము, పంక్తి, జీవితకాలము,

స్థితి, మనస్సు, వస్త్రపుటంచు.

దహనము—స. కాల్చుట, దుర్వ్యాపారము, పులికడుగు, త్రిసంఖ్య, పావురము, కృత్తిక, జీడి, నిప్పు, చిత్రమూలము.

దళము—స. ఆకు, సేన, కత్తియొఱ, తునుక, గొప్పతనము, భాగము, గోరు, సగము, చీఁకటిచెట్టు ఆకు, భాగ్యము, హరిదళము, అధికము, చట్టము, (దే) ఎక్కువ, గుంపు సమృద్ధము, సాంద్రము, చిక్కనిది.

దాక్షాయణి—స. అశ్విన్యాది నక్షత్రము, భూమి, పార్వతి.

దాక్షిణ్యము—స. మొగమోటము, దయ, నీతి, ఐకమత్యము, నేర్పు.

దాత్యూహము—స. కూకురుగుండఁగి పిట్ట, వానకోయిల, మబ్బు, భరత పక్షి.

దానము—స. వితరణము, ఏనుఁగు, కపోలమందలి మదము, రక్షణము, పరిపాలనము, ఛేదనము, శుద్ధి, చతురుపాయములలో నొకటి.

దాపు—దే. భయము, దగ్గఱ, చెక్కు.

దాయము—స. తండ్రిసొత్తు, దానము, అరణము, కట్నము, భిక్షము, ఛేదనము, ఎత్తిపొడుపుమాట, నిర్మలత్వము, బహుమానము, భాగము, తావు, నష్టము, అంచము, దే. గవ్వలాట, ఆపద, పాచికలయందలి పందెము.

దాయాదుఁడు—స. సగోత్రుఁడు, జ్ఞాతి, కుమారుఁడు.

దార—స. అగ్ని సాక్షిగా వివాహమాడిన పెండ్లాము, (వి) వితరణము, కత్తియంచు, నీటిచాలు, క్రమము.

దారకుఁడు—స. బాలకుఁడు, కొమరుఁడు, మిత్రభేదము చేయువాఁడు, కృష్ణసారథి, చీల్చువాఁడు.

దారదము—స. విషభేదము, పాదరసము, ఇంగువ, సముద్రము, వసనాభి, సింధుదేశము, హింగుళము.

దాసి—స. పనిచేయుట కేర్పాటైనది, కాకిదొండ, నల్లగోరంట, మహాదానములు 16 లో నొకటి, ఐశ్వర్యములు 8 లో నొకటి, కొన్నదాసి.

దాసుఁడు—స. సేవకుఁడు, దాసరాజు, దానార్హుఁడు, శూద్రుఁడు, చేఁపలు పట్టు జాలరి, జ్ఞాని.

దివ్యము—స. లవంగము, అందమైనది, శ్రేష్ఠము, ఆశ్చర్యకరము, సాంబ్రాణి, ఆకాశము, చందనము, స్వర్గమునఁ బుట్టినది, ధామ.

దీపకము—స. వాము, జీలకఱ్ఱ, దీపము, ఒక రాగము, ఒక అర్థాలంకారము, కుంకుమ, డేగ.

దీర్ఘదర్శి—స. విద్వాంసుఁడు, ఎలుఁగుబంటి, గద్ద, దూరపుయోచన కల వాఁడు.

దీర్ఘాయువు—స. కాకి, మార్కండేయుఁడు, బూరుగుచెట్టు, చిరజీవి, జీవకమను గంధద్రవ్యము.

దుందుభి—స. పాచికయందలియిత్తిగ,

భేరి, వరుణుఁడు, కోమటి, శూద్రుఁడు, ఒక సంవత్సరము, ఒక రాక్షసుఁడు.

దుడుకు—దే. తప్పు, తొందరపాటు, గర్వము, దుష్టము.

దుడ్డు—దే. లావుకఱ్ఱ, గుదియ, ధనము, మోటుకాఁడు, బండ.

దూరదర్శి—స. విద్వాంసుఁడు, దూరాలోచన కలవాఁడు, గ్రద్ద.

దృష్టాంతము—స. ఉదాహరణము, శాస్త్రము, మరణము, ఒక అర్థాలంకారము, నిదర్శనము.

దెప్పరము—దే. ఆపద, ఆశ్చర్యము, గుప్పాహవచనము, దుర్లభము, దుస్సహము

దేవమణి—స. కౌస్తుభము, గుఱ్ఱపు మెడయందలి సుడి, సూర్యుఁడు, దేవతలలో గొప్పవాఁడు, చింతామణి యను రత్నము, శివుఁడు.

దొర-దే. రాజు, సైనికుఁడు, సమానుఁడు, పద్మనాయకుఁడు, ప్రారంభము, ఐరోపాదేశస్థుఁడు, గొప్పవాఁడు.

దోనియ—దే. పడవ, పాలెవాఁడు, చాఁపుచుట్టుడు మ్రాను, జలగడుగు వాని సాధనము.

దోహదము–స. ఎరువు, ఇచ్ఛ, గర్భిణికిఁ గల కోర్కి, గర్భము, వృక్షాగముల కకాలమున బుష్పఫలను బుట్టించు స్త్రీల పాదతాడనాదిక్రియ, వృక్షాభివృద్ధిని గలుపు శాస్త్రము.

ద్రవము—స. రసము, పరుగు, తడి, పరిహాసము, నీరు, స్త్రీ పురుష మనోరంజకమగు ఆట, గమనము.

ద్రవ్యము—స. ధనము, ఇత్తడి, పూఁత, లక్క, కల్లు, మందబుద్ధి, శుభమైనది, ఔషధము, పృథివ్యాది, నవద్రవ్యములు, వినయము, వృక్షవికారము, గుణవంతమైనది, అణఁకువ.

ద్రవిణము—స. ధనము, బంగారు, శౌర్యము.

ద్రుణము—స. కత్తి, ఒకరకము, తుమ్మెద, వృశ్చికము, విల్లు, వింటినారి, ద్రోణాచార్యుని విల్లు, అమ్ములపొది.

ద్రుతము—స. త్వరితము, కరగించిన ఘృతసువర్ణాదులు, పిల్లి, వృక్షము, లీనము, వకారము, చీలినది, వడిగలది.

ద్రోణము—స. రథము, తూము, తుమ్మికూర, తేలు, విల్లు, ద్రోణుని విల్లు, నాలుగు తూముల పరిమాణము, అరచేటెడు, విషము, ఒక దేశము, మాలకాకి, జలాశయము, ఒక కొండ.

ద్రోణి—స. చిన్నయోడ. జెట్టి, అశ్వత్థాముఁడు, పశువుల మేతగల భూమి, కొండపల్లము, దొన్నె, నీలిచెట్టు.

ద్వంద్వము—స. స్త్రీ పురుషులజంట, ఒకరితో నొకరుచేయు యుద్ధము, రెండు, వివాదము, పొలిమేర, ఎల్ల, వాక్యము, యజ్ఞపాత్రము, ప్రయోజనము, మిథునరాశి, కోట, ఒకరోగము,

రహస్యము, సందేహము, ఒకమాసము, శీతోష్ణములు.

ద్విజ—స. గంటుబారంకి, పక్షి, పల్లు, పాము.

ద్విజన్ముఁడు—స. బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు

ద్విజము—స. పక్షి పాము, దంతము.

ద్విజరాజు—స. చంద్రుఁడు, శేషుఁడు, గరుత్మంతుఁడు.

ద్వీపి—స. పులి, చిఱుతపులి, సముద్రము, నదము.

ద్వైమాతురుఁడు—స. గణపతి, జరాసంధుఁడు.

ధనంజయుఁడు—స అర్జునుఁడు, అగ్నిహోత్రుఁడు, ఇంద్రుఁడు, మేఘుఁడు.

ధనంజయము—స. ఒకపాము, ఒక ఉపవాయువు, మబ్బు, ఎఱ్ఱమద్ది.

ధనము—స. విత్తము, గోసమూహము, ప్రేమాస్పదమగు వస్తువు, వడ్డీ కాక అసలు, ధ్వని, సంకలనపు గుఱుతు, దోఁచుకొనిన డబ్బు, ఆస్తి, ధనియము, ధనిష్ఠానక్షత్రము.

ధనికుఁడు—స. విత్తము గలవాఁడు, వర్తకుఁడు, అప్పిచ్చువాఁడు, భర్త, సత్పురుషుఁడు.

ధన్వంతరి—స దేవవైద్యుఁడు, మహేశ్వరుఁడు, సూర్యుఁడు, నారింజచెట్టు.

ధన్వి—స అర్జునుఁడు, ఏఱుమద్దిచెట్టు, నేర్పరి, విలుకాఁడు, సైనికుఁడు, సమర్థుఁడు

ధమని—స సరము, మెడ, అగసాలెవాని గొట్టము, పసుపు, ఒక గంధద్రవ్యము, శుద్ధరక్తవాహిని.

ధమనుఁడు—స. కొలిమితిత్తి నూఁదువాఁడు, అగ్ని, క్రూరుఁడు.

ధరణీధరుఁడు—స. శ్రీ మహావిష్ణువు, ఆదిశేషుఁడు, శివుఁడు, భూపాలుఁడు.

ధర్మము—స. పుణ్యము, స్వభావము, న్యాయము, ఆచారము, సామ్యము, అహింస ఎద్దు, అదృష్టము, వేదోక్తవిధి నీతి, సత్కార్యము, యజ్ఞము, విల్లు, ఉపనిషత్తు.

ధర్మరాజు—స. యుధిష్ఠిరుఁడు, బుద్ధదేవుఁడు, మన్మథుఁడు, కృషీవలుఁడు, యముఁడు

ధర—స. పృథ్వి, మెదడు, సంహారము, స్త్రీగర్భాశయము, ఒకఛందోవృత్తము.

ధాటి—స. దండయాత్ర, ముట్టడి వేయుట, ధైర్యము, శక్తి, యుద్ధము.

ధాత—స. బ్రహ్మ, రక్షించువాఁడు, ౧౦ సంవత్సరము ధరించువాఁడు, విష్ణువు, శివుఁడు, ఆత్మ, త్రాగువాఁడు, ఒక సూర్యుఁడు, ఒక వాయువు.

ధాతువు—స. వాతము లోనగునది, రసము లోనగునది, గైరిక, ఎముక, శ్లేష్మాదులు, సంగీతము, సప్తసంఖ్య, ఆకాశము, ఇనుము, బంగారము, స్వభావము, ధనము, తేజస్సు, నాడి,

భూధాతువు, త్వక్కు మొదలగునవి, పృథ్వి మొదలగునవి.

ధాతువాదము—స. రసవాదము, వ్యాకరణశాస్త్రము.

ధాత్రి—స. నేల, తల్లి, దాది, ధరించునది, ఉసిరిక, ధరింపఁజేయునది.

ధామము—స. గృహము, స్థానము, ప్రకాశము, పట్టణము, ప్రభావము, సుఖము, అన్నము, ధనము, గుంపు, గుఱ్ఱు, ఆకసము, ప్రతాపము, తినుట, శరీరము, జన్మము.

ధార—స. నీటిచాలు, కత్తిపదను, పాత్రముందలి చిల్లి, అశ్వగమనము, ప్రవాహము, పరంపర, వానకాలువ, సేనాగ్రభాగము, ఒకనగరము, బండికన్ను, వానముసురు, మేలిమి, గుంపు, యశస్సు, మాట, కింవదంతి, సామ్యము, ఆరోహించుట కిశక్యమైన పర్వతాగ్రము, ఒకదేశము, తోట.

ధావనము—స. పరుగెత్తుట, పరిశుద్ధము, ఉతుకుట, తోముట, ప్రవహించుట.

ధిష్ణ్యము— స. గృహము, బలము, నక్షత్రము, అగ్ని, మొదటిది, నాల్గవది, చోటు.

ధీమంతుఁడు—స. పండితుఁడు, బృహస్పతి, బుద్ధిమంతుఁడు.

ధూమకేతువు—స. అగ్ని, ఉత్పాతము, తోకచుక్క.

ధూసరము—స. బూడిదరంగు, పావురము, లొట్టియు, గాడిద, బూడిదరంగు గలది.

ధృతరాష్ట్రుఁడు—స. దుర్యోధనుని తండ్రి, రాజు, ఒకగంధర్వుఁడు, సర్పవిశేషము.

ధృతి—స. ధరించుట, గ్రహించుట, నిశ్చలత్వము, సౌఖ్యము, జన్మము, సంతోషము, ఒక గ్రహయోగము, ద్రావకము, ధీరత్వము, ఒక ఛందస్సు.

ధేనుక—స. లేఁగటియావు, ఆఁడేనుఁగు, పార్వతి, ఈనినయేనుఁగు, ప్రసవించిన స్త్రీ, ఆఁడుగుఱ్ఱము, చిన్నకత్తి.

ధ్రువము—స. ఊహ, మఱ్ఱిచెట్టు, మోడు, నిశ్చయము, గసిక, మేకు, యజ్ఞపాత్రము, సారచెట్టు, పర్వతము, గుఱ్ఱపుసుడి, బాతు, ఒక నక్షత్రము, గ్రహయోగవిశేషము, ఎడతెగనిది, తాళవిశేషము, కదలనిది.

ధ్రువుఁడు—స. నక్షత్రవిశేషము, ఒక వసువు, బ్రహ్మ, విష్ణువు, శివుఁడు.

ధ్వజము—స. టెక్కెము, గుఱుతు, మగమణి, మంచపుకోడు, చెట్టు, మద్యవిక్రయశాల చిహ్నము, గర్వము, ధ్వజస్తంభము.

ధ్వని—స. శబ్దము, వ్యంగ్యప్రధానపదము, కావ్యస్వరూపము.

నంగనాచి—దే. దిట్టతనము గలిగియు లేనట్లు నటించునది, వడ్లచిలుక.

నంద—స. తిథివిశేషము, బాన, సంతోషము, కామధేనువుదూడ,

తొమ్మిది, ముంత, కలిమి, జిత్తులమారి తనము.

నంది—స. శివునిఎద్దు, ఎద్దు, మఱ్ఱిచెట్టు, సంతోషము, జూదము, జయయొక్క పుత్రుఁడు, జువ్వి, మినుము, కొడుకు.

నక్క—దే. భూషణము, నాఁగటి కఱ్ఱు, ప్రమానియతుకు, గోడపెట్టుటకుఁ ద్రవ్వెడు పునాదులకు వేయు గని కలు, ఒదుగు, గంటు, దాఁగు.

నగౌకసము-స. పక్షి, కాకి, సింహము, శరభము.

నటి—స. నట్టువుని పెండ్లాము, దొమ్మరి వాఁడు, కాకిదొండ, గవ్వగుత్తిక, వేశ్య.

నతము—స. వంగినది, వంకరయైనది, లోఁతైనది, పార్శ్వక్రియలు.

నప్త—స. మనమరాలు, మనుమఁడు, మునిమనుమఁడు.

నభము—స. ఆకాశము, శ్రావణ మాసము, ముక్కు, మేఘము, వర్షా కాలము, అభ్రకము, మృణాళబిస, తంతువు, నరకినకల, హింసపెట్టనది.

నయము—స. నీతి, జూదము, పొం దించుట, (దే) లాభము, నునుపు, చౌక, పద్ధతి, నేర్పు, ఆసక్తి, మృదు వు, ఆరోగ్యము, అందము.

నరుఁడు—స. బ్రహ్మ, మూర్ఖుఁడు, విష్ణువు, శివుఁడు, ఒకముని, ఇంద్రుఁడు, మనుష్యుఁడు, అర్జునుఁడు.

నర్తకుఁడు—స. నట్టువుఁడు, ఈశ్వ రుఁడు, రాజు, పాములవాఁడు.

నర్మము—స. పరిహాసము, అనురాగ ప్రకటన చేష్ట, నీలము, సంతోషము.

నలి—దే. రోగము, అత్యంతము, పొడి, స్వల్పము, యోగ్యము, సన్నము, నలిగినది, పేర్మి, (స) మణిశిల, సువాసన ద్రవ్యము.

నలిని-స. తామర, తామరతీఁగ, తామర కొలను, ఒకవృత్తము, ఆకాశగంగ.

నాంది—స. బ్రాహ్మణుఁడు చేయు ఆశీర్వాదము, భేరి, ప్రారంభము, ఆనందము, సమృద్ధి, నాటకారంభము నందలి మంగళము.

నాగము—స. తగరము, పాము, కొండ, మేఘము, కరి, గజ్జము, మేక, గృహ ము, పృష్ఠభాగము, ఒక రసము, ఉప వాయువు, ముస్తె, పొన్నచెట్టు, సీస ము, నాగవాసము, శ్లేషము.

నాగరము—స. సొంటి, నగరమునఁ బుట్టినది, మోసపుమాట, దుఃఖము, కపటము, మొక్క, లిపివిశేషము, గోరఁట, ముస్తె.

నాడి—స. నరము, గడియకాలము, గొట్టము, కాడ, కుండ, తలమీదిగడ్డ, వంచకుని నడవడి, నాడికులుపు, ఈనె, ఇడాది, తెల్లగఱిక.

నాణెము—త. నాగరకత, బంగారపు బిళ్ళ, ముద్ర, ధనము, శ్రేష్ఠము, మంజులత, వెండి.

నాథుఁడు—స. యజమానుఁడు, ఱేఁడు, పెనిమిటి, ఇంద్రుఁడు.

నాభి—స. కస్తూరి, బొడ్డు, ఒక విషము, బండికంటి నడిమితూము, ముఖ్యము, విజిగీషువగు రాజు, ప్రధానుఁడు, బొట్టె, చక్రవర్తి.

నారము— స. సొంటి, ఉదకము, నరుల సమూహము ధనము, లేగదూడ, ఆత్మకు సంబంధించినది.

నారాయణి— స. పార్వతి, లక్ష్మి, అతివ, వెన్నెల, సరస్వతి, గంగానది, కృతాభిషేకురాలు, ఒక ఆశ్రమము, గోపుచ్ఛము, పిల్లపీఁచర మొక్క.

నారాయణుఁడు—స. విష్ణువు, అగ్ని, బ్రహ్మ, సూర్యుఁడు, సముద్రుఁడు, మహారాక్షసుఁడు, పూరుఁడు, శివుఁడు, చంద్రుఁడు.

నారి—స. స్త్రీ నరము, భార్య, నారి కుఱుపు, దే. వింటియల్లెత్రాడు.

నాలి—దే. వంచన, హీనము, మందము, కల్ల, నరము, కురుపు, నీచము.

నాళము—స. తామర లోనగు వాని కాడ, బాణము, రంధ్రము, కత్తిపిడి మగకుతి, తూము, అగసాలె వాని ఊఁదుగొట్టము చిమ్మనగ్రోవి.

నాళీకము—స. తామర, బాణము, పద్మసమూహము, ఆకసము, కేసరము, గుజ్జము, బాణాగ్రము.

నిక్షేపము— స. భూమిలోపాఁతునిధి, తాకట్టు, ఉంచుట, త్యజించుట, త్రోసివేయుట.

నిగమము—స. మార్గము, అంగడివాడ, నగరము, వేదము, నిజము, వర్తకము, నిశ్చయము.

నిగ్గు—దే. ఉత్కృష్టకాంతి, కిరణము, వర్ణలేశము, జిడ్డు, సారము, పస.

నిగ్రహము—స. బెదరుమాట, శిక్ష, నింద, వైద్యము, పిడి మారణక్రియ, మేర చెఱ, అడ్డగింపు, హస్తక్రియలు.

నిట్ట— దే. స్థానము, ప్రవాహము, స్తంభము, నిక్కినది పార్శ్వము,పొడవు.

నితంబము— స. దరి, కొండనడుమ, పిఱుఁదు, మూపు, శిఖరము, మొల.

నిదాఘము— స. వేసఁగి, చెమట, ఎండ, వేఁడిమి.

నిదేశము—స. ఆజ్ఞ, నిరూరణ, బుద్ధి చెప్పుట,పనుపు, కనఁబఱచుట,దాఁపు.

నిద్దము— త. స్నేహముకలఁది, చిక్కనైనది, మనోహరము, నునుపుగలది, దట్టమైనది.

నిధనము-స. చావు, కులము, నాశము.

నిధువనము—స. కలయిక్క వడఁకు, సంభోగము, క్రీడ.

నిప్పచ్చరము— దే. దారిద్ర్యము, శూన్యము.

నిబంధనము— స. ఏర్పాటు, కారణము, బంధనము, కట్టుపాటు, ఊఁత, స్థాపము, వీణాతంత్రులుకట్టుస్థానము, కూర్పఁబడినది.

నిభృతము—స. నిండినది, తగ్గినది, రహస్యము,స్థిరము, వినయము, నెమ్మది.

నిమిత్తము—స. కారణము, గుఱి నామమాత్ర కారణము, శకునము, గుఱ్తు.

నియామకుఁడు—స. చుక్కాని నడపు వాఁడు, నియమించువాఁడు నియంత, తండేలు, యజమానుఁడు.

నిరీక్షణము—స. చూపు, దర్శనము, వెదకు, మర్యాద, భావించుట, కోరిక.

నిరృతి—స. దిక్పాలవిశేషము, ఉపద్రవము లేనిది, అభాగ్యము, ప్రేతకళ, మృతిభార్య, పెద్దమ్మ.

నిర్మాల్యము—స. కళంకములేనిది, మిగిలినది, పూజచేయఁగా మిగిలిన, లేక వాడిన పుష్పాదులు మొదలగునవి అర్భకము, ధరించి తీసి వేసినవి.

నిర్మోకము—స. పాము కుబుసము, విడుపు, కవచము, మోక్షము, ఆకాశము.

నిర్యాణము—స. మరణము, నిర్గమము, పశువులనుకట్టు పలుపు లేక గుది, ముక్తి, ఏనుఁగు కడకన్ను.

నిర్యాతనము—స. చంపుట, ఈవి, అప్పుతీర్చుట, దాపుడుసొమ్మునిచ్చుట, పగతీర్చుట.

నిర్వ్యూహము—స. సిగబంతి, వాకిలి, నాగవాసము, రసము, ద్వారము, మ్రానిజిగురు.

నిర్వాణము—స. ముక్తి, నాశము, సుఖము, చలారినది, కలయిక, విశ్రాంతి, ఏనుఁగునీళ్ళలో మునుఁగుట.

నిర్వేశము—స. జీతము, అంతటవ్యాప్తమౌట, సుఖదుఃఖానుభవము, వేశ్యకిచ్చు ధనము, మూర్ఛ, పెండ్లి, ప్రాప్తి, భోగము.

నిర్హారము—స. నాటిన బాణాదులను తీయుట, రహస్యముగా ధనాదులు కూడఁబెట్టుట, నాశము, శవవాహము, విరేచనము.

నిలువు—దే. నిలుచుట, మీదియంతస్తు, ఆకారము, శరీరము, కోయఁగా మిగిలిన చేనులోని భాగము, రెండు గజముల యెత్తు.

నివాపము—పితృదేవతలకిచ్చుట, బలి, చల్లుట, పారవేయుట.

నివేశము—స. గృహము, ప్రవేశము, సేనాశిబిరము, కూర్చుండుట, ఉనికిపట్టు, పరిణయము, చొఱవ.

నిశాంతము—స. ఇల్లు, అంతఃపురము, వేగుజాము, మిక్కిలి అణఁగినది.

నిష్కము—స. నాణెము, టంకము మాడ, పతకము, వెండి, బంగారు పాత్రము, రత్నములుపొదిగిన పతకము, బంగారు.

నిష్ఠ—స. స్థానము, చేటు, సమాప్తము, వేడికొనుట, నిలుపుట, తాత్పర్యము, నెఱవేర్చుట, యాచన, నాటకసంధి, నిర్వహణము, ప్రేమ.

నిస్తరణము—స. దాఁటుట, బయలుదేరుట, మరణోపాయము, మోక్షము ఉపాయము, రక్షణము, ఆధారము.

**నీచము**—స. అల్పము, క్రిందిది, పొట్టిది, పల్లము, అధమము, గ్రహగతియొక్క క్రిందిభాగము.

**నీతము**—స. ధనము, ధాన్యము, పొందింపఁబడినది, విహరించుట, తేఁబడినది.

**నీరజము**—స. నీటఁబుట్టినది, తామర, ముత్యము, కుష్ఠరోగము, దుమ్ములేనిది, ముట్టుడిగినది, మాచకమ్మ, నీరుల్లి, వత్తుగుల్ల మొ.

**నీరసము**—స. దానిమ్మచెట్టు, రసములేనిది, ఎండినది, బలహీనము.

**నీరుపుట్టువు**—ద్వి. శంఖము, తామర, రత్నము, ఉచ్చైశ్శ్రవము, అగ్ని, కౌస్తుభము, చంద్రుఁడు, ఐరావతము

**నీరుమోపరి**—దే. కుంభము, కలశము, నీరుమోయునది, మేఘము.

**నీలకంఠము**—స. నెమిలి, ఊరఁబిచ్చుక, ముల్లంగి తుమ్మెద, పాము, బంగారుపిచ్చుక, కొటుకపిట్ట.

**నీవి**—స. పోఁకముడి, చెరసాల, వేదికామధ్యభాగము, వణిఙ్మూలము, మూలధనము, పందెపుసొమ్ము.

**నెట్టుకొను**—దే. పూనుకొను, నెలకొను, అతిశయించు, గెంటుకొను, బలాత్కరించు.

**నెమ్మి**—త. వంజుళవృక్షము, నెమ్మది, నెమిలి, ప్రేమము, స్నేహము, అనుగ్రహము, సుఖము, సేమి, సంతోషము.

**నెరవు**—దే. పూర్తిమార్గము, పొసుగు, వ్యాపనము, ఒక చెట్టు, పూర్ణము, యుక్తము, విశాలము, అధికము, వ్యాప్తము.

**నెఱి**—దే. ఆచారము, అందము, క్రమము, న్యాయము, పరాక్రమము, టెక్కు, వంకరతనము, ప్రశస్త యోగ్యము, అత్యంతము, గొప్ప, నిగ్గు.

**నెల**—దే. చంద్రుఁడు, పున్నమిమాసము, చోటు, కర్పూరము, ఒక శిరోభూషణము.

**నేత్రము**—స. కన్ను, పేరు, ఏరు, పట్టువస్త్రము, నక్షత్రము, రెండు, నరము, జడ, చెట్టువేరు, వస్త్రము, తరిత్రాడు, రథము, రక్షించునది

**నైగమము**—స. పట్టణము, వేదాంతము, ఉపనిషత్తు, పాశుపతాద్యస్త్రములు, థైర్యము, ఆధారము.

**న్యక్షము**—స. సమస్తము, దున్నపోతు, నీచము.

**న్యాయము**—స. నీతి, తగవు, తత్త్వశాస్త్రము, తర్కశాస్త్రము, దృష్టాంతము, పద్ధతి, మాత్రము, ప్రభుత్వము, మర్యాద సంబంధము, చట్టము, పోలిక, పుణ్యము, తీర్పు, చెడని ధర్మము వ్యాఖ్యము.

**పంక్తి**—స. వరుస, కీర్తి, గుంపు, పక్వము, పది, గీత, సేన.

**పంచమము**—స. కోయిల, ఒక స్వరము, ఐదవది, ఒకదేవత, ఇంపైనది.

పంచాంగము—స. కూర్మము, తిథి వార నక్షత్ర యోగ కరణములు కల సాంవత్సరిక గ్రంథము, 5 అంగములు కలది.

పంపు—దే. ఆజ్ఞ, సెలవు, దాస్యము, వ్యభిచారము, సేవ, పరిమళ్ళవయస, హింస 15 తులముల బరువు, పంపించు, ఒక యంత్రము.

పక్షము—స. పగ, ప్రక్క, గ్రహము, బలము, శరీరపార్శ్వము, పరాధీనము, పొయ్యి, రంధ్రము, తలవెంట్రుక, కృత్యము, చెయ్యి, దగ్గర, గోడ, తలుపురెక్క, కొప్పు, మైత్ర్యాది జనిత సప్తవిధబలము, రెండు, రెక్క, తర్కవిషయ సాధ్యము, 15 దినములు, సహాయము సేన, అంబారీ.

పచ్ఛదము—త. దుప్పటి, అంగవస్త్రము, మరకత కాంతి, వస్త్రము.

పటలము—స. ఇంటికప్పు, సమూహము, రత్నదోషము, నేత్రరోగ విశేషము, పరివారము కుడుపు, బొబ్బ, వారచీర, తనుక, తిలకము.

పటువు—స నేర్పరి, ఇందుప్పు, చొరవ, చేదుపొట్ల, వాడి, సమర్థుడు, దేహము దాచని బంటు, రోగ శూన్యుఁడు.

పట్టము—స. పట్టునూలు, రాజధాని, సింహాసనము, డాలు, తలగుడ్డ, కుర్చీ, ఉత్తరీయము, రంగుగుడ్డ, వస్త్రము, కిరీటము, పలక, సన్నెకల్లు, నాలుగు త్రోవలు కలియుచోటు, లలాట భూషణము, కల్లు, కోట, రాజు ఇచ్చినది, పట్టా, గాయపుగుడ్డ కట్టుమీఁది పట్ట.

పట్టు—దే. చెల్లు, ప్రారంభించు, తికులు, బహుకాలము చెల్లు, మార్గాన, గ్రహణము, స్థానము, అవకాశము, విషయము, వైశాల్యము, అవలంబము, బంధుత్వము, గృహము, పట్టెవల, ఊరు.

పడగ—త. పాముపడగ, టెక్కెము, నగ.

పడుచు— దే. కన్యక, బాలుఁడు, యువతి, శిశువు, వేశ్య.

పణము— స. పందెము, ధనము, వ్యాపారము, వెల, ద్యూతము, కూలి, గవ్వయెత్తు ఒడంబడిక, బహుమానము, 80 గవ్వలనాణెము, అతిభాగ్యము, పని, దుకాణము, కొనుట, గవ్వ, ప్రమాణము, జీతము, వ్యయము.

పతంగము — స. పక్షి, మిడుత, బాణము, ఒక ధాన్యము, మార్జాలము, పాదరసము.

పతితము—స. పడినది, పరాజితము, పాపము.

పత్రము—స. ఆకు బాణము, రెక్క, వ్యవహారార్థము వ్రాసికొన్న కాగితము, ఉత్తరము, ఈక, చురకత్తి, పుస్తకములోని కాగితము, వాహనము.

పదము—స. పాదము, చిహ్నము, శబ్దము, వాక్యము, ప్రయత్నము, మిష, మోసము, స్థలము, కాంతి, బాణము, పదార్థము, కాలి అడుగు

జాడ, పాట, పద్యపాదము, ఉద్యోగము, కీర్తన, అంశము, కారణము, అడుగు, భాగము, సంరక్షణము.

పదిలము — దే. సంతోషము, సుఖము, దృఢము, స్థైర్యము.

పద్మ — స. లక్ష్మి, పార్వతి, సరస్వతి, ఆఁడుజింక, తామర, ఒక వ్యూహము, ఒక సంఖ్య, బారంగి.

పద్మము — స. కమలము, పాము, ఒక నిధి, ఒక వ్యూహము, సంఖ్యా విశేషము.

పద్మిని — స. తామరతీఁగ, స్త్రీజాతి విశేషము, తామరకొలను, లక్ష్మి, తామరతింపు, ఆఁడేనుఁగు.

పని — దే. వ్యాపారము, చేయుట, శిల్పము, అక్కర, కొలువు, వృత్తి.

పన్ను — దే. కప్పు, యుద్ధమునకు సిద్ధపడు, సిద్ధపఱచు, ఉపదేశించు, దంతము.

పయోధరము — స. స్తనము, మేఘము, కొబ్బరికాయ, కొట్టిగడ్డ, ఒక చెఱకు.

పరంపదము — స. విష్ణులోకము, ఉన్నతపదవి, మోక్షము, శాశ్వతసుఖము.

పరఁగు — దే. ఒప్పు, ప్రవర్తిల్లు, వ్యాపించు, ప్రసిద్ధమగు, ప్రవహించు, విహరించు.

పరము — స. మోక్షము, పరము, శ్రేష్ఠము, మీఁదిది, ముఖ్యము, కేవలము, అన్యము.

పరమేశ్వరుఁడు — స. శ్రీమహావిష్ణువు, సాంబశివుఁడు.

పరాగము — స. పుప్పొడి, ధూళి, గ్రహణము, చందనము, ఒకానొక కొండ, నలుసరింపి, కీర్తి.

పరి — దే. సమూహము, పంక్తి, సేన, వర్తనము, ఆవృత్తి.

పరికరము — స. ఉపకరణము, నడికట్టు, సమూహము, పరివారము, అడ్డము, ఒక కావ్యాలంకారము, ప్రారంభించుట, గొంగపట్టు, గాఢాలింగనము, మంచము, పిష్టాంశము, వివేకము.

పరిగ్రహము — స. పెండ్లి, స్వీకారము, భార్య, శాపము, అడ్డము, చెట్టువేరు, ప్రాప్తి, ప్రారంభము, పరివారము, ప్రతిష్ఠ.

పరిఘము — స. యోగములలో నొకటి, గాజుకుండ, దెబ్బ, తలుపుగడియ, ఇనుపకట్లకఱ్ఱ, కవిస, పురద్వారము, ఆయుధము, లాటికఱ్ఱ, హింస, కంటకము.

పరిణామము — స. జీర్ణము, మారురూపము, ఏనుఁగుకొమ్ము, ప్రకృతి విరుద్ధమైనది, ఉబ్బు.

పరివేషము — స. అన్నము వడ్డించుట, చుట్టుకొలత, సూర్యాది పరివేషము, భోజనకాలమున వేచియుండుట, చుట్టుకొనుట.

పరుఁడు — స. శత్రువు, శ్రేష్ఠుఁడు, పెద్దవాఁడు, పరమాత్మ, అన్యుఁడు.

పర్యాప్తము— స. తృప్తి, స్వేచ్ఛ, నివారణము, సమర్థము.

పర్యాయము— స. అవసరము, చుట్టి వచ్చుట, వంతు, తరుణము, భేదము, నిర్మాణము, పంక్తి, ఏకార్థవాచి పదము, ఒక అలంకారము, సౌఖ్యము, ముక్తి, గుణము.

పర్వము—స. గణుపు, పండుగ, దర్శ, విషువదాది, సమూహము, ప్రస్తావము, మహాభారత భాగము.

పఱ— దే. ఉప్పుపండెడు బయలు, బయలు, సమూహము, ఇతరము, అధికము, గొప్ప, సున్నము కొలుచు మానము.

పఱపు—దే. శయ్య, శీఘ్రము, వ్యాపి, విరివి, పోగొట్టు, త్రోలు, ప్రయోగించు.

పలము—స. నాలుగు కర్షముల యెత్తు, మాంసము, 3 తులముల యెత్తు.

పలలము—స. మాంసము, పరిపక్వము, హోమాన్నము, బురద, నూవుపిండి.

పలాశము—స. ఆకు, మోదుగు, ఆకుపచ్చ, కర్పూరము, కచ్చూరము, శాసనము, ఒక పక్షి.

పలితము— స. నెరసిన తలవెంట్రుక, బూద, మిరియము, నెఱయుట.

పల్లవము—స. చిగురు, కొనచెంగు, లత్తుకరంగు, చిగిర్చినకొమ్మ, శృంగారము, బలము, కొమ్మ, కృతులలో మొదటిపాదము, విరివి.

పల్లవి—స. వ్యభిచారిణి, కృతులు మొదలగువాని మొదటిచరణము.

పవి— స. వజ్రాయుధము, వజ్రము, పిడుగు.

పవిత్రము— స. జందెము, జలము, తామ్రము, దర్భ, పరిశుద్ధము, విష్ణు చక్రము, దవనము, పసపు, పెరుగు కుండ, మంత్రము, బంగారు, అద్దము, నిప్పు, గోమయము.

పశువు—స. నాలుగుకాళ్ళ జంతువు, పశుప్రాయుఁడు, బలికిచ్చు మృగము, గొఱ్ఱె, ఆత్మ.

పస—దే. వెలుతురు, స్ఫురణము, సారాంశము, సమృద్ధి, సారము, చతురత్వము, సామర్థ్యము.

పాండువు—స. ఒకరోగము, తెల్లనిది, పాండురథము, తెలుపు.

పాంసుల—స. ఱంకుటాలు, ధూళి, భూమి.

పాకము—స. పంట, పూర్తి, వికాసము, మంచి తెలివిగలది, జీర్ణము, అగ్ని, పాత్ర, దేశోపద్రవము, కురుపు, పండినది, కాల్చుట, చిన్నది, ఫలితము, కావ్యపాకము, వంట, వృద్ధత్వము, నియతస్థితి.

పాంచాలి—స. ద్రౌపది, ఒక కావ్య రీతి, బొమ్మ.

పాగ—దే. అశ్వశాల, తలపాగ, గుఱ్ఱముల (వరుస) గుంపు, పావకోళ్ళు.

పాచకుఁడు—స. వంటవాఁడు, అగ్ని.

పాటకము—స. పట్టాకత్తి, వాద్యము, తీరము, వ్యవహారము, రాజధాని మధ్య ప్రదేశము, హీనము, మూలద్రవ్యము, నే గానివేశనము.

పాటి—దే. సామ్యము, సమము, కొలఁదిని న్యాయము, ప్రమాణము, సాధారణము.

పాటీరము—స. చందనము, మబ్బు, వరిమడి, సీసము, ముల్లంగిదుంప, వెదురుచేవ, జల్లెడ.

పాఠకుఁడు—స. వేదసారము చదువువాఁడు, ఉపన్యాసకుఁడు, చదువువాఁడు, పురాణము చెప్పువాఁడు, ఉపాధ్యాయుఁడు.

పాడి—దే. ధర్మము, స్వభావము, న్యాయము, వ్యవహారము.

పాత్ర—స. కంచము, ఆకు, నాట్యమాడెడు స్త్రీ పాత్రసామాన్యము.

పాథస్సు—స. నీరు, ప్రాఁత, అన్నము.

పాదము—స. అడుగు పద్యమునందలి చరణము, కాలు, కోడు, భాగము, స్తంభము, కొండక్రింది భాగము, కిరణము, పాతిక వేరు.

పారణము—స. మేఘము, పూర్తి చేయుట, ఉపవాసముచేసిన మఱునాటి భోజనము, తృప్తి, చదువుట.

పారలౌకికము—స. పరమాన్నము, పరలోక సంబంధమైనది.

పారి—స. పాత్రము, ముంత, మల్లచిప్ప, పాలుపితుకు భాండము, ఏనుఁగు కాలి గొలుసు, (దే) తడవ, మన్ను.

పార్వణము—స. పార్వణమను శ్రాద్ధము, పిండము, పర్వతసంబంధమైనది.

పాలాశము—స. ఆకుపచ్చన, మోదుగ చెట్టు సంబంధమైనది.

పాలు—దే. తెల్లనగు భాగము, వంతు, వశము, క్షీరము, చెట్టు రసము సమీపము.

పావకుఁడు—స. అగ్నిహోత్రుఁడు, సూర్యుఁడు మంచినడవడికఁగలవాఁడు.

పావనము—స. జలము, ఆవుపేఁడ, రుద్రాక్షము, పవిత్రము, ప్రాయశ్చిత్తము, కృచ్ఛ్రవ్రతము, ఒక వాతరోగము, పచ్చగుంట, గలిజేరు, చందనము, అగ్ని.

పావని—స. ఆవు, గంగ, తులసి, హనుమంతుఁడు, భీముఁడు, పవిత్రురాలు.

పాశము—స. త్రాడు, గుంపు, కల, బాణము, కుత్సితము, ఆయుధము.

పాళి—స. అంచు, వరుస, మీసములుగల స్త్రీ, గుర్తు, చెవితమ్మె, తీగకొన, కత్తియొర, పాలు, కొండచరియ, అశ్రువులు, స్థానము, పేను

పాళియము—దే. పాళెము, శిబిరము, దండు, పట్టణము, కావలి.

పింజరము—స. బంగారు, పసుపుగలిసిన యెఱుపు గుఱ్ఱము, రాగి, పచ్చన, కలత, హరిదళము.

పిండము—స. బ్రతుకుఁదెరువు, పితృదేవతల కిచ్చు అన్నపుముద్ద, చెండు,

సమూహము, ముద్ద, బిచ్చము, గుండ్రని ది, మొత్తము, వస్తువు, శరీరము, ఆహారము, గట్టిది, బలము, గర్భము, ఇనుము, గజకుంభము, దట్టము, ఉండ.

పిచ్ఛ—స. అరఁటి చెట్టు, పోఁక, పాముయొక్క జొల్లు, గంజి మీఁది మీఁగడ, బూరుగుబంక, అధరోష్ఠపు క్రిందిభాగము, మొగ్గ, వరుస, ఒర, సమూహము.

పిటకము—స. పుండు, చెమటపొక్కు, చిన్నగంప, చిన్నపెట్టె.

పిణ్యాకము—స. తెలకపిండి, మైనము, కుంకుమ, ఇంగువ, కుంకుమపూవు, ధూపద్రవ్యము.

పిశునుఁడు—స. కొండెగాఁడు, క్రూరుఁడు, వానరముఖుఁడు.

పిష్టకము-స. పిండివంట, నేత్రరోగము, మాఁబొడి.

పిసరు—దే. తునుక, కడిగినధాన్యములో క్రో పుడుపడినది, లేశము.

పిసాళి—దే. వ్యాపనముగలది, ప్రకాశమైనది, శోభితము, దొంగయెత్తుగలది, కోపముగల స్త్రీ, వ్యాధిపీడితుఁడు, మూర్ఖుఁడు, కుత్సితముగల యోఁదుది.

పీఁకె—దే. త్రాఁగఁగా మిగిలిన పొగచుట్ట, గొట్టము, గొంతుక.

పుండరీకము—స. తెల్లతామర, తీర్థవిశేషము, పెద్దపులి, తెల్లగొడుగు, ఆగ్నేయపు దిక్కునందలి యేనుఁగు, తియ్యమామిడిచెట్టు, పట్టుపురుగు, ఒక యజ్ఞము, చంద్రుని విల్లు, వరుణుని శంఖము, కప్ప, తెల్లచెఱకు.

పుండ్రము—స. నలుపుగలసిన యెఱ్ఱ చెఱకు, తెల్లచెఱకు, పురుగు, పులి, వంగదేశము, గురివెంద, నుదుటి నామము.

పుచ్ఛ—దే. మడ్డి, పుప్పిపట్టుట, ఆజ్ఞాపించుట, గ్రహించుట, పెఱుకు, పంపుట.

పుటము—స. పూఁలబుట్ట, కంటిరెప్ప, గుజ్జుపుకాలి గొరిజ, లోఁతులేని చేతి గుంట, ఔషధముచేయుటకై చేర్పఁబడిన రెండు డిప్పలు, దొప్ప, మడత, మూఁత.

పుడమిపట్టి—దే అంగారకుఁడు, నరకాసురుఁడు, సీత,

పుణ్యజనుఁడు—స. నైరృతి, పుణ్యాత్ముఁడు, సుజనుఁడు, రాక్షసుఁడు, యక్షుఁడు.

పుణ్యము—స. ధర్మము, నీరు, బంగారము, పుష్పము, మనోజ్ఞము, పవిత్రము, సుకృతము.

పున్నాగము—స. సురపొన్న, జాజికాయ, పద్మము, తెల్ల సర్పము, తెల్ల కలువ.

పురము—స. పట్టణము, ఇల్లు, శరీరము, మేడ, నిత్యము, మరణము, ఎల్ల, పరాక్రమము, గుగ్గిలము.

పురాణపురుషుఁడు—స. ముదుసలి. శ్రీమహావిష్ణువు.

పురాణము—స. బ్రాహ్మము మొద

లగు గ్రంథము, కథ, చరిత్ర, పదు నెనిమిది, పురాతనము.

పురి—దే. మెలి, ఆక్రమణము, గోనె కుట్టెడు త్రాడు, నెమలిపింఛము, ధాన్యపుపురి, స. పట్టణము.

పురుడు—దే. జాతాశౌచము, సమానము, సమానుఁడు.

పులకము—స. పులగము, ఏనుఁగునకుఁ బెట్టెడు అన్నపుముద్ద, చెట్టుమీఁది నల్లపురుగు, నులిపురుగు, వసుస, సూర్యకాంతమణిలోని మచ్చ, వజ్రము, హరిదళము, గగుర్పాటు.

పులికూడు—దే. పులిసిన అన్నము, భిక్షాన్నము.

పుష్కరము—స. ఆకాశము, తామర, బాణము, తీర్థవిశేషము, సర్పవిశేషము, పంజరము, పంద్రెండు, వాద్యముఖము, యుద్ధము, ఏనుఁగుతొండము చివర, ఒక ద్వీపము, మద్దెల, విరోధము, భాగము, యోగము, బెగ్గురపక్షి, ఉదకము.

పుష్పకము—స. కుబేరుని విమానము, కుంపటి, ఒకకొండ, నేత్రరోగము.

పుష్యము—స. పుష్యమీ నక్షత్రము, కలియుగము, పౌషమాసము, పుష్యరాగము.

పూగము—స. పోఁక, గుంపు, గంగరావి.

పూఁట—దే. సంధ్య, కాలము, పగటిలో సగము, దినము, జామీను, పూనుట.

పూరణము—స. నింపుట, బూరెలలోని పూర్ణము, గుణించుట, ఇష్టము, వస్త్రపుపుంజము, బూరుగుచెట్టు, గలిజేరు.

పూర్తము—స. తటాకాదులను త్రవ్వించుట, పాలనము, ఆలయ ప్రతిష్ఠ, అన్నదానము, కప్పబడినది, నిండింపఁబడినది.

పృథువు—స. నల్లజీలకఱ్ఱ, ఒక వానరుఁడు, ఒక రాజు, ఇంగువద్రాను, అగ్ని, గొప్పది.

పృథ్వి—స. విరివియైనది, ఇంగువద్రాను, భూమి, పచ్చ, పవడములలోని దోషము, సముద్రతీరము, నల్లజీలకఱ్ఱ.

పృదాకువు—స. పాము, పులి, చిఱుతపులి, కొండచిలువ, తేలు.

పృశ్ని—స. కిరణము, చిన్నయెముక, బోయవాఁడు, అలిపిరి.

పృష్ఠము—స. మూఁడి, వీఁపు, గొంతులో పుట్టు మధ్యమధ్వని, యాగసంబంధమైన స్తోత్రవిశేషము.

పెంపు—దే. నాశముచేయు, సమృద్ధి, గౌరవము, వృద్ధి, మాహాత్మ్యము, పాలనము.

పెద్ద—త. వృద్ధుఁడు, జ్యేష్ఠుఁడు, అత్యంతము, తెలిసినది, గొప్పవాఁడు, శ్రేష్ఠము, దీర్ఘము, ముఖ్యుఁడు, బిగ్గర.

పెనఁకువ—దే. వాదము, యుద్ధము, కలయిక, మట్టుకొనుట, పెనఁగు.

పేఁట—త. నగరము, అంగడి, పట్టణభాగము.

పేరు—దే. నామము, ప్రసిద్ధి, భూషణము, పెద్దది, ముద్దట్టు, దట్టమగు.

పేశలము—స. మనోహరము, కోమలము, నేర్పుకలది, రోకలి, కోయిల, ధూర్తము.

పొంగు—దే. సంతోషము, ఉబుకుట, పొంగరము, స్ఫోటకము, సంతోషించు.

పొదుగు—దే. క్రమ్ము, కప్పు, పొత్తిగుడ్డ, పక్షులు గ్రుడ్లను రెక్కలలోఁ గప్పు.

పొర—దే. ఉల్లిపొర, నేత్రరోగ విశేషము, కపటము, పాముకుబుసము, మడత, ప్రమాదము.

ప్రకరణము—స. ప్రసంగము, విషయము, గ్రంథభాగము, నాటకభాగము.

ప్రకృతి—స. ప్రత్యయము చేరకముందున్న శబ్దస్వరూపము, పురవర్గము, సత్త్వాదిగుణ సామ్యావస్థ, ముఖ్యము, యోని, ప్రాణి, పరమాత్మ, తల్లి, పంచభూతములు, మొదటి రూపు, సహజము, ఉపాదానకారణము.

ప్రఖరము—స. కంబళము, గుఱ్ఱపుకవచము, కంచరగాడిదె, కుక్క, ఏనుఁగుకవచము, మిక్కిలి కఱుకైనది.

ప్రగ్రహము—స. చెఱ, త్రాసుయొక్క త్రాడు, పగ్గము, కళ్ళెము, పరిచర్య, పూజ, చెయ్యి, తలుపు గడియ, బంగారు, కిరణము, మ్రానిపసుపు, నియమనము.

ప్రచండము—స. సహింప శక్యము కానిది, చేరరానిది, వాఁడిమిగలది, సాధ్యముకానిది, తెల్లగన్నేరు.

ప్రణయము—స. ప్రేమము, శాంతి, మోక్షము, నమ్మకము, వినయము, యాచన, వ్యాపకము, స్నేహము.

ప్రజ్ఞానము—స. బుద్ధి, చిహ్నము.

ప్రణీతము—స. మంత్రముచే సంస్కరింపఁబడిన యగ్ని, చొప్పింపఁబడినది, నీరుపోసి యుడకబెట్టఁబడినది, త్రోయఁబడినది, చేయఁబడినది, రచింపఁబడినది.

ప్రతి—స. సదృశము, మాఱు, విరోధి, భాగము, గుర్తు, విఘ్నము, అంగీకారము, నకలు.

ప్రతిగ్రహము—స. పుచ్చుకొనుట, దానద్రవ్యము, గ్రహభేదము, సేనకు వెనుకటిబలము, ఇల్లు, తమ్మపడిగము.

ప్రతిశ్రయము—స. పడిసెము, ప్రాపు, కొలువుకూటము, ఆధారము, సత్రము, ఇలు.

ప్రతిసరము—స. ఏనుఁగు కుంభస్థలముల క్రిందిచోటు, చేతికిఁ గట్టుకొను తోరము, కడియము, పూలదండ, ఒక మంత్రము, వ్రణశుద్ధి, సేనకు వెనుకభాగము.

ప్రతీకము—స. ప్రతికూలము, ముఖము, గుర్తు, ఆకృతి, విలోమము, పరా

క్రమము, రమ్యము, జారనిది, ఒక భాగము, అవయవము.

ప్రతీతి—స. కీర్తి, ఆదరము,సంతసము, నమ్మకము, నిశ్చయము, జ్ఞానము.

ప్రత్యయము—స. ప్రతిజ్ఞ, ఆధారము, నమ్మకము, బుద్ధి, హేతువు, ప్రసిద్ధి, నిర్ధారణ, సమ్మతి, వశము, జండా, ఉపపదము,ద్వారము, యుద్ధము, నడవడి.

ప్రతిపత్తి—స. పేరు, జ్ఞానము, అనుమానము, ధైర్యము, ప్రాప్తి, దుష్టత్వము, వ్యాపారము, గౌరవము.

ప్రదరము—స. బాణము, విఱుచుట, ఆఁడువాని రక్తస్రావము, భయము, అల్లెత్రాడు, చీలుట.

ప్రదేశము—స. దేశము, స్థానము, బెత్తిలి, గోడ, లాడితెను, చోటు.

ప్రధానము—స. ముఖ్యము, ప్రకృతి, పరమాత్మ, బుద్ధి.

ప్రపంచము—స. భూలోకము, సంసారము, మోసపుచ్చుట, వెడల్పు, వైపరీత్యము, శబ్దవిస్తరము, రచన.

ప్రభ—స. వెలుఁగు, నిప్పులమంట, సూర్యునిభార్య, పార్వతి, ప్రభల సంబరము.

ప్రమాణము—స. ప్రత్యక్షాది జ్ఞానకారణము, మేర, కొల,తూనిక, సత్యవాదిత్వము, హేతువు,ఒట్టు, సత్యము, దృష్టాంతము, ఎఱుఁగునది,శాస్త్రము.

ప్రయోగము—స. నడపుట, కర్మ కర్మ క్రియల కూడిక, తంత్రము, ఉపయోగము,ఔషధము నుపయోగించుట, దృష్టాంతము, యత్నము.

ప్రయోజనము—స. కార్యక్షి లాభము, హేతువు, ఉపయోగము.

ప్రలంబము—స. హారవిశేషము, తేగ, స్తనము, మేఘము, కొమ్మ, తగరము, వ్రేలాడుట.

ప్రవణము—స. వాటముగల పల్లపు భూమి, వంగినది, నాలుగుత్రోవలు కలసినతావు, క్షణము, తిన్ననిది, రచ్చవీథి.

ప్రవహణము—స. వాహనము, ఒకవిధమగు పడవ, బాలికల క్రీడాశకటము.

ప్రవాళము—స. పగడము, రత్నము, వీణాదండము, శిశువు, జంతువు, చిగురు.

ప్రవాహము—స. పాఱుదల, వరద, పక్షి, గాలి, ధార, పరంపర, ఉత్తమాశ్వము.

ప్రవృత్తి—స. ప్రవేశము, చరిత్రము, కనఁబడుట, ఉపయోగము, ఆరంభము, వృద్ధి, గుణము, పట్టుదల, చాకచక్యము, అదృష్టము, సమాచారము, వరద, అర్థము, బ్రతుకుఁదెరువు, నడత.

ప్రసంగము—స. విషయవిస్తరము, ప్రస్తావము, చేరిక, వాదము, భక్తి, సంభాషణ, కలయిక, సంబంధము (సంపర్కము), తరుణము, శాస్త్రోక్త

మైన వృత్తి, లాభము, సంగతి, అంశము.

ప్రసవము—స. పూవు, బిడ్డ, ఫలము, వృద్ధి, అనజ్ఞ, క్రమానుగత ప్రసంగము, పుట్టుక.

ప్రసాదము—స. ప్రసక్తి, ప్రసన్నత, నివేదింపఁబడిన భోజనసామగ్రి, నైవేద్యము, మంచిస్వభావము, స్వచ్ఛత, శాంతి, క్షేమము, దానము, దేవాలయము, అంతఃపురము, ఒక కావ్యగుణము, అనుసరణము, సంతోషము, నిర్మలత్వము, అనుగ్రహము.

ప్రసువు—స. తల్లి, అరఁటి, లత, దర్భ, ఆఁడుగుఱ్ఱము, లేఁతగడ్డి.

ప్రస్తావన-స. స్తోత్రము, నాటకములో మొదటి సంభాషణ, ఆరంభము.

ప్రస్తానము—స. అవసరము, సమయోచితము, కీర్తి, చెప్పుట, కాలము, ఆరంభము.

ప్రళయము-స. కల్పాంతము, మూర్ఛ, అపాయము, మృత్యువు, ప్రాఁత (త) భృత్యువు, జీర్ణవస్త్రము, పూర్వము, పురాతనము.

ప్రాఖర్యము—స. చురుకుఁదనము, దుర్మార్గము, పట్టుదల, ఉద్రేకము.

ప్రాజాపత్యము—స. అధికారము, యజ్ఞవిశేషము, 12 దినముల వ్రతము, ఒక వివాహభేదము.

ప్రాణము-స. ప్రాణవాయువు, గాలి, బలము, ఐదు, ఆయువు,జీవితకాలము, ఇంద్రియము, బాలింతబోలు.

ప్రియము—స. స్నేహము, సంతోషము, ఇష్టము (దే) కోరఁబడినది, గిరాకి.

ప్రీతి—స. సంతోషము, 27 యోగములలో నొకటి, స్నేహము, మన్మథుని భార్య, 5-వఛందములలోనొకవృత్తము.

ప్రోడ—త. నిపుణుఁడు, ప్రౌఢస్త్రీ, వివేకి.

ప్లవంగము—స. కోఁతి, కప్ప.

ప్లవము—స. పడవ, కప్ప, కోఁతి, గంధతృణము, నీరుకాకి, నీటికోడి, దుర్గంధము, కుప్పిగంతు, చప్పుడు, గొఱ్ఱె.

ఫలము—స. పండు, ప్రతిఫలము, ప్రయోజనము, జాజికాయ, ప్రత్తికాయ, బాణము, ములికి, డాలు, ధనము, సుఖము, నుదురు, వేపుడుపిండి, విత్తనము, ఎముక, పిడికిలి, నాఁగటికఱ్ఱు, పందికోఱ, చివరభాగము, అధికము.

బంటు—త. సేవకుఁడు, శిష్యుఁడు, భటుఁడు, భక్తుఁడు, శూరుఁడు.

బందు—త. ఆవరణము, విరోధము, పెట్టెబందు, గోపనము.

బంధనము—స. కట్టు, త్రాడు, చెఱ, చంపుట, తాకట్టు, తొడిమ.

బంధము—స. కట్టు, కావ్యరచనావిశేషము, చెఱ, ముడి, రోగము, చెఱ

సాల నుంచుట, శరీరము, ఏర్పాటు చేయుట, సంబంధము, ఒట్టుకొనుట, చేరిక, ఒడంబడిక, ఫలితము, కనఁబఱచుట, సంభోగపద్ధతి, నరము, అంచు, తాకట్టు.

బంధురము— స. ఒప్పిదమైనది. కిరీటము, కలహంస, నూనెమడ్డి, పొడుగుగలదై వంగినది, పక్షి, ఆఁడుగుఱి, ఒక వృత్తము.

బటువు— దే. భూషణము, గుండ్రనిది, దృఢము, దిండు.

బడబ—స. ఆడుగుఱ్ఱము, దాస్యపుకత్తె, బ్రాహ్మణయువతి.

బడుగు – దే. (బడువు) శవము, అశక్తుఁడు, కృశించినది.

బదరము—స. రేగుపండు, ప్రత్తికాయ, జపప్రత్తి, దే విచ్ఛిన్నము.

బద్ద—త. కాయయొక్క చీలిక, వెదురుయొక్క ఖండము, కాయధాన్యముల పప్పు.

బరి—దే. పార్శ్వము, గిఱి, దొంగ, శత్రువు, దేహాదిపార్శ్వము, బడి.

బర్కరము—స. ప్రాఁతపు పశువు, హేళనము, నాలుగు పాదములుగల జంతువు, మేఁక.

బర్హి—స. నెమలి, దర్భ, అగ్ని, నగవు, కురువేరు.

బలము—స. వాసన, రసము, రూపము, సత్తువ, సేన.

బలదేవుఁడు— స. బలరాముఁడు, వాయువు.

బలి—స. గంధకము, చర్మపుముడుతలు, కప్పము, బలవంతుఁడు, పూజాసామగ్రి, ఒకచక్రవర్తి, యమదండము, అర్పణము.

బలుఁడు—స. బలరాముఁడు, ఒక రాక్షసుఁడు, కాకి, బలవంతుఁడు, మాంసలుఁడు.

బాగు—త. క్షేమము, విధము, సుందరమైనది, అందము.

బాదరాయణుఁడు —స. (బాదరాయణి) వ్యాసుఁడు, నిష్ప్రయోజకుఁడు, వెఱ్ఱివాఁడు.

బాము—వై. పుట్టుక, పీడ, కష్టము.

బాల—స. స్త్రీ, 16 సం॥ లోఁబడినది, మూఢురాలు, కొబ్బరిచెట్టు, త్రుటి.

బాలిశుఁడు-స. బాలుఁడు, మూర్ఖుఁడు.

బావ-త. అక్కమగఁడు, మగనియన్న, పెద్దవాఁడగు మేనత్త మేనమామల కొడుకు.

బిందువు—స. నీటిబొట్టు, సున్న, చుక్క, శుక్రము, భ్రూమధ్యము, ఆకాశము, చెఱువు, దంతక్షత విశేషము.

బింబము—స. ప్రతిబింబము, ప్రతిమ, సూర్య చంద్ర మండలము, యోని, అంతఃపురము, ఊసరవెల్లి, సమానము, దొండపండు.

బిలము—స. రంధ్రము, గుహ, గుఱ్ఱము.

జము—స. విత్తనము, నిజము, గర్భాధానము, శుక్రము, కారణము.

బుధుఁడు—స. ఒక గ్రహము, పండితుఁడు, వేల్పు, వృద్ధుఁడు.

బుసము—స. పొల్లు, ఊక, కసె, మీఁగడతీసిన పెరుఁగు, తృణము, పిడక.

బృందారకుఁడు—స. వేలుపు, శ్రేష్ఠుఁడు, శివుఁడు, కృష్ణుఁడు, సుందరుఁడు.

బొంది—దే. దారము, పుష్పసరము, వెన్నుదీయుటకు యోగ్యముకాని వరి లోనగునది.

బ్రహ్మ—స. నలువ, విష్ణువు, శివుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, పరమాత్ముఁడు, బ్రాహ్మణుఁడు, ఋత్విజుఁడు.

బ్రహ్మము—స. తపము, సత్యము, తత్త్వము, ఆధ్యాత్మవిద్య, జ్ఞానము, జన్నము, నాదము, చప్పుడు, ఒక గ్రహయోగము, ఏకము, మోక్షము.

బ్రాహ్మి—స. ఒకమాతృక, బాఁపనచిమ, బారంగి, సరస్వతి, ఒకచేఁప, వాక్కు, బ్రాహ్మణస్త్రీ, రోహిణీనక్షత్రము, పొన్నగంటికూర, సోమెదకూర.

భంగము—స. చెఱుపు, కోరిక, అవమానము, అల, రోగము, ఆటంకము, ఓటమి, పగులుట, త్రుంచుట, భాగము, విఱుగుట, వేఱుపడుట, నిరాకరించుట, తప్పిపోవుట, నాశము, పగులు, పాఱిపోవుట, నిలుపుదల, కుంగుట, జనుము, మోసము, కాలువ.

భగము—స. శ్రీ, వీర్యము, జ్ఞానము, ఇచ్ఛ, వైరాగ్యము, మాహాత్మ్యము, కీర్తి, ఐశ్వర్యము, ధర్మము, యత్నము, మోక్షము, సౌఖ్యము, యోని, సౌందర్యము, రసము, ప్రేమ, నీతి, బలము, నిస్పృహ, అణిమాది సిద్ధి, ఉత్తరఫల్గుణీనక్షత్రము.

భగవంతుఁడు—స. విష్ణువు, శివుఁడు బుద్ధుఁడు, సన్మానితుఁడు.

భగవతి—స. నది. సరస్వతి, పార్వతి, పూజ్యస్త్రీ.

భద్రము—స. శుభము, సౌఖ్యము, ఒక కరణము, బంగారు, నాగముస్తె, ఎద్దు, గజజాతివిశేషము, కాటుకపిట్ట, శ్రేష్ఠము, శుభకరము.

భరటుఁడు—స. కూలివాఁడు, కుమ్మరి.

భవ్యము—స, సుందరము, యోగ్యము, శ్రేష్ఠము, సత్యము, శుభము, కాఁబోవునది.

భాండము—స. తొడవు, నిషేధము, దుఃఖము, గుఱ్ఱపుఁదొడవు, మొదలిసొమ్ము, వస్తువు, కుండ మొదలగు మట్టిపాత్ర.

భానువు—స. సూర్యుఁడు, శివుఁడు, వృద్ధుఁడు, మదాంధుఁడు, మబ్బు, రాజు, దినము, కిరణము.

భామము— స. క్రోధము, శోభ.

భారతి—స. సరస్వతి, వాక్కు, ఒక నది, ఒక పక్షి, మెఱపు, జ్ఞానముద్ర, ఒక కావ్యము.

భార్గవి—స. పార్వతి, లక్ష్మి, సరస్వతి, గరిక, తులసి.

భావము—స. సత్తు, మనోవికారము, అభిప్రాయము, ఆత్మ, పుట్టుక, స్వభావము, ధాత్వర్థరూపక్రియ, రత్యాది, వస్తువు, అర్థకారణము, ఉనికి, కలుగుట, అగుట, స్థితి, భక్తి, పద్ధతి, నిష్కపటము, ప్రేమ, తలంపు, సారము, హృదయము, నిశ్చయము, ధ్యానము, ప్రపంచము, మోహాభినయము, జ్ఞానేంద్రియము, జాతకములోని 12 గృహములు.

భిక్ష—స. బిచ్చము, వేడుకొనుట, బిచ్చమెత్తిన వస్తువు, కడికొలఁది యన్నము, కొలువు, కూలి.

భిత్తి—స. గోడ, చాప, తావు, కాంతి, పగులఁగొట్టుట, దోషము, జుత్తిలి, అవసరము.

భిన్నము—స. పగిలినది, వేఱుపడినది, కూడియున్నది, భాగము, శోణనీల రత్నదోషము, విరిసినది.

భీష్ముఁడు—స. భయంకరుఁడు, శివుఁడు, రక్కసుఁడు, శంతనుపుత్త్రుఁడు.

భూతము—స. ప్రాణి, దేవతాభేదము, పృథివ్యాది, కడచినది, సత్యము, పొందఁబడినది, న్యాయము, బలము, వెలసినది, భస్మము.

భూతి—స. ఐశ్వర్యము, భస్మము, పుట్టుక, గజవిలాసము.

భూభృత్తు—స. రాజు, కొండ.

భూరి—స. బంగారము, విశాలము, బ్రహ్మ, విష్ణువు, శంకరుఁడు, అధికము.

భూషణము—స. ధర్మము, విల్లు, యజ్ఞము, పుణ్యము, న్యాయము, అలంకారము.

భృగువు—స. శుక్రుఁడు, జమదగ్ని, అగ్ని, పరాక్రమము, రాహువు, కొండచరియ, ఒక ముని, శివుఁడు.

భేకము—స. కప్ప, భయపడుట, మబ్బు.

భోగము—స. సుఖము, రాజ్యము, పాముయొక్క శరీరము, భోజనము, ధనము, పంట, వేశ్యాదుల కిచ్చెడు వెల, అనుభవము, పూజ, పాముపడగ.

భోగి—స. పాము, రాజు, ఈశానుఁడు, కరణము, మునసబు, సుఖించువాఁడు, మంగలి, ఒక పండుగ.

భ్రమము—స. నీటిసుడి, భ్రాంతి, తరిజెపట్టునాయుధము, మూర్ఛ, నీరు ప్రవహించుతూము, తిరుగుడు.

మంజరి—స. చిగిరించిన లేఁతకొమ్మ, బొట్టుగుచెట్టు, పూఁచిన లేఁతకొమ్మ, పూగుత్తి, పెద్ద ముత్తెము.

మంజులము—స. పాఁచి, ఒకదినుసు, కూకురుగుండెఁగపక్షి, పక్షి, పొదరిల్లు, మనోహరము, ఒప్పిదము.

మండ—దే. ముంజేయి, కుండ, చీల మండ, వేపుడుసుచ్చు, భూమి, జెండా, జిగురు, కొమ్మ.

మండపము— స. మీగడ, నూనె లోనగువానిచేత, గంజి, బలము, శాకము, నెమలిపింఛము, ఆముదము చెట్టు, భూషణము.

మండలము— స. దేశము, కుక్క, సమూహము, సూర్యచంద్రుల బింబము, 12 గురు రాజులు, 40 దినముల కాలము, విలుకాని నిలుకడ, ఒక వ్యూహము, ఇంద్రునికత్తి, అలంకారము, సూర్యచంద్రులకు కట్టు గుడి.

మండలి—స. గుంపు, పిల్లి, పాము, కుక్క, శుక్రుడు, సూర్యుడు.

మంథరము—స. కవ్వము, ఆకసము, నడుము, వృద్ధి, చక్రము, మెల్లగాఁ బోవునది, చొరవలేనిది, వంకరైనది, విశాలమైనది.

మందరము— స. కవ్వపుఁ గొండ, అలసము, మందారమనుకల్పవృక్షము, బహుళము.

మందు—దే. ఔషధము, ప్రతిక్రియ, వశ్యౌషధము, ఉపాయము, తుపాకిమందు, దుర్లభము, విషయము.

మందుఁడు—స. శని, అల్పుఁడు, చొరవలేనివాఁడు, ఇచ్చవచ్చినట్లు తిరుగువాఁడు, మూర్ఖుడు, నిర్భాగ్యుఁడు, వ్యాధిగ్రస్తుఁడు, అసమర్థుఁడు.

మణి—స. రత్నము, కడియము, వర్ధామాము, ముత్యము, ఒక సర్పము, అజాగళస్తనము.

మతము—స.అభిప్రాయము,శాస్త్రము, సమ్మతి, తెలియఁబడినది, స్మార్తాది మతము, పూజింపఁబడినది, జాతి సమ్మతము.

మతి—స. మనస్సు, వాంఛ, వాక్కు, బుద్ధి, తలఁపు.

మత్కుణము— స. నల్లి, కొబ్బరి కాయ, దున్నపోతు, కొబ్బరిచెట్టు, దంతములులేని యేనుఁగు.

మదము—స. క్రొవ్వు, రేతస్సు, గర్వము, సంతోషము, కస్తూరి, కల్లు.

మదనము— స. ఆమని, మైనము, మంగచెట్టు, ఉమ్మెత్తచెట్టు, కామశాస్త్రము, ములగచెట్టు, పక్షి, వసంత ఋతువు, కౌంరి.

మధుకరము—స. భిక్షాన్నము, జీవన వృక్షము, తుమ్మెద.

మధురస—స. చాగచెట్టు, పిన్నపాల చెట్టు, ద్రాక్షలత.

మధురసము— స. మకరందము, మాధుర్యము, తేనె.

మధువు—స. తేనె, పాలు, నీరు, కల్లు, మకరందము, చైత్రము, వసంతఋతువు, ఇప్పచెట్టు, నెయ్యి, ఒకరక్కసుఁడు, పాలకూర.

మధూలిక—స. పుప్పొడి, మకరందధార, చాగచెట్టు.

మధ్యమ—స. దుద్దు, నడిమి వ్రేలు, వాగ్భేదము, చెఱసాల, పౌర్ణమి, క్రొత్తగ సమర్తాడిన పడుచు.

మధ్యమము—స. నడుము, నడిమిది, ఒక స్వరము.

మధ్యము- స. అవకాశము, న్యాయము, నడికరముది, నడుము, నడిమిది.

మనికి—దే. స్థానము, జీవనము, వాసగృహము, నివసించుట, వర్తనము.

మనువు—స. మంత్రము, విష్ణువు, కాలాగ్రజుఁడు, (దే) మగఁడు, జీవనము, వర్తనము, మనుఁగు, పోషించు.

మన్నెము—త. సన్మానించి యిచ్చిన భూభాగము, పన్నులేనిభూమి, కొండభూమి.

మన్యువు—స. క్రోధము, శోకము, దైన్యము, అగ్ని, యజ్ఞము, అహంకారము.

మబ్బు—దే. మేఘము, అజ్ఞానము, చీఁకటి.

మరియాద—త. క్రమము, మర్యాదమేర, కట్టుబాటు, గౌరవము.

మరుత్తు—స. గాలి, వేల్పు, పిక్క.

మరులు—దే. మోహము, పిశాచము.

మర్కము—స. గాలి, మనస్సు.

మర్కటము—స. కోఁతి, సాలెపురుగు, పంది, స్త్రీరతి, ఒక పక్షి, ఒకవిషము.

మర్యాద—స. పొలిమేర, నడత, నిష్ఠ, కట్టుబాటు, తీరము, సన్మానము.

మఱు—దే. వృత్తియందు మఱుఁగు మాఱు, మఱుసటి, శబ్దముల కాదేశ రూపము. (మఱుపడు, మఱునాఁడు, మఱుమాట మొ.)

మలము—స. పురీషము, స్త్రీరజస్సు, పాపము, మురికి.

మల్లము—స. మల్ల, ప్రమిద, బలమైనది, శ్రేష్ఠము, గొప్పది, చెక్కిలి, చెంబు.

మల్లు—దే. కోఁతి, జెట్టియుద్ధము.

మసలు—దే. తడయు, విహరించు, నీళ్లు మలమలకాఁగు, వెనుకకుతిరుఁగు.

మహాధనము—స. చిల్లమడ్డి, కృషి, బంగారు, గొప్పవెలగల వస్తువు లేక వస్త్రము, గొప్పవెలగలది.

మహి—స. భూమి, శక్తి, జ్ఞానము, మహిమ, ఉత్సవము, నాసికాగ్రము, ఒక నది.

మాతృక—స. తల్లి, పెంపుడుతల్లి, న్యాసము, బ్రాహ్మ్యాద్యాది సప్తమాతృకలు, దాది, సవతితల్లి, మూలగ్రంథము.

మాత్ర—స. అక్షరావయవము, వర్ణము, అలంకారము, సందేహము, నిశ్చయము, కొలఁది, సర్వము, ధనము, పరివారము, త్రుటికాలము.

మాధవి—స. కల్లు, కల్లుబెల్లము, నేపాళపుచెట్టు, విషాగమము, తేనె, చక్కెర, లక్ష్మి, తుంటెనకత్తె, మాదీఫలము.

మానము—స. కొంచెము, గ్రహము, స్త్రీలకోపము, మానిక, గర్వము, అభిమానము, మరియాద, స్త్రీ పురుషుల గుహ్యావయవము, తులామానము, మనోగౌరవము.

మాను—దే. విడుచు, చెట్టు, మనోజ్ఞత, ఒప్పు.

మాయ—స. అజ్ఞానము, రతీదేవి, పార్వతి, హరిద్వారము, కపటము, ఇంద్రజాలము, దయ, మోసము, లక్ష్మి, భ్రమ.

మారి—స. మారణము,మశూచి, లక్ష్మి, వ్యభిచారిణి, జనక్షయ రోగము, పార్వతి, ఒక గ్రామదేవత.

మారుతి—స. స్వాతీనక్షత్రము, భీముఁడు, హనుమంతుఁడు.

మార్గము—స. త్రోవ, మార్గశిర మాసము, వెదకుట, బౌద్ధజ్ఞానభేదము, మూడి, కస్తూరి, మృగశిర.

మార్జనము—స. తుడుపు, శుభ్రము, లొద్దుగుచెట్టు, ప్రోక్షించుట.

మాల—స. చండాలజాతి విశేషము, పూదండ, వరుస, దిబ్బ, వంచన, గుంపు, పిక్కచెట్టు.

మాలిక—స. పుష్పములదండ, విరజాజి చెట్టు, కూఁతురు, ఒక నది, ఒక పక్షి, రాజగృహము, సమూహము, పంక్తి రూపమైనది.

మాలిమి—దే. ప్రేమ, వాత్సల్యము, నావికాశాస్త్రము, నావికాశాస్త్ర వేత్త.

మావి—దే. మనుష్యాది గర్భస్థ శిశువునకు మీఁదనుండు పొర, మామిడి చెట్టు.

మావు—దే. అశ్వము, అశ్వసంగమము, చేపలబట్టు సాధనము.

మాషము—స. మినుములు, మూర్ఖము, 5 గురిగింజలయెత్తు.

మాహిషికుఁడు—స. పశుపాలకుఁడు, విటుఁడు, స్వభార్యా వ్యభిచారముపై జీవించువాఁడు.

మించు—దే. అతిశయించు, అతిక్రమించు, కాలిచుట్టు, ఆధిక్యము, ప్రకాశము, మెఱుపు.

మిడుకు—దే. జీవము, బ్రతుకు, త్రుళ్లు, పరితపించు, సంచరించు, ఆఱు.

మినుకు—దే. కిరణము, మంగళసూత్రము, వేషము, ఒక భూషణము, చిన్న బంగారునాణెము, ప్రకాశించు.

మిన్న—త. భూషణము, మణి, శ్రేష్ఠమైనది, పదోత్తరఘటిత శ్రేషవాచకము, (దే) ఆకాశము.

మిసి—స. సదాప, వాము, జటామాంసి, (దే) మత్స్యభేదము.

మీఁదు—దే. పరము, పైభాగము, ముందు, రాఁబోవుకాలము.

మీఁటు—దే. ఎగఁద్రోయు, తేలుకుట్టు, ఉద్రేకము, ఆధిక్యము, వీణెమీటు, పొడుచు.

ముంత—దే. చెంబు, కుండ, మానిక, మూఁడున్నరసేరు.

ముంతమామిడి—దే. ఒకానొకవృక్షము, జీడిమామిడి, అగ్రబీజము.

మిత్రుఁడు—స. సూర్యుఁడు, శత్రుదేశపు రాజు, స్నేహితుఁడు.

ముక్కు—తె. శ్వాసనుస్తంభించు, స్తనాగ్రము, నాసిక, తుద, చెడిపోవు.

ముఖము—స. మొగము, మాట, నోరు, తల, చనుమొన, ద్వారము, వైపు, పీఠిక, పైభాగము, ప్రధానము, ఉపాయము, మొదలు, ఆధారము, ఊరిముందరి భూమి, రాగి, ఆరంభము, ఒకనాటక సంధి.

ముగ్ధ—స. యౌవన ముదయించుచున్న స్త్రీ, తెలివిలేనిది, క్రొత్తది, చక్కనిది.

ముచ్చట—దే. సల్లాపము, ప్రేమము, కోరిక, రమ్యము, వేడుక, వృత్తాంతము.

ముట్టు—దే. ఆఁడుదాని రజస్సు, తాఁకుట, సాధనము, శత్రువులను ముట్టడించు, కడముట్టు.

ముడి—దే. గ్రంథి, ఎద్దుమూపురము, సంధి, కలహము, వికసింపనిది, పొట్టు తోనుండునది, దారపుముడి, మలవిసర్జనావయవము.

మునుము—దే. వరుస, ఎదటిచోటు, సేనాముఖము, తఱుచుఁదనము.

మురువు—దే. సౌందర్యము, గర్వము.

ముష్టి—స. కత్తిపిడి, [illegible]ద్ధి, చెట్టు, సో[illegible]గుతులముల యెత్తు, పిడి[illegible]ద్రవ్యము, [illegible]

ముసలి—స. ఉడుము, బల్లి, బలరాముఁడు, నేలతాడి, (దే) వృద్ధు.

ముహూర్తము—స. పంద్రెండుక్షణములకాలము, రెండుగడియలకాలము, అల్పకాలము, శుభకార్యము.

మూఁగ—తె. మూఁగవాఁడు, దోమ, ఒక పక్షి.

మూర్తి—స. శరీరము, యమదండము, కాఠిన్యము, ప్రతిమ.

మూర్ధాభిషిక్తుఁడు—స. క్షత్రియుఁడు, రాజు, ముఖ్యుఁడు, చక్రవర్తి, మంత్రి, శిరస్సునం దభిషేకము చేయువాఁడు.

మూల—స. ఒక నక్షత్రము, కోణము, వైపు, సందు, కొప్పు.

మూలము—స. వ్యాఖ్యానము లేని గ్రంథము, ఊడ, వేరు, సమీపము, కారణము, గుదస్థానమునఁ గల్గు రోగవిశేషము, ప్రధానము, ఆధారము, పునాది, ఒకనక్షత్రము, ముఖ్యపట్టణము, పొద, క్రిందిభాగము.

మృగము—స. జింక, పశువు, ఏనుఁగు, మృగశీర్షానక్షత్రము, వెదకుట, యాచన, వేఁడికోలు, వేఁట, కస్తూరి.

మెట్ట—దే. నీరులేక పండెడు సస్యము, కొండ, దిబ్బ, మెరకనేల.

మెట్టు—దే. సోపానము, కొండ, తిప్ప, [illegible]త్రము, మజ్జిగ, తొక్కు.

మెత్త[illegible] పలుపు, మృదువైనది,

చిన్నదిబ్బ మట్టిగోడఅండ గుజ్జుపు పల్లము.

మెయి — దే. శరీరము తృతీయావిభక్తి యందు వచ్చు ప్రత్యయము విధము పార్శ్వము.

మెఱుఁగు — దే. వెలుతురు, కాంతి కిరణము, నేయి మొదలగువాని జిడ్డు, మెఱుఁగుపెట్టుట

మేఖల — స. మొలనూలు కత్తిపిడి, కొండనడుము, చిలుకడ్రాడు.

మేధా(వి)వంతుఁడు — స. చిలుక సూక్ష్మబుద్ధి గలవాఁడు.

మేర — దే ఎల్ల, హద్దు, ప్రదేశము, క్రమము, కట్టుబాటు

మేలిమి — దే మంచిబంగారము గౌరవము, ఉత్తమత్వము

మేలు — దే క్షేమము, ప్రేమము, స్నేహము, లాభము, సౌందర్యము, సుకృతము అధికము, ఉపకారము.

మై — దే శరీరము రీతి ప్రక్క.

మొద — త ద్వారము మొగ్గ అప్రాణి వస్తుముఖము, తొలి మొన నదీసముద్రాదుల ముఖము

మొన — దే అగ్రము, ముందు సేన, వ్యూహము.

మోక్షము — స. కైవల్యము మృత్యువు, మొక్కపుచెట్టు, విడుపు గ్రహణము యొక్క తుద.

మోచకము — స. అరటిచెట్టు, విడుచునది, విసుగునది, మునగచెట్టు.

మోపు — దే మోయఁజేయు, అనించు, గడ్డికట్ట భారము, ఆరోపించు వింటి నారి ఆధిక్యము.

మోహము — స అజ్ఞానము, వలపు, పొరపాటు బాధ, ఆశ్చర్యము, మూర్ఛ చిత్తవికలత్వము

మౌళి — స. నేల, అశోకము, కొప్పు, కిరీటము జటాజూటము, జుట్టు, శిరము.

యంత్రము — స. బీజాక్షరచక్రము, తిరుగలి, ఉపాయము, ఎండ్రి, సూత్రము, పనిముట్టు.

యక్షకర్దమము — స. కర్పూరము చందనము, కుంకుమపువ్వు అగరు, కక్కోలము కస్తూరి వీనితోఁ జేయఁబడిన కలపము.

యతి — స. పద్యవిశ్రమస్థానము, నియమము, సన్యాసి

యత్నము — స. ఉద్యోగము, జాగ్రత, తెలివి కష్టము, పట్టుదల, కడక, పాటు.

యమకము — స శబ్దాలంకారము, సంయమము, వస్తువుల జంట

యాతువు — స. రాక్షసుఁడు యమధర్మరాజు, వెడలువాఁడు, వాయువు.

యాత్ర — స. పోవుట, కాలక్షేపము చేయుట, పుణ్యక్షేత్రములనుగూర్చి పోవుట, జాతర, మాట్టడి, ఉత్సవము, జీవనాధారము. మార్గము.

యాపనము — స. కాలము గడపట-

ప్రాణరక్షణము, వాడుక, తిరస్కరించుట, ఆలస్యము.

యోగము—స. ధ్యానము, ఉపాయము, విష్కంభము మొదలగునవి, కూడిక, కవచము, ధనము, ఉద్యోగము, ఔషధము, నూతన వస్తుప్రాప్తి, రాజయోగము, మందుల సమూహము, అదృష్టము, సంబంధము, ఒకశాస్త్రము, సమయము, ఉపయోగము, విధానము, కాఁడి, ఆధారము, వాహనము, ఫలితము, ముఖము, కార్యము, శరీరస్థైర్యము, భాగ్యము, సూత్రము, భక్తి.

యోని—స. ఆఁడుగుఱి, గని, కారణము, జన్మస్థానము, బంగారు, రత్నములు పుట్టుచోటు, నివాసస్థానము.

రంకుఁడు—స. లోభి, శెట్టి.

రంగము—స. తగరము, నాట్యస్థానము, యుద్ధభూమి, రంగు, వైకుంఠము, చప్పుడు, స్వరభేదము, శ్రీరంగము, నాట్యము, ఆనందము, గుంపుగలచోటు.

రంధ్రము—స. బిలము, తప్పు, నవసంఖ్య, నింద.

రక్తము—స. నెత్తురు, కుంకుమపువ్వు, ఎఱుపు, కుంకుమ, రాగి, అనురాగము కలది, ఎఱ్ఱనిది.

రక్ష—స. రక్షణము, వాఁత, లక్క, తోరము, జాగ్రత్త, మంత్రమూలికా విశేషము, మసిబొగ్గు, రక్షణమునకు నుదుట ధరించెడు భస్మవిశేషము.

రచ్చ—తె. రాజమార్గము, సభ, మండపము, గోష్ఠి, జగడము, కలకలము.

రజతము—స. వెండి, బంగారము, రక్తము, నక్షత్రము, గజదంతము, ఒక కొండ, తెల్లనిది, హారము.

రజస్సు, రజము—స. ఒక గుణము, మట్టు, నెత్తురు, ధూళి, పుప్పొడి.

రతి—స. సంభోగము, అనురాగము, మన్మథుని భార్య, ఆఁడుగుఱి, (దే) పచ్చల తూనికయందొక యెత్తు, మణుగులో 25-వ భాగము.

రత్నగర్భుఁడు—స. సముద్రుఁడు, కుబేరుఁడు.

రథము—స. తేరు, కన్ను, పాదము, శరీరము, ప్రబ్బలి.

రసము—స. పాదరసము, శృంగారాది, జనము, కషాయాది, రుచి, అనురాగము, పసరు, వీర్యము, దేహధాతువిశేషము, ద్రవ్యము, విషము, చారు, పాలు, అందము, బంగారు, సారము, రసకర్పూరము, నాలుక, ప్రేమ, సంతోషము, చెఱకురసము, అమృతము, నేయి, కోరిక.

రసాల—స. నాలుక, మజ్జిగ, గఱిక, శర్కర, మెంతిపెరుగు, నేలగుమ్మడి, ద్రాక్షతీగ, చెఱకు.

రసాలము—స. మామిడి, చెఱకు, చిల్లమడ్డి, గంధరసము.

రాక—స. షోడశకళలతోఁ జంద్రుఁడుండు పున్నమ, రజస్వలైనది, గజ్జి, తీఁట, ఒక యేఱు, వచ్చుట.

రాగము—స. నాట లోనగునది, అనురాగము, ఆశ, మాధుర్యము, కాంతి

మాత్సర్యము రంగు క్లేశములోనగు నది అందము సంతోషము, ఎఱుపు కోపము రజోగుణము, అసూయ

రాజు—స ప్రభువు క్షత్రియుఁడు పుడమిఱేఁడు యక్షుఁడు ఇంద్రుఁడు, చంద్రుఁడు

రామము—స. కుష్ఠము, పెద్దదుప్పి వాస్తుకవృక్షము, అందమైనది, తెల్లని నల్లని

రాముఁడు—స. శ్రీరాముఁడు, బలరాముఁడు, పరశురాముఁడు, బ్రహ్మ గృహస్థుఁడు,

రాష్ట్రము—స రాజ్యము, ఉపద్రవము

రాసము—స. గొల్లక్రీడ కొలువు, రసము, మాత్యాలహారము, కోలాహలము, ధ్వని.

రిష్టము—స క్షేమము, అభావము కుంకుడుచెట్టు పాపము, అశుభము ఖడ్గము

రీతి—స విధము, సంగీతము, మర్యాద వ్యవహారము, జారుట ఇత్తడి చిట్టెము

రుచకము—స సౌవర్చలవణము, అశ్వాభరణ విశేషము సజ్జికాక్షారము మాల్యము, దంతము, మంగళద్రవ్యము రాజగృహవిశేషము మాదీఫలపుఁజెట్టు కంఠాభరణ విశేషము, ఆముదపు చెట్టు.

రూపము } స ఆకృతి సౌందర్యము,
రూప్యకము } జంతువు పదము, గ్రంథపఠనము, నాటకము వెండి లేక బంగారు నాణెము స్వభావము శ్లోకము.

రేపు—దే ప్రాతఃకాలము, వెనుకటి దినము, పూర్వాహ్ణము.

రేఫము—స రవర్ణము, చప్పుడు ధర్మము, నీచము.

రేవు—దే ఘట్టము సముద్రమునందు సరకులు ఎగుమతి దిగుమతి చేయు చోటు, రేగుచెట్టు, కరవాకపట్టణము.

రోచనము—స. ప్రియమైనది, కాంతి గలది, దానిమ్మ బూరుగు, ఉల్లి కుంకుమ.

రోహితము—స. నెత్తురు వంకరలేని యింద్రధనుస్సు, ఒక చేఁప అగ్ని వాహనము కొరదు మోదుగచెట్టు, ఎఱ్ఱమీను, ఎఱుపు, కేసరిమృగము, ఎఱ్ఱనిది.

రౌద్రము—స నవరసములలో నొకటి దినమునందలి మొదటిభాగము క్షయ రోగజ్వరము, ఎండ, తీక్ష్ణము, భయంకరము

లంఘనము—స. దాఁటు గుఱ్ఱపు దూకుడు నేరము అన లంకణము.

లంభనము—స దూషించుట సంపాదించుట, పొందుట

లక్షణ—స ఒక శబ్దవృత్తి ఆఁడు బెగ్గురు పక్షి, ఒక యోషధి.

లఘువు—స. పిక్కచెట్టు, శీఘ్రము, చులకనిది నలఆగరు, మనోహరమైనది.

చేవలేనిది, హ్రస్వాక్షరము, చిన్నది, అక్షరవిశేషము, నీచము.

లత—స. తీఁగ, గరిక, ముత్యాలపేట, పువ్వులగురివెంద, కొమ్మ, చీమ, సాలెపురుగు, కస్తూరి.

లపనము—స. భాషణము, నోరు, ముఖము.

లయము—స. నీటివట్టివేరు, కౌఁగిలింత, నాశము, కరఁగుట, దాఁగుట, విశ్రాంతిస్థానము, చేరిక, అదృశ్యమగుట, అంటుకొనుట, కలిసిపోవుట.

లలామము—స. చిహ్నము, శ్రేష్ఠము, నగ, రత్నము, జెండా, కొమ్ము, సామర్థ్యము, తోఁక, బొట్టు, గుఱ్ఱము.

లేపము—స. పూఁత, సున్నము, భోజనము లోనగునది, తైలము, గచ్చు, అలుకుట, గాయమునకు వేయుమందు, మరక, పాపము.

లోల—స. నాలుక, ఆశ, తామర, మిక్కిలి యిచ్ఛగలది, లక్ష్మి, కదలునది, 55 సం॥ములకు మించిన స్త్రీ.

లోహితము—స. రక్తచందనము, కుంకుమపువ్వు, నెత్తురు, ఒక నదము, ఎఱ్ఱనిది.

వంక—తె. వంకర, దిక్కు, పక్షము, కొలువు, వంపు, వాగు, స. గుఱ్ఱపు జీను, వక్రమైనది, నదీవక్రము.

వంగము—స. తగరము, సత్తు, కోయిల, ప్రత్తి, వంగమొక్క, ఒకదేశము.

వంటుఁడు—స. బ్రహ్మచారి, పొట్టివాఁడు, భటుఁడు.

వంశము—స. తండ్రితాతల పరంపర, వెన్నెముక, గుంపు, ప్రేపబెత్తము, పిల్లనగ్రోవి, వెదురు, కులము.

వధువు—స. ఆఁడుది, కోడలు, పెండ్లాము, పెండ్లికూఁతురు, సంపంగిమొగ్గ, పిక్కిచెట్టు.

వప్రము—స. నగము, కోటకొఱడు, తీరము, కోట, వరిమడి, చెలియలికట్ట, వారధి, కొండనెత్తము.

వరణము—స. వరించుట, ప్రహరి, వంతెన, వేష్టనము, ఉలిమిరిచెట్టు.

వరము—స. కుంకుమపువ్వు, వరించుట, దేవతలనుండి పొందు అభీష్టము, పిచ్చుక, ఒకనిధి, శ్రేష్ఠము, కోరిక, వరి, కొంచెముహితమైనది, ఉత్తమము, అందమైనది. బహుమానము.

వరాంగము—స. శిరము, గుహ్యము, ఏనుఁగు, శ్రేష్ఠావయవము.

వరాటకము—స. గవ్వ, మోకు, తామరపూస.

వరివస్య—స. సేవ, కాచియుండుట, ఉపాసనము, సన్మానము.

వరుఁడు—స. పెండ్లికొడుకు, రాజు, శ్రేష్ఠుఁడు.

వరుణము—స. ఉలిమిరిచెట్టు, వరుణపర్వతము, దినముయొక్క 14 వ భాగము, జలము.

వరుస—దే. పంక్తి, వంతు, పరంపర, క్రమము, సామ్యము, పర్యాయము.

వర్గము—స. అధ్యాయము, తెగ, గుంపు, బలము, సజాతీయవర్గము, లబ్ధము.

వర్చస్సు—స. తేజము, రూపము, మలము.

వర్జనము—స. విడుపు, త్యాగము, బాధపెట్టు, దానము, హింస, వధము.

వర్ణము—స. అక్షరము, ఆకారము, బంగారము, రంగు, భేదము, జాతి, స్తుతి, గుణము, కంబళము, కులము, యశస్సు, మూఁత.

వర్ణి—స. బ్రహ్మచారి, వ్రాఁతగాడు, ఋషి, చిత్తరువు వ్రాయువాఁడు, కఁది, మూర్ఖుఁడు, సందరము.

వర్షము—స. వాన, జంబూద్వీపము, ఏఁడాది, భారతాది, మబ్బు, పేడితనము.

వర్షాభువు—స. కప్ప, పట్టుపురుగు, గలిజేరు, ఎఱ్ఱ, వర్షాకాలమునఁబుట్టునది.

వరాహము—స. పంది, ముస్తె, కోఁతి, ఉత్తరపదమైనచో శ్రేష్ఠవాచకము, కొండ, వరహా.

వలను—దే. దిక్కు, ప్రక్కన, నేర్పు, ఉపాయము, ప్రదక్షిణము, యుక్తము, కుడి, దక్షిణము, చాతుర్యము, అనుకూల్యము, శకునము, ఒప్పిదము, విధము.

వలాహకము—స. కృష్ణుని రథ్యములలో నొకటి. మేఘము, పర్వతము.

వల్లవుఁడు—స. గొల్లవాఁడు, వంటవాఁడు, భీముఁడు.

వశము—స. అధీనము, కోరిక, ప్రభుత్వము.

వసతి—స. గృహము, ఉనికి, రాత్రి, బౌద్ధలయము, జైనాలయము, పుట్టువు, సుఖప్రదము.

వసువు—స. ధనము, రత్నము, కిరణము, అగ్ని, ఒకరాజు, పలుపు, సువర్ణము. బద్ధి, గంధద్రవ్యము, నల్లన, మధురమైనది, దేవతావిశేషము.

వస్నము—స. వస్త్రము, కస్ని, భృతి, ధనము, మూల్యము.

వాగ్మి—స. చిలుక, సరసముగాఁబలుకువాఁడు, బృహస్పతి

వాగీశుఁడు—బ్రహ్మ, కవీశ్వరుఁడు, వాక్చాతుర్యముగలవాఁడు, బృహస్పతి.

వాజము—స. నేయి, నీరు, అన్నము, ధ్వని, స్వచ్ఛము, విష్ణునగుడి, వేగము, బాణము, ఱెక్క, హవిస్సు.

వాజి—స. గుఱ్ఱము, పులుఁగు, ములుఁకు.

వాడ—దే. వీథి, గృహపంక్తి, సుగంధము.

వాణిని—స. నాట్యకత్తె, కుంటెనకత్తె, కపటముగలది, త్రాగుబోతుస్త్రీ, కాముకురాలు, వేశ్య, మదించినయువతి.

వానము—స. చాఁప, పరిమళము, బిలము, ఎండినకాయ, కుట్టుపని, కుమ్మరము, నీటిగాలి, గండస్థలము, ఆటవికము, గతి.

వారము—స. మద్యపాత్రము, ఏడు దివసముల కాలము, మంద, ఆచ్ఛాదనము, తడవ, సమయము, జలసంఘము, సమూహము, వాకిలి, వంతు, నదికి ఆవలి యొడ్డు.

వారాహి—స. నేలతాడు, ఆఁడుపంది, పాఁచితీగ, ఒక మాతృక.

వారిజము—స. తామర, ఉప్పు, శాడితచెట్టు, శంఖము.

వారి—స. నీరు, ఏనుఁగునుకట్టుత్రాడు, ఆయుధధార, చిన్నకుండ, పంచదార, కురువేరు, కుండ, సరస్వతి.

వారుణి—స. పడమటిదిక్కు, కల్యము, యముని భార్య, శతభిష నక్షత్రము, మద్యము, గరిక.

వాలు—దే. అతిశయించు, వంగు, అతిక్రమించు, వ్రాలు, (త) కత్తి, వాడిమి, క్రూరము, పొడవు.

వాల్లభ్యము—స. ప్రభుత్వము, దయ, ప్రీతి, చొరవ, నమ్మకము, బలము, భక్తి, సఖత్వము.

వాసంతి—స. పూలగురిజ, అడవిమొల్ల, ఒంటె, దుర్గ.

వాసన—స. గంధము, వస్త్రము, వస్త్రసంబంధమైనది.

వాస్తువు—స. ఇల్లు, ఇంటిస్థలము, వాస్తుశాస్త్రము.

వాహిని—స. నది, సేన, రథములు 81, ఏనుఁగులు 81, గుఱ్ఱములు 243, కాల్బలము 405 గల సేన.

వికల్పము—స. భ్రమ, అవాంతరకల్పము, పొరపాటు, ఒక అలంకారము, అనిశ్చయము, విధము, యుక్తి.

విక్రమము—స. అధికబలము, ఆక్రమించుట, అడుగుపెట్టుట, శూరత్వము, సాహసము.

విగ్రహము—స. శరీరము, విస్తారము, ఆఱుగుణములలో నొకటి, వస్త్రాభావము, యుద్ధము, విభాగము, బొమ్మ.

వితాకు—దే. నిశ్చేష్టత, పరధ్యానము, పరవశత్వము.

వితానము—స. మేలుకట్టు, గుంపు, అవసరము, జన్నము, ఇల్లు, లేకపోవుట, జబ్బు, బహుళము.

విధము—స. రీతి, జీతము, ఏనుఁగు, కబళము.

విధి—స. ధాత, కాలము, ఏర్పాటు, చేయుట, భాగ్యము, విధము, పని, ఆధారము, నిబంధనము, ఆజ్ఞ, మత విషయకమగు కర్మ, స్థితి, నడవడి, సృష్టించువాఁడు, అదృష్టహీనత.

విధువు—స. చంద్రుఁడు, గాలి, గజకుంభస్థల మధ్యప్రదేశము, విష్ణువు, రాక్షసుఁడు, కర్పూరము.

వినత—స. గరుత్మంతునితల్లి, వంకరైనది, వంపుపెట్టె, వంగినది, గురుశిక్ష కలది.

వినాయకుఁడు—స. విఘ్నేశ్వరుఁడు, గరుత్మంతుఁడు, బుద్ధుఁడు, గురువు.

విప్పు—దే. విడుచుట, వైశాల్యము,

విరియుట, బాహుళ్యము, కథనువిప్పు, విడఁదీయు.

విబుధుఁడు—స. వేలుపు, చంద్రుఁడు, పండితుఁడు.

విభావసుఁడు—స. సూర్యుఁడు, అగ్ని, చంద్రుఁడు, దొంగ.

విభుఁడు—స. ప్రభువు, నిత్యుఁడు, బ్రహ్మ, ఈశ్వరుఁడు.

విరసము—స. రసములేనిది, స్నేహవైషమ్యము, విరుద్ధరసము గలది, జగడము.

విరోచనుఁడు—స. చంద్రుఁడు, అగ్ని, సూర్యుఁడు, యుద్ధసర్మదుఁడు, ప్రహ్లాదుని కొడుకు.

విలక్షణము—స. వేఱైనది, యోగ్యము, సుందరము, మంచి లక్షణములు లేనిది, సామాన్యవిరుద్ధము, చూచుట, భేదము.

విలాసి—స. మన్మథుఁడు, చంద్రుఁడు, విష్ణువు, అగ్ని, శివుఁడు, భోగవంతుఁడు, సర్పము, చంద్రుని శంఖము.

విలోమము—స. కుక్క, పాము, క్రమమునకు విరుద్ధము, అవరోహణక్రమము గలది.

వివర్తనము—స. చుట్టివచ్చుట, నృత్యము, మార్పు, సమూహము, కంటిగ్రుడ్డు త్రిప్పుట, మాఱినస్థితి, దొర్లుట.

వివస్వంతుఁడు—స. సూర్యుఁడు, అగ్ని.

విశాఖము—స. కదురు, శాఖలులేనిది. విలుకాఁడు, రెండుకాళ్ళను జేనెడెడము గలుగ నిలుచుట.

విశేషము—స. అతిశయము, అవయవము, భేదము, వింతరూపము, చరిత్రము, తిలకము.

విషమము—స. సమముకానిది, విరుద్ధము, బేసి, గఱుకైనది, అక్రమమైనది, కష్టమైనది, చెడ్డది, అనుకూలము కానిది.

విష్కంభము-స. ఒక గ్రహయోగము, ఆటంకము, మ్రాను, నాటకాంగము, ఒక బంధము, ఎక్కువ.

విష్కిరము— స. కోడి, నెమలి, పక్షి, కముజు.

విష్టరము—స. చెట్టు, దర్భాసనము, కృష్ణాజినము, పీఠము, చోటు.

విస్రంభము—నమ్మకము, ఆజ్ఞ, ప్రేమ, హింసించుట, ప్రణయకలహము.

వీఁక—దే. ఉత్సాహము, అభివృద్ధి, పరాక్రమము, గర్వము, యుద్ధరంగమునుండి పరుగెత్తుట, ఔన్నత్యము, దీనత్వము, విధానము, సామ్యము.

వీఁగు—దే. ఉత్సాహముచేయు, యుద్ధమునఁ బరుగెత్తు, ఓడిపోవు, విక్కు, చలించు, తొలఁగు.

వీడు—దే. వదలు, వృద్ధిపొందు, విశదమగు, వీడఁజేయు, బహుమానము, పట్టణము, దండు, శిబిరము, మార్గస్థుల సమూహము, దొమ్మరవాండ్ర సమూహము.

వీధి—స. త్రోవ, వాక, పంక్తి, నాటక భేదము.

వీలు—దే. ఉపయోగించు, యుక్తము, అనుకూలము, చీలు, బద్దలగు.

వృత్తము—స. పద్యభేదము, జీవనము, తాఁబేలు, నడత, వరింపఁబడినది, గుండ్రమైనది, చుట్టఁబడినది, కడచినది, గట్టిది, చచ్చినది, ఒక గుండ్రమైన యాకృతి.

వృత్తాంతము—స. సమాచారము, కథ, ఏకాంతము, సంభావణము, రహస్యపు మాట, సమయము, ప్రకరణము, ప్రక్రియ.

వృత్తి—స. జీవనోపాయము, వ్యాపారము, నడవడిక, అభిదాది, కైశిక్యాది, వివరణగ్రంథము.

వృద్ధి—స. అభివృద్ధి, వడ్డి, ఒకమందు, సంతోషము, సుఖము, గుణకారము.

వృషభము—స. ఒకరాశి, ఏనుఁగు చెవి, ఎద్దు, తిరుమల.

వృషము—స. ఎద్దు, ఎలుక, పుణ్యము, వీర్యము, బలము, ఇసుక, గజ్జము, శ్రేష్ఠము, జలము, ధర్మము, అడ్డసరపు చెట్టు.

వృషలి—స. శూద్రస్త్రీ, గొడ్రాలు, కన్య, చచ్చుపిల్లలు కలది, పెండ్లి కాక మునుపు రజస్వలయైన పిల్ల.

వృష్ణి—స. పొట్టేలు, శ్రీకృష్ణుఁడు, ఒక యాదవుఁడు, ఇంద్రుఁడు, పొట్టి వాఁడు, వాయువు, పాషండుఁడు, అగ్ని.

వెనుక—దే. వెనుకభాగము, పడమర, ముందటిది, తరువాత, వెంబడి, అశ్రద్ధ.

వెన్ను—దే. వీఁపు, ఇంటి నడికొప్పు, వరికంకి.

వేగము—స. జవము, స్వర్గప్రియము, త్వర, ప్రవాహము, మలమూత్రాది ప్రవృత్తి.

వేది—స. యజ్ఞాదులకుఁ జదరముగాఁ గట్టిన తిన్నె, ముద్దుటుంగరము, తిన్నె విద్వాంసుఁడు, బ్రహ్మ, తెలిసినవాఁడు.

వేధ—స. బ్రహ్మ, విష్ణువు, విద్వాంసుఁడు, బాధ.

వేల—స. హద్దు, పొలిమేర, కాలము, రాజభోజనము, ఉప్పెన, అనాయాస మరణము, వ్యాధి, బుధుని పెండ్లాము.

వైవస్వతుఁడు—స. ఒక మనువు, శని, యముఁడు.

వైశికము—స. కపటము, దూష్యము, భోగముతనము, భోగముదానిది.

వ్యక్తి—స. జాతికి వేరై జాతికి ఆశ్రయమైనస్వరూపము, దృశ్యము, ఉనికి, భేదము, స్పష్టత, ఏకవస్తుబోధకము, జాతివ్యక్తులలో జాతికానిది.

వ్యవసాయము—స. ప్రయత్నము, పరిశ్రమ, కృషి, పాటుపడుట, నిశ్చలబుద్ధి, పట్టుదల, చావ నిశ్చయించుకొనుట, వృత్తి, పని, వర్తకము, యుక్తి, ప్రవర్తన.

వ్యసనము—స. ఆపద, ఆసక్తి, కామక్రోధములవలనఁ బుట్టిన దోషము, పాపము, నిష్ఫలమైన ప్రయత్నము, అపాయము, చెడువాడుక, వేఁట చేయుట, చింత, నష్టము, శ్రద్ధ, నాశము, నేరము, అసమర్థత, దండన.

వ్యలీకము—స. అప్రియము, అచ్చెరుపాటు, అకార్యము, అసత్యము, సిగ్గు, బాధ, మోసపుచ్చుట, మన్మథావేశముచేఁ జేయఁబడిన కామినీజనాపరాధము.

వ్యాళము—స. క్రూరమృగము, పాము, మత్తగజము, ద్రవ్యవ్యయము, పులి.

వ్యూహము—స. సేన, దేహము, గుంపు, నిర్మాణము, గుమిగూడుట.

వ్యోమము—స. ఆకాశము, నీరు, మబ్బు.

వ్రజము—మధుర, గుంపు, మార్గము, గమనము, పసులశాల.

శంకువు—స. ఆకు, చేఁప, బాణము, సంఖ్య, మేకు, శిశ్నము, ప్రేవుల గుంపు, శివుఁడు, ఒకచెట్టు, పాపము, కొమ్మలులేక మోడువడినచెట్టు, నీటి పంది.

శంబూకము, శంబుకము—స కప్పచిప్ప, ఏనఁగు కుంభస్థలముకడచోటు, నూక.

శంబుకుఁడు—రామహతుఁడగు శూద్ర తపస్వి.

శంభువు—స. శివుఁడు, విష్ణువు, బ్రహ్మ, బుద్ధదేవుఁడు, సిద్ధుఁడు.

శకలము—స. తునుక, చేఁప, పక్షి, నారచీర, నారచెట్టు, పట్ట.

శక్తి—స. బలిమి, చిల్లకోల, పార్వతి, ఇచ్ఛాది, సత్త్వాది, ఉత్సాహాది, వశిష్ఠుని కుమారుఁడు, బల్లెము, సహాయము, పరాశరుని తండ్రి, సామర్థ్యము.

శక్వరి—స. ఒక ఛందస్సు, ఒడ్డాణము, సంకరజాతిస్త్రీ, ఏఱు.

శచి—స. ఇంద్రుని భార్య, పిల్లపీఁచర మొక్క.

శతకోటి—స. వజ్రాయుధము, నూఱుకోట్లు.

శతపత్రము— తామర, వెగ్గురుపక్షి, నెమలి, రాచిలుక, వడ్లంగిపిట్ట.

శయువు—స. పెనుఁబాము, తూము కాలువ.

శరీరము—స. దేహము, మృతశరీరము, బలము.

శర్కర—స. చక్కెర, మధుమేహము, ఋగ్వేదము, చిల్లపెంకు, తునుక, గులకఱాయి, ఱాతినేల.

శలాక—స. గొడుగు లోనగువానికమ్మి, బాణము, వీణాది వాద్యసాధనవిశేషము, ఏదుపంది, సన్నని లోహపుకడ్డీ, దర్భఁకట్ట, ఎముక.

శల్యము—స. ఎముక, సలాక, బాణము, విషము, చిల్లకోల, మేకు, ఏదుపంది, ఈఁటె, మంగచెట్టు, మల్లు, శరీరము లో గుచ్చుకొని బాధించుచున్న ఇతర

పదార్థము, గసిక, విశేష దుఃఖకారణము, పాపము, నింద, ఆపద.

శశము—స. కుందేలు, బాలెంతబోలు, గంధరసము, లొద్దుగ.

శసనము—స. యజ్ఞమునందలి పశువధము, ప్రోక్షణము.

శాఖ—స. వృక్షము, తురక, వేదము, అంతర్భాగములు గలది.

శాతకుంభము—స. బంగారు, ఉమ్మెత్తచెట్టు.

శారద—స. సరస్వతి, పార్వతి, క్రొత్తది, ప్రతిభ, కప్పుట, శరత్కాలము, ఏడాకుల యరటి, ఏఁడాది.

శారి—స. గోరువంకపిట్ట, జూదపుసారె, ఏనుఁగుమీఁది కంబళము, చౌడోలు.

శార్ఙ్గము—స. విష్ణువుయొక్క విల్లు, శృంగసంబంధమైనది, విల్లు.

శాలావృకము—స. కోఁతి, నక్క, కుక్క.

శాసనము—స. రాజు తాను దానము చేసిన భూమికై వ్రాసియిచ్చినపత్రములు, శిక్షించుట, ఆజ్ఞ, శాస్త్రము, అధికారము, రాళ్ళయందుఁ జెక్కఁబడిన వృత్తాంతము, తీర్పు, ఇంద్రియ నిగ్రహము, పన్నలేని యూరు, పని, వాక్యము, బెత్తపల్లె, వ్రాతమూలకమగు నొడంబడిక.

శిఖ—స. సిగ, కొన, తఱిగొఱ్ఱచెట్టు, నెమలిసిగ, ఊడ, కిరణము, మంట, కొమ్ము.

శిఖండి—స. అడవి, మొల్లచెట్టు, నెమలి, ధృష్టద్యుమ్నునియన్న, నెమలిపురి, బాణము, కోడి.

శిఖరము—స. అగ్రము, చంక, పిఱుదు, కొండకొన, మండపము.

శిఖరిణి—స. చక్కెరతోఁ గూడిన పెరుఁగు, రోమావళి, ఉత్తమస్త్రీ, మల్లెచెట్టు, వృత్త విశేషము.

శిఖి—స. అగ్ని, కోడి, కేతువు, నెమలి, వృక్షము, బాణము, సిగగలవాఁడు, ఎద్దు.

శిపివిష్టుఁడు—స. విష్ణువు, బట్టతల (చర్మవ్యాధి) కలవాఁడు, శివుఁడు.

శిర—స. రక్తనాళము, పానుపు, పాము, పిప్పలివేరు, ముఖ్యము, శిలీముఖము, స. బాణము, తుమ్మెద.

శివము-స. శుభము, జలము, మోక్షము, సుఖము, గ్రహయోగము, వేదము, తియ్యమామిడిచెట్టు, మేకు, దేవతావేశము.

శిష్టము—స. మిగిలినది, ఆజ్ఞాపింపఁబడినది, మర్యాదగలది, పవిత్రమైనది, శిక్షింపఁబడినది, విధేయతగలది, శాంతమైనది, ప్రధానమైనది.

శీకరము—స. తుంపర, ఏనుఁగు తొండము చివరిమదము.

శీధువు—స. చెఱకుకల్లు, పుష్పరసము, ఏనుఁగుకన్నులందుఁ బుట్టెడుమదము

శుండ—స. తొండము, వేశ్య, ఉష్ట్రి మొక్క, కల్లంగడి, తామరతీఁగ.

శుక్తము—స. పులికడుగు, పులుసు, మాంసము, పుల్లనిది, పవిత్రము, పరుషము, స్వచ్ఛము.

శుక్తి—స. ముత్యపుచిప్ప, పుఱ్ఱె యెముక, శంఖము, నేత్రరోగము.

శుక్లము—స. వెండి, మాసమునందలి మొదటి పక్షము, తెలుపు, వీర్యము.

శుచి—స. అగ్ని, శుక్రుఁడు, చంద్రుఁడు, శివుఁడు, సూర్యుఁడు, బ్రాహ్మణుఁడు, వేదాంత మెఱిఁగినవాఁడు, బ్రహ్మచర్యము, శృంగారరసము, ఉపధాశుద్ధమైనమంత్రి, గ్రీష్మఋతువు, జ్యేష్ఠమాసము, ఆషాఢమాసము, పరిశుద్ధమైనది, తెల్లనిది.

శుద్ధాంతము—స. అంతఃపురము, రాజుయొక్క ఏకాంతస్థలము, అంతఃపురస్త్రీ.

శుద్ధి—స. శోధనము, నిర్మలత్వము, మార్జనము, పవిత్రముగాఁ జేయుట, చక్కఁజేయుట, తీర్పుట, ప్రాయశ్చిత్తము, అప్పు, కాంతి, నిజము.

శుభ్రము—స. అభ్రకము, తెల్లనిది, ఒక గ్రహయోగము, తెలుపు, ప్రకాశించునది.

శుల్కము—స. సుంకము, వేశ్యకిచ్చెడి ధనము, ఉంకువ, లాభము, పెండ్లికుమారుఁడు కుమార్తెకిచ్చు బహుమానము, బేరముచేసియిచ్చు సంచకరువు.

శూరుఁడు—స. సూర్యుఁడు, రణసాహసుఁడు, ప్రౌఢుఁడు.

శృంగము—స. కొమ్ము, శిరస్సు, సొంటి, కొండకొన, చన్ను, చిహ్నము.

శృంగారము—స. గంధపుపొడి, అలంకారము, నవరసములలో నొకటి, సౌందర్యము, సురతము.

శృంగారి—స. విటుఁడు, ఏనుఁగు.

శృంగి—స. కొండ, ఎప్పుడును మునిగియుండు ఆఁడుచేఁప, ఏనుఁగు, నగ, అతివస.

శేషము—స. మిగులు, వేయితలలపాము, నైర్మల్యము, తినగా మిగిలినది, వధము, సంబంధము.

శ్వేతము—స. తెలుపు, వెండి, కైలాసపర్వతము, స్ఫటికము, ఒక ద్వీపము.

శైలి—స. రచనాకౌశలముగల భాషాసౌష్ఠవము, లేఖనపద్ధతి, భాషాసరణి, విధము (ధోరణి).

శోకము—స. పుత్రమరణాది దుఃఖముచేతఁ దపించుట, వగపు, శిఖరము, కరుణారసము, మనోదుఃఖము.

శోణము—స. ఎఱుపు, నిప్పు, ఎఱ్ఱని గుఱ్ఱము, దుండిగపుమొక్క, ఎఱ్ఱనిది.

శౌరి—స. విష్ణువు, కృష్ణుఁడు.

శ్యామ—స. యమున, 16 ఏండ్లస్త్రీ, ఆవు, రాత్రి, నీలి, పిప్పలి.

శ్యామము—స. నలుపు, మబ్బు, ఆకుపచ్చ, బొద్దికూర, సుగంధపాల.

శ్రద్ధ—స. అక్కఱ, సమ్మానము, ఆసక్తి, మర్యాద, మంచికోరిక, ఆస్తిక్యము, భక్తి, వేడుక.

శ్రమము—స. అలసట, దేహదార్ఢ్యమునకై చేసెడు సాము లోనగునది, అలవాటు, ప్రయాసము, తపస్సు, దుఃఖము, కష్టించి చదువుట.

శ్రీ—స. లక్ష్మి, ఐశ్వర్యము, సంపద, వృద్ధి, అలంకారము, శోభ, సరస్వతి, పార్వతి, బుద్ధి, విషము, సాలిపురుగు, ఒక రాగము, మారేడుచెట్టు, గౌరవార్థము కొన్నిపదములకు ముందువచ్చునది, మంగళప్రదము.

శ్రుతము—స. వినఁబడినది, శాస్త్రము, వినుట.

శ్రుతి—స. వేదము, చెవి, వినుట, వార్త.

షోడశము—స. పదునారు, మృతునికి పదునొకండవ దినమందుచేయు శ్రాద్ధకర్మ, పదునారవది.

సంకేతము—స. పేరు, ఒడఁబాటు, సంజ్ఞ, ముందుగా మాటాడుకొని నిష్కర్ష చేసుకొన్నస్థలము, ఏర్పాటు.

సంకోచము—స. కుంకుమ పువ్వు, సంక్షేపము, ముకుళభావము, చేప, బంధము, బిడియము, సంశయము.

సంగడము—త. స్నేహము, పరివారము, చేరిక, సమీపము, సంకటము, జత, సహాయము, సేవ.

సంగడి—త. స్నేహము, సమీపము, జత, వెనుక, పార్శ్వము, విధము, సమూహము, రెండు తాటి బొందులు జతగా కట్టిన తెప్ప, స్నేహితుఁడు.

సంగము—స. స్నేహము, సమీపించుట, కూడిక, చేరిక, అనురాగము, పోట్లాట, కోరిక, సాంగత్యము నదులు కలియుచోటు, స్నేహితులగుంపు.

సంగరము—స. యుద్ధము, బుద్ధి, విషము, అంగీకారము, ప్రతిజ్ఞ, ఆపద.

సంగ్రహణము—స. పట్టుకొనుట, సంగ్రహముచేయుట, రక్షించుట, వ్యభిచారము, కలయిక.

సంగ్రహము—స. సమ్యగ్గ్రహణము, సంక్షిప్తగ్రంథము, సంక్షేపము, కూడఁబెట్టుట, సంపాదించుట.

సంతతి—స. కులము, పుత్రపౌత్రపారంపర్యము, విరివి, వరుస.

సంతానము—స. బిడ్డ, కులము, ఒక కల్పవృక్షము, పుత్రపౌత్ర పారంపర్యము, సంతతి.

సందు—త. ఇఱుకువీథి, ఎడము, సారంగము, ఆఁడుగుఱి.

సంధానము—స. కూర్చుట, బాణము వింటినారియందు కూర్చుట, మఱల కూడునట్లు చేయునది, త్రిలికదురు, సంఘటనము, స్నేహము చేయునది.

సంధించు—స. కూడు, ఎదుర్కొను, కూర్చు, కలుపు, రోగ మతిశయించి దోషించు.

సంధ్య- స. ప్రొద్దుపొడుచుటకుముందు అయిదుగడియలవఱకును, ప్రొద్దుగ్రుంకిన వెనక మూఁడుగడియలవఱకునుగల కాలము, ప్రతిజ్ఞ, సంధి, చింత, మేర, సంధ్యాకాలమందు చేయు ఉపాసన.

సంపత్తి-స. సంపద, భాగ్యాతిశయము, సమృద్ధి, జయము, తగినస్థితి, పూర్తి.

సంపత్తు, సంపద— స. ఐశ్వర్యము, అభివృద్ధి, గుణోత్కర్షము, సౌఖ్యము, కోరిక, అదృష్టము, నెఱవేఱుట, విస్తారము, లాభము, ధనము.

సంపరాయము—స. ఆపద, దగ్గర, గణికాంగణము, భవిష్యత్తు, యుద్ధము.

సంవర్తము—స.ఒకమేఘము, కల్పాంతము, తాండ్రచెట్టు.

సంవిత్తు—స. జ్ఞానము, అంగీకారము, ప్రతిజ్ఞ, సంకేతము, సంభాషణము, సంగ్రామము.

సంసరణము— స. సంసారము, పట్టణమునుండి వెడలుట, బాట, సంపర్కము, యుద్ధ ప్రారంభము, గోపురము.

సంస్కారము— స. చక్కఁజేయుట పాకము, శవమును దహనముచేయుట, మునుపనుభవించినది తలంపునకు వచ్చుట, చదువు, సంకల్పము, వంట, ఉపనయనము, కర్మ.

సంస్కృతము—స. చక్కఁజేయఁబడిన ఒక భాష, పక్వముచేయఁబడినది, వ్యాకరణశిక్షితమైన, శ్రేష్ఠమైనది, అలంకరింపఁబడినది.

సంస్థ—స. ఉనికి, నాశము, మేర, గుంపు, స్వభావము, స్థితి, వృత్తి, ముగింపు, సత్ప్రవర్తనము, పోలిక, కనఁబడుట, మరణము.

సంస్థానము— స. సన్నివేశము, రాజ్యము, మరణము, చతుష్పథము, గుంపు, ఆకృతి, ఉనికి, గుఱుతు, తావు, మంచిస్థితి.

సంహారము— స. సంహరణము, చంపుట, నాశముచేయుట, యుగాంతము, వెనుకకులాగుట, గుంపు, నేర్పు, ముగింపు.

సంహిత-స. వర్ణసంయోగము, శాస్త్రము, వేదమునందు కొంతభాగము.

సచివుఁడు—స. మంత్రి, స్నేహితుఁడు, సహాయుఁడు.

సజ్జ—త. సస్యవిశేషము, శిరోగృహము, అయితము, గంటె, మూలికొగృహము.

సత్తి—త ఆయుధవిశేషము, కాళికాదేవి, బలిమి, పార్వతి, వశిష్ఠునికొడుకు.

సత్తు—స. నక్షత్రము, పూజ్యము, ఉన్నది, సాధువు, శ్రేష్ఠము, సత్యము, చదువరి, సీసము.

సత్యము—స. నిజము, కృతయుగము, ఒకలోకము, ఒట్టు, నిజమయినది.

సత్యవతి—స. వ్యాసునితల్లి, సోమెదకూర, నారదుని పెండ్లాము, సత్యముగలది.

సత్త్రము— స. ధర్మార్థమన్నమిడు గృహము, ఎడతెగని యీవి, యజ్ఞవిశేషము, మంచివారిని కాపాడునది, వస్త్రము, చల్ది, సాధనము, కపటము, అడవి.

సత్త్వము— స. సత్తి, ఒక గుణము, దేహబలము, స్వభావము, ప్రాణము, మనస్సు, జంతువు, ఉనికి, తెలివి, వస్తువు, ప్రయత్నము, శ్రేష్ఠత, భాగ్యము, నిజము, పృథివ్యాది ద్రవ్యము.

సదాగతి- స. వాయువు, సముద్రుఁడు, కిరటము, సూర్యుఁడు, మోక్షము, సర్వేశ్వరుఁడు.

సన్నము:—స. అల్పము, కూర్చున్నది, కృశించినది, బలహీనమైనది, చింత నొందినది, శిథిలమైనది, నాశనమైనది, పోయినది, సమీపమందలిది, చలనము లేనిది.

సభ—స. పరిషత్తు, ఇల్లు, చావడి, జూదము, సమాజము, కొలువు కూటము.

సమయము—స. కాలము, సంకేతము, శపథము, ఆజ్ఞ, అగత్యము, ఉచిత కాలము, సూత్రము, సూచన, ఒడంబడిక, మేర.

సమాధానము- స. చక్కఁగానుంచుట, చిత్తము యొక్క స్థైర్యము, అంగీకారము, యూపస్తంభమధ్యభాగము, నిత్యకర్మము, మంచిదెలుఁగుట, ఆక్షేపణకుఁ బ్రత్యుత్తరమిచ్చుట.

సమాధి- స. మనోలయము, నియమము, ధ్యానము, మానము, వ్యసనము, బంధనము, ఒకఅలంకారము, తపస్సు, ఓర్పు, సిద్ధాంతీకరణము.

సమానము- స. నాభియందలివాయువు, ఒకటి, తుల్యము, న్యాయమైనది, సామాన్యము.

సమితి—స. సమూహము, సంగమము, సభ, యుద్ధము, సామ్యము, సమానత్వము.

సముత్థానము—స. ప్రయత్నము, ద్రవ్యార్జనముకొఱకు ప్రయత్నము చేయుట, సేవ, ద్రవ్యార్జనము, రోగనిర్ణయముచేయుట, యుద్ధము, మేలుకొనుట.

సమ్మర్దము—స. రాయిడి, గుంపు రాపిడి, యుద్ధము, త్రొక్కుట.

సరస్వతి—స. బ్రాహ్మి, ఆవు, భూమి, ఉత్తమస్త్రీ, ఒకనది, మనువుభార్య.

సరి—త. హారము, యుక్తము, సమము, సమాప్తము, అంగీకారార్థకము, పూర్ణముగ, మిట్టపల్లములులేనిది, సమానసంఖ్య, ఋజువు.

సర్గము—స. సృష్టి, పరిచ్ఛేదము, నిజము, ప్రయత్నము, యుక్తి, స్వభావము, వదలుట.

సహము—స. ఓర్పు, కాంతి, గోరు భూమి, జవము, బలము, మార్గశిర మాసము.

సాతు—దే. వర్తకసంఘము, బాటసారుల గుంపు.

సాత్వికము—స. రోమాంచము, సత్త్వగుణమువలనఁగలిగినది, నిజమైనది, సాధుత్వము.

సాదము—స. నైర్మల్యము, శరణము, విషాదము, అడుగునచేరుట, కృశత్వము, అలసట, పలచన, నష్టము, బాధ, నాశము, స్వచ్ఛత, దే. అన్నము.

సాది — స. గుఱ్ఱపురౌతు, రథ సారథి, మావటీఁడు.

సాధకుఁడు— స. యక్షిణీవిద్యచేయు వాఁడు, సాధించువాఁడు, యోగి.

సాధనము—స. సాధించుట, సౌఖ్యము, మృతసంస్కారము, స్వాధీనము. ఉపాయము, ఉపకరణము, హేతువు, మగసుజీ, నివర్తనము, ధనము.

సాధువు—స. బుద్ధదేవుఁడు, మంచి వాఁడు, తగినది, ముదుసలితనము, వడ్డీ కిచ్చి బ్రతుకువాఁడు, మునీశ్వరుఁడు.

సామము—స. ఒక వేదము, ఒక జన్నము, మంచితనము, ఒక కార్యోపాయము, మంచిమాట.

సామ్రాణి—త. ఉత్తమాశ్వము, సాంబ్రాణి.

సాయకము—స. బాణము, నాశము చేయునది, క్షీణము, కత్తి.

సారంగము—స. ఇఱ్ఱి, తుమ్మెద, వానకోయిల, మబ్బు, నీరు, తేఁబేలు, తామర, ప్రొద్దు, చిత్రవర్ణముగలది.

సారణి—స. కాలువ, నీటితూము, రావణుని మంత్రి, అతిసారరోగము, షడ్జస్వరముపలికెడు తంతి, గొంతెమ గోరుచెట్టు.

సారసము—స. తామర, బెగ్గురుపిట.

సారె— దే. కూఁతురు నత్తగారింటికిఁ బంపునపుడు పంపెడువరుస, మాటిమాటికి, కుమ్మరవాని చక్రము.

సారము—స. జంతుసమూహము, అర్థముతోఁ గూడినది, వర్తకజన సమూహము.

సాలము—స. వృక్షము, యక్షధూపము, మద్దిచెట్టు, ప్రాకారము, కోట.

సావిత్రి- స. సరస్వతి, హస్తానక్షత్రము, సత్యవంతునిభార్య, పార్వతి.

సింధువు—స. ఒకానొకయేఱు, ఒక దేశము, ఏనుఁగు, సముద్రము.

సికత—స. ఇసుక, ఇసుకనేల, శర్కర, ఒక వ్యాధి.

సిదాంతము—స. స్థిరమైన పక్షము, జ్యోతిష గ్రంథము, నిర్ణయింపఁబడినది, నిరయము.

సిద్ధి—స. ఈడేఱుట, పూర్తి, వాంఛిత ప్రాప్తి, తపస్సిద్ధి, ఒకగ్రహయోగము.

సీమ—స. ఎల్ల, వరిమడి, పెడతల, గుఱుతు. దిగంతము, ఒడ్డు, మేర.

సీసము—దే. మల్లబంధవిశేషము, కోపము, ఒకానొకపద్యము. (స) ఒక లోహము.

సుఖము—స. సౌఖ్యము, సంతోషము, స్వర్గము, అభివృద్ధి, ఆరోగ్యము, క్షేమము.

సుడి—దే. జలావర్తము, అనిలావర్తము, రోమావర్తము, ఋకారపు గురుతు.

సుత్య—స. సోమలతను కొట్టి పిడుచుట, స్నానము, సోమపానము.

సుధ—స. అమృతము, సున్నము, పాలు, ఇటుక, చెముడుమొక్క.

సున్న—త. అనుస్వారము, మణిదోష విశేషము, అభావము.

సుమనస్సు—స. పువ్వు, విద్వాంసుఁడు, వేలుపు.

సుమాళము—దే. పారవశ్యము, ఆవేశము, సుఖము, అత్యుత్సాహము.

సురభి—స. కామధేనువు, అందుగు చెట్టు, బంగారు, వసంత ఋతువు, ఆవు, చైత్రమాసము, జాజికాయ, సంపెంగచెట్టు, మంచివాసన గలది, మనోహరమైనది.

సువర్ణము—స. బంగారు, ధనము, మాడ, ఒక పువ్వు, మంచివర్ణముకలది.

సుషమ—స. మిక్కిలిశోభ, మనోజ్ఞమైనది, సరిసమానమైనది.

సూచీముఖము—స. అభినయ హస్త విశేషము, పక్షి విశేషము, బాణము, సూదిమొన.

సూతకము—స. జాతాశౌచము, పాదరసము, మృతాశౌచము, పుట్టుక.

సూతుఁడు—స. రథసారథి, బట్టు, వడ్రంగి.

సూక్ష్మము—స. అణువు, పరమాత్మ, అల్పము, ఇసుము, పోఁక, నైశిత్యము, కపటము.

సూదము—స. వండినపప్పు, బావి, నాశము, చారు, తప్పు, బురద.

సూనుఁడు—స. కుమారుఁడు, మనుమఁడు, సోదరుఁడు, సూర్యుఁడు.

సూరి—స. పండితుఁడు, శూరుఁడు, కర్త.

సూరుఁడు—స. సూర్యుఁడు, పండితుఁడు.

సెల—త. సెలయేరు, ఏదుపంది ముల్లు, బాణపు ములికి, పైకిఎగచు, కఱ్ఱచివర యందలి యినుపముల్లు, ప్రవాఱునంగు చిము వ్యాపించెడి రంధ్రము, బాణము, నదీమూలము.

సేవ—స. శుశ్రూష, అనుసరణ, కొలువు, పూజ, గౌరవించుట, వాడుక, భక్తి, స్తోత్రము, తఱచు వచ్చుచుండుట, బుజ్జగించుట, చెప్పిన పని చేయుచుండుట.

సైరంధ్రి—స. గట్టువాలు, ద్రౌపది, సంకరజాతి స్త్రీ, అంతఃపురపు కావలికత్తె, పరగృహమందుండి స్త్రీలకు శృంగారాదులను జేయునట్టి పతివ్రత.

సొంపు—దే. ఒప్పు, సంతోషము, సమృద్ధి, ప్రసన్నత, సౌందర్యము, సుఖము, కాంతి.

సొద—త. పీనుఁగును గాల్చుటకు పేర్చిన కట్టెలు లోనగువాని ప్రోగు,

దుఃఖరాత్ర, చిత్యాగ్ని, వ్యర్థప్రసంగము, అధికప్రసంగము, దుఃఖము.

సొమ్ము—తె. ధనము, గోధనము, ఆభరణము, ఆధీనవస్తువు.

సొరుగు—దే. మూర్ఛిల్లు, ఎడుటాకు, మూర్ఛ, పెట్టెయఱ.

సోమము—స. తిప్పతీఁగ, గుంపు, జన్నము, ధనము, ధాన్యము, అమృతము, కల్లు విషము, వాసన, స్తోత్రము, శిరము, గాలి, కోఁతి, ఆకాశము, పులికడుఁగు, కర్పూరము, జలము.

సోముఁడు—స. చంద్రుఁడు, యముఁడు, పితృదేవత, శివుఁడు, కుబేరుఁడు, ఒక వసువు.

స్కంధము—స. రాబందు, కొమ్మ, భుజము, ఎద్దుమూఁపు, యుద్ధము, చెట్టుబోదె, సమూహము, ప్రకరణము, శరీరము, విషము, మగగుటి, పాపము, నేరము.

స్తంభము — స. కంబము, స్థిరత, మౌనపాటు, తెలివిలేమి, నిర్బంధము, అడ్డంకి, ఆధారము, సహజశక్తులను నిలుపుట, మొద్దు.

స్తిమితము—స. తడిసినది, శాంతమైనది, తడిచి, మూయబడినది. తృప్తినొందినది, మెత్తనిది, స్థిరత, క్షేమ.

స్తోమము—స. గుంపు, స్తుతి, ధనము, యజ్ఞము, బల, శక్తి, ప్రార్థన.

సపతి—స. శ్రేష్ఠుఁడు, సారథి, ఒక శిల్పి, కంచుకి.

స్థాణువు—స. శివుఁడు, మేకు, మోడు.

స్ఫురితము— స. చుంబనవిశేషము, అదిరినది, రతిబంధవిశేషము, రెప్పపాటుభేదము, తోఁచినది.

స్మృతి—స. తలంపు, బుద్ధి, ధర్మశాస్త్రము, ఒక యలంకారము

స్వత్వము— స. సొత్తు, హక్కు, స్వామ్యము, ఉన్నది ఉన్నట్లు ఉండుట.

స్వము—స. ధనము, తాన, తనది.

స్వయంప్రభువు- స. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు.

స్వస్తికము— స. తూర్పు వాకిలిగల రాజగృహము, పాముపడగమీఁది నల్లనిరేఖ, మంగళవస్తువు.

స్వామి—స. ఒడయండు, అధికారి, కుమారస్వామి, దేవుఁడు, వస్తుస్వాతంత్ర్యము గలవాఁడు, భర్త, గొప్ప సన్యాసి, ఆచార్యుడు.

హంస, హంసము— స. అంచ, పరమాత్మ, యోగివిశేషము, తెల్లగుఱ్ఱము, శరీరవాయువిశేషము, మంత్రభేదము, మాత్సర్యము, దున్నపోతు, తీర్థము, శాఖోత్పత్తిజరుగు మ్రానిభాగము, ఒకచెట్టు, హాస్యరసము, నవ్వు.

హంసుఁడు—స. జీవుఁడు, దీక్షాగురువు, శివుఁడు, విష్ణువు, గంధర్వుఁడు, జితేంద్రియుఁడు, సూర్యుఁడు, మన్మథుఁడు.

హనువు—స. దౌడ, దెబ్బ, మెడ, బెత్తము, జబ్బు, చావు, గంధద్రవ్య విశేషము.

హరి—స. విష్ణువు, ఇంద్రుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, యముఁడు, సింహము, గుఱ్ఱము, కోఁతి, పాము, వాయువు, కిరణము, కప్ప, యుద్ధము, అగ్ని, శివుఁడు, నీరు, చిలుక, పచ్చనిని, బంగారువర్ణముగలది.

హరిచందనము—స. రక్తచందనము, ఒక కల్పవృక్షము, వెన్నెల, కుంకుమ.

హరిణి—స. ఆఁడుజింక, ఒక యప్సర స్త్రీ, ఆకుపచ్చవర్ణముగలది, బంగారు ప్రతిమ.

హరితము—స. ఆకుపచ్చవర్ణము, పచ్చగుఱ్ఱము, పచ్చపిట్ట, సింహము, గిజిగాడు, పచ్చపెసర, ఆకుపచ్చనిది.

హరిత్తు—స. దిక్కు, ఆకుపచ్చగుఱ్ఱము, ఆకుపచ్చవర్ణము, గరిక, సింహము, ఆకుపచ్చనిది.

హవము—స. యజ్ఞము, ఆజ్ఞ, పిలుచుట.

హసంతి—స. కుంపటి, కంబళి, మల్లె, మొక్క, పెరుగుతోటకూర.

హాయనము—స. సంవత్సరము, కిరణము, ఒకధాన్యము.

హారకుఁడు—స. దొంగ, దోఁచుకొను వాఁడు, జూదరి.

హారము—స. నూటయెనుబది పేటల ముత్యాలపేరు, పుష్పమాలిక, భిన్నాంకములలో లవము క్రిందిది. యుద్ధము, హారసంబంధమైనది, హరించునది.

హాలాహలము—స. నలికండ్లపాము, విషభేదము, బల్లి.

హితము—స. వెనుకటికి మేలుచేయునది, పోయినది, ధరింపఁబడినది, ఇష్టము, శీఘ్రము, ధరింపఁబడినది. పొందబడినది, ఉంచఁబడినది, ఉపయోగకరమైనది, తగినది, ప్రేమగలది, లాభము, క్షేమము.

హిమము—స. మంచు, చల్లనిది, చందనము, చలికాలము, మంచుకొండ, ముత్యము, వెన్న, రాత్రి, కర్పూరము, తగరము.

హిరణ్యము—స. బంగారము, మాడ, గవ్వ, శుక్రము, రొక్కము.

హీర—స. ముత్యాలహారము, లక్ష్మి, పిపీలికము, పిడుగు, పాము, సింహము.

హేతి—స. అగ్ని, శిఖ, ఆయుధము, సూర్యకిరణము, మంట.

హేమము—స. బంగారు, ఉమ్మెత్త, మంచు, నల్లగుఱ్ఱము, గుఱ్ఱము, వైశ్వదేవము, దేవయజ్ఞము, నాగకేసరము.

హేల—స. భ్రూనేత్రాది వికారముల చేత చక్కఁగాఁ దెలియఁదగిన మనోవికారము, విలాసము, నదీవిశేషము, సంతోషము, తిరస్కారము, సురతేచ్ఛ, వెన్నెల, సౌలభ్యము.

హేళి—స. సూర్యుఁడు, కౌఁగిలి.

హొమ్ము—దే. స్థూలము, శక్తి, ఒమ్ము, బలుపు.

హోర—స. అహోరాత్రము, శాస్త్ర విశేషము, రాశ్యర్థము, గంటకాలము, లగ్నభేదము, రేఖాభేదము.
దే. ఉపాయము, ఉపాయశాలి.

హ్రాదిని }
హ్రోదిని } స. వజ్రాయుధము, మెఱపు, ఏఱు, అందుగుచెట్టు.

హ్రాస్వము—స. కుఱుచ, పొట్టి, స్వల్పము, దీర్ఘములేని యక్షరము.



# వ్యుత్పత్త్యర్థములు

అంకకాఁడు — కళంకము కలవాఁడు (చంద్రుఁడు) మాత్సర్యశీలుఁడు

అంకురార్పణము — అన్నప్రాశన, చౌల, ఉపనయన వివాహ, సీమంత, పుంసవనాది శుభకర్మలకుఁ బ్రారంభమున నాచరింప ఒడు కర్మ

అంకుశగ్రహుఁడు — అంకుశమను నాయుధ విశేషమును గ్రహించువాఁడు = మావటీఁడు.

అంకుశ దుర్ధరము — అంకుశమునకు లొంగనిది = ఏనుఁగు.

అంకుసపు (సంపు) మ్రాది — అంకుశాకారము గలమూలానక్షత్రము.

అంగజ — దేహమునఁ బుట్టినది = కూఁతురు

అంగ(భవము)జము — శరీరమునఁబుట్టినది = వెంట్రుక నెత్తురు రోగము మదము గోరు సంతానము.

అంగజుఁడు — దేహమున బుట్టినవాఁడు = కొడుకు మన్మథుఁడు

అంగదట్టము — స్త్రీలు మొలకుఁగట్టుకొనెడు వస్త్రవిశేషము

అంగదము — అవయవమును రక్షించునది = బాహుపురి

అంగన — మంచి అవయవములు గలది = సుందరి.

అంగనాప్రియము — స్త్రీల కిష్టమైనది = అశోకము

అంగ(భవుఁడు)భువు — చూ అంగజుఁడు

అంగమొలవేలుపు — దిసమొల (వస్త్రశూన్యమైన కప్రదేశము)గల దేవుఁడు = ఈశ్వరుఁడు

అంగారక — అవయవములను రక్షించునది = అంగి.

అంగర(క్షుఁడు)క్షకుఁడు — ప్రభు శరీరమును ఆపదరాకుండ రక్షించువాఁడు = బంటు.

అంగరాజు — రాజునకుఁ దయవారరాజు [illegible]రాజు, అంగదేశపు రాజు

అంగరుహము — అవయవములయందు మొలచునది = వెంట్రుక.

అంగవికలుఁడు — స్వభావ విరుద్ధము లయిన యవయవములు కలవాఁడు, మూర్ఛ నొందినవాఁడు

అంగసంగము — స్త్రీ పురుష శరీరముల కలయిక = సంభోగము.

అంగసంస్కారము — తైలాదికముచే శరీర మాలిన్యమును బోఁగొట్టుట = అభ్యంగనము.

అంగహీనుఁడు — అవయవ లోపము గలవాఁడు = అంగవికలుఁడు, ఈశ్వర

ఫాలనేత్రాగ్నిచే దగ్ధుఁడైనవాఁడు, మన్మథుఁడు.

అంగాంగీభావము— అంగమునకును అంగికిని గల సంబంధము.

అంగారకమణి—అంగారక గ్రహమున కిష్టమైన మణి = పగడము.

అంగారకర్పరము—సువర్ణము మొదలగు లోహములను గరఁగుట కుపయోగించెడి మూస.

అంగారకారి—అంగారక గ్రహమునకు శత్రువు = బుధుఁడు.

అంగా(రి)రణి— నిప్పుగాని, నిప్పులేని బొగ్గులుగాని కలది = కుంపటి.

అంగార(ధాని)పాత్రి—నిప్పుబొగ్గులకుఁ బాత్రమైనది = కుంపటి.

అంగారశకటి—నిప్పునకు శకట (బండి) మైనది = కుంపటి, పొయ్యి.

అంగారిణి— సూర్యుఁ డుదయించెడు దిక్కు=తూర్పు, నిప్పుగలిగి యెఱ్ఱనై ప్రకాశించునది = కుంపటి.

అంగుడుదుడిపి—తంత్రములు చెప్పెడి వాఁడు = తంటలమారి.

అంగుళి(త్రాణము)త్రము—వ్రేళ్ళను రక్షించునది = ఉడుము తోలుతోఁ గుట్టిన విలుకాని హస్తకవచము.

అంఘ్రిపము— పాదములచే (వ్రేళ్ళచే) పానము చేయునది = వృక్షము.

అంచగుఱ్ఱపుజోదు—హంస వాహనము నెక్కెడు యోధుఁడు = బ్రహ్మ.

అంచతత్తడిచెలియ—హంసవాహనము గల బ్రహ్మదేవుని భార్య, సరస్వతి.

అంచతేజి— హంస వాహనముగా గల వాఁడు = బ్రహ్మ.

అంచతేజీనెక్కి-యాడురౌతు— హంసను గుఱ్ఱముగానెక్కి విహరించెడు శూరుఁడు = బ్రహ్మ.

అంచతేజిపొలఁతి—బ్రహ్మదేవుని భార్య = సరస్వతి.

అంచపదము—వ్రాఁతయందుఁదప్పుగల చోట నుంచెడు హంసపాదాకృతి గల గుర్తు = హంసపాదు.

అంచయాన—హంసయొక్క నడకవంటి నడకగలది = స్త్రీ.

అంచయేనుఁగు మావంతు— హంస యానెడు ఏనుఁగునకు మావటీఁడయిన వాఁడు = మన్మథుఁడు.

అంచరవు(రా)తు-హంసనెక్కి తిరుగు వాఁడు = బ్రహ్మ.

అంచలవిడిది—హంసలదండు విడియు చోటు = గంగ.

అంజనకాఁడు— అంజన ప్రభావము న

దొంగిలింపఁబడిన వస్తువులను గనుగొను వాఁడు.

అంజనవిద్య—ఒక విధమగు కాటుక నఱచేతికి వ్రాసికొని దానిమహిమచే బోయిన ధనాధికమును, దొంగలను, నిక్షేపమును, దెలియఁదగిన విద్యా విశేషము.

అంటనిజేజే—ముట్టరాని ప్రభువు = అగ్నిదేవుఁడు.

అంట(రా)నివేల్పు—ఉష్ణ తేజము కలవాఁడగుటచేఁ దాఁకుటకు భీతిని బుటించుదేవుఁడు = అగ్ని.

అండజ—కస్తూరిమృగముయొక్క అండ ములవలనఁ బుట్టినది = కస్తూరి.

అండజము—గ్రుడ్డువలనఁ బుట్టినది = పక్షి, పాము, చేఁప, తొండ, ఉడుము, బల్లి, కోడిపిల్ల మొ॥

అండజుఁడు—గ్రుడ్డునుండి పుట్టిన వాఁడు = అనూరుఁడు, గరుడుఁడు.

అంతఃకరణము—లోని ఇంద్రియము= మనస్సు.

అంతఃకుటిలము—లోపలఁ గుటిలత్వ ము (వంకర) కలది = శంఖము.

అంతఃక్రిమి—లోనఁ బురుగులుకలది= మేడిపండు.

అంతఃపశువు—పశువులు గ్రామములో నుండు కాలము, సూర్యాస్తమయము మొదలు సూర్యోదయము వరకు నుండు కాలము.

అంతఃపురము— రాజస్త్రీలు డెందు లోని గృహము.

అంతఃపురికుఁడు— అంతః పురమును గాచువాఁడు = కంచుకి.

అంతఃప్రజ్ఞుఁడు— ఆత్మస్వరూపమును దెలిసికొన్నవాఁడు.

అంతకుఁడు- అంతమొందించువాఁడు = యముఁడు.

అంతగుఁడు— పారగుఁడు, శాస్త్ర మొదలగువాని యంతమును బొందిన వాఁడు.

అంతము—1. జీవితపరిమాణముయొక్క గాని, ప్రారబ్ధకర్మముయొక్క గాని తుద, 2 దీనియందుఁ బాశబద్ధుఁ డగును — చావు.

అంతరగ్ని— శరీరములోని యగ్ని = జఠరాగ్ని.

అంతరజ్ఞుఁడు— తారతమ్యము దెలిం గిన వాఁడు,పరేంగితము తెలిసినవాఁడు.

అంతరజ్వలనము—స. లోన మంట కలది = కడుపులోనిమంట, మనస్తాప ము, జఠరాగ్ని.

అంతరాకాశము— హృదయమందలి యాకాశము = బ్రహ్మము.

అంతరాపత్య—లోపలి శిశువుగలది = చూలాలు.

అంతరాయము—నడుమ వ్యవధి కలు గుట = విఘ్నము.

అంతరారాముఁడు— పరమాత్మ

యందు రమించువాఁడు, బ్రహ్మానంద సుఖము ననుభవించువాఁడు.

అంతరింద్రియము— లోని ఇంద్రియము = మనస్సు.

అంతరిక్షగము— ఆకాశమున సంచరించునది = పక్షి.

అంతరిక్షము— తనలో నక్షత్రములు కలది = ఆకాశము.

అంతర్మనస్కుఁడు—చింతచే బాహ్య వ్యాపారము లేక లోపల నణఁగిన మనస్సుగలవాఁడు=ఖిన్నుఁడు

అంతర్మనుఁడు-దుఃఖాదులచేత బాహ్య వ్యాపారమున మనస్సు లేనివాఁడు దుఃఖమునొందిన మనస్సు కలవాఁడు ధ్యానమున మునిఁగినవాఁడు.

అంతర్ముఖుఁడు— బయటికి సంసారి వలెఁ గనఁబడుచు లోన బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుఁడైనవాఁడు.

అంతర్మృతము— కడుపు లోపలనే చనిపోయినది = శిశువు.

అంతర్యామి— లోనఁ బ్రవేశించి యింద్రియములనుగాని జీవునిఁగాని బ్రవర్తింపఁ జేయునది = పరమాత్మ జీవాత్మ వాయువు

అంతర్లాపి— సమాధానములో నణఁచి యుండునట్లు ప్రశ్నింపఁబడిన విషము సమస్య.

అంతర్వంశికుఁడు— అంతఃపురమున గావలికాయువాఁడు = కొజ్జా.

అంతర్వాణి—శాస్త్రము నెఱింగిన వాఁడు శరీరమున శాస్త్రరూపమైన సరస్వతి కలవాఁడు = విద్వాంసుఁడు.

అంతర్వాహిని—భూమిలోపలఁ బ్రవహించెడు ఏఱు.

అంత(ర్వేశి)(ర్వేశ్మి)కుఁడు— కొజా.

అంతశయ్య—జీవితాంతమును బొందిన వాని శయ్య = శ్మశానము

అంతావశాయి— గ్రామాంతమున నివసించువాఁడు = చండాలుఁడు

అంతావసాయి— నఖకేశాంతములను ఛేదించువాఁడు = మంగలి, ఉదర పోషణార్థము జంతువులను ఛేదించువాఁడు = చండాలుఁడు

అంతేవాసి— గురుసమీపమున నివసించువాఁడు = శిష్యుఁడు.

అత్యంకుశము—అంకుశదుర్ధరము

అంత్యక్రియ—మృతునకుఁజేయు దేహసంస్కారము = ఉత్తరక్రియ

అంధకరణము—అంధునిజేయునది = చీఁకటి.

అంధకరిపు(ఁడు) వు—అంధకాసురుని (సంహరించినవాఁడు) శత్రువు = ఈశ్వరుఁడు.

అంధకసూదనుఁడు—చూ. పై.

అంధకారము— లోకుల నంధులుగా జేయునది = చీఁకటి.

అంధకారి— చూ. అంధకరిపువు, అంధునిగా జేయునది = చీఁకటి.

అంధకూపము—గడ్డి మొదలగువానిచేఁ బైభాగమునఁ గప్పఁబడిన పాడునూయి, ఒకానొక నరకము.

అంధ(ధా)తమసము—కన్నులున్నను గ్రుడ్డివార్లనుగాఁజేయు చిమ్మచీఁకటి.

అంధాహి—విషశూన్యమైన సర్పవిశేషము, స్పష్టము, అంధునకద్దము చూపినటు, పా.

అంధుఁడు—వికలత్వమును పొందిన కన్నులుగలవాఁడు = గ్రుడ్డివాఁడు.

అంధులము—దర్శన మాత్రమునసే విరహుల నంధులనుగాఁ జేయునది = దిరిసెనము.

అంపకాఁడ—అమ్ము (బాణము) చేతఁ బట్టినవాఁడు = విలుకాఁడు.

అంబ—లోకములకుఁ దల్లియైనది = పార్వతి.

అంబటిప్రొద్దు—అంబలిత్రాగువేళ = మధ్యాహ్నము.

అంబరదము—వస్త్రములనిచ్చునది = దూది.

అంబరమణి—ఆకాశమున మణివలెఁ బ్రకాశించువాఁడు = సూర్యుఁడు.

అంబరాంతము—వస్త్రముయొక్క కొన = చెఱఁగు, భూమ్యాకాశములు కలసినట్లగపడు ప్రదేశము.

అంబరాంబరుఁడు—ఆకాశము వస్త్రముగాఁగలవాఁడు=దిగంబరుఁడు, శివుఁడు.



అంబరీషము—వేఁచఁబడు లాజాది వస్తువులచే మ్రోయునది=మంగలము.

అంబష్ఠుఁడు—1. చికిత్సకై సమీపమున నుండువాఁడు, 2 బ్రాహ్మణయువకునకు వైశ్యయువతియందుఁ బుట్టినవాఁడు = మంగలి, మావటివాఁడు.

అంబారుపిడుజు—పశువుల శరీరము నుండి రక్తమును బీల్చెడి జంతు విశేషము = కొణుజు.

అంబిక—1. లోకములకుఁదల్లి, 2 సమస్తమును బుట్టించునది = పార్వతి.

అంబికానాథుఁడు — పార్వతికి మగడు = శివుఁడు.

అంబికేశ్వరుఁడు— పార్వతికి ప్రభువు = ఈశ్వరుఁడు.

అంబుకంటకము—నీటిలోఁగంటకము వలె నుండునది = మొసలి.

అంబుగజము—నీటియందు ఏనుఁగు వలె బలముగలిగియుండునది, మొసలి.

అంబుచరము—నీటియందు సంచరించునది = చేప మొ॥

అంబుజగర్భుఁడు—విష్ణుని నాభికమలమునకు గర్భము, (సంతానము) అయినవాఁడు = బ్రహ్మ

అంబుజన్మ (ము)—ఉదకమునఁ బుట్టుక గలది = పద్మము, శంఖము, అగ్ని, సారసపక్షి.

అంబుజన్ముఁడు—(క్షీరసాగర మథన

మున) ఉదకమున జనించినవాఁడు = చంద్రుఁడు, అగ్ని.

అంబుజబాంధవుఁడు— చూ. అంబుజమిత్రుఁడు.

అంబుజమిత్రుఁడు—పద్మములకు స్నేహితుఁడైనవాఁడు= (సూర్యోదయమునఁ బద్మములు వికసించును) సూర్యుఁడు.

అంబుజము—ఉదకమునఁ బుట్టినది= పద్మము శంఖము సారసపక్షి, వజ్రాయుధము.

అంబు (జాత) జవైరి—పద్మములకు శత్రువు (చంద్రోదయమునఁ బద్మములు ముకుళించును)=చంద్రుఁడు,

అంబుజాలయ— పద్మము గృహముగాఁ గలది = లక్ష్మి.

అంబుజాసన—పద్మము పీఠముగాఁ గలది = లక్ష్మి.

అంబుజాసనుఁడు—శ్రీవిష్ణుని నాభి కమలము పీఠముగాఁ గలవాఁడు = బ్రహ్మ.

అంబుజుఁడు—చూ. అంబుజన్ముఁడు.

అంబుజోదరుఁడు—పద్మము ఉదర (నాభి) మునఁగలవాఁడు=శ్రీవిష్ణువు.

అంబుతస్కరుఁడు— ఉదకమును దన కిరణములచే సంహరించువాఁడు= సూర్యుఁడు.

అంబుతాలము—నీటియందుండునది = నాచు.

అంబుదము—ఉదకము నిచ్చునది = మేఘము.

అంబుధరము— ఉదకమును ధరించునది = మేఘము.

అంబుధి— ఉదకములను ధరించునది = సముద్రము.

అంబుధీషుధి—సముద్రము అమ్ములపొదిగాఁ గలవాఁడు = శివుఁడు.

అంబునిధి—ఉదకముల నెల్లప్పుడును ధరించునది = సముద్రము

అంబుపము—ఉదకమును మిక్కుటముగాఁ ద్రాగునది = సముద్రము.

అంబుపుఁడు— లములను త్రాగెడువాఁడు, జలములకు రాజు=వరుణుఁడు.

అంబుప్రసాదము— ఉదకమును నిర్మలముగా జేయునది = చిల్ల, ఇందుగుకాయ.

అంబుభృత్తు—ఉదకమును ధరించునది = ముస్తె, సముద్రము, మేఘము.

అంబుమర్కటము—నీటియందు మర్కటాకారముగల జంతువు = మొసలి.

అంబు (ముచము) ముక్కు— నీటిని విడుచునది, మేఘము.

అంబురాశి—ఉదకములకుఁ బ్రోగు అయినది = సముద్రము.

అంబురుహ—చూ. అంబుజన్మ.

అంబురుహము—చూ. అంబుజము.

అంబురుహిణి—నీట మొలచునది = తామరతీఁగ.

అంబువల్కలము—నీటియందు వస్త్రమువలెనుండునది = నాచు, పాఁచి తామరపాకు కలువతెకు.

అంబువాచి—ఆషాఢబహుళ దశమి మొదలు త్రయోదశివఱకును భూమికిఁ గలపేరు (ఈకాలమున భూమి ఋతుమతియను ప్రతీతినిబట్టి వ్యవసాయదారులచే సేద్యము చేయఁబడదు.)

అంబువాహము—నీరు మోయునది = మేఘము, చెఱువు, తృణవిశేషము.

అంబువాహి—నీరు మోయువాఁడు = మేఘుఁడు.

అంబువాహిని—ఎత్తుడు నీరుపోయు నిమిత్తము తొలిచి కొలువ మొదట నుంచెడు తాటిపట్టె లోనగునది = దోనె, నీరుమోయు స్త్రీ.

అంబుసర్పిణి—ఉదకమునఁ జరించునది = జలగ.

అంబుసేచని—ఓడనుండి నీళ్ళెత్తిపోయు బొక్కెన.

అంబూకృతము—నిష్ఠీవముతోఁ (నోటితుంపర) గూడినమాట లేక ధ్వని.

అంబేద—దిట్టతనము లేనివాఁడు = అసమర్థుఁడు.

అంభసాంభ్రమము—నీటియందుఁ దొటుపాటులోఁగూడినది = నీటి సుడి.

అంభస్సారము—నీటి సారము = ముత్యము.

అంభోజగర్భుఁడు—అంబుజగర్భుఁడు.

అంభోజజని—(అంభోజజన్ముఁడు), శ్రీవిష్ణుని నాభికమలమునఁ బుట్టినవాఁడు = బ్రహ్మ.

అంభోజమిత్రుఁడు—అంబుజమిత్రుఁడు

అంభోజము—చూ. అంబుజము.

అంభోజయోని—శ్రీ విష్ణుని నాభికమలము ఉత్పత్తి స్థానముగాఁ గలవాఁడు = బ్రహ్మ.

అంభోజ(శత్రువు)వైరి—చూ. అంబుజవైరి.

అంభోజాసనుఁడు—అంబుజాసనుఁడు.

అంభోజిని—అంభోజము (పద్మము) కలది = తామరతీఁగ, తామర కొలను, పద్మముల సమూహము.

అంభోజుఁడు—చూ. అంబుజన్ముఁడు.

అంభోదము—చూ. అంబుదము.

అంభోధరము—చూ. అంబుధరము.

అంభోధి—చూ. అంబుధి.

అంభోనిధి—చూ. అంబునిధి.

అంభోభ్రమము—అంభసాంభ్రమము.

అంభోరాశి—చూ. అంబురాశి.

అంభోరుహము—అంబురుహము.

అంశ(హారి)హరుఁడు— భాగమును దీసికొనువాఁడు.

అంశి—(దాయ) భాగము గలవాఁడు

అంశుకము—తంతువులచే నించుకంత పలుకునది = కోక.

అంశు(హస్తుఁడు)కరుఁడు—హస్తములవంటి కిరణములు కలవాఁడు = సూర్యుఁడు

అంశు(భృత్తు)ధరుఁడు— కిరణములను ధరించువాఁడు=సూర్యుఁడు.

అంశుపతి—కిరణములకు ప్రభువు = సూర్యుఁడు.

అంశుమంతుఁడు— కిరణములు కల వాఁడు = సూర్యుఁడు, చంద్రుఁడు, నిరృతి, విష్ణువు ధనికుఁడు.

అంశుమత్ఫల—ప్రకాశించెడు ఫలములు గలది = అరఁటిచెట్టు.

అంశుమాలి—కిరణసమూహము మాల గాఁగలవాఁడు = సూర్యుఁడు.

అంహతి— స. పాపములను జెరచునది = దానము.

అకర్ణము—చెవులులేనిది = పాము

అకర్మకము— కర్మలేనిది. (కర్మాకాంక్షానుత్పాదకం బగు క్రియ గల వాక్యము.

అకల్క—మాలిన్యములేనిది=వెన్నెల

అకాయుఁడు—శరీరములేని వాఁడు = 1 రాహువు 2. మన్మథుఁడు, 3 పరమాత్మ.

అకార్యకరణము— 1. చేయఁదగని పని చేయుట, 2. చేయఁదగినపని చేయకుండుట.

అకార్యకారి—1. నిషిద్ధ కార్యమును జేయుట 2 విహితకార్యము నాచరింపకుండుట

అకాలము— 1. కాలములేనిది, 2. నలుపు కానిది, 3 అయుక్తకాలము.

అకాలసహము— కాల విలంబము సహింపనిది, చిరకాలము ముట్టడికి ఆగలేనిది=దుర్గము మొ.

అకించనుఁడు—కొలది ద్రవ్యమైనను లేనివాఁడు = నిఱుపేద.

అకించిత్కరము—కొంచెమైనను జేయనిది = పనికిమాలినది

అకుతోభయుఁడు— దేనివలనను భయము లేనివాఁడు.

అకూ(వా)(పా)రము—1. అవలదరి యందు భూమిలేనిది, 2. మర్యాదచే భూమినంతను ఆక్రమింపనిది = సముద్రము (ఆదికూర్మము)

అకూపారుఁడు—మేరలేక భూమండలమును దన కిరణసమూహముచే నిండించువాఁడు = సూర్యుఁడు.

అకృతబుద్ధి—శిక్ష పొందని బుద్ధిగలవాఁడు=మూర్ఖుఁడు.

అకృతాత్ముఁడు—బ్రహ్మను సంధానము కలవాఁడు, చూ. అకృతబుద్ధి.

అకృతాస్త్రుఁడు—అస్త్రములు ప్రయోగించ లేనివాఁడు, విలువిద్యయందు నేర్పులేనివాఁడు.

అకృతోద్వాహుఁడు—పెండ్లికాని వాఁడు (బ్రహ్మచారి).

అకృష్ట(రోహి)పచ్యము—దున్నని భూమియందు పండునది = నివ్వరి.

అకృష్ణకర్ముఁడు—మంచి నడవడిక కలవాఁడు, పుణ్యకర్ముఁడు.

అక్కఱగండఁడు—ఆవశ్యక కార్యదీక్ష గలవాఁడు.

అక్కుపక్షి—బక్కవానికి నుపమానముగా గ్రహింపఁబడు పక్షివిశేషము.

అక్కుముల్లు—మనస్సునకుఁ గలుగు బాధ.

అక్రియుఁడు—1. కార్యదీక్ష లేనివాఁడు, 2. ముఖ్యకృత్యములు లేనివాఁడు, 3. విహితాచారములు అనుషింపనివాఁడు.

అక్షజము—ఇంద్రియము (కన్ను, ముక్కు మొ.) వలన జనించునది = ప్రత్యక్షజ్ఞానము, సర్పశిరమున బుట్టినది = వజ్రము.

అక్షతలు—క్షతము (హింస) లేనివి = సేసఁబ్రాలు.

అక్షతుఁడు—నాశము లేనివాఁడు = శివుఁడు.

అక్షదర్శకుఁడు—అక్షదృక్కు—న్యాయ విచారణకర్త, జూదమందలి న్యాయాన్యాయములను బరిష్కరించువాఁడు.

అక్షదేవి—పాచికలచేఁ గ్రీడించువాఁడు = జూదరి.

అక్షద్యూతికము—పాచికలాటయందలి కలహము.

అక్షదుగ్ధుఁడు—జూదమున మోసపోయినవాఁడు.

అక్షధరుఁడు—అక్షము (బండిచక్రము) ధరించువాఁడు = విష్ణువు.

అక్షధూర్తుఁడు—పాచికలాడుట వలనఁ గుటుంబమును జెరచువాఁడు = జూదరి.

అక్షపాదుఁడు—పాదమున నేత్రము కలవాఁడు =, న్యాయశాస్త్రకర్తయగు గౌతముఁడు.

అక్షమాల—అకారాది క్షకారాంతమయిన వర్ణముల మాలిక, ఆ వర్ణములకు మాఱుగ స్ఫటికములు మొదలగునవి గ్రుచ్చినమాల = తావళము, ఇంద్రియముల సమూహము.

అక్షయము—1. క్షయము లేనిది, 2. ఇల్లులేనిది = పరమాత్మ

అక్షయ్యోదకము—శ్రాద్ధకాలమునఁ బిండదానమునకుఁ బిమ్మటఁ దేనెయు, నువ్వులును గలిపి యిచ్చెడుజలము.

అక్షరచణుఁడు, అక్షరచుంచువు—చక్కని లిపివ్రాయుటయందు సమ

ర్థుఁడు = వ్రాఁతకాఁడు.

అక్షరచ్యుతకము—పదములలో నొక యక్షరమును దీసివేయఁగా మిగిలిన వానికి మఱియొక యర్థము స్ఫురించు నట్లు జెప్పెడు చిత్రకవిత్వము (కవయామి, వయామి, యామి.)

అక్షరజనని—అక్షరములను బుట్టించునది = కలము, గంటము.

అక్షరజీవకుఁడు— వ్రాఁతవృత్తివలన జీవనము చేయువాఁడు.

అక్షరతూలిక—చిత్తరువు వ్రాయుటకు తూలికవలెనే అక్షరములు వ్రాయుట కుపయోగించునది=కలము.

అక్షరము—నాశనము పొందనిది = జీవాత్మ, పరమాత్మ, కైవల్యము, ధర్మము, క్రతువు, జపము.

అక్షరాభ్యాసము—శుభముహూర్తము చూచి విద్యారంభకాలమున బాలునిచే వర్ణములను దిద్దించుట.

అక్షరాస్యుఁడు—అక్షరములు వచ్చినవాఁడు, చదివినవాఁడు.

అక్షరుఁడు— నశింపనివాఁడు=విష్ణువు, శివుఁడు, బ్రహ్మము.

అక్షవాటము— జెట్టు (మల్లుల) సాధన చేయుచోటు = మల్లభూమి, జూదమాడెడు చోటు.

అక్షవాముఁడు—జూదమున న్యాయవిరుద్ధముగాఁ బ్రవర్తించువాఁడు.

అక్షశౌండుఁడు—జూదమున మిగుల నేర్పుగలవాఁడు.

అక్షహృదయము— 1. జూదమునందలి రహస్యము, 2. అధికసంఖ్యగల వస్తువులనైనను జూచినంత మాత్రమున లెక్కింపకయే మొత్తము చెప్పఁగల శక్తినిచ్చు విద్య.

అక్షాంశరేఖలు—భూమి చుట్టును బోవుచు, భూమధ్యరేఖకు సమాన దూరమునందుండు రేఖలు.

అక్షావపనము—పాచికలాడెడు (నెత్తి) పలక.

అక్షావాపుఁడు—పాచికలాడు వాఁడు = జూదరి.

అక్షింతలు—అక్షతలయొక్క రూపాంతరము, పూజించునపుడును ఆశీర్వదించునప్పుడును ఉపయోగించెడు పసుపుతోఁగూడిన బియ్యము, బొట్టుగా నుపయోగించు కుంకుమ మొదలగు ద్రవ్యము.

అక్షిగతుఁడు-కంటిని బొందినవాఁడు = కనబడువాఁడు, ద్వేషింపఁదగినవాఁడు.

అక్షిభేషజము—కంటిమందు = కాటుక.

అక్షియోనికుఁడు—నేత్రాకారముగా బయటికిఁ జూపట్టెడి 1000 యోనులు (స్త్రీల గుహ్యాంగములు) శరీరమంతటను గలవాఁడు ఇంద్రుఁడు. (మోసముచే నహల్యనుగూడిన యింద్రుని నామె భర్తయగు గౌతముఁడు పైవిధముగా నుండునట్లు శపించెనని పురాణప్రసిద్ధి.)

అక్షివికూణితము—లజ్జాదికముచే

వించుకంత సంకోచమును బొందిన కంటిచూపు = క్రేగంటిచూపు.

అక్షో(క్షౌ)హిణి— 21,870 రథములును, అన్నియే యేనుఁగులును, 65,610 గుఱ్ఱములును, 1,09,350 కాల్బలమును గల సేనాసమూహము.

అఖండము— ఖండము కానిది = సమసము, సంపూర్ణము.

అఖిలము—దున్నఁబడనిది = నేల.

అఖాతము— నరులచేఁ ద్రవ్వంబడని సముద్రాదికము, అగడిత.

అగచరము— వృక్షము (కొండ)లయందు సంచరించునది = కోఁతి.

అగచాట్లపోతు,అగచాట్లమారి— ఆపదలు (పొందు) కలిగించు స్వభావము కలవాఁడు.

అగజము—1. చెట్టునఁ బుట్టినది, 2. పర్వతమునుండి పుట్టినది = శిలాజిత్తు.

అగజాత—పర్వతరాజగు హిమవంతుని పుత్త్రిక = పార్వతి.

అగదంకారుఁడు— మందులచే రోగము లేకుండఁ జేయువాఁడు = వైద్యుఁడు.

అగదము—రోగము లేకుండఁ జేయునది = ఔషధము.

అగమము—నడువలేనిది = చెట్టు.

అగము—నడువలేనిది = చెట్టు, కొండ, పాము.

అగమ్యము—1. నడువరానిది = మార్గము మొ. 2. చేరరానిది = పర్వతము మొ. సంగమమునకుఁ దగనిది= పరకళత్రము మొ. తెలియరానిది = అర్థము మొ.

అగస్త్యభ్రాత— అనామకుఁడును, నిష్ప్రయోజకుఁడునైయగస్త్యమునికి, దోడఁబుట్టినవాఁడు.

అగస్త్యమాత్రము— అగస్త్యమునిచేఁ ద్రాగి తిరిగివిడిచిపెట్టఁబడినది = సముద్రము. (కాలకేయులు, వృత్రాసురుఁడు మొదలగు రాక్షసులు దేవతలను, మునులను బాధించుచు సముద్రమున దాఁగియుండిరి. మునులచేఁ బ్రార్థింపఁబడిన అగస్త్యుఁడు పుడిసిలిపట్టి సముద్రమును పానముచేసెను. రాక్షసులు బయటఁబడఁగా దేవతలు వారిని సంహరించిరి. పిమ్మట మునులచేఁ దిరిగి ప్రార్థింపఁబడి సముద్రమును మూత్రద్వారమున విడిచెనని పురాణప్రసిద్ధి.)

అగస్త్యుఁడు— వింధ్యపర్వతము వణఁచినవాఁడు = ఒక ఋషి.

అగస్త్యోదయము- భాద్రపదమాసాంతమునఁ గలుగు అగస్త్యనక్షత్రోదయము. (జలములు తేఱును.)

అగాధగంధము— దాఁపరాని పరిమళము గలది = ఇంగువ.

అగౌకసము— అగము (పర్వతము, చెట్టు) నివాసముగాఁగలది= సింహము, శరభమృగము, పక్షి మొ.

అగ్గికంటి—తెరచిన తోడనే అగ్నివలె

భస్మముచేయు సమర్థముగుకన్ను నుదుటఁ గలవాఁడు = శివుఁడు.

అగ్గి (పుత్త్రు)ఁడు చూలి- ఈశ్వరతేజమును ధరించిన యగ్ని హోత్రుని బిడ్డఁడు=1. కుమారస్వామి2. జలము

అగ్గితత్తడి—అగ్నిదేవునకు వాహనమైనది = పొట్టేలు.

అగ్ని—ఊర్ధ్వముగను వక్రముగను జ్వలించువాఁడు.

అగ్నిదృక్కు—చూ. అగ్గికంటి.

అగ్నిసఖుఁడు—అగ్నికి స్నేహితుఁడైనవాఁడు = వాయువు.

అగ్నికేతువు—అగ్నికి జెండా అయినది = పొగ.

అగ్నిగర్భ—అగ్ని గర్భమందుఁగలది = శమీవృక్షము.

అగ్నిగర్భము—లోపల అగ్నిగలది = సూర్యకాంతమణి, అరణి

అగ్నిచిత్తు— అగ్నిచయనము చేసినవాఁడు.

అగ్నిజము— అగ్నినుండి పుట్టినది = బంగారు, నీరు.

అగ్నిజిహ్వుఁడు— 1. తీక్ష్ణమైన వాక్కులు గలవాఁడు, 2 అగ్నియే జిహ్వగాఁగలవాఁడు=వరాహము

అగ్నిదుఁడు—ఇండ్లకు నిప్పు పెట్టువాఁడు = ఆతతాయి

అగ్నిదృక్కు— అగ్నివలెఁ దీక్ష్ణమైన చూపుగలవాఁడు = శివుఁడు

అగ్నిపరీక్ష— అగ్నిమూలముగా దోషాదోషములను బరీక్షచేయుట

అగ్నిబాహువు— అగ్నికి బాహువు (చేయి) అయినది = పొగ.

అగ్నిభము— అగ్నివలెఁ బ్రకాశించునది = 1. బంగారు, 2 కృత్తికా నక్షత్రము.

అగ్ని (జుఁడు) భువు— శివవీర్యమును గ్రహించిన యగ్నివలనఁబుట్టినవాఁడు కుమారస్వామి.

అగ్నిమి (త్రుఁడు) త్త్రము— అగ్నిదేవునకు స్నేహితుఁడు=వాయువు

అగ్నిముఖుఁడు—అగ్ని ముఖముగాఁ గలవాఁడు = 1. దేవత (యజ్ఞాదులయందు ఋత్విక్కులు హోమద్రవ్యమును అగ్నియందు వ్రేల్చఁగా,దానిని అగ్నిహోత్రుఁడు దేవతలకుఁ గొనిపోయి యిచ్చునని పురాణ ప్రసిద్ధి), 2. అగ్నియందు హోమద్రవ్యములను వ్రేల్చుటకభిముఖుఁడై యుండువాఁడు =అగ్నిహోత్రి, 3. బ్రాహ్మణుఁడు

అగ్నిరేత(ము)స్సు— అగ్ని యొక్క వీర్యము=బంగారు

అగ్నివాహ(న)ము— అగ్నిదేవునకు వాహనమైనది = 1. గొఱ్ఱె, 2. మేక

అగ్నిశిఖము– నిప్పువంటి కొనలుఁగలది = 1.దీపము 2.బాణము 3.బంగారము 4. కుంకుమపువ్వు 5 పసుపు.

అగ్నిష్టోమము —వసంతకాలమున 5 దినములలోఁ జేసి ముగించెడి యాగవిశేషము.

అగ్ని (గ్నీ) షోమీయము-అగ్నియు, సోముఁడును దేవతలుగాఁగల యాగ విశేషము.

అగ్నిసఖుఁడు—అగ్నిమిత్రుఁడు.

అగ్నిసూత్రము—ఉపనయనమున బ్రాహ్మణుఁడు ధరించు ముంజదర్భ మొలత్రాడు=మౌంజీమేఖల.

అగ్నిహోత్రము—1. ఆహితాగ్నులు ప్రాతస్సాయంకాలములయందుఁ జేసెడి హోమము = దధిపయోరూపమైన హవిస్సు, 2. అగ్ని.

అగ్నిహోత్రి—ప్రాతస్సాయంకాలములందు నిత్యముసు అగ్నికార్యము చేయువాఁడు.

అగ్రకులజుఁడు—చూ. అగ్రజన్ముఁడు.

అగ్రగుఁడు— ముందునడచువాఁడు = మొదటివాఁడు.

అగ్రజన్ముఁడు—అగ్రజాతుఁడు.

అగ్రభువు, అగ్రజుఁడు— 1. అగ్రకులమునఁ బుట్టినవాఁడు = బ్రాహ్మణుఁడు, 2. దేవతలలో ముందుగాఁ బుట్టినవాఁడు = బ్రహ్మ, అగ్ని.

అగ్రతస్సరుఁడు—ముందునడచువాఁడు = మొనగాఁడు.

అగ్ర (అగ్రే) సరుఁడు— అగ్రజన్ముఁడు.

అగ్రహారము—రాజుచే బ్రాహ్మణమాత్రనివాసమునకై నిర్మాణము చేయఁబడిన గ్రామభేదము.

అగ్ని (గ్రి) యుఁడు— చూ. అగ్రజన్ముఁడు.

అగ్రేదిధిషువు— మాఱుమనువుదానిని బెండ్లాడిన బ్రాహ్మణుఁడు, మారుమనువుదాని మొదటి మగఁడు, అక్కకు ముందు వివాహితయగు చెల్లెలు.

అఘభోజి— దేవతలకుఁగాని, పితరులకుఁగాని, అతిథులకుఁగాని పెట్టక తాను దినువాఁడు.

అఘమర్షణము—జలములందుండి మూఁడుమాఱులు జపించుటచే సర్వపాపములను (గురుతల్పగమనాది మహాపాతకములు) నశింపఁ జేసెడు ఋగ్వేదమంత్రము.

అఘశంసి— ఇతరుల దోషములు మాత్రమే ప్రకటించువాఁడు.

అఘోరుఁడు— ఎవనికంటె భయంకరుఁడు లేఁడో అతఁడు = రుద్రుఁడు.

అఘ్న్య—చంపఁదగనిది = ఆవు.

అఘ్రేయము— వాసన చూచుటకుఁ దగనిది (శక్యముకానిది) = మద్యము.

అచల— కదలనిది=భూమి, పర్వతము.

అచలకీల—పర్వతములు కీలలు(మేకులు) గాఁ గలది = భూమి.

అచలజ—పర్వతరాజగు హిమవంతుని కుమార్తె = పార్వతి.

అచలత్విట్టు—స్థిరమైనకాంతిగలది = కోకిల.

అచలము— చలించనిది = పర్వతము, మేరు, బ్రహ్మము.

అచలుఁడు—చలింపనివాఁడు= 1. శివుఁడు, 2. అర్క.

అచిరద్యుతి, అచిరప్రభ—క్షణిక కాంతిగలది = మెఱపు.

అచేతనము- చైతన్యము (సుఖదుఃఖానుభవము) లేనిది = జడము.

అచ్ఛభల్లము— 1. అభిముఖ్యముచే హింసించునది, 2. తనకుసంబంధించిన జాతివారిని గాక పరులను హింసించునది = ఎలుఁగుగొడ్డు.

అచ్ఛావాకుఁడు— సోమయాగమున శంసన కర్తయై హోతకు సహాయము చేయు ఋత్విజుఁడు.

అచ్యుతాగ్రజుఁడు — శ్రీకృష్ణుని (కృష్ణుని) యన్న = బలరాముఁడు, శేషేంద్రుఁడు.

అచ్యుతుఁడు- తనపదవినుండి భ్రంశము నొందనివాఁడు = శ్రీవిష్ణువు, శనైశ్చరుఁడు, శివుఁడు.

అజంభము—పండులేనిది = కప్ప.

అజంభుఁడు—పండ్లు లేనివాఁడు = సూర్యుఁడు. (దక్షాధ్వర ధ్వంసకాలమున శివుఁడులేని దక్షయాగమునకు నీవేలవచ్చితివని వీరభద్రునిచే దౌడపై గొట్టఁబడిపండ్లూడినవాఁడు. కావుననే యితనికిఁ బాయస మిష్టము.)

అజకావము—చూ. అజగవము.

అజగరము—మేఁకను మ్రింగునది, నిత్యమును మేల్కాని యుండునది, ఎల్లప్పుడును విషముగలది = కొండ చిలువ.

అజగవము- శివుని ధనుస్సు, పినాకము.

అజన్మము- పుట్టుకలేనిది = మోక్షము.

అజన్యము- పుట్టనిది, పుట్టింపఁదగనిది, జనులకు హితము కానిది, అశుభ సూచకమై జనించుటకు యోగ్యముకానితోఁకచుక్కలోనగుఉత్పాతము.

అజప-1. సగము మగపోలికలును సగము ఆఁడు పోలికయుఁ గల ఆకృతి, 2. (హంసః) ఉచ్ఛ్వాస నిశ్వాసముల చేతనే అక్షరములను బలికించెడు గాయత్రీమంత్ర విశేషము.

అజపుఁడు- 1. వైదికములుగాని గ్రంథములు చదువువాఁడు, 2. మంత్రములు క్రమముగాఁజదువనివాఁడు, 3. మేఁకలను గాచువాఁడు.

అజమారుఁడు— మేఁకలను జంపు వాఁడు = కటికవాఁడు.

అజముఖుఁడు—గొఱ్ఱె తల తలగా నమర్పఁబడినవాఁడు= దక్షప్రజాపతి. (శివుని యాహ్వానముచేయక యాగము చేసిన దక్షునిశిరమును వీరభద్రుఁడు నఱికివేసెను. బ్రహ్మాదిదేవతలందఱును శివుని బ్రార్థింపఁగా, 'దక్షునకు గొఱ్ఱెతల నమర్చి బ్రతికించె' నని పురాణప్రసిద్ధి.)

అజరుఁడు— అమృతము త్రాగుటచే ముదిమిలేనివాఁడు = వేలుపు.

అజవాహనుఁడు — అజము వాహనముగాఁ గలవాఁడు = అగ్ని.

అజాగరము — ఎంతమాత్రమును నిద్దరపట్టనీయనిది = గుంటగలగర.

అజాజీవుఁడు — మేఁకలను గాచుటవలన జీవించువాఁడు.

అజాతవ్యంజనుఁడు — స్ఫుటముగాని యౌవనచిహ్నము గలవాఁడు.

అజాతశత్రు (ఁడు)వు — శత్రువులు లేనివాఁడు = ధర్మరాజు.

అజాయుద్ధము — ఆరంభమున శూరత్వముగలిగి అవసానమున శూన్యాడంబరముగల మేఁకల పోరాటము.

అజితుఁడు — జయింపఁబడనివాఁడు — 1. విష్ణువు 2. శివుఁడు 3. బుద్ధుఁడు.

అజినపత్త్ర — చర్మమువలెనుండు రెక్కలు గలది=గబ్బిలము.

అజిహ్మగము — వక్రము (వంకర) గాఁ బోనిది=బాణము.

అజిహ్వము — జిహ్వ (నాలుక) లేనిది = కప్ప. (ఇది అగ్నికి అపరాధ మొనర్చి శాపవశమున నాలుక పోగొట్టుకొన్నదని పురాణప్రసిద్ధి)

అజీ(గవ)గావము — చూ. అజగవము.

అజుఁడు — పుట్టుక లేనివాఁడు — 1. శివుఁడు 2 విష్ణువు 3. బ్రహ్మ 4. చంద్రుఁడు 5 మన్మథుఁడు 6 జీవుఁడు.

అజ్జవాలు — పాదము ఆయుధముగాఁ గలది=కోడి.

అజ్ఞాతవాసము — ఇతరులకుఁ దమ యునికి దెలియకుండ నివసించుట

అజ్ఞుఁడు—1 ఎఱుగనివాఁడు మూఢుఁడు, 2. కొంచెము తెలిసినవాఁడు = అల్పజ్ఞుఁడు.

అట్టహాసి — పెద్దనవ్వు నవ్వువాఁడు = శివుఁడు

అట్టాలికాకారుఁడు — 1. కులటయగు శూద్రస్త్రీకి చిత్రకారునివలనఁ బుట్టినవాఁడు 2 తాపీ పనివాఁడు

అడవి (కాఁపు) (నెలవరి) (మనికి)— అడవియందు నివసించునది కోఁతి మొ.

అడవికుక్క — కుక్క యాకారము గలిగి అడవియందు సంచరించునది = తోడేలు.

అడవిగీము — అడవి గృహముగాఁ గలది=వానరము

అడవితిరుగుడు — అడవినట్టు, అరణ్యమునందు సంచరించునది = కోఁతి.

అడవిదిమ్మరి — అడవులయందు సంచరించునది = కోఁతి.

అడవిపుట్టువు — అడవియందుఁ బుట్టినది=ఐరావతము.

అడవిమనికిపట్టు — అరణ్యము నివాసస్థానముగాఁ గలవాఁడు=జడదారి.

అడిదపుమెకము — చూ. ఖడ్గమృగము.

అడుగుకైదువుదునేదారి— పాదము ఆయుధముగాఁగల ప్రభువు = వామన రూపవిష్ణువు.

అడుగు చెమ్మటలాఁడు— గంగ యుద్భవించిన కారణమున పాదముల యందు తడిగలవాఁడు = శ్రీవిష్ణువు.

అడుగుదోదుమి— పాదము ఆయుధముగాఁగలది = కోఁడి.

అడుగు(వు)పుట్టువు— బ్రహ్మదేవుని పాదములయందుఁ బుట్టినవాఁడు = శూద్రుఁడు, విష్ణుపాదములయందుఁ బుట్టినది = గంగ.

అడుగువాఁకగలాఁడు— పాదమున గంగానది గలవాఁడు = శ్రీవిష్ణువు.

అడుగువాలుపులుగు— పాదములు ఆయుధములుగాఁగల పక్షి = కోడి.

అడ్డపాప—1. చేతులలో అడ్డముగాఁ బట్టఁదగిన శిశువు, 2. దూరదృష్టిలేని వాని కన్నులలోని పాప.

అడ్డవేడెము — సర్పగమనము వలె నుండెడు అశ్వధారావిశేషము.

అణిమ— సూక్ష్మముగాఁ జేయునది = అష్టసిద్ధులలో నొకటి.

అణువాదము— పరమాణువులు నిత్యములు, జగత్కారణములు నని చెప్పెడి తార్కికవాదము.

అతనువు— శరీరము లేనివాఁడు=మన్మథుఁడు. (పార్వతిపై మోహముజనించుటకు బాణములు వేయఁగాఁ, జలించిన చిత్తముగల శివుఁడు కోపించి మన్మథుని ఫాలనేత్రాగ్నిచే దగ్ధుని గావించె నని పురాణప్రసిద్ధి.)

అతికాయుఁడు— అసాధారణమైన యాకారముగల మానవుఁడు.

అతికృచ్ఛ్రము— ఏకభుక్తము, అయాచితాన్న భక్షణము, నక్తభోజనము; వీనిని మూమ్మారుఆచరించునపుడు పట్టెడు అన్నము తినుచు 9 రోజులు గడపి 3 దినము లుపవసించెడు ద్వాదశదిన వ్రతము.

అతిఖట్వుఁడు— మంచమును మించిన పొడవుగలవాఁడు.

అతిగంధము— ఎక్కువ వాసన గలది, గంధము, సంపెంగ మొ॥

అతిగవుఁడు— బుద్ధి లేకపోవుటయందు గోవు నతిక్రమించినవాఁడు = మూర్ఖుఁడు, వాక్కుల కగోచరుఁడు= పరమాత్మ.

అతిజాగరము— ఎల్లప్పుడును మేలుకొనియుండునది = నల్లకొంగ.

అతిథి— తిథ్యాది కాలనియమములేక యింటికి భోజనమునకు వచ్చువాఁడు, ఎల్లప్పుడును దిరుగువాఁడు.

అతిదేశము— ఒకదాని ధర్మమును సామ్యమునుబట్టి మఱియొక దానియం దారోపించుట.

అతిధృతి— అతిశయించిన ధైర్యము గలవాఁడు.

అతిబల— శ్రీరామలక్ష్మణులకు విశ్వా

మిత్రుఁ డుపదేశించిన యొక విద్య, మిక్కిలి బలముగలది.

అతిబలుఁడు— మిక్కిలి బలముగల వాఁడు = వాయుదేవుఁడు మొ.

అతిబ్రహ్మచర్యుఁడు—స్త్రీసంగమాదికముచే నతిక్రమించిన బ్రహ్మచర్య వ్రతము గలవాఁడు.

అతిభయప్రద—ఖండములుగాఁ జేయఁబడిన గజాశ్వ భటాదికముచే నతి భయంకరమయిన యుద్ధభూమి

అతిభారగము— ఎక్కువ బరువుతోఁ బోవునది = గాడిద.

అతిమాయుఁడు—మాయ నతిక్రమించిన వాఁడు = ముక్తుఁడు.

అతిరథుఁడు—అనేకులగువిలుకాండ్రతో నొంటిగ యుద్ధముచేయువాఁడు

అతిరోమశము—ఎక్కువ రోమములం గలది=1 అడవిమేఁక, 2. పెద్దకోఁతి.

అతివర్ణాశ్రమి—వర్ణాశ్రమ ధర్మములను మీఱి నడచువాఁడు

అతివాసము— శ్రాద్ధమునకుఁ బూర్వ దినమునఁ జేయు నుపవాసము.

అతివృష్టి—దేశోపద్రవకరమైన హెచ్చు వాన

అతివ్యాప్తి—స. మితిమీరి వ్యాపించుట, అలక్ష్యమునందు లక్షణప్రవృత్తిరూప మైన యొక లక్షణదోషము. (గోవునకు శృంగిత్వము (కొమ్ములు కలిగియుండుట) లక్షణమని చెప్పినెడల, నట్టి శృంగిత్వలక్షణము మహిషాదులందును యుండుటచే దానింబట్టి యందతివ్యాప్తిదోషము సంభవించినది)

అతిశయోక్తి—వలసిన దానికంటె నెక్కువగా వర్ణింపఁబడిన పలుకు.

అతిశ్వము— బలమునను, నీచత్వమునను గుక్కను మించినది = అడవిపంది.

అతిసారకి— విరేచనము లెక్కువగానగు రోగవిశేషము గలవాఁడు.

అతిహసితము— శరీర కంపముతోఁ గూడిన యధమజాతి నవ్వు.

అతీంద్రియము— నేత్రాదీంద్రియము లకు గోచరము కానిది.

అతీంద్రియుఁడు— ఇంద్రియములకు గోచరము కానివాఁడు = పురుషుఁడు, ఆత్మ.

అత్యంకుశము— స. అంకుశమునకు లొంగనిది = ఏనుఁగు

అత్తెసరు—గంజివారకుండ నన్నములో నత్తుకొనిపోవునట్లు బియ్యముతోఁ బెట్టెడి యెసరు

అత్యంతవాసి—గురువుకడ నెల్లప్పుడును నిలిచియుండు శిష్యుఁడు

అత్యంతసంయోగము— ఎడతెగని సంబంధము.

అత్యంతాతిశయోక్తి— కారణము లేకుండఁగనే కార్యము కలుగునట్టి యలంకారవిశేషము.

అత్యంతాభావము— త్రికాలముల యందును లేకుండుట = చతుర్విధాభావములలో నొకటి, నిత్యాభావము

అత్యంతీనుఁడు—యుద్ధాదులయందుఁ దఱచుగాఁబోవు స్వభావముకలవాఁడు

అత్యగ్నిష్టోమము—అగ్నిష్టోమమునకుఁ బిమ్మటఁ జేయఁబడు యాగము.

అత్యామ్లము— మిగుల పులుపుగలది- చింతచెట్టు

అత్యాహితము— 1 మహాభయము 2. చావునకుఁ దెగించిచేయు సాహస కార్యము.

అత్యుక్తి—చూ. అతిశయోక్తి.

అత్యుగ్రము—మిక్కిలి తీవ్రమైన పరిమళము గలది = ఇంగువ.

అదంతము—(1) దంతములు (లేనిది) రానిది = శిశువు (జంగ) (2) అత్తు- అనగా హ్రస్వ అకారము అంతమునఁ గలది (అత్ లోని తకారము ఉచ్చా సౌకార్యార్థమైనచో హ్రస్వ దీర్ఘము లను రెండింటికి నిగ్రహణ)

అదయుఁడు— దయలేనివాఁడు = క్రూరుఁడు.

అదితిజుఁడు— కశ్యపున కదితియందుఁ బుట్టినవాఁడు - వేలుపు

అదితినందనుఁడు— స్వర్గాధిపత్యముచేఁ దల్లియగు నదితిని సంతసింపఁజేయు వాఁడు = ఇంద్రుఁడు, చూ. అదితి జుఁడు.

అదృశ్యకరణము—కనబడకుండఁజేసెడు ఇంద్రజాలక్రియ.

అదృష్టము—చూడఁబడనిది=భాగ్యము, అగ్ని జలాదులవలనఁ బుట్టిన కీడు, కర్మజన్యములై సుఖ దుఃఖ హేతువు లగు ధర్మాధర్మములు. (అపూర్వమని మీమాంసకుల మతము)

అదేశస్థుఁడు—దుర్దేశమున నున్నవాఁడు, స్వదేశమున లేనివాఁడు.

అదోహము—1. పాలు పితుకఁదగని కాలము, 2 పాలు పితుకకుండుట

అద్ధాపురుషుఁడు— సుగుణాదికముచే నిజముగా మనుష్యుఁడని చెప్పదగిన వాఁడు

అద్మరుఁడు- అధికముగాఁ దినువాఁడు= తిండిపోతు.

అద్యతనము—గతించిన రాత్రియొక్క చతుర్థయామము మొదలుకొని, రాఁబోవు రాత్రియొక్క ప్రథమ యామాంతము వఱకుఁగల కాలము. (నిన్నటి యర్ధరాత్రము మొదలుకొని నేఁటి యర్ధరాత్రమువఱకు నుండు కాలమని పక్షాంతరము.)

అద్రి— ఫలమూలములద్వారమున వరులచే భక్షింపఁబడునది = పర్వతము.

అద్రికీల—చూ. అచలకీల.

అద్రిజ—హిమవంతుఁడను పర్వతరాజునకుఁ బుట్టినది = పార్వతి.

అద్రిభిత్తు- (అద్రిభిదుఁడు) (ఎగురుచు గ్రామాదులపైఁబడి ధ్వంసము చేయు

చుండిన కారణమున) పర్వతముల ఱెక్కలను ఛేదించినవాఁడు = ఇంద్రుఁడు.

అద్రిభువు—చూ. అద్రిజ.

అద్రిరాజు—పర్వతములకుఁ బ్రభువు= హిమవంతుఁడు.

అద్వయవాది— సమస్తమును జీవ్య రూపము; దానికంటె రెండవది లేదని వాదించువాఁడు.

అద్వేషరాగి—ఇష్టానిష్టములు లేని వాఁడు.

అద్వైతము—జీవేశ్వరుల కభేదము చెప్పెడి మతవిశేషము.

అద్వైతానందము—జీవ బ్రహ్మైక్యానుభవమువలనఁ గలిగెడు ఆనందము.

అద్వైతి— జీవ బ్రహ్మైక్యమును బోధించు మతమువాఁడు.

అధనుఁడు—ధనము లేనివాఁడు = దరిద్రుఁడు.

అధమర్ణుఁడు—అధమమైన ఋణము కలవాఁడు = అప్పుతీసుకొన్నవాఁడు.

అధరకము—కుచములయందుఁ జేయు చుంబనము.

అధఃకాయము— దేహముయొక్క క్రిందిభాగము.

అధరము—ముఖముయొక్క అధోభాగమున నుండునది = పెదవి.

అథర్వణి—అథర్వవేదము తెలిసిన బ్రాహ్మణుఁడు, శుభాశుభ వైదిక కర్మములను జేయించుచు మేలుకీడులను దెలిపెడు ఆచార్యుఁడు.

అథర్వాణుఁడు—చూ. అథర్వణి.

అధశ్శ(ము)యుఁడు— నేలపైఁ బరుండు వాఁడు.

అధశ్శిరస్సు—అధోముఖముగా నున్నది = లంచము పుచ్చుకొనెడువా రనుభవించెడు నరకము.

అధికమాసము—ఒక సంవత్సరములోనే రెట్టింపుగా వచ్చెడు సూర్య సంక్రమణము లేని చాంద్రమాస మాసము.

అధిజిహ్వము— ఒకటికంటె వించిన జిహ్వ (నాలుక)లు గలది = సర్పము.

అధిజ్యము—ఎక్కు పెట్టఁబడిన ధనురాదికము.

అధిదేవత—అధిష్ఠించి యుండెడు దేవత, సర్వాధిపతియగు పరమేశ్వరుఁడు.

అధినగ్నిక— వివాహముకాని పదునొకండు వత్సరముల కన్యక.

అధిప్రజుఁడు— ఎక్కువ బిడ్డలు గల వాఁడు.

అధిభూతము—సమస్తభూతముల యందును వర్తించుచుండునది = పరమాత్మ.

అధిమంథనము—నిప్పునకై మథించు కాష్ఠము = అరణి మొ.

అధిరథుఁడు—రథము మీఁద నున్న వాఁడు = సారథి.

అధిరోహిణి—ఎక్కుటకు వీలైనది = నిచ్చెన.

అధిరోహుఁడు—గజాదులపై నెక్కువాఁడు = మావటివాఁడు మొ.

అధివిన్న—సవతికనముచే దుఃఖించునది = మొదటి పెండ్లాము

అధివేత్త—భార్యయుండఁగా మఱియొక స్త్రీని బెండ్లాడినవాఁడు

అధివేద(న)ము—భార్య యుండఁగా దిరిగి బెండ్లాడుట.

అధివేదనికము—మఱియొక స్త్రీని బెండ్లాడునపుడు మొదటి భార్యకుఁ దృప్తికలిగించుటకై భర్తచే నివ్వఁబడిన స్త్రీధనము.

అధిశ్రయణి—వండఁదగిన తండులాది యుక్తమగుపాత్రకు ఆశ్రయమైనది = ప్రొయ్యి.

అధీతి—అధ్యయనము చేసినవాఁడు.

అధీనుఁడు—(అధి + ఇనుఁడు) పొందఁబడిన ప్రభువు కలవాఁడు = పరులకు లోఁబడినవాఁడు.

అధీయానుఁడు—వేదము చదువుకొనుచున్న విద్యార్థి.

అధీర—రోషమునఁ బరుషవాక్యముల చేతను, తర్జన తాడనములచేతను భర్తను పీడించు శృంగారనాయిక.

అధీ(శ్వరుఁడు)శుఁడు—సమస్త సామంతులచే సేవింపఁబడు రాజు.

అధునాతనము—ప్రస్తుతకాలమునకు సంబంధించినది.

అధోక్షజుఁడు—1. ఇంద్రియము నధఃకరించి పుట్టినవాఁడు 2 జితేంద్రియులకుఁ బ్రత్యక్ష మగువాఁడు = శ్రీమహావిష్ణువు

అధోగంత—భూమిలో సంచరించునది = ఎలుక.

అధోగతుఁడు—నీచస్థితిని బొందినవాఁడు.

అధోభుక్తము—భోజనానంతరమునఁ ద్రాగునీరు, మందు మొ

అధోభువనము—భూలోకమునకుఁ గ్రిందిలోకము = పాతాళము.

అధోవాయువు—క్రిందిభాగము (గుదస్థానము) నుండి పోవు వాయువు = అపానవాయువు.

అధ్యక్షుఁడు—ఇంద్రియ గోచరమైనవాఁడు = చర్యలను గనిపెట్టి చూచువాఁడు.

అధ్యగ్నికృతము—వివాహ సమయమున అగ్నిహోత్రసన్నిధిని జదివింపఁబడు స్త్రీధనము.

అధ్యయనము—గురుముఖమున అనుపూర్విగఁ జదువు వేదపఠనము.

అధ్యాత్మదృక్కు—(విదుఁడు) అంతరాత్మను దెలిసికొన్నవాఁడు, బ్రహ్మసాక్షాత్కారమును బొందినవాఁడు.

అధ్యాత్మయోగము— మనస్సును బాహ్యవిషయములనుండి మరలించుకొని ఆత్మయందు సమాహితము చేయుట.

అధ్యాత్మరామాయణము— పరమాత్మకును, జీవునకునుఁగల సంబంధమును శ్రీరామకథారూపమునఁ దెలిపెడు నొక మహాకావ్యము.

అధ్యాపకుఁడు— వేదమును విద్యార్థులకుఁ జెప్పువాఁడు.

అధ్యాపయిత— శిష్యులచే వేదాధ్యయనము చేయించువాఁడు = గురువు, చదువు చెప్పువాఁడు, ఉపాధ్యాయుఁడు.

అధ్యారోపము— ప్రమాదమున నొకదాని గుణమును మఱియొకదానియందున్నట్లు భ్రమించుట=మిథ్యాజ్ఞానము.

అధ్యావాహనికము— పుట్టినింటినుండి అత్తవారింటికిఁ బోవునపుడు తల్లిదండ్రులచే నీయఁబడు స్త్రీధనము = సారె (అరణము).

అధ్యాసము—ఒకదానిని మఱియొకటిగా భావించుట = మిథ్యాజ్ఞానము.

అధ్యాహారము— వాక్యపూరణమునకై లేని పదములను గొన్నిఁటిని దెచ్చుకొనుట.

అధ్యూఢ—చూ. అధివిన్న.

అధ్యూధ్ని—పెద్దపొదుగుగల యావు.

అధ్యేత— చదువువాఁడు = విద్యార్థి.

అధ్యేషణ—పూజ్యులను సత్కారపూర్వకముగ నొక కార్యమున నియోగించుట.

అధ్వగ—మార్గమునఁ బ్రవహించునది= నది.

అధ్వ(అన్యుఁడు) గుఁడు—మార్గమున నడచువాఁడు=తెరువరి, సూర్యుఁడు.

అధ్వనీనుఁడు—వేగముగాఁ బయనము చేయువాఁడు.

అధ్వపతి—మార్గమును గాచుచుండుటచే. బ్రభువైనవాఁడు=సూర్యుఁడు.

అధ్వరము—వైదికమార్గము నిచ్చునది = యజ్ఞము.

అధ్వర్యుఁడు— యజ్ఞమునందు యజుర్వేదతంత్రమును నడపువాఁడు, వేదముల నెఱుఁగువాఁడు.

అధ్వశల్యము—మార్గమున పాదములకును వస్త్రములకును దగులుకొని బాటసారులను శల్యము (ముల్లు) వలె బీడించునది = ఉత్తరే (ణి) ను.

అనంగము— అవయవములు లేనిది = 1. ఆకాశము, 2. హృదయము.

అనంగలేఖ— వియోగసహనము లేని కాముకీకాముకులు పరస్పరము వ్రాసికొనెడు (మన్మథప్రేరణమున వ్రాయఁబడిన) ప్రణయలేఖ.

అనంగుఁడు—శివుని ఫాలనేత్రాగ్నిచే దగ్ధుఁడైన కారణమున శరీరము లేని వాఁడు = మన్మథుఁడు.

అనంత—అంతము లేనిది = భూమి.

అనంతము—అంతము లేనిది=ఆకాశము, పరబ్రహ్మము.

అనంతవిజయము—ఎన్నికకుమీఱిన జయములు కలది=ధర్మరాజు శంఖము.

అనంతశయనుఁడు—అనంతుని (ఆదిశేషుఁడు) యందు శయనించువాఁడు= శ్రీవిష్ణువు.

అనంతుఁడు—తుద లేని వాఁడు= 1. విష్ణువు, 2. శేషుఁడు, 3. శివుఁడు.

అనంశము—దాయభాగమునకు వీలు లేనిది = ఆకాశము, పరబ్రహ్మము.

అనక్షరము—ఉచ్చరింపరానిది=తిట్టు.

అనగారుఁడు—ఇల్లు లేని వాఁడు= సన్న్యాసి.

అనడ్వాహము—బండిలాగునది = ఎద్దు (అనడ్వాహి = ఆవు)

అనధ్యయనము—వేదాదిపఠనమునకు నిషిద్ధ (కాలము) దినము.

అనన్యగతికుఁడు—వేఱుగతి లేనివాఁడు.

అనన్యచిత్తుఁడు—ఒక వస్తువుపై మాత్రమే మనసు నిల్పినవాఁడు.

అనన్యజుఁడు—1. మనస్సునకు భిన్నమైన స్థలమున నుదయింపనివాఁడు, 2. అనన్య(విష్ణువు)నకుఁబుట్టినవాఁడు= మన్మథుఁడు.

అనన్యపూర్వ—పూర్వ మెవ్వఁడును భర్తగా లేనిది = కన్య.

అనన్యపూర్వుఁడు—పూర్వ మెవ్వతెయు భార్యగా లేనివాఁడు = అవివాహితుఁడు.

అనన్యవృత్తి—ఒక దానియందు మాత్రమే మనస్సుగలవాఁడు.

అనపత్యుఁడు-సంతానము లేనివాఁడు= నిస్సంతు.

అనఫ—చంద్రునకు ద్వాదశస్థానమున సూర్యవ్యతిరిక్తమైన గ్రహముండెడు జాతకయోగవిశేషము.

అనముఁడు—పరులు నమస్కరించునపుడు తిరిగి నమస్కరింపక ఆశీర్వదించువాఁడు = 1. బ్రాహ్మణుఁడు, 2. సన్న్యాసి.

అనర్థకము—పరస్పరాన్వయము లేనిది.

అనలుఁడు—లోకములకు జీవనాధారమైనవాఁడు = అగ్ని.

అనవస్కరము—కడుగుట లోనగువానిచే నిర్మలమైనది.

అనవస్థానము—ఒకచోట నిలుకడ లేనిది = వాయువు.

అనశనము—అశనము (భోజనము) లేకుండుట = ఉపవాసము.

అనసూయ—అసూయ లేనిది = అత్రి మహర్షి భార్య.

అనస్సు—దీనిచే వాహనము జీవించును = బండి.

అనాగతవిధాత— రాఁగల యనిష్టమునకు ముందుగాఁ బ్రతీకారము చేసికొనువాఁడు.

అనాగతార్తవ—పొందని ఋతుధర్మము గలది = సమర్తాడనిది.

అనాచారము— ఆచారము కానిది, విహితముల ననుష్ఠింపకుండుట, నిషిద్ధముల ననుష్ఠించుట.

అనాత్మజ్ఞుఁడు-1. తన్నుఁ దా నెఱుఁగనివాఁడు, 2. పరమాత్మస్వరూపము తెలియనివాఁడు.

అనాత్మవంతుఁడు— ఇంద్రియములను వశపరచుకొననివాఁడు.

అనాత్మ్యము— స్వకుటుంబముపైఁ బ్రేమలేకయుండుట.

అనాదినిధనుఁడు—జనన మరణములు లేనివాఁడు, పరమాత్మ.

అనాదిమధ్యాంతము— మొదలు, నడిమి,తుద లేనిది = పరమాత్మ.

అనామధేయుఁడు—పేరు లేనివాఁడు, అగస్త్యభ్రాత మొ.

అనామయము—ఆమయము(రోగము) లేనిది = ఆరోగ్యము.

అనామిక— ప్రసిద్ధమగు నామము (పేరు) లేనిది = దర్భవ్రేలు. (ఈ వ్రేలితో శివుఁడు బ్రహ్మదేవుని శిరము త్రుంచుటచే నపవిత్రమై వైదిక కర్మలయందు ఉచ్చరింపరాని నామము కలదయ్యెనని పురాణ ప్రసిద్ధి.)

అనాయకము—నాయకుఁడు లేని కార్యాదికము.

అనావిద్ధము—1. తొలివేయఁబడనిది, 2. బాధింపఁబడనిది-రత్నాది.

అనావృష్టి— దేశమునకు హాని కల్గునట్లు భొత్తిగా వానకురియకుండుట.

అనాశ్రమి— బ్రహ్మచర్యాది చతురాశ్రమములలో నొకటియు లేనివాఁడు.

అనాహతము— చలువచేయనిది = క్రొత్తవస్త్రము, కొట్టఁబడనిది.

అనిదంపూర్వము—పూర్వమందు లేనిది = అపూర్వము.

అనిమిత్తము— కారణము లేనిది = అపశకునము.

అనిమిషము— ఱెప్పపాటు లేనిది = చేఁప.

అనిమిషుఁడు } ఱెప్పపాటులేనివాఁడు
అనిమేషుఁడు } = వేలుపు.

అనిరుద్ధపథము— అడ్డగించఁ బడని మార్గము గలది = ఆకాశము.

అనిరుద్ధుఁడు— ఇతరులచే నడ్డగింపఁబడనివాఁడు=1. మన్మథుని కొడుకు, 2. ఘూఢచారుఁడు, 3. శ్రీవిష్ణువు, 4. శివుఁడు.

అనిలఘ్నకము— వాతరోగములను బోఁగొట్టునది = తాండ్ర.

అనిలజుఁడు / అనిలాత్మజుఁడు } వాయుదేవుని కుమారుఁడు = 1. ఆంజనేయుఁడు, 2. భీముఁడు.

అనిలసఖుఁడు — వాయుదేవుని స్నేహితుఁడు = అగ్ని.

అనిలాంతకము — వాతరోగమును బోఁగొట్టునది - ఇంగువ.

అనిలా(శి)శనము — గాలి యాహారముగాఁగలది = సర్పము.

అనిలుఁడు — ప్రాణులకు జీవనాధారమైనవాఁడు = వాయుదేవుఁడు.

అనీకస్థుఁడు — 1. యుద్ధమున నిలచినవాఁడు, 2. ఏనుఁగులను శిక్షించుటయందు నేర్పరి = రాజభటుఁడు.

అనీకిని — 2187 రథములు, 2187 ఏనుఁగులు, 6561 గుఱ్ఱములు, 10935 కాల్బలమును గల సేనాసమూహము. (అక్షౌహిణిలోఁ బదియవపాలు.)

అనీశ్వరుఁడు — తనకుఁ బ్రభువు లేనివాఁడు = శివుఁడు.

అనుకరణము — ఇతరులు చేసినటుల చేయుట, ధ్వన్యాదులను దెలుపునపు డుపయోగించు పదము (గణగణ, పళపళ మొ.)

అనుకనీయుఁడు — కనిష్ఠుని కంటె పూర్వుఁడు. (నలుగురు కుమారులలో మూఁడవవాఁడు.)

అనుకల్పము — ముఖ్యకల్పమునకంటె నధమమైన వేదవిధానము.

అనుకామీనుఁడు — తన యిచ్ఛ వచ్చినట్లు నడచు(కొను)వాఁడు.

అనుకూలుఁడు — నాయికలలో నొక నాయికయందు విశేషానురక్తుఁడై యుండు నాయకుఁడు.

అనుచరుఁడు — అనుసరించి చరించువాఁడు = భృత్యుఁడు = సహాయుఁడు.

అనుగామీనుఁడు — యుద్ధమునందు యథేచ్ఛగాఁ దిరుగువాఁడు.

అనుజాతుఁడు — గుణములచేఁ దండ్రిని బోలిన కుమారుఁడు, అనుసరించి పుట్టినవాఁడు = తమ్ముఁడు.

అనుజీవి — అనుసరించి జీవించువాఁడు = భృత్యుఁడు.

అను(జన్ముఁడు)జుఁడు — అనుసరించి పుట్టినవాఁడు = తమ్ముఁడు.

అనుదాత్తము — ఉచ్చారణ సాధనములగు తాల్వాది స్థానముల యధోభాగమున నుత్పన్నమగు అచ్చు = నీచైస్స్వరము - ఉదాత్తము కానిది.

అనుదారుఁడు — దార (భార్య) ననుసరించి యుండువాఁడు.

అనునాసికము — ముక్కుతోఁ బలుకఁబడు అక్షరము (ఙ, ఞ, ణ, న, మ).

అనుపదము — అడుగుననుసరించునది, పాదపాదము ననుసరించు వ్యాఖ్యానాదికము, సంగీతమున చరణచరణమునకు పాడెడు గీతభాగము, కంఠమున చేయుచుంబనము.

అనుపల్ల (వి) వము— పల్లవి ననుస రించి వచ్చు చరణము.

అనుపవీతుఁడు— ఉపనయనము కాని వాఁడు.

అనుపానము—మందుతోఁగూడ చేర్చి పుచ్చుకొనెడు వస్తువు, అన్నముతోఁ గూడ తినఁదగిన కూర మొదలగు సామగ్రి.

అనుపేతుఁడు— వడుగు కానివాఁడు, గురువునొద్దచదువనారంభించినవాఁడు.

అనుప్రాసము—శబ్దసామ్యము గల్గునట్లు చెప్పిన శబ్దాలంకారము.

అనుబంధము—జరుగుచున్న దాని ననువర్తించుట.

అనుబంధుఁడు—తల్లిదండ్రులు లోనగు పెద్దల ననుసరించి నడచు కొడుకు లోనగువాఁడు.

అనుబలము— సేనవెనుక సహాయముగా పోవు సేన.

అనుభావనము- ముఖవికాసాది చిహ్నములచే మనస్సునందలి భావమును సూచించుట.

అనుభూతి— తర్కశాస్త్రమున ప్రత్యక్షాది ప్రమాణజన్యజ్ఞానము.

అనుమరణము— దేశాంతర మరణము సంభవించునపుడు క్షత్రియస్త్రీచేయు ప్రక్రియ = సహగమనము.

అనుమానము— సాధన సామగ్రిచే సాధ్యవస్తు వనుమేయింపఁబడుట.

అనుమితి— అనుమాన ప్రమాణ జన్యజ్ఞానము, పరామర్శ జన్యజ్ఞానము.

అనుమృతుఁడు- మరణించినవాని వెంట మరణించినవాఁడు.

అనుమేయము—ఊహింపఁదగినది.

అనులోమ— భర్తకంటె నీచ జాతి భార్య.

అనులోమ (భవుఁడు) జుఁడు — అనులోమకుఁ బుట్టినవాఁడు.

అనువాచనము—అధ్వర్యునిప్రైషము చొప్పున హోత ఋక్కుల నుచ్చరించుట.

అనువాదము— ఒకరు చెప్పినదానిని తిరిగి చెప్పుట, భాషాంతరీకరణము.

అనువేశము- పెద్దవాని వివాహమునకుఁ బూర్వము చిన్నవాఁడు పెండ్లాడుట.

అనుశస్త్రము—శస్త్రమునకు మారుగా నుపయోగింపఁబడు సాధనము.

అనుశాయి—పుణ్యపాపరూప కర్మలకు ఫలభూతములైన స్వర్గనరకాదులను అనుభవించినపిమ్మట మిగిలిన పుణ్యపాపముల వాసనకలవాఁడు.

అనుశ్రుతము— వేదవంశ సాంప్రదాయము ననుసరించి వచ్చినది.

అనుశ్రుతి— ప్రస్తావనవిషయము ననుసరించిన యితరజనసంభాషణముల కనికి.

అనుస్వారము— స్వరము (అచ్చు) ననుసరించి వచ్చునది = బిందువు.

అనూచానుఁడు—గురుముఖమున సాంగవేదాధ్యయనముచేసినవాఁడు.

అనూపజము— జలసమృద్ధిగల నేల యందుఁ బుట్టునది = అల్లము.

అనూరుఁడు—ఊరువులు (తొడలు) లేనివాఁడు. (తన సవతియగు కద్రువ నాగులను గని సుఖించుచుండెననియు, తనయొక్క రెండు గ్రుడ్లును పెరిగి త్వరలో పిల్లలుగా లేదనియు విచారించి, వినతయొక్క గ్రుడ్డును జిదుపఁగా, నందుండి యవయవనిర్మాణము పూర్తిగా కాకపోవుటచే, తొడలులేని యొక తేజశ్శాలి యుదయించెనని పురాణ ప్రసిద్ధి. ఇతఁడే సూర్యసారథి)

అనృతము— ఋతము (సత్యము) కానిది = అబద్ధము.

అనేకగోత్రుఁడు— ఒక గోత్రము నుండి మఱియొక గోత్రమువానిచే స్వీకరింపఁబడిన పుత్రుఁడు.

అనేకజము—ఒకటికంటె (అనేక పర్యాయములు) ఎక్కువసారులు పుట్టునది = పక్షి.

అనేకపము— తొండము, నోరు (అనేకము = ఒకటికంటె నెక్కువ) అను రెంటిచేఁ ద్రాగునది = ఏనుఁగు.

అనేకలోచనుఁడు—ఎక్కువ కన్నులు కలవాఁడు = ఇంద్రుఁడు, శివుఁడు.

అనేకశఫము—చీలిన డెక్కలుగలది= ఆవు మొ.

అన్నప్రాశనము— బిడ్డలకుఁ బ్రారంభమున అన్నము తినిపించు శుభకర్మ విశేషము.

అన్నరసము—జఠరాగ్ని వలన పరిపాకము నొందిన యన్నసారము.

అన్నాదుఁడు—అన్నము తినువాఁడు = మనుష్యుఁడు.

అన్నింటి తిండికాఁడు, అన్ని దినువాఁడు—చూ. సర్వభక్షకుఁడు.

అన్యభృత్తు—స్వజాతి భిన్నమైన కోయిలను పెంచునది = కాకి.

అన్వాహార్యము— ప్రతిమాసమునను జేయఁదగిన పిండపితృయజ్ఞాదికము.

అన్యచిత్తుఁడు— మఱియొకదాని యందు మనస్సుగలవాఁడు.

అన్యతమము—పెక్కింటిలో నొకటి.

అన్యతరము— రెంటిలో నొకటి.

అన్య (పుష్ట) భృతము— తల్లికంటె వేఱగు కాకిచేఁ బోషింపఁబడినది = కోయిల.

అన్యపూర్వ—ఒక పురుషునకు వాగ్దానము చేయఁబడి, యితరపురుషునకు వివాహముచేయఁబడిన స్త్రీ.

అన్యమాతృజుఁడు—సవతితల్లి కుమారుఁడు.

అన్యవాపము—తన గ్రుడ్లను మఱియొక పిట్టగూటిలోఁ బెట్టునది = కోకిల.

అన్యాపదేశము— ఒక దానినిమఃసున

నుంచుకొని యది స్ఫురించునట్లుగా మఱియొకదానిని చెప్పుట.

అన్యోన్యాభావము—(ఘట మెప్పుడును పటముగాదు, పట మెప్పుడును ఘటము కాదు) = తర్కము నందలి చతుర్విధాభావములలో నొకటి.

అన్యోన్యాశ్రయము—రెండు విషయములు పరస్పరము ఆశ్రయములై యుండు వాక్యార్థదోష విశేషము.

అన్వయము—దీనిచే సంబంధింపఁబడును=వంశము.

అన్వర్థము—అనుసరించిన యర్థము కలది = సార్థకము.

అన్వవాయము—పూర్వము పరము అని యన్వయింపఁబడునది = వంశము.

అన్వాధే(యికము) యము—
వివాహానంతరము భర్తృకులమునుండి కాని, మాతృకులమునుండికాని, పితృకులమునుండికాని పొందెడు స్త్రీధనము.

అన్వారోహణము — సహగమనము వక భార్య భర్తయొక్క చితి నెక్కుట.

అపచారము—పెద్దలయెడలఁ జేసిన యపరాధము.

అపచుఁడు—సర్వోత్తమమగు గృహస్థాశ్రమమునుండియు, నితరుల కన్నముపెట్టక తన పొట్టనుమాత్రమే నింపుకొనువాఁడు.

అపత్యము— నరక పతనము నుండి తప్పించునది = సంతానము.

అపత్యశత్రువు—తన సంతతికి శత్రువు = సర్పము.

అపత్రపిష్ణువు—లజ్జ స్వభావముగాఁ గలవాఁడు = సిగ్గరి.

అపధ్వంసజుఁడు—హీనజాతి పురుషుని వలన ఉచ్చజాతిస్త్రీయందు బుట్టిన వాఁడు.

అపదిశము— రెండు దిక్కులనుమధ్య భాగము = ఐమూల.

అపధ్వస్తుఁడు— తిరస్కరింపఁ (బహిష్కరింపఁ) బడినవాఁడు.

అపథ— మార్గముకానిది = తప్పుడు త్రోవ.

అపభ్రంశము — సంస్కృతమునుండి భ్రంశము నొందినది = అపశబ్దము.

అపమృత్యువు— అరాత్తుగా సంభవించిన మరణము.

అపరక్రియ— చనిపోయిన వానిని గూర్చి వెనుకఁజేయఁబడు కర్మ.

అపరాజిత— ఎప్పుడును పరాజయమును బొందనిది = పార్వతి.

అపరాజితుఁడు— ఓడింపఁబడనివాఁడు = 1. శివుఁడు, 2. విష్ణువు.

అపరాధపరిశోధకుఁడు— వివిధ మార్గములచే నేరస్థులను బరిశోధించి

దోషులను బయటఁబెట్టెడు ప్రభుత్వోద్యోగి = పత్తేదారు.

అపరాహ్ణము — అహస్సు (పగలు) మూఁడు భాగములు చేయఁగాఁ గడపటి భాగము; అయిదు భాగములు చేసినపుడు నాలుగవ భాగము.

అపరిగ్రహము— (అప్రతిగ్రహము) ఇతరుల వలన నేమియు గ్రహింపకుండుట; దేహయాత్రకు వలసినదానికంటె నధికముగా బోధసాధకమగు ధనాదికమును గైకొనకుండుట.

అపరిచ్ఛదుఁడు—ప్రశస్తములు కాని వస్త్రములు కలవాఁడు=దరిద్రుఁడు.

అపరోక్షము—చక్షురాదీంద్రియ గోచరమైనది.

అపర్ణ—1. పర్ణము (ఆకు)లను సయితము తినక శివునకై తపము చేసినది, 2. పోఁగొట్టబడిన ఋణము కలది = పార్వతి.

అపలాపము—ఎఱిఁగి యుండియు నెఱుఁగననుట.

అపవర్గప్రదుఁడు—మోక్షము నిచ్చువాఁడు = శివుఁడు.

అపవర్గము—దుఃఖాదులను వర్జించుట = మోక్షము.

అపవర్జనము—పాపమును వర్జించునది దానము. చూ. అపవర్గము.

అపవిత్రుఁడు—ఆచమనము చేయనపుడు శిరమునుగాని, కంఠమునుగాని కప్పుకొని, కచ్చవిడిచిగాని, జుట్టుముడి విరియఁబోసికొనిగాని, యజ్ఞోపవీత శూన్యుఁడైగాని యుండువాఁడు.

అపవిద్ధుఁడు—తల్లిదండ్రులు విడువఁగా మఱియొకరిచే బుత్త్రుఁడుగా దీసికొనఁబడినవాఁడు = ద్వాదశవిధ పుత్త్రులలో నొకఁడు.

అపవ్యయమానుఁడు—1. ఋణము పుచ్చుకొని లేదనెడువాఁడు, 2. దుర్వ్యయము చేయువాఁడు.

అపశబ్దనుఁడు— వ్యాకరణ విరుద్ధపదములను ప్రయోగించువాఁడు = గ్రామ్యవాది.

అపశబ్దము—వ్యాకరణసాధువు కాని దుష్టపదము.

అపసదుఁడు— బ్రాహ్మణునకుఁ గ్రింది మూఁడుజాతుల స్త్రీలయందుఁ గాని, క్షత్త్రియునకు క్రింది రెండు వర్ణముల స్త్రీలయందుఁగాని, వైశ్యునకు శూద్ర స్త్రీయందుఁగాని పుత్త్రుఁడు. బడసద =

అపసరము— ఒకనియాస్తి నికిఁ జెందుటకుఁ దగిన ఁనకు వాగా ప్రతిగ్రహక్రియాదికము. పురుషునకు

అపసర్పుఁడు—ఊరూరఁ దిరిగి సమాచారము తెలిసికొనివచ్చి రాజునకుఁ జెప్పువాఁడు = వేగరి.

అపసవ్యము—కుడివైపున నున్నది = దక్షిణము, కుడిభుజము మీఁదనుండి యెడమచేతి క్రిందికి ధరింపఁబడిన జన్నిదము నెం.

అపస్నాతుఁడు— జ్ఞాత్యాదుల మరణము నిమిత్తము స్నానము చేసినవాఁడు, పుత్త్రాదులచే సంస్కారార్థము స్నానము చేయింపఁబడిన మృతకళేబరము.

అపస్మారము— మోహదుఃఖాదులచేఁ గలిగెడి యావేశము = మూర్ఛారోగవిశేషము.

అపస్వరము—వేదాదులందు స్వరస్థానమునఁ దప్పుగాఁ జెప్పినస్వరము.

అపహస్తితుఁడు— మెడపైఁ జేయి వైచి గెంటఁబడినవాఁడు.

అపహాసము—దేహము దురఁగాఁ, గన్నీరు గారఁగా నవ్వెడు నవ్వు.

అపాం(క్త్య)కుఁడు—పంక్తి భోజనమున కర్హుఁడు కానివాఁడు.

అపాంక్తేయుఁడు—చూ. పై.

అపాంపతి— జలములకుఁ బ్రభువగు వాఁడు = సముద్రుఁడు, వరుణుఁడు.

[illegible]త్రీకరణము— పాత్రుఁడగు [illegible] అపాత్రునిగాఁ జేయు [illegible] ప్రతిగ్రహాది దోషము.

అపానము— విణ్మూత్రాదుల నధోముఖము లగునట్లు త్రోసివేయుటచేఁ బ్రాణులు జీవించుటకాధారమైన వాయువు.

అపారపారము—ఈవలిదరియు నావలి దరియు లేనిది = సముద్రము.

అపుంస్క—మగఁడులేని యాఁడుది = విధవ.

అపునర్భవము— తిరిగి పుట్టుక లేనిది = మోక్షము.

అపూర్వవాదము— చేసినకర్మవలనఁ బుణ్యాపాపరూపమగు నపూర్వము కలుగునని చెప్పునది=పూర్వామీమాంసావాదము

అపూర్వవిధి—ఇతర ప్రమాణము వలనఁ బ్రాప్తముకాని విషయములను విధించు వాక్యము.

అపేతరాక్షసి—పోఁగొట్టఁబడిన రాక్షసికంటి పాపముకలది = తులసి.

అప్పతి—ఉదకములకుఁ బ్రభువు = వరుణదేవుఁడు, సముద్రుఁడు.

అప్చరము—(అప్సరము) నీటియందుఁ దిరుగునది = చేఁప, మొసలి మొ.

అప్పిత్తము—నీటిని శోషింపఁజేయునది = అగ్ని.

అప్సరము—చూ. అప్చరము.

అప్పుఁబుట్టువు— నీటియందుఁ బుట్టినది = పద్మము మొ.

అప్రకాండము— స్కంధములేనిది = చిన్నపొద, తుప్ప.

అప్రకృతము—ప్రస్తుత విషయమునను సంబంధింపనిది.

అప్రజాత— సంతానవంతురాలు కానిది = గొడ్రాలు.

అప్రతిగ్రాహకుఁడు— ఇతరులవలన నేమియు గ్రహింపనివాఁడు.

అప్రతిద్వంద్వుఁడు—1 సాటిలేనివాఁడు 2 శత్రువులు లేనివాఁడు (అప్రతిరథుఁడు)

అప్రతిపత్తి—ఏమియును దోఁచక పోవుట.

అప్రతివీర్యుఁడు—సాటిలేని పౌరుషము కలవాఁడు.

అప్రత్యక్షము—చక్షురాదీంద్రియ గోచరము కానిది.

అప్రదక్షిణము—కుడిప్రక్కనుండి ఎడమప్రక్కగాఁ జుట్టివచ్చుట

అప్రమేయము—ఇంతయని కాని ఇట్టిదని కాని, నిర్ధారణ చేయరానిది

అప్రయోజకుఁడు—కార్య నిర్వాహకత్వ సామర్థ్యము లేనివాఁడు

అప్రస్తుతప్రశంస—ప్రకృత విషయమునకుఁగాని, ప్రకృతకాలమునకుఁగాని సంబంధింపని సంభాషణము

అప్రాప్తవ్యవహారుఁడు—వ్యవహార యోగ్యమగు వయస్సు మీఱింపని వాఁడు

అప్రాశ్యుఁడు—పంక్తియందు భుజింపఁదగనివాఁడు

అప్రియంవదుఁడు—అనిష్టములగు పరుషవాక్యములు పలుకువాఁడు

అప్సరసలు—ఉదకమునందు జనించిన వారు = దేవవేశ్యలు.

అప్సుచరము—ఉదకములయందు సంచరించునది = చేప మొ.

అప్సుజము—చూ అంబుజము.

అబల—అల్పమయిన బలము కలదిః బలము లేనిది = ఆఁడుది

అబోధవేళ — అనధ్యయన సమయము (వేదపఠన నిషిద్ధకాలము).

అబ్జ—ఉదకములయందుఁ (క్షీరసాగర మథనమున) బుట్టినది=లక్ష్మి సుర

అబ్జజుఁడు— } విష్ణుని నాభికమలమునఁ
అబ్జభవుఁడు— } బుట్టినవాఁడు=బ్రహ్మ.

అబ్జబాంధవుఁడు—తామరలకు బంధువైనవాఁడు = సూర్యుఁడు

అబ్జమిత్రుఁడు— తామరలకు స్నేహితుఁడు=సూర్యుఁడు

అబ్జము—నీటియందుఁ బుట్టినది = 1 పద్మము 2. ఉప్పు

అబ్జయోని—విష్ణుని నాభికమలము యోని (ఉత్పత్తిస్థానము)గాఁ గలవాఁడు = బ్రహ్మ

అబ్రహ్మణ్యము—బ్రాహ్మణునిచేఁ జేయఁదగనిది = హింసాది.

అబ్జవాహనుఁడు—పద్మము వాహనముగాఁ గలవాఁడు=బ్రహ్మ

అబ్జవైరి (అబ్జారి) — పద్మములకు శత్రువు = చంద్రుఁడు. (చంద్రోదయము కాఁగానే పద్మములు ముకుళించును )

అబ్జిని—అబ్జము (తామరపువ్వు)లు గలది సరస్సు.

అబ్జుఁడు—(క్షీరసాగర మథనమున) నీటఁ బుట్టినవాఁడు = చంద్రుఁడు.

అబ్దము—నీటి నిచ్చునది = మేఘము.

అబ్దుఁడు—ఉదకముల నిచ్చువాఁడు = మేఘుఁడు.

అబ్ధి—ఉదకములను ధరించునది = సముద్రము.

అబ్ధికఫము—సముద్రుని శ్లేష్మము = నురుఁగు.

అబ్ధిజ—పాలసముద్రమునఁ బుట్టినది = లక్ష్మి, మద్యము.

అబ్ధిజము—క్షీరసాగర మథనమునఁ బుట్టినది = కల్పవృక్షము.

అబ్ధిజుఁడు—క్షీరసాగర మథనమునఁ బుట్టినవాఁడు = 1. చంద్రుఁడు, 2. ధన్వంతరి.

అబ్ధినగరి—సముద్రమునందలి పట్టణము= ద్వారక (పలుమార్లు జరాసంధుఁడు మొదలగువారు తనదేశముపై దండెత్తి వచ్చుచుండుటచే శ్రీకృష్ణుఁడు వారి వలన భీతిచేఁ దన పటణమును సముద్రమునఁ గట్టెనని పురాణప్రసిద్ధి.)

అబ్ధినవనీతకుఁడు—సముద్రమున నవనీతము (వెన్న)వలెఁ బుట్టినవాఁడు = చంద్రుఁడు.

అబ్ధినవనీతము—క్షీరసాగర మథనమునఁ బుట్టిన వెన్న = అమృతము.

అబ్ధిమండూకి—సముద్రమునఁ గప్పవలె నుండునది = ముత్యపుచిప్ప.

అబ్ధిమేఖల—సముద్రము మొలత్రాడుగాఁ గలది = భూమి.

అబ్ధివధువు—సముద్రుని భార్య = నది.

అబ్ధిశయనుఁడు—ప్రళయ కాలమున సముద్రము శయ్యగాఁ గలవాఁడు = విష్ణువు.

అబ్ధిశయుఁడు—జగత్ప్రళయకాలమున సముద్రమునందు శయనించువాఁడు = విష్ణువు.

అబ్ధిసారము—సముద్రమునకు సారమైనది = ముత్యము.

అబ్భక్ష(ణ)ము—నీరుత్రాగి యుపవసించుట.

అబ్భక్షము—ఉదకము ఆహారముగాఁ గలది = సర్పభేదము.

అబ్రహ్మచర్యకము—మొదటిదగు బ్రహ్మచర్యాశ్రమ విరుద్ధకర్మము = రతి.

అబ్రాసి—నీటిప్రోగు = సముద్రము.

అభయడిండిమము—భీతిఁ బొందిన సేనలను ప్రోత్సాహపెట్టుటకై యుద్ధమున ప్రయోగించు ఢక్కాది వాద్యవిశేషము.

అభయవచనము—రక్షించెదనని చేసిన వాగ్దానము.

అభవుఁడు—పుటుక లేనివాఁడు = శివుఁడు.

అభికుఁడు—వలపు గలవాఁడు=కాముకుఁడు.

**అభిక్రమము**— శత్రువులను గూర్చి దండెత్తి పోవుట.

**అభిగమనము**—1. స్నేహితు నెదుర్కొని గౌరవించుట, 2. జయమునకై యెదుర్కొని పోవుట.

**అభిఘార(ణ)ము**— సంస్కారార్థము హవ్యాదులపై ఘృతాదులను కొంచెముగా వేయుట.

**అభిచరణము**— శత్రుహింసార్థముచేయు మంత్రతంత్రయుక్త ప్రయోగము.

**అభిచారకుఁడు**— అభిచారము చేయువాఁడు.

**అభిచారము**—పరులను దిరస్కరించుట కాచరింపఁబడినది = హింసార్థమైన యథర్వణవేదవిహిత హోమకర్మము.

**అభిజాతుఁడు**—మంచికులమునఁ బుట్టిన వాఁడు, సాంగవేదాధ్యయనము చేసిన వాఁడు.

**అభిజిత్తు**— పగలు 14 గడియలమీఁద 2 గడియలకాలము. (సూర్యోదయము మొదలు 8-వ ముహూర్తము.)

**అభిజ్ఞుఁడు**— అంతటను వస్తుతత్త్వము నెఱుఁగువాఁడు =1. చంద్రుఁడు, 2. పండితుఁడు.

**అభిధ**— సంకేతితార్థమును స్ఫురింపఁ జేసెడి శబ్దశక్తి.

**అభినయము**—అంగవిన్యాసాదికముచేఁ గావించు హృద్గత భావసూచన.

**అభినిర్ముక్తుఁడు**—సూర్యుఁడస్తమించు వేళ నిద్రించువాఁడు.

**అభినివేశము**— తప్పక చేయవలయు ననెడి పట్టుదల = అభిలాషము.

**అభిప్లవము**—అంతటను వెల్లివిరియుట = ఉపద్రవము.

**అభిమనస్కుఁడు**—కార్యమున కభిముఖమైన మనస్సుకలవాఁడు.

**అభిమరుఁడు**—ద్రవ్యాశచేఁ బ్రాణములను లెక్కింపక పులి, యేనుఁగు మొదలగు క్రూర జంతువులతోఁ బోర నద్యమించినవాఁడు.

**అభిమానపుత్రుఁడు**— ప్రేమచేఁ గుమారునివలె రక్షింపఁబడువాఁడు.

**అభిమానము**— నేను, నాది యనెడు భావము.

**అభియాతి**—జయార్థ మెదుర్కొని పోవు వాఁడు = శత్రువు.

**అభియోక్త**—అభియోగము (వ్యాజ్యము) తెచ్చువాఁడు = వాది.

**అభిరూపుఁడు**—అనురూపము కలవాఁడు, మనోహరుఁడైనవాఁడు =1. చంద్రుఁడు 2. శివుఁడు, 3. విష్ణువు, 4. మన్మథుఁడు, 5. పండితుఁడు.

**అభివాద(దన)ము**— గోత్రనామములు చెప్పుచు పాదములకు మ్రొక్కుట.

**అభివ్యాపకము**—అంతటను వ్యాపించి యుండునది (వాయువు), ఆధార భేదము.

అభిశస్తుఁడు—1. లేని నింద మోఁపఁబడినవాఁడు, 2. పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు.

అభిశ్రవణము— శ్రాద్ధకాలమున భోక్తలు భుజించునపుడు ఇతరబ్రాహ్మణులు చేయువేదమంత్రపఠనము.

అభిషిక్తుఁడు—1. పట్టాభిషేకము (రాజులకుఁ బట్టము గట్టునపుడు చేయించుస్నానము) చేయఁబడినవాఁడు.

అభిసంధుఁడు— ఇతరుల గుణములను సహింపక ఆక్షేపించువాఁడు = వంచకుఁడు.

అభిస(సా)రణము (అభిసారము) } నాయకుఁడు నాయికనిమిత్తముగాని, నాయిక నాయకుని నిమిత్తముగాని సంకేతస్థానమునకుఁ బోవుట; నాయికానాయకుల సంకేతస్థానము.

అభిసారి(క)ణి— ప్రియుని గూర్చి సంకేతస్థానమునకు ఒంటరిగాఁ బోవు నాయిక; ప్రియుని సంకేతస్థలమునకు రప్పించుకొను నాయిక.

అభిహితాన్వయవాదము— వాక్యమునందలి పదములు తమతమ ప్రత్యేకార్థములను దెలిపినపిమ్మట పరస్పరమన్వయించి విశిష్ట వాక్యార్థమును దెల్పుట.

అభీ(ప్సితము)ష్టము— అన్నివిధములచేతను బొందుటకు నిశ్చయింపఁబడినది, మనస్సునకుఁ బ్రియమైన వస్తువు.

అభుక్తమూలము— జ్యేష్ఠ కడపటియరగడియయు, మూలమొదటి యరగడియయు గలిసిన కాలము. (జ్యేష్ఠ కడపటి రెండు గడియలును మూల మొదటి రెండు గడియలును గలిసిన కాలమని కొందఱు)

అభూతాహరణము— స. ప్రసుతమున కుపయోగపడునట్లు నెపముపెట్టి చెప్పుట. (ధర్మరాజు ఏనుఁగు చావు నెపముగాఁగొని అశ్వత్థామ చచ్చెనని ద్రోణునితోఁ జెప్పినమాట యిట్టిది.)

అభూతపూర్వము— ఇంతకుఁ బూర్వము లేనిది. (అనిదం పూర్వము.)

అభ్యంగ(జ)నము—కంటికిఁ గాటుకపెట్టుట, దేహమునకు నూనె మొదలగునవి రాచికొనట = తలయంటు.

అభ్యంతరము— దిక్కుల మధ్యప్రదేశము.

అభ్యమిత్రు (ణు) (యు)ఁడు—శౌర్యముతో శత్రువు నెదుర్కొని పోరువాఁడు.

అభ్యర్థి—సహాయము కోరువాఁడు, పదవినిమిత్తము ప్రయత్నించు వ్యక్తి.

అభ్యవకర్షణము—1. నాటిన ముల్లు లోనగువానినూడఁదీయుట, 2. కలుపుఁదీయుట.

అభ్యసూయ—గుణములయందు దోషారోపణము చేయుట = ఈర్ష్య.

అభ్యసూయకుఁడు—సుగుణముల యందు దోషారోపణముచేయువాఁడు.

అభ్యాకర్షణము— మల్లులు ద్వంద్వయుద్ధమున దండలు కొట్టుకొనుట,

అభ్యాగతుఁడు — భోజనకాలమున వచ్చిన యతిథి - తిథి, పర్వము ఉత్సవము మొదలగువానియందు ప్రత్యాశతో వచ్చినవాఁడు.

అభ్యాగారికుఁడు — కుటుంబ పోషణమునకై మిగుల పాటుపడువాఁడు.

అభ్యాసాదనము — శస్త్రాదులచే శత్రువును నిర్బలునిగాఁ జేయుట = ముట్టడి.

అభ్యుత్థానము — ఆదరముచేఁ గాని, గౌరవముచేఁగాని లేచియెదురువచ్చుట.

అభ్యుదితుఁడు — సూర్యోదయ సమయమున నిద్రించువాఁడు.

అభ్యుద్గతుఁడు — గౌరవార్థము లేచి యెదురు వచ్చినవాఁడు, ఉన్నతస్థితికి వచ్చినవాఁడు.

అభ్యుషితుఁడు — స్వామిని కాచుకొని యుండు సేవకుఁడు.

అభ్రం(లిహ)కషము — ఆకాశమును ఒరయునది = మిక్కిలి ఎత్తైనది.

అభ్రకము — అభ్రము (మేఘము) తో సమానమైన వర్ణముకలది = గనులలో పుట్టు ఒకవిధమగు తెల్లనిరేకు.

అభ్రపిశాచ(కుఁడు)ము — ఆకాశమున సూర్యాదిగ్రహములకుఁబిశాచమువలెభయ ముగలిగించువాఁడు రాహువు.

అభ్రపుష్పము-చూ. మేఘపుష్పము.

అభ్రమాతంగము — ఆకాశమున నుండెడు ఏనుఁగు = ఐరావతము.

అభ్రము — ఉదకమును భరించునది = 1. మేఘము, 2. ఆకాశము, 3. హారతి కర్పూరము.

అభ్రమువల్లభము — అభ్రమువు అనెడి ఆఁడేనుఁగయొక్క భర్త = ఐరావతము.

అమంగలము — శుభప్రదము కానిది = 1. ఆముదపుచెట్టు, 2. అశుభము.

అమనస్కయోగము — బ్రహ్మధ్యానముచే మనస్సును లయింపఁజేయు యోగవిశేషము.

అమనస్కుఁడు — కార్యాచరణమునకుఁ జాలినట్టి మనోదార్ఢ్యము లేనివాఁడు, విషయాంతరమునందు నిల్చిన మనస్సు కలవాఁడు, మనోవ్యాపారశూన్యుఁడు (యోగి), మనసు లేనివాఁడు (పరమాత్మ).

అమరంమన్యుఁడు — తాను దేవుఁడని తలఁచువాఁడు.

అమరకము — ప్రతి సంవత్సరము గొంత శిస్తు ఇవ్వవలసినదిగా నేర్పాటు చేసికొని, భూమిని దున్నుకొనునిమిత్తము ఈనాముదారు వ్యవసాయదారునివశము చేయుట.

అమరగురువు(ఁడు) — దేవతల యుపాధ్యాయుఁడు = బృహస్పతి.

అమరతటిని — దేవలోకము నందలి నది = మందాకిని.

అమరతరువు — కోరిన కోరికల నిచ్చెడి దేవతల వృక్షము = కల్పవృక్షము.

అమరద్విజుఁడు— దేవుని నిత్యమును బూజించెడు బ్రాహ్మణుఁడు= పూజారి.

అమరనాయకుఁడు—దేవతలకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

అమరప్రభువు—అమర నాయకుఁడు.

అమరరత్నము—దేవతల కోర్కులు తీర్చుమణి = చింతామణి.

అమరలోకము— దేవతలు నివసించెడు లోకము = స్వర్గము.

అమరసింహుఁడు— దేవతలలో శ్రేష్ఠుఁడు = ఇంద్రుఁడు.

అమరాపగ—చూ. అమరతటిని.

అమరాలయము — అమరుల (దేవతల)కు నివాసస్థానమైనది = ఇంద్రుని స్వర్గము.

అమరావతి—అమరులు (దేవతలు) నివసించియుండుపట్టణము = ఇంద్రుని రాజధాని

అమరుఁడు— మరణించినవాఁడు = వేలుపు.

అమర్త్యుఁడు—మృతి నొందువాఁడు, మర్త్యుఁడు, మర్త్యుఁడు కానివాఁడు (మరణించనివాఁడు), అమర్త్యుఁడు = వేలుపు.

అమర్షణుఁడు——1. కోపము కలవాఁడు, 2. ఓర్వలేనివాఁడు.

అమర్షహాసము— హృదయమునందలి కోపమునుదాఁచి, పైకి నవ్విన నవ్వు.

అమాత్యుఁడు— మంత్రము (ఆలోచనము)తోఁ గూడి యుండువాఁడు = మంత్రి.

అమానుషము—1. మనుష్యుని శక్తి మీఱినది, 2. మనుష్యకృతము కానిది.

అమావాస్య—కూడియున్న సూర్యచంద్రుల కలది = 30 వ తిథి.

అముక్తహస్తుఁడు—1. పిడికిలి పట్టు విడువనివాఁడు, 2. మితముగా వ్యయము చేయువాఁడు.

అముష్యాయణుఁడు—1. సత్కులమునఁ బుట్టినవాఁడు 2. ప్రసిద్ధికెక్కిన గోత్రముగల తండ్రికొడుకు.

అమృతకర(కిరణు)ఁడు—అమృతమయములైన కిరణములు కలవాఁడు = చంద్రుఁడు

అమృతపుఁడు—క్షీరసాగర మథనమునఁ బుట్టిన యమృతమును ద్రాగినవాఁడు = వేల్పు.

అమృతము—1. మరణమును బొందింపనిది, 2. క్షీరసముద్ర మథనమునఁ బుట్టినది - సుధ. (దీనియందు మరణము లేదు = మోక్షము.)

అమృతసూతి—క్షీరసాగరమునఁ (అమృతము = ఉదకము) బుట్టినవాఁడు = చంద్రుఁడు.

అమృతహస్తము— రోగియొక్క చేతినాడిని పరీక్షింపగనే ఆరోగ్యము

కలుగునట్లు చేసెడి వైద్యుని యోగ హస్తము.

అమృతాంధసుఁడు—అమృత మన్న ముగా గలవాఁడు = వేల్పు.

అమృతాంశుఁడు (పు)—అమృత మయములైన కిరణములు కలవాఁడు = చంద్రుఁడు.

అమృతాశనుఁడు—చూ. అమృతాంధసుఁడు.

అమృతాహరణుఁడు—అమృతమును హరించినవాఁడు = గరుత్మంతుఁడు. (గరుత్మంతుఁడు తనయొక్క మాతృ సేవా నివృత్త్యర్థము నాగులకు అమృత భాండము నిచ్చుట కొడంబడి దేవ లోకమునుండి యమృతభాండమును బలాత్కారముగాఁ గొనివచ్చె నని పురాణప్రసిద్ధి.)

అమృతుఁడు—చావు లేని వాఁడు = వేలుపు, ధన్వంతరి మొ.

అమృతేశయుఁడు—జగత్ప్రళయ కాల మున నీటిపై శయనించువాఁడు = విష్ణువు.

అమేధసుఁడు—మేధస్సు (బుద్ధి) లేని వాఁడు = మూర్ఖుఁడు.

అమేధ్యము—అపరిశుద్ధమైనది = పురీషము.

అమైథునుఁడు— మిథునకర్మ లేనివాఁడు = బ్రహ్మచారి, సన్యాసి.

అమ్ముమ్రేటునేల—బాణము పడునంత దూరముగల భూమి.

అమ్లఫలము—పుల్లనిపండు = చింత పండు.

అమ్ల(శాకము)వృక్షము— పుల్లని పండు (ఆకులు) గల చెట్టు = చింత.

అయథార్థవర్ణుఁడు—కృత్రిమమైన వేషమును ధరించి చరించువాఁడు = వేగువాఁడు.

అయనము—సూర్యుని దక్షిణోత్తర దిశల గమనకాల పరిమితి.

అయస్కాంతము—ఇనుము నాకర్షించునది = సూదంటుఱాయి.

అయస్కారుఁడు—ఇనుప పనిచేయు వాఁడు = కమ్మరి.

అయాజ్యసంయాజ్యము—యజ్ఞము చేయుట కర్హత లేనివానిచే యజ్ఞము చేయించుట.

అయిదుకైదువులజంత—చూ. పంచ బాణుఁడు.

అయిదు మోముల వేలుపు—
(అరపది మోముల వేల్పు) 1. ఈశాన ము, 2. తత్పురుషము, 3. వాసుదేవము, 4. సద్యోజాతము, 5. అఘోరము అను ఐదు ముఖములు కలవాఁడు=శివుఁడు.

అయిదువ—5 వన్నెలు గలది = పుణ్య స్త్రీ (మంగళసూత్రము, పసుపు,కుంకు మము, గాజులు, చెవ్వాకు.)

అయు (గ) (గ్మ) నేత్రుఁడు — బేసి, 3 కన్నులు కలవాఁడు = శివుఁడు.

అయు(గ్బాణుఁడు)గశరుఁడు — బేసి (1. అరవిందము 2. అశోకము 3. చూతము 4. నవమల్లిక 5. నీలోత్పలము 1. ఉన్మాదన 2. తాపన 3. శోషణ 4. స్తంభన 5. సమ్మోహనము) సంఖ్య గలబాణములుకలవాఁడు, మన్మథుఁడు.

అయుగసప్తి — బేసి (7) సంఖ్యగల గుఱ్ఱములు రథవాహనములుగాఁ గలవాఁడు = సూర్యుఁడు.

అయుగార్చి — బేసి (1. కాళి 2. కరాళి 3. విస్ఫులింగిని 4. ధూమ్రవర్ణ 5. విశ్వరుచి 6. లోహిత 7. మనోజవ) సంఖ్య గల (జ్వాలారూపములగు) కిరణరూపములగు నాల్కలు కలవాఁడు = అగ్ని.

అయుగ్మ(చ్ఛద)పర్ణము — బేసిసంఖ్య గల యాకులుగలది = ఏఁడాకుల (పొన్న) యరఁటి.

అయుగ్మవాహుఁడు — చూ. అయుగసప్తి.

అయోగవి — 1. శూద్రునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టిన యాఁడుది, 2. అయోగవుని భార్య.

అయోగవుఁడు — శూద్రునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టినవాఁడు.

అయోగ్రము — ఇనుపకట్టు గాని, పొన్నుగాని వేసినది = రోఁకలి.

అయోధ్య — యోధులకు జయింపశక్యము కానిది = కోసలదేశపురాజధాని.

అయోనిజ — గర్భమువలనఁ బుట్టనిది = సీత మొ.

(17)

అయోనిజుఁడు — గర్భమువలనఁ బుట్టనివాఁడు = 1. శివుఁడు 2. విష్ణువు.

అయోముఖము — ఇనుప (మొన) మొగము గలది = బాణము.

అయౌగికము — వ్యుత్పత్తి లేనిది = రూఢము. (పదము.)

అరంగమము — వేగముగాఁ బోవునది = బాణము.

అరణము — పెండ్లినపుడు, కుమార్తెకును వివాహకాలమున నీయఁబడు ధనము.

అరణి — అగ్ని పుట్టించుటకుఁ గాష్ఠాంతరముచే మథింప యోగ్యమైనదారువు.

అరణీసుతుఁడు — అరణియొక్క కుమారుఁడు = శుకుఁడు, (ఘృతాచియను నప్సరసఁ జూచుచు నరణిని మథింపఁగా వ్యాసునకు రేతస్స్ఖలనమై యరణిపైఁబడి, యందుండి సద్యఃకాలముననే శుకుఁడు పుట్టెనని పురాణప్రసిద్ధి) అగ్ని.

అరణ్యచంద్రిక — ప్రయోజనశూన్యమై యడవియందు కాచిన వెన్నెల.

అరణ్య(ణ్యే)చరము — అరణ్యమునందు సంచరించునది = కోఁతి మొ.

అరమెయిజోటివాఁడు — సగము స్త్రీశరీరమును, సగము పురుషశరీరమును గలవాఁడు = అర్ధనారీశ్వరుఁడు.

అరవిందబాంధవుఁడు — పద్మములకు జుట్టమైనవాఁడు = సూర్యుఁడు.

అరవిందమిత్రుఁడు — పద్మములకు స్నేహితుఁడైనవాఁడు = సూర్యుఁడు.

అరవిందము— కేసరములను బొంది యుండునది = తామరపువ్వు.

అరవిందపదుఁడు— పద్మము గృహముగాఁ గలవాఁడు = బ్రహ్మ.

అరవిందసూతి— విష్ణుని నాభికమలమునఁ బుట్టినవాఁడు = బ్రహ్మ.

అరవిం(దేక్షణుఁడు) దాక్షుఁడు— పద్మములవంటి నేత్రములు కలవాఁడు = విష్ణువు.

అరవిందాసనుఁడు— విష్ణుని నాభికమలము పీఠముగాగలవాఁడు = బ్రహ్మ.

అరవిందిని— తామరతీఁగ, తామరల గుంపు, పద్మములుగలది = సరస్సు.

అరాజకము— రాజులేని దేశము.

అరాతి— సంహరించువాఁడు=శత్రువు.

అరిందముఁడు— కామాద్యరిషడ్వర్గమును గెలుచువాఁడు=శివుఁడు, శత్రువును అణఁచువాఁడు.

అరిగాపు— శత్రువులు రాకుండఁ బెట్టిన కావలి.

అరిత్రగాధము— తెడ్డునకుఁ దగులునంత మెరకగలది = లోఁతులేని నీరు.

అరిష్టము— మంత్రాదులచే రక్షింపఁబడి పిశాచాదులచే బాధింపఁబడని బాలకాదులుగలది=పురుటిల్లు, రిష్టము (శుభము) కానిది = అశుభము.

అరిష్టసూదనుఁడు— కాకాసురుని భంజించినవాఁడు = శ్రీరాముఁడు, అశుభమునుబోఁగొట్టువాఁడు=విష్ణువు. (కాకాసురుఁడు దండకారణ్యమున నున్న సీతయొక్క స్తనమును ఫలభ్రాంతిచేఁ బొడుచఁగా భార్యకుఁ గలిగించినయాపదకు శ్రీరాముఁడు కోపించి వానిపైఁ దృణమును మంత్రించివదలెను. అస్త్రము వెంబడింపఁగా కాకాసురుఁడు ముల్లోకములను బరువిడి బ్రహ్మాదిదేవతలను శరణుఁగోరి వ్యర్థము కాఁగాఁదిరిగివచ్చి శ్రీరామునే శరణుపొందెను. శ్రీరాముని యనుగ్రహమున నా యస్త్రము వానిప్రాణములు తీయక యొకనేత్రమును గ్రహించి క్షమించెనని పురాణప్రసిద్ధి.)

అరుణలోచనము— ఎఱ్ఱని కన్నులు గలది=పావురము.

అరుణసారథి— అరుణుఁడు సారథిగాఁ గలవాఁడు = సూర్యుఁడు.

అరుణాత్మజ— సూర్యుని కుమార్తె = 1. యమున, 2. తపతి.

అరుణాత్మజుఁడు— సూర్యుని కుమారుఁడు=1. శని, 2. సావర్ణి మనువు, 3. యముఁడు, 4. జటాయువు, 5. కర్ణుఁడు, 6. సుగ్రీవుఁడు, 7. అశ్వినీదేవతలు.

అరుణానుజుఁడు— అరుణుని (అనూరుఁడు) తమ్ముఁడు = గరుత్మంతుఁడు.

అరుణాభుఁడు— అనూరుని కాంతివంటి కాంతిగలవాఁడు = శివుఁడు.

అరుణార్చి— ఎఱ్ఱనికాంతిగలవాఁడు= సూర్యుఁడు.

అరుణావరజుఁడు—అనూరునకుఁ బిమ్మటఁ బుట్టినవాఁడు=గరుడుఁడు.

అరుణుఁడు—ఎఱ్ఱనివాఁడు = 1. సూర్యుఁడు, 2. అనూరుఁడు.

అరుణోదయము—సూర్యసారథియగు అనూరుని సూర్య దిగ్దర్శనము, సూర్యోదయమునకుఁబూర్వము నాలుగడియలకాలము.

అరూషుఁడు—దేనిచేతను గప్పబడనివాఁడు=సూర్యుఁడు.

అర్కకాంత—సూర్యుని భార్య = 1. సంజ్ఞాదేవి, 2. ఛాయాదేవి (ప్రాగ్గతిగుడు).

అర్కతనయ—అరుణాత్మజ.

అర్క(తనయుఁడు)జుఁడు—సూర్యుని కుమారుఁడు = శని, కర్ణుఁడు, సుగ్రీవుఁడు, సావర్ణిమనువు, యముఁడు, జటాయువు, అశ్వినీదేవతలు.

అర్కపర్ణము—సూర్యునివలె వేఁడిమిగల యాకులు గలది = జిల్లేడుచెట్టు.

అర్కప్రియ—సూర్యుని భార్య = 1. సంజ్ఞాదేవి, 2. ఛాయాదేవి.

అర్కబంధువు—సూర్యునకు జుట్టము = తామర, గౌతమముని, బుద్ధుఁడు.

అర్కవివాహము—జిల్లేడు చెట్టును కన్యకగాఁ గొని పెండ్లియాఁడుట = మూఁడవభార్యను పెండ్లాడుటకుఁ బూర్వము విహితము. దీనిచే మూఁడవ భార్య నాల్గవది యగును.

అర్కవ్రతము—1. మాఘశుద్ధసప్తమి మొదలగు దినములందు సూర్యప్రీతికై చేయు వ్రతవిశేషము, 2. సూర్యుఁడు మెల్లమెల్లగా జలములు గ్రహించునట్లు రాజు ప్రజలకు నొప్పిలేకుండ పన్నుపుచ్చుకొను నియమము.

అర్కేందుసంగమము—సూర్యచంద్రుల సమావేశము=అమావాస్య.

అర్ఘ్యప్రదానము—త్రిసంధ్యలయందును సూర్యునుద్దేశించి బ్రాహ్మణులచే సభక్తికముగా నీఁబడు నర్ఘ్యోదకము.

అర్ఘ్యము—(అర్ఘము = పూజ) పూజార్థముపయోగించెడు పుష్పాదికము.

అర్చకత్వము—భగవంతునకు నిత్యమును జేయు పూజాదికము.

అర్చిష్మంతుఁడు—కాంతికలవాఁడు= 1. అగ్ని, 2. సూర్యుఁడు, 3. విష్ణువు.

అర్జునధ్వజుఁడు—అర్జునుని రథమునకు జండాయైనవాఁడు=ఆంజనేయుఁడు.

అర్ణోదము—నీటి నిచ్చునది = మబ్బు.

అర్ణోరాశి—ఉదకములకు సమూహమైనది = సముద్రము.

అర్ధచంద్రము—స. అర్ధచంద్రుని యాకారము కలది = 1. అర్ధచంద్రముఖముగల బాణము, 2. నఖక్షతము 3. అభినయహస్తవిశేషము.

అర్ధరథుఁడు—ఒక్క విలుకానితో నిలిచి పోరలేని యోధుఁడు.

అర్ధచంద్రకము (అర్ధేందువు) } నెమలిపురిలోని యర్ధచంద్రాకారమగు చిహ్నము.

అర్ధజరతి—సగము ముదుసలియు సగము పడుచుదియు నగు స్త్రీ వ్రేలు స్తనములు నల్లని వెంట్రుకలు గలది.

అర్ధతూరము—యుద్ధారంభము నందలి భేర్యాది వాద్యధ్వని.

అర్ధదూషణము—సప్తవ్యసనములలో నొకటియగు ధనమును పాడుచేయుట.

అర్ధనారీశ్వరుఁడు—సగము స్త్రీయు, సగము పురుషుఁడు నైనవాఁడు = సాంబశివుఁడు.

అర్ధ(పతి)పుఁడు—ద్రవ్యమును పాలించువాఁడు = కుబేరుఁడు, రాజు

అర్ధము—అర్థింపఁ (కోర) బడునది = ధనము

అర్ధవాదము-1 విధినిషేధవాక్యములను బలపఱచి బోధించుటకై నిందారూపముగాఁగాని స్తుతిరూపముగాఁగాని చేసెడు వివరణము, 2 నిందాస్తుతులలో నొకటి ప్రయోజనముగాఁ గల లౌకికవాక్యము.

అర్ధవేదము—నవరత్నముల జన్మస్థానములు, జాతులు, గ్రహములు, వీని దోషము లెఱింగించుచుఁ దత్తద్రత్న ధారణమునఁ గలుగు శుభాశుభఫలములను దెలుపునది = ఉపయజుర్వేదము

అర్ధసీరి—పంటలోఁ బాలుగలవాఁడు = పాలికాఁపు.

అర్ధహరణము—దండ్యునివలన ధనమును దండుపుగొనుట = దండభేదము.

అర్థాలంకారము—అర్థము ప్రధానముగాఁగలిగి కావ్యశోభాజనకమయిన యుపమాదికము.

అర్ధికుఁడు—బ్రాహ్మణునకు వివాహితయగు వైశ్యస్త్రీయందుఁబుట్టి సంస్కరింపఁబడినవాఁడు రాజాదులను మేల్కొలుపుట భోజనాద్యవసరములను దెలుపుట మున్నగు నవసరకార్యములందు నియుక్తుఁడయిన స్తుతిపాఠకుఁడు.

అర్ధరథుఁడు—1. అతిరథ మహారథ సమరథులకంటెఁ దక్కువ, 2. ఒక్క విలుకానితో సరిగా నిలిచి పోరలేని యోధుఁడు.

అర్ధహారము 54 లేక 64 పేటలుగల కంఠహారము

అర్ధోదయము—1. సూర్యునియొక్క గాని, చంద్రునియొక్క గాని మండలము సగముదయించుట, 2 పుష్యమాఘమాసములలో అమావాస్యయు ఆదివారము, శ్రవణనక్షత్రము వ్యతీపాతయోగమును గలిసిన యోగము.

అర్యాణి—(అర్య) అర్యుని (కోమటి) భార్య = వైశ్యస్త్రీ.

అర్శోఘ్నము—మూలవ్యాధిని బోఁగొట్టునది = 1 కంద 2. నల్లజీడి 3 తక్రము 4 మోఁకడపెరుఁగు

అర్శోహితము—మూలవ్యాధిని గుదుర్చునది = నల్లజీడి

అలంకరిష్ణు(ఁడు)వు—అలంకరించుకొను స్వభావము గలవాఁడు

అలంకారము—శరీరమునకుఁగాని కావ్యమునకుఁగాని శోభకలుగఁజేయునది.

అలంఘ్యము—దాటుటకు శక్యము కానిది

అలంపురుషీణుఁడు—ఇతరునితోఁ బోరు సమర్థుఁడు = ప్రతిమల్లుఁడు

అలక—తానుండుచోటు నలంకరించునది = కుబేరుని రాజధాని

అలకలు— అలంకరింపఁ బడునవి = ముంగురులు.

అలగర్ద—విషముగల యొక పెద్దజలగ

అలరుబో(ణి)డి—పువ్వువలె సుకుమార శరీరముగల స్త్రీ

అలరువిలుకాఁ(ల్డా)డు—అరవిందము మొదలుగాఁగల పువ్వులు బాణములుగాఁగల విల్లుకలవాఁడు = మన్మథుఁడు.

అలరువిలుకానియన్న—పూవిల్తుఁడగు మన్మథునకు అన్నయైనవాఁడు=బ్రహ్మదేవుఁడు (విష్ణువునకు లక్ష్మియందు మన్మథుఁడు జనింపక పూర్వమే నాభికమలమునందు బ్రహ్మపుట్టుటచే అన్నయయ్యెను )

అలరువిలుతుఁ(ల్తు)డు— మా. అలరు విలుకాఁడు.

అలర్కము— కఱచునను భయమువలన నడ్డగింపఁబడునది = ఔషధప్రయోగమువలన పిచ్చిపట్టినకుక్క.

అలి(ళిం)దము—తలవాకిలి ప్రక్కనుండు గృహము, వాకిటికి వెలుపలనున్న నలుచదరపుచోటు.

అలిప్రియము— తుమ్మెదలకు మిగుల నిష్టమైనది = ఎఱ్ఱకలువ

అలివేణి—తుమ్మెదలవలె నల్లనిరంగుగల వేణి (సర్పాకారముగా నల్లిన జడ) గలది = స్త్రీ

అలుక్సమాసము— విభక్తిలోపములేని సమాసము (మధ్యేమార్గము)

అలౌకికసన్నికర్షము—లోకసిద్ధముకాని ప్రత్యక్షజ్ఞానమును గలిగించు లోకసంబంధము.

అలౌకికుఁడు— లోకసంబంధము లేనివాఁడు = లోకవ్యవహారజ్ఞానశూన్యుఁడు.

అల్పంపచుఁడు— కొంచెముగా వండుకొనువాఁడు = పిసినిగొట్టు.

అల్పతనువు—అల్పశరీరముగలవాఁడు = అలిపిరి

అల్పప్రాణము— ఉచ్చారణమున అల్పప్రాణవాయు-వ్యాపారముగలది =

అంతస్థములు, అనునాసికములు, పరుష సరళములు మతాంతరమున గ్రాహ్యాచ్చులు.

అల్పసరస్సు— చిన్న చెఱువు=గుంట.

అల్పాయువు— తక్కువ యాయుర్దాయము కలది = పొట్టేలు.

అల్లె(ల్లి య)ము— వివాహానంతరము అల్లుని ఓలిచి యత్తవారింటఁ బెట్టెడు విందు.

అవకీర్ణి— పరస్త్రీ సంగమాదికముచే నశించిన వ్రతముకల బ్రహ్మచారి.

అవగథుఁడు— ప్రాతస్స్నానము చేసిన వాఁడు.

అవటకచ్ఛపము— బావియలోని తాఁబేలువలె లోకానుభవము లేనివానిని దెల్పుట కుపయుక్తమగు పదము.

అవ(నాటుఁడు)టీటుఁడు— చప్పిడి ముక్కుకలవాఁడు.

అవడీనము — పక్షి క్రిందికిఁ బరుగెత్తు గమనవిశేషము.

అవతంసము—అలంకారార్థము చెవులకుఁ బెట్టుకొను పువ్వులసొమ్ములు.

అవతారము— దేవతలు మనుష్యులై పుట్టినప్పుడు ధరించిన రూపము.

అవతారిక— గ్రంథాదిని రచింపఁబడు తదుత్పత్తివిషయిక కవికృత ప్రస్తావము.

అవధానము— మనస్సు ఇతరవిషయముల నుండి మరలి యొక విషయమునందు నిలిచియుండుట = ఏకాగ్రత

అవధాని–1. మనోయోగము కలవాఁడు, 2. వేదము బాగుగాఁ జదివినవాఁడు.

అవధాయకుఁడు—అవధానము చేయువాఁడు, ఏకవిషయమునందే మనస్సు నిల్పువాఁడు.

అవధూనుఁడు—భార్య లేనివాఁడు.

అవధూ(త)తుఁడు—కేవల బ్రహ్మజ్ఞానపరుఁడై వర్ణాశ్రమాదులను బరిహరించిన సన్న్యాసి.

అవధూపితము— ధూపద్రవ్యములచేఁ బరిమళింపఁజేయ బడినది.

అవని—స. 1. ప్రజలను రక్షించునది, 2. రాజుచే రక్షింపఁబడునది=భూమి

అవని(నీ)ధరము, అవని(నీ)ధ్రము— భూమిని ధరించునది = పర్వతము

అవని(నీ)పతి, అవని(ని)పాలుఁడు } భూమికిఁ బ్రభువు = రాజు

అవని(నీ)రుహము— భూమియందుఁ బుట్టునది = చెట్టు.

అవనేజనము— శ్రాద్ధమునఁ బిండదానమునకై కుశలుపఱచి వానినిజలముతోఁ దడపుట యను సంస్కారము

అవపాతము—ఏనుఁగును బట్టుటకై త్రవ్వి, మీఁద తేలికైన కఱ్ఱలను, కంపలను ఒలుచగాఁ గప్పి యాపైం గొంచెము మట్టిపోసి నేలమట్టముగాఁ జేసినపల్లము.

అవబోధకుఁడు—మేలుకొలుపువాఁడు— సూర్యుఁడు, రాజులను మేలుకొలుపు స్తుతిపాఠకుఁడు, గురువు.

అవభృథము— దీక్షావ్రతమును నిర్వహింపఁజేయునది, యజ్ఞాంత మందు న్యూనాతిరిక్తదోషపరిహారార్థము చేయఁ బడు కర్మము.

అవభ్రటుఁడు— అకటీటుఁడు.

అవమము— మూఁడు తిథులు గూడిన దినము అథమము.

అవరజ— ఒకరి తరువాతఁ బుట్టినది, తోఁబుట్టువు, చెల్లెలు, శూద్రస్త్రీ.

అవరజుఁడు— వెనుకఁబుట్టినవాఁడు = తమ్ముఁడు, శూద్రుఁడు.

అవరవర్ణుఁడు— అధమమైనవర్ణము గల వాఁడు = శూద్రుఁడు.

అవరోధనము—రాజస్త్రీలున్న కారణమున నిరోధింపఁబడుభవనము = అంతఃపురము.

అవరోధికుఁడు— అంతఃపురమునందలి కావలివాఁడు = కంచుకి.

అవలేహము— నాకితినఁదగిన యౌషధాదికము = లేహ్యము మొ.

అవశకునము— ప్రయాణీకుల భావికార్యప్రాప్తికి అశుభ సూచకమైన గుఱుతు.

అవశీనము— చలి మొదలగువానిచే ముడుచుకొని పోవునది = శరీరము.

అవసరనైవేద్యము—తన కుపకారము చేయునిమిత్తము ఇతరుల కిచ్చుబహుమతి, మహానైవేద్యము సిద్ధముకాని యపుడు ముందుగ నిచ్చు గుడాదిక నైవేద్యము.

అవస్కందము— నిద్రాసమయముల యందు శత్రువులపైఁ బడుట.

అవస్కంది—పరకాంతలనుగాని, శత్రువులనుగాని హఠాత్తుగాఁ బైఁబడి చెఱచువాఁడు.

అవహిత్థ— గౌరవ కౌటిల్యాదులచేఁ జేయు హర్షాదుల మఱుఁగుపాటు.

అవాక్పుష్పి—అధోముఖములగు పుష్పములు గలది = 1. పెద్దసదాప, 2. బ్రహ్మదండి.

అవాఙ్మనసగోచరము— వాక్కునకును మనస్సునకును గోచరముకానిది, చెప్పను దలంపను శక్యముకానిది.

అవాచి—అపరాహ్ణకాలమునసూర్యుఁడు పొందు దిక్కు, దక్షిణాయనమున సూర్యుఁ డుదయించుదిశ = పడమర.

అవాచీనము— దక్షిణదిక్కునందుఁ బుట్టినది, తలక్రిందైనది.

అవారపారము—చూ. పారావారము.

అవావటుఁడు— స్త్రీకి సవర్ణుఁడగు ద్వితీయపురుషునివలనఁ బుట్టినవాఁడు.

అవాసుఁడు— వస్త్రమును ధరింపని వాఁడు = దిగంబరి.

అవిం(ద)దువు—చనిపోవుచున్న బిడ్డలు గల స్త్రీ.

అవికటోరణము—రాజానకుఁ గప్పముగా మందనుండి యీఁదగిన గొఱె.

అవిద్య—విద్యకు విరోధి = అజ్ఞానము.

అవిముక్తేశ్వరుఁడు—అవిముక్తమను కాశీక్షేత్రమందలి ప్రభువు = కాశీ విశ్వేశ్వరుఁడు.

అవియోగవ్రతము—వైధవ్యము కలుగకుండుటకై మార్గశీర్ష శుక్ల తృతీయ యందు స్త్రీలు గావించు వ్రతము.

అవివేచకుఁడు—కార్యాకార్య విమర్శన జ్ఞానము లేనివాఁడు.

అవిశ్వాస—ఈఁతకును, ఈఁతకును నడుమ విగుల ఎడము గల యావు

అవిషము—విషములేనిది = స్వర్గము, సముద్రము.

అవీచి—తరంగములు లేనిది నరకము.

అవీర—మగఁడును, బిడ్డలును లేని స్త్రీ.

అవైదికుఁడు—వేదోక్త కర్మములు చేయనివాఁడు.

అవ్యక్తము—1 స్పష్టము కానిది, 2. రూపాదులు లేకపోవుటచేఁ జక్షురాదులకు గ్రాహ్యము కానిది, జగత్కారణమగు ప్రధానము = మూలప్రకృతి, అజ్ఞానము, సూక్ష్మశరీరము, సుషుప్త్యవస్థ, నిరాకార బ్రహ్మము, పరబ్రహ్మము.

అవ్యక్తుఁడు—రూపాదులు లేకపోవుటచేఁ జక్షురాదులకు గ్రాహ్యము కానివాఁడు = విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు మూఢుఁడు.

అవ్యయుఁడు—నశింపనివాఁడు = విష్ణువు, శివుఁడు, ఋ. పరబ్రహ్మము.

అవ్యాకృతము—నామరూపములచే స్పష్టపరుపఁబడనిది వేదాంత ప్రకటము కాకుండ బీజరూపమున జగత్కారణమైయున్న అజ్ఞానము

అవ్యాప్యము—వ్యాప్తిలేనిది (నిప్పుండుచోట పొగయుండుననుట నియమము లేదు కాలిన యినపగుండునందు నిప్పున్నను పొగలేదు, కనుక నిప్పు పొగకు అవ్యాప్యము)

అవ్యాప్యవృత్తి—1 స్వాధికరణము నందు సర్వత్ర వుండనిది = ఘటాదికము (ఘటాదికము స్వాధికరణమగు గృహమున సర్వత్ర వ్యాపించి యుండదు) 2 స్వాధికరణమున నెల్లప్పుడును వ్యాపించియుండనిది = రాగద్వేషాదికము స్వాధికరణమగు హృదయమున నెల్లప్పుడున యుండదు. కనుక రాగద్వేషాదికము అవ్యాప్యవృత్తి

అవ్యుత్పన్నుఁడు—వ్యుత్పత్తి జ్ఞానము (పాండిత్యము) లేనివాఁడు

అశకుంభి—జలముమీఁదఁ బుట్టి స్వల్పకాలములోనే జలమంతయు వ్యాపించునట్టి తృణవిశేషము = కుంభిక.

అశని—స. మల్లోకములను భుజింప సమర్థమైనది = 1. వజ్రాయుధము, 2. పిడుగు.

అశబ్దవాది—అశబ్దము = ప్రధానము, ప్రధానము జగత్కారణమని వాదించువాఁడు = సాంఖ్యుఁడు.

అశరీరవాణి—శరీరరాకృతి చూపకయే ఆకాశమునఁ బుట్టెడు పలుకులధ్వని

అశిశ్వి—శిశువులులేనిది = గొడ్రాలు.

అశీతాంశుఁడు— చల్లనివి కాని కిరణములు కలవాఁడు = సూర్యుఁడు

అశీతికుఁడు— ఎనుబది యేండ్లవయసు కలవాఁడు.

అశీతిద్వయము—ఎనుబదిరెండు పన్నములు గల వేదభాగము.

అశ్రవణము—చెవులులేనిది = పాము.

అశ్వత్థము— అశ్వరూపముగు అగ్నిని ధరించియుండునది=రావి అశ్వశ్శమున కిక్కడ తేజమనియే అర్థము.

అశోకము – శోకనాశకర వృక్షము.

అశోకుఁడు— భక్తుల శోకములను నశింపఁజేయువాఁడు, విచారము లేనివాఁడు = విష్ణువు.

అశౌచసంకరము— అశౌచమధ్యమున మఱియొకయాశౌచము వచ్చుట.

అశ్మకుట్టకుఁడు—ఱాతితోఁ జూర్ణము చేసికొని యపక్వ పదార్థములను దినువాఁడు=వానప్రస్థుఁడు, ఱాలను మలచువాఁడు.

అశ్మగర్భము—ఱాయి యుత్పత్తి స్థానముగాఁ గలది = పచ్చ

అశ్మజతువు — ఱాతినుండి లక్కవలె వచ్చెడు సారము = సిలాజిత్తు.

అశ్మజము— ఱాతినుండి పుట్టినది = సిలాజిత్తు ఇనుము

అశ్మదారణము— ఱాలను జెక్కెడు సాధనము = ఉలి

అశ్మభాలము— వస్తువులను జూర్ణము చేయు లోహపాత్ర విశేషము = అమాందస్తా

అశ్మసారము—ఱాలనుండి తీయఁబడు సారము = ఇనుము సిలాజిత్తు

అశ్రీకము— సంపదను హరింపఁజేయునది.

అశ్రీకు (లు)ఁడు— సంపద శోభ లేనివాఁడు = దరిద్రుఁడు.

అశ్రుతము – వేద సమ్మతము కానిది విననిది.

అశ్లీలము—ఒప్పిదము కానిది=పామరజనవాక్కు.

అశ్వఖరజము—గుఱ్ఱమునకును గాడిదకును బుట్టినది = కంచరగాడిద.

అశ్వతీర్థము— గంగాతీరమునఁ గన్యాకుబ్జనగరప్రాంతమున నున్న తీర్థవిశేషము. (గాధి తనకుమార్తెయగు సత్యవతిని ఋచీకునకుఁ బెండ్లిచేయునపుడు ఒక చెవి నలుపున శరీరము తెలుపును గల వేయిగుఱ్ఱములను గోరెను. అవి తలఁచినపుడే వచ్చునని ఋచీకుఁడు చెప్పెను. గాధి గుఱ్ఱములను దలఁచుకొనఁగా గన్యాకుబ్జసమీపమునుండి వచ్చెను. ఆకారణమున నా ప్రదేశమున కా పేరు సార్థకమయ్యెను)

అశ్వత్థకము - అశ్వత్థవృక్షము(రావి)లు ఫలించు కాలమునఁ దీర్పఁదగిన ఋణము.

అశ్వత్థామ — జననకాలమున గుఱ్ఱమువలె ధ్వనించిన ద్రోణాచార్యుని పుత్త్రుఁడు. (వివస్త్రయై అన్నము వడ్డించుచున్న కృపిని జూచుటవలన ఈశ్వరుని వీర్యము స్ఖలనమయ్యెను. కృపి యా మహత్తరమైన వీర్యమును వ్యర్థము చేయరాదని గుఱ్ఱమునకుఁ బెట్టఁగా దానికిఁ బుట్టెనని పురాణప్రసిద్ధి.)

అశ్వ (బంధుఁడు) పాలుఁడు — గుఱ్ఱమును గాపాడెడు భృత్యుఁడు.

అశ్వబడబము — ఆఁడు, మగ గుఱ్ఱముల యొక్క సమూహము.

అశ్వమహిషిక — గుఱ్ఱమునకును, దున్నపోతునకును గల స్వాభావికవైరము.

అశ్వముఖుఁడు — గుఱ్ఱముయొక్క ముఖమువంటి ముఖము గలవాఁడు = కిన్నరుఁడు.

అశ్వమేధము - గుఱ్ఱమును బలిపశువుగాఁ జేసి సార్వభౌముఁడు చేయుయాగము.

అశ్వమేధీయము — అశ్వమేధయాగమున నుపయోగించు నియమితలక్షణములుగల గుఱ్ఱము.

అశ్వవిదుఁడు — అశ్వహృదయమను విద్య నెఱిఁగిన వాఁడు = నలసార్వభౌముఁడు.

అశ్వశాస్త్రము — అశ్వలక్షణాదికమును దెలుపు శాస్త్రము.

అశ్వసృగాలిక — గుఱ్ఱమునకును, నక్కకును గల స్వాభావికవైరము.

అశ్వస్తను(నిక)ఁడు — రేపటికిఁ గావలసిన పదార్థమును జాగ్రత్తపెట్టుకొననివాఁడు.

అశ్వహృదము — గుఱ్ఱముయొక్క మనోగత భావమును దెలుపు విద్యావిశేషము.

అశ్వి — వృషభజాతి పురుషునియం దిష్టము గల స్త్రీజాతి విశేషము, గుఱ్ఱములు కలవాఁడు.

అశ్వీకము — గుఱ్ఱములచే లాగఁబడునది = రథాదికము.

అశ్విని — 1. గుఱ్ఱపుముట్టెవంటి యాకారముగల నక్షత్రము. (దక్షుని కుమార్తెయుఁ జంద్రుని భార్యయునని పురాణప్రసిద్ధి) 2 బడబా (ఆఁడుగుఱ్ఱము) రూపమును ధరించిన సూర్యపత్నియగు సంజ్ఞాదేవి. (విశ్వకర్మ కూఁతురు)

అశ్వినులు — అశ్వరూపధారులగు సూర్యసంజ్ఞలకుఁ బుట్టినవారు = స్వర్లోకవైద్యులు.

అశ్వీనము - గుఱ్ఱముచేత నొకదినములోఁ బోఁదగిన త్రోవ.

అషడక్షీణము — ఆఱుకన్నులకు గోచరింపనిది, ఇరువురికంటె నితరులెఱుఁగని రహస్యము = 1. ఆలోచనము, 2. మంత్రము లోనగునది.

అష్టగతికుఁడు — ఎనిమిది గతి విశేషములు గలవాఁడు = రాజు (1. పన్ను

పుచ్చుకొనుట, 2. సేవకులకు వేతనాదిక మిచ్చుట, 3. ప్రత్యక్షాప్రత్యక్షకార్యములందు సమర్థులగు గూఢచారులను నియోగించుట, 4. మంత్రి మున్నగు వారిని దృష్టాదృష్టములగు దుష్టకార్యములనుండి మరలించుట, 5. సందిగ్ధ కార్యములయందుఁ దన యాజ్ఞచేఁ బ్రవర్తింపఁ జేయుట, 6. ప్రజల వ్యవహారములు జక్కఁ బెట్టుట, 7. ఓడినవారినుండి శాస్త్రోక్తమయిన ధనమును సంగ్రహించుట, 8. జనుల పాపములకుఁ బ్రాయశ్చిత్తములను విధించుట.)

అష్టపది — జయదేవకృతమయిన గీతగోవిందములోని 8 పాదములుగల గీతము.

అష్ట(పాదము)పాత్తు — 8 పాదములు గలది = శరభమృగము, సాలెపురుగు.

అష్టమంగళము — మొగము, జూక, వాలు, రొమ్ము, గొరిజలు 4. ఈయెనిమిది మాత్రము తెల్లగానుండుగుఱ్ఱము. ఎనిమిదిమంగళవస్తువుల సముదాయము. 1. సింహము, 2. ఎద్దు, 3. ఏనుఁగు, 4. కలశము, 5. వ్యజనము, 6. వైజయంతి, 7. భేరి, 8. దీపము (అని కొందరు); 1. బ్రాహ్మణుఁడు, 2. గోవు, 3. అగ్ని, 4. బంగారు, 5. నేయి, 6. ఆదిత్యుఁడు, 7. జలము, 8. రాజు.

అష్టమకాలికుఁడు — స.ఏఁడుపూఁటలు భుజింపక ఎనిమిదవపూఁట భుజించువాఁడు = ఒకవిధమగు వానప్రస్థుఁడు.

అష్టమూర్తి — పంచభూతములు (5) సూర్యచంద్రులు (2) పురుషుఁడు (1) మొత్తము 8 మూర్తులు తన స్వరూపముగాఁ గలవాఁడు = శివుఁడు.

అష్టవర్గము — పురుషుని శుభాశుభములను సూచించు గ్రహచక్రభేదము, ఎనిమిది అక్షరవర్గముల సముదాయము. (అ, క, చ, ట, త, ప, య. స.)

అష్టశ్రవసుఁడు — ఎనిమిదిచెవులు గలవాఁడు = బ్రహ్మ.

అష్టాకపాలము — ఎనిమిది మృణ్మయపాత్రలలో సంస్కరింపఁబడినది = పురోడాశాదికము.

అష్టాక్షరి — ఎనిమిది అక్షరములతోఁ (ఓమ్, న, మో, నా, రా, య, ణా, య) గూడిన యొక మంత్రరాజము.

అష్టాంగము — ఎనిమిది అంగములు గలది = 1. ప్రణామవిశేషము 2. యోగవిశేషము 3 ఆయుర్వేదము 4. సూర్యార్ఘ్యము 5. పూజావిధి 6. నెత్తపలక 7. న్యాయసభ మొ.

అష్టాగవము — ఎనిమిదియెద్లచే లాఁగఁబడునది = శకటవిశేషము.

అష్టాత్ముఁడు — చూ. అష్టమూర్తి.

అష్టాధ్యాయి — 8 అధ్యాయములుగల పాణినీయ సంస్కృతవ్యాకరణము.

అష్టాపదము — ఎనిమిది లోహములందు ఉనికిగలది = బంగారము, ప్రతిపంక్తియందును ఎనిమిదేసి పంక్తులు గలది, నెత్తపలక.

అష్టావక్రుఁడు — తల్లిగర్భమునసుండియు వేదాధ్యయన సందర్భమున వక్రముగాఁ బలుకుటచే జనకునిచే శపింపఁ

బడి ఎనిమిదివంకరలుగల శరీరముతోఁ బుట్టినవాఁడు = ఉద్దాలకశిష్యుఁడగు ఏకపాదుని కొడుకు

అష్టావధానము—ఎనిమిది భిన్నాభిప్రాయముల నొక్కకాలమున వెలిబుచ్చు మేధాశక్తి.

అష్టావధాని—ఏకకాలమున 8 అంశములయందు మనస్సు నిలుపఁ గలవాఁడు

అసంస్కృతము—వ్యాకరణాదులచే సంస్కరింపఁబడనిది=అపశబ్దము

అసంబద్ధప్రలాపము—పరస్పరాన్వయశూన్యమైన అప్రస్తుత ప్రస్తావము.

అసత్ఖ్యాతి—1 మిథ్యాజ్ఞానము (ముత్యపుఁ జిప్పయందు రజతభ్రాంతి బ్రహ్మమందు జగద్భ్రాంతి) 2. అపకీర్తి

అసదధ్యేత—స్వశాఖను బరిత్యజించి యన్యశాఖ వేదమును అధ్యయనము చేయువాఁడు

అసద్ధేతువు—తర్కవ్యభిచారాదిదోషయుక్తమగు హేతువు = హేత్వాభాసము.

అసమనయనుఁడు—(అసమనేత్రుఁడు) అసమాక్షుఁడు=సరికాని (బేసి ౩) నేత్రములు కలవాఁడు = శివుఁడు

అసమర్థసమాసము—పరస్పరాన్వయములేని పదముల సమాసము.

అసమవాయికారణము—సమవాయికారణమునకు సన్నిహితమగు కారణము, తంతుసంయోగము పటమునకును తంతురూపము పటరూపమునకును అసమవాయికారణములు.

అసమశరుఁడు—చూ అయుగశరుఁడు.

అసమీక్ష్యకారి—గుణదోష విచారము గావింపక యేకార్యమునైనను జేయువాఁడు.

అసమేషువు—చూ. అయుగశరుఁడు

అసలుఁబుట్టువు—చూ అంబుజము

అసహాయశూరుఁడు—సహాయము లేకయే యుద్ధరంగమున నైపుణ్యము చూపు యోధుఁడు.

అసిక్ని—అంతఃపురమునఁ బని చేయునది.

అసితము—తెల్లపుకానిది = నలుపు

అసితాంగము—నల్లనిదేహముకలది = ఖడ్గము.

అసితాననము—నల్లనిముఖముకలది = కొండముచ్చు.

అసితార్చి—నల్లనిపొగతోఁ గూడిన జ్వాలకలవాఁడు = అగ్ని.

అసితుఁడు—నల్లనివాఁడు = 1. శని 2. శ్రీకృష్ణుఁడు 3 దేవలుఁడను ముని.

అసిదంష్ట్రము—కత్తులవంటి కోఱలు కలది = మొసలి.

అసిధారావ్రతము—కత్తియంచుపైఁ గాలు తెగకుండ నిలుచుట వలె విశేష కఠినియమములుగల వ్రతము, సౌందర్యవతియు యౌవనవతియునగు స్త్రీతో నొకశయ్యపై శయనించి

యాఁ మెయందు మనసైనఁ జొరనీయకుండుట (అసిధారము).

అసిధా(వు)వకుఁడు— కత్తులకుఁ బదును పెట్టువాఁడు.

అసి(పుత్రిక)ధేనుక— ఖడ్గమునకుఁ బిల్లవంటిది = చూరకత్తి.

అసిపత్రము— కత్తులవంటి ఆకులుగలది = చెఱకు.

అసిపత్రవనము— కత్తులవంటి చెట్ల యాకులుగల వనము = నరకవిశేషము.

అసిమిగొల్లెన— గోనెలతో వేసిన చిన్నగుడారము.

అసుతీబలుఁడు— శూద్రజాతి విశేషమునఁ బుట్టిన కన్యపాలుఁ డను వాఁడు.

అసుతీవలుఁడు— క్షత్రియస్త్రీయందు శూద్రునకుఁ బుట్టిన 5 విధముల సారాయి నమ్మువాఁడు.

అసుర— చూ. అసురుఁడు.

అసురాచార్యుఁడు— రాక్షసుల గురువు = శుక్రాచార్యుఁడు.

అసు(ర)రుఁడు— అమృతము లేనివాఁడు = రాక్షసుఁడు.

అసుస్థిరాదరుఁడు— స్వప్రాణరక్షణమున నిరంతరాదరణము కలవాఁడు.

అసూయ— గుణములయందు దోషారోపణము చేయుట=ఓర్వలేనితనము, తన విరోధికి చెఱుపు చేయవలెనని కోరుట.

అసూర్యంపశ్య— సూర్యుని గాని, యెండనుగాని చూడనిది = 1. రాజు భార్య, 2. అంతఃపుర స్త్రీ.

అసృగ్ధరము— స్త్రీలకుఁగల్గు కుసుమ రోగవిశేషము.

అసృగ్ధర— నెత్తుటిని ధరించునది = చర్మము.

అసేచనకము— చాలసేపు చూచినను మనస్సునకు సంతృప్తి గలుగనిది = అతిసుందరము.

అసోమ—చంద్రుఁడు లేనిరాత్రి.

అస్ఖలితబ్రహ్మచారి— వంజ్రతాడులోనగువానిని ధరించి వేదాధ్యయనము చేయుచు, స్త్రీలవిషయమై యెప్పుడును దొట్రుపాటు పడని పడుచువాఁడు.

అస్తాచలము— సూర్యుఁ డస్తమించెడు పడమటికొండ.

అస్తికాయము—జీవుఁడు, పుద్గలము, ధర్మము, అధర్మము, ఆకాశము- వీనితోఁ గూడినది.

అస్తుంకారము— అస్తు (ఔఁగాక, కానిమ్ము) అని పలుకునది = అంగీకారము.

అస్థిధన్వుఁడు — ఎముకయే ధనుస్సుగా గలవాఁడు = శివుఁడు.

అస్థిభక్షము— ఎముకలను గొఱుకునది = కుక్క.

అస్థిమాలి—(అస్థిహారుఁడు) ఎముకల

మాలలను (కపాలములు) ధరించినవాఁడు = శివుఁడు.

అస్థివిగ్రహుఁడు— మిక్కిలి చిక్కిన శరీరముగలవాఁడు = భృంగి.

అస్థిశృంఖల— విఱిగిన ఎముకలను గూర్చునది = నల్లేరు.

అస్థిసంచయము—చచ్చిన వెనుక మంచిదినముచూచి ఎముకలు ప్రోగు చేయు కర్మము = సంచయనము.

అస్త్రకంటకము— ముల్లువలె నుండు నస్త్రము = బాణము.

అస్త్రజీ(వుఁడు)వి—అస్త్రాదులచే జీవించువాఁడు, పెక్కువిలుకాండ్రతోఁ బోరెఁడు యోధుఁడు.

అస్త్రము—మంత్రముచేఁ బ్రయోగింపఁ బడునది.

అస్త్రవిద్య— అస్త్రప్రయోగోపసంహారములను దెలిపెడి శాస్త్రము.

అస్పృష్టి— ముట్టరాని మృతాశౌచము = మైల.

అస్రప—రక్తమును ద్రాగునది=1. జలగ, 2. పిశాచి, 3. నల్లి.

అస్రపుఁడు—రక్తపానము చేయువాఁడు = నిర్బతి, రక్కసుఁడు.

అస్వప్నుఁడు— నిద్రలేమిచే స్వప్నములు లేనివాఁడు = వేలుపు.

అస్వరము—1. చెవి కింపుగాని (మెల్లని) స్వరముగలది, 2. స్వరము (అచ్చు) కానిది = హల్లు.

అస్వరుఁడు—చెవి కింపుగాని స్వరము కలవాఁడు.

అస్వాధ్యాయుఁడు—వేదాధ్యయనము చేయని బ్రాహ్మణుఁడు.

అహంకారము, అహంకృతి,

అహంక్రియ—1. నేను నాది యనెడు దురభిమానము, 2. మహత్తత్త్వమువలన బుట్టి, పంచతన్మాత్రలకుఁ గారణమయిన తత్త్వభేదము=క్రోధము.

అహం (ప్రథమిక) పూర్విక— యుద్ధాదులందు నేనుముందు నేనుముందని యొకరొకరి మీఱుట. దీనినే అహమహమిక అని యందురు.

అహంవాది—(అహంయువు) తన్ను గూర్చి తాను హెచ్చుగా చెప్పుకొను వాఁడు=గర్వి.

అహఃకరుఁడు—పగటిని కలుగఁజేయు వాఁడు=సూర్యుఁడు.

అహమగ్రిక—నేనుముందని యాధిక్యమునకయి కలహించుట.

అహమహమిక—యుద్ధాదులందు నేనుముందు నేనుముందని పరస్పరము రోషమునఁ బలుకుట. యుద్ధాదులందు జూపు అహంకారము.

అహర్దానము— మరణించిన వారికై చేయఁబడు పిండజలాది దానము.

అహ(ఃపతి)స్పతి(ర్నాథుఁడు)—పగటికిఁ బ్రభువు=సూర్యుఁడు.

అహార్బాంధవుఁడు— ప్రభువగుటచేఁ బగటికిని, పగటియందు జనులకును బంధువైనవాఁడు = సూర్యుఁడు.

అహర్మణి—పగటియందు మణివలెఁ బ్రకాశించువాఁడు = సూర్యుఁడు.

అహర్ముఖము—పగటిలో మొదటి భాగము = ప్రాతఃకాలము.

అహల్యాజారుఁడు— అహల్యకు విటుఁడైనవాఁడు = ఇంద్రుఁడు.

అహల్యానందనుఁడు— కుమారుఁడగుటచే అహల్యను సంతోషపెట్టినవాఁడు = శతానందుఁడు.

అహస్కరుఁడు—పగలు గలుగఁజేయువాఁడు = సూర్యుఁడు.

అహింస— సమస్తప్రాణికోటియందును మనోవాక్కాయ కర్మములచే దృష్టినిలిపి బాధింపకుండుట.

అహిద్విషము—పాములకు శత్రువు= గరుత్మంతుఁడు, నెమలి, ముంగిస.

అహిద్విషుఁడు—నాగులకుశత్రువు = 1. గరుత్మంతుఁడు, 2. ఇంద్రుఁడు.

అహినకులము — పాములయొక్కయు, ముంగిసలయొక్కయు సమూహము.

అహినకులిక—సర్పమునకును, ముంగిసకును గల స్వాభావికవైరము.

అహిపతి— సర్పములకుఁ బ్రభువు = ఆదిశేషువు.

అహిఫేనము— పాముగరళమువలెఁ దీక్ష్ణమైనది = నల్లమందు.

అహిభయము— రాజులకుఁ బుత్త్రిదాయాద ప్రభృతి స్వపక్ష జనకృతమయిన భయము.

అహిభుక్కు—పాములను భుజించు (నది) వాఁడు = 1. గరుత్మంతుఁడు, 2. నెమలి, 3. ముంగిస.

అహి(ర్బుధ్న్యుఁడు) భూషణుఁడు— సర్పములను అలంకారములుగాఁ గలవాఁడు = శివుఁడు.

అహిభృత్తు—సర్పములను అలంకారములుగా ధరించువాఁడు = శివుఁడు.

అహిమన్యువు — పాముపగ, పాముపగవంటి పగ గలవాఁడు.

అహిమాంశువు-వేఁడియైన కిరణములు గలవాఁడు = సూర్యుఁడు.

అహిమార (కము) కుఁడు, అహీమేద(కము)కుఁడు— పాములను జంపు (నది) వాఁడు = 1. ముంగిస, 2.నెమలి, 3 గరుత్మంతుఁడు, వృత్రాసురుని జంపినవాఁడు = ఇంద్రుఁడు.

అహిరిపువు—సర్పమునకు శత్రువైన (ది)వాఁడు=గరుడుఁడు, ఇంద్రుఁడు, కృష్ణుఁడు. (ముంగిస, నెమలి.)

అహిరూపభృత్తు— సర్పాకారమును ధరించునది = పాము కుబుసము.

అహిహ—పామును జంపినవాఁడు = ఇంద్రుఁడు, శత్రువునుగొట్టినవాఁడు.

అహీంద్రుఁడు—సర్పములకుఁ బ్రభువు = శేషుఁడు.

అహీరణి—రెండుతలల పాము.

అహోపురుషిక—గర్వముచేఁ గలిగెడి యాత్మగౌరవము.

అహోరాత్రము—అఱువది గడియల ప్రమాణముగల యొక రాత్రియుఁ బగలు, 30 ముహూర్తములకాలము

అళీసుహృత్తు—తుమ్మెదలకుఁ జెలికత్తె యైనది = మల్లె.

ఆంకుశికుఁడు అంకుశము ఆయుధముగాఁ గలవాఁడు = మావటీఁడు.

ఆంగికము—అవయవములచే జరుపఁబడినది, భ్రూవిక్షేపాద్యభినయ విశేషము, స్త్రీల హావభావాదికము.

ఆంగి(గీ)రసుఁడు—అంగి (గీ) రసుని కుమారుఁడు = బృహస్పతి.

ఆంజనేయుఁడు—శివతేజమును గ్రహించిన వాయుదేవునివలన నంజనకుఁ బుట్టినవాఁడు = హనుమంతుఁడు.

ఆంతరాలుఁడు--జీవుఁడు అణురూపుఁడయి శరీరములోనే యుండును అతఁడు విభుఁడు కాఁడని తలఁచువాఁడు = మాధ్వమతస్థుఁడు.

ఆంబికేయుఁడు—1. అంబికాదేవి (పార్వతి) యొక్క పుత్రుఁడు = కుమారస్వామి, విఘ్నేశ్వరుఁడు, 2. అంబికాపుత్రుఁడు=ధృతరాష్ట్రుఁడు.

ఆంభసికము – అంభస్సుచే (నీటిబలముచే) సంచరించునది=చేప మొ.

ఆఁబడ్డ—పాలు విడిచిన ఆవుపెయ్య.

ఆఁబోతుర(రా)వుతు—ఆఁబోతు నెక్కువాఁడు = శివుఁడు.

ఆకల్పస్థాయి—కల్పాంతము (ప్రపంచ నాశము) వఱకు నుండునది.

ఆకష(షి)కుఁడు—ఒరగంటి మీఁద రాచి బంగారు మొదలగువాని వన్నె పరీక్షించుటయందుఁ గుశలుఁడు.

ఆకాంక్ష—అన్వయమునకై యొకపదము మఱియొక పదమును గోరుట. (క్రియనుబట్టి కర్త్రకర్మాదులనువిశేష్యములనుబట్టి విశేషములను దెలిసికొనుటకై చేసెడు ప్రశ్నము.)

ఆకాలికి—పుట్టిన వెంటనే నాశనము నొందునది = మెఱపు.

ఆకాశకక్ష—ఆకాశము భూమియు నంటినట్లు చుట్టును గనఁబడు ప్రదేశము = దిక్చక్రము.

ఆకాశగంగ—ఆకాశమునం దుండెడి గంగానది = మందాకిని

ఆకాశదీపము—తులారాశియందు రవి యుండఁగా నొకమాసకాలము సాయంకాలమున నెత్తయినచోటఁ బెట్టుదీపము = కార్తీక దీపము.

ఆకాశపంచాంగము—పుర్వాపర సందర్భశూన్యమై కుకవిచే వ్రాయఁబడిన చరిత్రాదికము.

ఆకాశపుష్పము—ఆకాశమునఁ బుష్పమువలె నసంభవమైనది.

ఆకాశభాషితము—1. నాటకరంగమునఁ బాత్రాంతరము లేకున్నను ఉన్నట్లు నటించుచు సంభాషించుట 2 ఆకాశమునందుండి యదృశ్యులగు దేవాగులవలనఁబుట్టినమాట = ఆకాశవాణి

ఆకాశవాణి— ఆకసమునుండి పుట్టినట్లు వినఁబడునట్టి యదృశ్యదేవాదుల వాక్కు = అశరీరవాక్కు

ఆకాశము—సూర్యాది గ్రహములచే నంతటను బ్రకాశించునది.

ఆకేకరము—కొంచెము ఓరఁగా జూచునది = కన్ను

ఆక్రందితుఁడు— దుఃఖితులగు వారి యేడ్పు విని, యాచోటికిఁ బరుగునఁ బోవువాఁడు = ఆక్రందకుఁడు.

ఆక్షద్యూతికము—జూదము వలనఁ గలిగినది = వైరము.

ఆఖండలుఁడు— పర్వతములను భేదించినవాఁడు = శత్రువులను ఖండించువాఁడు.

ఆఖుభుక్కు— ఎలుకలను భక్షించునది = పిల్లి పాము మొ

ఆఖువాహనుఁడు—ఎలుక వాహనముగాఁగలవాఁడు = విఘ్నేశ్వరుఁడు.

ఆఖువిషహా— మూషిక విషమును హరించునది = దేవతావృక్షము.

ఆఖ్యానము—భారతము మొదలగు ఆర్షమహాకావ్యముల నడుమ వచ్చెడి కథా విశేషము.

ఆఖ్యాయ(యి)కుఁడు— ఒకరుచెప్పిన దానిని మఱియొకరికిఁ బోయి చెప్పు వాఁడు = దూత కథకుఁడు.

ఆఖ్యాయిక— వాస్తవముగ జరిగిన కథనుజెప్పెడి హర్షచరితాదిగ్రంథము

ఆగంతుకము— కాల నియమములేక వచ్చునది. ఒక కవి రచించిన ప్రబంధాదులలో మఱియొకరిచే నడుమఁ జొప్పింపఁబడినది = ప్రక్షిప్తము

ఆగడపలు— దొంతిగా నేర్పడిన మేఘపంక్తి

ఆగమము— వ్యాకరణమున (మిత్రుని వలె) నధికముగావచ్చి చేరెడు వర్ణము (మిత్రవదాగమః)

ఆగవీనుఁడు—గోవులను దోలుకొని పోయి తిరిగి సాయంకాలమున నప్పగించు వరకును మేపి, వానిని గాఁచెడి గొల్లవాఁడు.

ఆగా(యి)త్యము— కొంచెమును గొప్పగాఁ జేసి, కావించెడు అలుపు ఏడ్పు లోనగునది.

ఆగామి—జీవుఁడు తాను ధరించియుండెడు శరీరము ద్వారా మరణకాల పర్యంతము చేసిన పుణ్యపాప కర్మముల సమూహము శరీరము విడిచినతోడనే యితఁడు ఆర్జించిన పుణ్యపాపకర్మములు వెనుకటి జన్మమునందు అనుభవింపఁగా మిగిలినవానితోఁ గలియును.

ఆగ్నేయము—అగ్నికి సంబంధించినది బంగారు నేయి, భస్మస్నానము.

ఆగ్నేయస్నానము—శరీరమునం దంతటను విభూతిని బూసికొనుట.

ఆగ్నేయుఁడు— శివునితేజమును ధరించిన యగ్నికి షట్కృత్తికలరూపమును ధరించిన స్వాహాదేవియందుఁ గలిగినవాఁడు = కుమారస్వామి.

ఆగ్రభోజనికుఁడు— భోజనకాలమున పంక్తి మొదటఁ గూర్చుండుటకు నధికారముగల బ్రాహ్మణుఁడు.

ఆగ్రహాయణికము—మార్గశీర్ష పూర్ణిమనాఁడు చెల్లింపఁదగిన ఋణము.

ఆగ్రహారికుఁడు— బ్రాహ్మణ పోషణార్థ మియ్యఁబడిన యగ్రహారము ననుభవించువాఁడు.

ఆఘారము— అగ్ని సంస్కారార్థము నేయి పోయుచుఁ జేసెడిహోమము = నేయి.

ఆఘార్షణి— ధూపనాదికమును రాచి శుభ్రము చేయుటకుపయోగించునది = కుంచె

ఆచమనము—ఉదకము దనియందుఁ బానము చేయఁబడును.

ఆచయకుఁడు—పుష్పాదికమును ప్రోగు చేయుటయందు నేర్పరి

ఆచారదీపము— రాజులకుఁ గాని, అశ్వాదులకుఁ గాని, మంగళార్థము నివాళిపట్టెడు దీపము.

ఆచారలాజలు—రాజాదు లూరేగునపుడు మంగళార్థము కన్యకలు వారిపైఁ జల్లు లాజలు.

ఆచారవేది— 1. ఆచారము తెలిసినవాఁడు, 2. ఆచారమునకు వేదికవంటిది = ఆర్యావర్తము.

ఆచార్య—వేదమునకు వ్యాఖ్యానము చేయు స్త్రీ, తానే మంత్రోపదేశము చేయు స్త్రీ

ఆచార్యభోగీనము— ఆచార్యుఁడనుభవింపఁదగిన ద్రవ్యాదికము

ఆచార్యాని—ఆచార్యుని భార్య.

ఆచార్యుఁడు—వేద వ్యాఖ్యానము చేయువాఁడు.

ఆచ్ఛోదనము—మృగములు తఱుమఁబడుటకు సాధనమయినది = వేఁట.

ఆజన్మసురభిపత్త్రము— పుట్టినది మొదలు పరిమళించెడి ఆకుగలది = మరువము.

ఆజ్ఞాచక్రము—కనుబొమల నడుమనుండు చక్రవిశేషము.

ఆజ్యము—అన్నాదులయందుఁ బోయఁదగినది = నేయి

ఆజ్యావేక్షణము- పీడా పరిహారార్థము నేయిలోఁగాని, నూనెలోఁగాని ముఖమును చూచుట.

ఆటతిప్ప —క్రీడార్థ మేర్పరచిన కొండ = కృతకాద్రి.

ఆటవికుఁడు—అడవిలో నివసించువాఁడు.

ఆటవిడుపు—ఆడుకొనుటకై విద్యార్థులను వదలిపెట్టుట.

ఆటీకనము— లేఁగదూడలు దుముకు నప్పటి గమనము.

ఆఢ(కిక)(కీన)ము—తూమెడు విత్తులు చల్లదగిన నేల, 4 కుంచములబియ్యము ఉడుకు పాత్రవిశేషము, 4 కుంచముల బియ్యము పట్టెడు గంప మొదలగునవి.

ఆతతాయి— చంప నుద్యోగించిన వాఁడు = దుర్మార్గుఁడు

ఆతపత్త్రము—ఆతపము (ఎండ) నుండి రక్షించునది = గొడుగు.

ఆతపవారణము—ఎండ సోఁకకుండు నట్లు వారించునది=గొడుగు.

ఆతి(థేయ)థ్యము—అతిథికిఁ జేయఁ దగిన భోజనాదిసత్కారము.

ఆతిథేయుఁడు—అతిథి సత్కారము చేయువాఁడు.

ఆతివాహికుఁడు— మరణానంతరమున నతివాహమునందు (ఇహలోకమునుండి పరలోకమునకు గొనిపోవుట యందు) నియోగింపఁబడిన వేలుపు.

ఆతురసన్న్యాసము— రోగాదులచే జీవితమునందు విరక్తిగలిగి స్వీకరించు సన్న్యాసము.

ఆతోద్యము— (వాదిత్రము) తతము, ఆనద్ధము-సుషిరము - ఘనము అనెడి వాయిద్యచతుష్టయము.

ఆత్తగంధుఁడు— గర్వభంగము చేయఁబడినవాఁడు.

ఆత్మంభరి— (ఆత్మగ్రాహి, ఉదరంభరి) దేవతలు, అతిథులు మున్నగు వారికిఁ బెట్టక తనపొట్టనుమాత్రమే పోషించుకొనువాఁడు.

ఆత్మగతము—ఇతర పాత్రము వినకుండునట్లు తనలో దాననుకొను మాట.

ఆత్మగుప్త—పరులనుండి తన్ను గాపాడుకొనునది=దూలగొండి.

ఆత్మఘాత(తు)కుఁడు— తనకుఁదానే ఘాతచేసికొని యాత్మహత్యచేసికొను వాఁడు.

ఆత్మఘోషము—కాకాయనికూయుచు, దన నామమును దెలుపునది = కాకము, కుక్కుటము = కోఁడి.

ఆత్మజ—తన వలనఁ బుట్టినది= కూఁతురు.

ఆత్మజాతుఁడు—మన్మథుఁడు (చూ. ఆత్మజుఁడు).

ఆత్మ(జన్మ)జుఁడు—తన వలనఁ బుట్టువాఁడు(తానే పుత్త్రరూపముగా జనించువాఁడు)=కొడుకు.

ఆత్మజ్ఞుఁడు—ఆత్మజ్ఞానము కలవాఁడు.

ఆత్మతత్త్వము—ఆత్మయొక్క యథార్థ స్వరూపము.

ఆత్మదర్శనము— 1. ఆత్మ సాక్షాత్కార సాధనమైన శ్రవణమనన నిధిధ్యాసనాదికము, 2. ఆత్మసాక్షాత్కారము, 3. సర్వభూతములు తానేయని యెఱుఁగుట.

ఆత్మదర్శనము—శరీరమును జూపునది=అద్దము.

ఆత్మదానము— తన్నుఁ దా నిచ్చుకొనుట-(ఆత్మనివేదనము, స్వార్థత్యాగము=ఆత్మసమర్పణము.)

ఆత్మనిష్ఠుఁడు—ఆత్మజ్ఞానమునుమాత్రమన్వేషించు బ్రహ్మనిష్ఠుఁడు=ముముక్షువు.

ఆత్మభువు— హృదయమునఁ బుట్టువాఁడు = మన్మథుఁడు.

ఆత్మభూతుఁడు—ఆత్మసంభవుఁడు.

ఆత్మవశ్యుఁడు—తన మనస్సును వశముచేసికొన్నవాఁడు, తనకు వశమయినవాఁడు.

ఆత్మసంభవ— చూ. ఆత్మజ.

ఆత్మ (భూతుఁడు) సంభవుఁడు— 1. తన శరీరమునఁ బుట్టినవాఁడు = కొడుకు, 2. మనస్సునందుఁ బుట్టినవాఁడు=మన్మథుఁడు, 3. తనంతఁద నే పుట్టినవాఁడు = బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, పరమాత్మ.

ఆత్మహత్య— తన్నుఁ దాను జంపుకొనుట.

ఆత్మాపహారకుఁడు— తన యథార్థస్వరూపమును దాఁచువాఁడు.

ఆత్మా(అభ్యంతరా)రాముఁడు— ఆత్మయందుమాత్రమే రమించుచుఁ దృప్తుఁడయి యుండువాఁడు=యోగి.

ఆత్మాశి— తనజాతివానిని భక్షించునది = చేప పాము మొ.

ఆత్మోపజీవి—స్వకాయకష్టము చే జీవించువాఁడు.

ఆత్మోపముఁడు— రూపాదికమునందు తనతోడి సామ్యమును బొందువాఁడు = పుత్రుఁడు.

ఆత్రేయి—ఆత్రిగోత్రునకలెఁ బొందరానిది=బహిష్ఠయైనది.

ఆత్రేయుఁడు—అత్రిమహాముని యొక్క కుమారుఁడు = 1. దూర్వాసుఁడు, 2. దత్తాత్రేయుఁడు, 3. చంద్రుఁడు.

ఆదర్శము— దీనియందుఁ దననీడ కనఁబడును = అద్దము.

ఆదిత్యహృదయము— స. సూర్యపరమైనట్టియు, విష్ణుపరమైనట్టియు, రామాయణాంతర్గత స్తోత్రము.

ఆదికావ్యము— దీనికిఁ బూర్వమున కావ్యములు లేవో అది = వాల్మీకి రచితమగు శ్రీమద్రామాయణము.

ఆదితేయుఁడు— అదితికిఁ గశ్యపుని వలనఁ బుట్టినవాఁడు = వేలుపు.

ఆదిత్యవారము—సూర్యదేవతాక మగు వారము.

ఆదిత్యుఁడు—అదితికిఁ గశ్యపునివలనఁ బుట్టినవాఁడు = సూర్యుఁడు, వేల్పు, ఆదిత్య మండలాంతర్గతుఁడును హిరణ్యవర్ణుఁడు నగు విష్ణువు.

ఆదిత్యులు— అదితికిఁ గశ్యపునివలనఁ గల్గిన సంతానము = దేవతలు.

ఆదిభిక్షుకుఁడు— మొట్టమొదట భిక్ష మెత్తినవాఁడు = శివుఁడు.

ఆదివరాహము— మొదట వరాహావతారమును (పందిరూపమును) ధరించినవాఁడు = శ్రీవిష్ణువు.

ఆదివారము—ఏఁడు వారములలో మొదటిది = భానువారము.

ఆదివిద్వాంసుఁడు— మొదటి విద్వాంసుఁడు = కపిలమహర్షి.

ఆదిశక్తి— మొదటి శక్తిస్వరూపము = పరమేశ్వరుని మాయాశక్తి, దుర్గ.

ఆదీపకుఁడు—1. ఇండ్లకు నిప్పు పెట్టువాఁడు, 2. పురికొలుపువాఁడు.

ఆదేశము— 1. వ్యాకరణమున నొకవర్ణమును ద్రోసి యాస్థానమున శత్రువువలె వచ్చునట్టి మఱియొకవర్ణము = సాన్నాక్రమణము, జ్యోతిషశాస్త్రవేత్తలు మొదలగువారు చెప్పెడి శుభాశుభ ఫలము, 2. ఆజ్ఞ. (ప్రభువు మొదలయినవారిది.)

ఆదేష్ట—ఆదేశించువాఁడు, ఋత్విక్కులను నియమించువాఁడు, యజ్ఞము చేయించువాఁడు = యజమానుఁడు.

ఆద్యంతరహితుఁడు— మొదలును జివరయు లేనివాఁడు = భగవంతుఁడు, పరమాత్మ.

ఆధ్యూనుఁడు— తిండిమీఁదనే దృష్టి కలవాఁడు, ఒకరిచేతి యన్నము వకయి కనిపెట్టుకొని యుండువాఁడు.

ఆథర్వణము— అథర్వణవేదసంబంధమైనది. 1. అథర్వసమూహము, 2. అథర్వవేదవిహితమగు అభిచారాది కర్మము.

ఆధానము—సంస్కారపూర్వకముగా హవ్యాదికమును స్థాపించుట.

ఆధారశక్తి— సర్వాధారశక్తిరూపమైన పరమేశ్వరశక్తి = మాయ, తంత్ర మూలాధారమందలి కుండలిని యను పరదేవత.

ఆధారాధేయభావము— ఆధారమనునది, ఆధేయమనునది గల సంబంధము. (ఘృతము, పాత్ర మొదలగువానికిఁగల పరస్పర సంబంధము.)

ఆధికరణికుఁడు— న్యాయ విచారణ స్థానమునందు వినియోగింపఁ బడినవాఁడు=న్యాయాధికారి.

ఆధిదైవికము— అగ్ని, వాయువు, మొదలగు దేవతలవలనఁ గలుగు దుఃఖభేదము=తాపత్రయములలో నొకటి.

ఆధిభౌతికము— పృథివ్యాది పంచభూతములవలనఁ గలిగిన సుఖదుఃఖాదికము.

ఆధివేదనికము— రెండవపెండ్లి చేసికొనువాఁడు మొదటి పెండ్లామున కిచ్చిన ధనాదికము.

ఆధిస్తేనుఁడు— తాకట్టుసొమ్మును తాకట్టుపెట్టినవాని యనుజ్ఞలేక యుపయోగించుకొనువాఁడు.

ఆధోరణుఁడు— ఏనుఁగును నేర్పుగా నడపువాఁడు = మావటీఁడు.

ఆధ్యాత్మికము— మనశ్శరీరాదుల కలనఁ గలిగిన శోక మోహ జ్వరాది దుఃఖము.

ఆనందన (పృచ్ఛన)ము— బంధువులు లోనగువారిని ఆలింగనాదికముచేతను, కుశల ప్రశ్నాదికము చేతను సంతోషపెట్టుట.

ఆనందభుజుఁడు— ఆనందము ననుభవించుచున్నవాఁడు= సుషుప్త్యవస్థలో నున్న జీవుఁడు.

ఆనకదుందుభి—జననకాలమున దేవతాకృతములగు నానక ధ్వనియుఁ గలవాఁడు = వసుదేవుఁడు. (ఆనకము = తప్పెట లేక మద్దెల, దుందుభి = భేరి)

ఆనద్ధము—మద్దెల మొదలగు చర్మ వాద్యము.

ఆనాయ్యము— గార్హపత్యము నుండి తీసికొనిరాఁబడిన దక్షిణాగ్ని.

ఆనిలి— వాయుదేవుని కుమారుఁడు = హనుమంతుఁడు, భీముఁడు.

ఆనూపము—చెమ్మనేల నందునది = ఎనబోతు మొ.

ఆపగ—ఉదక సమూహముచేఁ బోవు నది = నది.

ఆపగేయుఁడు— శంతనుని వలన గంగకు బుట్టినవాఁడు = భీష్ముఁడు.

ఆపన్నసత్త్వ—గ్రహింపఁబడిన గర్భము గలది = చూలాలు.

ఆపమిత్యకము—ఒక వస్తువునకు బదులుగాఁ దీసికొన్న మఱియొక వస్తువు.

ఆపాంగ్యము— కడకన్నులకుఁ బెట్టఁ దగినది = కాటుక.

ఆపానము—అనేకులు కూడి మద్య పానము చేయుచోటు.

ఆపోశ (స) (సా)నము— భోజన సమయమున నాద్యంతములయందుఁ బుడిసిలిలో నింపఁబడిన మంత్రపూర్వక జలమును గ్రహించుట.

ఆప్రచ్ఛనము— గమనాగమనముల యందు బంధుమిత్రాదులను కుశల ప్రశ్నాదికముచే సంతసింపఁజేయుట.

ఆప్లవవ్రతి-వేదాధ్యయనముచేసి సమావర్తనస్నాన మాచరించి దార పరిగ్రహార్థము వ్రతవిశేషము నాచరించు ద్విజుఁడు = స్నాతకుఁడు.

ఆభీరుఁడు—పిఱికివాఁడు-గొల్ల.

ఆమలకము— ఆరోగ్యము నిచ్చు గుణము గలది = ఉసిరికాయ.

ఆప్లుతుఁడు—చూడు. ఆప్లవవ్రతి.

ఆబాలగోపాలము— పిల్లవాఁడు మొదలు గొల్లవాఁడు వఱకుగల జన సమూహము.

ఆబ్దికము— ప్రతిసంవత్సరము నీయఁబడు శ్రాద్ధవిశేషము = తద్దినము.

ఆభరణము— అంతటను శోభకొఱకు ధరింపఁబడునది = సొమ్ము.

ఆభాస— లేనిది యున్నట్లు తోఁచుట.

ఆభి(చారిక)చరణికము—శత్రుమారణ వశీకరణాది ప్రయోగములకు సాధనమైన మంత్రాదికము.

ఆభిజాత్యము—సద్వంశమునఁ బుట్టుట౹ పాండిత్యము సౌందర్యము.

ఆభిధానికుఁడు— నిఘంటువు వ్రాసినవాఁడు.

ఆభీరి—గొల్లవానిభార్య గొల్లజాతిస్త్రీ

ఆభ్యాదాయికము— పితృ మాతృ కులాదులనుండి లబ్ధమగు స్త్రీధన విశేషము

ఆమంత్రణము— చూ ఆనందనము. నానా, పిలుపు, అభినందనము, కామచారానుజ్ఞ, సంభాషణము.

ఆమనిచెలి— వసంతునకుఁ జెలికాఁడు = మన్మథుఁడు.

ఆమరసము— రక్తముగా మాఱుటకుఁ బూర్వస్థితిలోనుండెడు అన్నరసము

ఆమవాతము— అజీర్ణమువలని వాయువుచేఁ ద్రేగులు పొందెడి మాంద్యము= మలబద్ధము.

ఆమశ్రాద్ధము—బియ్యము మొ॥ నపక్వ పదార్థములతోఁ బెట్టెడు శ్రాద్ధము.

ఆమాశయము—స. అపక్వాన్నముండెడు కోశము = కడుపులోబొడ్డునకు పైభాగము.

ఆమిషప్రియము—మాంసమునం దిష్టము కలది = రాపులుఁగు

ఆముక్తమాల్యద—తనచే ధరింపఁబడిన మాల్యము శ్రీరంగస్వామికి నిచ్చినది = గోదాదేవి.

ఆముష్మికము } పరలోకమునఁగలుగునది.
ఆముత్రికము }

ఆముష్యకులిత— సద్వంశమునఁ బుట్టుట.

ఆముష్యాయణుఁడు— ప్రసిద్ధవంశము గల తండ్రికలనఁ బుటినవాఁడు.

ఆమోదము—1. దూరముగావ్యాపించెడి పరిమళము, 2. సంతోషము.

ఆమ్నాయము—గురుశిష్య పరంపరగా నభ్యసింపఁబడునది = వేదము

ఆమ్రపేశి— ఎండఁబెట్టిన మామిడిపండు ముక్క = మామిడిచిన్న.

ఆమ్రేడితము— వ్యాకరణపరిభాషయందు ద్విరుక్తముయొక్క పరరూపము.

ఆయకట్టు— (ఆయము+కట్టు) రాఁబడి యొక్క ప్రమాణము.

ఆయకాఁడు—రాఁబడిపన్నును దీసికొను కరణము లోనగు గ్రామాధికారి.

ఆయతికాఁడు—రాజాదాయమును రక్షించువాఁడు = కోశాధ్యక్షుఁడు.

ఆయవసము— పశువులు మేయుటకుఁ జోటైనది = పచ్చికబయలు.

ఆయవారము— ప్రతి గృహమునకును దిరిగి ధాన్యమునుగాని బియ్యమునుగాని యాచించుట.

ఆయశ్శూలికుఁడు—సామోపాయముచే సాధింపఁదగిన పనులను దండోపాయముచే నెఱవేర్చుకొనువాఁడు తీక్ష్ణకర్మ గలవాఁడు.

ఆయోధము— యుద్ధముచేయుటకుఁ దగిన సాధనము.

ఆయు(ధికుఁడు)ధజీవి—ఆయుధముచే బ్రతుకువాఁడు = యోధుఁడు

ఆయుధధర్మిణి—రోగము నశింపఁజేయుటలో నాయుధముయొక్క ధర్మము గలది = తక్కిలిచెట్టు.

ఆయుర్దాయము- జ్యోతిశ్శాస్త్రప్రకారముగా జాతకునకు జన్మకాలమందలి గ్రహరాశి స్థితివలనను, లగ్న విశేషము వలనను లబ్ధమైన యాయువు.

ఆయుష్కర్మము—ఆయుర్దాయమును వృద్ధిచేయు కర్మము = క్షౌరము.

ఆయుష్కాముఁడు— దీర్ఘాయువును గోరువాఁడు

ఆయుష్మంతుఁడు— అధికాయుర్దాయము కలవాఁడు.

ఆయోగవుఁడు— శూద్రునకు వైశ్యస్త్రీయందుఁ బుట్టినవాఁడు=వడ్రంగి.

ఆరంభవాదము—పరమాణువుల వలన జగత్తు పుట్టునను వైశేషికాది మతసుల వాదము.

ఆరంభశూరత్వము—కార్యారంభమున మాత్రము మిగుల యాటోపము గలిగి యుండుట. (అజాయుద్ధము, దంపతి కలహము వంటిది)

ఆరకూటము—సువర్ణముయొక్క మాయారూపమువలెఁ బ్రకాశించునది=ఇత్తడి.

ఆరక్షము—యుద్ధరంగ మంతటను రక్షించునది= = సైన్యము.

ఆరఘట్టము— కూపోదకమును పయికి రప్పించు యంత్రవిశేషము = ఏతము.

ఆరటము—1. హిందూదేశముయొక్క పశ్చిమోత్తరమున నుండు దేశవిశేషము = పంజాబు 2 ఆరట్టదేశమునందుఁ బుట్టిన గుఱ్ఱము

ఆరణేయుఁడు— అరణియందు పడిన వ్యాసునివీర్యమును దినుటచే శుకము నందుఁ బుట్టినవాఁడు = శుకుఁడు.

ఆరణ్యకుఁడు—అరణ్యమున నుండువాఁడు = వానప్రస్థుఁడు

ఆరతి— దేవతావిగ్రహముల యెదుట దీపమునుగాని వెలిగించిన కర్పూరమునుగాని త్రిప్పుట.

ఆరామము—ఇందు క్రీడింతురు=తోఁట.

ఆరాధ్యుఁడు—ఆరాధింపఁ దగినవాఁడు = శైవుల గురువు.

ఆరివేరపుఁదపసి—కలహములఁ బెట్టెడు ముని = నారదుఁడు.

ఆరుణి—అరుణుని సంతతి = 1. ఉద్దాలకుఁడను ఋషి, 2. యముఁడు.

ఆరుద్రపురుగు— ఆరుద్రకార్తెలోఁ జూపట్టెడి పటువంటి శరీరచ్ఛాయగల యెఱ్ఱనిపురుగు.

ఆరెగోల— ఏనుఁగుపక్కలు పొడిచి బెదరించుట కరచంద్రాకారముగా నుక్కుతోఁ జేసిన ములికిగల వేణుదండము.

ఆరోగ్యము— రోగము లేనివాని (అరోగుని) భావము.

ఆరోపము— ఒక వస్తుధర్మములు లేని మఱియొక్క వస్తువునందున్నటు చెప్పుట.

ఆరోహాము— పురుషునిచే నధిష్ఠింపఁబడునది = పీఁటుఁదు.

ఆర్కి—సూర్యుని కుమారుఁడు = 1. శని, 2. యముఁడు, 3. సుగ్రీవుఁడు, 4. కర్ణుఁడు, 5. వైవస్వతమనువు.

ఆర్జుని— అర్జునుని కొడుకు — అభిమన్యుఁడు, బభ్రువాహనుఁడు.

ఆర్తవము— ఋతువునకు సంబంధించినది = రజోబిందువు, పుష్పము, ఋతుస్నానానంతరము గర్భోత్పత్తి కనుకూలమైన కాలము.

ఆర్ధికుఁడు— పొలములోని పంటమొదలగు వానిలో సగము గ్రహించువాఁడు = పాలికాపు మొ॥, బ్రాహ్మణునకు వైశ్యస్త్రీయందుఁ బుట్టి బ్రాహ్మణునిచే సంస్కరింపఁబడినవాఁడు = అంబష్ఠుఁడు.

ఆర్య—శ్రేష్ఠురాలు = పార్వతి, అత్త, నాటకమున నటుఁడు భార్యను సంబోధించునపుడు ప్రయోగించు నామము, ఒక వృత్తవిశేషము.

ఆర్యకము— గయలోఁ బితృదేవత నుద్దేశించి చేయు శ్రాద్ధవిశేషము.

ఆర్యపుత్త్రుఁడు— కావ్యనాట్య పరిభాషలయందు భర్తృపర్యాయవాచకము.

ఆర్యావర్తము— పూర్వపశ్చిమసముద్రములకును, వింధ్యహిమవత్పర్వతములకును గల మధ్యప్రదేశము.

ఆర్యుఁడు— కర్తవ్యము ననుసరించుచు నకర్తవ్యమును విసరించుచుఁ బ్రస్తుతాచారము ననువర్తించువాఁడు = ఆర్యావర్తదేశమువాఁడు, బ్రహ్మక్షత్రియవైశ్యులలో నొకఁడు.

ఆర్షభ్యము—కాలక్రమమున నాఁబోతు కాఁదగిన కోడె.

ఆర్షము— ధర్మార్థము వరుని వలన గోమిథునముఁ బుచ్చుకొని కన్యనిచ్చి యథాశాస్త్రముగాఁ జేయువివాహము, ఋషి సేవితమైనది = వేదము, పురాణము మొ.

ఆఱుకాళ్ళపురుగు—షట్పదము.

ఆఱుమోముల వేలుపు— ఆఱుముఖములుగల దేవుఁడు = కుమారస్వామి.

ఆఱువేలదేశము— కృష్ణానదికి దక్షిణ

ముగానుండి పూర్వము ధరణికోట రాజధానిగాఁగల యొకానొకదేశము

ఆలంకారికుఁడు— ఆలంకారశాస్త్రమును జదివినవాఁడు

ఆల(ఁగా)కాఁపరి— గోవులను గాచువాఁడు=గోపాలుఁడు శ్రీకృష్ణుఁడు.

ఆలజేఁడు— అవులకుఁ బ్రభువు = ఆఁబోతు.

ఆలవట్టము— చూ పై. (ఆలావర్తము) రాజాద్యుపచారార్థము వస్త్రములో గుండ్రముగాఁ జేసిన విసనకఱ్ఱ

ఆలాస్యము— పెద్దముఖము కలది = మొసలి

ఆలింగి—కౌగిలించుకొనువాఁడు. యవధాన్యపుగింజవంటి యాకారము గలదై వాయింప ననువగు నొక మృదంగము.

ఆలింపనము— పండుగు దినములందు గోడలకునున్నము వేసి నేలను ముగ్గులు పెట్టి గృహము నలంకరించుట

ఆలీఢము— విలుకాఁడు కుడికాలు ముందుకును నెడమకాలు వెనుకకును జాఁచి నిలుచుట.

ఆలీఢకము—దూడలు దుముకులాడుచుఁ గ్రీడించుట.

ఆలెప్ప్రొయ్యి— ఒకసారిగ నాలుగైదు పాత్రములు వేఱువేఱుఁగాఁబెట్టి వండుట కేర్పఱచిన ప్రొయ్యి.

ఆలేఖ్యశేషుఁడు— చిత్తరువు మాత్రమే మిగిలినవాఁడు = చచ్చిపోయినవాఁడు.

ఆవకాయ—ఆవగుండ, కారము, నూనె మొదలగు పదార్థములతో నూరఁబెట్టిన మామిడికాయ

ఆవనేయుఁడు-భూదేవి కుమారుఁడు = నరకుఁడు, అంగారకుఁడు (భూదేవి విష్ణుని గాంచి స్త్రీరూపమును దాల్చి ప్రేమభిక్ష యడిగెను విష్ణువు సమ్మతించెను. భూదేవి యొక పవడపు రూపముగల బీజమును విడువఁగా నందుండి అంగారకుఁడు జనించెను) దాక్షాయణీ విరహమున శివుఁడు చింతించునప్పుడు అతని శరీరము నుండి స్వేదబిందు వొకటి వ్రాలెను. అందుండి లోహితాంగుఁడను కుమారుఁడు జనింపఁగా భూదేవి వానిని పుత్రభావమున స్వీకరించెనని కొందఱు.

ఆవరణశక్తి— చైతన్యమును గప్పిపుచ్చుమాయాశక్తి

ఆవర్తని— కలియఁబెట్టుటకు సాధనమైనది = గరిటె.

ఆవర్తనీయము— మథింపఁదగినది = మరల మరలఁ బఠింపఁదగిన పాఠాదికము.

ఆవసథము— విద్యార్థులు, సన్న్యాసులు మొదలగువారు బసచేయు మఠాదికము.

ఆవసానుఁడు— గ్రామము యొక్క చివరను వసించువాఁడు = చండాలుఁడు మొ.

ఆవాహనము— దైవశక్తిని విగ్రహాదులయందుఁ బ్రవేశింపఁ జేయునప్పటి మంత్రోచ్చారణము.

ఆవికము— గొఱ్ఱెకు సంబంధించినది = పాలు మొ॥ గొఱ్ఱెబొచ్చుతోఁ జేయఁబడిన కంబళము.

ఆవృతుఁడు— బ్రాహ్మణునకు ఉగ్రకన్యయందుఁ (క్షత్రియునకును శూద్రస్త్రీకిఁ బుట్టినదానియందు) బుట్టినవాఁడు

ఆవేగము— ఇష్టానిష్ట ప్రాప్తిచేఁ గలిగెడు తొట్రుపాటు = చిత్త సంభ్రమము

ఆశయేశుఁడు— చిత్తమునందుండువాఁడు = మన్మథుఁడు.

ఆశాపిశాచిక— పిశాచివలె బాధించెడునాశ = అడియాస.

ఆశీవిషము— కోఱలయందు విషము గలది = సర్పము.

ఆశుకవిత్వము— దీర్ఘాలోచన చేయకయే సమయోచితముగను, త్వరితముగను జెప్పెడి కవిత్వము

ఆశుగము— శీఘ్రముగాఁ బోవునది = బాణము, 2 గాలి.

ఆశు (గామి) గుఁడు— సత్వరముగాఁ బోవువాఁడు = సూర్యుఁడు.

ఆశుతోషుఁడు— త్వరితముగను, సులభముగను సంతోషించువాఁడు = శివుఁడు

ఆశుశుక్షణి— త్వరగా నెండించువాఁడు = 1 అగ్ని, 2. సూర్యుఁడు.

ఆశ్మసారము— ఱాయియొక్క సారము = శిలాజిత్తు

ఆశ్రమి— బ్రహ్మచర్యాది చతురాశ్రమములలో నొక యాశ్రమము కలవాఁడు.

ఆశ్రయాశుఁడు— తన కాధారమగు కాష్ఠాదికమును దినువాఁడు = అగ్ని

ఆశ్రయాసిద్ధి— సాధ్యమగు విషయమున కాధారమగు పదార్థము లేక పోవుట యను హేతు దోషము. (సరోజపద్మమువలె నాకాశపద్మము పరిమళము గలది యనినచోట సాధ్యమగు పరిమళమునకు నాశ్రయమగు గగనపద్మముండుట యసంభవము)

ఆశ్వము— గుఱ్ఱములచే లాగఁబడునది = రథము మొ. గుఱ్ఱముల సమూహము.

ఆశ్వయుజము— అశ్వినీనక్షత్ర యుక్త పూర్ణిమగలమాసము.

ఆశ్వినులు— అశ్వరూపధారిణి యగు సంజ్ఞాదేవియందు సూర్యునకుఁ గలిగినవారు = నాసత్యుఁడు దస్రుఁడు నను దేవలోకవైద్యులు.

ఆశ్వినేయులు— అశ్వినీదేవతల యంశమునఁ గుంతికి జనించినవారు = నకుల సహదేవులు

ఆశ్వీనము— అశ్వ మొకదినములో నడువఁదగినంత ప్రదేశము.

ఆషాఢము— బ్రహ్మచారి ధరించెడు మోదుగకోల, ఆషాఢానక్షత్రయుక్త పూర్ణిమగల మాసము.

ఆసంగము— విషయాంతరములను

వదలి మనస్సు ఒక్కవిషయమునందే లగ్నమైయుండుట.

ఆసారము— అంతటను బడుపట్టిది = జడివాన.

ఆసీనప్రచలాయితము— కూర్చుండి నిదరించుచు ఊగుట.

ఆసుంగ్రోవి—సాలెవాఁడుఆసుపోయు నపుడు నూలుచొప్పించెడు గొట్టము= ఆసుపుల్ల

ఆసుతీవలుఁడు— సోమలతను పిడిచి రసము తీసెడి యాజ్ఞికుఁడు.

ఆసురము— కన్యయొక్క పిత్రాదుల కును గన్యకును యథాశక్తి ద్రవ్య మిచ్చి స్వేచ్ఛానుసారముగఁ గొని వచ్చి చేసికొను వివాహము.

ఆసేచనకము— ఎంతసేపు చూచినను తనివితీరనిది.

ఆస్కందితము— అతి వేగముగాఁ బాఱెడి యశ్వధారావిశేషము.

ఆస్తికుఁడు— భగవంతుఁడు కలఁడని నమ్మువాఁడు, శ్రద్ధగలవాఁడు.

ఆస్ఫోటని—రత్నములకు బెజ్జమువేసెడి సూది.

ఆస్యలాంగలము— నాఁగలివలె సుప యోగపడు ముఖముకలది = పంది.

ఆస్రపుఁడు—రక్తమును ద్రాగువాఁడు = రాక్షసుఁడు.

ఆహవనీయము— హోమము చేయఁ దగినది=హవిరాదికము, అగ్నిహోత్ర శేదము.

ఆహవము—ఇందు పరస్పరము పిలువఁ బడుదురు = యుద్ధము యాగము.

ఆహిండికుఁడు— నిషాదునకు వైదేహ స్త్రీ యందుఁ బుట్టినవాఁడు = చెఱ సాల కాఁపరి

ఆహితాగ్ని—ఎల్లప్పుడును అగ్నిహో త్రమును ఆధాన విధిపూర్వకముగా సంచుకొని యుండువాఁడు = సోమ యాజి.

ఆహుతి—దేవత నుద్దేశించి యగ్నియందు మంత్రపూర్వకముగా హోమద్రవ్య మును వేల్చుట.

ఆహూతప్రపలాయి— వాదబలము లేమిచే న్యాయాధికారుల సమనునకు హాజరు కానివాఁడు

ఆహోపురుషిక— గర్వముచేఁ దన్ను గొప్పగా సంభావించుకొనుట.

ఆహ్నికము—పగటిభాగమునఁ జేయఁ దగిన కర్మము.

ఆహ్వానము— వ్యవహారమునకు బిలుచు టకు సాధనమైన రాజకీయపత్రిక.

ఆహ్వాయము— వ్యవహారమున వివాద నిర్ణయార్థము రమ్మని యధికారులు ప్రతివాది, సాక్షి మున్నగువారికిఁ బంపెడు నాజ్ఞాపత్రము.

ఇంచుఁబోడి— చెఱకువలె మనోహర మగు శరీరముగల యాఁడుది.

ఇంచువిలుతు (కా)ఁడు— చెఱకు

విల్లుగాఁ గలవాఁడు = మన్మథుఁడు, ఇంచువింటి 'జెంచు, ఇక్షుధన్వుఁడు.

ఇంటికోపుంజు— అహల్యకొరకు గౌత మాశ్రమమున రాత్రి కోడిపుంజయి కూసినవాఁడు = దేవేంద్రుఁడు.

ఇందిందిరము— పద్మసంపదతోఁ గూడినది = తుమ్మెద.

ఇందిర—పరమైశ్వర్యవతి = లక్ష్మి.

ఇందిరానిలయము } ఇందిరాలయం,
ఇందిరామందిరము } లక్ష్మికి నివాస స్థానమైనది = పద్మము.

ఇందీవరము — ఐశ్వర్య యుక్తయగు లక్ష్మిచే వరింపఁబడినది, ఇంద్రియము లను సంతోషపెట్టునది = నల్లకలువ.

ఇందీవరుఁడు— లక్ష్మీదేవి భర్త = విష్ణువు.

ఇందుమౌళి—చంద్రుఁడు శిరోభూష ణముగాఁ గలవాఁడు = శివుఁడు.

ఇందులోహము- చంద్రునివలెఁ బ్రకా శించు లోహము = వెండి.

ఇందువు(ఁడు) – మంచుతోఁ గూడిన కిరణములచేఁ దడిపెడువాఁడు = చంద్రుఁడు.

ఇందువ్రతము— చంద్రకళలయొక్క క్షయవృద్ధుల ననుసరించి దినమున కొక్కొక్క కబళముచొప్పున తగ్గించియు హెచ్చించియు భుజించుచుఁ జేయు వ్రతవిశేషము = చాంద్రాయణ వ్రతము.

ఇంద్రకృష్టము— మనుష్యుల ప్రయ త్నములేకయే వర్షజలముసమృద్ధముగా నుండుటచేఁ బండునది=ధాన్యము.

ఇంద్ర (ధనుస్సు) చాపము— మేఘమున చిత్రవర్ణములతో ధనురా కారముగాఁ గనఁబడు సూర్యకిరణ సముదాయము.

ఇంద్రచ్ఛందస్సు—వేయి పేటలు గల హారము.

ఇంద్రజాలము— మంత్రౌషధాదులచే నొకవిధమగు పదార్థమును మఱియొక విధముగాఁ జూపెడువిద్య.

ఇంద్రజిత్తు— ఇంద్రుని జయించిన వాఁడు = రావణుని కొడుకు - మేఘ నాథుఁడు.

ఇంద్రధ్వజము— భాద్రపద శుక్ల ద్వాదశియందు రాజు తనరాజ్యమంగు సస్యవృద్ధికరమగు వర్షముకురియుటకై యింద్రప్రీతిగా నెత్తెడు ధ్వజ విశేషము.

ఇంద్రలోకము—ఇంద్రుఁడు ప్రభువు గాఁగల లోకము = స్వర్గము.

ఇంద్రశత్రువు— ఇంద్రునకు శత్రు వైనవాఁడు = రాక్షసుఁడు, వృత్రా సురుఁడు మొ॥

ఇంద్రాగ్ని—మేఘములవలనఁ గలుగు నిప్పు = మెఱుపు.

ఇంద్రాణి — ఇంద్రునిభార్య=శచీదేవి.

ఇంద్రాయుధము— 1. ఇంద్రుని

ధనుస్సు, 2. మేఘపంక్తిలో నానావర్ణములు గలిగి ధనురాకారముగల సూర్యకిరణము.

ఇంద్రావరజుఁడు— అదితియందుఁ గశ్యపునివలన నింద్రునకుఁ బిమ్మటఁ బుట్టినవాఁడు = విష్ణువు.

ఇంద్రియగోచరము— ఇంద్రియములకు గోచరమగునది = శబ్దస్పర్శరూప గుణాదికము.

ఇంద్రియనిగ్రహము— ఇంద్రియములను విచ్చలవిడిగా విషయములయందుఁ బ్రవర్తింపనీయక వశపఱచుకొనుట.

ఇంద్రియబోధకము— ఇంద్రియముల కుద్రేకము కలిగించునది = మద్యాది.

ఇంద్రియసన్నికర్షము— ఇంద్రియములకుఁ దమతమ విషయములతోడి సంబంధము, ప్రత్యక్షజనక మగు వ్యాపారము.

ఇంద్రియారాముఁడు— పంచేంద్రియ విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల ననుభవించుటయం దాసక్తి కలవాఁడు = విషయలోలుఁడు.

ఇంద్రోత్సవము— (వర్షాధిష్ఠాన దేవత యగు) దేవేంద్రునిగూర్చి ప్రభువులు మొదలగువారు ప్రతిసంవత్సరమును జరిపెడు నుత్సవవిశేషము.

ఇక్షుకీయ— చెఱకు విశేషముగాఁగల భూమి.

ఇక్షుధన్వుఁడు— చెఱకు విల్లుగాఁగల వాఁడు = మన్మథుఁడు.

ఇక్షుయంత్రము— చెఱకు రసము తీసెడు యంత్రవిశేషము = చెఱకు గానుఁగ.

ఇక్షుశరాసనుఁడు— ఇక్షుధన్వుఁడు.

ఇగురుఁగైదువుజోదు— పల్లవము ఆయుధముగాఁగల యోధుఁడు = మన్మథుఁడు.

ఇగురు(ఇగురాకు)ఁబోఁడి(ణి)— (చిగురుఁబోఁ(డి)(ణి), చిగురువలె సౌకుమార్యమును, సౌందర్యమును గల యాఁడుది.)

ఇగురువి(ల్కాఁడు)ల్తుఁడు — చిగురు నారి (అల్లెత్రాడు) గాఁగల ధనుస్సు గలవాఁడు = మన్మథుఁడు.

ఇచ్చకదారి— ముఖప్రీతి కరములగు కృత్యములు చేయువాఁడు.

ఇచ్చకాలమారి— ముఖప్రీతి కరములగు మాటలు పల్కెడు స్వభావము గలవాఁడు.

ఇచ్ఛమానికము— కోరికలను తీర్చెడి మణి = చింతామణి.

ఇచ్ఛావతి— సంభోగమునందుఁ గాక తదితర ధనాది విషయములయందు మాత్ర మిచ్ఛగల స్త్రీవిశేషము.

ఇచ్ఛరము, ఇద్వరము } కామమున స్వేచ్ఛగా సంచరించునది = ఆఁబోతు.

ఇతరేతరాశ్రయము— చూ. అన్యోన్యాశ్రయము.

ఇతికర్తవ్యత—ఇది ఈ విధముగ చేయఁ దగిన దనుట.

ఇతిహాసము—(ఇతి + హ + ఆసీత్ = ఇతిహాసము) పూర్వరాజుల చరిత్రము గలది = భారతము మొ.

ఇత్రిగ మోముల బలియుఁడు—(ఇరు+తిగ) = ఇత్రిగ, (రెండుమూఁడులు ఆఱు) చూ. షణ్ముఖుఁడు.

ఇద్దరుతల్లుల ముద్దుబిడ్డఁడు—గంగా పార్వతుల గారాబుకొడుకు = వినాయకుఁడు.

ఇధ్మజిహ్వుఁడు—కట్టెలవలన బయలు వెడలిన జ్వాలలు నాలుకలుగాఁ గల వాఁడు, కట్టెలు తినెడు జిహ్వ కల వాఁడు = అగ్ని.

ఇధ్మప్రవ్రశ్చనము—కట్టెలను నఱుకునది = గొడ్డలి.

ఇధ్మవాహనము—కట్టెలు వాహనముగాఁ గలవాఁడు = అగ్ని.

ఇబ్బంది—అడవిపందికిని నూరఁబందికిని బుట్టినది. చూ. ఇబ్బందిగాఁడు.

ఇబ్బందిగాఁడు—పెద్దపులికిని జిఱుతపులికిని బుట్టినపులి = ఎలుఁగుగొడ్డు.

ఇభనిమీలిక—తినినయెడల నేనుఁగునైనను మత్తు కలుగఁజేసి నిద్రింపఁజేయునది = గంజాయి.

ఇభపోట—మగ ఏనుఁగు లక్షణములు పైకముగల ఆఁడేనుఁగు.

ఇభము—మదమునుబొందునది=ఏనుఁగు.

ఇరుఁదలపులుఁగు—రెండు తలలుగల పక్షి = గండభేరుండము.

ఇరుఁబుట్టువు—రెండు పుట్టుకలు గల వాఁడు(ది) = బ్రాహ్మణుఁడు, పక్షి.

ఇరుదంతి—రెండు దంతములు గలది = ఏనుఁగు.

ఇరుఁదలగ్రుడ్డు కానుపు—రెండు తలలు గల గ్రుడ్డును బెట్టునది = గండభేరుండము.

ఇరుఁదలపాము—రెండు తలలు గల పాము = డుండుభము.

ఇరులు(ల)గొంగ, ఇరులుదాయ—చీఁకటికి విరోధి = సూర్యుఁడు.

ఇరుకుమ్రాను—ఆవరణలోనికి మనుష్యుఁడు మాత్రము వెళ్ళుటకు వీలుగాను, పశువులు పోకుండునట్లుగాను పాతిన పంగలకొయ్య.

ఇఱ్ఱిదాల్పు బావ—హరిణమును ధరించిన చంద్రునకు బావయైనవాఁడు (చంద్రుని సోదరియగుఁ లక్ష్మికి మగఁడు.) = విష్ణువు.

ఇలతాల్పు—చూ. భూధరము.

ఇల్లంట్రము—స్త్రీ మగనితోఁ దన పుట్టినింటఁ జేయు కాఁపురము.

ఇల్ల(ఱిక)టము—అల్లుఁడు తన పెండ్లాముతో వత్తవారి యింటనే చేయు కాఁపురము.

ఇల్లడ—అడిగినప్పుడు తిరుగ నిచ్చు పద్ధతిపై నొకరియొద్ద దాఁచిన ధనాదికము, దాఁపుడుసొత్తు.

ఇల్లాలు—ఇంటియందలి స్త్రీ = గృహిణి.

ఇల్లోనారాయణమ్మ—పిల్లికి బిచ్చమైనను పెట్టని బాలవిధవ, ఎంగిలిచేతితోఁ గాకిని సయితము గొట్టనిది.

ఇవము (ఈము) మేఁపరి— హిమము (మంచు) ను భక్షించువాఁడు = సూర్యుఁడు.

ఇవము (ఈము) సూడు — మంచునకు శత్రువైనవాఁడు = సూర్యుఁడు.

ఇషుధి—బాణమును ధరించునది = అమ్ములపొది.

ఇష్టాపూర్తము—అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదానుపాలనము, ఆతిథ్యము, వైశ్వదేవము, ఇష్టము, వాపీకూపతటాకారామదేవాలయనిర్మాణములు, అన్నదానము మొ॥ పూర్తము.

ఇష్టిపచుఁడు—దేవతార్థము కాక స్వార్థమునకై మాత్రమే వండుకొను వాఁడు = పిసినిగొట్టు, రాక్షసుఁడు.

ఇష్వసనము—ఇష్వాసము, బాణములను జిమ్మునది = ధనుస్సు.

ఇష్వుఁడు—ఉపదేశము కొఱకుఁ జేరఁదగినవాఁడు = ఉపాధ్యాయుఁడు.

ఇహాముత్రఫలము — ఇహపరములందలి కర్మఫలము.

ఈఁగపులి—ఈఁగలకుఁ బులివలె భయంకరమైనది = సాలెపురుగు.

ఈఁద(చూలి, పట్టి) కొమరుఁడు—వాయుదేవుని కొడుకు = 1. హనుమంతుఁడు, 2. భీముఁడు.

ఈక్షణికుఁడు—హస్తరేఖలను జూచి శుభాశుభఫలములను జెప్పువాఁడు = సాముద్రికుఁడు.

ఈగి(వి)మ్రాను— కోరికలు తీర్చెడి వృక్షము = కల్పవృక్షము.

ఈగులకెంపు—ఇచ్చమానికము.

ఈర్ష్యకుఁడు—అసూయ కలవాఁడు, ఇతరుల సంభోగమును జూచినఁగాని సంభోగోద్రేకము గలుగని యొక విధమయిన నపుంసకత్వము గలవాఁడు.

ఈలపురుగు—ఈలవలె ధ్వనిచేయు పురుగు = చిమ్మట.

ఈవుల(కెంపు)—రతనము. చూ. ఇచ్చమానికము.

ఈవులమొదవు—కోరికలను తీర్చెడు గోవు = కామధేనువు.

ఈశానుఁడు—ఐశ్వర్యము కలవాఁడు = శివుఁడు.

ఈశ్వరవిభూతి—లోకమున స్థానవిశేషములందుఁగల ఈశ్వరాంశము.

ఈశ్వరసాక్షి— మాయోపహిత చైతన్యము.

ఈశ్వరి—ఈశ్వరుని భార్య = పార్వతి.

ఈశ్వరుఁడు—స్వభావముచేతనే ఐశ్వర్యము కలవాఁడు = శివుఁడు.

ఈషణము— త్వరపెట్టునది = కోరిక.

ఈషాదంతము—నాఁగటి కోలవంటి దంతము గలది = పెద్దదంతములుగల యేనుఁగు.

ఈసపిట్ట— శరీరముపై ముండ్లు గలిగి గుండ్రముగానుండు ఒకజాతి చేప.

ఈహామృగము—మృగములను గోరునది = తోఁడేలు.

ఉంకుటుంగరము— వధూవరులు పెండ్లిచేసుకొనుటకు పరస్పరము సమ్మతించి మార్చుకొనెడియుంగరము.

ఉంఛవృత్తి—ఓళ్ళదగ్గరగాని, పొలములోఁ గాని పడిన ధాన్యపుగింజల నేరుకొని తిను వృత్తి.

ఉందురువు— తన ముఖముచే ముట్టఁబడిన వస్తువును ద్రవింపఁజేయునది = ఎలుక.

ఉకానహము— పీతరక్త (కృష్ణరక్త) వర్ణముగల గుఱ్ఱము.

ఉఖ్యము—ఉఖ (వంటకుండ) యందు వండఁబడిన మాంసాదికము.

ఉగాది—చైత్రమాసమునందలి మొదటి దినము.

ఉగ్రంపశ్యము—క్రూరముగాఁ జూచునది = వ్యాఘ్రము మొ.

ఉగ్రగంధము—గాటయిన పరిమళము గలది = సంపెంగ, వెల్లుల్లి, ఇంగువ.

ఉగ్రధన్వుఁడు—భయంకరమైన విల్లు గలవాఁడు=1. శివుఁడు, ఇంద్రుఁడు.



ఉగ్రసేనుఁడు— భయంకరమైన సైన్యముకలవాఁడు.

ఉగ్రశ్ర (వు) వసుఁడు—సూతుని కొడుకు = రోమహర్షణుఁడు.

ఉగ్రాక్షుఁడు— భయంకరమైన ఫాల నేత్రము కలవాఁడు = శివుఁడు.

ఉగ్రుఁడు స.— 1. భయమును గలుగఁజేయువాఁడు = శివుఁడు, 2. క్షత్రియునకు శూద్రజాతి భార్యయందుఁ బుట్టిన సంకీర్ణజాతివాఁడు.

ఉచితజ్ఞుఁడు— ఉచితము (యుక్తము) నెఱింగినవాఁడు.

ఉచ్చంద్రము—రాత్రియొక్క చివర భాగము = అపరరాత్రము.

ఉచ్చలము—చలించెడు స్వభావము కలది మనస్సు.

ఉచ్చింగటుఁడు— కోపస్వభావముగల మనష్యుఁడు.

ఉచ్చైశ్శ్రవము—నిక్కిన చెవులు గలిగి, గట్టిగా మాట్లాడినఁగాని విన లేనిది = ఇంద్రుని గుఱ్ఱము.

ఉచ్ఛృగిత్త— ఆవుల మూత్రము నాఘ్రాణించుచు వానిని వెంబడించు గిత్త = స్త్రీలోలుఁడు.

ఉచ్ఛాసనుఁడు— శాసనము నతిక్రమించినవాఁడు = అవిధేయుఁడు

ఉచ్ఛిష్టాన్నము—ఇతరులు తినఁగా మిగిలిన యన్నము, బ్రాహ్మణభోజన

పృథివీపతి—భూమికి భర్త = రాజు.

పృథురోమము— దీర్ఘములైన రోమములు కలది = చేప, రొయ్య, బొద్దిక.

పృదాకువు—కుత్సితముగాఁ బలుకునది = పాము, పులి, చిఱుతపులి (తే.వ.).

పృషతము—ఒడలిపైఁ జుక్కలు కలది = దుప్పి.

పృషదశ్వుఁడు— 1. జలబిందువులు వాహనమైనవాఁడు, 2. జలబిందువులు వాహనముగాఁ గలవాఁడు, 3 పృషత్తు (ఒక మృగము) వాహనముగాఁ గలవాఁడు = వాయువు.

పృషదాజ్యము—పెరుఁగుతోఁ గలుపఁబడిన నేయి = హవిస్సు.

పెండ (పెంజ) రము— చూ. గండ పెండేరము.

పెందిరువడి— ఎక్కువఁగాఁ దిరుగఁ గలవాఁడు = గరుత్మంతుఁడు.

పెంపుడుగున్న—(రూపమున సామ్యము కలిగియుండుటచే బాల్యమునఁ గాకులచేఁ గూఁతరచ్చుపడుచు) పెంపఁబడు పక్షి = కోయిల.

పెట్లమారి— దెబ్బలుతిను స్వభావము కల(ది) వాఁడు.

పెద్దకడుపువేలుపు— పెద బొజ్జగలాఁడు = గణపతి.

పెద్దని(ద్ర)దుర— శాశ్వతమైన నిద్ర = మరణము.

పెద్దపులుఁగు-పెద్దపక్షి = రాపులుఁగు, గుడ్లగూబ.

పెద్దమ్మ—లక్ష్మికి అప్ప = 1. జ్యేష్ఠాదేవి, 2. పెద్దతల్లి.

పెద్దరోగము—దేహము దినెడురోగము = కుష్ఠురోగము.

పెద్దవేలుపు—దేవతలలోఁ బెద్దవాఁడు = బ్రహ్మ.

పెనుమసనము—పెద్దవల్లకాఁడు గల పట్టణము = కాశి.

పెనువెల్లి— ప్రళయకాలము నందలి యేకార్ణవము = పెద్దసముద్రము.

పెనుమాళ్ళదుగుబుగ్గ—విషుపది.

పైఁడికడుపుదేవర— చూ. హిరణ్యగర్భుఁడు.

పైఁడి(పసిఁడి)చూలాలు— బంగారమును గనునది = భూమి.

పైఁడినెలఁత— ధనాధిదేవత = లక్ష్మి.

పైఁడిఱేఁడు—ధనాధిపుఁడు.

పైతృకము— పితృసంబంధమైనది = శ్రాద్ధము, ఆబ్దికము మొ.

పైతృష్వ (సేయు డు) స్రీయుఁడు- మేనత్తకొడుకు.

పైరులయెకిమీఁడు— పైరులకధిపతి = చంద్రుఁడు.

పైరులుసురు—పైరులకుఁ బ్రాణమైనది = మేఘము.

పైశాచము—నిద్రించియుఁ, ద్రాగి మైమఱచియు శీలము సంరక్షింపఁ బరాకుఁబడి యున్నదానిని, సంభోగేచ్ఛచే బలత్కారముగాఁ గొనిపోయి చేసికొను వివాహము.

పొంగట్టు—బంగరుకొండ = మేరువు.

పొందామరలపంట—బంగారపు కమలములు పండునది = దేవగంగ.

పొంబోరవేలుపు—చూ. హిరణ్యగర్భుఁడు.

పొక్కిలిచూలి, పొక్కిలిపాపఁడు—విష్ణునినాభియందుఁ బుట్టిన బిడ్డఁడు—బ్రహ్మ (ప్రళయకాలమునఁ శ్రీవిష్ణువు నీరముపై శయనించియుండఁగా నతని నాభినుండి కమలము పుట్టెను. బ్రహ్మ విష్ణువునొద్దకువచ్చి యతని కుక్షిస్థములగు లోకములను జూడఁదలఁచి విష్ణుని శరీరమునఁ బ్రవేశించి లోకములను జూచెను. ఇంతలో శ్రీవిష్ణుని నవరంధ్రములు మూఁతపడెను. ఆ కారణమున విష్ణులోనుండి నాభికమలము గుండా బ్రహ్మ బయటికివచ్చెను. అదిమొదలు బ్రహ్మ విష్ణుని పుత్త్రుఁడుగా వ్యవహరింపఁబడుచుండెనని కూర్మపురాణము.)

పొగకన్ను—పొగతోఁగూడిన అగ్ని జనించెడు శివుని ఫాలనేత్రము.

పొట్టకూడు—జీతమునకు మాఱుగాఁ బొట్టకుఁ బెట్టెడుకూడు.

పొట్టివడుఁగు—పొట్టిబ్రహ్మచారి = విఘ్నేశ్వరుఁడు, వామనరూపుఁడగు విష్ణువు.

పొడకోకఁగట్టుప్రోడ, ప్రొడలగింజె ముదాలుపు—మచ్చలుగల చర్మమును వస్త్రముగాఁ గట్టినదిట్టరి = శివుఁడు.

పొడలమెకము—మచ్చలుగల మృగము = దుప్పి.

పొడుగుమడుగు—మిక్కిలి పొడుగైన మడుగు = ఆకాశగంగ.

పొదరిండ్లచుక్క—పొదరిండ్లువలె నుండు నక్షత్రము = పునర్వసు.

పొల(సుఁ)దిండి—మాంసమును దినువాఁడు—రాక్షసుఁడు, నైరృతుఁడు.

పొలసు(మేఁతరి)మేపరి, పొలసుఁదిండీడు } చూ. పొలదిండి.

పో(ప్రో)చిళ్ళు—శకునము చూచుటకై పొగుగిళ్ళమీద అక్షతలు, నీరు చల్లుట.

పోట—స్త్రీపురుష లక్షణములతోఁ గూడినది = మాచకమ్మ.

పోతుగుఱ్ఱము గలాఁడు—దున్నపోతు వాహనముగాఁ గలవాఁడు = యముఁడు.

పోతురౌతు—దున్నపోతు నెక్కి స్వారిచేయువాఁడు = యముఁడు.

పోత్రి—అధికమైన మోఁగలది = పంది.

పోరంబోకు—సాగుబడికిరాని నేల.

పోరుఁదిండి – పోరోగిరపుఁ (దంట) దిండి—కలహ మాహారముగాఁగలవాఁడు = నారదుఁడు.

పౌత్త్రి—కొడుకు కూఁతురు = మనుమరాలు.

పౌత్త్రికేయుఁడు—దత్తుగాఁ దీసికొన్న కూఁతురుయొక్క కొడుకు.

పౌత్త్రుఁడు— పుత్త్రునికిఁ బుత్త్రుఁడు = మనుమఁడు.

పౌరాణికుఁడు— పురాణము (చెప్పువాఁడు) తెలిసినవాఁడు.

పౌరులు—పురమునందలి ప్రజలు.

పౌర్వాపర్యము— ముందు వెనుకలకుఁ గల సంబంధము.

పౌలస్త్యుఁడు— పులస్త్యుని వంశమునఁ బుట్టిన వాఁడు = కుబేరుఁడు, రావణుఁడు, కుంభకర్ణుఁడు మొ.

పౌలోములు—మారీచునకుఁ బులోమయందుఁ గల్గిన 60,000 దానవసంతతి.

పౌషము— పుష్యమీ నక్షత్రముతోఁ గూడిన పున్నమగల నెల = పుష్యమాసము.

ప్రకంపనుఁడు—మిగుల కంపింపఁజేయువాఁడు = వాయువు.

ప్రకృతి—ప్రత్యయము చేరకపూర్వమున్న శబ్దరూపము = స్వభావము.

ప్రగల్భ—(18 ఏండ్లకు మించిన) మిక్కిలి ప్రతిభగల నాయికావిశేషము.

ప్రచే(తసు)(తు)ఁడు—మంచి మనస్సు కలవాఁడు = వరుణుఁడు.

ప్రజాపతి—ప్రజలకుఁ బ్రభువు=బ్రహ్మ, రాజు.

ప్రణయకోపము— ప్రేమముయొక్క కుటిల ప్రచారమువలనఁ గారణము లేకయే నాయికా నాయకులకుఁ గలిగెడు కోపవిశేషము.

ప్రతిగృహీ(త)తుఁడు—దానము పుచ్చుకొన్న వాఁడు.

ప్రతిజ్ఞ—ఏదేని యొకపనిని దప్పక చేసెదనని దృఢముగాఁ బల్కుట.

ప్రతిపక్షుఁడు— ఎదుటి పక్షమువాఁడు = శత్రువు.

ప్రతిభ—సమయానుకూలముగాఁ బ్రకాశించెడు బుద్ధివిశేషము.

ప్రతివాది— వాదికి విరుద్ధ పక్షమువాఁడు = శత్రువు.

ప్రతిహారకుఁడు— గారడివిద్యయందు నైపుణ్యము కలవాఁడు.

ప్రతిహా(రి)రుఁడు— వాకిట గావలి కాయువాఁడు = ద్వారపాలకుఁడు.

ప్రతీచి— సాయంకాలమున సూర్యుఁడస్తమించు దిక్కు = పడమర.

ప్రతీపదర్శిని—వక్రముగా నాలోచించునది = స్త్రీసామాన్యము.

ప్రతీహారము—పూర్వము నేను వీనికి మేలుచేసితిని గాన నిప్పుడు నాకు మేలు చేయునని యెంచి చేయునట్టి సంధి.

ప్రత్యంతపర్వతము— పెద్దకొండ చేరువనుండు చిన్నకొండ.

ప్రత్యక్షము—అక్షము (ఇంద్రియము) నకు అభిముఖమైనది = పంచేంద్రియ గోచరమగు రూపరస గంధాదికము.

ప్రత్యర్థి— ప్రతికూలముగాఁ గోరువాఁడు = శత్రువు.

ప్రత్యాబ్దికము— ప్రతి సంవత్సరము చేసెడి శ్రాద్ధము.

ప్రత్యాలీఢము—విలుకాఁడు యుద్ధమున నెడమకాలు ముందునకును, కుడికాలు వెనుకకును జాచి నిలుచుట.

ప్రత్యాహారము— విషయములనుండి యింద్రియములను మరలించుట.

ప్రత్యు (ద్గమము) త్థానము—పెద్దలు వచ్చినపుడు లేచుట.

ప్రదక్షిణము— దేవతాదుల నుద్దేశించి కుడివైపుగా చుట్టును దిరుగుట.

ప్రద్యుమ్నుఁడు— ఎక్కువ బలము గలవాఁడు = మన్మథుఁడు.

ప్రద్యోతనుఁడు— మిక్కిలి ప్రకాశించువాఁడు = సూర్యుఁడు.

ప్రధానులు—ప్రకృష్టముగా ధరించువారు = ఉత్కృష్టులును, హీనులును గాక మధ్యమాధికారములందు వ్యవస్థితులైన దళవాయి మున్నగువారు.

ప్రపితామహి—ప్రపితామహుని (ముత్తాత) భార్య.

ప్రపితామహుఁడు— తాతతండ్రి = ముత్తాత.

ప్రపౌత్రి—పౌత్త్రుని కూఁతురు = మునుమనుమరాలు.

ప్రపౌత్త్రుఁడు—పౌత్రుని కుమారుఁడు = మునుమనుమఁడు.

ప్రప్రపితామహుఁడు— ప్రపితామహుని (ముత్తాత) తండ్రి.

ప్రభంజనుఁడు— వృక్షశాఖాదులను విరుగఁగొట్టువాఁడు = వాయువు.

ప్రభాకరుఁడు— కాంతిని గలుగఁజేయువాఁడు = సూర్యుఁడు, అగ్ని.

ప్రభాతము—తెల్లవాఱుటకుఁ బూర్వమునఁ గల నాలుగు గడియలకాలము.

ప్రమ, ప్రమితి—యథార్థజ్ఞానము.

ప్రమత్తుఁడు—ప్రమాదమును బొందినవాఁడు.

ప్రమథాధి(పతి)పుఁడు— ప్రమథగణములకుఁ బ్రభువు = ఈశ్వరుఁడు.

ప్రమద— మిగుల యౌవనమదముగల స్త్రీ.

ప్రమద (ప్రమదా) వనము—మదవతులు విహరించుటకు యోగ్యమైన యుద్యానము.

ప్రమాతామహి—మాతామహుని (తల్లితండ్రి) తండ్రియొక్క భార్య.

ప్రమాతామహుఁడు— తల్లితాత = ముత్తాత.

ప్రలంబఘ్నుఁడు— ప్రలంబాసురుని సంహరించినవాఁడు = బలరాముఁడు.

ప్రవయుఁడు— ఎక్కువవయస్సు కల వాఁడు = వృద్ధుఁడు.

ప్రవల్హిక— గూఢార్థముగల ప్రబంధము.

ప్రవాదము— అకారణముగ దేశమంతటను వ్యాపించిన వార్త.

ప్రవ్రజితుఁడు— చూ. పరివ్రాజకుఁడు.

ప్రశాంతుఁడు— మిగుల శాంతినొందిన వాఁడు.

ప్రశిష్యుఁడు—శిష్యుని శిష్యుఁడు.

ప్రసాదము— భగవంతునకు నివేదించిన యన్నాదికము.

ప్రసాధని—కేశములను జిక్కులేకుండ నట్లు లెస్సగాఁ జేయునది=దువ్వెన.

ప్రస్తారము— ఛందశ్శాస్త్రము నందలి గురు లఘువుల గుణకారము.

ప్రస్తావన— నాటకములోని నటీసూత్రధారుల సంభాషణ.

ప్రహసితము— శిరః కంపముతోఁ గూడిననవ్వు, గేలి.

ప్రళయము— జగము దీనియందు లయము పొందును = యుగాంతము.

ప్రాఁగబ్బము— పురాతనమైన కావ్యము = వేదము.

ప్రా(మిన్క)(ఁజదువు)ఁ బలుకులు— పురాతనమైన విద్య = వేదము.

ప్రాకృతుఁడు— విశేష జ్ఞానములేక పుట్టినప్పటివలె నుండువాఁడు = అల్పుఁడు.

ప్రాగల్భ్యము— స్త్రీలయొక్క అప్రయత్నమైన శృంగారచేష్టావిశేషము.

ప్రాచి— ప్రథమమున సూర్యుఁ డుదయించు దిక్కు = తూర్పు.

ప్రాచీనావీతము— అపసవ్యముగా వేసికొనిన యజ్ఞోపవీతము = ప్రాచీనమై దక్షిణభుజముననున్న జందెము.

ప్రాచేతసుఁడు— ప్రచేతసుని కొడుకు = వాల్మీకి ముని.

ప్రాజాపత్యము— మీరిరువురును ధర్మము నాచరింపుఁడని వరునితోఁ జెప్పి వరునిచే 'నేను అన్యాశ్రమస్థుఁడను గాక గృహస్థాశ్రమమునుండి ధర్మము నాచరించెదను'అని చెప్పించి చేయు వివాహము.

ప్రాజాపత్యకృచ్ఛ్రము— 3 దినములు ప్రాతఃకాలమున భుజించి 3 రోజులయాచితముగ లభించినదానిని భుజించి 3 దినములు ఉపోష్కవాసము చేయుట.

ప్రాజ్ఞుఁడు— మంచి ప్రజ్ఞ గలవాఁడు = బుద్ధిమంతుఁడు.

ప్రాణగొడ్డము— ప్రాణోపద్రవకరము.

ప్రాణనాథుఁడు—తన ప్రాణమునకుఁ ప్రభువు = ప్రియుఁడు, మగఁడు.

ప్రాణ(ము)వాయువు— వాయువులోని ప్రాణాత్మకమగు నొక భాగము.

దీనిచే లెస్సగా జీవింతురు. ప్రకర్షముగా శ్వాసాదులకు బయలు వెడలించునది = శరీరమందలి వాయువు.

ప్రాణాయామము— నాసారంధ్రముల నుండి వెడలెడి యుచ్ఛ్వాసనిశ్వాస రూపమగు వాయువును బంధించుట.

ప్రాణిద్యూతము— ప్రాణుల నొడ్డి జూదమాడుట = కోడిపందెము మొ.

ప్రాతిపదికము— ధాతు భిన్నమును, ప్రత్యయ భిన్నమును, ప్రత్యయాంత భిన్నము నగు నర్థవచ్ఛబ్ద స్వరూపము.

ప్రాతిభాసికము— లేనిది యున్నటు కనఁబడునది.

ప్రాతిహారికుఁడు— గారడీవిద్యయందు నేర్పరియైన వాఁడు.

ప్రాదేశము— చూపుడుఁవ్రేలిని, బొటనవ్రేలిని చాఁచిపట్టిన కొలత.

ప్రామినకులు— పురాతన ప్రామాణిక వాక్యములు = వేదములు.

ప్రాయశ్చిత్తము— పాపపరిహారార్థము చేసెడు కర్మము.

ప్రాయేటు— పురాతన మైన నది = (సముద్రము).

ప్రాయోపవేశము— ఆహారాదులను విడచి మరణమునకై వేచియుండుట.

ప్రారబ్ధము— సుఖదుఃఖాది భోగముల ననుభవించుటకై తిరిగిజన్మకలిగించెడు కర్మవిశేషము. జీవుని సంచితమునుండి ఈశ్వరుఁడు 'ఈజన్మమున నీవు పుణ్యపాపఫలముల ననుభవింపు' మని పంచిపెట్టుట.

ప్రాలేయము— శరత్కాలముయొక్క ప్రళయమున (అంతమున) వచ్చునది = మంచు.

ప్రావృషిజము— వర్షకాలమునఁ బుట్టునది = కప్ప, తుపాను.

ప్రావే(ల్వ)లుపు— పూర్వదేవుఁడు.

ప్రాహ్ణము— ఉదయము మొదలు 10 గడియలవఱకుఁ గల కాలము.

ప్రియంవదుఁడు, ప్రియవాది— ప్రియమును బల్కువాఁడు.

ప్రియుఁడు— అధికముగాఁ బ్రేమించువాఁడు = మగఁడు.

ప్రీతిదత్తము— వివాహానంతరము భర్తవలన అత్తమామలచేఁ బ్రీతిపూర్వకముగా నివ్వఁబడిన స్త్రీధనము.

ప్రేతపురము— యముని సదనము = నరకము.

ప్రేతవనము—చూ. పితృవనము.

ప్రొద్దు (కూన) (గొడుగు) (చూలి) (పట్టి)— సూర్యుని కుమారుఁడు = సుగ్రీవుఁడు, కర్ణుఁడు మొ.

ప్రొద్దు(జోడు)జంట— చూ. సెంవాఁడు.

ప్రొద్దుజోడుకోడె— సూర్యునికి జంటయైన వాఁడు = చంద్రుఁడు.

ప్రాగ్దుతిరుగుఁడు— సూర్యుని గమనము ననుసరించి తిరిగెడువృక్షము.

ప్రాగ్దునెలకందోయి— సూర్య చంద్రులు నేత్రములుగాఁ గలవాఁడు =శ్రీవిష్ణువు.

ప్రోషితభర్తృక- దేశాంతరగతుఁడగు ప్రియునిగూర్చి విచారించెడు నాయికా విశేషము.

ప్లవ(ం)గము— దాఁటుచుఁ బోవునది = కోఁతి (ఁకు), గరుడుఁడు, అనూరుఁడు.

ప్లుతము—దూరదేశమునకైనను సమానమైన వేగముతోఁ బరుగెత్తెడు అశ్వగమన విశేషము. మూఁడు మాత్రల కాలము గల సామవేదాది స్వరము.

ఫణాభరము—పడగను భరించునది = సర్పము (పడగదారి).

ఫణి—ఫణము (పడగ) కలది = పాము

ఫల్గునుఁడు— ఫల్గునినక్షత్రమునఁబుట్టిన వాఁడు = అరుసుఁడు.

ఫాలనేత్రుఁడు—ఫాలమునందు నేత్రము కలవాఁడు = శంకరుఁడు.

ఫేరవము (ఫేరువు)— 'ఫే' యను ధ్వని గల్గునటు కూయునది - నక్క.

బంగారుకడుపువాఁడు—చూ. హిరణ్యగర్భుఁడు (పోంభోరవేల్పు).

బండారుఁడు— బత్తెలనుగాచువాఁడు.

బంధకి—ఉదాసీనుఁడగు పురుషుని పయితము స్వవశమున బంధించునది= జారిణి, ఆటకత్తె.

బంధనాలయము— ప్రభువులు నేరస్థులను బంధించుట కేర్పాటు చేసిన కట్టడము = చెఱసాల.

బంభరము— 'బం' అను శబ్దమును భరించునది = తుమ్మెద, భ్రమరము.

బకధ్యానము—ఏటియొడ్డునఁ జేఁపలకై వేఁచియుండి చేపడికొంగయొక్క ధ్యానము.

బకవైరి— బకాసురుని సంహరించినవాఁడు = కృష్ణుఁడు, భీముఁడు.

బజారి—వ్యభిచారము గలది = జారిణి.

బటువాలురాయఁడు— గుండ్రని యాయుధము (సుదర్శన చక్రము) గల ప్రభువు = విష్ణువు.

బటువుకైజోదు—గుండ్రని యాయుధముగల యోధుఁడు = విష్ణువు.

బటువుగుబ్బలి— గుండ్రని పర్వతము చక్రవాళశైలము.

బటువుగువ్వ, గుండ్రనిపక్షి— చక్రవాకము.

బటువు(గ్రదువు) (వాలు) (గత్తి) బిల్లవాలు— గుండ్రని యాయుధము = సుదర్శన చక్రము.

బటువుమల— గుండ్రని పర్వతము = చక్రవాళము.

బడగొండ—కొండవలెఁ బెద్దయాకారము గలిగి నీళ్ళుగల మేఘము.

బడిశము—చేఁపలను బట్టెడుగాలము.

బధిరుఁడు— బాధింపఁబడిన శ్రవణ సామర్థ్యము గలవాఁడు = చెవిటి.

బద్ధవైరము—హృదయమున గాఢముగా నాఁటియున్న పగ.

బమ్మ(తండ్రి) దేవర—బ్రహ్మదేవుని తండ్రి = శ్రీవిష్ణువు.

బయకారము— యౌవనమున బయలుపడు శృంగారచేష్టా విశేషము.

బరిగోల—ఏనుఁగు ప్రక్కలు పొడిచి బెదరించుటకై యలుఁగు గల వేణుదండము, నానా బాణము.

బర్హి—పింఛము గలది = నెమలి.

బర్హిర్ముఖులు—అగ్నియే ముఖముగాఁ గలవారు, అగ్నియందు హోమము చేయఁబడిన హవిరాదికమున సంతుష్టి నొందువారు = దేవతలు.

బర్హిశ్శుష్మ—దర్భలు బలముగాఁగల వాఁడు = అగ్ని.

బర్హిః కేశుఁడు—దర్భలు వెండ్రుకలుగాఁ గలవాఁడు = అగ్ని.

బలదేవుఁడు—బలముగల దేవుఁడు = బలరాముఁడు, వాయువు.

బలభద్రుఁడు— బలముచే శ్రేష్ఠుఁడైనవాఁడు = బలరాముఁడు.

బలరాముఁడు— బలముచే జనులను రమించువాఁడు = కృష్ణుని యన్న.

బలసూదనుఁడు, బలా(రాతి)రి—బలాసురుని సంహరించిన వాఁడు = ఇంద్రుఁడు.

బలి(సూదనుఁడు)ధ్వంసి—(ఇంద్ర రాజ్యమును బలాత్కారముగా గ్రహించిన) బలిచక్రవర్తియొక్క ప్రాభవమును ధ్వంసముచేసినవాఁడు=వామనరూప విష్ణువు.

బలి(భుక్కు)పుష్టము—బలిగా నివ్వఁబడిన యాహారముచేఁ బోషింపఁబడునది, బల్యన్నమును దినునది = కాకి.

బలిసద్మము— బలియొక్క నివాస గృహము = పాతాళము.

బలీవర్దము—కంఠమున వళులు (ముడుతలు) గలది = ఎద్దు.

బలుఁడు—బలము గలవాఁడు = బలరాముఁడు.

బలువంజమెకము— (బలువు + అంజ+మెకము.) చూ. ౬౧౦.

బలుహజ్జమెకము— పెద్దపాదముగల మృగము = ఏనుఁగు.

బల్తలమెకము—గొప్పతలగల మృగము = ఏనుఁగు.

బల్పాపఱేఁడు—పాముల పెద్దలకు సయితము ప్రభువైనవాఁడు = ఆదిశేషుఁడు.

బల్లిదుఁడు—బలము గలవాఁడు.

బహు(పాత్తు)పాదము — చాల యూడలు గలది=మఱ్ఱిచెట్టు.

బహురూపము—రంగు రంగుల రూపము ధరించునది = ఊసరవెల్లి.

బహురోమ—ఎక్కువ రోమములు (వెండ్రుకలు) కలది = మేక.

బాంధకినేయుఁడు—బంధకి (ఱంకులాడి) యొక్క కొడుకు.

బాకినో(టి)కు మెకము — విశాలమైన నోరుగల మృగము = సింహము.

బాడబము— ఆఁడుగుఱ్ఱము ముఖమున నుండునది = బడబాగ్ని.

బాణాసనము— బాణముల కాసనమైనది = విల్లు.

బాదరాయణసంబంధము— ఇరువురకు రేఁగుచెట్టు కలిగియుండుటవలననైన సంబంధము మాత్రమే.

బాదరా (యణి) యణుఁడు—బదరీవనము నివాసముగాఁ గలవాఁడు = వ్యాసముని.

బాబాతౌతు—గఱ్ఱము వాహనముగాఁ గలవాఁడు = కుబేరుఁడు.

బారమేనులపోఁడ / బారరూపుల వేలుపు } చూ. ద్వాదశాత్ముఁడు.

బాల—పదునాఱేండ్లకు లోఁబడిన పడుచు.

బాలభృత్యుఁడు—బాల్యము నుండియు సేవచేయుచు జీవించుచుండెడివాఁడు.

బాలాధ్యాపకుఁడు— బాలురకుఁ జదువుచెప్పెడు నుపాధ్యాయుఁడు.

బాలిశుఁడు—తనకుఁజేసిన సన్మానమును జెఱచుకొనువాఁడు = బుద్ధిహీనుఁడు.

బాల్యము—బాలభావము (పదునాఱేండ్లకులోఁబడిన వయస్సు.)

బాసవాలు—చూ. గీర్వాణుఁడు.

బాసవాల్గొర—(శాపాలాప సమర్థమయిన వాక్కు ఆయుధముగాఁగల) దేవతలకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

బాసికము — కూర్గులు వివాహసమయమున వధూవరులకు ఫాలములఁ గట్టెడు హారవిశేషము.

బాహుజుఁడు—బ్రహ్మయొక్క బాహువులనుండి బుట్టినవాఁడు = క్షత్రియుఁడు.

బాహులేయుఁడు— షట్కృత్తికల కుమారుఁడు = కుమారస్వామి.

బాహాబాహవి— బాహువులతోఁ బరస్పరము పెనఁగులాడుచుఁ జేసెడి ద్వంద్వయుద్ధము.

బింబాధర / బింబోష్ఠ } దొండపండువంటి పెదవిఁ గల యాఁడుది.

బిందువాసరము—స్త్రీ గర్భిణి యైన దినము.

బిడాలము— మూషికములను భేదించునది = పిల్లి.

బిడౌజుఁడు— వ్యాపనశీలమయిన శత్రువులను (భేదించు) ఆక్రమింపఁ జేయునట్టి తేజముగలవాఁడు = ఇంద్రుఁడు.

బిత్తరిజింకతాలుపు—సొగసైన లేడిని ధరించినవాఁడు = చంద్రుఁడు.

బిబ్బికడుపువేలుపు—చూ. లంబో దరుఁడు.

బి(బ్బో)బ్బోకము—నాయిక గర్వా తిశయముచే నిష్టవస్తువునందు సైతము చూపెడు తిరస్కారభావము.

బిలేశయము—రంధ్రమున నిద్రించు నది = సర్పము, ఎలుక మొ.

బిసప్రసూనము, బిసరుహము } తామర తీఁగను బుట్టినది = పద్మము

బుజముపుట్టువు—బ్రహ్మదేవుని భుజ మునఁ బుట్టినవాఁడు = క్షత్రియుఁడు.

బుడతనెలతా(ల్పు)లుపు— బాల చంద్రుని శిరమున ధరించినవాఁడు = శివుఁడు.

బుధుఁడు—అన్నిఁటి నెఱిఁగినవాఁడు = విద్వాంసుఁడు.

బువ్వము— వివాహమున బంధువులం దఱు నేక పంక్తిలోఁ గూర్చుండి వేడుకగా భుజించుట.

బుసకొట్టుపుట్టువు— పుట్టిన తోడనే బుసకొట్ట నేర్చిన జంతువు=త్రాఁచు.

బూచుల(ఱేడు)మెకిమీఁదు,బూత నాదుఁడు—భూతములకుఁ బ్రభువు = శివుఁడు.

బూడిదపన్ను—శ్మశానమున శవదహన సంస్కారాధికార మిచ్చినందులకైన పన్ను.

బృందారకులు— మంచి సమూహము కలవారు = దేవతలు.

బృందావనము—కృష్ణుఁడు నివసించెడు తులసితోఁట.

బృంహితము— ఏనుఁగు యొక్క ఘీంకారము.

బృహద్భాన(ఁడు)వు— అధిక ములయిన కిరణములుకలవాఁడు = అగ్ని.

బేసికంటి—విషమ సంఖ్యగల (మూఁడు) కన్నులు కలవాఁడు = శివుఁడు.

బేసికంటిమామ—శివునకు మామ యైనవాఁడు = దక్షుఁడు, హిమ వంతుఁడు.

బేసికంటివేల్పు, బేసికన్నుసామి— విషమ సంఖ్యగల (మూఁడు) కన్నులు గల దేవుఁడు = శివుఁడు.

బేసికైదువుజోదు—విషమ సంఖ్యగల (5) యాయుధములు గల వీరుఁడు = మన్మథుఁడు.

బొందడీఁడు—కవచము తొడిగినవాఁడు.

బొక్కలాఁడు—పుట్టలయందలి రంధ్ర ములలో నివసించువాఁడు = సర్పము.

బొచ్చుమెకము— శరీర మంతయుఁ బెచ్చుగాఁ బెరిఁగిన వెండ్రుకలు గల మృగము = భల్లూకము.

బొజ్జ(దేవర) వేలుపు— గొప్పబొజ్జగల వాఁడు = వినాయకుఁడు.

బొట్టెకోల— తామరమొగ్గవంటి మొనగల బాణవిశేషము.

బొడ్డనబావి— నడుమ పిల్లనూయి గల కోనేఱు.

బొబ్బమెకము— గర్జనము చేయు మృగము = సింహము.

బొమముడి— కోపముచేఁ గలిగెడు కనుబొమల ముడి.

బొమ్మరిల్లు— బాలికలాటలాడుకొనుటకై బొమ్మల నంచుకొనెడు చిన్నయిల్లు.

బొమ్మలాట— తెరవెనుక పాత్రానుకూలముగ స్త్రీ పురుషులు పాడుచు బొమ్మలచే నాడించెడు నాటక విశేషము.

బొరియచూలి— పుట్టనుండి పుట్టినవాఁడు = వాల్మీకి.

బొల్లిగ(గ్ర)ద్ద, బొల్లినెమ్మొగము పిట్ట— తెల్లనిగద్ద = గరుత్మంతుఁడు.

బొల్లిమోరమెకము— తెల్లనై దీర్ఘమగు ముఖముగల వ్యాగము=ఎలుఁగు.

బోధకరుఁడు— ప్రాతఃకాలమున రాజులను నిద్రనుండి మేల్కొలిపెడివాఁడు = వైతాళికుఁడు.

బోధిద్రుమము— జ్ఞానమును గలుగఁజేసెడి వృక్షము (గౌతమబుద్ధున కీ వృక్షము క్రిందనే తత్త్వజ్ఞానము కలిగెను) = రావిచెట్టు.

(26)

బోరపాకుఁడు— చూ. ఉరగము.

బ్రద్దలవారు— పేము బెత్తముల నుధరించినవారు=రాజకింకరులు.

బ్రధ్నుఁడు— తన తేజస్సుచే నితర తేజస్సులను బంధించువాఁడు = సూర్యుఁడు.

బ్రహ్మచర్యము- బ్రహ్మచారి యొక్క ఆశ్రమవిశేషము.

బ్రహ్మచారి-(వేదాధ్యయనవ్రతమున) బ్రహ్మయందు ఆచరించువాఁడు= వడుగైనవాఁడు.

బ్రహ్మణ్యుఁడు— వేదాధ్యయనము చేసినవాఁడు, బ్రాహ్మణుని యందు భక్తి గలవాఁడు.

బ్రహ్మనాభుఁడు- బ్రహ్మ తన నాభి యందు జన్మించినవాఁడు = విష్ణువు.

బ్రహ్మపుత్త్రుఁడు— బ్రహ్మయొక్క మానసమునఁ బుట్టినవాఁడు = నారదుఁడు, సనకుఁడు, సనందుఁడు మొ.

బ్రహ్మబంధువు—అబద్ధపు సాక్ష్యము పలికినందున దూషింపఁబడినవాఁడు, కర్మహీనుఁడగు బ్రాహ్మణుఁడు.

బ్రహ్మబిందువు—వేదాధ్యయన కాలమున నోటినుండి రాలెడు తుంపర.

బ్రహ్మమీమాంస— వేదాంత

శాస్త్రము నందలి బ్రహ్మ పదార్థ విచారణము.

బ్రహ్మమేఖలము— బ్రహ్మచారులు ముంజిగా (ముంజదర్భల మొలత్రాడు) నుపయోగించెడు తృణవిశేషము.

బ్రహ్మయజ్ఞము—పితృతర్పణమునకుఁ బూర్వమునఁ జేసెడి వైదికకర్మ విశేషము.

బ్రహ్మరథము—పరమపదించిన సన్న్యాసులను గొనిపోయెడు వాహన విశేషము, బ్రహ్మవాహనము=హంస.

బ్రహ్మలిపి— బ్రహ్మచే వ్రాయఁబడి సులభముగాఁ దెలియని కపాలముమీది వ్రాఁత.

బ్రహ్మవర్చసము—సదాచారాధ్యయన సమృద్ధి. వేదాధ్యయనాదికము వలన జనించిన తేజస్సు.

బ్రహ్మసాయుజ్యము—పరబ్రహ్మమున లీనమగుట, బ్రహ్మభావము నొందుట.

బ్రహ్మసువు— బ్రహ్మనుగాని, తపస్సునుగాని చలింపఁజేయువాఁడు = మన్మథుఁడు.

బ్రహ్మస్తేయము— అన్యాయముగా బ్రహ్మవిద్యను సంపాదించుట.

బ్రహ్మహత్య—బ్రాహ్మణుని చంపుట, దానివలనఁ బాపము.

బ్రహ్మాంజలి—వేదాధ్యయన కాలము నందలి నమస్కారము.

బ్రహ్మాండము—భూగోళ ఖగోళాది.

బ్రహ్మాణి—చూ. బ్రాహ్మి.

బ్రహ్మారణ్యము — వేదాధ్యయన యోగ్యభూమి, మహారణ్యము.

బ్రహ్మావర్తము—ఢిల్లీకి వాయవ్య భాగమున నుండెడు దేశము.

బ్రహ్మాసనము— భగవద్ధ్యాన సాధన భూతమైన యాసనవిశేషము.

బ్రాహ్మణకుఁడు—అయోగ్య బ్రాహ్మణుఁడు.

బ్రాహ్మణబ్రువుఁడు— జాతిమాత్రోపజీవియగు బ్రాహ్మణుఁడు = కపట ద్విజుఁడు.

బ్రాహ్మణము— బ్రాహ్మణుల సమూహము, వేదభాగము.

బ్రాహ్మణాయనుఁడు—పండితుఁడును, సదాచార సంపన్నుఁడు నగునట్టి వంశకర్తవలనఁ బుట్టిన బ్రాహ్మణుఁడు.

బ్రాహ్మణుఁడు—బ్రహ్మ (శిరమునందు) కులమునఁ బుట్టినవాఁడు.

బ్రాహ్మణ్యము— బ్రాహ్మణుల సమూహము, బ్రాహ్మణ కర్మము, బ్రాహ్మణ భావము.

బ్రాహ్మము—పెద్దవ్రేలి మొదట నుండెడు బ్రహ్మతీర్థము.

బ్రాహ్మి— బ్రహ్మయొక్క భార్య = సరస్వతి.

భక్తవత్సలుఁడు— భక్తులయందు దయ గలవాఁడు = దేవుఁడు.

భగందరము— మర్మస్థానము నందలి వ్రణము.

భగవంతుఁడు—ఐశ్వర్యాదికము గలుగుటచేఁ బూజ్యుఁడైనవాఁడు=విష్ణువు, శివుఁడు.

భగవద్గీత-అర్జునునకు శ్రీకృష్ణునిరూపు గల భగవంతుఁడుపదేశించిన వేదాంత సారముగల గ్రంథము.

భగిని—తోఁడఁబుట్టినది = సోదరి.

భగినీయుఁడు—చూ. భాగినేయుఁడు.

భట్టారకుఁడు— భటులచే యుదము నుండి తరించువాఁడు, శత్రురాజు, భటులను పీడించువాఁడు.

భగుఁడు— జనులచే భజియింపఁబడు వాఁడు = సూర్యుఁడు.

భట్టిని—బ్రాహ్మణుని భార్య, నాట్య పరిభాషయందు రాజభార్య.

భద్రకుంభము—రాజ ద్వారమున నుండు జలపూరితమైన హేమకలశము.

భద్రాసనము—మణిస్థాపితమగు రాజా స్థాన పీఠము.

భరద్వాజము— భరద్వాజులచే సృజింపఁబడినది = ఏట్రింత.

భర్గుఁడు—కాముఁడు, కాలుఁడు మొ. వారిని సంహరించినవాఁడు = శివుఁడు.

భర్త—భరించువాఁడు = మగఁడు.

భర్తృమతి—జీవించియున్న మగఁడు గలది = పుణ్యస్త్రీ.

భర్మము— ఆభరణరూపమున భరింపఁ బడునది = బంగారము.

భవనము—బాలురు దీనియందు పుట్టుదురు = ఇల్లు.

భవాని—భవుని భార్య = పార్వతి.

భవుఁడు— సమస్తము దా నే యగు వాఁడు = శివుఁడు.

భవ్య—పూజించినవారికి వాంఛితముల నిచ్చునది = పార్వతి.

భషకము—మొఱుగునది = కుక్క.

భస్మాంగుఁడు—బూడిద పూసికొన్న శరీరము కలవాఁడు = శివుఁడు.

భాగవతము— కృష్ణరూప భగవంతుని చరితముగల గొప్ప పురాణగ్రంథము.

భాగవతుఁడు— భగవంతుని యందు భక్తి కలవాఁడు.

భాగినేయుఁడు— తోఁడఁబుట్టిన దాని కొడుకు = మేనల్లుఁడు.

భాగీరథి— భగీరథునిచే భూలోకము నకుఁ గొనిరాఁబడినది = గంగ. (సగర పుత్త్రులు యజ్ఞాశ్వము నన్వేషించుచుఁ బాతాళమున సమాధియున్న కపిల మహర్షిపైఁ జౌర్యారోపణము చేసి యాతని కోపానలమున దగ్ధులైరి. ఉత్తమలోక ప్రాప్తికై వారి యస్థుల మీఁద మనుమఁడగు భగీరథుఁడు గొప్ప

తపముచేసి గంగను ప్రవహింపఁజేసె నని పురాణప్రసిద్ధి)

భాజ్యము—భాగింపఁదగినది = భాగము.

భాను(వు)ఁడు— ప్రకాశించువాఁడు = సూర్యుఁడు.

భానుమంతుఁడు — కిరణములు కల వాఁడు = సూర్యుఁడు.

భానువులు— ధర్మునకుఁ దన పది మంది భార్యలలో నొకతెయగుభానవు నందు జన్మించినవారు.

భానేయుఁడు— కిరణములు కలవాఁడు = సూర్యుఁడు.

భామిని—క్రీడాసమయమునఁ బ్రణయ కోపమును జూపెడు స్త్రీవిశేషము.

భారతము— భరతవంశీయుల చరిత్ర ములఁ జెప్పెడు నితిహాసము.

భారతి —ఈలోకమునకు భరతమునిచేఁ దేఁబడినది = సరస్వతి.

భారూపము—ప్రకాశస్వరూపము = ఆత్మ, పరబ్రహ్మము.

భార్గవుఁడు— భృగుమహర్షి యొక్క కుమారుఁడు = శుక్రుఁడు, పరశు రాముఁడు.

భార్య—భరింపఁబడినది = పెండ్లాము.

భావజుఁడు— సంకల్పముచేఁ బుట్టు వాఁడు = మన్మథుఁడు.

భావము— నిర్వికారాత్మకమైన చిత్త మునఁ గలుగు ప్రథమవికారము.

భావుకుఁడు—తోడఁబుట్టినదాని మగఁడు = బావమఱఁది.

భాస్కరుఁడు — కాంతి కలుగఁజేయు వాఁడు = సూర్యుఁడు.

భాస్వ(ంతుఁడు)రుఁడు—ప్రకాశించు వాఁడు = సూర్యుఁడు.

భిండి(పాలము)(వాలము)హాలము- ఇనుపయలుగుల ఆయుధవిశేషము.

భిక్షుకుఁడు—తిరిపె మెత్తుకొని జీవిం చెడు సన్న్యాసి.

భిషక్పాశుఁడు—వైద్యము చక్కఁగాఁ దెలియనివాఁడు.

భీముఁడు— భయమును గలుగఁజేయు వాఁడు=శివుఁడు, ధర్మజునితమ్ముఁడు, ఒక రాజు.

భీరువు— భయస్వభావము గల స్త్రీ విశేషము.

భీష్మసువు—భీష్మునిఁగన్నతల్లి = గంగ.

భీష్ముఁడు— సత్యవతి (యోజనగంధి యొక్క తండ్రి దాశరాజు పనుమని ప్రకారము, తన తండ్రియగు శంతనుని వివాహము నిమిత్తము పెండ్లియాడనని భీష్మించినవాఁడు.

భుజంగ(భుజగ)భుజుఁడు— పాము లను దినునది = నెమలి; పాములను దినువాఁడు = గరుత్మంతుఁడు.

భుజంగభూషణుఁడు— సర్పము లలంకారముగాఁ గలవాఁడు=శివుఁడు

భుజంగమము, భుజ(ం)గము— భుజముచేఁ బ్రాఁకునది = సర్పము.

భుజగాశనుఁడు— సర్పములను దిను వాఁడు = గరుడుఁడు - నెమలి.

భువనేశ్వరి—ప్రపంచమునకు నధికారిణి = పార్వతి.

భూకంపము— అగ్నిపర్వతాదుల వలన గలిగిన భూమియొక్క సంచలనము.

భూ(రుహము)జము— భూమియందుఁ బుట్టునది = వృక్షము. (భూరుహము, భూభువు, భూమీరుహము, భూమిజాతము.)

భూజాని— భూమిజాయ (భార్య) గాఁ గలవాఁడు = విష్ణువు, రాజు.

భూతదయ—సమస్త జీవులయందును జూపఁదగిన ప్రేమాతిశయము.

భూతదర్పణము—చిన్న వస్తువును పెద్దదిగాఁ గాన్పింపఁ జేయు యంత్రము.

భూతయజ్ఞము— వైశ్వదేవానుష్ఠానమునకుఁ బిమ్మట బహిర్దేశమున భూతతృప్తికై యీఁబడు బలిదానము.

భూతవైద్యుఁడు—పిశాచములను బాఁదోలువాఁడు.

భూతాత్ముఁడు—సమస్త జీవులకు నాత్మయైనవాఁడు = బ్రహ్మ.

భూతేశుఁడు, భూతపతి— పిశాచగణములకుఁ, బ్రమథగణముల నధిపతి, = శివుఁడు.

భూదారణము —భూమిని బ్రక్కలించునది = నాఁగేలు.

భూదారము—భూమిని ద్రవ్వునది పంది.

భూదేవుఁడు—బ్రహ్మవర్చసము చేత వెలుఁగుచు భూమియందు దేవతలవలె నుండువాఁడు = బ్రాహ్మణుఁడు.

భూధరము—భూమిని ధరించునది = పర్వతము.

భూ(పతి)(పాలు)(మీశు)ఁడు— భూమిని బరిపాలించువాఁడు = రాజు.

భూభుజుఁడు— భూమి ననుభవించు వాఁడు = రాజు.

భూభృత్తు—భూమిని భరించు (నది వాఁడు = కొండ, రాజు.

భూమిజ—చూ. నేలచూలి.

భూమిజుఁడు— (కు ముఁడు) విష్ణువంశమున భూమికిఁ బుట్టినవాఁడు = అంగారకుఁడు, నరకాసురుఁడు

భూమిస్పృశుఁడు— పొలములను జక్కఁజేయుటకు నాఁగేలు మొదలగు వానిచే భూమిని తాఁకువాఁడు.

భూరి(మాయము)మాయువు— ఎక్కువమోసము చేయునది = నక్క.

భూవరుఁడు—భూమికి భర్తయైన వాఁడు.

భూసురుఁడు—చూ. భూదేవుఁడు.

భృంగము—నీలిమను భరించునది = తుమ్మెద.

భృంగరోలము—తుమ్మెదవలె ధ్వనించునది = కందురీఁగ.

భృతాధ్యాపకుఁడు—జీతము తీసికొని విద్య నేర్పువాఁడు.

భృతి (భుక్తి) భుజుఁడు — కూలి చేసికొని జీవించువాఁడు = నౌకరు.

భ్రూణము—తల్లికడుపులోఁ దిరుగునది = గర్భములోని పిండము.

భేకము—సర్పమువలన భీతి నొందునది = కప్ప.

భేషజాంగము—మందు పుచ్చుకొనిన పిదప తీసికొనునది = అనుపానము.

భైరవి— భైరవుని భార్య = పార్వతి. (దుర్గాదేవి మహిషాసుర శుంభ నిశుంభాదులను సంహరించియు నుగ్రాకారమును వీడకుండియున్నతఱి, బ్రహ్మాదులు భయపడి శివుని ప్రార్థింపఁగా భైరవావతారము ([illegible])న నామెను శాంతింపఁజేసెను.)

భైషజ్యము—దీనిచేఁ జికిత్స చేయుదురు = ఔషధము.

భోగదేహము — మరణానంతరమున జీవుఁడు సుఖ దుఃఖానుభవార్థము గ్రహించెడు యాతనా శరీరమగు సూక్ష్మదేహము.

భోగాశి— సర్పములఁ దినువాఁడు = గరుత్మంతుఁడు (నెమలి).

భోగాశిపత్త్రి—గరుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడు = విష్ణువు.

భోగి(భోగవతి)—సర్పశరీరము గలది = పాము, భోగముకలవాఁడు = రాజు, అనుభవశాలియగు పురుషుఁడు.

భోగిని— సంభోగము కలది = పట్టమహిషికంటె భిన్నురాలు.

భౌతికము— పంచభూతాత్మక మైనది = శరీరము.

భ్రకుంశుఁడు— స్త్రీవేషము వేసి నటించెడి పురుషుఁడు.

భ్రమర(క)ము— తిరుగుచుండునది = తుమ్మెద.

భ్రాతృ(జుఁడు)వ్యుఁడు, భ్రాత్రీ(భ్రాత్రే)యుఁడు —తోడఁబుట్టినవాని కొడుకు

భ్రూకుం(సు)శుఁడు—చూ. భ్రకుంశుఁడు.

భ్రూణహత్య—గర్భమును బోఁగొట్టుట. (భ్రూణము = తల్లిచే భరింపఁబడునది = శిశువు.)

మంగళాచరణము—గ్రంథారంభమున నిర్విఘ్న పరిసమాప్తికై కవిచేయు ప్రార్థనాదికము.

మంగళాశాసనము— వైష్ణవ పరిభాషయందు ఆశీర్వాదము = దీవన.

మంచు(గుబ్బలి)కొండ— హిమవంతము.

మంచుమలల్లుఁడు— హిమవంతుని యల్లుఁడు = శివుఁడు.

మంజిష్ఠారాగము—లోపలను బైటను సమానముగాఁ గనపడు వెడు గాఢానురాగము.

మంటితిండి—మన్ను తినునది = తేలు.

మండలే(శ్వరు-శు)ఁడు— అధీశ్వర సార్వభౌములకంటె గొప్పరాజు.

మం(దు-దూ)కము— తటాకాదుల యందు శోభిల్లునది = కప్ప.

మండోదరి—పలుచని యుదరము (కడుపు) గలది = రావణుని భార్య.

మంత్రసాని— సుఖ ప్రసవోపాయమునుజేయు చికిత్సకురాలు.

మంత్రి—కార్యముసఁ గార్యాలోచనము (మంత్రము) కలవాఁడు.

మంథ(ర)జము—కవ్వమువలనఁ బుట్టునది = వెన్న.

మంథా(చలము)ద్రి— (క్షీరసాగరమును దేవదానవులు) మథించుటకుఁ గవ్వముగా గ్రహించిన పర్వతము = మంథరపర్వతము.

మంథానము—చిలుకునది = కవ్వము.

మందాకిని—మందముగా వక్రగమనముతోఁ బ్రవహించునది = స్వర్గంగ.

మకరందము—దీనిచే పుష్ప మలంకరింపఁబడును = పూఁదేనె.

మకరకంఠి–నడుమ మొసలిముఖమేర్పడఁ జేసిన పురుషుల కంఠాభరణవిశేషము.

మకరకుండలము—మొసలి యాకారము గల కర్ణభూషావిశేషము.

మకరతోరణము— మొసలిరూపముగాఁ దయారుచేసిన తోరణము.

మకరధ్వజుఁడు—మొసలి జెండాగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

మకరాంకుఁడు— మొసలిధ్వజచిహ్నముగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

మకరాలయము— మొసలికి నివాసయోగ్యమగు స్థలము = సముద్రము.

మకరికాపత్రము— స్త్రీలకుఁ గపోలాది స్థలములందు లత్తుకతో వ్రాయు మకరాది రేఖావిశేషము.

మక్షిక—అపరిశుద్ధమగుటచే దీనియెడఁ గోపింతురు = ఈఁగ.

మఖ(వంతు-వు)ఁడు— యజ్ఞములందుఁ బూజింపఁబడువాఁడు = ఇంద్రుఁడు.

మ(మా)గధుఁడు— వంశావళిని జదువువాఁడు.

మగనాలు—మగఁడు జీవించియున్నయాఁడుది = పుణ్యస్త్రీ.

మగ(మానికపు)(టాలి) వాలు— వజ్రమయమైన ఆయుధము.

మఘ(వంతు-వు)ఁడు— చూ. మఖవుఁడు.

మఘోని—ఇంద్రుని భార్య = శచీదేవి.

మచ్చెకంటి—చేఁపలవంటి కన్నులుగల యాఁడుది.

మడికాసు (గట్టు)మల— వెండి కొండ = కైలాసము.

మడికాసుమలఱేఁడు—వెండికొండకుఁ బ్రభువైనవాఁడు = శివుఁడు.

మణి(కూజిత)(త)ము— సంభోగ కాలము నందలి గళరవము.

మణిప్రవాళము— వేఱువేఱుభాషల లోని పదములసాంకర్యము వలన నేర్పడినభాష, 2 భాషలు కలసినకవిత్వము.

మతంగజము—మతంగుఁడను ఋషి వలనఁ బుట్టినది = ఏనుఁగు.

మత్కుణుఁడు—గడ్డమును, మీసమును లేని మగవాఁడు.

మత్తకాశి(ని)— మదము లేకయే మదము కలదివలెఁ బ్రకాశించు స్త్రీ విశేషము.

మత్స్యబంధనము— చేఁపలను బంధించునది = గాలము, వల.

మత్స్యము—మాంసము హరించు నిచ్ఛచే హర్షించునది = చేఁప.

మత్స్యవేధిని—చేఁపలను భేదించునది = గాలము.

మదకలము— మత్తుచే వ్యక్తముకాని మాటలు కలది = మదపుటేనుఁగు.

మదనపత్రిక—విరహవేదనాదులను దెలియఁజేయుచుఁ బ్రియునకు వ్రాసి కొన్న ప్రణయలేఖ.

మదనుఁడు—మదింపఁజేయువాఁడు = మన్మథుఁడు.

మదహస్తి—చూ. మదకలము.

మదావళము—మదముగలది=ఏనుఁగు.

మదికొలకుపులుఁగు— మానససరస్సునందుండుపక్షి = హంస.

మ(ద్యము)దిర—త్రాగినచో మదింపఁ జేయునది = కల్లు.

మదోత్కటము—మదముచే మించినది = ఏనుఁగు.

మధుకరము—పూఁదేనెను జేయునది = తుమ్మెద.

మధుపము—మధువు (తేనె)ను పానము చేయునది = తుమ్మెద.

మధుపర్కము—1. పెరుగుతోఁ గలసిన తేనె, 2. పెండ్లిలో వధూవరుల కిచ్చెడు వస్త్రములు.

మధుప్రియుఁడు— మద్యమును ప్రేమించువాఁడు = బలరాముఁడు.

మధుమక్షిక—తేనెయందాసక్తమైన యీఁగ = తేనెటీఁగ.

మధురిపు(వు)ఁడు—మధువను రాక్షసునకు శత్రువు = విష్ణువు.

మధులి (ట్టు) హము—పూఁదేనెను ఆస్వాదించునది = తుమ్మెద.

మధువైరి—చూ. మధురిపువు.

మధువ్రతము—పూఁదేనెను మాత్రము త్రాగెడు వ్రతము కలది = తుమ్మెద.

మధుసూదనుఁడు—మధువనెడి రాక్షసుని సంహరించినవాఁడు = విష్ణువు.

మధూచ్ఛిష్టము— తేనెచేత విడువఁబడినది = మైనము.

మణికర్ణిక- శివుని దక్షిణ కర్ణభూషణము పడిన సరోవరము. (విష్ణువు తన చక్రమున సరస్సుగాఁ దొలిచి యచ్చట శివునికొఱకుఁ దపమాచరించెను. శివుఁడు ప్రత్యక్షమై ఆ సరోవరమును గంగానదితోఁ దుల్యమగు పుణ్యక్షేత్రమగునట్లు వరమిచ్చెను.)

మనసిజుఁడు— మనస్సున నుదయించువాఁడు = మన్మథుఁడు.

మనఃప్రభువుఁడు, మనో (జుఁడు) (జాతుఁడు) భవుఁడు— చూ. పై.

మనీష— అన్నిఁటిని దెలిసికొనునది = బుద్ధి.

మనీషి-బుద్ధికలవాఁడు = విద్వాంసుఁడు, పండితుఁడు.

మనుజా (శనుఁడు)శి— మనుష్యుల ఆహారముగాఁగలవాఁడు=రాక్షసుఁడు.

మను (ష్యుఁడు) జుఁడు—మనువువలనఁ బుట్టినవాఁడు = నరుఁడు.

మనుజేంద్రుఁడు (నాథుఁడు) శ్వరుఁడు, మనుజ (పాలుఁడు) పాలకుఁడు— చూ. నరేంద్రుఁడు.

మనుయుగము— మనువు యొక్క కాలము 31,10,40,000 సంll రములు.

మను (మన) వృత్తి—అనాథలకు జీవనార్థమిచ్చెడు ద్రవ్యము.

మనోవృత్తి, మనోవర్తి—చూ. పై.

మనుష్యధర్ముఁడు— మనుష్యుల యాచారమువంటి యాచారము కలవాఁడు = కుబేరుఁడు.

మనో (జీవుఁడు) (భవుఁడు)జ్ఞవసుఁడు—తీక్ష్ణమైన బుద్ధికలవాఁడు.

మన్నుఱేఁడు— చూ. భూపాలుఁడు.

మన్మథుఁడు— బుద్ధిని గలఁతపెట్టువాఁడు = రతీదేవిభర్త.

మన్మనము— భార్యాభర్తల సంభోగకాలమున దేశభాషతో మెల్లగాఁ జెప్పుకొను రహస్యము.

మన్వంతరము— 71 దివ్యయుగములు (మనుకాల పరిమాణము)

మబ్బుత్రోవ— మేఘములకు మార్గమైనది = ఆకాశము.

మబ్బు (పగ) విప్పు— మేఘునకు శత్రువు = వాయువు.

మబ్బుపూవు—చూ. మేఘపుష్పము.

మబ్బు మే (లత) పరి, మబ్బు పగ— మేఘమునపహరించువాఁడు=వాయువు

మబ్బురూపరి— మేఘ రూపమువంటి రూపముకలది = ఐరావతము.

మబ్బు రౌ (రవు) తు— మేఘము వాహనముగాఁ గలవాఁడు=ఇంద్రుఁడు.

మయి (మై) సున్నవజీరు— శరీరములేని శూరుఁడు = మన్మథుఁడు.

మయూరకము— నెమలి రంగువంటి రంగుకలది = మైలుతుత్తము.

మయూరచటకము—నెమలి యాకారముగల చిన్నజంతువు = కోడి.

మయూరము— పాములను హింసించునది = నెమలి.

మరుగొంగ— మన్మథునికి శత్రువు = శివుఁడు.

మరుతేజి— మన్మథునకు వాహనమైనది = చిలుక.

మరుతేరు— మన్మథునకు రథమైనవాఁడు = వాయువు.

మరుత్వంతుఁడు—మరుత్తులు (దేవతలు) కలవాఁడు = ఇంద్రుఁడు.

మరుత్వంతులు— ధర్మునకుఁగల పది మంది భార్యలలో నొకతెయగు మరుత్వతికిఁ జన్మించినవారు.

మరుత్సఖుఁడు— వాయుదేవుని మిత్రుఁడు = అగ్ని.

మరునయ్య—మన్మథుని తండ్రి = శ్రీవిష్ణువు.

మరునయ్యతేజి —విష్ణుని వాహనము= గరుడుఁడు.

మరునల్లె—మన్మథుని యల్లెత్రాడు (వింటినారి) అయినది = తుమ్మెద.

మరునిడాలు— మన్మథుని ధ్వజము = చేఁప, మొసలి.

మరుమరీచికాన్యాయము— ఎడారిలో నెండమావులు నీళ్ళవలెఁ గాన్పించి యెంతదూరము పోయినను అట్లే యుండునట్టి రీతి.

మరుమామ— మన్మథునియొక్క మేనమామ = చంద్రుఁడు.

మర్కటము— చాటునపుడు కొమ్మల సందునఁబడి చచ్చునది = కోఁతి.

మర్కటకము— తన నాభినుండి వచ్చెడు నూలుపట్టుకొని మర్కటమువలె నెక్కునది = సాలెపురుగు.

మర్త్యుఁడు— మృతి నొందువాఁడు భూలోకమునఁబుట్టినవాఁడు=నరుఁడు.

మల (దాయ) (సూడు) గొంగ— పర్వతములకుశత్రువు = (పర్వతములు పట్టణములపై వ్రాలి హింసచేయుచుండఁగా వాని రెక్కలను వజ్రాయుధముచే నఱికినవాఁడు = ఇంద్రుఁడు.)

మల (మన్కి) మనికి— కొండలు. నివాసస్థానముగాఁగలది = కోఁతి.

మలయజము — మలయ పర్వతమునఁ బుట్టునది = చందనము.

మల్లికాక్షము—1. తెల్లని కన్నులు గల గుఱ్ఱము, 2. మలినమైన ముక్కు కాళ్ళుగల తెల్లహంస.

మస్కరి— కామ్యకర్మములను ప్రతిషేధించు స్వభావము కలవాఁడు = సన్న్యాసి

మస్తిష్కము—శిరస్సును బొందియుండునది = మెదడు.

మహంతు—దేవ స్థానములకు ధర్మకర్తృత్వము జరిగించు బైరాగి.

మహాంగము—గొప్ప యవయవములు గలది = ఒంటె.

మహా(గ్రీవి)గ్రీవము—పొడుగైన కంఠము గలది = ఒంటె.

మహాదేవుఁడు—దేవులలో శ్రేష్ఠుఁడు = శివుఁడు.

మహానటుఁడు—నటులలో శ్రేష్ఠుఁడు = శివుఁడు. (కాళికాలయమున గజచర్మాగ్రలను ధరించి, డమరుకమును గొలఁబూని, శివుఁడు తాండవము చేయునని పురాణ ప్రసిద్ధి)

మహానసము— అధికమైన భోజనోపకరణములు కలది = వంటయిల్లు.

మహాబలుఁడు— మిగుల బలము కలవాఁడు = వాయుదేవుఁడు.

మహాభాష్యము—పాణినీయ వ్యాకరణ సూత్రములకు విపుల వ్యాఖ్యానముగల ప్రమాణగ్రంథము.

మహామదము— ఎక్కువ మదము గలది = ఏనుఁగు

మహామదము—గొప్ప శరీరము గల జంతువు = ఏనుఁగు.

మహాయుగము— 43,20,200 సంవత్సరములు గల కృత, త్రేతా, ద్వాపర కలియుగముల కాలపరిమాణము.

మహారజతము—తామ్రము మొదలగునవి దీనిచే నెక్కువగా రంజింపఁబడును = బంగారము.

మహారథుఁడు—11,000 విలుకాండ్రతోఁ బోరువాఁడు. (తన్నును సారథిని గుఱ్ఱములను గాపాడు కొనుచుఁ బోరెడి యోధుఁడు. గొప్ప రథము గలవాఁడు)

మహారౌరవము— మిగుల భయంకరమగు ధ్వనిగల నరకవిశేషము.

మహాలయము— భాద్రపద బహుళమునఁ జేయఁబడు పితృశ్రాద్ధము.

మహాశయుఁడు— ఘనమైన మనస్సు గలవాఁడు = సముద్రుఁడు మొ.

మహాసర్గము—మహా ప్రళయమునకు బిదపఁ గలుగు సృష్టి.

మహాసేనజనకుఁడు—కుమార స్వామి తండ్రి = శివుఁడు.

మహాసేనుఁడు—గొప్పసేన కలవాఁడు = కుమారస్వామి.

మహిషము— బలముగల దగుటవలన నాదరింపఁబడునది = కారెనుఁబోతు.

మహిషవాహనుఁడు— దున్నపోతు వాహనముగాఁ గలవాఁడు = యముఁడు.

మహీక్షితుఁడు—భూమి నధివసించిన వాఁడు = ప్రభువు.

మహీ(ధ) ధరము—భూధరము.

మహీ(జ) (జాత) రుహము— చూ. భూజము.

మహీ(శ్వరు) (శు) పాలుఁడు — చూ. భూపాలుఁడు.

మహీసుత—చూ. నేలచూలి.

మహోత్పలము— గొప్పదైన ఉత్పలము = పద్మము.

మాంసలుఁడు— శరీరమున నెక్కువ మాంసము కలవాఁడు=బలవంతుఁడు.

మాగధుఁడు— క్షత్త్రియస్త్రీకిని వైశ్యునకుఁ బుట్టినవాఁడు; వంశవీర్యాలను బొగడి జీవించువాఁడు; మగధ దేశమున నుండువాఁడు.

మాచకమ్మ— స్తనశూన్య వక్షమును, మీసమును గల యాఁడుది.

మాణవకుఁడు— మనువు యొక్క అల్పమయిన అపత్యము (పదునారేండ్లకు లోఁబడినవాఁడు = బాలుఁడు.

మాతంగము—చూ. మతంగజము.

మాతంగుఁడు—(గ్రామ మధ్యమును బొందనివాఁడు.) మతంగ సంతతిలోని వాఁడు = మాలవాఁడు.

మాతరిశ్వుఁడు— ఆకాశమున వృద్ధి నొందువాఁడు = వాయువు.

మాతలి—మతలుఁ డను వాని కుమారుఁడు, సారథి కర్మలయందుఁ గల సమస్త మతముల నెఱింగినవాఁడు.

మాతామహి—తల్లితల్లి.

మాతామహుఁడు— తల్లి తండ్రి = తాత.

మాతులపుత్త్రికము—మాతులము (ఉమ్మెత్త)నకుఁ బుట్టినది=ఉమ్మెత్త కాయ.

మాతు(లాని)లి—మాతులు (మేన మామ) ని పెండ్లాము.

మాతులుఁడు— తల్లితోడఁ బుట్టిన వాఁడు = మేనమామ.

మాతులేయుఁడు— మేనమామ కొడుకు.

మాతృష్వస— తల్లితోడఁబుట్టినది = పినతల్లి.

మాతృష్వ(సేయి)స్రీయ — తల్లి తోడఁ బుట్టినదాని కూఁతురు.

మాతృష్వసేయుఁడు— మాతృష్వస (పినతల్లి లేక పెదతల్లి) యొక్క కుమారుఁడు, మాతృష్వస్రీయుఁడు.)

మాధవకబళము—మధుకర సంబంధ

మగు ముద్ద, భగవంతుని స్మరించుకొనుచు అడిగెడు భిక్షాన్నపుముద్ద.

మాధవుఁడు—1. లక్ష్మీదేవికి భర్త, 2. యదుపుత్త్రుఁడగు మధువువంశమున నవతరించినవాఁడు, 3. శత్రువులను భయపెట్టువాఁడు = శ్రీ విష్ణువు.

మాధుకరము— పుష్పముల యందలి మధువును తుమ్మెదలు గ్రహించు రీతిగ గృహస్థుల యిండ్లకుఁ బోయి వారికి నొప్పి కలుగఁజేయక భిక్షుకులు భిక్షమును గొని జీవించుట = మధుకర వృత్తిచేఁ దెచ్చిన భిక్షము.

మా(నవు)(నుష్యు)ఁడు } చూ. మనుజుఁడు.
మనుష్యుఁడు— }

మానసౌక(స)ము— మానససరస్సు నివాస స్థానముగాఁ గలది = హంస.

మానిసిదిండి— మనుష్యులను దిను వాఁడు = రాక్షసుఁడు.

మానిసిరౌతు— మనుష్యుడు వాహనముగాఁగలవాఁడు=కుబేరుఁడు.

మానిసిఱేఁడు— మనుష్యులకుఁ బ్రభువు = రాజు.

మానిసిసింగము— చూ. నరసింహుఁడు.

మానుపాశి— మనుష్యులనుదినువాఁడు = రాక్షసుఁడు.

మామమామ— తనకు మామయైన సముద్రునకు మామ = శ్రీ విష్ణువు. (సముద్రుని కొమార్తెయగు లక్ష్మిని విష్ణువు పెండ్లాడెను. శ్రీవిష్ణుపాదోద్భవ యగు గంగకు సముద్రుఁడు భర్త యయ్యెను. ఈ విధముగా నిరువురును బరస్పరము మామలైరి.)

మామమామబావ— శ్రీ విష్ణుని బావమరఁది = చంద్రుఁడు. (భార్య యగు లక్ష్మికి సోదరుఁడు.)

మాయా(దేవీ)సుతుఁడు— శుద్ధోదనుఁడను రాజునకు భార్య యగు మాయాదేవికిఁ బుట్టినకొడుకు = బుద్ధుఁడు, సిద్ధార్థుఁడు.

మారకుఁడు (మారుఁడు)— విరహిజనులను మరణింపఁజేయువాఁడు = మన్మథుఁడు.

మార(క)జిత్తు—మన్మథుని జయించిన వాఁడు=1. శివుఁడు, 2. కామక్రోధాదులను జయించినవాఁడు, 3. స్కంధ, క్లేశ, మృత్యు, దేవపుత్త్ర మారములను జయించినవాఁడు = బుద్ధుఁడు.

మారుతి— వాయుదేవుని కుమారుఁడు = భీముఁడు, హనుమంతుఁడు.

మార్కండేయుఁడు— మృకండ మహర్షి కుమారుఁడు = శివభక్తుఁడు.

మార్జాలదాంపత్యము—సంభోగకాలమునఁ బొత్తులియక పరస్పరము కలహించు మార్జాలదంపతుల భావము.

మార్జాలము—మూషక గ్రహణముచే గృహమును శుద్ధిచేయునది = పిల్లి.

మా(ర్తం)ర్తాండుఁడు— మృకండుఁడనవాని కొడుకు. బ్రహ్మాండము మృతి (రెండు శకలములగుట) నొందిన

సపుడు పుట్టిన వాఁడు = సూర్యుని సుషుమ్న యను రశ్మియొక్క యవతారము.

మాలిమికాఁడు— ఓడనడుపు శాస్త్రము తెలిసినవాఁడు.

మావటీఁడు— ఏనుఁగులను పాలించువాఁడు.

మాసికము— అబ్దికము కలుఁగు ప్రతి నెలకుఁ జేసెడు శ్రాద్ధకర్మము.

మాహిష్యుఁడు— అంతఃపుర స్త్రీలను రక్షించుటయందు సమర్థుఁడు; వైశ్య స్త్రీకిని,క్షత్రియునకునుబుట్టినవాఁడు.

మాహేశ్వరి— శివునకుఁ బరిచర్యలు చేయునది = సప్తమాతృకలలోనొకతె.

మాహేశ్వరుఁడు—నిత్యము మహేశ్వరపూజ చేయువాఁడు = శైవుఁడు.

మించుఁ(బోఁణి)బోఁడి— మెఱుపువలె మనోజ్ఞురాలగు నాఁడుది.

మింటిచూలి— ఆకాశమునఁ బుట్టిన వాఁడు = వాయువు.

మింటితెరువరి— ఆకాశము సంచారయోగ్యమగు మార్గముగాఁ గలవాఁడు = సూర్యుఁడు.

మింటితెరువరులు— ఆకాశమున (స్వర్గము)సంచరించువారు = దేవతలు.

మిక్కిలికంటి (దేవర) వేల్పు— ఎక్కువ కన్నులు (గొప్పకన్ను) గల దేవుఁడు = శివుఁడు.

మిత్తి(గొంగ)(వేటకాఁడు)మిత్తి చూ. అంతకాంతకుఁడు.

మిత్రుఁడు— సర్వ భూతములయందు స్నేహయుక్తుఁడు = స్నేహితుఁడు, సూర్యుఁడు.

మినుకుఁజేడియ— విద్యలకు అధిష్ఠానదేవత = సరస్వతి.

మినుకులదణి— వేదములకుఁ బ్రభువు = బ్రహ్మదేవుఁడు.

మినుకులబరణి(యిక్క)— ఋక్సామయజుర్వేద స్వరూపమయిన దేహము గలవాఁడు = సూర్యుఁడు.

మినుజుట్టుదేవర—ఆకాశమేజుట్టుగాఁ గల దేవుఁడు = శివుఁడు.

మినుమానికము— ఆకాశము నందలి సుప్రసిద్ధ మాణిక్యము = చింతామణి.

మినువాఁకతోఁబుట్టువు— గంగకుఁ దోడఁబుట్టినవాఁడు = శూద్రుఁడు.

మినుసిగకలాఁడు— ఆకాశము జటాజూటముగాఁగలవాఁడు = శివుఁడు.

మినుసిగవేల్పు— ఆకాశము వఱకు వ్యాపించినశిఖగలదేవుఁడు = శివుఁడు.

మిన్నుకొలఁకు— ఆకాశమునందు సరస్సువలె నున్నది = దేవగంగ.

మిన్ను వాఁక (మిన్వాఁక) చూ. చదలేఱు.

మిన్నువాఁకతాలుపు— స్వర్గంగను శిరమున ధరించినవాఁడు = శివుఁడు.

మిన్నేటితాల్పు—చూ. పై. శివుఁడు.

మిన్నేఱు—చూ. చదలేఱు.

మిహికాకరుఁడు—చలని కిరణములు గలవాఁడు = చంద్రుఁడు.

మీఁగండ్ల మెకము—శిరమున నేత్రములుగల మృగము=శరభమృగము.

మీన(ధ్వజుఁడు)కేతనుఁడు—మీనము (చేఁప) ధ్వజముగాఁ గల వాఁడు = మన్మథుఁడు.

మీనవల్లంకి—నీటిసమీపమున నెగురుచు మత్స్యములను బట్టెడు పక్షి విశేషము = పిచ్చుక.

మీనాంకుఁడు—చూ. మీనధ్వజుఁడు

మీను మొసలి సిడెంబుల మేటి—చేఁపయు మొసలియు ధ్వజములుగాఁ గల శూరుఁడు = మన్మథుఁడు.

మీలదొంగ—చేపలకు శత్రువు = పిచ్చుక, కొంగ.

మీలవేఁటరి—చేపలను వేఁటాడు వాఁడు = బెస్తవాఁడు.

ముంజకేశుఁడు—ముంజిగడ్డి యాకారముగల జుట్టుగలవాఁడు = విష్ణువు.

ముండి(ముండకుఁడు)—వెండ్రుకలు గొరుగువాఁడు = మంగలి.

ముండితుఁడు—గొరగఁబడిన తల గల వాఁడు = బోడితలవాఁడు.

ముంతపొగ—మూతి బిగించుటకు ముందుగా కాల్చి ముంతలో వేసిన మిరపకాయల పొగ.

ముకుందుఁడు—మోక్షము నిచ్చువాఁడు = విష్ణువు.

ముకురము—దీనిచే నలంకరింపఁ బడుదురు = అద్దము.

ముక్కంటి—మూడు కన్నులు కలవాడు = శివుఁడు.

ముక్కంటిచెలి—శివునకు మిత్రుఁడైనవాఁడు = కుబేరుఁడు.

ముక్కంటితలపువ్వు—ఈశ్వరుని శిరమునఁ బువ్వువలె నుండువాఁడు = చంద్రుఁడు.

ముక్కంటి తొలిపట్టి—ఈశ్వరుని తొలికుమారుఁడు=విఘ్నేశ్వరుఁడు.

ముక్కంటి పండు—మూఁడు కన్నులు గల పండు = కొబ్బరికాయ.

ముక్కంటి పండుల మెక్కెడు దిండీఁడు—కొబ్బరికాయలను దినువాఁడు = విఘ్నేశ్వరుఁడు.

ముక్కంటిమల—ఈశ్వరుని పర్వతము = కైలాసము.

ముక్కంటిమామ—శివుని మామ (1. పార్వతి తండ్రియగు హిమవంతుఁడు, 2. సతీదేవి తండ్రియగు దక్షుఁడు.)

ముక్కంటిమావు—శివుని వాహనము = వృషభము.

ముక్కంటి యనుగుఁ జెలి— చూ. త్ర్యంబక సఖుఁడు.

ముక్కంటియమ్ములపొది— ఈశ్వరుఁడు తన బాణములను దాఁచుకొనుటకుఁ బొదియైనది = సముద్రము.

ముక్కంటియిల్లు— ఈశ్వరుని గృహమైనది = కైలాసము.

ముక్కంటిసంగాతి— ఈశ్వరుని మిత్రుఁడు = కుబేరుఁడు.

ముక్కంటి సొమ్ము— ఈశ్వరునకాభరణ మయినది = సర్పము.

ముక్కోటికలకంటు— చూ. త్రిపురాంతకుఁడు.

ముక్తిక్షేత్రము— మోక్షము నిచ్చు పుణ్యక్షేత్రము = కాశి.

ముక్తి— శరీరేంద్రియములవలన ఆత్మ విడువఁబడుట. ఆత్మను సంసారబంధములవలన విడిపించునది = మోక్షము.

ముఖంపచుఁడు— ముఖస్తుతి చేయువాఁడు = యాచకుఁడు.

ముఖద్వారము— నది సముద్రములోఁ గలియుచోటు.

ముఖమంటపము— దేవాలయములో గోపుర సమీపమున నుండు మండపము.

ముగ్ధ— ఉదయించుచున్న యౌవనము గలది, 16 సంవత్సరములకు మించని వయసుగల బాలిక.

ముట్టెమెకము— పొడుగయినముట్టెగల మృగము = అడవిపంది.

ముత్తైదువ(ముత్తో) — ముదుసలి సుమంగలియగు స్త్రీ.

ముత్త్రోవద్రిమ్మరి— ముల్లోకములందుఁ బ్రవహించునది = గంగ.

ముదియనివారిలోఁబెద్ద— ముదిమి లేనివారిలో (దేవతలలోఁ) బెద్దవాఁడు = బ్రహ్మ.

ముదిరము— దీనిచేఁ బైరుపెట్టి రైతులు సంతోషింతురు = మబ్బు.

ముద్దరాలు — పదునారేండ్ల వయసును మించనిది=సంపూర్ణ యౌవనావిర్భావము కానిది = (ముగ్ధ.)

ముద్దుగలకాళ్ళ (పుఱుగు)పులుఁగు— మూఁడు+దుగి = ముద్దుగ. (దుగ = రెండు) ఆఱుకాళ్ళుగల జంతువు. తుమ్మెద.

ముద్దుగల తల్లుల బిడ్డఁడు— ఆర్గురు తల్లులచేఁ బెంపఁబడినవాఁడు= కుమారస్వామి.

ముద్దుగుమ్మ— మనోజ్ఞురాలగు స్త్రీ-

ముద్దు (రాలు) (లగుమ్మ) లాడి- చూ. పై.

ముద్దుటుంగరము— అక్షరములు చెక్కిన (ముద్రగల) యుంగరము.

మునిముచ్చు— మునివలె మౌనముతో నేమియుఁ దెలియనట్లు నటించెడు కుత్సితుఁడు.

మునుగుచీఁకటుల విచ్చుమొగ్గ—ముందుగాఁ జీఁకటులందు వికసించు మొగ్గ = చంద్రుఁడు.

మున్నీటిచూలి—సముద్రుని కొమార్తె = లక్ష్మి.

మున్నీటిపట్టి— సముద్రుని కుమారుఁడు = చంద్రుఁడు.

మున్నీరు—సృష్ట్యాదినుండియు నున్న నీరు = సముద్రము.

మున్నెరిక—పూర్వరాగమువలనఁ గల్గిన ప్రియవిరహతాపము.

ముబ్భాసవాసము— త్రయీతనువు.

ముముక్షువు—మోక్షేచ్ఛ గలవాఁడు.

ముమ్మొనవాలు—మూఁడు మొనలు గల ఆయుధము = త్రిశూలము.

ముమ్మొనవాలుదాలుపు—చూ. త్రిశూలధారి.

ముయ్యేఱు—స్వర్గ మర్త్య పాతాళములను మూఁడులోకములందును బ్రవహించిన నది = గంగ.

ము(రవైరి)రారి— మురాసురునకు శత్రువు = శ్రీవిష్ణువు.

మువ్వన్నెకాఁడు—చిత్రభానువు.

మువ్వన్నెమెకము—మూఁడురంగులు గల జంతువు = పెద్దపులి.

మువ్వన్నెవిల్లు—మూఁడు రంగులుగల ఇంద్రధనుస్సు.

ముష్వేలుపులయిక్క—మాఠరుఁడు, పింగళుఁడు, దండుఁడు అను నామాంతరములతో వ్యవహరించెడుయమాగ్నిరుద్రులకు స్థానమయిన సూర్యుఁడు.

ముష్టింపచుఁడు—పిడికెడు బియ్యము వండుకొనువాఁడు = దరిద్రుఁడు.

ముష్టీముష్టి—పరస్పరము పిడికిళ్ళతో గ్రుద్దుకొనుచుఁ జేయు ద్వంద్వయుద్ధము.

ముసలి—ముసలము (రోకలి) ఆయుధముగాఁ గలవాఁడు = బలరాముఁడు.

ముస్తెలమేఁపరి—తుంగ ముస్తెలను దినునది = పంది.

ముళ్ళయతి—చూ. కలన తపసి.

ముహూర్తము— 12 క్షణముల (2 గడియల)కాలము.

మూలకర్మము— మూలికలచే నైన స్తంభన వశీకరణాది కర్మము.

మూలబలము—సామాన్య యుద్ధమునకు సిద్ధముగాక నిల్వగానుండు సేన.

మూలమట్టము—గోడల మూలలను బరీక్షించుటకుయోగ్యమయిన మూఁడు మూలలు గల నుట్టపలక.

మూల(శంక)వ్యాధి—గుదస్థానమునఁ బుట్టెడు వ్యాధివిశేషము.

మూలాధారము—గుదస్థానమున నుండెడు నాడుల కాధారమయిన యొకచక్రము.

మూషికము—అన్నాదులను దొంగిలించునది = ఎలుక, పందికొక్కు.

మూషికవాహనుఁడు— ఎలుక వాహనమైనవాఁడు = గణపతి.

మూసిక—మంగళసూత్రమునందు తాళిబొట్టుకు ఈవలావల గ్రుచ్చి కట్టు కొనెడు నానుగ్రోవి.

మృగదంశకము—మృగములను గొఱుకునది=1. కుక్క, 2. ఎలుఁగు.

మృగధూర్తకము—జంతుకోటిలో ధూర్తమైనది (అతివినయము కనఁబఱచుచు మోసగించునది) = నక్క.

మృగనాభి—ఒకజాతి మృగముయొక్క బొడ్డునందుండెడు పరిమళద్రవ్య విశేషము = కస్తూరి.

మృగమదము—ఒక జాతి మృగముయొక్క మదము = కస్తూరి.

మృగ(రాజు)(పతి) —జంతుకోటికిఁ బ్రభువైనది = సింహము.

మృగ(వైరి)రిపువు— మృగములకు శత్రువైనది = సింహము.

మృగ (లక్షణుఁడు) లాంఛనుఁడు—జింక చిహ్నముగాఁ గలవాఁడు = చంద్రుఁడు.

మృగవాహనుఁడు— జింక వాహనముగాఁగలవాఁడు = వాయువు.

మృగాంకుఁడు-చూ. మృగలక్షణుఁడు.

మృగాక్షి—లేడి కన్నులవలెఁ జంచలములైన నేత్రములుగల స్త్రీ.

మృ(గయుఁడు)గాజీవుఁడు— మృగపక్ష్యాదులను వేఁటాడి జీవించువాఁడు = బోయవాఁడు.

మృగా(దనము)జీవము— జంతువులను దిని బ్రతుకునది = సివంగి.

మృ(గాధిపము)గస్వామి } చూ.మృగరాజు.
మృగేం(ద్రము)ద్రుఁడు }

మృడాని—మృడుని భార్య=పార్వతి.

మృత(కాంతక) (తాంతక)ము —చనిపోయినవాని కళేబరమును భక్షణరూపముగా నంతమును బొందించునది = నక్క.

మృతాశౌచము— మృతుఁడైనవాని వలనఁగలుగు శుచిరాహిత్యము=మైల.

మృత్కరుఁడు—మట్టిపనిచేసి బ్రతుకువాఁడు = కుమ్మరి.

మృత్యుంజయుఁడు— మృత్యువును జయించినవాఁడు = శివుఁడు.

మృత్యుఫల—మరణకాలమునమాత్రమే ఫలము నిచ్చునది = అరఁటిచెట్టు.

మృత్యుసూతి—ప్రసవించి చనిపోవునది = పీత, తేలు, బొద్దిఁక.

మృదంగము—1. కొట్టఁబడునది, 2. మృత్తు అంగము గాఁగలది = మద్దెల.

మృదుపుష్పము—మిగుల సుకుమారమైన పువ్వులుగలది = దిరిసెన చెట్టు.

మెకముల(కొలము)(ఱేఁడు) సామి- చూ. మృగరాజు.

మెకములతిండి—మృగములను దినునది = సివంగి, పెద్దపులి మొ.

మెఱుఁగుఁబోఁడి—మెఱుపువలె మనోజ్ఞాంగులు ఆఁడుది = స్త్రీ.

మేఁకతిండి—మేఁకలను దినునది = తోఁడేలు.

మేఖలకన్యక—మేఖల పర్వతమునఁ బుట్టినది = నర్మదానది.

మేఘజ్యోతి—మేఘముల నడుమనుండు ప్రకాశము = మెఱుపు, పిడుగు.

మేఘద్వారము—మేఘములకు ద్వారమైనది = ఆకాశము.

మేఘనాదము—మేఘముల నుండి ఒయల్వెడలు ధ్వని = పిడుగు.

మేఘనాదానులాసి— పిడుగులనువిని నృత్యము చేయునది = నెమలి.

మేఘపుష్పము—మేఘములందు బుష్పాకారముగా నుండునది = ఉదకము.

మేఘవాహనుఁడు— మేఘములు వాహనముగాఁ గలవాఁడు = ఇంద్రుఁడు.

మేధావంతుఁడు— ధారణాశక్తి గల సూక్ష్మబుద్ధి గలవాఁడు.

మేదిని— మధుకైటభుల మేధస్సు (మెదడు) చేదడుపఁబడునది=భూమి.

మేనకాత్మజ—1. హిమవంతుని భార్యయగు మేనకయొక్క కూఁతురు = పార్వతి, 2. విశ్వామిత్రునివలన దేవవేశ్య యగు మేనకకుఁబుట్టినది = శకుంతల.

మేనరికము=తోఁబుట్టువు యొక్కయు, తల్లితోఁడఁబుట్టిన వాని యొక్కయు దేహ సంబంధభావము.

మేనుతాలుపులసామి—కోరిన రూపమునుదాల్చెడు రాక్షసుల ప్రభువు = నైరృతుఁడు.

మేమఱపు—శరీరమును గప్పునది = కవచము.

మేలిచ్చుపులుఁగు—శుభము నిచ్చు పక్షి = గరుత్మంతుఁడు.

మైత్రావరుణి—మిత్రుని (సూర్యుని) యొక్కయు, వరుణుని యొక్కయు వీర్యమువలన జనించినవాఁడు = అగస్త్యుఁడు.

మైనాకుఁడు— మేనకా హిమవంతుల పుత్రుఁడు.

మొండెపుగాము—తలలేని శరీరము గల గ్రహము = రాహువు.

మొండెపురక్కసుఁడు— తల తెగిన శరీరముగలరాక్షసుఁడు = కబంధుఁడు.

మొగము తెలుపుమెకము—తెల్లని ముఖముగల జంతువు = ఎలుఁగు.

మొగులుదారి—చూ. మేఘద్వారము.

మొగులువిరి— చూ. మేఘపుష్పము.

మొగులువిరిపొది—ఉదకమునకు స్థానమైనది = సముద్రము.

మొదటివేల్పు—దేవతలలోఁ బెద్ద వాఁడు = బ్రహ్మ.

మొదటిహస్తి—(క్షీరసాగరమథనమున బుట్టిన) మొదటి ఏనుఁగు=ఐరావతము

మోక్షపురి—చనిపోయిన వారికి మోక్షము నిచ్చుపట్టణము = కాశి.

మోక్షము—1. జీవునిఁ బాశములవలన విడిపించునది, 2. దుఃఖాది దురవస్థల వినాశనము.

మోట్టాయితము—ప్రియుల యెడ స్త్రీలకుఁ గల్గు శృంగారచేష్ట.

మోదకప్రియుఁడు— కుడుముల యందుఁ బ్రీతిగలవాఁడు = గణపతి.

మౌంజీధరుఁడు—ముంజదర్భల మొల త్రాడు ధరించినవాఁడు = బ్రహ్మ చారి.

మౌక్తికము—ముత్యపు చిప్ప వలన విడువఁబడినది = ముత్యము.

మౌని—మౌనముఁ దాల్చువాఁడు = ఋషి.

మ్రానుద్రిమ్మరి—చెట్లపైఁ దిరుగునది = కోఁతి.

మ్రుచ్చిలిపోటు— నిద్రాసమయమున పైబడి చేసెడి యుద్ధము.

యక్షకర్దమము—యక్షులకుఁ బ్రియమైన ఆర్ద్రత్వముచేఁ బంకతుల్యమైయుండునది. (కర్పూరము, అగరు, కస్తూరి, తక్కోలము మొదలగు వానిచేఁ దయారుచేయఁబడిన సుగంధ ద్రవ్యవిశేషము).

యక్ష(ప్రభువు)రాట్టు- (యక్షేశుఁడు) = యక్షులను దేవయోని విశేషులకుఁ బ్రభువు = కుబేరుఁడు.

యజ్ఞపురుషుఁడు— యజ్ఞమునందుఁ బూజింపవలసిన ప్రధానపురుషుఁడు = విష్ణువు.

యజ్ఞభోక్త— యజ్ఞమునందలి హవిరాదికము ననుభవించువాఁడు=వేల్పు.

యజ్ఞేశ్వరుఁడు— యజ్ఞమునకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

య(ష్ట)జ్వ—యాగము చేసినవాఁడు = సోమయాజి.

యతేంద్రియుఁడు— జయింపఁబడిన యింద్రియములు గలవాఁడు = ముని.

యథాజాతుఁడు—పుట్టిన నాటి వలె జ్ఞానము లేక యుండువాఁడు = మూర్ఖుఁడు.

యథార్థవర్ణుఁడు—నిజస్థితిని జెప్పు వాఁడు = వేగులవాఁడు.

యదృచ్ఛాభిజ్ఞుఁడు—ప్రసంగవశము ననే సమస్తకార్యములు తెలుసుకొనిన సాక్షి.

యద్భవిష్యుఁడు — స్వప్రయత్నము లేక "కానున్నది కాకమానదు" అని యూహించువాఁడు.

యమపటము— నరలోకమున పాపులు యమునిచే బాధింపఁబడుటను సూచించుపటము.

యమునాభ్రాత— యమున (నది) కు సోదరుఁడు=యముఁడు. (సూర్యునకు సంజ్ఞాదేవియందుఁ బుట్టినవాఁడు.)

యా(జ-జ్ఞి)కుఁడు— యాగము నడపు వాఁడు=ఋత్విక్కు.

యామికుఁడు— ప్రతి యామమునకు గస్తి తిరుగువాఁడు=తలారి.

యాదః (యాదసాం)పతి, యాదోనాథుఁడు— జల జంతువులకుఁ బ్రభు వైనవాఁడు = సముద్రుఁడు.

యాయజూకుఁడు— పలుమారు యజ్ఞముచేయు స్వభావము కలవాఁడు.

యాశోదేయుఁడు— యశోద కొడుకు = కృష్ణుఁడు.

యాష్టికుఁడు— దుడ్డుకఱ్ఱ ఆయుధము గాఁ గలవాఁడు.

యుగాంతము—కృత త్రేతా ద్వాపర కలి యుగముల యంత్యభాగము = మహాప్రళయము.

యూపదారువు — యజ్ఞమునందుఁబశు బంధనార్థము నాటినదై పట్టలేని దారువు.

యోగప(ట్టె-ట్ట)ము—యోగులు జంధెముగా ధరించు వస్త్రపుపట్టె.

యోగవాగ(ము)లు— అంతరిక్ష మార్గమునఁ బోయెడు యోగసిద్ధులు ధరించెడు పావకోళ్ళు.

యోగాభ్యాసము— యమనియమా ద్యష్టాంగము నభ్యసించుట.

యోనిసంకరము— ఆశాస్త్రీయమగు జాత్యంతర వివాహము.

యోషాప్రియ— స్త్రీల కిష్టమైనది = పసుపు.

యౌవనము— పదునాఱేండ్లు మొదలేఁబది వత్సరములవఱకుఁగల వయో=వస్థా విశేషము.

రంగాజీవుఁడు, రంగోపజీవి— 1. చిత్తరువులు వ్రాయువాఁడు. 2. నాటక రంగములయందు నాట్యము చేయువాఁడు.

రంభోరు—అరఁటి స్తంభములను బోలిన తొడలు గల స్త్రీ.

రక్కసులగొంగ— రాక్షసులకు శత్రువు=శ్రీ విష్ణువు.

రక్తతుండము—ఎఱ్ఱని ముక్కు గలది = చిలుక.

రక్తదృక్కు—ఎఱ్ఱని నేత్రములు కలది = పావురము.

రక్తనాసిక—ఎఱ్ఱని ముక్కు గలది = గ్రుడ్లగూబ.

రక్త(పాయిని)ప—రక్తమును ద్రాగునది = 1. జలగ, 2. నల్లి, 3. డాకిని.

రక్తపాయి— రక్తమును పానముచేయు వాఁడు = రాక్షసుఁడు.

రక్తఫల—ఎఱ్ఱని పండ్లుగలది = దొండ.

రక్తపుఁడు—రక్తమును ద్రాగువాఁడు= రాక్షసుఁడు.

రక్తపుచ్ఛిక—ఎఱ్ఱని తోఁకగలది = పలికండ్లపాము మొ.

రక్తబీజము—ఎఱ్ఱని గింజలు కలది = దానిమ్మ మొ.

రక్తాంగుఁడు—ఎఱ్ఱని యవయవములు కలవాఁడు = అంగారకుఁడు.

రక్షరేక—మంత్రాక్షర లేఖనమున రక్షణార్థమైన రేక.

రక్షాధిపతి—రక్షణమునం దాధిపత్యము గలవాఁడు=రక్షకభటుఁడు.

రక్షాపేక్షకుఁడు—రక్షణమును అపేక్షించు (కోరు) వాఁడు = ద్వారపాలకుఁడు.

రజతాద్రి—వెండికొండ=కైలాసము.

జరనీకరుఁడు—రాత్రిని కలుగఁజేయు వాఁడు = చంద్రుఁడు.

రజనీచరుఁడు—రాత్రులందు సంచరించు వాఁడు = రాక్షసుఁడు, దొంగ.

రజనీజలము—రాత్రులందు పడెడు నీటి తుంపర = మంచు.

రజనీ (కాంతుఁడు) వల్లభుఁడు — రాత్రులకుఁ బ్రభువు = చంద్రుఁడు.

రజస్వల—రజస్సు (ముట్టునెత్తురు) కలది = ముట్టుది.

రజోహరుఁడు—వస్త్రముల మాలిన్యమును బోఁగొట్టువాఁడు = చాకలి.

రజ్జులాఁడి, రజ్జులాఁడు — వ్యర్థసంభాషణము గలది= ఆత్మస్తుతిపరురాలు.

రత(నాలపంట)నపుగని—రత్నములకు గనియైనది = సముద్రము.

రతిగురుఁడు—రతికి ఉపాధ్యాయుఁడయినవాఁడు = భర్త (రతి = మైథునము).

రతితస్కరుఁడు—స్త్రీల మానమును బలాత్కారముగా చెడఁగొట్టువాఁడు = జారుఁడు (రతిహిండకుఁడు).

రతిపతి, రతీశ్వరుఁడు—రతీదేవి మగఁడు = మన్మథుఁడు.

రత్నగర్భ—రత్నములు గర్భమునందుఁ గలది = భూమి.

రత్నగర్భుఁడు—రత్నములు గర్భమునఁ గలవాఁడు = 1. సముద్రుఁడు, 2. కుబేరుఁడు.

రత్నసానువు—రత్నమయము లయిన చఱియలు (పర్వతశిఖరమునకుఁ గ్రింది చోటు) గలది = మేరుపర్వతము.

రత్నాక(రము)రుఁడు—రతనపు గని.

రథాం(గము)గాహ్వయము—రథమున కంగమైన చక్రనామము గలది = 1 చక్రవాకము, 2. రథచక్రము, 3. విష్ణుచక్రము.

రథి(కుఁడు)—రథము నెక్కువాఁడు, రథము నెక్కి యుద్ధము చేయువాఁడు.

రథోత్సవము— దేవుని రథముననుంచి చేసెడు నుత్సవము.

రద(న)చ్ఛదము—దంతములను గప్పునది = పెదవి.

రశన—పదియాఱు పేటలుగల యాఁడుదాని మొలనూలు.

రసజ్ఞ—కటు, తిక్త, కషాయాది రసములను గుర్తించునది = నాలుక.

రసజ్ఞుఁడు (రసికుఁడు)— కావ్యశృంగారాది నవరసములను దెలిసినవాఁడు = పండితుఁడు.

రసపాచకుఁడు— కషాయాది రసవిశిష్ట పదార్థములను బచనము చేయువాఁడు. = వంటవాఁడు.

రస(సిద్ధి)వాదము— పాదరసమును గట్టి బంగారము తయారు చేయు శాస్త్రము.

రసాతలము— భూమియొక్క అధోభాగము = పాతాళము.

రసాభాసము— చూ. త్రివిధ రసాభాసలు. సాంకే. పదములు.

రసికుఁడు—చూ. రసజ్ఞుఁడు.

రసేంద్రము— గంధకాది రసములలో శ్రేష్ఠమైనది = పాదరసము.

రసోత్తమము— రసములలో నుత్తమమైనది = పాలు, పాదరసము.

రసోద్భవము— ఉదకమునఁ బుట్టునది=ముత్యము, పద్మము మొ.

రసోనకము— షడ్రసములలో పులుపొక్కటి మాత్రమే లేనిది=వెల్లుల్లి.

రాక—16 కళలతోఁగూడిన చంద్రుఁడు కలది = పూర్ణిమ.

రాక్షసము— తన వివాహము నాటకంపరచువారలను బాధించి (మొఱపెట్టు) కన్యను బలాత్కారముగాఁ దీసికొని వచ్చి చేసికొనెడు వివాహము.

రాఘవుఁడు— రఘువంశమునఁ బుట్టిన ప్రసిద్ధపురుషుఁడు = రాముఁడు.

రాచకురుపు— ప్రాణోపద్రవకరముగా వీఁపున లేచెడు వ్రణవిశేషము.

రాజధాని— రాజు నివసించు ప్రధాన పట్టణము = రాచవీఁడు.

రాజన్వంతము— మంచి రాజులుగల దేశము.

రాజమార్గము— బండ్లు మొదలగునవి పోఁదగిన ప్రధానవీథి.

రాజయోగము— సులభముగా నవలంబింపఁ దగిన ధ్యానవిధానము; జననకాలమున మనుష్యునకు గ్రహబలము వలనఁ గలుగు శుభస్థితి.

రాజరాజు— (రారాజు, రాఱేఁడు) చక్రవర్తి, దుర్యోధనుఁడు.

రాజసము— రజోగుణ సంబంధమైన వృత్తి. (దుఃఖకారణమైన రాగాది) రాయసము.

రాజసూయము— ఒక రాజు ఇతర రాజులను జయించి చేసెడు యాగము.

రాజహంస— ఎఱ్ఱని ముక్కు కాళ్లు గలిగి తెల్లనై యుండు పక్షివిశేషము.

రాజీనామా— వాది ప్రతివాదులు సమాధానపడి చేసికొన్న ఏర్పాటు. ఉద్యోగమును మానుకొనునప్పటిఅర్జీ

రాజీవము—రాజు ననుసరించి జీవించునది = పద్మము.

రాతిరిదిరుగుమేటి— రాత్రులందు సంచరించువారిలో (రాక్షసులు) సమర్థుఁడు = నైరృతుఁడు.

రాత్రి(ం)చరుఁడు— రజనీచరుఁడు.

రాత్రిమణి—రాత్రులందు మణివలెఁ బ్రకాశించువాఁడు = చంద్రుఁడు.

రాధేయుఁడు—(సూర్యునివలనఁ గన్యయగు కుంతికిఁబుట్టి గంగయందువిడువఁబడి) రాధ యను శూద్ర స్త్రీ చేఁ బెంపఁబడినవాఁడు = కర్ణుఁడు.

రామరము— రమర మనుదేశమునఁ బుట్టునది = ఇంగువ.

రామానుజకూటము— రామానుజ మతస్థుల (వైష్ణవుల) రాకపోకల కేర్పడిన యిల్లు.

రామాయణము— దశరథ పుత్రుఁడగు రాముని చరిత్రమును దెల్పెడి వాల్మీకిముని ప్రణీతకావ్యము.

రాముఁడు—రమింపఁజేయువాఁడు.

రావణుఁడు— 1 ప్రజలను మొఱ పెట్టించువాఁడు, 2. కైలాసమును మోకాలి నాధారముగాఁ జేసికొని యెత్తగా (పార్వతి భయమున శివుని గౌఁగిలించుకోఁగా) శివుఁడు కాలి బొటన వ్రేలితో నొక్కినపుడు గొప్ప రావము చేసినవాఁడు.

రాష్ట్రియుఁడు— నాట్యపరిభాషయందు రాజశ్యాలకుఁడు (పెండ్లాము తోడఁబుట్టినవాఁడు)

రాసభము—బెట్టుగా మొఱపెట్టునది = గాడిద.

రాసము—గోపకుల క్రీడావిశేషము

రిక్కలనంటు—భర్తయగుటచే నక్షత్రముల నంటియుండు వాఁడు = చంద్రుఁడు

రిష్టి—దీనిచేహింసింపఁబడుదురు =కత్తి

రుద్రభూమి—ఈశ్వరుని నివాసస్థలము = శ్మశానము, వల్లకాఁడు.

రుద్రాణి—రుద్రుని భార్య=పార్వతి

రుద్రులు—1. అసురులను రోదనము చేయించువారు, 2. దుఃఖమును బోఁగొట్టువారు 3 కల్పాదియందు వేదస్వరూపమగు రుతము (శబ్దము) ను బలుకువారు = వీరు 11 గురును గణ దేవతా విశేషము.

రుధిరుఁడు— నెత్తురువలె నెఱ్ఱగానుండు వాఁడు = అంగారకుఁడు.

రూపాజీవ—రూపమే జీవనాధారముగాఁ గలది = వేశ్య.

రెంటఁ్రతాఁకుడు—చూ. ద్వీపము.

రెంటత్రాగుడుతిండి— ఏనుఁగు ఆహారముగాఁ గలది = సింహము.

రెంటత్రాగుడుమెకము— నోరు, తొండములచేఁ ద్రాగునది = ఏనుఁగు.

రెంగునాల్కలుగలాఁడు—సర్పము. (గరుత్మంతుఁడు తన తల్లియగు వినత యొక్క దాస్య విముక్తికయి స్వర్గలోకమునుండి యమృత భాండమును దెచ్చి దర్భలపయినుంచి నియమ ప్రకారము నాగమాతయగు కద్రువ యొద్ద నుంచెను. నాగు లందఱును స్నాతులై యమృతపానము చేయుటకు వచ్చులోపల నమృతభాండమును దేవేంద్రుఁ డపహరించెను. నాగులు చేయునదిలేక దర్భలు నాకుటచే నాలుకలు రెండుగాఁ జీలినవని పురాణ ప్రసిద్ధి)

రేదొర—రాత్రికిఁ బ్రభువైనవాఁడు = చంద్రుఁడు.

రేద్రిమ్మ (రీఁడు) రి—రాత్రు లందు దిరుగువాఁడు = రాక్షసుఁడు, దొంగ.

రేపాలఁతిమగఁడు—రాత్రికి ప్రభువు = చంద్రుఁడు.

రేయింతిమామ—రాత్రియను కాంతకు మామ (మగఁడగు చంద్రుని తండ్రి) యైనవాఁడు = సముద్రుఁడు.

రే(తే) (రాయఁ)డు—రేదొర.

రేవతీరమణుఁడు— రేవతీదేవిభర్త = బలరాముఁడు.

రేవె (లుఁగు) (ల్గు) రేజ్యోతి— రాత్రులందుఁ బ్రకాశించువాఁడు = చంద్రుఁడు.

రేవెల్గుజోడు— చంద్రునకు జోడైన వాఁడు = సూర్యుఁడు. (సూర్యచంద్రులు విష్ణుని నేత్రములు.)

రొక్కపుదొర— నవనిధులకుఁ బ్రభువు = కుబేరుఁడు.

రోఁకలితాలుపు—రోఁకలి యాకారముగల యాయుధమును ధరించిన వాఁడు = బలరాముఁడు.

రోగఘ్నము— రోగమును బోఁగొట్టునది = మందు (రోగహారి).

రోగ (హారి) శాంతకుఁడు—(రోగాంతకుఁడు) రోగమును బోఁగొట్టువాఁడు = వైద్యుఁడు.

రోచిష్ణువు— రుచులచేఁ (కాంతులఁ) బ్రకాశించు స్వభావము గలవాఁడు.

రోమంథము—పశువుల చర్వితచర్వణము = నెమరు.

రో(లో)మశుఁడు— శరీరమంతటను రోమములు కలవాఁ డ = పంది, గొఱ్ఱె.

రోహితాశ్వుఁడు— ఎఱ్ఱని గుఱ్ఱములు గలవాఁడు=1.అగ్ని. 2.హరిశ్చంద్రుని కొడుకు = లోహితాశ్వుఁడు.

రోహిణి—9సం॥రముల వయసుగల కన్య.

రోహిణీ (రమణుఁడు) శుఁడు— రోహిణీదేవి భర్త=చంద్రుఁడు.

రౌహిణేయుఁడు— 1 వసుదేవునకు రోహిణియందు జన్మించిన యాదిశేషుని యవతారము = బలరాముఁడు, 2 బృహస్పతి భార్యయగు తారయందు చంద్రునకు జనించి రోహిణీదేవి (చంద్రునిభార్య)చేఁ బెంపఁబడినవాఁడు = బుధుఁడు.

రౌరవము—చూ. మహారౌరవము

ఱెల్లుకానుపుతాత- ఱెల్లుగడ్డియందుఁ బుట్టిన కుమారస్వామికి తాత (తల్లియగు పార్వతికిఁ దండ్రి) యైనవాఁడు = హిమవంతుఁడు.

ఱెల్లుచూలి— ఱెల్లుగడ్డియందుబుట్టిన బిడ్డఁడు = కుమారస్వామి.

లంపటుఁడు—ఎక్కువ ఆశకలవాఁడు = లోభి

లంబిక—వ్రేలునది = కొండనాలుక.

లంబోదరుఁడు— వ్రేలాడు బొజ్జగలవాఁడు = విఘ్నేశ్వరుఁడు

లక్ష్మి—ఈమెచే సర్వము చూడఁబడును = విష్ణునిభార్య.

లక్ష్మిపతి—లక్ష్మిదేవిమగఁడు=విష్ణువు

లచ్చికొమరుఁడు— లక్ష్మిదేవియొక్క పుత్త్రుఁడు = మన్మథుఁడు.

లచ్చికోడలు—లక్ష్మిదేవికిఁ గోడలయినది = సరస్వతి.

లచ్చితండ్రి—లక్ష్మిదేవికిఁ దండ్రియైనవాఁడు = సముద్రుఁడు.

లచ్చిమగఁడు— లక్ష్మిదేవి మగఁడు = విష్ణువు.

లచ్చియన్న— లక్ష్మిదేవికి ముందుగా క్షీరసముద్రమునఁ బుట్టిన సోదరుఁడు = చంద్రుఁడు.

లచ్చితేనెడమకన్ను— విష్ణుని ఎడమకన్నయినవాఁడు = చంద్రుఁడు.

లతాంతము—తీఁగెచివర నుండునది = పూవు.

లతారసనము— తీఁగె యాకారము కల నాలుక కలది = సర్పము.

లబ్ధవర్ణుఁడు— పొందఁబడిన యక్షరజ్ఞానము కలవాఁడు = పండితుఁడు.

లలన—విరసనశీలముగల యాఁడుది.

లవిత్రము— దీనిచే గోయుఁగురు = కొడవలి.

లాఁగడాఁగుఁడు— రంధ్రములయందు దాఁగియుండునది = సర్పము.

లాంగలము-దున్నునపుడు భూమిలోఁ జొచ్చునది = నాఁగలి

లాలాటికుఁడు—1 ప్రభువు యొక్క యభిప్రాయమును దెలిసికొనువాఁడు, 2 కార్యదక్షతలేనివాఁడు.

లవణాకరము— ఉప్పునకు కారణమైనది = సముద్రము.

లాసకము—ఆటపులుఁగు = నెమలి.

లింగకాయ—లింగధారులు శివలింగ

మునుంచి కంఠమునఁ గట్టుకొనెడు సజ్జకాయ.

లింగధారి— శివలింగమును గంఠమున ధరించియుండువాఁడు = శివభక్తుఁడు.

లిబ్బిపడఁతి— ధనము (నిధులు) నకు అధిష్ఠానదేవత = లక్ష్మి.

లిబ్బి (దొర)రాయఁడు— ధనము నకుఁ (నవనిధులకుఁ) ప్రభువు = కుబేరుఁడు.

లులాయము— నీటియందు మునుఁగునది = కారెనుపోతు.

లేలి (లేలీ)హానము—మాటిమాటికిని లేహనము (నాకుట) చేయునది = సర్పము.

లేహ్యము—నాకి భుజింపఁదగినది.

లేఖర్షభుఁడు— దేవతలలో శ్రేష్ఠుఁడు = ఇంద్రుఁడు.

లోకబాంధవుఁడు— ప్రపంచకమునకుఁ జుట్టమయినవాఁడు = సూర్యుఁడు.

లోకమాత— ముల్లోకములకును దల్లియైనది = 1. లక్ష్మి, 2. పార్వతి, 3. గంగ.

లోకాయతము — స్వభావమునకుఁ గర్తృత్వ మారోపించునట్టి మత విశేషము.

లోకాలోకము—భూమండలము నంతను జుట్టియుండెడు కొండ = చక్రవాళ పర్వతము.

లోకేశుఁడు— జగత్తునకుఁ ప్రభువు = బ్రహ్మ, జనులకుఁ ప్రభువు = రాజు.

లోలంబము —చూ. బంభరము.

లోలకర్ణుఁడు — చెప్పెడు మాటలను జెవియొగ్గి వినెడు స్వభావము కలవాఁడు.

లోహకారకుఁడు, లోహకారుఁడు — లోహములలోఁ బాత్రాదులను చేయువాఁడు = కమ్మరి.

లోహాభిసారము—ఆయుధ ధారలకు రాజులు మున్నగువారికిచ్చు నీరాజనము.

లోహితాంగుఁడు—ఎఱ్ఱని యవయవములు గలవాఁడు = అంగారకుఁడు.

వంకరతొండమువాఁడు— వక్రతుండుఁడు = వినాయకుఁడు.

వంచకము— మోసము చేయునది = నక్క, ఊరముంగిస.

వందనమాల— ద్వారమునఁ గట్టఁబడిన తోరణము.

వందారువు— గోత్రనామములను దెల్పుచుఁ బాదము నుస్పృశించి నమస్కరించువాఁడు.

వంధ్య— ఫలశూన్యమైనది=గొడ్రాలు.

వంశకరుఁడు=సంతానమువలన వంశము నిలుపువాఁడు.

వంశవర్తి— వెదురుగడపై నాట్యము చేసెడు దొమ్మరి.

వంశరోచన—వెదురువలనఁ బుట్టి జఠరాగ్నిని దీపింపఁజేయునది = తవక్షీరి.

వంశవృక్షము— వంశస్థుల క్రమమును దెలుపు పట్టిక.

వక్త్రము— దీనిచేఁ బలుకబడును = ముఖము.

వక్ర (కంఠ) గ్రీవము— వంకరమెడ గలది = ఒంటె.

వక్రపు(చ్ఛము)చ్ఛిత— వంకరయైన తోఁక గలది = కుక్క.

వక్షో(జము)రుహము— వక్షస్థలమునఁ బుట్టునది = స్తనము.

వచక్నువు—సభలలో నిర్భీతిగా మాట్లాడువాఁడు.

వచసాంపతి—వాక్కులకుఁ బ్రభువు= బృహస్పతి.

వచోహరుఁడు—వార్తలను గొనిపోవు వాఁడు = రాయబారి.

వజ్రకీటము— సాలగ్రామమున నుండి తొలిచెడు కీట విశేషము.

వజ్రతుండుఁడు—వజ్రసమానమైన తుండము (ముఖము) గలవాఁడు = గరుడుఁడు.

వజ్రదంతుఁడు—వజ్రమువంటి దంతము గలవాఁడు = గణపతి.

వడముడి— పగరను తపింపఁజేయు వాఁడు = భీముఁడు.

వజ్రాయుధుఁడు, వజ్రి—వజ్రాయుధము గల వాఁడు=ఇంద్రుడు.

వడకు(గుబ్బలి)గొండ—ఉత్తర పు దిక్కునను్న పర్వతము = హిమవంతము.

వన(వనే)చరము—వనమునందు సంచరించునది = కోఁతి.

వన(జము) (రుహము) జాతము— చూ. అంబుజము.

వనజాక్షి—తామరలవంటి కన్నులు గల యాఁడుది.

వనదము—చూ. అంబుదము.

వనదీపము— వనమునందు దీపమువలెఁ బ్రకాశించునది = సంపెంగి పువ్వు.

వన(ని)ధి—చూ. జల (ని)ధి.

వనప్రియము— వనమునం దిష్టమును కూర్చునది = కోయిల.

వనభోజనము— కార్తీక మాసమున వేడుకకై బంధుమిత్రాదు లొక వనమునఁగూడి భుజించుట.

వనమాలి—పాదములవఱకు వ్రేలాడు వనమాల (పుష్పములు, పత్రములు చేర్చి కట్టినదండ) ధరించినవాఁడు = విష్ణువు.

వనీపకుఁడు — అడుగుటను రక్షించు వాఁడు = యాచకుఁడు.

వనౌక(స)ము—వనము నివాసముగాఁ గలది = కోఁతి.

వప్రక్రీడ— గజాదులు దంతములు మొదలగువానితో భూమిని గోరాడెడి యాట.

వయస్య—వయస్సుచే సమానమైనది = చెలికత్తె.

వరవత్సల— పెండ్లికుమారునియందుఁ బ్రేమకలది = అత్త.

వరివర్ణము—శ్రేష్ఠమైన రంగుకలది = బంగారము.

వరవర్ణిని— శ్రేష్ఠమగు రూపసంపదగల యుత్తమస్త్రీ.

వరాటకుఁడు—వరాటకము (గవ్వ) వలె వ్యర్థమైనవాఁడు=అనామధేయుఁడు.

వరారోహ— గొప్ప పిరుఁదులు గలది = ఉత్తమ స్త్రీ.

వరాహకూర్చము— పగలు తుడుచుటకై పనికివచ్చు పందియొక్క రోమ సమూహము.

వరుణాలయము— వరుణదేవునకు స్థానమైనది = సముద్రము.

వరుణుఁడు— జనులచే వరములు కోరఁబడువాఁడు = పడమటి దొర.

వర్జ్యము—వర్జింపఁ (విడువఁ) దగిన దోషయుక్తమగు కాలము.

వర్ణవతి— శ్రేష్ఠమగు రంగు కలది = పసుపు.

వర్ష (వరుఁడు) ధరుఁడు—అంతఃపురమును గాచువాఁడు = హెగ్గడి.

వర్షాభువు— వర్షాకాలమునఁబుట్టునది= కప్ప, ఎఱ్ఱి, పట్టుపురుగు.

వర్షాశనము— పండితులు మున్నగువారికిఁ బ్రతిసంవత్సరము నిచ్చెడు పారితోషిక ద్రవ్యము.

వర్షోపలము— వర్షము కురియునప్పుడు పడు శిల = వడగల్లు.

వలక్షగువు— తెల్లని కాంతులు గలవాఁడు =చంద్రుఁడు.

వల (దొర) (రాయఁడు) ఱేఁడు— కామమునకుఁ బ్రభువు = మన్మథుఁడు.

వలపుమోపరి— గంధమును మోఁచుకొని పోవువాఁడు = వాయువు.

వలమురితాలుపు— పాంచజన్యమను పేరు గల దక్షిణావర్త శంఖమును హస్తమున ధరించినవాఁడు = విష్ణువు.

వలరాజుసూఁడు—మన్మథునకు శత్రువైనవాఁడు= 1. శివుఁడు, 2. శంబరాసురుఁడు.

వలి(దిబ్బ) (కొండ) (గట్టు) మల— చల్లనికొండ = హిమవత్పర్వతము.

వలిమలల్లుఁడు— హిమవంతుని యల్లుఁడు = శివుఁడు.

వలిమొలక— వాయు పుత్త్రుఁడు = 1. భీముఁడు, 2. ఆంజనేయుఁడు.

వలి వె (లుఁగు) ల్గు—చల్లని కాంతి కలవాఁడు = చంద్రుఁడు.

వలీముఖము— ముడుతలతోఁ గూడిన ముఖము గలది = కోఁతి.

వల్మీక (జన్మ) (జ) భవుఁడు— పుట్టయందుఁబుట్టినవాఁడు = వాల్మీకి. (బ్రహ్మ సత్యయాగంబున నొకనాఁడు స్వర్గమునకుఁబోయి యందలి రంభాదులను జూడఁగా నతనికి రేతస్సు స్ఖలన మయ్యెను. ఆ రేతస్సు పంకముతోఁ గలిసి యందుండి వాల్మీకి జనించెను. అతఁడు వెంటనే ఇంద్రసభ కేఁగి బ్రహ్మతోఁ దన జన్మకారణమును దెలిపుచ్చి తన కాహారమును సమకూర్చుమని యడిగెను. బ్రహ్మ తన రహస్యమును బయలుపెట్టినందులకుఁ గోపించి పతితుఁడై బోయలం గలిసి తిరుగునట్లు వాల్మీకిని శపించెను. వాల్మీకి ప్రార్థింపఁగా రామనామ జపము చే శాప విమోచన మగునని బ్రహ్మ పలికెను. కొంతకాలము వాల్మీకి కిరాతరూపమునఁ గ్రూరకర్మ లాచరించి సప్తఋషులచే రామనామము తలక్రిందుగ నుపదేశింపఁబడుటచే గొప్ప తపము చేసి నిరాహారుఁడై యుండఁగా నతని శరీరముపైఁ బుట్టలు మొలచెను. కొంతకాలమునకు నారదుఁ డచ్చటికి వచ్చి నారాయణునివలనఁ దాను వినిన రామావతార వృత్తాంత రహస్యమును దాఁచలేక రామకథను జెట్లుకుఁ జెప్పెను. పుట్టలోనున్న మహర్షి రామకథను సమగ్రముగా విని బయటికి వచ్చెనని ఉత్తర రామాయణము.)

వల్లె(త్రాడు) దాలుపు— పాశము ధరించినవాఁడు = వరుణుఁడు.

వశీకరణము— మంత్ర తంత్రౌషధాదులచే వశవర్తులనుగాఁ జేసికొనుట.

వషట్కృతము— అగ్నియందు వేల్వఁబడిన హవిరాదికము.

వసుంధర—ధనాదికమును ధరించునది= భూమి.

వసు (ధ) (మతి) గర్భ— బంగారము గర్భమందుఁగలది = భూమి.

వసుదేవుఁడు—ధనాదికముచేఁ బ్రకాశించువాఁడు = కృష్ణునితండ్రి.

వసువులు— ధర్మునకు దన పదిమంది భార్యలలో నొకతెయగు వసువునందు జనించినవారు. ఎల్లప్పుడును గూడుకొని యుండు (8) గణదేవతలు. చూ. అష్టవసువులు.

వస్త్రయోనులు— వస్త్రోత్పత్తికిఁ గారణము లయినవి = నార, కాయ, పురుగు, వెండ్రుకలు.

వహ్ని— హవిరాదికమును దేవతలకై వహించుకొని పోవువాఁడు = అగ్ని.

వహ్నిశిఖము— అగ్ని జ్వాల వంటి కాంతి గలది = కుంకుమపూవు.

వాంశికుఁడు— వెదురుతోఁ జేయఁబడిన పిల్లనగ్రోవి నూఁదువాఁడు.

వాఁకతాలుపు—గంగను ధరించినవాఁడు = శివుఁడు.

వా (గీశుఁడు) క్పతి— వాక్కులకుఁ బ్రభువు = బ్రహ్మ, కవీశ్వరుఁడు, బృహస్పతి, మిగుల సరసముగ మాటలాడ నేర్చినవాఁడు.

వాక్యము—1. వచించుటకు యోగ్యమైన తిఙంత సుబంత సముదాయము. 2. కర్తృ కర్మ క్రియా సంబంధము గల పదసముదాయము. (యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తియు కలదగు పద సముదాయము).

వాగురికుఁడు—వాగురము (వల) చే సంచరించువాఁడు = వలవేఁటకాఁడు.

వాగ్మి—చతురముగా మాటలాడు (నది) వాఁడు = బృహస్పతి (చిలుక).

వాఙ్మాలము—సాక్షులు తాము చూచినది చెప్పెడు వాగ్రూపమైన యుపన్యాసము.

వాచంయముఁడు—వాక్కును నియమము చేయువాఁడు = మౌని.

వాచస్పతి—లెస్సగా మాట్లాడఁగలిగిన కారణమున వాక్కులకుఁ బ్రభువైన వాఁడు = బృహస్పతి.

వాచా(టుఁడు)డంబరుఁడు—అక్కరమాలిన పెక్కు మాటలాడు వాఁడు = వదరుఁబోతు.

వాచాదరిద్రుఁడు—వాగ్దారిద్ర్యమును గనఁబరచువాఁడు = కొలఁదిగా మాటలాడువాఁడు.

వాజపేయము—అన్న విశారమైన సుర త్రాగఁబడునట్టి యాగము.

వాజి—వేగముగాఁ బోవునది = గుఱ్ఱము.

వాడవదినె—వీథిలోనివారందఱకును వదినె వావి కలది = 1. జారిణి, 2. వేశ్య.

వాత(మృగము)ప్రమి—గాలి కెదురుగ నడచెడు జంతువిశేషము.

వాతాయువు—చూ. పై.

వాతాయనము—గాలి పోవుమార్గము = కిటికీ.

వాతా(శి)శనము—వాయువును భక్షించునది = సర్పము.

వాతిబియ్యము—దహన సంస్కార కాలమున బంధువులు పీనుఁగు నోట వేసెడు బియ్యము.

వానకోయిల—ఆకాశమునుండి వర్ష బిందువులనుమాత్రమే త్రాగి జీవించు పక్షి విశేషము = చాతకము.

వానజాలిపులుఁగు—అనిష్టమగు వర్షాగమముచే విచారించుపక్షి = హంస.

వానతఱి—వర్షములు వచ్చుసమయము = వర్షకాలము.

వాననెచ్చెలి—చూ. వానకోయిల.

వానప్రస్థుఁడు—(గృహస్థాశ్రమమును వీడి) వనమునందు నివసించెడువాఁడు. 3-వ యాశ్రమమునఁ బ్రవేశించిన వాఁడు.

వానరము—నరునివలె నుండునది = కోఁతి.

వామనావతారము—బలినిఁ బాతాళమున కణఁచుటకై యదితిగర్భమున జనించిన విష్ణుని యవతారము.

వామదేవుఁడు—1. వామభాగమున (ఎడమప్రక్క) ధరింపఁబడిన భార్య

గలవాఁడు, 2. స్త్రీచేఁ బ్రకాశించు వాఁడు, 3. శ్రేష్ఠుఁడయిన దేవుఁడు= శివుఁడు.

వామలూరువు—కుటిలముగా జంతువులచే ద్రవ్వఁబడునది = పుట్ట.

వామలోచన—చక్కని కన్నులు గల స్త్రీ

వాయసారాతి—వాయసము (కాకి) నకు శత్రువయినది = గ్రుడ్లగూబ.

వాయుదారము—వాయువుచే బ్రద్దలుకొట్టఁబడినది = మేఘము.

వాయుపథము—గాలివీచెడు మార్గము = ఆకాశము

వాయుపుత్త్రుఁడు—కలి మొలక.

వాయుసఖుఁడు—వాయుదేవునకు స్నేహితుఁడు = అగ్ని

వార(స్త్రీ)కాంత—రాజ సేవార్థము పలుమారు వచ్చునది = వేశ్య.

వారణము—శత్రుబలమును వారించునది = ఏనుఁగు జేగ.

వారణాసి—వరుణ, అసి యను నదుల మధ్యనున్న పట్టణము = కాశి.

వారి(రుహము)జము—చూ. అంబుజము, ఉప్పు శంబూకము.

వారితస్కరుఁడు—అంబుతస్కరుఁడు.

వారిదము—చూ అంబుదము.

వారి(ని)ధి (వారాన్నిధి, వార్ధి)—చూ. అంబుధి.

వారిదము—ఉదకమునందు రథమువలె గమనసాధనమైనది = 1. పడవ, 2 తెప్ప, 3. ఓడ.

వా(రి)రాశి—నీటికుప్ప =సముద్రము.

వారివాహము—చూ. జలధరము.

వార్తాపత్త్రిక—వార్తలను ప్రకటన చేయు కాగితము.

వార్తావహుఁడు—1. వృత్తాంతములను గొనిపోవువాఁడు 2. కావడి మోయువాఁడు.

వార్త్తికము—అర్థాదులను వ్యక్తపఱచెడి వ్యాఖ్యాన గ్రంథము.

వార్షికము—సంవత్సరమున కొకసారి విద్వాంసుల కిచ్చెడు పారితోషిక ద్రవ్యము, వానకాలమునఁ బుట్టినది

వాలుఁగంటి—దీర్ఘములగు కన్నులుగల యాఁడుది.

వాలుఁగకంటి—వాలుగ (చేప) వంటి కన్నులు గల స్త్రీ.

వాలుగడాలు—వాలుగ (మత్స్యవిశేషము) ధ్వజముగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

వాల్మీకి—చూ వల్మీకజుఁడు.

వావదూకుఁడు—చతురముగా నిర్దోషమాటముగా మాటాడ నేర్చినవాఁడు = వాగ్మి.

వాసకసజ్జిక—పడకటింటిని దన్నును సింగారించుకొని భర్తరాకకయి వేచియుండు నాయిక

వాసవుఁడు—వసువులు (రత్నములు) గలవాఁడు = ఇంద్రుఁడు.

వాసుకి—వసువు (రత్నము) శిరమునఁ గలవాఁడు వసుకిఁడు వాని కుమారుఁడు = సర్పరాజు.

వాసుదేవుఁడు—వసుదేవుని కుమారుఁడు = శ్రీకృష్ణుఁడు.

వాస్తోష్పతి—గృహక్షేత్రాదుల అధిదేవత = ఇంద్రుఁడు

వాహద్విషము—గుఱ్ఱమునకు శత్రువు = కారెనుపోతు.

వాహిని—వాహములు (అశ్వములు) కలది = 1 సేన 2. ప్రవహించునది = నది. 81 ఏనుఁగులు, 81 రథములు 243 గుఱ్ఱములు, 405 కాలిబంట్లుగల కాలిసేన.

వాహినీనందనుఁడు } చూ. గాంగేయుఁడు.
వాహినేయుఁడు }

వాహినీపతి—1 సేనకు నాయకుఁడు = దండనాయకుఁడు, 2 నదులకుఁ బ్రభువు = సముద్రుఁడు.

వికటకవి—పరిహాసమునకై వికటముగా మాటలాడువాఁడు.

వికర్తనుఁడు— తమస్సును బోఁగొట్టువాఁడు = సూర్యుఁడు.

వికలాంగుఁడు—వికారమయిన యవయవములు గలవాఁడు.

విఘ్నేశ్వరుఁడు (విఘ్నరాజు)—విఘ్నములకుఁ బ్రభువు = గణేశుఁడు.

విచక్షణుఁడు—విశేషముగాఁ బలుకువాఁడు = విద్వాంసుఁడు.

విజయదశమి—త్రిపురసుందరి మహిషాసురుని నవమినాఁటిరాత్రి మూఁడవ యామమున సంహరించినందునను, దేవతలకు విజయము లభించుటచేతను సంతోషచిహ్నముగ ఆయుధాదులను బూజించెడు ఆశ్వయుజ శుద్ధ దశమి

వితండ—స్వపక్షపాతముగ వాదించు మూర్ఖవాదము.

వితంతువు—మంగళసూత్రములేనిది = విధవ

విదూషకుఁడు—శృంగార నాయక సచివులలో నొకఁడయి పరిహాసము కొఱకు నితరులను విశేషముగను, చమత్కారముగను దూషించువాఁడు.

విద్విషుఁడు—విశేషముగా ద్వేషించువాఁడు = శత్రువు.

విధవ—పోయిన ధవుఁడు (భర్త) కలది = పూర్వసువాసిని ముండమోపి.

విధా(త)తృఁడు—సర్వమును సృజించువాఁడు = బ్రహ్మ.

విధుంతుదుఁడు—చంద్రుని బాధపెట్టువాఁడు = రాహువు.

వినాయకుఁడు—1 స్వతంత్రుఁడగుటవలనఁ దనకు నితరప్రభువు లేనివాఁడు

= విఘ్నేశ్వరుఁడు, పక్షులకుఁ బ్రభువు = గరుత్మంతుఁడు.

వినకలికంటి—శబ్దములను వినుట యందు సమర్థములయిన కన్నులుగలది = పాము.

విను(రతనము) కెంపు— ఆకాశమున మణివలెఁ బ్రకాశించువాఁడు = సూర్యుఁడు.

విను(న్న)మాలి— ఆకాశముయొక్క బిడ్డ = వాయుదేవుఁడు.

వినుద్రిమ్మరి—చూ. ఖేచరుఁడు.

విను|ప్రోలు— ఆకాశమునందలి పట్టణము = స్వర్గము.

వినుప్రోల్దొర—స్వర్గమునకుఁ బ్రభువయినవాఁడు = దేవేంద్రుఁడు.

వినుమనుమఁడు—ఆకసమునఁ బుట్టిన వాయుదేవునకుఁ గుమారుఁడయిన వాఁడు = భీముఁడు, ఆంజనేయుఁడు.

వినుమ్రాను—(ఆకాశము) స్వర్గము నందుండు వృక్షము = కల్పతరువు,

వినువాఁక—ఆకాశమునందలి నది = మందాకిని.

వినువాఁకతాలుపు—గంగాధరుఁడు.

వి (నువా) న్వాఁకమోపరి—చూ. మిన్నువాఁక తాలుపు.

వి(నసి)న్నిగదేవర-ఆకాశమునిగాఁ గల దేవుఁడు.

వినుసిగతూపాసి—చూ. పై.

విన్వీలను—ఆకసము వైపునున్న పట్టణము = స్వర్గము.

విపినము —భయముచే దీనియందు వడఁకుదురు = అడవి.

విపుంసి—రూపకృత్యాదులందు పురుషునిఁ బోలెడు స్త్రీ.

విపుల—విశాలమైనది = భూమి.

విప్పుఱెప్పలవేఁడు—ఎల్లప్పుడును దెరచియుండెడు కనురెప్పలు గల దేవతలకుఁ బ్రభువు = ఇంద్రుఁడు.

విప్ర (యోగము) లంభము— అనురాగముగల నాయికా నాయకుల యెడఁబాటు.

విప్రలబ్ధ—సంకేతస్థానమునఁ బ్రియుని గానక మోసగింపఁబడుటచే విచారించెడు నాయిక.

విప్రవినోది—హస్తలాఘవ విద్యచే బ్రాహ్మణులకు వినోదము కలుగఁజేసి యాచించుకొనువాఁడు.

విభాకరుఁడు—విశేషకాంతిని గలుగఁ జేయువాఁడు = సూర్యుఁడు, అగ్ని.

విభాజకము— విభజించునది = భాగహారమునందు భాగించుసంఖ్య.

విభాజితము— విభజింపఁ బడినది = భాగహారమునందు భాగింపఁగావచ్చిన సంఖ్య.

విభాజ్యము—విభజింపఁదగినది = భాగహారమునందు భాగింపఁదగిన సంఖ్య.

విభావరి—1. సూర్యకాంతిని గప్పునది, 2. చంద్రాదులచేఁ బ్రకాశించునది = రాత్రి.

విభావసుఁడు—విశేషమైన కాంతియే ధనముగాఁగలవాఁడు =1. సూర్యుఁడు 2. అగ్ని.

విభీతకము—భూతములకు నివాసమగుటచే విశేషముగా భీతిని గలిగించునది = తాండ్రచెట్టు.

విభీషణము— మిగుల భయంకరమైనది = రౌరవనరకము.

విభ్రమము—వచనభూషణ విపర్యాస రూపమైన స్త్రీల శృంగారచేష్టా విశేషము, విశేషమైన భ్రాంతి.

విమతుఁడు—విరుద్ధమైన మతము గలవాఁడు = శత్రువు.

విమాతృజుఁడు—సవతితల్లి కొడుకు.

విమానము— ఆకాశ సంచారమునఁ బక్షితోఁ బోలికగలది = దేవరథము.

విమార్గగ— పతివ్రతలకు విరుద్ధమైన మార్గమున సంచరించునది = జారిణి.

విముక్తుఁడు—సంసార బంధమునుండి తొలఁగినవాఁడు = ముక్తుఁడు.

వియచ్చరము—చూ. ఖేచరము.

వియద్గంగ—చూ. చదలేఱు.

వియన్మణి—ఆకాశమణి, సూర్యుఁడు.

వియచ్చరుఁడు—ఆకాశమున జరించువాఁడు = వేలుపు.

వియోగిని—మగనితోడి సంయోగము లేనిది = విరహిణి.

విరజస్తమసుఁడు— రజస్తమో గుణములు లేనివాఁడు = సాత్త్వికుఁడు.

విరహోత్కంఠిత—ప్రియవియోగము వలన వేదనను బొందెడు నాయిక.

విరా(గి) గుఁడు— విషయ సుఖములయం దనురాగము లేనివాఁడు.

విరిం(చి) చనుఁడు— 1. భూతములను బుట్టించువాఁడు, 2. హంసలచే వహింపఁబడువాఁడు = బ్రహ్మ.

విరితేనెత్రావుడు— పువ్వులయందలి మకరందమును ద్రాగునది = తుమ్మెద.

విరివిలుకాఁడు—చూ. పుష్పధన్వుఁడు.

విరూపాక్షుఁడు— సూర్యచంద్రాగ్ని రూపములగు త్రివిధ నేత్రములు కలవాఁడు = ఈశ్వరుఁడు.

విరోచనుఁడు—విశేషముగాఁ బ్రకాశించువాఁడు = 1. సూర్యుఁడు, 2. చంద్రుఁడు, 3. అగ్ని.

విలయము—జగము లయము నొందు కాలము = ప్రళయము.

విలాసము— ప్రియదర్శనమునఁ గలుగు కటాక్ష భ్రూవికారాది రూపమైన స్త్రీల శృంగారచేష్టావిశేషము.

వి (లుకా)ల్కాఁడు } విల్లును ధరించినవాఁడు.
వి (లుదా)ల్దాలుపు }

విలోమజాతుఁడు— తండ్రికంటె గొప్పకులముగలతల్లికిఁ బుట్టినవాఁడు.

**వివస్వంతుఁడు**—కాంతిచే నన్నింటిని గప్పెడువాఁడు = సూర్యుఁడు, దేవత.

**వివ్వచ్చుఁడు**—చూ. బీభత్సుఁడు.

**విశల్యకరణి**—చచ్చినవానిని బ్రతికించెడు ఓషధీవిశేషము.

**విశాఖుఁడు**—పక్షియగు నెమలి వాహనముగాఁ గలవాఁడు = కుమారస్వామి. (విశాఖానక్షత్రమునఁ బుట్టినవాఁడు.)

**విశాలత్వక్కు**—వెడల్పైన త్వక్కు (చెట్టు పట్ట) కలది = ఏడాకుల యరఁటి.

**విశాలాక్షి**—విశాలములైన కన్నులు కలది = పార్వతి.

**విశ్వంభర**—విశ్వమును (సమస్తమును) భరించునది = భూమి.

**విశ్వంభరుఁడు**—సమస్తమును భరించువాఁడు = విష్ణువు.

**విశ్వకర్మ**—(విశ్వకర్ముఁడు)

**విశ్వకేతు(వు)ఁడు**—ప్రపంచము నంతను వ్యాపించిన ప్రకాశము కలవాఁడు = మన్మథుఁడు.

**విశ్వజనీనము**—సర్వజనులకు హితమైనది.

**విశ్వతోముఖము**—అంతటను వ్యాపించియుండునది=పరబ్రహ్మము.

**విశ్వనాథుఁడు**—ప్రపంచమునకు భర్త = శివుఁడు.

**విశ్వభేషజము**—సమస్తదోషములను జెఱచునది యగుటచే విశ్వమను పేరు గల యౌషధము = సొంటి.

**విశ్వరూపుఁడు**—సమస్తమైన రూపములందు నుండువాఁడు = విష్ణువు.

**విశ్వసృ(జుఁడు)ట్టువు**—సమస్తము సృష్టించినవాఁడు = బ్రహ్మదేవుఁడు.

**విశ్వస్త**—విశ్వసింపఁబడునది = విధవ.

**విశ్వాత్మ**—సమస్తమును ఆత్మస్వరూపముగాఁ గలవాఁడు = బ్రహ్మ.

**విశ్వామిత్రుఁడు**—ప్రపంచమునకు స్నేహితుఁడు = ఒక రాజర్షి.

**విశ్వేదేవులు**—ధర్మునకుఁ గల పదిమంది భార్యలలో విశ్వయందు జన్మించినవారు.

**విషధరము**—విషమును ధరించునది = 1. పాము, 2. తేలు, 3. జలమును ధరించునది = మేఘము.

**విషధరుఁడు**—క్షీరసాగర మథనమునఁ బుట్టిన హాలాహలమును కంఠమున ధరించినవాఁడు = శివుఁడు.

**విషధి**—చూ. జలధి.

**విషనాశకవిషన్యాయము**—చూ. స్థావరజంగమ విషన్యాయము.

**విషపుచ్ఛము**—విషము పుచ్ఛమున (తోఁక) గలది = తేలు.

విషమచ్ఛదము—చేసియైన (7) ఆకులు కలది = ఏడాకుల అరఁటి.

విషమనయనుఁడు—చూ. వేసికంటి.

విషమశరుఁడు—చూ. పంచబాణుఁడు.

విషమాయుధుఁడు—చూ. పై.

విషరుహాము—చూ. జలరుహాము.

విషా(రము)స్యము—విషము ముఖమున గలది = సర్పము.

విషువ(ము)త్తు—రాత్రింబగళ్ళు సమముగా నుండెడు కాలము.

విష్టరశ్ర(వు)(వసు)ఁడు—1. విష్టరము (దర్భముడి) వంటి చెవులు కలవాఁడు, 2. అశ్వత్థవృక్షమున వినఁబడువాఁడు, 3. దర్భముడి యాకారముగల వెంట్రుకల సుడి కర్ణమునఁ గలవాఁడు, 4. వ్యాపించెడి స్వభావముగల కీర్తిగలవాఁడు = విష్ణువు.

విష్ణుపదము—విష్ణువునకు స్థానమైనది = 1. ఆకాశము, 2. పాలసముద్రము, 3. ఆవులమంద.

విష్ణు(పాదోద్భవ)పది—విష్ణుపాదమునఁ బుట్టినది = 1. గంగ, 2. ద్వారక.

విష్ణురథము— విష్ణువునకు వాహనమైనవాఁడు = గరుత్మంతుఁడు.

విష్ణువు— విశ్వమును వ్యాపించియుండువాఁడు=వెన్నుఁడు, నూర్యుఁడు.

విష్వక్సేనుఁడు—అంతటను వ్యాపించిన సేన కలవాఁడు = విష్ణువు.

విసపుమేఁతరి—క్షీరసాగర మథనమునఁ బుట్టిన హాలాహలమును మ్రింగినవాఁడు = శివుఁడు.

విస్ప(రుఁడు)త్వరుఁడు—ప్రసరించెడు స్వభావము కలవాఁడు.

విహంగమము, విహగము— ఆకాశమునఁ బోవునది = పక్షి.

విహసితము—మనోహర ధ్వనిగల హాసము.

విహారబాసి—సన్యాసుల మఠములోని సేవకురాలు లేక సన్యాసిని.

విహాయసము—1. దీనియందు విశేషముగా నన్నియు సంచరించును. 2. సర్వము దీనిని బొందును.

విహ్రుతము— అవసరకాలమున లజ్జచే మాటాడకుండునట్టి స్త్రీలశృంగార చేష్టావిశేషము.

వీచిమాలి— తరంగములు మాలలుగాఁ గలవాఁడు = సముద్రుఁడు.

వీతిహోత్రుఁడు— 1. హవిస్సు ఆహారముగాఁ గలవాఁడు, 2. హవిస్సును గుఱ్ఱమువలె మోసుకొనిపోయి దేవతలకర్పించువాఁడు = అగ్నిహోత్రుఁడు.

వీనులకంటి—చూ. చక్షుశ్శ్రవము.

వీరజయంతిక—యుద్ధమున వీరులు గావించెడు నృత్యము.

వీరతాయెతు— వీరులు బిరుదుగాఁగట్టుకొనెడు తాయెతు.

వీరభద్రపళ్లెము—1. వీరులాచరించెడు క్రతువిశేషము, 2. మిగుల పెద్ద పళ్ళెరము.

వీర(సువు)మాత—వీరునిగన్న తలి.

వీరముష్టి— కోవట్లకు యాచించుకొని జీవించెడు ఒక తెగ భిక్షుఁడు.

వీరవైష్ణవుఁడు—వైష్ణవ మతమునందు మిగులఁ బట్టుదలగల విష్ణుభక్తుఁడు.

వీరశైవుఁడు— శైవమతమున మిగుల పట్టుదలగల శివభక్తుఁడు.

వీరాశంసనము— వీరుల స్తుతిపాఠములకుఁగానిహింసకుఁగాని స్థానభూతమై మిగుల భయంకరమగు యుద్ధరంగము.

వీరాసనము— 1. దేనిమీదను ఆనక కూర్చుండుట, 2. రాత్రులందు ఖడ్గము చేతఁబుచ్చుకొని హెచ్చరికతోఁ గావలి గాయుట.

వృకధూపము— వివిధములగు పరిమళ వస్తుసమ్మేళనమున వచ్చిన ధూపము.

వృకోదరుఁడు— వృక ప్రమాణమైన యుదరముకలవాఁడు (తోఁడేటికడుపు వాఁడు) = భీముఁడు.

వృత్రహుఁడు—వృత్రాసురుని సంహరించినవాఁడు = ఇంద్రుఁడు.

వృద్ధశ్రవుఁడు—వృద్ధులగు బృహస్పత్యాదుల యుపదేశములను వినువాఁడు = ఇంద్రుఁడు.

వృద్ధ్యాజీవుఁడు— వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు.

వృశ్చికీగర్భన్యాయము—తేలు తల్లి గర్భమును ఛేదించుకొని పుట్టినట్టి విధము.

వృషదంశకము-ఎలుకలను గొఱుకునది = పిల్లి.

వృషభ(ధ్వజుఁడు)వాహనుఁడు— వృషభము వాహనముగాఁ గలవాఁడు = శివుఁడు.

వృషాంకుఁడు— ఎద్దు చిహ్నముగాఁ గలవాఁడు = శివుఁడు.

వెండికొండమన్నీఁడు—కైలాసపర్వతమనుఁ ప్రభువు = శివుఁడు.

వెండి(గుండు)కొండ— కైలాస పర్వతము.

వెడవిల్కానిశాబా— మన్మథునకు వాహనమైనది = చిలుక.

వెడద(నోటి) (మోము)మెకము— విశాలమైన (నోరు) ముఖము గల మృగము = సింహము.

వెడవింటి, వెడవిలు(కాఁడు)తుఁడు— చూ. తూడు విల్తుఁడు.

వెనకయ్య } వెనకయ్య } విఘ్నేశ్వరునకు వెనక (పిమ్మట) పుట్టినవాఁడు= కుమారస్వామి.

వెనుకచూపుల మెకము— వెనుక దృష్టిగల జంతువు = భల్లూకము.

వెన్నదొంగ,
వెన్నముచ్చు } రేపల్లెయందు వెన్న దొంగిలించినవాఁడు = కృష్ణుఁడు.

వెన్నునన్న— అదితియందు వామన రూప విష్ణువునకుఁ బూర్వమున జన్మించినవాఁడు = ఇంద్రుఁడు, బలరాముఁడు

వెన్నుని వల (కన్ను) చూపు— శ్రీవిష్ణుని కుడికన్నయిన వాఁడు = సూర్యుఁడు

వెన్నుని (కోడుకురాణి) కోడలు — శ్రీవిష్ణుని కుమారుఁడగు బ్రహ్మ భార్య = సరస్వతి

వెన్నునడుగు— వామనావతారమున శ్రీవిష్ణుని 2 వ యడుగైనది = ఆకాశము.

వెన్నునిటెంకి—విష్ణుని నివాసస్థానము = 1. సముద్రము 2. వైకుంఠము

వెన్నుపడగ—విష్ణునకు జెండాయయిన వాఁడు = గరుత్మంతుఁడు

వెన్నుపాన్పు— విష్ణునకు శయ్యగా నుండువాఁడు = ఆదిశేషుఁడు

వెన్నువలచూపు—విష్ణుని దక్షిణ నేత్రము = సూర్యుఁడు

వెన్నెల (పిట్ట) పులుఁగు— వెన్నెలమాత్రాగి జీవించెడి పక్షి విశేషము = చకోరము.

వెన్నెల (రాయఁడు) ఱేఁడు— వెన్నెలకుఁ బ్రభువు = చంద్రుడు.

వెఱ్ఱినీళ్ళమేలువాఁడు— మద్యమును ప్రేమించువాఁడు = బలరాముఁడు.

వెలజక్కి—సామిటెంకి— ఉచ్చైశ్శ్రవము నకుఁ బ్రభువైన దేవేంద్రని వాస స్థానము = స్వర్గము

వెల (వెలఁది) యాలు— వెలతీసికొని ప్రేమించెడు స్త్రీ = వేశ్య యు.

వెల్లజాఱుడువీడు— గంగ ప్రవహించెడు పట్టణము

వెల్లముత్తైదువ—తెల్లని రూపముగల పుణ్యస్త్రీ = సరస్వతి

వెలిగారము- బంగారమునకుఁ గాంతిని గలుగఁజేయు నొకదినుసు తెల్లని యుప్పు = టంకణము

వెలిగిడ్డి— చూ. తెలిమొదవు.

వెలిగారు— తెల్లని యేనుఁగు = ఐరావతము.

వెలియాలపోతురౌతు—తెల్లని యెద్దు నెక్కి తిరుగువాఁడు = శివుఁడు.

వెల్లివాఁక—చూ తెలియేఱు.

వె (ల్గు) లుఁగుఱేఁడు— కాంతులకు ప్రభువు = సూర్యుఁడు.

వేఁగంటికచ్చేరి— వేయికన్నులుగల దేవేంద్రుని న్యాయస్థానము=సుధర్మ.

వేఁగంటిగొంగ— వేయి కన్నులుగల దేవేంద్రునకు శత్రువు = వృత్రాసురాదులు.

వేఁగంటిమెక్కుడు— వేయికన్నులు గల దేవేంద్రునకు వాహనమైనది = ఐరావతము.

వేఁగంటిసైదోడు—వేయికన్నులుగల దేవేంద్రునకుఁ దమ్ముఁడు = వామన రూప విష్ణువు.

వేగు (వేగురు)ఁజుక్క; వేగురిక్క—తెల్లవారు సమయమున నుదయించు నక్షత్రము = శుక్రుఁడు.

వేఁడికంటి—వేఁడిమి గల మూఁడవ నేత్రము కలవాఁడు = శివుఁడు.

వేఁడివెలుఁగు—వెచ్చని కాంతులు గలవాఁడు = సూర్యుఁడు.

వేడి వే (లుపు) ల్పు—వెచ్చని దేవుఁడు = 1. సూర్యుఁడు, 2. అగ్ని.

వేడుకకత్తె (త్తె) త్తియ—పరపురుషుల యందుఁ గాంక్షకలది = కులట, వినోదము కలుగఁజేయునది = వేశ్య.

వేణుధ్మఁడు—పిల్లనగ్రోవి నూదు వాఁడు.

వేత్రధరుఁడు—బెత్తమును హస్తమున ధరించువాఁడు = కట్టిక.

వేదవతి—జననకాలమున నూతికా గృహమందు వేదధ్వని వినఁబడుట చేతను, తండ్రియగు కృశధ్వజుఁడు వేదము పఠించునపుడు ఈమె పుటుట చేతను నీమెకీ పేరు గలిగెను.

వేదవ్యాసుఁడు—వేదములను విభాగముచేసి లోకవ్యాప్తిచేసినముని = పరాశర పుత్త్రుఁడు.

వేదాంగములు—వేదమునకవయవములైనవి = 6 శాస్త్రములు.

వేదాంతము—వేదముల చివరనుండునది = ఉపనిషత్సమూహము. (బ్రహ్మజ్ఞానోపదేశ సర్వస్వము)

వేఁయంచులవాలు—వేయి అంచులు గల ఆయుధము = చక్రాయుధము.

వే (యి) చుంగల పాగగలదిట్ట—వేయి పడగలుగల ఆదిశేషుఁడు అలంకారముగాఁ గలవాఁడు = శివుఁడు.

వేయిచేతుల(తేఁడు) (యెకిమీఁడు) దిట్ట—వేయిచేతులుగల ప్రభువు = 1. సూర్యుఁడు, 2. కార్తవీర్యార్జునుఁడు.

వే (లుపు) ల్పు గమికాఁడు—దేవసేనకు నాయకుఁడయినవాఁడు = కుమారస్వామి.

వే(లుపు)ల్పుగాణ—దేవతా సమూహములోఁ బాటకాఁడు = గంధర్వుఁడు.

వే(లుపు)ల్పుగిడ్డి—దేవతలకుఁ గోరికల నీడేర్చెడి ఆవు = కామధేనువు.

వే(లుపు)ల్పు జడదారి—దేవలోకపు ముని = నారదుఁడు.

వే(లుపు)ల్పుఁజెట్టు—దేవలోకమున దేవతల కోరిక లీడేర్చు వృక్షము = కల్పతరువు.

వే(లుపు)ల్పుటెంకి—దేవతల నివాస స్థానము = స్వర్గము.

వే (లుపు) ల్పు టేటిమగఁడు—గంగాదేవి భర్త = ఈశ్వరుఁడు.

వే(లుపు)ల్పుటేఱు— దేవలోకమునఁ బ్రవహించునది = గంగ.

వే(లుపు)ల్పుటేటి సవతికొడుకు— గంగాదేవికి సవతి యగు పార్వతి కొమారుఁడు = 1. విఘ్నేశ్వరుఁడు, 2. కుమారస్వామి.

వే(లుపు)ల్పుటొజ్జ—దేవతల కుపాధ్యాయుఁడయినవాఁడు=బృహస్పతి.

వే(లుపు)ల్పుదాయ—దేవతలకు జాతియైనవాఁడు = అసురుఁడు.

వేలుపు(ల్పు)ఁదెరువు— దేవతలకు మార్గమయినది = ఆకాశము.

వేల్పుదొరతేజి—దేవేంద్రునివాహనమగు గుఱ్ఱము = ఉచ్చైశ్శ్రవము.

వే(లుపు)ల్పుఁబెద్ద—సురజ్యేష్ఠుఁడు.

వే(లుపు)ల్పు బానిస—దేవతలకు సేవలు చేయునది = వేశ్య.

వే(లుపు)ల్పుబాస—దేవతలు మాట్లాడు భాష = సంస్కృతము.

వే(లుపు)ల్పు(బువ్వ) బోనము— దేవతలకు భోజనమయినది = అమృతము, చంద్రుఁడు.

వేల్పుప్రోలు—సురలోకము = స్వర్గము.

వే(లుపు)ల్పుమల— దేవతల విహారపర్వతము = మేరువు.

వే(లుపు)ల్పుఱేఁడు—దేవతలకు ప్రభువు = ఇంద్రుఁడు.

వే(లుపు)ల్పులమొగము— దేవతలకు ముఖమైనవాఁడు, తనయందు వేల్చిన హవిరాదికమును దేవతలకుఁ గొనిపోవువాఁడు = అగ్ని.

వేవెలుఁగు— వేయి కిరణములు గలవాడు = సూర్యుఁడు.

వే(లుపు)ల్పుమానికము— దేవతల కోరిక లీడేర్చు మణి = చింతామణి.

వేల్పువెజ్జు— దేవవైద్యుఁడు = ధన్వంతరి.

వైకుంఠము—వైకుంఠుఁ (విష్ణువు) డుండెడుస్థానము = మోక్షము.

వైకుంఠుఁడు—ఒక యవతారమున వికుంఠయను తల్లియందుఁ బుట్టినవాఁడు = విష్ణువు.

వైఖానసుఁడు—వానప్రస్థులలో నొకతెగవాఁడు, విష్ణుదేవళములోని అర్చకుఁడు.

వైదూర్యము—విదూరదేశమునఁ బుట్టిన రత్నము.

వై (ణవి)ణికుఁడు— వెదురులోఁ జేసిన పిల్లనగ్రోవి నూదువాఁడు.

వైతంసికుఁడు—మృగ పక్ష్యాదులను జంపి విక్రయించువాఁడు.

వైతాళికుఁడు— రాజులయొద్ద సమయముఁ గనిపెట్టి స్తోత్రము చేయుచుండువాఁడు.

వైదర్భి—విదర్భరాజగు భీముని కొమరిత = దమయంతి, రుక్మిణి.

వైదికుఁడు—వేదాధ్యయన సంపన్నుఁడగు బ్రాహ్మణుఁడు.

వైదేహికుఁడు—విదేహ రాజ్యమును బాలించినవాఁడు = జనకుఁడు.

వైధవేయుఁడు—విధవ (భర్తలేని) యొక్క కొడుకు.

వైధాత్రుఁడు—విధాత యొక్క కొడుకు = వైద్యశాస్త్రకర్తయు దేవర్షియు నగు సనత్కుమారుఁడు.

వైనతేయుఁడు—(కశ్యప బ్రహ్మకు) వినతయందుఁ బుట్టినవాఁడు = గరుత్మంతుఁడు, అనూరుఁడు.

వైన్యుఁడు—వేనుని కుమారుఁడు. (దుర్మార్గమున నున్న వేనుఁడను రాజు యొక్క వామహస్తమును మథింపఁగా విషాదుఁడును, పృథు హస్తము (కుడిచేయి)ను మథింపఁగా పృథువును బుట్టిరి) (పూర్వగాథాలహరి)

వైమాత్రేయుఁడు—సవతితల్లి (విమాత) కొడుకు.

వైయాకరణుఁడు—వ్యాకరణ శాస్త్రమును జదివినవాఁడు.

వైరాగ్యము—ప్రపంచవిషయములందనురాగము లేకుండుట.

వైరోచనుఁడు—విరోచనుఁడను రాక్షసుని కొడుకు = బలిచక్రవర్తి.

వైవస్వతుఁడు—వివస్వంతు(సూర్యుఁడు)ని కుమారుఁడు = 1. యముఁడు, 2. ఒక మనువు, 3. శని.

వైశేషికుఁడు—వైశేషికము (సప్త పదార్థములను జెప్పునట్టి తర్క శాస్త్రము) నెఱింగినవాఁడు.

వైశ్వదేవము—విశ్వదేవతలనుగూర్చి చేసెడు హోమాదికము.

వైశ్వానరుఁడు—విశ్వానరుఁడను ఋషి కుమారుఁడు = అగ్ని. సమస్తమైన నరులను అభిమానించువాఁడు = శివుఁడు.

వైష్ణవుఁడు—విష్ణువునందు మాత్రమే భక్తిగలవాఁడు.

వోఢజుఁడు—గర్భవతిఁ బెండ్లాడఁగా బుట్టినవాఁడు.

వ్యళీకము—మన్మథావేశముచేఁ జేయఁబడిన కామినీజనాపరాధము.

వ్యాఘ్రనఖము—పులిగోరువలెనుండు భూషణ విశేషము.

వ్యానము—శరీరమంతటను వ్యాపించియుండునది, దీనిచే విశేషముగా బ్రతుకుదురు = పంచవాయువులలో నొకటి.

వ్యాసఘట్టము—వ్యాసరచిత భారతమున నతికష్టమైన భాగము. (విఘ్నేశ్వరుని వ్యాసుఁడు తానుచెప్పు పురాణములను వ్రాయఁగోరెను. వినాయకుఁడు తన వ్రాత కాటంకము కలుగకుండునట్లు త్వరగా జెప్పవలెననెను. వ్యాసుఁడు తానుజెప్పునది అర్థముఁ జేసుకొని మఱి వ్రాయ వలసినదిగా నతని నొడంబఱచెను. వ్యాసుఁడు తనకుఁ గవనము సరిగా స్ఫురింపనప్పు

నొక కఠినమైన శ్లోకమును జెప్పుచు, దానిని గణించి, యవగాహనము చేసుకొనులోపల వేఱుశ్లోకము లూహించుకొనుచుండెడివాఁడని వాడుక)

వ్యుత్పత్తి — శబ్దసంభవ ప్రకారము = శాస్త్రజన్య విజ్ఞానము.

వ్యోమకేశుఁడు — ఆకాశమున నిండి యున్న వెండ్రుకలు గలవాఁడు = ఈశ్వరుఁడు.

వ్యోమధూమము — ఆకాశమున ధూమాకారముగా నున్నది = మేఘము.

వ్యోమయానము — ఆకాశ గమనమున కాధారమగునది = విమానము.

వ్రేఁతలమేలువాఁడు — గోపికలకుఁ బ్రియుఁడైనవాఁడు = శ్రీకృష్ణుఁడు.

శంకరుఁడు — సుఖమును గలుగఁజేయువాఁడు = శివుఁడు.

శంఖపాణి — చూ. కలుమురితాల ప్ర.

శంబరారి — శంబరాసురునకు శత్రువైనవాఁడు = మన్మథుఁడు.

శంభు(వు)ఁడు — సుఖ మీయన వలనఁ గలుగును = శివుఁడు.

శకుంతల — శకుంతము (పక్షి) లచే రక్షింపఁబడినది = మేనకా విశ్వామిత్రుల కూఁతురు. కణ్వుని పెంపుడు కూఁతురు.

శక్తిధరుఁడు — శక్తియను నాయుధమును ధరించినవాఁడు = కుమారస్వామి.

శక్రుఁడు — దుష్టులను శిక్షించుటయందు శక్తిగలవాఁడు = ఇంద్రుఁడు.

శచీపతి — శచీదేవియొక్క మగఁడు = ఇంద్రుఁడు.

శతకము — నూఱు పద్యములు గల గ్రంథము. నూఱు సంఖ్య గలది.

శతకోటి — నూఱంచులు గలది = ఇంద్రుని వజ్రాయుధము.

శతఘ్ని — నూర్గురనేకకాలమునఁ జంపునది = ఫిరంగి.

శతపత్త్రము — 1. నూఱు ఱేకులు గలది = తామర పువ్వు, 2. నూఱు ఈఁకలు గలది = 1. నెమలి, 2. బెగ్గురుపక్షి, 3. రాచిలుక, 4 వడ్రంగిపిట్ట.

శతమన్యు(వు)ఁడు — నూఱు యజ్ఞములు చేసినవాఁడు = ఇంద్రుఁడు.

శతాంగము — నూఱు అవయవములు గలది = యుద్ధరథము.

శతాబ్దము — నూఱు సంవత్సరముల పరిమితిగల కాలము.

శతారము — చూ. శతకోటి.

శతావధాని — ఏకకాలమున నూఱు అంశములందు మనస్సును బ్రవేశపెట్టఁ గలవాఁడు.

శనైశ్చరుఁడు — మందముగాఁ జరించువాఁడు = శని.

శబ్దగుణము— శబ్దము గుణముగాఁ గలది = ఆకాశము.

శబ్దగ్రహము—శబ్దమును గ్రహించునది = చెవి.

శబ్దశాస్త్రము— శబ్దముల లక్షణము తెలుపునది = వ్యాకరణము.

శమనపురి— యముని పట్టణము = నరకము.

శమనస్వస— యమునకుఁ దోడఁబుట్టినది = యమునానది.

శమనుఁడు — ప్రాణులను శమింపఁ జేయువాఁడు = యముఁడు.

శమము— బహిరింద్రియ నిగ్రహము.

శరజన్ముఁడు— రెల్లునందు బుట్టినవాఁడు = కుమారస్వామి.

శరవణ(జన్మ)జుఁడు, శరవణోద్భవుఁడు } చూ. శరజన్ముఁడు.

శరభము— సింహమును జంపునది = 8 కాళ్ళును, శిరోనేత్రములును గల జంతువు.

శరావము—పడిన యుదకాదికమును రక్షించునది = మూకుఁడు.

శరాస(న)ము— బాణములను జిమ్మునది = విల్లు.

శరీరజుఁడు—శరీరమునకుఁ బుట్టినవాఁడు = కుమారుఁడు.

శర్వరి—వ్యాపారమునుగాని, దినమును గానిఁ జెఱచునది = రాత్రి.

శర్వాణి—శర్వుని భార్య = పార్వతి.

శర్వుఁడు—ప్రళయమున భూతములను హింసించువాఁడు = శివుఁడు.

శశ(శి)ధరుఁడు—కుందేటిని ధరించినవాఁడు = చంద్రుఁడు.

శశవిషాణము—కుందేటి కొమ్మువలె లోకమున దుర్లభము.

శశాంకుఁడు— శశము (చెవులపిల్లి) చిహ్నముగాఁగలవాఁడు=చంద్రుఁడు.

శశాదనము—కుందేటిని దినునది = డేగ.

శశాదుఁడు—తండ్రియగు ఇక్ష్వాకు శ్రాద్ధము నిమిత్తము మాంసమును దెమ్మని పంపఁగా నపుడు కొన్నిశశము లను వేఁటాడి, యందొక దానిని భక్షించి, మిగిలినవానిని గొనిపోయినవాఁడు = వికుక్షి.

శశి—చూ. శశధరుఁడు.

శస్త్రాజీవుఁడు— శస్త్రముచే జీవించువాఁడు.

శాంకరి—శంకరుని కుమారుఁడు = కుమారస్వామి, వినాయకుఁడు, అగ్ని.

శాంతనవుఁడు—శంతనునకు గంగయందుఁబుట్టిన (8-వ)వాఁడు = భీష్ముఁడు.

శాకునికుఁడు —శకునము (పక్షి) లను జంపువాఁడు = బోయవాఁడు.

శాక్తుఁడు—, శాక్తేయుఁడు } శక్తిపూజ చేసినవాఁడు.

శాఖామృగము— వృక్షశాఖలందు సంచరించు మృగము = కోఁతి.

శాతకుంభము—శతకుంభపర్వతమున లభించునది = బంగారము.

శాతోదరి—కృశించినకడుపు (సన్నని నడుము) గల యాఁడుది.

శాఫరికుఁడు—చేపలను బట్టువాఁడు.

శాబ్దికుఁడు— శబ్దశాస్త్రము (వ్యాకరణము) తెలిసినవాఁడు.

శార్ఙ్గి—శార్ఙ్గమను ధనుస్సును ధరించినవాఁడు = విష్ణువు.

శార్దూలము—హింసించునది = పులి.

శిఖావంతుఁడు— సిగరూపుగల కిరణములు గలవాఁడు = అగ్ని.

శిఖి—సిగలు గలది=బాణము, నెమలి, అగ్ని, కోడి, చెట్టు.

శిఖివాహనుఁడు—నెమలి వాహనముగాఁ గలవాఁడు = కుమారస్వామి.

శితికంఠుఁడు— నల్లని కంఠము గలవాఁడు = శివుఁడు.

శిపివిష్టుఁడు—బట్టతల గలవాఁడు = శివుఁడు, విష్ణువు.

శిర(స్క)స్త్రాణము— చూ. శిరస్త్రము.

శిరస్త్రము—యుద్ధాదులందుశిరస్సును రక్షించునది = ఇనుపకుళ్ళాయి.

శిరోజ(రుహ)ము— శిరస్సునందు బుట్టునది = వెండ్రుక.

శిలాక్షరము— ఱాతిమీఁదఁ జెక్కఁబడిన యక్షరమువలె శాశ్వతమయినది.

శిలాజతువు—ఱాతియందుఁ బుట్టునది = శిలాజిత్తు.

శిలావృత్తి—కోఁతకోసిన మళ్ళయందుఁ బడియున్న వెన్నుల నేఱుకొనిజీవించు వృత్తి.

శిలీముఖము—శల్యము (ముల్లు) కొనయందుఁ గలది = బాణము, తుమ్మెద.

శివరాత్రి—మాఘ బ ౧౪ శనివాఁడు వచ్చెడి శివసంబంధమైన యుపవాస దినము.

శివుఁడు— 1. సాధుల హృదయమున శయనించియుండువాఁడు, 2. మంగళప్రదుఁడు = ఈశ్వరుఁడు.

శిష్యసంచారము— వైష్ణవగురువులు తమ శిష్యులతో గ్రామములకుఁ బోవుట.

శిష్టాచారము—సదాచార సంపన్నుల నడవడి.

శీకరము—1. శీతమును గలుగఁ జేయునది, 2. గాలిచే నిటునటు విసరఁబడిన వర్షబిందువులు = తుంపర.

శీత(కిరణుఁడు)కరుఁడు— చల్లనికిరణములు కలవాఁడు = చంద్రుఁడు.

శీతనగము—చల్లనిపర్వతము = హిమవంతము.

శీతభానుఁడు—చంద్రుఁడు.

శీతమయూఖుఁడు—చల్లనికిరణములు కలవాఁడు = చంద్రుఁడు.

శీతరశ్మి—చల్లని కిరణములు కలవాఁడు = చంద్రుఁడు.

శీతాంశుఁడు—చూ. శీతకరుఁడు.

శుండాలము—తొండముతో నదకను గ్రహించునది = ఏనుఁగు.

శుకవాహుఁడు—చిలుక వాహనముగాఁ గలవాఁడు = మన్మథుఁడు.

శుకుఁడు—వ్యాసునకు శుకరూపిణియగు సూర్యశియందుఁబుట్టినవాఁడు.

శుక్రశిష్యుఁడు—శుక్రాచార్యుని శిష్యుఁడు = రాక్షసుఁడు.

శుద్ధాంతము—రాజస్త్రీలుండుస్థలము = అంతఃపురము.

శునకము—ఇటు నటు తిరుగునది = కుక్క.

శునకముద్ర—వెరస్థులనుదుట శునకాకారముగాఁ గాల్చి ముద్రించెడు దండనవిశేషము.

శునాసీరులు — వాయు సూర్యులు సహాయులుగాఁగలవాఁడు= ఇంద్రుఁడు.

శుభదంతి—చక్కని దంతములు గలది = వాయవ్యదిశయందలి యాఁడేనుఁగు.

శుభోదర్కము—ముందు శుభము గలది.

శుభ్రాంశువు—తెల్లని కిరణములు కలవాఁడు = చంద్రుఁడు.

శూన్యవాది—దేవుఁడు లేఁడనెడి వాఁడు = నాస్తికుఁడు.

శూర్పణఖ—చేఁటలవంటి నఖము (గోరు)లు గలది = రావణుని చెల్లెలు.

శూర్ప(కర్ణము) శ్రుతి—చేఁటలవంటి చెవులుగలది = ఏనుఁగు.

శూరంమన్యుఁడు—తాను శూరుఁడనని తలఁచువాఁడు.

శూలపాణి—త్రిశూలము హస్తమందుఁ గలవాఁడు = శివుఁడు.

శూలి / శూలధరుఁడు } చూ. శూలపాణి,(శూలరోగముగలవాఁడు.)

శృంగబేరము—శృంగము (కొమ్ము)లవంటి యాకారము గలది = అల్లము.

శృంగాటకము—నాలుగు మార్గములు కలిసిన చోటు.

శృంగారయోని—శృంగారరసమునకు కారణమైనవాఁడు = మన్మథుఁడు.

శేష(శాయి)శయనుఁడు—ఆదిశేషుఁడుశయ్యగాఁగలవాఁడు = విష్ణువు.

శైలకన్య—పర్వతరాజగు హిమవంతుని కొమార్తె = పార్వతి.

శైలధన్వుఁడు—చూ. గట్టువిల్తుఁడు.

శైలాటము—పర్వతములయందు సంచరించునది = సింహము

శైవలిని—నాచు కలది = నది.

శోచిష్కేశుఁడు—శోచిస్సు (కాంతి) కేశము (తలవెండ్రుక) గాఁగలవాఁడు = అగ్ని.

శోణితము—శోణ (ఎఱుపు) వర్ణము కలది = రక్తము.

శౌద్ధోదని—శుద్ధోధనుఁ డను రాజుఁ గొడుకు = బుద్ధుఁడు.

శౌనకుఁడు—నైమిశారణ్యమున 12 వర్షములు సత్రయాగము చేసె నాతని వలన పుణ్యకథలను వినిన శునకుని పుత్త్రుఁడు = ఒక మహర్షి.

శౌరి—శూరుని మనుమఁడు = విష్ణువు.

శ్మశానము—శవములకు శయనము = వల్లకాఁడు.

శ్మశ్రువు—ముఖము నాశ్రయించునది = మీసము, గడ్డము.

శ్యాలకుఁడు—భార్యకుఁ దోడఁబుట్టినవాఁడు = బావమఱఁది.

శ్యేనము—తీవ్రముగాఁ బోవునది = డేగ.

శ్రద్ధాళువు—శ్రద్ధగలది, వేడ్కగల యాఁడుది, శ్రద్ధగలవాఁడు.

శ్రాద్ధదేవుఁడు—పితృకర్మలకు దేవుఁడు = యమధర్మరాజు.

శ్రాద్ధము—శ్రద్ధచే నివ్వఁబడినది, శాస్త్రయుక్తమయిన దేశకాలపాత్రాది నియమములచేఁ బితృదేవతలనుగూర్చి చేయఁబడు బ్రాహ్మణభోజనాదికము = ఆబ్దికము.

శ్రావణి—శ్రావణమాసము నందలి పూర్ణిమ.

శ్రియంమన్యుఁడు—తాను యోగ్యుఁడ నని తలఁచువాఁడు = గర్వి.

శ్రీ—విష్ణువు నాశ్రయించునది = లక్ష్మి.

శ్రీకంఠుఁడు—క్షీరసాగర మథనమునఁ బుట్టిన హాలాహలమును మ్రింగుటవలన శోభకంఠమునఁ గలవాఁడు - శివుఁడు.

శ్రీకరుఁడు—సంపదనుఁ గలుగఁజేయువాఁడు, శ్రీరాగము పాడువాఁడు.

శ్రీకాంతుఁడు(శ్రియఃపతి)—లక్ష్మీదేవి మగఁడు = విష్ణువు.

శ్రీకాళహస్తి—కృతయుగమున శ్రీయును (సాలెపురుగు), త్రేతాయుగమున కాళమను సర్పమును, ద్వాపరమున హస్తి (యేనుఁగు) యును ముక్తినొందిన స్థలము = శివలింగ క్షేత్రము.

శ్రీఘనుఁడు—యోగ్యతచే గొప్పవాఁడు = బుద్ధదేవుఁడు.

శ్రీదుఁడు—ధనము నిచ్చువాఁడు = కుబేరుఁడు.

శ్రీ(పతి)ధరుఁడు—లక్ష్మిని ధరించువాఁడు = విష్ణువు.

శ్రీనివాసుఁడు—లక్ష్మికి నివాసమైనవాఁడు = విష్ణువు.

శ్రీపుత్రుఁడు—లక్ష్మీదేవి కొడుకు = మన్మథుఁడు.

శ్రీముఖము—సన్యాసులు, గురువులు మొదలగు పెద్దలు వ్రాసి పంపెడు పత్రిక.

శ్రీవత్సలాంఛనుఁడు—శ్రీవత్స మను చిహ్నము వక్షమునఁ గలవాఁడు = విష్ణువు.

శ్రోత్రియుఁడు—శ్రుతిని (వేదమును) జదివిన బ్రాహ్మణుఁడు.

శ్రౌతము—1. శ్రుతము (వేదము) నందు విధింపబడినది 2 వేదోక్తకర్మ ప్రతిపాదక గ్రంథము.

శ్వపచుఁడు—శ్వానము (కుక్క)ను పచనము (వండుట) చేసి తినువాఁడు.

శ్వసనాశనము—శ్వసనము (వాయువు) అశనము (అన్నము) గాఁ గలది = సర్పము.

శ్వానము—చూ శునకము.

శ్వేతము—తెల్లని వన్నెగలది = వెండి.

శ్వేతవాహనుఁడు—తెల్లని గుఱ్ఱములు వాహనముగాఁగలవాఁడు=అర్జునుఁడు.

షట్కర్ముఁడు—యజన యాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహము లనెడు ఆఱు కర్మలు గల స్మార్త బ్రాహ్మణుఁడు.

షట్పదము—ఆఱుపాదములు గలది = తుమ్మెద.

షడభిజ్ఞుఁడు—దివ్యదృష్టి, దివ్యశ్రోత్రము పూర్వనివాసానుస్మృతి, పరేంగిత జ్ఞానము, అప్రత్యక్ష విషయ జ్ఞానము వియద్గమనానుగమన వ్యూహాది లక్షణమైన బుద్ధియుని 6 అభిజ్ఞలుగలవాఁడు = బుద్ధదేవుఁడు

షడాననుఁడు—అగ్ని భార్యలని లోకాపవాదములను బొందిన షట్కృత్తికల (వశిష్ఠుఁడు కాక మిగిలిన 6 గురు మహర్షుల భార్యల) స్తన్యపానమునకై యాఱు ముఖములు ధరించినవాఁడు = కుమారస్వామి.

షడము—నాసిక కంఠము వక్షస్సు తాలువు జిహ్వ, దంతము అను నాఱు స్థలములందును బుట్టిన స్వరవిశేషము.

షణ్ముఖుఁడు—చూ షడాననుఁడు

షష్టిపూర్తి— అఱువది సంవత్సరములు గడచిన పిదప గొప్పవారికి చేయు నుత్సవము.

షాణ్మాతురుఁడు—కార్తికేయుఁడు

షోడశము—మృతునకుఁ బదునారవ దినమునఁ జేయు శ్రాద్ధకర్మము.

సంకర్షణుఁడు—శత్రువులను ప్రళయమందలి జనులను సంహరించువాఁడు= బలరాముఁడు.

సంకల్ప(జన్మ-జు)ఁడు-సంకల్పమునఁ బుట్టువాఁడు = మన్మథుఁడు.

**సంకల్ప(యోని)భవుఁడు**—చూ. పై.

**సం (క)(కు) సుకుఁడు**—దేనియందును నిలకడ లేనివాఁడు.

**సంకుదారి**—చూ. కలుమురి తాలుపు.

**సంక్రందనుఁడు**—శత్రువును ఆక్రందనము (మొఱ) పెట్టించువాఁడు = దేవేంద్రుఁడు.

**సంక్రమణము**—సూర్యుఁడు మేషాది రాసులలో నొకరాశినుండి మఱియొక రాశికిఁ బ్రవేశించుట.

**సంక్రాంతి**—చూ. పై

**సంఖ్యము**—ఇందు వీరుఁడు లెస్సగాఁ గొనియాడఁబడును = యుద్ధము

**సంగమడుగు**—గ్రామమునకు సమీపమున నుండెడు మడుగు.

**సంగ్రహము** — సంక్షేపముగా గ్రహింపఁబడిన యర్థాదికము గలది = సారాంశమయిన గ్రంథము.

**సంఘాతమరణము**—జనులు గుంపులు గుంపులుగాఁ జచ్చుట.

**సంచయనము**— (మరణించిన మఱునాఁడు శ్మశానమున నెముకలు) ప్రోగు చేయుట.

**సంచికట్టు**—మందుల సంచి గట్టుకొని యదేపనిగా నుండెడు వైద్యుఁడు.

**సంచక(రువు)రము**—క్రయ విక్రయాదులకుఁ బూర్వము బేరముయొక్క స్థిరత్వమునకై యిచ్చెడు ధనము = బజానా.

**సంచకారము**—చూ. పై

**సంజీవకరణి**—తిరిగి జీవింపఁ జేసెడు ఓషధీవిశేషము. చూ. క్రిం.

**సంజీ(వి)వని**—మరణించినవారిని బ్రతికించు మందు, సంజీవకరణి.

**సంతానము**—లెస్సగాఁ గోరికలను దీర్చునది = ఒక కల్పవృక్షము.

**సందుదోషము**—బిడ్డలకు మాససందులయందుఁ గలుగు గ్రహదోషము.

**సందేశహారుఁడు**—వార్తలను మోసికొని పోవువాఁడు = దూత

**సంధర్షణి**—సాఁగఁదీసినను యథాస్థితికి వచ్చెడు ఒక బంక దినుసు = రబ్బరు.

**సంధానకరణి**—స్వస్థముచేయు నోషధీవిశేషము. చూ సంజీవకరణి.

**సంధ్య**—అహోరాత్రములచే సంధింపఁబడునది = ధ్యానము చేయదగిన కాలము. సూర్యోదయమునకు మూఁడు గడియలవరకును గల కాలము ప్రాతస్సంధ్య సూర్యాస్తమయమునకుఁ బూర్వము మూఁడు గడియల కాలము సాయంసంధ్య, పగటియొక్క ప్రమాణమున మధ్యభాగము మాధ్యాహ్నిక సంధ్య.

**సంధ్యావందనము**— త్రిసంధ్యలయందును జేయఁబడు దైవప్రార్థనము.

సంపరాయకము—ఇందు వీరులు పరస్పరము కదియుదురు = యుద్ధము.

సంప్రదాయము—గురుపరంపరచేతను, వంశక్రమముచేతను వచ్చిన వాడుక, వంశాచారము.

సంప్రయోగము—మూలికలతోఁ జేసెడు భూతోచ్చాటనాది క్రియ.

సంప్రహారము—ఇందు శత్రువులను లెస్సగా బ్రహరింతురు = యుద్ధము.

సంప్రోక్షణము—పరిశుద్ధికై యుదకాదులను జిలుకరించుట, విగ్రహాదులకు జీవప్రతిష్ఠచేయుట.

సంయత్తు—అస్త్రశస్త్ర గౌరవముగల చోటు = యుద్ధము.

సంయమము—వ్రతాదుల కంగమై తొలిదినముననే చేయఁదగిన యాచారము, హింసాదులవలన విరమించుట.

సంయుగము—పరస్పరము కూడిన రథముల నొగలు గలది = యుద్ధము.

సంలాపము—ఉల్లాసముగల పరస్పర సంభాషణము.

సంవర్తము—దీనియందు జగము లయమగును = ప్రళయము.

సంవీతము—హారమువలె వేసికొన్న జందెము, చుట్టుకొనఁబడినది.

సంశప్తకుఁడు—తిరిగిపోనని యొట్టుపెట్టుకొని యుద్ధముచేయువాఁడు.

సంస్కృతము—వ్యాకరణాది శాస్త్రములచే లెస్సగాఁ బరిష్కరింపఁబడిన దేవభాష.

సంస్తంభనము—శత్రువును గదలనీయని యస్త్రవిశేషము.

సంస్ఫోటము—ఇందు వీరులశిరములు వ్రక్కలగును = యుద్ధము.

సక్తుప్రస్థుఁడు—ఒక బీద బ్రాహ్మణుఁడు కుంచెఁడు పేలపుపిండి సంపాదించుకొని తానును, తనభార్యయు, కుమారుఁడును, కోడలును సమముగా దినవుద్యుక్తులుకాఁగా నొక యతిథి వచ్చెను. బ్రాహ్మణుఁడు తన భాగము నతని కిచ్చినను అతిథి తృప్తినొందనందున వారును తమతమ భాగములను క్రమముగా నిచ్చిరి. అతిథి తన ధర్మదేవతాస్వరూపమును జూపి, వారిని స్వర్గమునకుఁగొనిపోయెను. (సక్తువు = పేలపిండి, ప్రస్థము = కుంచము.) అది మొదలా విప్రునకు సక్తుప్రస్థుఁడను పేరు గల్గెను.

సతవాల్కల(మనీఁడు)జేజే—ఏడు నాల్కలుగల దేవుఁడు = అగ్ని.

సతనాల్కలపాదుసా—చూ. పై.

సతహలుమాదణి—చూ. సప్తాశ్వుఁడు.

సత్తిరాపగఱు—శివునకు శత్రువైనవాఁడు = మన్మథుఁడు. (సత్తి = శక్తి అనఁగా పార్వతి, రా = రాజు.)

సగరుఁడు—తన తల్లిగర్భమున సవతితల్లులచేఁ బెట్టఁబడిన గరళము గలిగియు బాధ నొందక గరసహితుఁడై పుట్టినవాఁడు.

సతీర్థ్యుఁడు—కూడఁ జదువువాఁడు.

సత్త్రితాలుపు—చూ. శక్తిధరుఁడు

సత్యము— సత్పురుషులయందుఁ బుట్టునది = నిజము.

సత్త్రయాగము— 13 మొదలు 100 దినములవఱకుఁ జేసెడు యజ్ఞము.

సత్త్రశాల— ధర్మార్థముగ బిచ్చము మొదలగునవి పెట్టుచోటు.

సదాగతి— సర్వకాలములయందును గమనము గలవాఁడు = వాయువు.

సదావృత్తి— బైరాగులు మొదలగువారి కిచ్చెడు భోజనసామగ్రి

సదాశివుఁడు— ఎల్లప్పుడును బ్రహ్మానంద స్వరూపుఁడును, నిర్వికారుఁడును గనుక శమించియుండువాఁడు.

స(హ)ధర్మిణి- ధర్మకార్యములయందుఁ దోడుగా నుండునది = అగ్నిసాక్షిగా వివాహమాడిన పెండ్లాము.

సనాతనుఁడు— పురాణపురుషుఁడు = భగవంతుఁడు.

సనాథ— మగఁడుగల యాడుది = ముత్తైదువ.

సన్న్యాసము—కామ్యకర్మల విడుపు.

సపత్నుఁడు— సపత్ని (సవతి) వలె దుఃఖహేతు వయినవాఁడు సమానపతిత్వము కలవాఁడు = శత్రువు.

సపిండీకరణము—మరణించినవాని పండ్రెండవ దినమునఁ గావించు సంవత్సరాంత శ్రాద్ధము.

సపిండుఁడు— ఏడుతరములలోపలి జ్ఞాతి

సప్త (జిహ్వుఁడు) హస్తుఁడు— జ్వాలారూపములగు 7 నాల్కలు గలవాఁడు = అగ్ని.

సప్తతంతువు—ఏడు ఛందస్సులచే విస్తరింపఁబడునది = యజ్ఞము.

సప్తపర్ణము— ఏడు ఆకులుమాత్రమే కల యరఁటిచెట్టు.

సప్తార్చి—చూ. సప్తజిహ్వుఁడు.

సప్తాశ్వుఁడు— (తన రథమునకు) ఏడు గుఱ్ఱములు కలవాఁడు = సూర్యుఁడు.

సబ్రహ్మచారి— వేదాధ్యయనమున సహాధ్యాయి, సహపాఠి.

సభాజనము—బంధువులు, స్నేహితులు మొదలగువారిని ఆలింగనాదికముచే సంతోషపెట్టుట.

సభికుఁడు— (సభ్యుఁడు) సభయందలి ధర్మజ్ఞుఁడు, జూదమాడుటకు యోగ్యమైనసభ కలవాఁడు, మద్యము ద్రాగువాఁడు.

సమంతభద్రుఁడు— సంపూర్ణమైన శుభముకలవాఁడు = బుద్ధదేవుఁడు.

సమంతభుక్కు— తన్నాశ్రయించిన వానిని పూర్ణముగా భుజించువాఁడు = అగ్ని.

సమదర్శి— సర్వభూతములను సమముగాఁ జూచువాఁడు = యముఁడు.

సమదృష్టి—సమస్త భూతములయందును



భేదబుద్ధిలేక సమానముగా జూచెడు చూపు.

సమపదము—విలుకాడు రెండు పాదములను సమానముగానుంచినిలుచుట.

సమరథుఁడు—ఒక విలుకానితో సమానముగానిలచి పోరెడు వీరుఁడు.

సమరము—మరణముతోఁ గూడినది = యుద్ధము.

సమవర్తి-అందఱియందును బక్షపాతము లేక సమముగాఁ బ్రవర్తించువాఁడు = యమధర్మరాజు.

సమావర్తనము— వేదశాస్త్రాధ్యయనానంతరమున వివాహార్థము గురువు ననుజ్ఞగైకొనుట.

సమావృత్తుఁడు—వేదాధ్యయనానంతరము వివాహాదుల నిమిత్తము గురువు ననుజ్ఞ పొందినవాఁడు.

సమాసకము—శుద్ధాంధ్ర పదముల సమాసము.

సమాసము— సమర్థములగు పదముల యేకీభావము.

సమీకము—ఇందు పరస్పరము కదియుదురు = యుద్ధము.

సమీక్ష్యకారి— లెస్సగా నాలోచించి పనిచేయువాఁడు.

సమీరుఁడు, సమీరణుఁడు } లెస్సగా సంచరించువాఁడు = వాయువు.

సముచ్చయము— ఒకదానితో నొకటిగాఁ గూర్చునది = వ్యాకరణపరిభాషలో నొక భాషాభాగము. మఱియొకదానిని తెల్పు 'ఉ' శబ్దము. ఇది కొన్నియెడల యడాగమయుక్తమును, మఱికొన్ని యెడల నకారయుక్తము నగును.

సముద్రనవనీతము — పాలసముద్రమున వెన్నవలె నుదయించినవాఁడు = చంద్రుఁడు.

సముద్రము— చంద్రోదయము వలన వృద్ధిపొందునది. అంతటను సంతోషము నిచ్చునది. ఈశ్వరాజ్ఞతోఁ గూడుకొని యుండునది.

సమ్మార్జని—తుడుచుటకు యోగ్యమైన సాధనము = చీఁపురుకట్ట.

సమ్రాట్టు—దిగ్విజయముచేసి రాజసూయ మొనర్చినవాఁడు = చక్రవర్తి.

సరసిజనాభుఁడు—కమలనాభుఁడు.

సరసిజభవుఁడు—చూ. పద్మభవుఁడు.

సర (సిజ) (సీరుహ) ము, సరోజ (రుహ) ము } — సరస్సు, చెఱువునందుఁ బుట్టినది = పద్మము.

సరస్వంతము— సరస్సు (ఉదకము) గలది = సముద్రము.

సరస్వతి— 1. అంతటను వ్యాపించి యుండునది. 2. బ్రహ్మలోకమున బ్రహ్మసరస్సు నాశ్రయించి నదీరూపముగాఁ బ్రవహించెడు నది = వాగధిదేవత.

సరళములు—మృదూచ్చారణగలయక్షరములు (గ. జ. డ. ద. బ.).

సరిత్పతి—నదులకుఁ బ్రభువు = సముద్రము.

సరీసృపము—వక్రముగాఁ బోవునది = సర్పము.

సరోజిని—తామరలు గలది = సరస్సు.

సర్పరాజు—సర్పములకుఁ బ్రభువు = వాసుకి.

సర్వంసహా—అంతను సహించునది = భూమి.

సర్వజ్ఞుఁడు—సర్వము నెఱిఁగినవాఁడు= 1. శివుఁడు, 2. బుద్ధదేవుఁడు.

సర్వతాపనుఁడు— సర్వజనులను తపింపఁజేయువాఁడు = మన్మథుఁడు.

సర్వతోభద్రము—1. నలుదిక్కులను వాకిండ్లు గల్గియుండుటచే నంతటను శుభముగల రాజగృహము, 2. అంతటను శుభముగలది = వేము.

సర్వతోముఖము— 1. అన్ని వైపులకును ముఖముగలది = ఆకాశము, 2. ప్రవహించునపు డన్నివైపులకును ముఖముగలది=ఉదకము. పుం. ఆత్మ, బ్రహ్మ, శివుఁడు.

సర్వభక్షకుఁడు— సమస్తమును దిను వాఁడు = అగ్ని.

సర్వమంగళ— సమస్తమైన శుభములు కలది = పార్వతి.

సర్వవేదుఁడు—సమస్తధనమును విశ్వజిద్యాగమున దక్షిణగా నిచ్చినవాఁడు.

సర్వపము—దేహమంతటను వ్యాపించునది = ఆవాలు.

సవిత—సుప్తుని (నిద్రించినవానిని) బ్రేరేపించువాఁడు = సూర్యుఁడు.

సవ్యసాచి—ఎడమచేతితో బాణము సంధింప నేర్పుగల అర్జునుఁడు.

సహగమనము— మృతినొందిన భర్తతోఁగూడఁ జితిఁజొచ్చి మరణించుట (సాహగమనము).

సహస్రదంష్ట్రము— వేయి కోఱలు గల చేఁప = పాఠీనము.

సహస్రపత్రము—వేయి దళములు గలది = తామరపువ్వు.

సహస్రకవచుఁడు—వేయి కవచములు గలవాఁడు = కర్ణుని వెనుకటి జన్మము నందలి రాక్షసుఁడు.

సహస్ర(కిరణుఁడు)కరుఁడు— వేయి కిరణములు గలవాఁడు = సూర్యుఁడు.

సహస్రపాదుఁడు— చూ. సహస్రకిరణుఁడు, విష్ణువు.

సహస్రబాహువు—వేయిచేతులు కలవాఁడు = కార్తవీర్యార్జునుఁడు.

సహస్రవేధి— వేయింటిని వేధించునది = ఇంగువ, పుల్లప్రబ్బ.

సహస్రాంశువు— వేయి కిరణములు గలవాఁడు = సూర్యుఁడు.

సహస్రాక్షుఁడు— వేయికన్నులు గల వాఁడు = ఇంద్రుఁడు.

సహా(పా)(ధ్యాయి)ధ్యాయుఁడు- కూడ వేదశాస్త్రాధ్యయనము చేయు వాఁడు.

సహోఢుఁడు— హరింపఁబడిన సొత్తుతోఁ బట్టుపడిన దొంగ.

సహోదరుఁడు—చూ. సోదరుఁడు.

సాంతపనము—సంతాపమువలనఁ గలుగు ప్రాయశ్చిత్తాదికము, 3 రోజులు పగటి పూఁటలందును, 3 రోజులు రాత్రులందును భుజించి, 3 రోజులు అయాచిత పదార్థములను భుజించి, పిమ్మట 3 రోజులుపవసించుట, పంచగవ్యమును, కుశోదకమును బుచ్చుకొని యొక రాత్రి యుపవసించుట.

సాంతపనకృచ్ఛ్రము—గోమూత్రము, గోమయము, గోక్షీరము, పెరుఁగు, నేయి, కుశోదకము వీనిని క్రమక్రమముగా నొక్కొక్క దినమున భుజించి, ఏడవనాఁడు కుష్ఠోపవాసముచేయుట.

సాంపరా(య-యి)కము— ఇందు వీరులు కదియుదురు = యుద్ధము.

సాంబశివుఁడు— అంబ (జగత్తులకుఁ దల్లి)తోఁ గూడుకొని యుండువాఁడు = ఈశ్వరుఁడు.

సాంబ్రాణి— సంబరేను చెట్టువలనఁ గలిగినది = ధూపద్రవ్య విశేషము.

సాంవత్సరికము— సంవత్సరాంతమున జరుగునది = ఆబ్దికము.

సాగరము—సగరపుత్రులచే యజ్ఞాశ్వాన్వేషణమునకై త్రవ్వఁబడినది = సముద్రము.

సాత్యవతేయుఁడు—సత్యవతికి బాల్యమున పరశరామునివలనఁ గలిగినవాఁడు = వ్యాసుఁడు.

సాత్రాజితి—సత్రాజిత్తు కొమార్తె = సత్యభామ.

సాధ్యులు—ధర్ముని 10 మంది భార్యలలో నొకతె యగు సాధ్యయందు జన్మించినవారు.

సానికరణము— కరణము క్రింద పని చేయు మఱియొక కరణము.

సానుమంతము—సానువులు (చఱియలు) కలది = కొండ.

సాప్తపదీనము— ఏడు అడుగులచేఁ గాని, ఏడుమాటలచేఁగాని పొందఁబడునది = సఖ్యము.

సామజము—సామవేదమువలనఁ బుట్టినది = ఏనుఁగు.

సామంతుఁడు—ఒక దేశము పొలిమేరకుఁ జేరికనున్న రాజు.

సామిధేని—అగ్నిని జ్వలింపఁ జేయు సమయమునఁ బఠించెడు ఋక్కు = సమిధలను బుట్టించునది.

సామిమల— కుమారస్వామి నివసించియుండెడు పర్వతము.

సామీరి—సమీరుని కొడుకు = భీముఁడు, ఆంజనేయుఁడు.

సాముద్రికము— సముద్రమునఁ బుట్టినది, భాగ్యసూచక దేహలక్షణములను దెలుపు శాస్త్రము.

సారమేయము—సరమ (అనుకుక్క)కుఁ బుట్టినది = కుక్క.

సారసము—చూ. సరసిజము.

సారువా— వర్షాకాలమున నీటియాధారమునఁ బండెడు పల్లపుపంట.

సార్థవాహులు—జంతుజాలమును గొనిపోవువారు = వర్తకులు.

సార్వభౌమము— సమస్తభూమండలమందును వెలుంగఁబడినది = ఉత్తరదిక్కునను౦డెడి ఏనుఁగు.

సార్వభౌముఁడు— సమస్త భూమండలము నేలురాజు = చక్రవర్తి.

సాలగ్రామము—విష్ణుచిహ్నములు గల శిలావిశేషము.

సాలభంజిక—వస్త్రదంత కాష్ఠాదులచేఁ దయారుచేయఁబడిన బొమ్మ.

సాలారిక— యుద్ధమున జయించి తేఁబడిన స్త్రీ = అంటిక మె.

సాలెపురుగు—బొడ్డునందలి నూలుతో సాలెవానివలె నేఁత నేసెడి యొక జాతి పురుగు.

సాష్టాంగము— 8 అవయవములు (2 చేతులు, 2 పాదములు, 2 భుజాగ్రములు, 1 బొమ్మ, 1 నొసలు) భూమికిఁ దగులునట్లుగాఁ జేసెడి నమస్కారము.

సాహిత్యము— కావ్యనాటకాలంకారాదుల యరజ్ఞానము.

సింగినాదము—పొడ దుప్పికొమ్ముతోఁ జేయఁబడిన యోగుల సుషిర వాద్య విశేషము.

సింహనాదము— ఏనుఁగులు మొదలగునవి భీతిలుటకై వీరులు కావించెడి ధ్వనివిశేషము.

సింహావలోకనము— సింగము తన యాహారమును దినఁబోవుచు, శత్రువులెవరైనఁ బరిసరముల నుండిరేమో యని స్వభావముచే ముందు వెనుకలకు జూచుట.

సింహాసనము—సింహాకృతిగలిగి బంగారుతోఁ జేయఁబడి, రాజులు కూర్చుండదగిన యున్నతమైన పీఠము.

సిక్థకము—అగ్నిసంయోగమునఁ గరఁగునది = మైనము.

సితాభ్రము— తెల్లని మేఘమువలెనుండునది = కర్పూరము.

సినీవాలి— చంద్రకళ కానవచ్చెడి అమావాస్య. చూ. కుహువు.

సిరిచూలి—లక్ష్మీదేవి కుమారుఁడు = మన్మథుఁడు.

సీత— నాఁగేటి చాలునఁ బుట్టినది = జానకి. (సీత = నాఁగేటి చాలు)

సీద్రంపుఁబెద్ద— కుబుసముగల వారిలో గొప్పవాఁడు = ఆదిశేషుఁడు.

సీమంతము— గర్భిణీస్త్రీలకుఁ జేయు నొక యుత్సవము.

సీమంతిని— సీమంతము (పాపట) కలది = స్త్రీ.

సీరధ్వజుఁడు— నాఁగలి గుఱుతుగాఁ గలవాఁడు = జనకుఁడు.

సీరపాణి— నాఁగలి హస్తమునఁ గల వాఁడు = బలరాముఁడు.

సుకృతము— లెస్సగాఁ, జేయఁబడినది = పుణ్యము, ధర్మము.

సుగతుఁడు— యోగ్యమైన గతులు గల వాఁడు = బుద్ధుఁడు.

సుగ్రీవుఁడు— మంచి మెడగలవాఁడు = సూర్యుని కుమారుఁడు.

సుడి(వాలు)కయిదువు— గుండ్రని యాయుధము = సుదర్శనచక్రము.

సుడిగట్టు—గుండ్రనిపర్వతము = చక్ర వాళము.

సుడిగొట్టు—గుండ్రముగా వీచువాఁడు = వాయుదేవుఁడు.

సుత్రాముఁడు— లోకములను లెస్సగా రక్షించువాఁడు = ఇంద్రుఁడు.

సుదతి—చక్కని పలువరసగల స్త్రీ.

సుదాయము—పెండ్లిలో అల్లునికి, ఆడు బిడ్డకు ఇచ్చెడు సగ.

సుధ— సుఖముగఁ బానము చేయఁబడు నది = అమృతము.

సుధర్మ— మంచి ధర్మము గలది = దేవసభ.

సుధాంగుఁడు—అమృత మయము లయిన యవయవములు కలవాఁడు = చంద్రుఁడు (అమృతాంగుఁడు).

సుధాం(శువు)(గుఁడు) కరుఁడు— అమృతమయము లయిన కిరణములు కలవాఁడు = చంద్రుఁడు.

సుధాపాణి— రోగులయెడ నమృత ప్రాయమైన హస్తము గలవాఁడు = ధన్వంతరి.

సుధి— లెస్సగా విచారించువాఁడు = పండితుఁడు.

సునాసీరుఁడు— శ్రేష్ఠమైన సేనాగ్ర భాగముగలవాఁడు = ఇంద్రుఁడు.

సుభగ— మంచినక్షత్రమున భర్తను గూడునది = సుందరి.

సుపర్ణుఁడు— మంచిఱెక్కలు కలవాఁడు = గరుత్మంతుఁడు.

సుప(ర్వులు)ర్వాణులు—1.యోగ్యము లయిన అంగుళ్యాది గ్రంథులు గల వారు, 2. శుభప్రదములయిన యుత్స వములు కలవారు = దేవతలు.

సుప్రతీకము— మంచి యవయవములు గలది = అష్టదిగ్గజములలో నొకటి.

సుమనస్సులు— మంచి మనస్సు కల వారు = దేవతలు.

సుమేరువు—లెస్సగా శిఖరములచే

నక్షత్రాదులను ధరించునట్టిది = మేరుపర్వతము.

సురగవి—వేల్పుటావు=కామధేనువు.

సురగురువు—దేవతల గురువు = బృహస్పతి.

సురజ్యేష్ఠుఁడు—దేవతలలోఁ బెద్దవాఁడు = బ్రహ్మ.

సురద్విషుఁడు—దేవతలను ద్వేషించువాఁడు = రాక్షసుఁడు.

సురదీర్ఘిక—దేవతలనడబావి = ఆకాశగంగ.

సురనిమ్నగ—దేవలోకపునది=ఆకాశగంగ, మందాకిని.

సురపతి—దేవతలకు ప్రభువు = ఇంద్రుఁడు.

సురలు—1. లెస్సగాఁ బ్రకాశించువారు, 2. భక్తితో నిచ్చిన హవిరాదికమును గ్రహించువారు, 3. సముద్రమున నుదయించిన యమృతము కలవారు = దేవతలు.

సురలోకము—దేవతలు నివసించు లోకము = స్వర్గము.

సురవర్త్మము—దేవతలు సంచరించెడు మార్గము = ఆకాశము.

సురాచార్యుఁడు—దేవతలకుగురువు= బృహస్పతి.

సురాలయము—దేవతల స్థానము = మేరుపర్వతము.

సురాళము—భూతావేశమునఁ (కోపావేశమున) గలుగు తలత్రిప్పు.

సువర్ణము—యోగ్యమయిన వర్ణము గలది = బంగారము, అగలు.

సువాసిని—1. సుఖముగా వసించియుండునది = పేరంటాలు, 2. తన పుట్టినింటనుండెడు స్వభావముకలది, 3. యోగ్యమైన వస్త్రాదికమును ధరించియుండునది.

సువ్రత—1. మంచి వ్రతము గలది, 2. సులభముగఁ బితుకఁదగిన యావు.

సుహృదుఁడు—మంచి హృదయము గలవాఁడు = చెలికాఁడు.

సూకరము—అనేకమయిన పిల్లలఁ గనునది = పంది.

సూచిపుష్పము—చుట్టును సూదుల వంటి మొనలుగల పువ్వు = మొగలి రేకు.

సూచిరోమ—సూదులవంటి రోమములు (వెండ్రుకలు) గలది = పంది.

సూచీపత్త్రము—ఒక గ్రంథము లయంశములను సూచించుపట్టీ.

సూతుఁడు-1. గుఱ్ఱములనుదోలువాఁడు, 2. శూద్రునకు క్షత్రియస్త్రీయందు గాని, క్షత్రియునకు బ్రాహ్మణస్త్రీయందుఁ గాని పుట్టినవాఁడు.

సూనృతము—ప్రియమును, సత్యమునగు పలుకు.

సూపకారుఁడు—సూపము (పప్పు) మొదలగువానిని తయారుచేయువాఁడు = వంటవాఁడు.

సూరసూతుఁడు—సూర్యుని రథము నడుపువాఁడు = అనూరుఁడు.

సూర్యకాంతము—సూర్యుని కాంతి తగులుటచే నిప్పుకలిగెడు తాయి.

సూర్యతనయ—సూర్యుని కుమార్తె = యమున, కాళింది.

సూర్యేందుసంగమము—సూర్య చంద్ర సంగమముకలది=అమావాస్య.

సృగాలము—మాంసమును దినునది = నక్క.

సృణి—ఏనుఁగు దీనిచే నడుచును = అంకుశము.

సెకకంటి—చూ. ఉగ్రాక్షుఁడు.

సెకవెలుఁగు—చూ. ఉష్ణరశ్మి

సెగపాపఁడు—చూ. అగ్నిచూలి.

సెగఱేఁడు—వెచ్చనిదేవుఁడు = అగ్ని.

సెలయేఱు—పర్వతములనుండి పాఱెడు నది.

సేనాంగము—రథ, గజ, తురగ, పదాతి చతుష్టయము.

సేనాని—సైన్యమును నడుపువాఁడు = 1. దళవాయి, 2. కుమారస్వామి.

సైంధవము—సింధుదేశమునఁ బుట్టిన (ఉప్పు) గుఱ్ఱము.

సైంధవుఁడు—సింధుదేశాధిపతి యగు వృద్ధక్షత్రుని కుమారుఁడు = జయద్రథుఁడు.

సైంహికేయుఁడు—హిరణ్యకశిపుని చెల్లెలగు సింహిక కొడుకు రాహువు.

సైరంధ్రి—స్వతంత్రురాలై పరగృహమునను౦డి గంధలేపనము, తిలకనిర్మాణము మొదలగు పనులుచేయు స్త్రీ; పురుషసాంగత్యమును గోరక ధైర్యముతో నుండునది.

సోఁకుదయ్యము—సమస్త పదార్థములను స్పృశించు దేవుఁడు=వాయువు.

సోఁకుమూఁకలగొంగ—రాక్షస సమూహములకు శత్రువు = విష్ణువు.

సోఁకులఱేఁడు—1. సోఁకుమూఁకల (ఱేఁడు) (దణి) రాక్షసులకుఁ బ్రభువు = నైరృతి, 2. పిశాచములకుఁ బ్రభువు = శివుఁడు.

సోదరుఁడు—తోఁడబుట్టినవాఁడు = అన్న, తమ్ముఁడు.

సోపప్లవుఁడు—పూర్వవైరము గల రాహువుచేఁ బట్టఁబడినవాఁడు = 1. సూర్యుఁడు, 2. చంద్రుఁడు.

సోమజుఁడు—చంద్రుని కొడుకు = బుధుఁడు.

సోమ(పీతి)(పుఁడు)పీథి—యజ్ఞమున సురాపానము చేయువాఁడు.

సోమయాజి—యజ్ఞము చేసినవాఁడు.

సోమాసి—చూ. పై.

సౌగంధికము— రోగనాశనమునకయి యోగ్యమయిన పరిమళము గలది = గంధకము.

సౌదా(మని)(మ్ని)మని— దండవలె దీర్ఘాకారము గలది, సుదామమను పర్వతముతోఁ గూడ నొకగిర్కన నుండునది = మెఱుపు.

సౌదాయికము— తల్లి దండ్రులచేఁ గాని, యన్నదమ్ములచేఁగాని యీయఁబడు స్త్రీధనము = సారె.

సౌధము— సుధ (సున్నము) తో నిర్మింపఁబడినది = మేఁడ.

సౌనంది— సౌనందమను పేరుగల రోఁకలి ఆయుధముగాఁ గలవాఁడు = బలరాముఁడు.

సౌనికుఁడు—మృగపక్ష్యాదులను జంపి విక్రయించుచు జీవించువాఁడు.

సౌప్తికము— నిద్రాసమయములందు హఠాత్తుగా శత్రువుల పయిఁబడి వధించుట, భారతమున నొకపర్వము.

సౌరమానము—సూర్యుని గమనమును బట్టి నిర్మింపఁబడిన కాలమానము.

సౌరసేయులు— కశ్యపునకు సురస యందు జనించిన సహస్రసంఖ్య గల సర్పములు.

సౌరి—సూర్యుని కుమారుఁడు - 1. శనైశ్చరుఁడు, 2. యముఁడు.

సౌవర్ణకరణి—చూ. సంజీవకరణి.

సౌవిదల్లుఁడు (సౌవిదుఁడు)— అంతఃపురమును గాచువాఁడు.

స్కంధుఁడు— దేవస్త్రీ సందర్శనమున వదలిన యీశ్వరవీర్యమువలనఁ బుట్టినవాఁడు = కుమారస్వామి.

స్కంధచాపము—మూఁపు మీఁది ధనుస్సు = కావడిబద్ద.

స్తంబేరమము— స్తంభముల (పాదుల) యందు రమించునది = ఏనుఁగు.

స్తంభనము— మంత్రశక్తిచే నగ్నిలోనగు వాని శక్తి నణఁగఁ జేయుట, ప్రమానపడఁజేయుట.

స్తబ్ధరోమము— దృఢమైన నిక్కపొడుచుకొన్న రోమము గలది = పంది.

స్తుతిపాఠకుఁడు— పరాక్రమాదులను బొగడువాఁడు = బట్టువాఁడు.

స్థండిలుఁడు — స్థండిల భూమి (దర్భాదులచే సంస్కరింపఁబడిన భూమి) యందు శయనించు వ్రతము గలవాఁడు.

స్థాణువు— ప్రళయకాలమున నుండువాఁడు = శివుఁడు, వాయువుచేఁగొట్టఁబడియు స్థిరముగా నిలిచియుండునది = మొద్దు.

స్థాలి—పదార్థములు దీనియందుండును= వంటకుండ.

స్థావరము—స్థిర (కదలకుండుట) స్వభావము కలది = జంగమ వ్యతిరిక్తమగు గిరివృక్షాదికము.

స్థిరాయువు— చిరకాలము జీవించి యుండునది = బూరుగుచెట్టు. (ఇది వేలకొలఁది సం॥రములు జీవించును.)

స్థూలదంతకము— బలమైన దంతము కలది = ఏనుఁగు.

స్థూల(నాస)నాసికము— బలమైన ముక్కు గలది = పంది.

స్నాతకము—వివాహమునకుఁ బూర్వము ఁ బ్రహ్మచారి చేసికొను వ్రతము.

స్పర్శవేది— తాఁకించుటవలన లోహము బంగారముగా మార్పుగల యోషధీవిశేషము.

స్పర్శ(స్పర్శ)నుఁడు -- తాకెడు స్వభావము గలవాఁడు = వాయువు.

స్మరహరుఁడు— మన్మథుని సంహరించినవాఁడు = శివుఁడు.

స్మరుఁడు—కామినీ కాముకులను త్వరపెటువాఁడు = మన్మథుఁడు.

స్మార్తము— స్మృతులయందుఁ జెప్పబడిన కర్మవిశేషము.

స్మృతి— మహర్షులచే వేదార్థ స్మరణ పర్యాలోచన పూర్వకముగా రచింపఁబడినది = ధర్మశాస్త్రము.

స్యాలకు(లు)ఁడు—పరిహాసవాక్యములచే గేలిచేయువాఁడు = భార్యతోఁడఁబుట్టినవాఁడు = బావమఱది.

స్రవంతి—పర్వతాదులనుండి స్రవించునది = నది.

స్రష్ట—సమస్తమునుసృజించువాఁడు = బ్రహ్మ.

స్వయందత్తుఁడు—తల్లి దండ్రులులేక కాని, వారిచే నకారణముగ విడువఁబడికాని, నేను నీకుఁ బుత్త్రుఁడ నయ్యెదనని వచ్చినవాఁడు.

స్వయంపాకము—ఒకనికి పూఁటకు సరిపడున ట్లిచ్చు వంటసామగ్రి.

స్వ(యం)భువు—తనంతటనే పుట్టినవాఁడు=బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుఁడు, మన్మథుఁడు.

స్వయంవర—తాను కోరిన భర్తను స్వయముగ వరించునట్టి స్త్రీ.

స్వయంవరము— క్షత్రియ కన్యలు నానాదేశ రాజన్యులసభలో స్వయముగఁ దమ యిచ్చివచ్చిన వరుని వరించెడి యుత్సవ విశేషము.

స్వర్ణకారుఁడు— బంగారపుపని చేయువాఁడు = అగసాలె.

స్వర్ణది—స్వర్గమున బ్రవహించునది = ఆకాశగంగ, మందాకిని.

స్వర్భానువు— స్వర్గమునఁ బ్రకాశించువాఁడు = రాహువు.

స్వర్వైద్యులు—దేవలోకపువైద్యులు = అశ్వినీదేవతలు.

స్వస్తిముఖుఁడు— మంగళాశీర్వాదము ముఖమునఁ గలవాఁడు = బ్రాహ్మణుఁడు.

స్వస్రీయుఁడు— స్వస (సోదరి) యొక్క కొడుకు = మేనల్లుఁడు.

స్వాధీనపతిక— స్వాధీనుఁడగు (తనకు వశుఁడు) భర్తగల నాయిక.

స్వాధ్యాయము-తనయొక్క వేదమును మాత్రమే అధ్యయనము చేయుట.

స్వాపతేయము—తన యజమానులందు లెస్సగా నుండునది = ధనము.

స్వామి—స్వమ్ము (ధనము)గలవాఁడు

స్వారాట్టు— స్వర్గమునఁ బ్రకాశించువాఁడు = దేవేంద్రుఁడు

స్వాహాప్రియుఁడు—స్వాహాదేవికిఁ బ్రియుఁడు (భర్త) = అగ్ని.

స్వీయ—తన భర్తయందు మాత్రమను రాగము గల నాయిక

స్వేదజము—చెమటవలనఁ బుట్టినది = పల్లి.

స్వైరిణి—యథేచ్ఛగాఁ బ్రియుల కొఱకు సంచరించునది = జారిణి.

హంస(రథు)(వాహ)నుఁడు— హంసవాహనముగాఁ గలవాడు = బ్రహ్మ.

హను(మానుఁడు)మంతుఁడు— హనువుకలవాఁడు = ఆంజనేయుఁడు.

హనువు—భక్ష్యమును నమలునది (చెక్కిలిమీఁది పార్శ్వముగాని వెనుకటి పార్శ్వముగాని హనువనఁబడును) = పెలిదౌడ

హయగ్రీవుఁడు— గుఱ్ఱపుకంఠము కల విష్ణువియవతారము, ఒక రాక్షసుఁడు.

హరి—1. చీఁకటిని హరించువాఁడు = సూర్యుఁడు చంద్రుఁడు 2 గజాదులను హరించునది=సింహము. భక్తుల హృదయముల నాకర్షించువాడు — విష్ణువు

హరిచందనము—దేవేంద్రుని సంతోషపెట్టునది = 1 దేవ వృక్షములలో నొకటి, 2 కపిలవర్ణముగల చందనము, 3. మామిడిపండు వాసనయుఁ బసుపు వన్నెయుఁగల చందనము = పచ్చని శ్రీగంధము

హరిదశ్వుఁడు— పచ్చని కాంతిగల గుఱ్ఱములు కలవాడు = సూర్యుఁడు

హరిదాసుఁడు— విష్ణువునకు దాసుఁడు = భక్తుఁడు దాసరి

హరిద్ర— హరిద్వర్ణము (పచ్చనిరంగు) కలది = పసుపు.

హరినణి— పసుపువన్నెగల రత్నము = మరకతము, పచ్చ.

హరిప్రియ— 1. విష్ణువునకుఁ బ్రియురాలు = లక్ష్మి భూమి, తులసి. (తులసి వెనుకటిజన్మమున జలంధరుని భార్య మహాపతివ్రత.) 2. బలరామునకు నిష్టమైనది = కల్లు.

హరిబువ్వము— వివాహమున నాల్గవ నాఁటిరాత్రి బంధువులగు స్త్రీ పురుషాదులఁగూడి విందారగించుట.

హరివాసరము— విష్ణునికిఁ బ్రియమగు దినము = ఏకాదశి.

హరివాహనుఁడు— విష్ణునికి వాహనమైనవాఁడు = గరుత్మంతుఁడు.

హరిశ్చంద్రుఁడు— స్త్రీత్వము నొందిన చంద్రునియందు హరికిఁ బుట్టినవాఁడు (త్రిశంకుని దత్తుఁడు).

హరిహయుఁడు— పచ్చనిగుఱ్ఱములు కలవాఁడు = ఇంద్రుఁడు.

హరీతకి— రోగములు హరించునది = కరక.

హరుఁడు—ప్రళయకాలమున సర్వమును హరించువాఁడు, భక్తుల పీడను హరించువాఁడు = శివుఁడు.

హర్మ్యము— మనస్సును హరించునది = ధనికుని గృహము.

హర్యక్షము— కపిలవర్ణముగల కన్నులు కలది = సింహము. డు. కుబేరుఁడు.

హర్షమాణుఁడు—సంతోషము నొందిన మనస్సు కలవాఁడు.

హ(లి)లాయుధుఁడు— నాఁగేలు ఆయుధముగాఁ గలవాఁడు = బలరాముఁడు.

హల్లకము— సంతోషము కలుగఁజేయునది = ఎఱ్ఱకలువ.

హల్లీసకము— స్త్రీసమాజము, కోలాటములో మండలాకారముగాఁ దిరుగుచుఁ జేయునృత్యము.

హవనీయము— హోమము చేయఁదగినది=హవిరాదికము.

హ(విస్సు)వ్యము— దేవతలకీయఁదగిన యన్నము.

హవ్య(వాహనుఁడు)వహుఁడు — హవ్యమును మోసికొని పోవువాఁడు = అగ్నిహోత్రుఁడు.

హవిస్సు— వేల్వఁబడునది = అగ్నిహోత్రమున వేల్చుటకు ఇవురఁబెట్టిన యన్నము, నేయి.

హసంతి— (నిప్పులచే) నవ్వువానివలె గుండునది, మల్లె, కుంపటి.

హసాము—అధికారుల యాజ్ఞను విధేయులు మంచిదని యంగీకరించుటయందు వచ్చునది.

హస్తిపకుఁడు—ఏనుఁగులను ఆహారాదిదానముచేఁ బాలించువాఁడు=మావటివాఁడు.

హాటకము—ప్రకాశించునది = బంగారము.

హాటకగర్భుఁడు — హిరణ్యగర్భుఁడు.

హారి—పాంథజన సమూహము, మనోజ్ఞమైనది, హారముగలవాఁడు, హరించువాఁడు.

హాల(హాల)(హాల)ము —సముద్రమథనసమయమున భయంకరవిషము.

హాలాహలము—చూ. పై.

హావము— భ్రూనేత్రాద్యవయవములచేష్టలచే సంభోగేచ్ఛ కొలఁదిగా

సూచింపబడుమనోవికారము. (దీనిచేఁ గాయకులు స్వవశముగాఁ జేయఁబడుదురు.)

హిమకరుఁడు—మిహికాకరుఁడు.

హిమధాముఁడు— చల్లనికాంతి గలవాఁడు = చంద్రుఁడు.

హిమము—తాపమును బోగొట్టునది = మంచు.

హిమవన్తము—మంచుకలది = ఇది కింపురుష వర్షమునకు దక్షిణమున హద్దుగా నుండు పర్వతము.

హిమవాలుక—మంచువలెఁ జల్లనై యిసుకవంటి యాకారము గలది = కర్పూరము.

హిమాంబువు—చల్లనినీరు = పన్నీరు.

హిమాంశువు—మిహికాకరుఁడు.

హిమాచలము—మంచుగల కొండ.

హిమా(లయము)ద్రి—చూ. పై.

హిరణ్యగర్భుఁడు—హిరణ్య (బంగారు) మయ మైనవాఁడు, గర్భమున హిరణ్యము కలవాఁడు = బ్రహ్మ.

హిరణ్యము—పోవునది = ధనము, ౨ బంగారము మొ.

హిరణ్య(రేతసు)(రేతు)ఁడు— హిరణ్యము (బంగారము) రేతస్సుగాఁ గలవాఁడు = అగ్ని.

హుతభుక్కు— హుతము (హోమద్రవ్యము) ను భుజించువాఁడు=అగ్ని.

హుత (వాహనుఁడు) వహుఁడు— హుతమును (హోమద్రవ్యమును) దేవేంద్రాదుల కిచ్చుటకై మోసికొనిపోవువాఁడు = అగ్ని.

హుతాశనుఁడు— హుతము అశనము (భోజనము) గాఁ గలవాఁడు = అగ్ని, హుతా(శి)శుఁడు. చూ. పై.

హృతాధికారుఁడు— హరింపఁ బడిన యుద్యోగరూపమైన యధికారము కలవాఁడు.

హృదయంగమము—మనస్సున కింపైనది = మాట.

హృదయము—హరింపఁబడునది = గుండెకాయ, మనస్సు.

హృదయాళువు—మంచి మనస్సు కలవాఁడు.

హృల్లాసము— గుండె అధికముగాఁ గొట్టుకొను వ్యాధివిశేషము.

హృషీకేశుఁడు—హృషీకము (ఇంద్రియము) లకుఁ బ్రభువు = విష్ణువు.

హేమంతము— మార్గశీర్ష పుష్యమాసములుగల (హిమముకల)ఋతువు.

హేమకూటము— (కింపురుషవర్షమున కుత్తరమునఁ గలది) బంగారు శిఖరములు గల ఒక పర్వతము.

హేమదుగ్ధకము— బంగారువన్నెగల పాలు కలది = అత్తిచెట్టు.

హేమపుష్పకము— బంగారు వన్నె గల పువ్వులు కలది = సంపెంగచెట్టు.

హేమము— లోహాంతరమును గూడి వృద్ధిపొందునది = బంగారము.

హేమాద్రి— బంగారుకొండ = మేరు పర్వతము.

హేరంబుఁడు— రుద్రుని సమీపమున నుండువాఁడు భక్తులను వృద్ధిలోనికిఁ దెచ్చువాఁడు శౌర్యముచే గర్వించిన వాఁడు = వినాయకుఁడు.

హేల— భ్రూనేత్రాది వికారములచే స్పష్టముగాఁ దెలియఁదగిన మనో వికారము, సంభోగాభిప్రాయము.

హేలావుకుఁడు— గుఱ్ఱములను విక్రయించువాఁడు.

హేష(ము)— గుఱ్ఱముయొక్క సకిలింత.

హేషితము— చూ. పై.

హైమము— హిమము వలనఁ గలిగిన జలాదికము హేమము (బంగారము) వలనఁ గలిగిన నగ.

హైమవతి— హిమవంతుని కుమార్తె = పార్వతి గంగ.

హైయంగవీనము— తొలినాఁడు చిలికి తీసిన ఆవువెన్న అప్పుడు తీసిన ఆవువెన్న కాచిన నెయ్యి.

హైహయుఁడు— హేహయుని కొడుకు = కార్తవీర్యార్జునుఁడు

హొయలుబండి— పాయంత్రము విలాసార్థము యొక్క పోవుట కుపయోగపడు బండి.

హో(త)త్రి— యాగమున హోమమును జేయువాఁడు, ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు.

హోళి— కామోత్సవముయొక్క కడపటి రోజున దగులబెట్టుటకై ప్రోగుచేసెడు గడ్డికంప.

హోళిపండుగ— బొండిలీలు ఫాల్గున మాసమునఁ జేయు కావ ప్రీతికర మగు వసంతోత్సవము

# వికృతి ప్రకృతులు



| వికృతి. | ప్రకృతి. | అర్థములు. |
| --- | --- | --- |

అంకియ—అంకము = ఒకటి.

అంకుసము—అఙ్కుశము = ఒక ఆయుధము.

అంకె—అఙ్కము = సమయము, వశము.

అంగళ—అఙ్గణము=వలుచదరపుచోటు

అంగరేకు — అంగరక్ష = చొక్కాయి.

అంగీ—అంగికము = చొక్కాయి.

అంగటము—అఙ్గుష్ఠము = బొటనవ్రేలు.

అంచ—హంస = ఒకానొక పక్షి.

అంచు—అఞ్చలము = మొన, తుద.

అంచపదము— హంసపాదము = ఒక గుర్తు.

అంచయాన—హంసయాన = హంసనడక వంటి నడకగల యాఁడుది.

అంచరవుతు— హంస రాహుత్తు = బ్రహ్మ.

అంజలి—అంజలి = దోసిలి.

అండి—హాండి = లోహకటాహము.

అంత—అథ = అనంతరము.

అంతరువు—అన్తరము = తారతమ్యము.

అంతస్తు—అంతరమ్ = భేదము.

అంతిపురము—అన్తఃపురము = రాజస్త్రీలుండు చోటు.

అంతిపురి—అన్తఃపురి = అంతిపురము.

అందంద—అత్యంతము = అచ్చటచ్చట.

అందము—అన్దము = చక్కఁదనము

అందలము—ఆన్దోళము = పల్లకి.

అందియ (అందె) } - అన్దుకము = కాలిభూషణము.

అంబరు—అంబరమ్ = అగరువు.

అక్క—అర్క = అప్ప.

అక్కజము—ఆశ్చర్యము = వింత.

అక్కలార—అగ్రాకార = అక్కలకట్టు.

అక్కరము— అక్షరము = అకారాది వర్ణము.

అక్కు—అఙ్కము = వక్షస్థలము.

అక్షింతలు—అక్షతలు = పసుపు కలిపిన బియ్యము.

అగ(డి త)డ్త—అఖాతము = పరిఖ.

అగలు—అగరువు = గంధద్రవ్యము.

అగిసి—అతసి = అగస్తి.

అగ్గి—అగ్ని = నిప్పు

అగిని—అగ్ని.

అచ్చర—అప్సరస = దేవవేశ్య.

అచ్చెరువు—ఆశ్చర్యము = విచిత్రము.

అట్టము—అష్టకము = వేదభాగము.

అడవి—అటవి = అరణ్యము.

అతకరించు—అధఃకరణము = అతిక్రమించు.

| వికృతి. | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|

అదనము—అధికము = హెచ్చు.

అదిరము—అధరము = పెదవి.

అద్దము } అద్దము } = దర్పణము.
అద్ద } అర్ధము } = సగము.

అనద—అనాథ = భర్తలేనిది.

అనుమఁడు— హనుమన్తుఁడు = ఆంజనేయుఁడు.

అన్నెము—అన్యాయము = అధర్మము.

అపురూపము— అపూర్వము = ముందు లేనిది.

అపోసానము—ఆపోశనము.

అప్ప—అంబకః = తండ్రి.

అప్పము—అపూపము = భక్ష్యవిశేషము.

అప్పగింత—అర్పణము = ఒప్పగింత.

అప్పళము—అర్పటము = అప్పడము.

అప్పళింత—ఆస్ఫాలనము = చప్పట.

అబందన—అభ్యంతరము = ఆటంకము.

అబ్బరము—అద్భుతము = ఆశ్చర్యము.

అబ్బ—అమ్బకుఁడు = తండ్రి.

అబ్బురము —అపారము=అపరిమితము.

అబ్బురము—అపూర్వము=అపురూపము, ఆశ్చర్యము.

అబ్బెసము—అభ్యాసము = అలవాటు.

అబ్రము—అపూర్వము = ఆశ్చర్యము.

అభిని—అహిఫేనము=నల్లమందు.

అంబా—అమ్బ = దూడయఱపు.

అంబాళము— ఆమ్రాతకము = నల్లమావిడి.

| వికృతి. | ప్రకృతి. | అర్థములు |
|---|---|---|

అంబిక—అమ్మిక = గౌరి.

అమవస } అమాస } అమావాస్య=కృష్ణపక్షాంతము

అమడలు— యమళము=ధాన్యవిశేషము

అమ—అమ్బ=తల్లి, పూజ్యస్త్రీ

అమ్మ—చూ. పై.

అమ్మిక—అమ్బిక=పార్వతి.

అమ్ము—అంబకము = బాణము

అఱు } అయ్య } —ఆర్యుఁడు = పూజ్యుఁడు, తండ్రి.

అ(ఱ)ర—అర్ధము = సగము.

అరణము—హరణము = పెండ్లిలో నల్లునకు, నాడుబిడ్డకు నిచ్చుధనము.

అరదము—రథము = స్యందనము

అరసంజ—అసురసంధ్య = ప్రదోషకాలము.

అరసము—హర్షము = సంతోషము.

అరిదళము—హరితాళము = హరిదళము

అరివాణము—హరివాణము = గిన్నె.

అరివేరము—అరవీర్యము = యుద్ధము.

అరిసె—అతిరసము = భక్ష్యవిశేషము.

అరిసెము—హర్షము = సంతోషము.

అర్సము—హర్షము = సంతోషము.

అరుసము—హర్షము = సంతోషము.

అరుహుఁడు—అర్హుఁడు = తగినవాఁడు.

అలిపిరి—అల్పుఁడు = సన్ననివాఁడు.

అలుపము—అల్పము = కొంచెము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

అలుచు—అలసుఁడు = నీచుఁడు.

అల్లము—ఆర్ద్రకము.

అవ—అమ్బ=తల్లితల్లి, తల్లి, పూజ్యస్త్రీ.

అవనాయము—అపన్యాయము= న్యాయము లేనిది.

అవారి—అపారము=అపరిమితము.

అవిసి—అతసి=శుకనాసము.

అవ్వ—అమ్బ=చూ. అవ.

అవ్వారి—అపారము=అపరిమితము.

అసడ్డ—అశ్రద్ధ=అక్కరలేమి.

అసదు—అసత్తు=అల్పము.

అసము—యశము=కీర్తి.

అసివేసు—ఆశ్లేష = ఒక నక్షత్రము.

అఁకరము—అగ్రహము=కోపము.

అకసము—ఆకాశము=మిన్ను.

అగడము—ఆగస్=అపరాధము.

ఆగాత్యము—ఆగస్=ఆర్భాటము.

ఆగాయిత్యము—చూ. పై.

అకతాయ—ఆతతాయి=తుంటరి.

అకళింత—ఆకలనము=అవగాహనము.

ఆత్రము—ఆతుర=త్వరపడుట.

ఆదరువు—ఆధారము=ప్రాపు, ఇల్లు.

ఆన—ఆజ్ఞ=కట్టడ.

ఆనతి—ఆజ్ఞప్తి=ఆజ్ఞ, కట్టడ.

ఆపోసనము—ఆపోశన=ఆచమనము.

ఆబోతి—అభుక్తి=పెనుతిండి.

వికృతి. ప్రకృతి. అర్థములు.

ఆమతి (ంపు)—ఆమంత్రణము=పిలుపు.

ఆమి(త)తి—ఆమంత్రణము = పిలుపు.

ఆముదము—ఆమన్డము=ఏరండతైలము.

ఆమిక—అహమహమిక=మదము.

ఆయవారము—యాయవారము=భిక్ష.

ఆ(మి)మెత—ఆమంత్రణము=పిలుపు.

ఆరంజ్యోతి—అరున్ధతి=వశిష్ఠునిభార్య.

ఆరగించు—ఆహారము = భుజించు, త్రాగు.

ఆరెము—ఆరామము=ఉద్యానము.

ఆరోగణము—ఆహారము=భోజనము.

ఆలము—హారము=యుద్ధము.

ఆలసము—ఆలస్యము=జాగు.

ఆస—ఆశ = అపేక్ష.

ఆసత్తి—ఆసక్తి=అపేక్ష.

ఇంగువ—హిఙ్గువు=సంభారవిశేషము.

ఇంచు—ఇక్షువు=చెఱకు.

ఆళఁది—హారిద్రము=పచ్చదనము.

అఱవలు—అరవులు=ద్రావిడులు.

అఱుత—ఆరాత్=సమీపమునందు.

అలఁది—హారిద్రము=పచ్చదనము.

అలకి—అలుకము=కుండ.

ఇంచుక—ఈషత్=కొంచెము.

ఇంతి—స్త్రీ=ఆఁడుది.

ఇందు—సిన్ధువు=సముద్రము.

ఇగము—హిమము=శైత్యము.

| వికృతి. | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|
| ఇచ్ఛ | ఇచ్ఛ | వాంఛ. |
| ఇచ్ఛకము | ఇచ్ఛ | ప్రియవచనము. |
| ఇటక, ఇటిక, ఇట్టిక | ఇష్టక | బంకమట్టితోఁ జేసిన తాయి. |
| ఇడ్డెన | ఇడియాణము | వాసెనకుడుము. |
| ఇ(లిం)ల్లింద | ఇంద్రవల్లి | మాతులుంగము. |
| ఇతము, ఇతవు | హితము | అప్రియమైనను మేలు చేయునది. |
| ఇతవుఁడు | హితుఁడు | చెలికాఁడు. |
| ఇత్తడి, ఇత్తళి | పిత్తళము | ఒకలోహము. |
| ఇమ్య | ఈహ | అపేక్ష. |
| ఇవక, ఇవము | హిమము | శైత్యము. |
| ఈఁదా(డి-డు) | హింతాలము | గిటక తాడి. |
| ఈయ | ఈహ | కోరిక. |
| ఈరస(ము) | ఈర్ష్య | అసూయ. |
| ఈసు | చూ. పై. | |
| ఉక్క | ఉల్కా—ఊష్మ | ఉమ్మ. |
| ఉంగుటము | అఙ్గుష్ఠము | బొటనవ్రేలు. |
| ఉక్కడీఁడు | ఉత్కటుఁడు | శూరుఁడు. |
| ఉగ్గడించు | ఉద్ఘాటనము | వచించు. |
| ఉగ్గము | ఉద్గ్రాహము | ఉట్టి. |
| ఉత్తరువు | ఉత్తరము | ఆజ్ఞ. |
| ఉత్తిఁడు | యుక్తుఁడు | తగినవాఁడు. |
| ఉదియ, ఉద్దియ | ఉచ్ఛ్వాసము, ఉద్యోగము | నిట్టూర్పు, ప్రయత్నము. |
| ఉపము | ఉపాయము | వెరవు. |
| ఉపాసము | ఉపవాసము | పస్తు. |
| ఉప్పతిల్లు | ఉత్పత్తి | పుట్టు. |
| ఉప్పన | ఉల్బణము | సముద్రవిజృంభణము. |
| ఉప్పరము | అభ్రము | ఆకాశము. |
| ఉప్పరిగ | ఉపకారిక | రాజగృహము. |
| ఉబ్బరము | ఉల్బణము | పొంగరింపు. |
| ఉబ్బసము | ఉచ్ఛ్వాసము | పొడిదగ్గు. |
| ఉబ్బు | ఉల్బణము | పొంగు. |
| ఉమాదము, ఉమ్మాదము | ఉన్మాదము | చిత్తవిభ్రమము. |
| ఉమి, ఉమ్మి | ఊర్మి | తూపొడుపు. |
| ఉమ్మ(రము) | ఊష్మము | ఆవిరి. |
| ఉమ్మాదము | ఉన్మాదము | వెఱ్ఱి. |
| ఉమ్మెత్త | ఉన్మత్తము | ఒకానొకచెట్టు. |
| ఉరువు, ఉరవు | రూపము | ఆకృతి. |
| ఉల్ల(ల్లె)డ | ఉల్లాభః | మేలుకట్టు. |
| ఉవిద | యువతి | స్త్రీ. |
| ఉసురు | అసువు | ప్రాణము. |
| ఉవ్వెత్తు | యుగపత్ | ఒక్కసారిగ. |
| ఊఁ | హుమ్ | ఊఁకొట్టుట. |
| ఊదర | ఉదారము | ఒకరకముగడ్డి. |
| ఊఁకర | హుంకారము | ఊఁకొట్టుట |
| ఊషర(ము) | ఊషరము | చవుటినేల. |

వికృతి.     ప్రకృతి.     అర్థములు.

ఊసివాసము—ఉచ్ఛ్వాసము= నిట్టూర్పు.

ఎక్కటి } ఏకము } = ఒకటి.
ఎక్కటీఁడు } ఏకాకి } = ఒంటరి.

ఎక్కిలి —హిక్క=దప్పివలనఁ బుట్టిన

ఎగ్గడి ఎగ్గడీఁడు—హేడుఁడు = కొజ్జా.

ఎగ్గతము—ఏకాంతము=రహస్యము.

ఎ(డ)ద
ఎద్ద } హృత్తు = హృదయము
ఎడఁద

ఎ(డ్డియ)డ్డ—హేడః = మూర్ఖుఁడు.

ఎనుము—హేరమ్బము = గేదె

ఎరసు—ఈర్ష్య = అసూయ.

ఏకలీఁడు—ఏకలము = అడవిపంది.

ఏడిక—ఏడకము = పొట్టేలు.

ఏలకి—ఏలము = పేరేలకి.

ఎఱ్ఱన—అరుణ = ఎఱుపు.

ఏతము, ఏతాము—యంత్రము=నీరుతోడు సాధనము.

ఏతనము—ఏకలము=అడవిపంది.

ఏనిక ఏనుఁగు—అనేకపము=గజము.

ఏరాళము—హేరాళము=అధికము.

ఒంటె—ఉష్ట్రము = లొట్టిపిట్ట.

ఒక్కటి—ఏకము = ఒకటి.

ఒజ్జ, ఓజ— ఉపాధ్యాయుఁడు=గురువు.

ఒడ్డాణము—ఓఢ్యాణము = భూషా విశేషము.

వికృతి.     ప్రకృతి.     అర్థములు.

ఒడ్డనము—ఆండనము = డాలు.

ఒదవు—ఉదయము = పుట్టు.

ఓకిలింత—ఉద్గారము = ఓకర.

ఓగిరము
ఓయిరము } ఆహారము = అన్నము.

ఓర—హోర = అహోరాత్రము.

ఓరెము—ఆహారము = అన్నము.

కంకటి—ఖట్టిక = మంచము.

కంకర—కర్కరము = కంకరఱాయి.

కంగటి—చూ. కంకటి.

కంచము—కంసము = భోజనపాత్ర.

కంచు—కాంస్యము=ఒకానొక లోహము.

కంజా—కపిఞ్జలము = ఒక పక్షి.

కండ—ఖణ్డము=మాంసము పులకండము.

కం(టియ)టె—కంఠిక=మెడనగ.

కండచక్కెర—ఖణ్డశర్కర=పులకండము.

కండిక—ఖండికము = భూమిలో కొంత భాగము.

కంతి—గ్రంథి=పెగగడ్డ దద్దురు.

కందుఁడు—స్కన్దుఁడు=కుమారస్వామి.

కందురీఁగ—గంధోలి.

కంబము—స్తంభము=గుంజ.

కంబడి
కంబళి } కమ్బళము = వెండ్రుకలతో నేసినది, గొంగళి.

కకపాలక } కక్షపాలము } = సన్న్యాసుల
కక్కపాల } } యుపకరణము (సంచి.)

వికృతి. ప్రకృతి. అర్థములు.

కక్కరము—కర్కశము=కఱకు.

కక్కసము—కర్కశము = కఠినము.

కక్కెర—క్రకరము=బకము.

కగ్గ(ము)—ఖడ్గము=కత్తి.

కచోరము—కచ్చూరము = ఒకానొక చెట్టు.

కచ్చ—కచ్ఛ = కాసె, గోఁచి.

కచ్చడము—కచ్ఛట=గోఁచి.

కచ్చితము—ఖచితము=హెచ్చుతగ్గులు లేనిది.

కజాయము, కజ్జము } ఖాద్యమ్ = అప్పము.

కజ్జురము, కజ్జూరము, కజూరము } = ఖర్జూరము.

కజ్జెము—ఖాద్యమ్=అప్పము.

కటకరము—గంధర్వము=ఒంటెపిల్ల.

కటారి, కటారు } కరారము=కత్తి.

కటికమెకము—ఖడ్గమృగమ్=మృగవిశేషము.

కట్టియ, కట్టె } కాష్ఠమ్=కొయ్య, దండము.

క(ట్ల)ట్లి—ఖట్వా = శవయానము.

కడవ—కటాహము=పెద్దకుండ.

కడ—కాష్ఠ = దిక్కు.

వికృతి. ప్రకృతి. అర్థములు.

కడిమి—కదమ్బము=కడపచెట్టు.

కడియము, కడెము } కటకము=హస్తభూషణము.

కడ్డి—ఖటిక=శలాక.

కణజము—గంజ=గాదె, పాణక.

కత్తలాన—కర్తలాణము = నల్లగుఱ్ఱము.

కత్తెర—కృత్తికా=ఒక నక్షత్రము.

కదుపు—కదంబము = ఆవులమంద.

కదుల(ము)—ఖట్వా=శవయానము.

కణుఁదురు, కదిదురు } గన్ధోలి = కందిరీఁగ.

కడుపు—గర్భము = కుక్షి.

కత—కథ = ఇంచుక సత్యమైన కల్పిత ప్రబంధము.

కతము—గతము = కారణము.

కత్తెర—కర్తరి = ఒక పనిముట్టు.

కద—కథ = వృత్తాంతము, చూ. కత.

కనియ—ఖండము = ముక్క.

కనీసము—కనీయము = తక్కువైనది.

కనుఁదురు—గంధోలిక = కందిరీఁగ.

కన్నడము—కర్ణాట = ఒకభాష.

కన్నయ్య—కృష్ణః = కృష్ణుఁడు.

కన్నఁడు—కృష్ణః = కృష్ణుఁడు.

కన్నము—కర్ణః = రంధ్రము.

కన్నియ, కన్నె } కన్యక = పెండ్లికానిపిల్ల, ఒక రాశి, కూఁతురు.

కపురము, కప్పురము } = కర్పూరము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

ప్పడము—కర్పటము = కట్టుకోక.

కప్పెర { కర్పరము = కపాలము.
ఖర్పరము = భిక్షాపాత్రము

కప్రము—కర్పూరము = కప్పురము.

కబ్బము—కావ్యము = దివ్యప్రబంధము.

కముఁజు—కపిఞ్జలము = ఒకానొక పక్షి.

కయిత—కవిత = కృతి.

కయివారము—కైవారము = స్తోత్రము.

కరవాలు—కరవాలము = కత్తి.

కరువ—గ్రావము = కొండ.

కరువు—గర్భము = శుక్లశోణితపిండము.

కర్జము—కార్యము = పని.

కఱకంఠుఁడు — గరకణ్ఠుఁడు = శివుఁడు.

కఱకు—కర్కరము, కక్కరము, కర్కశము = కఠినము, పరుషము.

కఱ్ఱి—కాలము = నల్లనిది.

కఱ్ఱి—కాలుఁడు = నల్లనివాఁడు, అర్జునుఁడు.

కలము—కలమము = వ్రాయు సాధనము.

కలుము—కల్మషము = మాలిన్యము.

కలువ—కైరవము = కల్వ.

కల్లు—కల్య = మద్యము.

కవణము—ఖాదనము = గుఱ్ఱపుఁదిండి.

కయిత—కవిత = కవిత్వము.

కర—ఖరమ్ = తీక్ష్ణము.

కరగసము—క్రకచము = ఱంపము.

కరడిగ—కరండికా = పూలసజ్జ.

వికృతి. ప్రకృతి. అర్థములు.

కవుఁజు—కపిఞ్జలము = ఒకానొకపక్షి.

కసవు—ఘాసము = గడ్డి.

కసుమాలము—కశ్మలము = మలినము.

కస్తురి—కస్తూరి = మృగనాభి.

కాకి—కాకము = వాయసము.

కాగితము—కాకలము = పత్రవిశేషము.

కాడు—కటము = శ్మశానము.

కాణము—ఖాదనము = గుఱ్ఱపుఁదిండి.

కాన—కాననము = అడవి.

కామాల—కామలము = రోగవిశేషము.

కారము—క్షారము = రసవిశేషము.

కారిజము—కాలేయము = కార్జము.

కారు—కాలము = నలుపు, సమయము.

కావంచి—కామంజిక = కామంచి.

కాలువ—కుల్య = కయ్య.

కావడి—కావటి = కావడిబద్ద.

కా(సియ)సె—కచ్ఛ = దట్టి, కాసెకోక.

కాళంజి—కరాచి = తమ్మపడిగము.

కా(ళియ)ళె—కాహళిక = బూరగొమ్ము.

కార్తె { కృత్తిక = కృత్తికానక్షత్రము.
క్రాన్తి = సూర్యుని నక్షత్ర ప్రవేశము.

కిగ్గాడి—కీకటుఁడు = క్షుద్రుఁడు.

కిసుక—కృషి = వ్యవసాయము.

కీక—ఘీంకారః = కూత.

కీగాడి—చూ. కిగ్గాడి.

కీరితి—కీర్తి = యశము.

| వికృతి. | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|

కీలు—కీల = ఎముకకీలు.

కుంకటి—కూటకము = జుట్టు, పిల్లజుట్టు, ప్రధానము.

కుంకుమ— కుఙ్కుమము = రాగద్రవ్యము.

కుం(చె)-చియ—కుంచిక = చామరము, తూ.

కుంటెనకత్తె—కుట్టని = తార్చునది.

కుండ—గుణ్డము = మట్టిపాత్రము.

కుక్క—కుర్కురము = శునకము.

కుచ్చితము—కుత్సితము = నిందితము.

కుడిపి—కురూపి = అనాకారి.

కుమ్మర—కుమ్భకారుఁడు = కుమ్మరి.

కురులు—కురు(ర)ళము = ముంగురులు.

కువాడ(ళ)ము—కపట = మోసము.

కూఁకటి—కూటకము = చూ. కుంకటి.

కూన—కుణకము = బిడ్డ.

కూసము—కూర్పాసమ్ = కుబుసము.

కూళ } క్రూరుఁడు = కుత్సితుఁడు.
కూళుఁడు } మూఢుఁడు.

కేళాకూళి—ఖేలాకూలమ్=క్రీడాసరస్సు.

కే(డియ)(డె)ము—ఖేటకము = డాలు.

కే(రిజ-ర్జ)ము— గేరంగము = పక్షి విశేషము.

కేలు—కరి =చేయి, తొండము.

కైజా—కపింజలము = కముజుపిట్ట.

కైత—కవిత = కవిత్వము.

కైవడి—కైవర్తి = కయివడిముస్తె.

| వికృతి. | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|

కైసరుఁడు—కవీశ్వరః = కవి.

కొంగ—క్రుఙ్ = క్రౌంచము.

కొంఁ(చియ-చె)ము—కించిత్ = అల్పము.

కొంతము—కుంతలము = ఈటె.

కొంచ—క్రౌఞ్చము = ఒకానొకపక్షి, కొండ.

కొండ—కుణ్డము = పర్వతము.

కొటిక } ఖేటకము = గ్రామము.
కొట్టిక }

కొట్టడి—కోష్ఠము = కొట్టు.

కొక్కెర—కృజ్ = కొక్కెరాయి.

కొట్టము } —గోష్ఠము=పశువులపాక.
కొట్టాము }

కొట్టు—కోష్ఠము = సరకుల గది.

కొడి(స)సె—కుటజము = కొండమల్లె.

కొట్రు—ఖట్టేరకుఁడు = పొట్టివాఁడు.

కొడి—కోటి = దీపశిఖ.

కొడుకఁడు—కుణకుఁడు = కొడుకు.

కొతిమిరి—కుస్తుంబరి = కొత్తిమిరి.

కొనటి—కునష్ఠి = అంగహీనుఁడు.

కొమరసామి— కుమారస్వామి = సుబ్రహ్మణ్యుఁడు.

కొమరత } -కుమారి = కూఁతురు.
కొమా(రి)త }

కొమరుఁడు—కుమారుఁడు = కొడుకు.

కొల(కు)ను—కూలము = సరస్సు.

కొలము—కులము = వంశము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

కోఱపము—క్షురప్రము = గడ్డమును తోమెడు పనిముట్టు.

కోడి—కుక్కుటము = ఒకజంతువు.

కోమటి—కార్పటికుఁడు = వైశ్యుఁడు.

కోమలి—కోమలము = చక్కనిది.

కోయిల—కోకిలము = ఒకానొక పక్షి.

కోర—ఖరువు = దంష్ట్రి, పల్లు.

కో(గా-వె)ల— కోకిలము = ఒకానొక పక్షి.

కోసు—క్రోశము = రెండుమైళ్ళదూరము

క్రక్కస—కర్కసము = కఠినము.

క్రొంచ—క్రౌఞ్చము = ఒక కొండ, ఒక పక్షి.

కోఖ్మి—కురవకము = ఎఱ్ఱగోరింట.

ఖాణము—ఖాదనము = గుఱ్ఱపుఁదిండి.

గంగరేఁగు—కర్కంధువు = పెద్దరేఁగు.

గంజాయి—కల(ళ)ఞ్జము = కైపువస్తువు.

గంజి—కాంజికము = అన్నరసము.

గందము—గన్ధ = చందనము.

గంజా(యి)—కలంజము = మత్తువస్తువు.

గండవడము—కాండపటము = తెర.

గంబుర(ము) } కర్పూరము } = ఆరతి లోనగు వానికుపయోగించెడి వస్తువు.
గంబురా
గంబూర(ము)

గండు—గండము = మగతనము.

గంత—కంథము = బొంత.

గజ్జి—కచ్ఛువు = తీఁటకుఱుపు.

గగనము—గహనము = అడవి.

వికృతి. ప్రకృతి. అర్థములు.

గట్టన—ఘట్టనము = గట్టించుట.

గట్టు—ఘట్టము = కొండ, తీరము.

గడ—కాణ్డము = కోల, కంబము.

గడన } ఘటన, గణన } = సంపాదనము.

గడియ—ఘటిక = 24 నిమిషముల కాలము.

గడియారము— ఘటికారము = కాలపరిమాణయంత్రము.

గడ్డ—గండము = కుఱుపు.

గద్ద—గృధ్రము = ఒకానొకపక్షి.

గద్దియ } ఖట్టికము = సింహాసనము, ఉన్నతపీఠము.
గద్దె

గ(న్నే-న్నే)రు—కరవీరము (ఒకచెట్టు).

గబ్బి—గర్వి = పొగరుబోతు, దుష్టము.

గరగ—కరక = చిన్నకుండ.

గని—ఖని = రత్నాదులు పుట్టుచోటు.

గరాసు—క్రవ్యాశి = దుష్టుఁడు.

గరి(డు)డీ—ఖురళి = సాముకూటము.

గరిత—గృహిణి = ఇల్లాలు.

గఱి—గరుత్తు = ఱెక్క.

గరుటామంతుఁడు } గరుత్మంతుఁడు = గరుడుఁడు.
గరుటాలమంతుఁడు

గరుడ—గారుడము = ఒకానొక రత్నము.

గఱువ (గురువు) = గొప్పవాఁడు, పెద్ద.

గరుము = ఖరభువి = గరపనేల.

గవర(న)=గౌర = కొంచెమెఱుపు.

గాఁజర = కలంజము = పొగాకు.

గాజు = కాచము = మృద్వికారము.

వికృతి. ప్రకృతి. అరములు.

గాటము—గాఢము = అధికము.

గాటు—కటువు = కారము.

గాడి—గాఢము = గాటము.

గాడిద—గార్దభము = ఖరము.

గాణ { గాయనుఁడు = పాటకాఁడు.
గాయని = పాటకత్తె. }

గాణి—గాయని = పాటకత్తె.

గాతము—ఖాతము = పల్లము.

గాతి—ఘాతి = దెబ్బ, చఱపు.

గాద—గాథ = సమాచారము.

గాదె—గఞ్జము = ధాన్యము పోయుటకు మట్టిరొయిఱలతోఁ గట్టిన బుట్ట.

గామిడి—గ్రామణి = శ్రేష్ఠుఁడు.

గాము—గ్రహము=సూర్యాది,పిశాచము.

గార—క్షారము = మఱక, సున్నము.

గారడము—గారుడము = విషమంత్రము.

గాము—మాయ.

గార (వ) ము
గారా(బ)ము } గౌరవము=గొప్పతనము, ప్రేమము.
గారాబు

గారె—ఘారికము = వడ.

గాసము—గ్రాసము = ఆహారము.

గిండి—కుండి = సన్నని మెడగల పాత్ర.

గిడ్డి—గృష్టి = పొట్టియావు.

గిరిశము—శిరీషము = దిరిసెనము.

గీఁక—ఘీఙ్కారము = ఏనుఁగుకూఁత.

గీము—గృహ(గేహ)ము = ఇల్లు.

గుండము—కుణ్డము = నిప్పులగుంట.

వికృతి. ప్రకృతి. అర్థములు.

గుండిగ—కుండిక = వెడల్పు నోరుగల పాత్రము.

గుండు—గండము = పెద్దఱాయి, గోళి.

గుం(ట)త—గర్తము = చిన్నగోయి.

గుండ్రము—కుణ్డలము = వర్తులము.

గుగ్గిలము— గుగ్గులువు = గుగ్గులువృక్షపు బంక.

గుంపు = గుంఫము = ప్రోగు.

గుజ్జు—కుబ్జుఁడు = పొట్టివాఁడు.

గుట్ట—కుణ్డము = కొండ.

గుట్టు—గూఢము=మర్మము, రహస్యము.

గుడారము
గుడారు } గుణాలయము = డేరా.

గుడిసె—కుటీరము = చిన్న గడ్డిపాక.

గుత్తి—గుచ్ఛము = పూవులు, కాయలు లోనగువాని గుత్తి.

గుదియ—గద = ముద్గరము.

గుద్దలి—కుద్దాలము = మొక్కలను పెల్లగించెడి సాధనము.

గుబ్బ—కుంభము = కుచము, గుండ్రనిది.

గుద్ద—గుదము = ముడ్డి.

గుమ్మడి—కూశ్మాండము = తీఁగ.

గుయ్యారము - గుహ్యాగారము=చెఱసాల.

గుఱ్ఱము—ఖురువు = అశ్వము.

గులిగ—గుళిక = పాదరసము లోనగువానితోఁజేసిన యుండ.

గుఱిజ—గుంజ = గురివెంద.

గుల్ల—క్షుల్లకః=క్షుద్రశంఖము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

గూటము—కూటము = డేరామేకు.

గూఁటి—(ఘోణి - ఘృష్టిః) = పంది.

గూటము—కూటము = వడ్రంగి పని ముట్టు.

గుడారము—గుణాలయము = డేరా.

గూబ—ఘూకము = గుడ్లగూబ.

గూఁద—గుదము = కిందకుదిగినగుదము.

గేదఁగి—కేతకి = పచ్చపూ మొగలి.

గేలి—కేళి = క్రీడ, పరిహాసము.

గేస్తుఁడు—గృహస్థుఁడు.

గొంటు—కుంఠః / ఘూంట } = వంచకుఁడు, మొద్దువక్క.

గొంతి—కున్తి = పాండురాజుభార్య.

గొడ్డలి—కుఠారము = పరశువు.

గొత్తు—గుచ్ఛము = గుత్తి.

గొనము—గుణము = సత్త్వాది, శౌర్యాది.

గొనయము—గుణము = అల్లెత్రాడు.

గొబ—గుహ = మూల, గుహ.

గొరిజ / గొరిసె } ఖురము = జంతువుల కాలిగిట్ట.

గొ(ఱ్ఱియ)ఱ్ఱె—కురరి = మేషము.

గొం(డిలి)డ్లి—క్రీడ = ఆట.

గొల్ల(ఘోంట) = రేగుచెట్టు.

గొద—క్షుధ = ఆఁకలి.

గొరక—ఖురాలకము = ఇనుపబాణము.

గొల్ల—గోపాలుఁడు = గొల్లవాఁడు.

గోడ—కుడ్యము = భిత్తి.

వికృతి. ప్రకృతి. అర్థముల

గోడా—ఘోటకము = గుఱ్ఱము.

గోడిగ—ఘోటక = ఆఁడుగుఱ్ఱము.

గోణాము / గోణము } కౌపీనము = గోఁచి.

గోధుమ—గోధూమము = ఒకపైరు.

గోనె—గోణీ = సంచి.

గోరఁట—కురణ్టకము = ఒకానొక చెట్టు.

గోరు—ఖురము = నఖము.

గోరువంక—గోరజ్జువు = పక్షివిశేషము.

గోరోజనము / గోఱజము } గోరోచనము = ఆవు కడుపులోనిది.

గోలీ = గోలకము = ఆటియుండ.

గోలెము—గోలకము = కుండ.

గోసంగి—గోహింసకుఁడు = మాదిగ.

గోసన—ఘోషణము = చాటించుట.

గోసు—ఘోషము = చాటింపు.

గౌసెన—కోశము = గలీబు.

గ్రద్ద—గృధ్రము = పక్షివిశేషము.

చికతలిక్క—క్ష్వేంకము = ఎఱ్ఱని మొగము గల కోఁతి.

చికినము—చిక్కణము = పోకవక్క.

చిట్ట—చిత్రము = ఆశ్చర్యము.

చిరుఁగు—జీర్ణము = చినుఁగు.

చిఱుత—చిత్రికము = చిఱుతపులి.

చీమిడి—శింఘాణము = ముక్కునుండి వచ్చు శ్లేష్మము.

| వికృతి | ప్రకృతి | అర్థములు. |
|---|---|---|

చంక
చంకిలి } కక్షము = బాహుమూలము.
చక్కిలి

చందమామ—చన్ద్రమసుఁడు = చంద్రుఁడు

చందము—ఛన్దస్సు = ఛందము, విధము

చందిరిక—చన్ద్రిక = వెన్నెల.

చందు { చన్ద్రుఁడు = చంద్రుఁడు
{ సౌందర్యము = అందము.

చందురమామ-చన్ద్రముఁడు = చంద్రుఁడు.

చందురము—సిన్ధూరము = కుంకుమ

చందురుఁడు—చన్ద్రుఁడు = చందమామ

చందువా-చంద్రోదయము = మేలుకట్టు.

చంద్రకము—సిన్దూరము = కుంకుమ

చక్క— { పట్కము = ఆలు.
{ శల్కము = ముక్క.

చక్కిలము—శష్కులి = భక్ష్యవిశేషము.

చక్క—చంగము = తిన్ననిది.

చక్కిలి—కక్షము = చంక.

చక్కెర—శర్కర = పంచదార

చట్టము—శాస్త్రము = శాసనము.

చట్టు—ఛాత్రుఁడు = శిష్యుఁడు.

| వికృతి. | ప్రకృతి | అర్థములు |
|---|---|---|

చదర—చతురశ్రము = చిన్నచాప.

చదరంగము—చతురఙ్గము = ఒక యాట

చదరము—చతురశ్రము = సమమైన వెడల్పు పొడుగులు కలది

చదుకము—చతుష్కము = నాలుగు మార్గములు కలియుదారి, చతుష్పథము

చదుర—చతుర = నేర్పుగల స్త్రీ.

చదురు { చతురము = చాతుర్యము
{ సదస్సు = సభ గద్దె

చదురుఁడు—చతురుఁడు = నేర్పరి

చను—స్తనము = కుచము.

చనుపకము—చమ్పకము = సంపెఁగ.

చన్ను—స్తనము = కుచము

చ(ల్ల-లా)డము—చలని = లాగు

చవి(క-కె)
చవి(ర-రె) } చతుష్కము = మండపము

చవుకము—చతుష్కము = చదరము

చవుతి—చతుర్థి = నాలుగవ తిథి

చవుదంతి—చతుర్దన్తి = ఇంద్రుని యేనుఁగు.

చవుదరి—చతుర్థము = శూద్రుఁడు.

చవుషష్టి—చతుష్షష్టి = ఎనుబది నాలుగు.

| వికృతి | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|
| చాగము | త్యాగము | ఈవి. |
| చాగి | త్యాగి | ఈవికాడు. |
| చామ | శ్యామము | నలుపు |
| | శ్యామ | యౌవనస్త్రీ |
| | శ్యామకము | ఒకానొకపైరు. |
| చామనము | శ్యామలము | నల్లనిది. |
| చాయ | ఛాయ | కాంతి సూర్యుని భార్య. |
| చారు | సారః | చాఱు. |
| చింత | చించ | తింత్రిణి. |
| చింద | చిల్లము | చిన్నగ్రద్ద. |
| చిందఱ | ఛిద్రము | రంధ్రము. |
| చిచ్చు | శుచి | నిప్పు, తాపము. |
| చిటిక | క్షితికము | కాలవిశేషము, ఒక ధ్వని |
| చిత్త | చిత్ర | ఒకానొక నక్షత్రము |
| చిత్తరు (వు) | చిత్రము | ఆశ్చర్యము, పటమునందలి బొమ్మ. |
| చిరునామా | శిరోనామ | సంతకము. |
| చిలుక | శుకము | ఒకానొక పక్షి. |
| చివర | శిఖరము | కొన. |
| చిత్తరము | చిత్రము | అద్భుతము |
| చిప్పె | శిల్పి | దర్జీవాడు. |
| చిల్లు | శల్యము | బాణపుములికి. |
| చీఁదఱ, చిల్లి | ఛిద్రము | రంధ్రము. |
| చీర | చీరము | వస్త్రము. |
| చీల | శల్యము—కీలము | మేకు |
| చిక్కము | శిక్యము | ఉట్టి. |
| చి(న్నె)న్నియ | చిహ్నము | గుఱుతు. |
| చుంచు | చుచుందరి | కంపెలుక. |
| చుప్పనక, చుప్పనాక | శూర్పణఖ | రావణుని చెల్లెలు. |
| చూఁకురు | శోకము | వగపు. |
| చూ(చు)రి | ఛురిక | చిన్నకత్తి |
| చూఱ | చుర | దోఁపుడు, కొల్ల. |
| చెంక | శంఖము | చెంప, లెంప. |
| చెందిరము | సింధూరము | గంగ సిందూరము |
| చెంద్రిక | సిందూరము | కుసుంభవర్ణము. |
| చెంబు | శుల్బము | రాగిపాత్ర |
| చెకడా | శకటము | రెండెద్దులబండి. |
| చెదలు | శిథిలి | పుట్టచీమ |
| చెవి | శ్రవము | శ్రోత్రము |
| చెరవ(ము) | చరుః | వేడుఉప్పుమూతిగల పాత్ర. |
| చె(రు) (ఱు) వు | సరము | కొలను. |
| చేల | చేలము | వస్త్రము. |
| చేమంతి | సేమంతి | పుష్పవిశేషము |
| చొక్కటరము | చోక్షతరము | స్వచ్ఛము |
| చోఁపు | క్షుభ్ | తరుము, కలఁచు |
| చొక్కము | చోక్షము | స్వచ్ఛము. |

వికృతి. ప్రకృతి. అర్థములు.

జంకు—శంక = బెదరు.

జంగము—జఙ్గముఁడు = లింగధారి.

జంత్రము—యంత్రము = కీలుబొమ్మ.

జంగ—జంఘ = పిక్క, తొడ.

జందెము—యజ్ఞోపవీతము

జంపె—ఝంప = సంగీతతాళభేదము.

జక్కిణి—యక్షిణి = ఒక జాతి

జక్కులు—యక్షులు = దేవతాభేదము

జక్కువ—చక్రము = పక్షివిశేషము.

జగడము—ఝకటము = కలహము.

జగము—జగత్తు = లోకము.

జడ—జట = వెండ్రుకల కలయిక.

జడ్డు—శ్రద్ధ = ఆసక్తి.

జతన } యత్నము = పూనిక.
జతనము }

జతను—స్థానము = కూడిక.

జన్నము—యజ్ఞము = యాగము.

జన్నిదము—యజ్ఞోపవీతము = జందెము.

జముఁడు—యముఁడు = అంతకుఁడు.

జమున—యమున = ఒకానొక యేఱు.

వికృతి. ప్రకృతి. అర్థములు.

జమ్మి—శమి = ఒకానొక చెట్టు.

జలకము—జలము = ఉదకము, స్నానము.

జలగ—జలూకము = రక్తమును పీల్చు నీటిలోని చిన్నజంతువు.

జవ్వనము—యౌవనము = యౌవనభావము.

జక్కిని—యక్షిణి = కుబేరుని భార్య.

జడదారి—జటాధారి = ఋషి.

జడను—జడతా = మాంద్యము.

జతి—యతి = గీతభేదము.

జనుము—శణము = ఒకజాతి పైరు.

జబర—ఖపురము = పోఁకపట్ట.

జాతర—యాత్ర = క్షుద్రదేవతోత్సవము.

జాము—యామము = 3 గంటలకాలము.

జాల—జాలము = చేఁపలవల.

జిత్తు—యుక్తి = కపటోపాయము.

జిలకఱ }
జిలకఱ్ఱ } జీరకము = ఒకానొకసంబారువు
జీలకఱ }
జీలకఱ్ఱ }

జుట్టు—చూడ = సిగ.

జుజ్జు—జర్జరము = శిథిలము.

జూజము—ద్యూతము = జూదము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

జూదము—ద్యూతము=పాచికలాట.

జూజి—దూతి = దూతిక.

జల—జలము=నీటిబుగ్గ.

జేగంట—జయఘణ్ట = ఘంటావిశేషము.

జెష్ట—జ్యేష్ఠ=పెద్దది, అక్క.

జొన్న—జూర్ణము = సస్యవిశేషము.

జోగి—యోగి = యోగాభ్యాసము కలవాఁడు, భిక్షుకుఁడు.

జోగిణి—యోగిని = జోగురాలు.

జోటి—యోషిత్తు = స్త్రీ.

జోతి—జ్యోతి = కాంతి, దీపము.

జోదు—యోధుఁడు = యుద్ధవీరుఁడు.

జోసి—జ్యౌతిషికుఁడు = జోస్యుఁడు.

జోస్యము—జ్యోతిషము = జ్యోతిశ్శాస్త్రము.

జోస్యుఁడు—జ్యౌతిషికుఁడు = జ్యోతిశ్శాస్త్రవేత్త.

టక్కు—ఠక్కము = మోసము.

టికము—త్రికము = ముడ్డిమూస.

ఢంకా—ఢక్క = నగారా వాద్యము.

డంబు—దంభము = మోసము.

డంబము—డమ్బరము = విజృంభణము.

డమరుగము-డమరుకము=చర్మవాద్యము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

డక్క—ఢక్క = వాద్యభేదము.

డాలు—ఢాలము= = కేడెము, జండా.

డిగ్గియ—దీర్ఘిక = నడబావి.

డోల-డోల=ఉయ్యాలవంటి యందలము.

డోలు—ఢోలము = చర్మవాద్యము.

తంబుర—తుంబరము = వాద్యవిశేషము.

తంతి—తంత్రి=ఒక లోహపుతీఁగ.

తంతు—తన్త్రము = మోసపునడపు.

తందరి—తన్ద్రము = కునికిపాటు.

తక్కడ—తర్కారి = త్రాసు.

తగరము—తమరము = లోహవిశేషము.

తచ్చన—తర్జనము = కపటము.

తదియ—తృతీయము = మూఁడవ తిథి.

తపసి—తపస్వి = తపము చేయువాఁడు.

తప్పెట—తమ్మటము = చర్మవాద్యము.

తలవారి—స్థలవారము = తలారి.

తలితము—తలిమము = పఱుపు.

తవనిధి—తపోనిధి = తపోరాశి.

తలము, తబుసు { తపస్సు, తపము } = మంత్రమును జపించుట.

తమగము—తమంగము = మంచె.

తములము, తమ్ములము { తాంబూలము=వక్కసున్నముతోఁగూడినతమలపాకు.

తమ్మి—తామరసము = కమలము.

తరఁగ—తరఙ్గము = అల.

వికృతి. ప్రకృతి. అర్థములు.

తరవరి, తరవలి } తరవారి = పట్టాకత్తి.

తరుణియ—తరుణీ = యౌవనవతి.

తరుచు—తక్ష్ = సానఁబెట్టు

తతి—తరసము = మాంసము

తలియ—స్థాలము = భోజనపాత్రము.

తల్లడము—తరళము = చలనము.

తివరము—తమరము = తగరము.

తలి(గ)య—స్థాలము = భోజనపాత్రము.

తాట—తాటంకము = చెవికమ్మ

తాడు—తాళము = తాడిచెట్టు

తాత—ధాత = బ్రహ్మ.

తానము { స్థానము = ఉనికిపట్టు. స్నానము = మునుక. }

తానము—త్యానము = గానాంగము.

తాపసి—తపస్వి = ముని

తావరము, తావలము } స్థావరము = స్థిరము.

తామర—తామరసము = పద్మము.

తాలు(వ)వు—తాలు = దౌడ

తికము—త్రికము = మడ్డిపూస

తిప్ప, దిబ్బ, దిమ్మ } = ద్వీపము.

తిరము—స్థిరము = నిలుకడయైనది

తి(గ)వ—త్రికము = మూఁడు.

తివుడ—త్రిపుట = తాళవిశేషము.

తిత్తి—దృతి = తోలుసంచి.

తిప్ప—ద్వీపః = రాశి, దిబ్బ.

తిమిరి—తిమిరము = నేత్రరోగభేదము.

తిమ్మనము—తేమనము = పాలు, బెల్లము, పిండి కలిపి ఉడికించిన పదార్థము

తీంద్రము—తీక్ష్ణము = తీవ్రము.

తీతువు—తిత్తిరి = ఒకానొక పక్షి.

తీవరము—తీవ్రము = వేగిరపాటు

తీవరుఁడు—ధీవరుఁడు = చేఁపలు పట్టువాఁడు

తుమ్మి—తుంబి = ఒకానొక చెట్టు

తుంట—దష్టము = తుంటరి

తుండము, తుండెము } తోండనము = ముక్క.

తుత్తము—తుత్థము = మైలతుత్తము.

తురక—తురుష్కుఁడు = మ్లేచ్ఛుఁడు.

తురికి—తురఙ్గము = గుఱ్ఱము.

తుఱుము—తురుమ్బము = కొప్పు.

తురితము—త్రుతము = శీఘ్రముగా.

తుఱుతు—త్వరితము = వేగముగా.

తూపి—స్థూపము = గుడిశిఖరము.

తెక్కలి—తస్కరుఁడు = మోసగాఁడు.

తెప్పలు—తృప్తి = సమృద్ధి

తెనుఁగు—త్రిలింగము = చూ వ్యు.

తెలికలు—తిలలు = నూవులు.

తెలుఁగు—త్రిలిఙ్గము = తెనఁగు.

| వికృతి | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|

తెల్ల—ధవళము = శుక్లము.
తెలగా—త్రిలింగము = ఒకజాతి.
తె(లియ)లె—స్థాలి = భోజనపాత్ర.
తేగము—త్యాగము = ఈవి.
తేజు—తేజము = కాంతి.
తేమ—తేమము—తడి ఆర్ద్రిత
తొండము—తుణ్డము = ఏనుఁగు చేయి.
తొందర—త్వర = వేఁగిరపాటు.
తొక్క—త్వక్కు = చెట్టుపట్ట మొ.
తోరము—స్థూలము = లావు గొప్ప.
తొగరు—తువరము = ఒగరు.
తొందు—తుంది = బొజ్జగలవాఁడు.
త్రాణ—ద్రవిణము = బలము.
దంట—ధృష్టుఁడు = దిట్టరి.
దండ—దణ్డికము = హారము.
దండు—దణ్డము = సైన్యము.
దం(డియ)డె—దండిక = వీణె మొ.
దండెము / దండియ / దండియము } దణ్డిక { = బట్టలు వేసి కొనుట కనువగు కొయ్య
దక్కనము—దక్షిణము—ఒక దిక్కు పేరు.
దగ—దాహము = దప్పి, పిపాస.
దట్టి—ధటి = కౌపకోశ.
దట్టుఁడు—ధృష్టము = ధీరుఁడు
దడ—ధట = కొయ్యత్రాసు.

| వికృతి. | ప్రకృతి | అర్థములు. |
|---|---|---|

దబ్బ—దర్భ = తృణవిశేషము.
దమ్మఁడు—ధర్ముఁడు = నిష్కపటుఁడు
దమ్మము—ధర్మము = పుణ్యము.
దయ్యము—దైవము = దేవుఁడు.
దర—ధారణ = వెల.
దరి—తీరము = గట్టు, దగ్గఱ.
దరిసెనము—దర్శనము = చూచుట.
దవనము—దమనము = ఒక మూలిక.
దళవాయి = దళవాహి = సేనాధిపతి
దసరా—దశరాత్రము = పదిరోజులు.
దడి(బ-మ)ము—తలిమము = శయ్య.
దణా—దళము = సేన.
దనియాలు—ధనికము = కొత్తిమిరివిత్తు.
దాడి—ధాటి = దండయాత్ర.
దా(డి)లిమ్మ / దా(డి)నిమ్మ } దాడిమము=దానిమ్మచెట్టు.
దాది / దాదిలి } ధాత్రి =పాలిచ్చు పెంచుతల్లి.
దాయ—దాయాదుఁడు=జ్ఞాతి, శత్రువు.
దార—ధార = నీటిచాలు, దానము
దారబందము—ద్వారబంధము=ద్వారము.
దారము—ద్వారము=దారబందము.
దారి—ద్వార్ = మార్గము.
దారి—ధారి = ధరించువాఁడు.
దాసము—దాస్యము = సేవ, కొలువు.
దాసరి—దాసేరుఁడు = విష్ణుభక్తుఁడు.
దిచ్చరి—దిక్చారిణి = వ్యభిచారిణి.

వికృతి. ప్రకృతి. అర్థములు.

ది(డి)గ్గియ—దీర్ఘిక = నడబావి.

దిటము—దృఢము = శక్తి, ధైర్యము.

దిట్ట / దిట్టడు } ధీరుఁడు = ధృష్టుఁడు.

దినసరులు—దినచర్య = రోజువారీ కార్యక్రమము.

దిరిసెనము / దిరిసెము } శిరీషము = దిరిసెనపుఁజెట్టు.

దివటీ / దివ్వటీ } దీపయష్టి = ఇనుపసలాకకు గుడ్డ లంచుట్టి వెలిగించెడు దీపము.

దివాణము— దేవాయతనము=రాజుకొలువు కూటము, రాజభవనము.

ది(వి-వ్వి)య, దివె, దివ్వె } దీపము = దీపము.

దిష్టి—దృష్టి = చూపు.

దిస్స—దిశ = దిక్కు.

దీ(మ)ము—దీపకము = ఎఱ, బోను, ఇల్లు.

దుండగము—దౌష్ట్యము = దౌర్మార్గ్యము

దీపురము—దీప్రము = ప్రకాశించునది.

దీ(వ-మ)సము—ధీవశము = ఆలోచన.

దీవి—ద్వీపః = దిబ్బ, ద్వీపము.

దుగ—ద్వికము = రెండు.

దుగినుఁడు—ద్రుహిణము = బ్రహ్మ.

దుగుణము—దిగుణము = రెండింతలు.

దుగ్గ—దుర్గ= పార్వతి, శక్తి.

దుడ్డు—దణ్డము = లావుకఱ్ఱ, గద.

దునేదారి—ధనుర్ధారి = విలుకాఁడు.

వికృతి. ప్రకృతి. అర్థములు.

దుప్పటము / దుప్ప(టి)టీ } ద్విపటి = కప్పుడుబట్ట.

దుబాసి—ద్విభాషి = రెండు భాషలు నేర్చినవాఁడు.

దురద—దద్రువు = కండూతి, జిల.

దురము { త్వర / ఉదరము } = వేగము. / = యుద్ధము.

దు(గ)వ — ద్వా = రెండు.

దువారము—ద్వారము = వాకిలి.

దువ్వటము—ద్విపటము = దుప్పటము.

దువ్వి—ద్వీపి = పెద్దపులి.

దూఁకలి—దుఃఖము = బాధ.

దూలము—స్థూలము = తనాబీ.

దుస్ససేనుఁడు— దుశ్శాసనుఁడు=దుర్యోధనుని తమ్ముఁడు.

దూపము—ధూపము = వాసనగల పొగ.

దెస—దిశ=దిక్కు, వైపు.

దేవము—ధ్యానము = ధ్యానము.

దేవర—దేవుఁడు = ప్రభువు, దేవుఁడు.

దేవళము—దేవాలయము = గుడి.

దేవెరి / దేవేరి } దేవి = దొరసాని.

దేవేలి—దేవలకుఁడు = పూజారి.

దొండ—తుండి = ఒక దినుసు తీఁగ, బింబిక.

దొం(డ)దు—తుంది = బొజ్జగలవాఁడు.

దొందము-ద్వంద్వము=ద్వంద్వరోగము.

వికృతి. ప్రకృతి అర్థములు

డోన { తూణము = అమ్ములపొది
{ ద్రోణి = కొండమీఁది గుంట.

డో(న్నియ)న్నె—ద్రోణి = దొప్ప.

డొమ్మి—తుములము = సంకులయుద్ధము.

డోదసి—ద్వాదశి = పండ్రెండవతిథి.

డోయి—ద్వయి = జోడు, కవ.

డోరణ
డోరణము } తోరణము = మావి డాకుల దండ

డోరము—ద్వారము = దారబందము

డోసము—దోషము = పాపము

ద్రోవది—ద్రౌపది = ద్రుపదరాజు కొమార్తె.

నట్టు—నటః = నర్తకుఁడు.

నరసింగడు—నరసింహుఁడు = నృసింహదేవుఁడు.

నాఁగలి
నాఁగెలు } లాఙ్గలము = దున్ను సాధనము.
నాఁగేలు

నాగ—నాగము = పూజ్యము పెద్దది.

నాగవలి } నాకబలి = పెండ్లిలోనగడపటి
నాగవల్లి } రోజున జరుగు శుభకార్యము.

నాగసరము—నాగస్వరము = సన్నాయి.

నాగు(వు)—నాగము = సర్పము, పాము.

నాటకము—నాట్యము = నర్తనము.

నా(డె)ణెము—నాణకము = రాగి, వెండి బంగారముల ముద్ర.

నాదు—నాదము = ధ్వని, మ్రోఁత.

నాన—జ్ఞానము = సిగ్గు, లజ్జ.

వికృతి. ప్రకృతి అర్థములు.

నాయఁడు—నాయకుఁడు = అధిపతి, ఒక బిరుదు.

నాయము—న్యాయము = నీతి ధర్మము.

నారసము—నారాచము = బాణము.

నారాజి—నారాచము = కత్తి

నారి—నాడి = వింటియుల్లెత్రాఁడు.

నారింజ—నారంగము = ఫలవృక్షము.

నారికడము—నారికేళము = టెంకాయ చెట్టు.

నిక్కవుఁడు—నిష్కపటము = నిష్కాపట్యము.

నిచ్చయము—నిశ్చయము = నిర్ణయము.

నిచ్చలము } నిశ్చలము = చలింపనిది.
} నిశ్చలము = నిష్కపటము.

నిచ్చ(లు)—నిత్యము = ఎల్లప్పుడు.

నిచ్చెన—నిశ్శ్రేణి = ఎక్కుడుసాధనము.

నిత్తెము—నిత్యము = శాశ్వతము.

నిత్తెమల్లె—నిత్యమల్లిక = ఒక పుష్పలత.

నిదుర
నిద్దర } నిద్ర = కూరుకు నిద్ర.

నిమూసము—నిమేషము = తెప్పపాటు కాలము.

నిమ్మ—నింబము = జంబీరము.

నియ్యోగి—నియోగి = ఒక తెగవిప్రుఁడు.

నిరాచారి—నిరాహారి = ముని.

నిరుకుళము—నిరర్గళము = దిగంబరము.

వికృతి. ప్రకృతి. అర్థములు

నిరుతి—నిర్ఋతి = నైర్ఋతుఁడు.

నిస్సంతు-నిస్సంతతి = సంతానశూన్యము.

నేయి—స్నేహము = ఆజ్యము.

నిసి { నిశీథము = అర్ధరాత్రము
నిశ = రాత్రి.

నైట్టికశీల—నైష్ఠికశీలుఁడు = బ్రహ్మచారి.

నీతము—నియతము = నియమము.

నీరు—నీరము = ఉదకము.

నెగ్గడము—నికటము = సమ్మర్దము.

నెపము } నిభము=వ్యాజము, మిష.
నెవము }

నెయ్యము—స్నేహము=చెలిమి, ప్రేమ.

నెమ్మి—నేమి=కంజులము బండిచక్రము చుట్టునుండు కమ్మి.

నేమము—నియమము=నియతి, వ్రతము.

నేస్తము—స్నేహము = చెలిమి, ప్రేమ.

పంచ—పార్శ్వము = పంచపాళి.

పంచదార—పఞ్చసారము = చక్కెర.

పందెము—పణితము = జూదమున నొడ్డునది.

పండేరము—భక్ష్యము = భక్ష్యము.

పక్కి—పక్షి = పులుఁగు.

పగడము—ప్రవాళము = రత్నభేదము.

పజ—ప్రజ = జనము.

పటికము—స్ఫటికము=ఒకానొకఱాయి.

పట్టము—పట్టణము=రాజ్యము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

పడగ { పతాక } = టెక్కెము.
పడిగె { స్ఫటా. } = సర్పఫణము

పడిసెము—ప్రతిశ్యాయము = రొంప.

పడుట—పతనము = పాటు.

పడిహారి } ప్రతీహారి=ద్వారపాలకుఁడు.
పణిహారి }

పణ్యారము—పణ్యాహార = నానఁబప్పు.

పతిమ—ప్రతిమ = బొమ్మ

పదవి—పదము = ఉన్నతస్థానము.

పదిలము—భద్రము = సుఖము

పద్దె(ము)— పద్యము = ఛందోబద్ధమైన కావ్యము.

పన్నము—ప్రశ్నము = వేదపరిచ్ఛేదము.

పన్నిదము—పణితము = పందెము

పన్నీరు—పన్నీరము = హిమాంబువు.

పన్ను—పణము = భూమిపన్ను.

పబువు—ప్రభువు = అధిపతి.

పబ్బము—పర్వము = పుణ్యదినము.

పయనము } ప్రయాణము = కదలుడు.
పయినము }

పయఁట } పైర = పయ్యెద.
పయ్యెఁట }

పరామరిక } పరామర్శ = చక్కగా
పరామరిస } విచారించుట.

పరిది—పరిధి = సూర్యునిచుట్టు గుడి.

పరితము—పరభృతము = కోయిల.

పరియంకము—పర్యఙ్కము = శయ్య

పరియాచకము— పరిహాసము=కోడిగము

ఆటవిడుపు—బాలురను ఆటకై విడుచుట.

ఆటు-పోటు— చంద్రోదయాస్తమయములందు సముద్రజలమునందలి అలల వృద్ధి క్షయములు.

ఆడఁబోయినతీర్థ మెదురగు—అప్రయత్నముగనే కోరిక సఫలమగు.

ఆడుచఁ బాడుచు— అనాయాసముగా, నిర్లక్ష్యముగా.

ఆదరా-బాదరా—వేగిరపాటు.

ఆన-పాను— పుట్టువునకు పూర్వోత్తర రహస్యము.

ఆర్చు-తీర్చు—కోరికతీర్చు, బుజ్జగించు.

ఆరితేరు-గడితేరు, నిపుణుఁడగు.

ఆలుమూఁడగు—కార్యనాశనమగు, నూలు అఱుగుటవంటిది.

ఆలగోడు-బాలగోడు— పెడబొబ్బలు, పలువురు కలిసిచేసెడు రోదనము.

ఆవగింజలో అరపగము—పెద్దకార్యములో మిక్కిలి చిన్నభాగము.

ఆకలించిన ప్రేగులు లెక్కపెట్టు-చూచినంతనే గ్రహించు.

ఇచ్చక బుచ్చకములు— ముఖప్రీతి వాక్యములు.

ఇచ్చిపుచ్చుకొన్న యీలగ్రద్ద— దానమిచ్చి తిరిగి తీసికొన్న లోభి.

ఇనుపగజ్జెలతల్లి—నిర్భాగ్యదేవత, పెద్దమ్మ.

ఇల్లుగుల్ల చేయు—సొమ్ము అంతయు వమ్ము చేయు.

ఇల్లో నారాయణమ్మ— ఎంగిలి చేతితోఁ గాకిని కూడ కొట్టనిది, మిక్కిలి లోభముగల స్త్రీ.

ఇసుకపాతఱ—హద్దులేనిది.

ఈఁకకు ఈఁక — తోఁకకు తోఁక — ఏ భాగమున కా భాగము విడివిడిగా.

ఈఁగకు ఇలి - పాముకు బలి పెట్టఁడు—(ఇలి=ఎంగిలి మెతుకు.) మహాలోభి యనుట.

ఈడు-జోడు—సరిసమానము.

ఈల కఱచు—అపజయము పొందు, ప్రాణము బిగపట్టు.

ఉంగరాలచేతిమొట్టికాయ— లంచమిచ్చి నొక్కపనిచేయించుకొనుట, అధికారిచే చెప్పించి పనిచేయించుకొనుట.

ఉక్కుతునక్కలు— మిక్కిలి బలముగలవారు, శూరులు.

ఉగ్గుపాలతోఁబెట్టు— చిన్నతనమునుండి అలవఱచు.

ఉట్టికట్టుకొనియూగు— చిరకాలము అశక్తుఁడై జీవించియుండు.

ఉట్టిపడుట— అకస్మాత్తుగాఁ గనబడుట

ఉడుతభక్తి— శ్రీరాముఁడు వారధి గట్టునపుడు ఇసుకలో పొర్లి నీట వదలుచు చూపిన భక్తి.

ఉప్పు-పత్రిలేదు—మాటాడకుండుట

ఉప్పుతిను—సొమ్ముతిను.

ఉప్పుతో తొమ్మిది—మృష్టాన్నము.

ఉల్లకుట్టుమాటలు—మర్మమును భేదించు మాటలు.

ఊచముట్టుగ—నిశ్శేషముగ.

ఊఁత(కోల)గఱ్ఱ—నడచుట కాధారమైన కఱ్ఱ.

ఊఁత-పాటిలేదు—ఏ మాటను సరకుచేయకుండుట.

ఊలమాలగుకుచు—చీకాకుపడు, తహతహ నొందు.

ఋణము తీఱు—సంబంధము తెగిపోవు.

ఎంగిలిమంగలము—అపరిశుద్ధము.

ఎండకన్నెఱుఁగక=వీథిమొగము చూడక, ఎట్టికష్టముల ననుభవింపక.

ఎంబెన్న— నిరక్షరకుక్షి, పనులయందు మిక్కిలి అసమర్థుఁడు.

ఎకాయెకి—మధ్యమధ్య ఆగక, ఎడతెగక.

ఎగ-దిగ—పైనుండి క్రిందకు, క్రిందనుండి పైకి.

ఎగ (గొట్టు)వేయు<br>ఎత్తివేయు } అప్పులు తీర్చక దివాలా తీయు.

ఎగసఁద్రోయు— వైరాదులనురగుల్కొలుపు, పురికొలుపు.

ఎడమడుగు—తృణీకారభావము, భేదము.

ఎత్తిపొడుపు — తీయఁగా మాటాడుచు ఎదుటివారికి వారివారిదోషముల నెత్తి చూపుట.

ఎదురేగు—గౌరవార్థము ఎదురుగాఁబోవు.

ఎదురెక్కు-ఎదురీఁదు— ఎన్ని కష్టములు వచ్చినను సాహసముతో ప్రతిఘటించుట.

ఎదుఱొమ్ముకుంపటి—ఱొమ్ముపై కుంపటి చాల బాధాకరమనుట (సమీపమున నున్న శత్రువు).

ఎదుగు-బొదుగు—వృద్ధి క్షయములు.

ఎద్దు-మొద్దు— ఎందుకును పనికిరాని మందుఁడు.

ఎనిమిదవ అష్టము వర్ణించుట—కార్యము సిద్ధింపనపుడు బూతుల పంచాంగము విప్పుట.

ఎనుఁబోతుపై జడివాన—ఎంతవర్షము కురిసినను ఎనుఁబోతు లక్ష్యము చేయదనుట.

ఏండ్లును-పూండ్లును— అనేక సంవత్సరములు.

ఏకియేకి వదలు— తిట్టి సాధించి విడచు, కొట్టి కొట్టి విడచు.

ఏకు మేకగు — మిత్రుఁడుగాఁజేరి శత్రుత్వము సాధించు.

ఏటావలి గిలిగింతలు — దూరస్థుల మైత్రి నిష్ప్రయోజనమగుటి.

ఏటికోళ్ళు—నమస్కారము.

ఏటిదరిమ్రాను—నదీతీరమందలి వృక్షమెప్పటికయినను నీటిదెబ్బచేఁ గూలక మానదనుట.

ఏట్రింత రాయబారము — తీతువుపిట్ట సముద్రునితో రాయబారమంపుటవలె హాస్యాస్పదమగుననుట.

ఏడుకట్ల సవారి—శవవాహనము.

ఏనుఁగుపాడి-సమృద్ధియైన పాలసంపద.

ఏనుఁగుదాహము— ఏనుఁగుకొన్నికడవల నీరు త్రాగునట్లు అత్యాశను కలిగి యుండుటను సూచించును.

ఏ యెండ కా గొడుగు = సందర్భానుసారముగా నాచరించి కాలము గడుపుట.

ఏఱ్ఱు-కోళ్లు ఏకమగు — వర్షప్రవాహము వలన నదులు, కాలువలు కలిసిపోవుట.

ఐనింటివారిబిడ్డ — భాగ్యవంతుల (మంచి కులమునఁ బుట్టిన) బిడ్డ.

ఐ  ఆజ లేదు — ఎంతమాత్రము జాడ తెలియకుండుట.

ఐసరుబొజ్జ — ఇతరులు చేయు స్తుతుల కుబ్బుట.

ఒంటికంటి రామలింగము — ఎదుటివారి కలిమి చూచి యోర్వలేనివాఁడు.

ఒక కుదురై యుండు—భేదభావము లేక కలసియుండు.

ఒక కంట విషము, ఒకకంట నమృతము—ఒకరిపై శత్రుత్వము, మఱియొకరిపై ప్రేమ చూపుట.

ఒక కోటికి వచ్చు — ఒకే యభిప్రాయమునకు వచ్చు.

ఒజ్జలపంగనామము—గురువులకు తప్పులు దిద్దఁజూచుట.

ఒజ్జలపుచ్చకాయ — నేర్చిన విద్య మఱచుట, (గురువుల యండమును గూర్చి ప్రశ్నించినవానికి శిష్యుఁడు పుచ్చకాయ యని నమ్మునట్లు సమాధానమిచ్చెను.) పెద్దల లోపములను గప్పిపుచ్చుట.

ఒజ్జల పుచ్చపాదు — గురువులవద్ద చదివినది మఱచి, వారిపై నెదురుతిరుగుట.

ఒట్టిగొడ్డు తాకట్టు—అసలుసొమ్ముకే కాక మేఁతకూలికిని చెడవలసివచ్చుననుట.

ఒడలు దాచుట — పనిలో బద్ధకించుట.

ఒడిగట్టుట—నిందలను భరింపసిద్ధపడుట.

ఒరగొడ్డెము — హృదయమును బాధించు కుత్సితవాక్యము.

ఓమ్మను — మొదలుపెట్టు, అంకురార్పణ చేయు.

ఓరపారలు దిద్దు — లోపములు సవరించు.

ఓరంతప్రొద్దు — దినమంతయు.

ఓలచెంగనాలు — పరాజయము.

ఓహరి-సాహరి—తండోపతండములు.

ఔఁగాదను—అగునని కాదని తర్కించు.

ఔఁగాములు — అగుటయు, కాకపోవుటయు.

కంకణముగట్టుకొను — ప్రతిజ్ఞపట్టు.

కంచముచెంత పిల్లి—గుప్పెడు మెతుకులు పెట్టకుందురాయని కంచముచెంత పద్దు చేయక వేచియుండు పిల్లిరీతి.

కంచు కాగడాలు — కాంతిమంతములగు దీపములు.

కంచుమించు—అగోచరము.

కంచుపదను—పదనుపెట్టినకంచు మిక్కిలి నిశితమై, కఠోరమయి యుండుననుట.

కంటకమగు—శత్రువువలె బాధించు.

కంటదుమ్ముగొట్టు — చూచుచుండఁగనే మోసముచేయుట.

కంట వత్తిపెట్టుకొను — నిద్రాహారములు మాని శ్రద్ధగాపనిచేయు, రాత్రియంతయు దీపపువత్తి వెలిగించుకొని పనిచేయు.

కంటికిరెప్ప—నలుసుకూడ పడకుండునట్లు రెప్ప కంటిని కాచుచుండు ననుట.

కంటికిభారమగు — అసూయచేఁ గన్నెత్తి చూడఁజాలకపోవుట.

కంటికిమంటికి నేకమగు—కంటినుండి నేల

పటుకు నేకధారగా కన్నీరుకార్చున ట్లేడ్చు.

కంటిలోని (నెరసు) నలుసు— అనుక్షణము బాధించునది.

కండతుండములుగ— ముక్క ముక్కలుగ.

కండలు కోసియిచ్చు— కష్టముల కోర్చి పరోపకారముచేయు.

కండనకాయ— గుండె.

కందాలరాజు— పనిలేకయేవచ్చి కందా కొట్టెడు రాజబంధువు.

కకబిక— గజిబిజి, చెదిరిపోవుట.

కట్టికుడుపు— పాపము విధిగాఅనుభవింపఁ జేయు.

కట్టుతప్పు—నీతినియమముల నుల్లంఘించు.

కడగంటఁజూచుట— దయతోఁ గూడిన చూపు, కటాక్షించు.

కడిమాడనేయు— సంతుష్టికలుగు.

కడిపెడుబిడ్డలు— పలువురు సంతానము, దారిద్ర్యచిహ్నము.

కడుపుకక్కఱితి— దారిద్ర్యముచే (పేరాసచే ధనమునకై) తిండికై కానిపనులు చేయుట.

కడుపుబ్బు— కడుపులోనిముడక వెల్లడియగు ననుట.

కడుపునఁబెట్టుకొను— వధించు.

కడుపులోఁబెట్టుకొను— ఆదరించు.

కడుపుచిచ్చు— ఆఁకలిమంట, సంతతి నాశము.

కడుపుకందవిత్తగు— కందవిత్తు ఎక్కువ పిలకలను బెట్టునట్లు సంతతివృద్ధియగు.

కడుపుచల్లనగు— కడుపునిండ భుజించు, పుట్టినవారు జీవించియుండు.

కడుపు(మాడు)మసియగు— ఆఁకలివేయు, సంతతి నశించు.

కడుపేకైలాసము— ఎన్నిపనుల నైనను విడిచి పొట్టపోషించుకొనుట.

కడుపులోనిచల్ల కదలకుండ — ఎంత మాత్రము శ్రమలేకుండ.

కడుపులోఁజేయిపెట్టి కలచు— కష్టవార్తలచే హృదయమున కలఁతపుట్టించు.

కడుపునిండిన బేరము — అవసరములేని ప్రసంగము నిర్లక్ష్యమును సూచించు ననుట.

కత్తినూరుట— కలహమునకు సిద్ధపడుట.

కత్తిమీఁదిసాము— మిక్కిలి కఠోర నియమములతోఁగూడిన పని, సర్వవిధముల నపాయము కలుగఁజేయుననుట.

కత్తులబోను— కత్తులమర్చఁబడిన బోను, ఎటులిరిగినను ప్రమాదకారణంబనుట.

కథలకామరాజు— కల్పనకథలు పుక్కిట పురాణము చెప్పుటలో నిపుణుఁడు.

కనుపొట్టు—పాఱఁద్రోలు, భంగపరచు, పూర్తిగాఖండించు.

కనుప్రశాము— మోసపుచ్చు, వంచించు, కంటదుమ్ముకొట్టు.

కనుసన్నమెలఁగు— అభిప్రాయమునుబట్టి మసలుకొను.

కనువేదులు— చూచినంతనే వలచి వేదనపడు.

కన్నదేగాతి—చూచినదానినెల్ల తినవలెనని తలంచుట.

కన్నాకు— కట్టలోని మొదటియాకు.

కన్నీళ్ళుతుడుచు— శాంతింపఁజేయు.

కన్నీరు-మున్నీరు— ఎక్కువగా నేడ్చుట.

కన్నుగానకుండుట— పొగరుబోతుతనము కలిగియుండుట, క్రిందుమీదు గానరాకుండుట.

కన్నుగీటుట— కంటితో సంజ్ఞచేయుచు అభీష్టమును తెల్పుట.

కన్నుకుట్టుట— ఎదుటివారి కలిమిని, సౌందర్యమును జూచి యోర్వలేకుండుట.

కన్నులకరవు—కన్నులకుఁ జూచునట్టి యదృష్టము లేకపోవుట.

కన్నుల నిప్పులురాలు—కోపముచే కను లెఱ్ఱబడు.

కన్నులపండువు—ఇంపైన వస్తువులనుగాని, ఇష్టులనుగాని జూచుట.

కన్నుల ప్రాణము నిల్పు—మిగుల నీరసించియుండు.

కన్ను మిన్నెరుంగక—క్రిందుమీదు తెలియక, మంచిచెడ్డలు విచారింపక.

కన్నుమొఱఁగు—చూచుచుండఁగనే మోసపుచ్చు.

కన్నుమూసి గంత— అగపడకుండ కన్నులకు గంతలుకట్టుట.

కన్నులలో నిప్పులు పోసికొను— పరుల యుచ్ఛస్థితి కోర్వలేకపోవు.

కన్నువేయు—కోరు, ప్రేమించు.

కన్నులువాచు—రాక కెదురుచూచు.

కప్పదాట్లువేయుట—అటు నిటు గంతులు వేయుచు పోవుట.

కప్పయెలుఁగుపాము—కప్పకూఁత కూయుచు సమీపించిన కప్పలను మ్రింగెడుపాము.

కప్పలతక్కెడ—తక్కెడలోనున్న కప్పలు ఎగురుచు తక్కెడచిప్పల నట్టిట్టు చేయుననుట.

కమ్మిచ్చునఁదీయుట— బలాత్కారముగ లాంగఁదీయుట.

కయ్యమునకుఁ గాలుద్రవ్వు— కలహమునకుఁ డీకొను.

కయ్యాలక్రచ్చు—కలహశీలుఁడు.

కర్ణుఁడులేని భారతము— ప్రధానుఁడులేని కార్యరంగము.

కలలోనివార్త—అసత్యమనుట.

కలగూరగంప—రకరకముల కూరలతో నింపినగంప.

కలలోనికాన్పు—కల అబద్ధముగాన అందలి కాన్పును నబద్ధమేయనుట.

కసమస—తత్తరపాటు.

కసవుగరచు—గడ్డిగరచు, లోఁబడు.

కసవు-గట్ర—చెత్త-చెదారము.

కసిమసఁగు—చెండాడు-చంపు.

కాటికిఁ గాళ్లుసాచు— బలహీనుఁడై చావ సిద్ధముగానుండు.

కానక కన్నసంతానము— లేకలేక కలిగిన సంతతి.

కానికూడు— నీతిబాహ్యముగ గడించిన సొత్తు.

కాపారపుజీడి—తగులుకున్నచో వదలనిది.

కాయగాచు—బిడ్డపుట్టు.

కాయో-పండో—కార్యము చెడుటయో ఫలించుటయో యను సందేహము.

కారాకూరము—హృదయమును గలచునది.

కారాలు మిరియాలు నూరు—కోపము చేయు, పగసాధించు.

కాలికిబుద్ధిచెప్పుట—భయపడి పరుగెత్తుట.

కాలుద్రవ్వు—జగడమునకు ముందడుగు వేయు.

కాలుగాలినపిల్లి—బాధ సహింపఁజాలక యిటునటు పరుగులెత్తుట.

కాలుముడుచుకొను—మూత్రము విడుచు.

కాలుసాచు—సిద్ధమగు, మొండెత్తువేయు.

కాలుదూయు—యుద్ధమునకు సిద్ధపడు, పాటిపోవు.

కాళ్ళు-కడుపులుపట్టుకొను—బ్రతిమాలుకొను.

కాళ్ళుసారఁజాచు—అసమర్థునివలెఁ గాళ్లు చాచుకొని కూర్చుండు.

కావేరిగుఱ్ఱములు-కాలికొలఁది పరుగెత్తునవనుట.

కాసంత—ఇంచుక, కొలఁది.

కాసు(కప్పర)వీసము—లోలి.

కిక్కురుమనక } నోరుకదపక, సద్దుచేయక.
కిమ్మనక }

కిడంచి మేలెంచు—ముందుగా చెడ్డ తలంచి పిమ్మట మేలు నూహించుట.

కిలెఱుఁగు—మర్మము తెలిసికొను, గుట్టు గ్రహించు.

కుండగోఁకరి—కుండలు తోలుకొను వంటవాఁడు.

కుండేటికొమ్ము—కుందేలుకు కొమ్ములుండవనుట.

కుంభకోణము—డంబముతోఁ గూడిన కుత్సితనటనము.

కుప్పతిప్పలు—మిక్కిలి సమృద్ధి.

కూఁకటిద్రేళ్ళఁ గొల్లగించు—సమూలముగ నాశనముచేయు

కూటుకమూఁక—పిఱికిపందలకు ధైర్యము చెప్పి నిలువఁబెట్టిన సేనావ్యూహము.

కూడి-మాడి—ఏకముగాఁ గూడియుండి.

కూఁతవేటు దూరము—పెద్ద కేకకు అందునంతటి దూరము.

కూరనారలు—శాకపాకములు.

కూసలేఱుగుట—సర్వకంచుకముతో సమానముగుట.

కృతయుగపుమాటలు—పూర్వకాలపు మాటలు.

కొంకు-కొసరు—సంశయము.

కొంగు (పసిఁడి) బంగారము—సులభ సాధ్యమయిన వస్తువు.

కొంగు మాయు—బహిష్టయగు.

కొండపిండిగొట్టు—మిగుల కష్టమయిన కార్యమును సాధించుట.

కొండెకులకొరవి—కొండెములచే విరోధములు పెంచువాఁడు.

కొంపతీయు—మొదటికి మోసము తెచ్చు.

కొట్టి కోలాహలముచేయు—ఎక్కువ గందరగోళము చేయు.

కొట్టినపిండి—స్వవశములో నున్నది.

కొట్టుమిట్టాడు— లోలోన గందరగోళము పడు.

కొనలు సాగు—చిగుర్చు, వృద్ధిపొందు.

కొమ్ములువచ్చు—అధికారగర్వము కలుగు.

కొమ్ములు తిరిగినవారు—అతితేలినవారు.

కొమ్మసుద్దులాడుట— సంకేత వృత్తాంతములు పలుకుట.

కొఱుకరాని కొయ్య—చెప్పినమాట వినని మూర్ఖుఁడు.

కొఱివితోఁ దల గోకికొను— అనర్థములు కోరితెచ్చిపెట్టుకొను.

కోడిగ్రుడ్డుకు తంటసమా?-కోడిగ్రుడ్డుకు తంటసపుప్రయత్న మనవసరమగుటచే నవివేకమును సూచించును.

కోఁడికూసినదాఁక—తెల్లవాఱు వఱకు.

కోఁతలుకోయు—డంబములు పలుకు.

కోఁతిపుండు బ్రహ్మరాక్షసి— కోఁతికి కురుపున్న దానికి స్వజాతి కోఁతులన్నియు కలిసి మంచి హృదయముతోడనే కెలికి పెద్దపుండు చేయు ననుట.

కోరికతీఁగలెత్తు—కోరిక లభివృద్ధినొందుట.

కోఱలు పెఱికినపాము—దంతములు తీసిన పాము పొగరుతగ్గి యణఁగి యుండు ననుట.

గంగాప్రవేశముచేయు— కార్యము ధ్వంసము చేయు.

గంట వాయించు— బాకీలు ఎగవేయు' దేవతార్చనచేయు, మఱచిపోవు.

గంతకుఁ దగినబొంత—తాహతుకు తగిన వస్తువు.

గంపతిరుగుడు— చాల చిక్కులతోఁ గూడినది.

గచ్చు విచ్చు—కలఁతపడు, వికలమగు.

గట్టెక్కు—కృతార్థుఁడగు, కార్యసిద్ధిపొందు.

గడిదేరు—ఆరితేరు, నిపుణుఁడగు.

గడ్డిగఱచు— కడుపు కక్కుఱితికై కాని కూళ్ళు తిను.

గాడిదపిల్ల కోమలము—గాడిద చిన్నతనములో సుకుమారమైన రూపము గలిగి రానురాను వికారరూపమును, కఠోరమైన స్వరమును గలిగియుండుననుట.

గాడిదగడ్డు— శూన్యము, లోకమున గాడిదగుడ్డు అసంభవమనుట.

గాడిదగత్తర— గాడిదలు తన్నుకొనునట్లు గోలచేయుట.

గాదములోని దోసకాయ— దోసకాయ మట్టిలో కాచినపుడు దాని యాకృతి, రుచి మరుగుపడియుండి, యీవలకుఁ గొనివచ్చినపుడు సంతసమును గూర్చును

గాలిగంగలు—పిశాచాకృతిని ధరించు క్షుద్రదేవతా స్త్రీలు.

గాలిపాట— వినికిడివలనఁ గలిగినపాట.

గాలిమాట— సాక్ష్యములేని బూటకపు మాట.

గాసట బీసట— తాఱు మాఱయినది, కలఁత నొందినది.

గిడిగిళ్ళు—నమస్కారములు.

గీఁటువఁబుచ్చు— అనాదరణము చేయు, త్రోసివేయు.

గీరనగింజలు—బాలక్రీడా విశేషములు.

గుంటఁబెట్టి గంటవాయించు-మఱచిపోవు.

గుంటవోనమాలు — నేలపయి అక్షరములు దిద్దించుట, మొదటిమెట్టు అని భావము.

గుంటచిక్కులు — ధన సంపాదనమునకై చేయు కుయుక్తులు.

గుండెగాలము — హృదయమును బాధించుటలో ముల్లువంటిది.

గుండెగూడఁబెట్టు — హృదయమును నిబ్బరము చేసికొను.

గుండె చెరువగు — చిత్తము కలఁతనొందు.

గుండె ఱాయి చేసికొను — హృదయమున ధైర్యము చిక్కఁబట్టు.

గుండెలుతీసిన బంటు — దయాదాక్షిణ్యములు లేనివాఁడు.

గుక్కమిక్కను — ఉక్కిరి బిక్కిరి యగు

గుజగుజరేకులు — ఒకరకపు బాలక్రీడలు.

గుజగుజలుపోవు-రహస్యములు చెప్పుకొను.

గుజ్జెనగూడు — ఆటలలో బాలికలు వండుకొను వంటకములు.

గుటకలు మ్రింగుట — నోరూరుట.

గుట్టు-మట్టు — రహస్యము.

గుడిసెవాటు — విటకత్తె, కులట.

గుడుగుడు — గంజాయి త్రాగుడు.

గుదిగుంపులు చేయు — ఒకదానితో నొకటి సంబంధము కలుగునట్లు చేయు.

గురుఁడేకాదశమందున్నాఁడు — మిక్కిలి యుచ్చదశ యనుట.

గురువునకు పంగనామములు — గురువుల లోపము లెంచి గేలిసేయుట.

గురువుల పుచ్చపాదు — మా ఒజ్జలపుచ్చపాదు.

గుల్ల(చేయు) పఱచు — ఏమియు లేకుండ చేయు.

గుసగుసలు — రహస్యమున పలుకులను కూర్చి చెప్పుకొనుట.

గొంతెమకోర్కెలు-పొందరాని కోరికలు.

గొప్పగోడులు — కొద్ది గొప్పలు.

గోటమీటుట — పనిని సులభముగా సాధించుట.

గోరుచుట్టుపై రోఁకటిపోటు — ఆపదలపయి నాపదలు వచ్చుట.

గోఁచిపాఁతరాయఁడు — గోఁచిమాత్రమే మిగిలినవాఁడు.

గోడపెట్టు-పెట్టుచెట్టు — రెండునష్టములు ఒకరే అనుభవించుట.

గోడచేర్పు — సహాయము.

గోవిందములు కొట్టుట — గోవింద నామ స్మరణము చేయుట.

గోడు గుడుచు — అవస్థ లనుభవించు.

గోరంత — కొసంత.

గోరంతలు కొండంతలుచేయు-కొద్దిదానిని గొప్పగాచేయు.

గౌతముని గోవు — తాకినంతనే పడిచచ్చి బ్రహ్మహత్యాపాపమును దెచ్చిపెట్టినది.

ఘటాఘటీలు — హేమాహేమీలు.

చంకలు కొట్టుకొను — సంతసమున చంకలు వాయించుకొను.

చంకదుడ్డుశరణార్థి — దురుద్దేశ్యముతో

చంకలో దుడ్డు పెట్టుకొని శరణు కోరువాఁడు.

చందమామ గుటుగుట—దూరస్థమైన చందమామను పండను భ్రమచే ఆశించుట.

చంద్రునకు నూలుపోగు — గొప్పవారికి శక్తికొలఁది పారితోషిక మిచ్చుట.

చకారపుగుడులు — చకారమునకు గుడి యిచ్చుట (అనఁగా చీ యని ప్రయోగించుట).

చక్కట్లు దిద్దుట—తగవులు తీర్చుట.

చదువు సంధ్యలు—చదువుట, కాలకృత్యములు.

చదువు లటెక్కినవి — విద్యాభ్యాసము మూలఁబడినది.

చల్లని కడుపు — గర్భశోక మెఱుఁగనిది, కచాకము లేనిది

చాటు-మాటు—రహస్యము, మఱుఁగు.

చాయలా పాయలా-పట్టుదల లేకుండా.

చాలు-మూల— దారి డొంక, వరుస వావి.

చాలుమూల—సంగతి సందర్భము.

చింతాకంత-కొసంత, మిక్కిలి కొంచెము.

చింతాకు ముడుగు తటి — చింతాకులు ముడుచుకొను సూర్యాస్తమయ కాలము.

చిందఱవందఱ — తాఱుమాఱు, చెల్లాచెదర.

చికమకలు పెట్టు—కుయుక్తులచే చిక్కులఁ బెట్టు.

చిగిరింతపదవి—మిక్కిలి త్వరలో పెరిగి నశించెడు చిగిరింతవంటి యైశ్వర్యము.

చిచ్చరపిడుగు—నిప్పురాల్చు పిడుగు.

చిదిమిపెట్టినబంటు—నిగ్గుతేలిన శూరుఁడు.

చిన్నారిపొన్నారి—మనోహరమైన.

చిమ్మచీఁకటి—గాఢాంధకారము.

చిఱ్ఱుబుస్సను—కోపమున గద్దరించు.

చిఱ్ఱుబుఱ్ఱను— చిరాకుపడు.

చిలుకచదువు — నేర్పినంత పలుకేగాని చిలుక యితరమును గ్రహింపఁజాలదనుట.

చిలుకపలుకులు—అర్థజ్ఞానములేని అనుకరణ వచనములు.

చీఁకటితప్పు—జారత్వము.

చీఁకటులు త్రవ్వు—నేరములు వెదకు.

చీకిలి-మాకిలి—చిందరవందర, అల్లిబిల్లి.

చీరచిక్కు—గర్భవతియగు.

చీరికిఁగొనఁడు—లెక్కసేయఁడు.

చుక్కయెదురు, చుక్కవాలు } అనిష్టసూచకమైన శుక్రగ్రహ మెదురగుట.

చుట్టాల సురభి — బంధుగుల పాలిటి కామధేనువు.

చూఁచాయ—జాడ.

చూపుల గుఱ్ఱము—పైకి పుష్టిగా కనఁబడి పనికి నిరుపయోగమైనది.

చెండి చెకపికలాడుట, చెండు చెండాడుట. } ఖండించుట.

చెట్టపట్టు-పెండ్లియాడు, స్నేహముచేయు.

చెట్టాపట్టాలు—చేతులు పెనవైచుకొని స్నేహితులు తిరుగుట.

చెట్లపాలుసేయు — కష్టములపాలుసేయు.

చెట్టు కొక పిట్టయగు—పలు తావులకు చెదరిపోవు.

చెట్లపాలు-గట్లపాలు— అందఱు వేఱు వేఱు తావులకుఁ జేరుట.

చెప్పుక్రింద తేలు—చచ్చివదానివలె వణఁగి యుండు.

చెఱుగుమాయు—రజస్వలయగు.

చెల్లని కాసు—ఎచ్చటను మాఱనిది.

చెల్లాచెదరు—అటునిటు విడిపోవు.

చెవి గఱచుట / చెవికొఱుకుట } రహస్యము చెప్పుట.

చెవిఁబట్టుసంకు— చెవిటివానివద్ద శంఖ మూఁదుట వ్యర్థము అని భావము.

చెవినిల్లుగట్టుకొను—సతతము ఒకేవిషయమునుగూర్చి పట్టుదలఁగా జెప్పు.

చెవిలోసొంటికొమ్ముఁగ్రుచ్చుట—కఠినవాక్యములచే నొప్పించుట.

చెవులపండుగ—ఇష్టమైన ధ్వన్యాగులచే చెవులకింపుగొలుపుట.

చెవులఁబట్టియాడించుట-లోకువచేయుట.

పేతిసంచుభాగవతము—తనపెట్టుబడితో చమురుగున్నగునని గడించుకొని భాగవత మాడుట.

చేతులు పిసికికొనుట-అధికారులు మున్నగువారివద్ద చూపెడు దైన్యచేష్ట.

చేఁదుమ్రింగు—ఇష్టములేనిపని చేయవలసివచ్చు, విషము మ్రింగు.

చేదోడు-వాఁదోడు—పనికి, మాటకు సాయపడు.

చేయిక్రిందగుట—దానము పుచ్చుకొనుట.

చేయి చేసికొను — తనకు సంబంధము లేకున్నను పనిలో పాల్గొనుట.

చేయిమీఁదగుట—దానమిచ్చుట.

జిహ్వాగ్రతుప్పుడుల్లు — నాలుకయందలి యరుచిదోషము పోవు.

టాటాలుగుణించు— నాకేమికొదువయను దిలాసా తెలియఁజేయు పదము.

టాలాటోలీగా—పట్టుదలలేకుండఁగా.

డొక్కలో మెదలుట—పగ తీర్చుకొను వఱకు జ్ఞాపక ముంచుకొనుట.

తంగేటిజున్ను—సులభముగా లభించునది.

తంపటి దోసకాయ— క్రమవిరుద్ధముగా తయారయినది.

తంకట-బరకట- తర్క వితర్కము, చర్చ.

తలకొట్టుట—పరాభవము చేయుట.

తలక్రిందగుట— తాఱుమాఱగుట, వ్యత్యస్తమగుట.

తల దన్నుట—అతిశయించుట.

తలపట్టు—సిగపట్టు, కయ్యము.

తలవూవాడక- శ్రమపడక, పూవునలుగక.

తెలపట్టుట—సమగ్రముగా తెలియుట.

తలమునకలు— తనశక్తిమీఱుట, దుర్భరమగు.

తలలోనాలుక— మిక్కిలి అణఁకువ కలిగి యుండుట.

తాట పక్క వేయుట-చితుక కొట్టుట.

తాతకు దగ్గులు నేర్పుట—తెలిసిన వారికిఁ దెలియఁజేయఁ బ్రయత్నించుట.

తాతాచార్యుల ముద్ర— తిరుగులేని తీర్మానము.

తామరతంపర— తామరల సమూహము వలె మిక్కిలి వృద్ధిగలది.

తాళముపట్టు—పట్టుదలతో కార్యము సాధించు, యాజమాన్యము వహించు.

తాళిగట్టు—మంగళసూత్రము గట్టు.

తిక్కశంకరయ్య—పట్టువీడనివాఁడు.

తిరుక్షౌరము—ఏమియులేకుండఁజేయుట.

తిలోదకములు విడుచు-ఆశలు వదలుకొను.

తిష్టవేయుట—ఎక్కువకాలము మకాము చేయుట.

తీతువుపిట్ట రాయబారము- చూ. ఏట్రింత రాయబారము.

తుని తగవు—ఇరువురకును అనుకూలమగు లాగున చెప్పెడు తీర్పు.

తు-చ-తప్పక— నిరుపయోగములైన తు, చ అను నక్షరములు సైతము విడువక, ఆజ్ఞ నుల్లంఘింపక.

తూర్పారఁబట్టు— ధూళిపోవుటకై గాలి వాలు నధాన్యమునెత్తిఎగుఁబోయుట, వాచాలత్వమున మేరమీఱుట.

తెప్పలు తేలుట—ఆనందము చేఁ దేలియాడుట.

తేనెపూసినకత్తి— పైకి సాధువు వలెఁ గన్పించుచు లోన క్రూరత్వము గలవాఁడు.

తేలుకుట్టినదొంగ— ఎఱిఁగియు నెఱుఁగనట్లుండుట.

తొంటచేయి చూపు— అసమర్థతను వెల్లడించు, ఆశపెట్టి నిరాశచూపుట.

తొమ్మిదవ అష్టము— బూతుల పంచాంగము.

తోఁకముడుచు—పరాభవము నొందు.

తోడునీడ—నీడవలెవెన్నంటియుండుట.

త్రవ్వి తలకెత్తు—నిశ్శేషముగానిచ్చు.

త్రవ్వి తలపోసికొను— పూర్వవిషయములను స్మరించు.

త్రాడుతెగు— కార్యము భగ్నమగు, భర్త చనిపోవు.

త్రాడుబాలు—మొండితనము వహించు.

దంభన్న—చూ. ఎంబెన్న.

దారముకట్టుట— మంగళసూత్రము కట్టుట, పెండ్లాడుట.

దిప్పకాయ—వట్టి మూర్ఖుఁడు, పెంకెవాఁడు.

దిబ్బమెత్తుట—డబ్బిలో నిలువచేయుట.

దీవెనకోల—నమస్కారము.

దుంపతెంపుట— గడ్డపెల్లగించుట, సమూలముగ నాశనముచేయుట.

దుగ్గుపెట్టు— మోసముచేయు, అప్పటికి సర్దిచెప్పు.

దొమ్మరవాని డోలు— సతతము పనిలో నిమగ్నమై యుండునది.

దొరఁకు సన్న్యాసి— మోసగించి దొంగిలించుకొని పోవువాఁడు.

దోమాడకరణము—అధికారులను వదలక విసిగించి పనిచేయించుకొనువాఁడు.

ద్రావిడప్రాణాయామము—తలచుట్టు చేయిచుట్టి ముక్కు పట్టుకొనుట మిక్కిలి ప్రయాస నిచ్చుపని.

ధ్వజమెత్తు— కలహమునకై కత్తిగట్టు.

నంగనాచి—లోకజ్ఞానము కలిగి అమాయికవలె నటించునది.

నక్కనద్రొక్కు—కార్యసిద్ధి సూచకమైన శుభశకునము.

నక్కవినయము—కేవలము మోసము నిమిత్తము చూపెడు కృత్రిమ వినయము.

నక్కళ్ళుపడుట—నోటమాట రాకుండ పోవుట.

నడమంత్రపుసిరి—చిరకాలము లేమి ననుభవించినపిదప మధ్యకాలమున వచ్చిన యైశ్వర్యము.

నడుముకట్టు-సాహసించిముందడుగువేయు

నమ్మించి గొంతుక కోయు—నమ్మించి మోసముచేయు.

నల్లేరుపై బండి—తక్కువ వారిపై అధికారము చలాయించుట సులభము (జిగురుగానుండు నల్లేరుపై బండి త్వరితముగాఁ బోవుననుట).

నాతోడిద లోకము—నేనే గతి యనుకొనుట, తన సుఖదుఃఖములను బట్టి లోకముండునని భావించుట.

నాపసాని—నాగవల్లితంతు నడపు పెద్ద ముత్తయిదువ.

నాలుక మిగులుట—దూషణ వాక్యములు పలుకుట.

నాలుగాకులు ఎక్కువచదువుట-ఎక్కువ జిత్తులు తెలిసియుండుట.

నాలుకపై నువ్వుగింజ నానదు-రహస్యము వెంటనే (నూవుగింజ నానునంత కాలములో) బయలగు ననుట.

నిండుకుండ తొణఁకదనుట— అణఁకువ సూచితము.

నిమ్మకాయవాటము—చేతిలో సులభముగా నిమిడుననుట.

నియోగిముష్టి—చేయునది నీచపుపనియయినను బెట్టు, అహంభావము తగ్గదనుట.

నిలువుజీతము—నిలుచుండి సేవచేయుట.

నివురుగప్పిన నిప్పు—పయికి అనామకుఁడుగాఁ దోచెడు తేజశ్శాలి.

నిర్భాగ్య దామోదరుఁడు—పట్టి దౌర్భాగ్యుఁడు.

నీటఁ గలియు—కార్యము చెడిపోవు.

నీటవ్రాసినవ్రాలు—తక్షణమే చెడిపోవుననుట.

నీలాపనిందలు — అక్రమముగా పడు నేరారోపణము.

నీళ్ళు నములుట—సంశయముగాఁజెప్పుట, మందకొడితనము.

నెమరునకుతెచ్చుకొను—జ్ఞాపకము చేసుకొను.

నేతిబీరకాయ — పైకి మృదువుగను, సారవంతముగను కనఁబడుచున్నను లోన విశేషము లేనిది.

నీళ్లువిడుచు = ఆశవదలుకొను, పితరులకు తర్పణము లిచ్చు.

నేత్రపర్వము—కన్నులపండువు.

నేలకు గోలకు తెచ్చుట—మిక్కిలి కష్టము కలుగఁజేయుట.

నేలయీనినట్లు—జనములో నిండియుండునట్లు.

నేలవిడిచిసాము—ఆధారములేకయే పని చేయుట.

నోట గుమ్మఁగొట్టు—జీవనోపాధిని పోఁగొట్టు, చంపు.

పంగనామములు పెట్టు - పెద్దలకు తప్పులు దిద్దు.

పంగిడియెత్తు — గజాదులను పట్టుటకై త్రవ్వెడు గోయివంటి పన్నాగము.

పంచబంగాళము — మటుమాయమగు, ఛిన్నాభిన్నమగు.

పండువంటి కాపురము — సమస్తైశ్వర్యములతో గూడియున్న కాపురము.

పండ్లుకొఱుకుట—మిక్కిలి కోపపడుట.

పక్కలో బల్లెము — శత్రువువంటివాఁడు.

పచ్చకప్పురమగుట } అపరూపమగుట.
పచ్చపూసగుట } లభింపకపోవుట.

పటాపంచ—మాయము, అగపడకుండుట.

పట్టపగ్గములులేవు—బంధించుటకు త్రాళ్లు లేవు. (లోఁబడదని భావము.)

పట్టిపల్లారుట—మాట నిలుపుకొనుటకై ప్రయత్నించుట, నాశనముచేయుట.

పట్టినదెల్ల బంగారము—ప్రతిపనియు సఫలమై లాభించుట.

పట్టుగొమ్మ—పట్టుకొనుటకు ఆధారమైన కొమ్మ, ఆశ్రయము.

పడిగాపులుండుట—నిరీక్షించుట.

పడుగు-పేక — వస్త్రములోని నిడుపు అడ్డము వలె క్రిక్కిరిసి యుండుట.

పప్పులో కాలువేయు—తెలివి తక్కువ పని చేసి ప్రమాదమునకు గురియగు, జారిపోవు.

పలుకు బంగారము — బంగారమువలె అమూల్యమగు పలుకు.

పసుపుకొమ్మైన నొసగఁడు—మహాలోభి.

పాతాళప్రశ్న-అంతుతేలని చిక్కుప్రశ్న.

పానకములో పుడక— సత్కార్యములలో గలుగు విఘ్నములు.

పాలఁబడిన బల్లి— బయటఁ బడుటకు అటునిటు కొట్టుకొనుచుండు ననుట.

పాలవంటికులము—నిర్మలము, పవిత్రమగు కులము.

పింజ పింజ గఱచుట—(బాణ పాతము వ) ఒకదాని వెనుక నొకటి పోవుట.

పిచ్చుకపై బ్రహ్మాస్త్రము — కొద్దివాని మీద పెద్దప్రయత్నము చేయుట.

పిట్టతలలుపడు—నీరసముచే శుష్కించి సన్నగిలు.

పిట్టపిడుగుగా—అనివార్యముగా, తప్పని సరిగా.

పిడుగుమొత్తినతాయి—అడిగినను సమాధానము చెప్పని మూర్ఖుఁడు, పిడుగుచే అణఁచబడిన తాయి.

పిలువని పేరంటము— తనకుఁ దానే వచ్చినది, సంబంధములేనిదానిలో కలుగఁజేసికొనుట.

పిల్లిశీలము—కృత్రిమవినయము, కృతఘ్నతా స్వభావము.

పీకులాటపంచాంగము — చిక్కులచే సాధింపరాని వ్యాపారము.

పీఁచమడచు—మదము అణఁగఁగొట్టు.

పుంఖానుపుంఖము—ఒకదాని వెంబడి నొకటి పరంపరగా.

పుక్కిటి పురాణము— పుక్కిలినుండి వచ్చు వ్యర్థపు పలుకులు, సారహీన మగు లోకాభిరామాయణము.

పుట్టనిబిడ్డకు పేరు పెట్టుట— రాఁబోవు పనులకై ఆత్రపడుట.

పుట్టిమున్గుట—నష్టమగుట, ప్రాణాపాయము కల్గుట.

పుణికి పుచ్చుకొనుట— ఒకరి గుణములను పోలినగుణములను కల్గియుండుట, సమగ్రముగ ఉన్నదాని నున్నట్లు గ్రహించుట.

పుల్లవిరుచుట— భయమునుగాని, దృష్టిదోషమునుగాని పోగొట్టుటకై పుల్ల విఱచి పారవేయుట, ఆక్షేపణ చేయుట.

పుల్లవిరుపుమాటలు- సూటిపోటిమాటలు, మాటకును మఱియొక మాటకును సంబంధము లేకుండుట, కుపితస్వభావముతో ప్రతిదానికిని వ్యతిరేకముగా మాటలాడుట.

పులినాకినవాఁడు—చావుతప్పి బయట పడినవాఁడు.

పులినోటికండ—నశించుటకు సిద్ధముగా నున్నది.

పులిమీఁదపుట్ర—కష్టములపై కష్టములు వచ్చుట.

పులిమీసల నుయ్యాలలూగు— మిక్కిలి సాహసకార్యములకుఁ గడంగు.

పులుఁగడిగిన ముత్యము— మాలిన్యము, వాసనలేకుండ కడుగఁబడినముత్యము.

పూఁచినతంగేడు –సిరిసంపదలతోఁ గూడిన సంసారము.

పూజ్యము-శూన్యము—ఏమియు లేదనుట.

పూరిగఱచు—శత్రువులు యుద్ధరంగమున ఓడితిమనిసూచించుటకై గడ్డిగఱచు.

పూసగ్రుచ్చినట్లు—తు. చ. తప్పకుండునట్లు.

పూసలలో దారము—అభేద్యముగా, అనుకూలముగా.

పెండ్లినడక—ఠీవి, నెమ్మదిగానడచుట.

పెట్టనికోట—ఒకరు ఏర్పాటుచేయకయే ప్రకృతిసిద్ధమైనది.

పెట్టిపుట్టు—పూర్వజన్మమున దానముచేసికొని భాగ్యవంతుఁడుగాఁబుట్టు.

పెడచెవులఁబెట్టు— సరిగా వినుపించుకొనకయుండు.

పెదవులదడపు—లోలోన విచారించు, సగము దప్పికతీర్చుకొను.

పెద్దనిద్దుర—మరణము.

పెద్దలచాటుది—అస్వతంత్రురాలు.

పెన్నిధిగన్న పేద— కొద్దివాఁడు గొప్ప ఫలితమును బొందునపుడు అనుభవించెడి యానందము.

పేనుగుఱ్ఱెక్కినపాటు— స్వల్పకాలములో సులభముగా.

పైలాపచ్చీసు— పడుచుఁదనపుచేష్ట, పందెపుపావు మొదటిగెలుపు.

పొగమాయుట—వన్నె, కీర్తి తగ్గుట, చెడిపోవుట.

పోచికోలుతిండి—ఏమియు పనిచేయక తిరుగుట.

పొడవడఁగు—మదముతగ్గు, చచ్చు.

పోయినపోక— పోయినతరువాత తిరిగి రాలేదనుట.

ప్రాఁతకాఁపు — మొదటి నుండియు నున్నవాఁడు.

ప్రాఁతపంచాంగము—పురాతనపు వ్యవహారము.

ప్రాణగొడ్డము—ప్రాణాపాయకరము.

బంగారుకాళ్ళయ్య— మంగళప్రదమైన పాదన్యాసము కలవాఁడు.

బంగారుబొమ్మ—అందకత్తెయనుట.

బుట్టలోఁబెట్టు—వలలో వైచుకొను, మోసముచేయు.

బులియుచుండుట—స్తుతులకు ఉబ్బుచుండుట.

బూడిదబుస్సన్న— బూడిదలోఁ బొర్లాడు చుండెడి బిడ్డ.

బెండుపఱచు—గుల్లచేయు, చులకనచూపు.

బొగ్గుగఱచుట—నీచదశకువచ్చుట.

బొట్టుగట్టు—పెండ్లియాడు, మాంగల్యము గట్టు.

బొమ్మలుపెట్టుట— పెద్దలనువెక్కిరించు.

బ్రహ్మకాయ—వటవటవదరెడు వాచాటుఁడు, మిక్కిలి పూర్వుఁడు.

మంకుపట్టు—మొండిపట్టు.

మక్కికిమక్కి— ఉన్నదియున్నట్లు, జరిగినది జరిగినట్లు.

మడిగట్టుకొను-న్యాయమార్గమున నడచుకొను.

మనసు విరుగుట— ఇష్టము తగ్గిపోవుట, స్నేహము చెడిపోవుట.

మన్నుమిన్నులు—క్రిందు మీఁదులు.

మాకు-మట్రి—చెట్టు చేమ మొ॥

మాట పట్టింపు— వివాదము.

మాదిగ మంచము—రకరకముల త్రాళ్ళతో నల్లంబడి వెల్లకిల వైవంబడి తలదిక్కు తెలియక యుండును.

మారామున్లు—గుంటచిక్కులు.

మింటఁబెట్టిన దీపము— మిక్కిలి ప్రసిద్ధమైనది, ప్రకాశించునది, త్వరలో నాఱిపోవుననుట.

మిట్టపెత్తనము— గట్టుపైఁ గూర్చుండి చేయు పెత్తనము.

మిట్టిమీఁదపడు—పైకెగిరి చేఁపవలెపడు.

మిడతంభొట్ల శకునము— అనుకొనకయే అదృష్టవశమున పని నెరవేరుట.

మిన్నుదన్ను—వృద్ధియగు, ఎత్తగు.

మీఁదుకట్టు— దేవతాదులనిమిత్తము కొంత విత్తము ముడుపుగా నుంచుట.

మీసాలపైఁదేనియలు— స్వల్పకాలములో నశించెడి కొద్దిసుఖము.

మీసాలబువ్వ-వట్టి డంబాచారము (లోన శూన్యముపైఁడంబమునుసూచించును.)

ముంగొంగుపసిఁడి—కొంగునఁ గట్టుకొన్న బంగారమువలె సులభముగా కోర్కెలను దీర్చునది.

ముంజిగట్టు—ఉపనయనముచేయు.

ముందడుగువేయు-సిద్ధపడు,సాహసించు.

ముక్కాకలదేరు-తాపత్రయముజయించు.

ముక్కుపట్టనిముత్యము—చిన్నతనముచే నవనవలాడుచుండునది.

ముక్కు కోఁతలు—చిక్కులు పెట్టుట.

ముక్కుపచ్చలారక — చిన్నవయస్సు దాఁటక.

ముక్కుమొగము చూడక — మొగమాటము లేక.

ముక్కు విఱుచుట ఆక్షేపించుట, ఇష్టపడక పోవుట.

ముల్లుమూపుట—పక్షపాతము చూపించుట, మొగ్గు.

ముళ్ళమాట — కలహము కలిగించు మాటలు.

మూట-ముల్లె—డబ్బు-దస్కము.

మూఁడుకాళ్ళ ముసలి— దండము సహాయమున నడచు ముసలి.

మూడుపూవులు, ఆరుకాయలు—మిక్కిలి ఉన్నతస్థితిని దెలుపుట.

మూఁడు ముళ్లుపడు — వివాహమగు.

మెచ్చి మేఁకతోలుకప్పు — మెచ్చుకొన్నను అల్పసత్కారము చేయు.

మేఁకపోతు గాంభీర్యము — లోన పిరికితనమును, పైకి గాంభీర్యమును చూపుట.

మేఁకవన్నెపులి— బయటికి సాధువుగాఁ గనిపించుచు, లోన క్రౌర్యము చూపుట.

మేడికాయ బోనము—చూపుల కింపుగా నున్నను, సంతృప్తికరముకాని భోజనము.

మేలుబంతి — చూచివ్రాఁత కొఱకైన ఒరవడి పంక్తి.

మొసలికన్నీరు— కృత్రిమ విచారము.

యాదవకులమునకు ముసలము— యాదవవంశనాశనమునకు ముని శాపముచే దెచ్చిపెట్టుకొన్న రోఁకలి.

రెంటికిం జెడిన రేవఁడు— చాఁకలి వాఁడు గాలివీచుటచే గట్టుపైనున్న గుడ్డల కొఱకును, బండదరినున్న గుడ్డల కొఱకును ఇటునటు పరుగెత్తి, తుదకు రెంటికిని జెడిన విధము.

రెండు నాలుకలు—ఆడినమాట తప్పుట, రెండు విధములుగా మాటాడుట.

రోళ్ళ రోఁకళ్ళఁబాడు— లోకమంతయు గగ్గోలుగాఁ జెప్పుకొను.

రేకు మడచుట—కొట్టుట, అణచుట.

లక్ష్మీదేవి పఱక—సిరి సంపదలు.

లొట్టాభట్టీయము—అతిశయపు మాటలు, అసంబద్ధ ప్రలాపములు.

లింగు లిటుకులు—తెలివితేటలు.

లులామాలము—మోసము.

వంటయింటికుందేలు- స్వాధీనములోనున్న వస్తువు.

వట్టిగొడ్డు తాళ్ళట్టు— వట్టి చాఁరియు, తిండి దండుగయు, ద్రవ్య నష్టమును గలుగు ననుట.

వర్షాకాలపు చదువు—వానవలన ఎక్కువ సెలవుదినములు వచ్చుటచే సాగని చదువు.

వాడి వడఁబోయుట— విమర్శించి నిగ్గు తేల్చుట.

వాడివత్తలగుట—మిగులఁ గృశించుట.

విటతాటము-తలక్రిందుగా, తారుమారు.

వెనుకవేసికొను-కూడఁబెట్టుకొను, ఒకనిని సమర్థించు.

వెన్నుచూపుట—పాఱిపోవుట.

వెన్నుదన్నుట— తఱుముకొని వచ్చుట, అనుసరించుట.

వ్రేళ్ళుపారు-నాటుకొను,స్థిరపడియుండు.

శరకోపము పెట్టు—మోసము చేయుట, టోపి వేయుట.

శనివారపు జడి— శనివారము ప్రారంభించిన వర్షము, తిరిగి శనివారము వచ్చువఱకు విడువదనుట.

సగ మెరుక—శత్రుత్వము, వ్యతిరేకము.

సగ్గిసమగ్గిసలు—లోలోనఁగలుగు ఉద్రేకములు.

సింగినాదము—సన్న్యాసుల చేతియందలి (దుప్పికొమ్ముతోఁ జేసిన) వాద్యవిశేషము.

సిగపట్ల గోత్రము— ఒకరిజుట్టు ఒకరు పట్టుకొని పోట్లాడుట.

సిగపూవాడకుండుట—చెక్కుచెదర కుండుట.

సిరిరా మోకాలొడ్డు— ఐశ్వర్యమును కాలఁ దన్నుకొను.

సున్నసున్నం గలిపె—సర్వము నశించె ననుట.

సైంధవలడ్డు — పానకములో పుడక వంటిది.

సొరకాయకోఁతలు—క్రియా శూన్యములైన డాంబికవచనములు.

హెచ్చుకుందాడు—ఎక్కువ తక్కువ మాటలు పలుకు.

హేమాహేమీలు— అధిపులు, మొనగాండ్రు.

# సంస్కృత జాతీయములు

అంకురార్పణము— నవధాన్యాంకురములను అర్పించుట, ప్రారంభము.

అకాలవర్షము— వర్షాకాలమునందుఁగాక యితరసమయములందు కురియువర్షము, నష్టకారి యనుట.

అగస్త్యభ్రాత— పేరు ప్రఖ్యాతులు లేనివాఁడగుటచే సోదరునిబట్టి వ్యవహరింపఁబడువాఁడు.

అగ్రతాంబూలము— మొదటి స్థానము, సభలలో గౌరవింపఁబడి ముందు తాంబూలము గ్రహించుట.

అజగరోపవాసము— కొండచిలువ ఉపవాసము చేయునదివలె నోకేచోటున నుండి సమీపించిన జంతుజాలమును అకస్మాత్తుగాఁ గబళించుననుట, పరులను వంచించుటకై చేయు కృత్రిమ నటనము.

అజాగళస్తనము— మేక మెడచన్నువలె నిష్ప్రయోజన మనుట.

అద్వైతము— తాఁజెలిసికొన్న ధర్మశాస్త్ర విషయముతప్ప రెండవది మంచిది కాదను నమ్మకము, చాదస్తము.

అనాఘ్రాతపుష్పము — వాసన చూడని పూవు, పూర్వమెవ్వరిచేతననుభవింపఁబడనిది.

అనామతరువు—పేరులేని చెట్టు (అనామకుఁడు).

అభ్రపుష్పము-ఆకాశమునందలి పుష్పము (అసంభవమనుట).

అరణ్యరోదనము— అడవిలోని యేడ్పు (వినువారుండరనుట).

అరణ్యామలకము— అడవియుసిరికయును, సముద్రపుటుప్పునకునుగల సంబంధము.

అర్క_వివాహము—జిల్లేడుచెట్టును కన్యకగా గ్రహించి పెండ్లియాడుట, తివివాహమునకుఁ బూర్వము చేయఁదగినది. అనగా నామె నాల్గవ భార్యయగుననుట.

అర్క_వ్రతము — సూర్యుఁడు మెల్లమెల్లగా నావిరి రూపమున జలమును గ్రహించుట.

అలంకరణ విద్యార్థి—యోగ్యమైన దుస్తులను మాత్రము ధరించుచు తోడి విద్యార్థులతో చదువున వెనుకఁబడెడువాఁడు

అవటకచ్ఛపము-బావియలోని తాఁబేలు (లోకానుభవము శూన్యమనుట).

అశ్వతరీగర్భము—గాడిదవలన నాఁడు గుఱ్ఱమునకుఁ గలుగు సంతతి తల్లిచావునకుఁ గారణమగుననుట.

అశ్వమహిషక— గుఱ్ఱమునకును, దున్నకును గల స్వాభావికవైరము.

అస్ఖలితబ్రహ్మచారి— వేదాధ్యయనపరుఁడయి నీతి నియమములతోఁ గూడి, స్త్రీ విషయమై తొట్రుపడని హృదయము గల బ్రహ్మచారి.

అశ్వశృగాలిక— గుఱ్ఱమునకును నక్కకునుగల స్వాభావికవైరము.

...రావ్రతము—కత్తివాయిపై పండుకొనుటవలె మిగుల కఠినమైనవ్రతము, భార్యాభర్తలు ఒకే శయ్యపైఁ బరుండియు గలియకుండుట, శయన మధ్యమున పదునుకత్తినుంచి దంపతులు బ్రహ్మచర్యము నడపుట.

అహినకులిక— సర్పమునకును, ముంగిసకును గల సహజవైరము.

అహిమన్యువు— త్రాచు పాము పగ, త్రాచు పగపట్టినవారిని జంపుటయో తాను జచ్చుటయో జరుగును.

ఆకాశచిత్రము—ఆకసమున గీసినబొమ్మ. (అసంభవమనుట.)

ఆకాశపంచాంగము — పుక్కిటి పురాణము, సారములేని లోకాభిరామాయణము.

ఆబాలగోపాలము— (బాలుఁడు మొ॥ వృద్ధుని వఱకు) గొల్లవానివఱకుఁ గల జను లందఱు.

ఆరంభశూరత్వము— ఆరంభమున నున్న ఆడంబరము క్రమక్రమముగాక్షీణించు ననుట.

ఇంద్రభోగము— గొప్ప వైభవములోఁ గూడిన సుఖానుభవము.

ఉచ్చనీచము—మంచిచెడ్డలు.

ఉత్తరకుమార ప్రజ్ఞలు— డాంబికవచనములు.

ఉత్పన్నమందముద్ధులు— కట్టులేక నీటిబుడగలవలెఁ బుట్టుచు నశియించుచుండెడు బుద్ధులు.

ఉద్యోగరాఘవుఁడు— సత్కార్యమునకు రాక్షసవధోద్యోగమున నిమగ్నుఁడగు రాఘవునకు జంతుజాలము సైతము సాయపడుట సూచితము.

కంచి గరుడసేవ— కంచిలో నిక్కిలి పెద్దదైన గరుడాళ్వారు సేవ. (సులభముగా తెమల దనుట.)

కంఠగత ప్రాణము—చావసిద్ధమగుట.

కంబళపురీషము—కంబళిలో నంటుకొన్న మలము. (సులభముగా వదల దనుట.)

కంబళ భోజనము— కంబళిలో తినుచు వెండ్రుక లేఱుకొన్నట్లు.

కచాకచి— ఒండొరులు జుట్టుపట్టుకొని పెనగులాడుచు చేయు యుద్ధము.

కరతలామలకము— అఱచేతిలోని యుసిరిక. (సులభగ్రాహ్య మనుట )

కరబదరము— అఱచేతి యందలి రేగుపండు.

కర్ణరసాయనము—చెవులకు ఇంపైనది.

కర్ణాకర్ణిక—ఒక చెవినుండి మఱియొక చెవికి వార్తలు వినఁబడుచు వెల్లడియగుట.

కర్కటిగర్భము— ఎండ్రకాయ గర్భము. (మాతృ నాశనకారి.)

కాకతాళీయము— కాకి వ్రాలుట, తాటిపండు పడుట — ఒకేకాలమున జరుగుటవంటిది. (హఠాత్తుగా సంభవించువానిని సూచించును.)

కాకదంత పరీక్ష—అసలే దంతములులేని కాకికి దంతములు ఎన్ని? ఎట్లుండును? అని పరీక్షచేయుట.

కాలనేమిజపము— ఒకరిని మోసగించుటకు చేయు కృత్రిమనటనము, రామకార్యార్థియైపోవు ఆంజనేయుని

కాలనేమి మునిరూపమున మోసగించెను.

కీర్తిపటములు—పేరుప్రఖ్యాతులు వెల్లడించు శిలాశాసనాదికము.

కుంభకర్ణనిద్ర—భేరీమృదంగాది వాద్యములచేఁగాని, ఏనుగుల త్రొక్కుడిచేగాని మెలకువరాని కుంభకర్ణుని దీర్ఘనిద్ర.

కుంభకోణము—మోసముతోఁ గూడిన కృత్రిమ నటనము.

కుంభద్రోణము—వర్షము కడవలతోఁ గుమ్మరించుట.

కూపమండూకము—కప్ప నూతిలో తిరుగుచు లోకమంతయు నంతేయనుకొను లోకజ్ఞానశూన్యత సూచితము.

కృత్యాద్యవస్థ—కావ్యప్రారంభమున కవిపడుకష్టము. (అధికశ్రమ సూచితము.)

కేశాకేశి— ఒండొరులు జుట్టుపట్టుకొని పెనగులాడుచుఁ గలహించుట.

గగనకుసుమము—చూ. ఆకాశపుష్పము

గజస్నానము—ఏనుఁగు స్నానముచేసియు తిరిగి చెత్తచెదారము తనపై చల్లుకొనును. (శూన్యఫలితము సూచితము.)

గతజలసేతుబంధనము— పోయిన నీటికై గట్టువేయుట.

గణపతిపూజ—కార్యప్రారంభము. అంకురార్పణము.

గోముఖవ్యాఘ్రము— గోవు ముఖముగల పెదపులి. (పైకి సాధురూపముదాల్చిన క్రూరుఁడు.)

ఘంటాపథము —మిక్కిలి వెడల్పయిన రాజమార్గము.

ఘుణాక్షరము—పురుగు దొలిచినప్పుడేర్పడిన యక్షరము.

ఘోటకబ్రహ్మచర్యము—గుఱ్ఱము బ్రహ్మచర్య నియమమునకు కట్టుపడదనుట.

తీర్థస్వార్థములు-తనపనియు, తీర్థయాత్రాఫలితమును కలిసివచ్చెననుట.

దత్తపుత్రశోకము — తెచ్చి పెట్టుకొన్న బాధ.

నాగవల్లినిష్ఠురము—అంత్యనిష్ఠురము.

నిరక్షరకుక్షి —పొట్టచించినను అక్షరము లేనివాఁడు (చదువురానివాఁడు)

నిర్ధూమధామము—పొగరాజని యిల్లు. (పొగపడిన కొంపయని భావము)

పయోముఖ విషకుంభము—పైన పాలును, లోనవిషమును గల కడవ

పాతాళప్రశ్న—అంతుతెలియని చిక్కు ప్రశ్న.

పింగళాజపము —పింగళ యను విటురాలు ద్వారమువద్ద విటులకై వేచియుండిన రీతి.

పిష్టపేషణము—పిసికినపిండి పిసుకుట.

బకధ్యానము—కొంగజపము, పరులను మోసగించుటకై చేయు కృత్రిమ నటనము.

బకజపము—చూ. పై.

బుధప్రకాశోదయము—బుధగ్రహమునకు ప్రకాశము గలుగుట. (జగత్తు సంక్షోభముచెంది ప్రకాశరహితమగును.)

బ్రహ్మరథము— బ్రాహ్మణులు సిద్ధి బొందిన సన్న్యాసులను మోసికొని పోవు శవవాహనము.

భగీరథప్రయత్నము—తన పితరుల యస్థులపై స్వర్గంగను ప్రవహింపఁజేయుటకు భగీరథుఁడు కావించినగొప్పయత్నము. (అమోఘమైన కార్యదీక్ష)

మండూకప్లుతి— కప్పగంతులు.

మర్కటముష్టి— కోఁతిపిడికిలి, పట్టువీడకుఁడుటను తెలియఁజేయును.

మారణయంత్రము—చంపఁ నట్టి లేక తాపము కలిగించు అభిచారికమంత్రము.

మీనమేషములు—మంచిచెడ్డలు.

యథాయథలు—చెల్లాచెదరు, చిందఱవందఱ.

రంగరంగవైభవములు—శ్రీ రంగమున రంగనాయకుని మహోత్సవములు.

రామబాణము—తిరుగు (ఎదురు) లేనిది.

రామరాజ్యము—శత్రువులులేక సుఖప్రదమైనది.

లోకాభిరామాయణము— లోకమందలి విశేషములు.

విశ్వామిత్రసృష్టి—బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిగాఁజేసిన విశ్వామిత్రుని సృష్టి.

శవజాగరము—శవమువద్ద జాగరము వ్యర్థము, మిక్కిలి కష్టము నగుననుట.

శషభిషలు—అభిప్రాయభేదములు.

సముద్రమథనము—శ్రమసాధ్యకార్యము.

సప్తమీవిభక్తి—అందున్, ఇందున్, న అను ప్రత్యయములు సప్తమిచే నందును యిందును లేక చెడెననుట

సర్వమంగళము—శుద్ధశూన్యమనుట.

సుగ్రీవాజ్ఞ—భయంకరమై మీరరానిఆజ్ఞ.

సూచీముఖభేద్యము—సూదితో భేదింపఁదగినది.

హస్తిమశకాంతరము—ఏనుఁగునకును, దోమకును గల తేడా, రూపగౌరవాదులందలి హెచ్చుతగ్గులు.

హృదయశల్యము—హృదయవిదారకము, బాధాజనకము నగు వార్త.

# జంటపదములు

అంకిలి—విఘ్నము, తాలుమూలము, కలఁత.

అంగిలి—అంతర్గళము.

అగమము—కొండ, వృక్షము.

ఆగమము—శాస్త్రము, అధికముగా వచ్చెడు వర్ణము, రాక.

అఁట—ఆశ్చర్యార్థకము.

అట—అక్కడ.

అడుపు—దెబ్బ, తాడనము.

అడువు—అడుగు, 12 అంగుళములు.

అనలుఁడు—అగ్నిదేవుఁడు.

అనిలుఁడు—వాయుదేవుఁడు.

అనుభవము—కుడుపు, అనుభవించుట.

అనుభావము—తేజస్సు, అధికారము.

అపరోధము—నిషేధము.

అవరోధము—అంతఃపురము, అడ్డగింత.

అబ్జము—పద్మము, ఉప్పు, శంఖము.

అబ్దము—సంవత్సరము, మేఘము.

అబ్రము—అపరూపము, ఆశ్చర్యము.

అభ్రము—ఆకాశము, బంగారు, మేఘము.

అభినందనము—సంతోషించుట.

అభివందనము—నమస్కారము.

అభ్రకము—గనులలోఁబుట్టు తెల్లరేకు.

అభ్రిగము—పక్షి.

అభ్రేషణము—కోరుట.

అభ్రేషము—న్యాయము, పాడి.

అర—సగము.

అఱ—గది, కొఱత.

అరక—బరువుపరుపఁబడిన ఎద్దుబండి.

అఱక—మూఁపు.

అరవర—ఎండినది.

అఱగఱ—శకలము.

అరి—కప్పము.

అఱి—జీర్ణించి.

అరుగు—పోవు.

అఱుగు—జీర్ణించు.

అర్శము—మూలరోగము.

అర్సము—సంతోషము.

అర్హణము—పూజ, గౌరవించుట.

అర్హము—తగినది, అనురూపము.

అలము—తేలుకొండి, శీఘ్రము, ఆక్రమణము, కౌగిలించుట, తృణము.

అలము—యుద్ధము.

అలుగు—ములికి, ఖడ్గము, రంధ్రము.

అలుఁగు—ద్రోహముచేయు, కోపించు.

అవమానము—పరాభవము.

అనుమానము—ఊహ.

అశన—తినుటకైనయిచ్ఛ, ఆఁకలి.

అశని—పిడుగు, మెరుపు, వజ్రాయుధము.

అళి—తుమ్మెద, మద్యము, తేలు.

ఆళి—పంక్తి, తేలు, చెలికత్తె.

అఁకరము—అగ్రహము.

ఆకరము—ఆధారము, సమూహము, గని.

ఆటంకము—అడ్డంకి.

ఆతంకము—రోగము, భయము.

ఆఁడి— స్త్రీప్రత్యయము, వగలాఁడి.
ఆడి—ఆఁడుధాతువుయొక్క క్త్వార్థకము.
ఆఁడు—పురుషవాచక ప్రత్యయము.
ఆడు—ఒక ధాతువు.
ఆయసము—ఇనుపది.
ఆయాసము—శ్రమము, ఉత్సాహము.
ఆయితము—సిద్ధము.
ఆయిదము—ఆయుధము.
ఆరు—రోమావళి, కలుగు, నిండు.
ఆఱు—ఒకానొక సంఖ్య, నశించు, తేమ తీఱు, శాంతించు.
ఆరుచు—అడించు.
ఆఱుచు—నశింపఁజేయు.
ఆలంబము—ఆధారము, ఊఁత.
ఆలంభము—చంపుట.
ఆలి—హీనము.
ఆళి—పంక్తి, చెలికత్తె, తేలు.
ఆలోకనము—చూపు, కాంతి.
ఆలోడనము—కలఁత, పూర్ణవిమర్శనము.
ఆవలి—ఉపద్రవము,పంక్తి,సమూహము.
ఆవళి—అధికము, ఉపద్రవము.
ఆహుతి—అగ్నియందు వ్రేల్చుట.
ఆహూతి—పిలుచుట.
ఇద్ధము—పరిశుద్ధము, ప్రకాశము.
ఇధ్మము—సమిధ (కట్టెపుల్ల).
ఇరుస—రెండుకుంచములు.
ఇరుసు—బండికన్ను.
ఇల—భూమి, ఆవు, బుధునిభార్య.
ఇలి—మెతుకు, అన్నము.
ఈఁక—పక్షియీఁక.
ఈక—ఇచ్చుధాతువ్యతిరేక క్త్వార్థకము.
ఈఁగు—చొచ్చు.
ఈగు—ఇగ్గు (వెనుకకొఱుగు).
ఈఁడు—ఒక ప్రత్యయము.
ఈడు—ప్రాయము, పోలిక.
ఈరము—పొదరిల్లు.
ఈఱము—దట్టము.
ఉత్తానము—లోఁతులేనిది.
ఉత్థానము—సంతోషము, లేచుట, ప్రయత్నము, సైన్యము.
ఉద్దానము—కట్టు, నిబంధనము.
ఉద్ధానము—ప్రొయ్యి.
ఉన్మాదము—చిత్తవిభ్రమము.
ఉన్మాథము—బోను, చంపుట, తిమ్మిరి.
ఉపదానము—కానుక.
ఉపధానము—తలగడ, విషము, స్నేహము.
ఉపాదానము—భిక్షము, ముఖ్యకారణము.
ఉపాధానము—కప్పుట, ఉంచుట.
ఉరియు—చలించు.
ఉఱియు—ఇల్లుకుఱియు.
ఉసుర్ధు—ఉస్సురనుట (ఉసూరు).
ఉసురు—ప్రాణము, ఆయుస్సు.
ఊఁక—ఊఁగులాట.
ఊక—ఉబుక.
ఊఁచు—ఊఁగఁజేయు.
ఊచు—జబ్బుచేత తలవెంట్రుకలురాలు.
ఊఁటు—నొవ్వవాటు.
ఊటు—వానచినుకులచేఁగలుగు చెమ్మ.
ఊఁతను—పట్టు.
ఊతము—కుట్టఁబడినది.
ఊఁదర—పొగ.
ఊదర—ఒక దినుసు గడ్డి.

ఎర—ఆహారము.

ఎఱ—వానపాము.

ఎఱక—ఱెక్క, భుజము.

ఎఱుక—జోస్యము, సోదె, గురుతు, తెలివి.

ఎఱఁగు—నమస్కరించు, దిగు.

ఎఱుఁగు—తెలియు.

ఏకు—దూదిని జక్కఁజేయు, దూదిచుట్ట.

ఏగు—పోవు, చనిపోవు.

ఏఁడు—సంవత్సరము, ఎవఁడు?

ఏడు—ఒక సంఖ్య (7)

ఏరు—దున్నుటకు సిద్ధముచేయు నాఁగలి.

ఏఱు—నది.

ఒదుఁగు—తొలఁగు, దాఁగు.

ఒదుగు—అధికము, సమృద్ధము.

ఒఱపిఁడి—యోగ్యుఁడుకానివాఁడు.

ఒఱపిడి—ఘర్షణము, రాపిడి

ఓరిమి—క్షమ, ఓర్పు.

ఓలిమి—మఱుఁగుచోటు, జలము.

కంతి—గడ్డ, దద్దు.

కంది—సస్యవిశేషము.

కంపణము—ఆయుధవిశేషము.

కంపనము—వణఁకు, కదలుట.

కక్ష—ఒడ్డాణము, ప్రహరి, నడుము, పోటీ.

కక్ష్య—మొలనూలు, భూమధ్యరేఖ.

కచము—వెంట్రుక.

కుచము—స్తనము.

కటి—మొల, పిప్పలిచెట్టు.

కిటి—పంది.

కదనము—యుద్ధము, హింస, పాపము.

కదన్నము—చెడ్డకూడు.

కపి—కోఁతి, విష్ణువు, ఏనుఁగు, సూర్యుఁడు.

కప్పము—పన్ను.

కబ్బము—కావ్యము, ప్రబంధము.

కమటము—అగసాలెవాని కుంపటి.

కమరము—తాఁబేలు, భిక్షాపాత్రము.

కరంబము—సద్వస్తువుల మేళనము.

కరంభము—పెరుఁగు గలిసిన పేలపిండి.

కర—చేయి.

కఱ—నల్లని.

కరటి—ఏనుఁగు.

కఱటి—వంచకుఁడు, అజ్ఞాని.

కరి—ఏనుఁగు.

కఱి—నల్లని.

కలుఁగు—బిలము, రంధ్రము.

కలుగు—అగు, సంభవించు, పొందు.

కల్మషము—నలుపు, పాపము, మాలిన్యము.

కల్మాషము—చిత్రవర్ణము, నలుపు.

కవి—కవి, వాల్మీకి, శుక్రుఁడు.

కాచు—కాఁగఁజేయు.

కాఁచు—రక్షించు.

కాఁడు—నాటు, పుంప్రత్యయము.

కాడు—శ్మశానము.

కాఁపు—కాఁపురము, శూద్రుఁడు.

కాపు—కావలి, కాయకాచుట.

కారు—ఋతువు. చూ. నానా.

కాఱు—స్రవించు. చూ. నానా.

కారుకొను—వల్లబారు.

కాఱుకొను—సందడించు.

కిరము — పంది.
కీరము— చిలుక.
కురరము— కవ్వము.
కురారము— గొడ్డలి.
కుదరము— గుజ్జము.
కుధరము— పర్వతము.
కొఱకు— పశువులు మేయు కంచె, పక్షు లెరయేటి తినుచోటు.
కొఱకు— చతుర్థీవిభక్తి ప్రత్యయము.
కొరవి— ఎఱ్ఱగొరంట.
కొఱవి— కొఱకంచు.
కొర— గిన్నె, పెద్ద, తట్ట.
కోఱ— దంష్ట్రము.
ఖాతము— అగడ్త, రంధ్రము, చెఱువు.
ఖాదము— ఆహారము తినుట.
గంధమాలి— గంట్లకచోర.
గంధమూషి— వాసనఎలుక.
గాఁడి— పల్లముగానున్న కాలువ.
గాడి— బండి.
గోదరి— ముచ్చివాఁడు.
గోదారి— వెన్నకాచిన మడ్డి.
చరము— చలించునది, ద్యూతవిశేషము.
చారము— చాఱచెట్టు, చెఱ.
చలనము— కదలిక.
ఛలనము— మోసము చేయుట.
చాగము— దానము.
ఛాగము— మేకపోతు.
చాఁకట— పొడవగుట.
చాగుట— నడచుట.
చిరి— చిలుక.
చిఱి— చిర్రికూర.

చీఁకు— చప్పరించు, చుంబించు, అంధుఁడు.
చీకు— గ్రుడ్డిది, నిస్సారము, అంధుఁడు.
చూఁడుము— దహింపుము.
చూడుము— వీక్షింపుము.
చేత— చేయుధాతువు కృదంతము.
చేత— తృతీయావిభక్తి ప్రత్యయము.
జిలుఁగు— మందము, అల్పము.
జిలుగు— చిక్కు.
జ్ఞాని— వేదాంతి, కోడి, జ్యోతిష్కుఁడు.
జ్యాని— ఏరు, ముసలితనము.
టీక— అర్థవివరణము.
టీకా— స్ఫోటకము పొడిపించుట.
డాఁగు— దాఁగు.
డాగు— గురుతు, మరక.
తరలు— ప్రయాణముగు.
తఱలు— కంపించు, విడచు
తరి— ఓడ, పొగ, మబ్బు, మాగాని.
తఱి— సమయము, అల, దగ్గఱ.
తరుచు— మథించు.
తఱుచు— పలుమారు, విస్తారము.
తరువు— నిర్బంధము, చెట్టు.
తఱువు— ఖండించు, తగ్గు.
తరుఁగు— క్షయించు, తగ్గు.
తఱుగు— ఖండించు, లంచము.
తాఁచు— తన్ను, సర్పము.
తాచు—పొదుగు, అతుకు, తోలుచు.
తీఁగ— పాఁకెడితీఁగ, మొలనూలు.
తీగ— చెఱువు ముందఱి ప్రదేశము.
తీరు— విధము, శరము, న్యాయము.
తీఱు— సంధి, వశించు, విడుపు.

తీరుచు—చక్కఁబఱచు, నెఱవేర్చు.
తీఱుచు—నశింపఁజేయు, ఎడఁబాపు.
తేరు—రథము.
తేలు—తేటఁబడు.
తొర—త్వర.
తొఱ—తొఱ్ఱ.
తొరఁగు—కాలుచుండు.
తొఱఁగు—విడుచు.
తొలఁకు—చలించు.
తొలకు—ఉపరంధ్రము.
తోఁడు—కెళ్ళగించు.
తోడు—ఆన.
దాఁక—వఱకు.
దాక—వెడల్పుమూతి గల కుండ.
దాఁపరించు—దొంగిలించు.
దాపరించు—ప్రాప్తించు
దాఁపు—దాఁచుకొను, ఖచితముచేయు.
దాపు—చేరువ, వాయించు.
దివి—ఆకాశము, స్వర్గముపాలపిట్ట.
దీవి—ద్వీపము.
దేవరుఁడు—భర్తతోఁబుట్టువు.
దేవలుఁడు—పూజారి.
ద్విపము—ఏనుఁగు.
ద్వీపము—పులితోలు, దీవి.
ధూపము—వాసన గల పొగ.
ధూమము—పొగ.
నగరము—పట్టణము.
నాగరము—సర్పాకృతి గల స్త్రీల శిరోభూషావిశేషము. చూ. నానా.
నగరి—పట్టణము.
నగరు—రాజగృహము, దేవగృహము.
నట్టుక—ఆటక.
నట్టువ—నర్తనము.
నాఁడు—దినము, కాలము.
నాడు—నాటు, దేశము.
నిటలము—నుదురు.
నిట్టలము—అధికము, నిశ్చయము.
నిదానము—ఆలోచించి పనిచేయుట.
నిధానము—నిక్షేపము, ఉంచుట.
నిరశనము—ఆహారము భుజింపకుండుట.
నిరసనము—తిరస్కారము.
నిర్దారణము—లెస్సగాఁ జీల్చుట.
నిర్ధారణము—నిశ్చయము.
నీరజము—తామర, ముత్యము.
నీరదము—మేఘము, తుంగ.
నీరు—ఉదకము, కన్నీరు, మూత్రము.
నీఱు—భస్మము.
నీవరము—బురద, వర్తకుఁడు, ఇల్లు, నీరు.
నీవారము—విత్తక పండెడు ధాన్యము.
నూఁక—ఒక చెట్టు.
నూక—శంబూకము.
నూఁగు—చిన్నముండ్లు.
నూగు—నూవుమొక్క.
నెమరు—పశువుల చర్వితచర్వణము.
నెమురు—తైలలేపనము.
నెరపు—పఱపు, అధికము.
నెఱపు—నెఱవేర్చు.
నేఁత—నేయుధాతువు కృదంతము.
నేత—ప్రభువు, నాయకుఁడు, నియంత
నేరమి—దోషము, అజ్ఞానము.
నేరిమి—సామర్థ్యము, నేర్పు.

పదరము—తమలపాకుల యడపము.
పదారము—కొలిదుమ్ము.
పన్నగము—పాము.
పన్నాగము—అందలముపై కప్పు.
పయోజము—తామర.
పయోదము—మేఘము.
పర—ఇతరము.
పఱ—పఱ్ఱి.
పరగు—ప్రవర్తించు.
పఱఁగు—ప్రసరించు, వ్యాపించు.
పరపు—ప్రయోగించు, శయ్య.
పఱపు—త్రోలు, వేగము, విరివి.
పరి—సేన.
పఱి=విధము.
పరిక—మ్రుగ్గ.
పఱికె—ఒక దినుసు తాయి.
పరిగొను—బారుకట్టు.
పఱిగొను—అపహరించు.
పరిహారము—చేయి, విడుపు.
పరిహాసము—ఎగతాళి.
పరువము—ప్రాయము, పరిపాకము.
పారువము—పారావతము.
పలుఁగు—స్ఫటికము.
పలుగు—దుష్టుఁడు.
పాఁడి—పాలసమృద్ధి, క్షీరము.
పాడి—న్యాయము, స్వభావము.
పాఁత—బట్ట.
పాత—కాచువాఁడు.
పార—గట్టు.
పాఱ—త్రవ్వునట్టి యొకసాధనము.
పాఱుఁడు—బ్రాహ్మణుఁడు.
పాఱుడు—ప్రవాహము.
పూఁచు—పూనుకొను.
పూచు—పుష్పించు.
పూఁట—దినములో నొక భాగము.
పూట—జామీను.
పూఁత—చర్చ, పూయుట.
పూత—పుష్పించుట.
పెరుఁగు—దధి, స్తన్యము.
పెఱుగు=విజృంభించు, సమకట్టు.
పేఁట—నగరశాఖ.
పేట—హారములోని సరము.
పేటు—పర్వతముశిఖరము, సరిగంచుపట్టె.
పేడు—సన్నచెక్క.
పొంగలి—పులగము.
పొంగిలి—పక్షులయాహారము.
పొలఁకు—గడ్డికుప్ప.
పొలకు—ఒక ఫలము.
పోఁక—క్రముకఫలము.
పోక—నడకడి, నష్టి.
పోఁకు—మంచుగలగడ్డి.
పోకు—నడకడి.
పోఁగు—దారముపోఁగు.
పోగు—కుప్ప.
ప్రతనము—పురాతనము.
ప్రతానము—జొంపము, తీఁగ, మొలక.
ప్రభవము—పరాక్రమము, పుట్టుక.
ప్రభావము—ప్రకాశము, శక్తి, మాహాత్మ్యము.

ప్రమదము — మిగుల మదము గలది, సంతోషము.

ప్రమాదము—ఏమఱుపాటు.

ప్రాకారము—చుట్టుగోడ.

ప్రాగారము—భవనము.

ప్రాఁచి—పాఁచి.

ప్రాచి—ఒక వృక్షము, తూర్పు.

ప్రోఁక—పోఁకచెక్క.

ప్రోక—సమూహము.

ప్రోఁగు—పోఁగు.

ప్రోగు—పోక.

బడప—విపత్తు.

బడబ—బ్రాహ్మణస్త్రీ, ఆఁడుగుఱ్ఱము, కుంటెనకత్తె.

బర్బరము—బొబ్బిలిచెట్టు.

బర్బూరము—తుమ్మచెట్టు.

బాఁజా—శ్యేనవిశేషము.

బాజా—ప్రకాశము, ప్రక్క.

బానసము—వంట, వంటయిల్లు.

బానిసము—దాస్యము.

బుక్కము—క్రొత్తప్రసిద్ధమైన మాంసము.

బుక్కాము—బుక్కా, పుప్పొడి.

బుడక—స్నానము.

బుడత—బాలుఁడు, పొట్టి.

బుధుఁడు-విద్వాంసుఁడు, ఒక గ్రహము.

బుద్ధుఁడు—పండితుఁడు, బుద్ధదేవుఁడు.

బెడఁద—విపత్తు, బాధ.

బెడద—భక్ష్య విశేషము.

బెళఁకు—ఒరయు, చలించు, బెగ[illegible]

బెళఁగు-మిరుమిట్లుగొను, కాంతి, అందము.

బోగము—సుఖము, వెల.

భోగము—చూ. నానార్థములు.

బోయ—కైవర్తుఁడు, కిరాతుఁడు.

బోయి—బెస్త పల్లకిమోయువాఁడు.

మన్న—అడ్డగింప, నిరోధము.

మన్ని—పెడతలయందలి నరము.

మలఁక—చిక్కు.

మలక— తురక, మూఁకుడు.

మలఁపు —నర్తనము.

మలపు—త్రిప్పు, ఆధిక్యము.

మశకము—దోమ, ఒక రోగము.

మసకము—సంభోగము.

మాఁటు—తగులముగొనుట.

మాటు —మఱుగుచేయు.

మాఁడు—మాడిపోవు, ఇంటికప్పు.

మాడు—వర్తించు.

మిడుఁగు—మిడుఁగురు పురుగు.

మిడుగు—గట్టితాయి.

మీఁది —పైని.

మీది—మీకుఁ జెందినది.

మూఁక—సమూహము.

మూక—మూఁగవాఁడు.

మూఁకుడు—మట్టిమూఁత.

మూకుఁడు —ఒక రాక్షసుఁడు.

మేఁడి —నాఁగటి వెనుక కొయ్య.

మేడి—అత్తిచెట్టు.

మోఁద—నెత్తురు[illegible]

మోద—తమలపాకుల[illegible]

యమము—ఉపరతేంద్రియనిగ్రహము.

యామము—జాము, సంయమము.

యామి—కులస్త్రీ, తోఁబుట్టువు.
యామిని—రాత్రి, పసుపు.
రశన—16 పేటల స్త్రీల మొలనూలు.
రసన—నాలుక.
రాఁజు—నిప్పంటుకొను.
రాజు—చంద్రుఁడు, ప్రభువు.
రిక్తము—శూన్యము.
రిక్థము—ధనము, విడిముడి.
రేఁపు—రేఁగఁజేయు.
రేపు—మా. నానార్థములు.
రోఁజు—శ్రమపడు.
రోజు—దినము.
లాఁగు—వస్త్రవిశేషము.
లాగు—విధము.
లేఁక—సేవకుఁడు.
లేక—జాబు, సమూహము, దట్టమైన.
లోఁడు—తోఁడు.
లోడు—దిండు.
వదలు—ఊడు, వీడు, విడుపు.
వదులు—సడలు, బిగుతు కానిది.
వర—శ్రేష్ఠమగు.
వఱ—మేర.
వలఁతి—స్త్రీ.
వలతి—చోటు.
వాఁడి—కఱకు.
వాడి—ఉపయోగించి.
వాఁడు—అతఁడు.
వాడు—ఉపయోగించు (ధాతువు)
వారు—వడియు.
వాలు—సన్నగాఁ గోయఁబడిన తోలు.
వాలుక—ఇసుక.
వాలుగ—మత్స్యవిశేషము.
వీఁడు—ఈతఁడు.
వీడు—పట్టణము.
వెలుఁగు—ప్రకాశించు.
వెలుగు—కంచె.
వేఁగి—పులి.
వేగి—వేగము కలవాఁడు.
వేఁగు—తపించు.
వేగు—ఉదయకాలము.
వేఁచు—తపింపఁజేయు.
వేచు—కనిపెట్టుకొనియుండుట.
వేరు—వృక్షమూలము.
వేఱు—ఇతరముగా.
వ్యంజనము—కూర, గురుతు, మీసము, హల్లు.
వ్యజనము—విసనకఱ్ఱ.
వ్రేఁత—వ్రేయుట.
వ్రేత—గొల్లది.
శాపము—తిట్టు, ఒట్టు.
శాబము—శిశువు.
శీర్ణము—సడలినది.
శీర్షము—శిరసు.
శుంఠ—మూఢుఁడు.
శుంఠి—సొంటి.
శోఫ—వాపురోగము.
శోభ — అలంకారమువలని ప్రకాశము, ఇచ్ఛ.
సంచము—పుస్తకపు సంచిక.
సంచము—బంగారము.
సంప్రదానము—త్యాగము.
సంప్రధానము—నిశ్చితబుద్ధి, ఆలోచనము.

సంశ్రయము—ఆశ్రయము.
సంశ్రవము—అంగీకారము.
సమాదానము—బహుమానగ్రహణము.
సమాధానము—అంగీకారము, జవాబు.
సవతి—తోడి పెండ్లాము.
సవతు—సమర్థ్యము.
సాఁకు—కాపాడు, సంరక్షించు.
సాకు—నెపము, వ్యాజము.
సాఁగు—పొడవగు.
సాగు—పోవు, వ్యవసాయము, జరగు.
సాఁతు—ఒకానొక జాతి.
సాతు—వర్తకజనసమూహము.
సిందురము—సిందూరము.
సింధురము—ఏనుఁగు.
సోమ—పరాక్రమము, శ్రమము.
సోము—సుఖము, ఆసక్తము.
హుతము—వేల్వఁబడినది, హోమము.
హూతము—పిలువఁబడినది.
హోడము—ఓడ, నావ, తెప్ప.
హోఢము—అపహరింపఁబడినది.

———

అఁకద—(సం) అంగదుఁడు, (దే) ఆపద.
అ గి—(సం) అంగములు కలది,
(దే) చొక్కాయ.
అంత—(సం) అంతము, (దే) అంతయు.
అట్ట—(సం) మంటపము, (దే) చర్మము.
అలక—(సం) కుబేరునిపట్టణము, (దే) ప్రణయకోపము.
అవ—(సం) ఉపసర్గము, (దే) అవ్వ.
అవనాయము—(సం) పడఁద్రోయుట, (దే) న్యాయము కానిది.
అవి—(సం) పర్వతము, (దే) సర్వనామము.
అణి—సం. అంచు, దే. ముత్యపు గుండ్రదనము.
ఆయము—సం. రాబడి, దే. జీవస్థానము.
ఆరతి—సం. విరతి, దే. హారతి.
ఆహాకము—సం. ముక్కుజబ్బు. దే. కుదువ.
ఇందువు—సం. చంద్రుఁడు, పలమెత్తు వెండి, దే. ఇంగుదచెట్టు.
ఈడ—సం. స్తోత్రము, దే. ఇక్కడ.
ఉడుపు—సం. నక్షత్రము, దే. ఉడుగు.
ఉరువు—సం. గొప్పది, దే. పరిహరించు.
ఏల—సం. పాట, దే. ఎందుకు.
కంకణము—సం. భూషణవిశేషము.
దే. ఒకజాతి నీటిపిట్ట.
కందము—సం. కందము, వై. పశువుల మూఁపు.
కంబళి—సం. ఎద్దు, వై. కంబళిపురుగు.
కంబు—సం. నీరు, దే. సజ్జలు.
కటువు—సం. కాని పని, నల్లావాలు, దే. కారము.
కదంబము—సం. గుంపు, దే. మిళితముగు.
కరము—సం. చెయి, తుండము, దే. మిక్కిలి.
కల—సం. అవ్యక్తమధుర ధ్వని, దే. ఉన్నటువంటి.

కలాపము—సం. భూషణము, గుంపు, దే. కలత.

కళ—సం. విద్య, దే. మూర్ఛ.

కాంచనము—సం. బంగారు, దే. కోవి దారము.

కాక—సం. కాకి. దే. అగుధాతువు యొక్క వ్యతిరేకార్థకము.

కాయము—సం. శరీరము, దే. బాలెంత మందు.

కుసుమ—సం. పువ్వు, దే. కుసుంబారంగు.

కేక—సం. సందేహము, కాడ, దే. అఱుపు.

కేసరి—సం. సింహము, దే. ఖేచరమృగము.

కోటరము—సం. సంఖ్యావిశేషము. దే. వేగు.

కోదండము—సం. విల్లు. దే ఒక శిక్ష

గడము—సం. ఒక జాతిచేఁప, దే. కుండ మూఁత.

గమకము—సం. స్వరవిన్యాసము, దే. ఎక్కువ.

గాత—సం. గాయకుఁడు, దే. దెబ్బ.

గురువు—సం. ఉపాధ్యాయుఁడు, దే. పరుఁగు.

చరి—సం. ఒక పురుగు. దే. లక్ష్యము.

చారు—సం. సుందరమగు, దే. సంభారము లతో గాఁచఁబడిన చింతపండునీరు.

చింత—సం. విచారము, దే. ఒక చెట్టు.

చిత్తు—సం. విజ్ఞానము, దే. చక్కఁగా దిద్దబడని తొలివ్రాత.

చిత్రిక—సం. చిత్రబింబము, దే. వడ్రం గికి ఉపయోగించు ఉపకరణము.

చిల్లము—సం. చీఁపరపిట్ట, దే. తడికన్ను.

జడ—సం. మందుఁడు, దే. జడ అల్లుట.

జితము—సం. జయింపఁబడినది, దే. స్థిరమైనది.

తండసము—సం. కమ్మరి కొలిమి. దే. కుటిలిక.

తగరము—సం. పొట్టేలు, వై. ఒక లోహము.

తతి—సం. సమూహము, దే. సమయము.

తన్వి—సం. స్త్రీ, దే. తనివితీరుట.

తమి—సం. చీఁకటి, దే. తమకము, కోరిక.

తల్లి—సం. జవరాలు, దే. మాత, ముఖ్యము.

తానము—సం. ఒకపాట, వై. స్నానము.

తామసము—సం. తమోగుణము, పాము, దే. ఆలస్యము.

తాళము—సం. తాటిచెట్టు, దే. మల్లబంధము, బీగము.

తుంగ—సం. ఉన్నతప్రదేశము, దే. ఒక దినుసు గడ్డి.

తూలి—సం. తూలిక, దే. పల్లెవాఁడు, అజాజీవి.

తోయము—సం. నీరు, దే. విధము, దండు, అదను.

దండ—దే. దగ్గర, వై. చేతిదండ.

దండము—సం. శిక్ష, దుడ్డు, దే. ప్రణుతి

దండి—సం. ఒక కవి, యముఁడు, దే. శౌర్యము, గొప్ప.

దళము—సం. ఆకు, సేన, భాగ్యము, దే. ఎక్కుడు, దట్టము.

దార—సం. భార్య, వై. ధార.

దేవర—సం. మఱఁది, దే. గౌరవార్థము ఉపయోగించు ఒకనామము, ప్రభువు.

ద్రోణము—సం ఒక కొండ, దే. ఒక యుపకరణము.

నయము—సం. నీతి, ద్యూతభేదము, దే. లాభము, సుగుణము.

నల్వ—సం. హస్త ప్రమాణముగలదారి, ద్వి. బ్రహ్మ.

నవకము—సం. తొమ్మిది, దే. మెత్తని.

నాగవల్లి—సం. తమలపాకు తీఁగె, దే. పెండ్లియందలి తుది దినమునందుఁ జేసెడి కర్మ.

నాగవాసము—సం. నాగలోకము, దే. గొండ్లెములు తగిలించెడు నిసుప కమ్మి, ఆటమేళము.

నామము— సం. పేరు, దే. బొట్టు, తిలకము.

నిగరము—సం. మ్రింగుట, దే. శ్రేష్ఠమైనది, బలము.

నిదానము—సం. ఆదికారణము, రోగనిర్ణయము, దే. నెమ్మదిగా నాలోచించుట.

నీడ — సం. పక్షిగూడు, చోటు, దే. ద్రుమాదిచ్ఛాయ.

నీతము—సం. కొనిరాఁబడినది, ధనము, దే. నియమము.

నేపాళము—సం. ఒక దేశము, వై. ఒక చెట్టు.

పంచి— సం. ఒక విధమగు వీణె, దే. పంచుట, విభాగము చేసి.

పట్టము—సం. వస్త్రము, చదరము, దే. పామపడగ, పట్నము.

పణము—సం. కూలి, ధనము, పందెము, జూదము, వెల, దే. మల్లబంధము.

పతకము—సం. ఎతకము, వై. క్రమముకొ పన్నుగడ.

పదవి—సం. మార్గము, దే. ఎక్కుడుస్థితి.

పది—సం. పాదములుకలది దే. సంఖ్యావిశేషము.

పాణి—సం. చేయి, వై. మృత్యుపుసీరు.

పానము— పానవిశేషము, గిన్నె, వై. ఫలరసము, ప్రాణము.

పాళి—సం. వరుస, అంచు గుర్తు, చోటు, పేను, చెవితమ్మె, దే జూదమాడుట యం దుపయోగించు నట్టివి.

పింజ-సం. బలము, పసుపు, దే. దూదిపింజ

పిండి—సం. సమూహము, వై. మార్దితధాన్యాదికము.

పుటము— సం. దొప్ప. పూలబుట్ట, దే. గుట్టుపుసడక.

పుత్తళి—సం. బట్టలు మొదలగువానిచేఁ జేయఁబడిన బొమ్మ, దే ఇత్తడి.

పురి—సం. పట్టణము, దే. మెలత, అల్లిక. నెమలిపింఛము.

పైకము—సం. పికముల సమూహము, దే. నాణెము.

పోలిక—సం. పోలీయను భక్ష్యము, దే. వలె, మాదిరిగా.

బంగాళము—సం. చెఱకు, ఒకపిట్ట, దే. వంగదేశము.

బుస-సం. పొల్లు, పెరుగు, దే. పాముబుస.

భేరము-సం. ప్రతిమ, దే. వర్తకవ్యాపారము.

మందము—సం. మెల్లని, దే. దట్టమగులావు.

మనువు—సం. మంత్రము, విష్ణువు. దే జీవనము, మగని వరించుట.

ముదిత—సం. సంతోషపడినది, ముగ్ధ, దే. స్త్రీ.

మేళము-సం. నటుల కూడిక, దే. వాద్యసముదాయము.

రంగము—సం. ప్రదేశము, దే పోదె.

రమణ—సం. అందమగు, దే. ప్రీతి.

రవ—సం. మ్రోఁత, దే నలుసు.

రాక—సం. పూర్ణచంద్రుఁడుగలపూర్ణిమ, దే. వచ్చుట.

లంక— సం. రావణపురి, దే. ద్వీపము.

వంక—సం. వంకర, దే. దెస, దిక్కు, ప్రక్క.

వంద-సం. బదనిక. దే. ఒక సంఖ్య 100.

వరట—సం. స్త్రీ. హంసము, దే. పిడక.

వల—సం. ముడుత, దే. శైత్యము.

వామి—సం. ఆఁడుగుఱ్ఱము, దే. పోగు

వారము—సం. దినముపేరు, దే. గుఱ్ఱము.

వాసము—సం. ఇల్లు, దే. ఇంటిమూలము.

విలాసము—సం. విభ్రమము, దే. చిఱునామా.

సరము—సం. హారము, దే. ముక్కుగాలి.

# ధ్వన్యనుకరణములు

ఇహిహీ—నవ్వుటయందలి యనుకరణము.

ఉహుహూ—చలిబాధ.

కటకట—కరువుబాధ.

కనకన—మండుట, రాలుట.

కరకర } వ్రాయుట, నములుట,
కఱకఱ { కొఱుకుట.

కలకల—నవ్వుట.

కవకవ—నవ్వుట.

కహకహ—పెద్దనవ్వు లేక గర్జన.

కికకిక—నవ్వుట.

కిచకిచ—పక్షులకూఁత.

కిటకిట—పండ్లుకొఱుకుట.

కిఱకిఱ—రథనేమిధ్వని.

కిలకిల—నవ్వుట.

కివకివ—పావురముల ధ్వని.

కీచుకీచు—కోఁతుల ధ్వని.

కుఱకుఱ—మిక్కిలి తక్కువైనది.

కుస్సుకుస్సు—దగ్గునప్పటి ధ్వని.

కొఱకొఱ—కోపము.

కొలకొల—పక్షులధ్వని.

గనగన—మండుట,రాలుట.

గరగర—కాంతి, చక్కనిది.

గఱగఱ—కఱుకుతనము.

గళగళ—ఉదక ధ్వని.

గబగబ—త్వరగా పోవుట.

గమగమ—పరిమళించుట.

గవగవ—తొందరపాటు.

గిజగిజ—క్షోభము, కాలుసేతులు కొట్టుకొనుట.

గిటగిట—పండ్లుగీటుట.

గిరగిర—తిరుగుట.

గిలిగిలి—చక్కిలిగింత.

గుటగుట—వ్యాఘ్రాదుల ధ్వని.

గుడిగుడి—ఉబుకునది.

గుదగుద—పరితపించుట.

గుబగుబ—నీటిరాక.

గుమగుమ—పరిమళించుట.

గురగుర—పందికూఁత.

గుఱగుఱ } ఎలుఁగుబంఁటి పుట్టనుకోరాడుట.
గులగుల } ఒకవిధమైన దురద.

గొటగొట—పులి గాండ్రించుట.

గొణగొణ—గొణుఁగుకొనుట.

గొలగొల—పక్షుల ధ్వని.

చకచక } పరువెత్తుట.
చకచక }

చటచట—మంటలో వస్తువులు పేలుట.

చరచర—బాణవేగము.

చలచల—ద్రవముల పలుచదనము.

చిదచిద—చెమ్మనేలపై నడచునప్పటి ధ్వని.

చిమచిమ—కుఱుపుమంట.

చిఱచిఱ—కోపము.

చిలచిల—ద్రవము చిమ్ముట.

చివచివ—శీఘ్రగమనము.

చురచుర } మండుట.
చుఱచుఱ }

చెరచెర—శీఘ్రముగా.

చాటచాట } కాఱుట.
చాడచాడ }

చొఱచొఱ—నెత్తురుకారుట.

జఱజఱ—ఈడ్చుట, జాఱుట.

జవజవ—దుర్బలవస్తువుల కంపము.

జలజల—పుష్పాదులు రాలుట.

జిలజిల—నాలుక మొ చెమ్మగిలుట.

జొటజొట—కారుట.

జొఱజొఱ—మిడుగురులు రాలుట.

టకటక—అశ్వాదుల నడక.

ఠంగుఠంగు—గంటమ్రోఁత.

తటతట } కొట్టుకొనుట.
తడతడ }

తలతల } మెరయుట.
తళతళ }

తహతహ—తమకము.

తెకతెక—ఉడుకుట, క్రాగుట.

తొకతొక—స్పష్టముకానిది.

తొటతొట—నిప్పులు మొ॥ రాలుట.

తొప్పతొప్ప—నోరు అడచికొనుట.

దగదగ—మండుట, మెఱయుట.

దడదడ—గుండె కొట్టుకొనుట.

దబదబ—తలుపుకొట్టుట, మొత్తుట.

దిరదిర—తిరుగుట.

దుడదుడ—మంచముపై నెక్కుట, నీరు కాఱు.

దుడిదుడి—గజాదులు వేగముగ నడచుట.

దుమదుమ=తడియుట.

దురదుర—శీఘ్రగమనము.

దొటదొట } నీరు కాఱుట.
దొడదొడ

దొడిదొడి—వేగముగ నడచుట.

దొప్పదొప్ప—నోరు అడచికొనుట.

నకనక—ఆఁకలి బాధ.

ధగధగ } ప్రకాశము.
ధిగధిగ

ధణధణ—శంఖభేర్యాది ధ్వని.

నసనస—తడిపిన చర్మపుధ్వని.

నిగనిగ—కాంతి విశేషము.

నరనర—నురుఁగల ధ్వని.

నెళనెళ—విఱుగుట.

నెళినెళి—మా. పై.

పకపక—నవ్వుట మొ.

పటపట—పగులుట, విరుగుట.

పలపల—తొరఁగుట.

పసపస—వాన ముసరు.

పళపళ—విరుగుట, ప్రకాశించుట.

పిదపిద—మృదువు.

పిలపిల—వచ్చుట, పోవుట, మూగుట.

పిసపిస—బురదలో నడచుట.

పుతపుత—ఈర్ష్యవలనిబాధ.

పులుకు పులుకు } ఱెప్పలు మూసి
పుల్కు పుల్కు } తెఱచుట.

పెటపెట—పండ్లు కొఱుకుట.

పెళపెళ—విఱుగుట.

పొటపొట—రాలుట.

పొటిపొటి—అల్పము.

పొలపొల—పొక్కుట.

పొసపొస—త్వరితముగా.

బగబగ—మండుట.

బిఱబిఱ—అతిత్వరితముగా.

బిసిబిసి—బిగువుబిగువు గలది.

బుగబుగ—బుగులుకొనుట.

బుగులు బుగులు—క్రక్కుట.

బుడబుడ—నీటినుండి వెడలుట.

బుడిబుడి—తొట్రుపాటు.

బుసబుస—నీరుపొంగుట.

బెకబెక—కప్పకూయుట.

బొసబొస—పైకి వెడలుట.

బొళుకుబొళుకు—క్రక్కుట.

మటమట } మండుట, మాడుట,
మలమల } మఱుఁగుట.

మిటమిట—ఎండకాయుట, మండుట.

మినమిన—మెఱయుట.

మిలమిల—తళతళ మెఱయుట.

మిసమిస—మెఱయుట.

మురముర—మూల్గుట, గొణఁగుట.

ముసముస—ముసరుట.

ముసిముసి నగవు—చిఱునగవు.

మెరమెర—మనోవ్యథ.

మొఱమొఱ—వస్త్రముల మ్రోఁత.

రవరవ—మెఱయుట.

రెపరెప—గాలివీచుట, మంట మ్రోఁత.

ఱవఱవ—కోపవికారము.

లవలవ—భేదిల్లినది.

లివలివ—దంతములు కదలుట.

లుకలుక—పురుగు తొలుచుట.

లొటలొట—లోనికిపోవుట.

లొడలొడ—కాఱుట.

వకవకలు—చెదరుట.

వకావకలు—చూ. పై.

వడవడ—వడఁకుట.

వికవిక—నవ్వుట, కేరుట.

విరవిర } విఱియుట, కాలుచేతులు కొట్టు
విలవిల } కొనుట.

విసవిస—త్రిప్పుట, ముసరుట.

వెడవెడ—అత్యల్పము.

వెలవెల—వైవర్ణ్యము.

సదసద—నలిగినది.

సరసర—మిక్కిలి శీఘ్రముగ.

సలసల—క్రాఁగుట, తెర్లుట.

సుఱసుఱ—స్రుక్కుట.

సొటసొట—కార్శ్యము.

హుహూ—చలి.

# ద్వంద్వపదములు

అంకపాంకములు—కోపము.

అంజలి గుంజలి—గాసినొందినది.

అండదండలు—సహాయము.

అంతలపొంతలవాఁడు—దూరపుచుట్టము.

అందచందములు—సౌందర్యము.

అందిపొందినవాఁడు—దూరపుచుట్టము.

అచ్చికబుచ్చికలు—కలుపుగోలుతనము.

అడపాడ—జాడ.

అదవదలు—కలఁతలు.

అప్పు-సప్పులు—ఋణఫణములు.

అరవరలు—శుష్కము.

అఱలు మరులు—మనసు తబ్బిబ్బు.

అఱగొఱ—న్యూనత.

అఱవఱలు—సూక్ష్మఖండములు.

తం(బి-బు)=తమ్ముఁడు = అనుజుఁడు.

తం(బుర-బురా-బూర)= వాద్యవిశేషము.

త(త్రి)క్క=తప్పు, నిరర్థకము.

త(ట)క్కరి = వంచకము.

త(క్కలి-క్కిలి-క్కిడ-క్కిడు-క్కెల) = చూ. క్రిం.

తక్కె(డ-డు-ల) బుడ్డబుడుసర.

త(టు)క్కు=మాయ, అసత్యము, జిత్తు.

త(త్రి)క్కు = విడుచు, తక్కువగు, అన్యము.

తగ(టి-టీ-టు-డు) = జరీ, సరిగ.

తగ(ఱు-రు) = తగరము, పొట్టేలు.

త(గు-వు) తా = శక్తుఁడగు, అర్హుఁడగు.

త(గ-వ)రము = వంగమను లోహము.

త(గు-వు)లము = వలపు, అడ్డు.

త(గు-వు)లు = తేలు = సక్తమగు, లగ్నమగు, లభించు, కలుగు, పొందు, కూడు, వలపు.

త(చ్చ-చ్చన) = మోసము, పరిహాసము.

తటా(లున-ల్న-న) = వెంటనే.

తటు(కు-క్కు)న = అనాలోచితముగా.

త(ట్టు-ట్టువ-ట్టువము) = గుఱ్ఱము, వాహనము.

త(డ-డి)క = వెదురుబద్దల అల్లిక.

త(డగ-ణగ-ణగా)ము = తోలుసంచి.

త(టా-డా)క(గ)ము = చెఱువు, సరస్సు.

త(డిబ-డిమ-లిప)ము = శయ్య.

త(డుము-డవు) = నిమురు.

తత్త(డి-ళా) = గుఱ్ఱము, వాహనము.

తత్త(ఱ-ఱము) = తొందర, కలత.

తన(రారు-రు) = వర్ధిల్లు, ఒప్పు.

త(నివి-న్వి-నివు) = తృప్తి, ఆశ.

త(నుకు-న్కు) = తాఁకు, తగులు.

త(ప-బి)సి = తాపసి = తపస్వి.

త(పె-పే-ప్పే-బే)ల = వంటగిన్నె.

త(ప్ప-పా)రము = తపారు = టోపి.

తమ(క-గ-ంగ)ము = మంచె, మండపము.

త(మ-మ్మ)టము = తప్పెట.

త(మి-వి-వ్వి)ఁద = చోడిగొట్టె.

త(మ-మ్మ)లము = వీటిక.

త(మ్మళి-మ్మల-ంబళి) = తమ్మళిజాతి.

త(ము-మ్ము)ఁడు = అనుజుఁడు.

త(రలుచు-రల్చు - ఱలుచు-ఱల్చు) = తరలించు.

త(రవా-రువా-ర్వా)యి = అవృత్తి.

తర(ళ-ళి)ము = చపలము.

తరా(జూ-జు) = త్రాసు, తక్కెడ.

త(ఱుచు-ర్చు) = త్రచ్చు = సానపెట్టు.

త(ఱచు-ఱుచ)చ్చు = చిక్కన.

త(ఱ-ఱి)పి = ముదురు, కొదమ.

త(ఱుగు-ర్గు-ఱువు) = తగ్గు, కోయు.

త(ఱు-ర)పు = తగ్గించు, కొంచెపఱచు.

త(ఱ్ఱ-ఱ్ఱు) = నీచుఁడు, తుచ్ఛుఁడు.

త(ల-లయ)ంటు = అభ్యంజనము.

త(లకొ-క్కొ)ను = కలుగు, పూను.

త(లగ-ల్గ-లా)డ = తల, దిక్కు.

త(ల్ల-లయం-లాఁ)పి = తలగడ.

తలతల-తళతళ = మెరయుట.

తల(త్ర-త్రాణ)ము = హస్తకవచము.

త(ల-ర)ము = విధము, శక్యము.

తల(యా-వ-వా)రి = తలారి.

త(ల-న)రారు = ఒప్పు, చలించు.

త(లియ-ళియ-లిగ-ళిగ)=తెలె=కంచము.

త(లప-డిబ-డిమ)ము = పఱుపు.

త(లు-ల)ఁగు = తల్గు = తొలఁగించు.

త(లుకు-లుక్కు-ళుకు-ళుక్కు)=అధిక కాంతి.

తల్లడి(లు-ల్లు-ంచు) = చలించు, భీతిల్లు.

త(వి-మి-వ్వి)ఁద = చోళ్లు.

త(వి-గి)లించు = తగు(లుచు)ల్చు = అంటించు.

త(వు-వ్వు) = త్రవ్వు = తవుగోల,

త(వు-గు)తా = ఒప్పు యుక్తమగు.

త(వు-గు)లు-తౌలు = ఆసక్తమగు, కలుగు

తాండ్ర = తాడి = విభీతకము.

తా(ఁబే-మే)లు = కూర్మము.

తా(త్రా)గు = పానముచేయు.

తా(చు-పు) = పొదుగు, తొలుచు.

తా(ట-డ)క = ఒక రాక్షసి.

తా(డి-డు) = తాళవృక్షము.

తా(డి-ళి) = ఒక చెట్టు, చెవికమ్మ.

తా(త్రా)డు = రజ్జువు, పాశము.

తాప(రము) = మెట్టు, పావంచా.

తా(పి-పీ) = రహస్యము, జాడ.

తాపి(క-కత్తె-కత్తియ) కుట్టని.
(సంధానము చేయునది.)

తాయె(త-తు-త్తు)రక్షాబంధనము.

తారసి(లు-ల్లు-ంచు) = సమీపించు.

తా(ఱుపు-ర్పు) = బరణి, పొణక.

తా(లిం-ళిం-లు)పు = పొగపు.

తా(ళి-ళీ) = మంగళసూత్రము, పతకము.

తావ(డ-ళ)ము = రుద్రాక్షమాల.

తావ(ర-ల)ము = స్థిరము.

తా(టా)వు = రావు, స్థానము.

తింత్రి(ణము-డి-డీకము) = చింత.

తింతి(డి-ళి-ళీ)క = చూ. పై.

తికమక(ము) = కలఁగినది, బాధ.

తి(త్రి)క్క = వెఱ్ఱి, పట్టుదల.

తిగ(తీ)వంచ = నాలుగు.

తి(గి-వి)యు - తి(గు - వు)చు = లాగు.

తి(న్నియ-న్నె)న = తీ(నియ)న = అరుగు.

తి(మి-మ్మి)రి = దురద, గర్వము, ఒక వ్యాధి.

తి(య-య్య)-తీయ = తీపికలది.

తియ్య(తీయ)ము = మధురము.

తి(రుగు-ర్గు-రువు)ర్వు = సంచరించు.

తి(రువి-ర్వి)ళక-తిర్లిక = దీపము.

తి(వ-గ)మూఁడు. (త్రికము).

తి(వు-వ్వు-గుచు-వుచు) = ఆకర్షించు.

తీఁ(డ్రిలు-డ్రిల్లు-డ్రించు=అతిశయించు.

తీఁ(గ-గియ-గె) } లత, తంతి,
తీ(వ-వియ-వె) } = తీఁగ.

తీ(ఱుచు-రుచు)ర్చు = నిర్మించు.

తీ(-దీ-డీ)లు = తగ్గుట, అడఁగుట.

తుం(తూ)టరి=తూఁడరి, తొట్టరి.

తుం(డము-డు-డె-డె)ము=తునుక.

తుఁ(దుం)దుడు(కు)=తొఁదరపాటు.

తు(ంప-ప్ప-వ-వ్వ)ర=తుషారము, తుట్ర.

తు(క్కు-క్కుడు)=నిస్సారము, చెత్త.

తు(టు-డు)ము=గుంపు, సమూహము.

తు(రా-టా)రము=పరుషవాక్యము.

తు(త్తి-త్తిరి)=నూఁగు బెండ.

తు(ద)ది=అగ్రము, వినాశము.

తు(నియు)నుఁగు = భిన్నమగు, తెగు, చచ్చు, చెడు.

తుపా(దుబా)సి=ప్రభువు, ద్విభాషి.

తు(మి-మ్మి)కి=తిందుకము.

తురా(యి)=శిరోభూషణము.

తురు(ష్కీ-ష్క)=అశ్వదేశము.

తుఱు(గు-ము)=కుఱ్ఱు, ముడుచు.

తుఱ(ము-చు)=రాల్చు.

తు(తుం)పర=శీకరము.

తు(స్సి-వర-వ్వర)=ఒగరునేల.

తూఁ(తుం)ట=ముక్క, చెఱకు.

తూఁ(ట-డ)-తుంట=దష్టుఁడు.

తూఁ(తుం)పర=తుషారము.

తూకు(వ)=బరువు.

తూని(క-కీ-తూనిక్క)=తూచుట.

తూ(ని-నీ)గ=పతంగిక.

తూపర(ణ-ణము-ణి) = జలదారి.

తూ(బ-వ)రము=తువరము, ఒగరైనది.

తూ(బ-వ)రుఁడు=పేడి.

తూ(తువ)ర=వానచినుకు.

తూ(ర-ల)=బలిసినచేఁప.

తూ(లిం-లు)చు-తూల్చు = తొలగించు, బాధించు.

తెం(టెం)కాయ=నారికేళము.

తెం(టెం)కి=స్థానము, నివాసము.

తెం(తేఁ)డు=శయనించు.

తెం(పు-చు)=ఖండించు.

తె(గ-వ)=నారి, సమూహము.

తెట్టు(వు)=కంచె, ఆవరణము.

తె(తెడ్డు)=కొయ్యగరిఁటె.

తె(నుఁగు-న్గు-లుఁగు-ల్గు) తెనుఁగు దేశము.

తెప్ప=తేప=నౌక,రాశి, మిట్టనేల.

తెప్పి(లు-రిలు-రిల్లు-ర్లు-ల్లు) = మూర్ఛనుండి తేలు, మేల్కొను.

తెమ(లుచు-ల్చు-లించు)=కదల్చు, కోయు, దువ్వు, జాడించు.

తె(తే)మ=చెమ్మ, తడి.

తెర(లుచు-ల్చు-లించు)=కదల్చు,తీయు.

తె(రువ-ర్వ)రి=బాటసారి.

తెఱ(గు-వు)=విధము, రీతి.

తె(ల-లు)చు=సేవించు, వేడు, పొగడు.

తె(ల-లి-ల్ల)=తెలుపు, తెల్లన.

తె(లివి-ల్వి)=ఎఱుక, జ్ఞానము.

తె(లివు-లివి-ల్వు)=కాంతి, ప్రకాశము.

తె(లుపు-ల్పు)చెప్పు, తెలియఁ జేయు' తెల్లఁదనము, స్వచ్ఛత.

తె(ల్లం-ల్ల)టి=బహుమానము.

తెల్ల(ము-మి)=విశదము, స్పష్టము.

తె(వ-గ)డు=తిరస్కరించు.

తె(వు-గు)లు=రోగము.

తే(చా)గము=త్యాగము.

తే(జి-జీ)=గుఱ్ఱము, వాహనము.

తే(ది-దీ)=దినము, తిథి.

తే(నె-నియ)=మధువు.

తేమ-తెమ్మ=చేమ, తడి.

తే(రు-ఱు)=కలుగు, రథము.

తే(లా-లియా)డు=ఓలలాడు.

తొం(తోఁ)క=వాలము, పుచ్ఛము.

తొం(దొం)డి=రంధ్రము, చిల్లు.

తొం(ద-దు)=బొజ్జగలవాఁడు.

తొక్కుట(ము) = త్రొక్కుట(ము) = ఒత్తుడు.

తొ(గ-వ)=కలువ, ఎఱ్ఱకలువ.

తొ(గ-వ)రు=ఎఱుపు, రాగము.

తొ(చ్చె-చ్చియ)ము=హీనము, తుచ్ఛము.

తొట్టరి-తుంటరి=దుష్టు(ఁడు)రాలు.

తొ(ట్టి-ట్టు-ట్టువ)=నీటితుక్కు.

తొ(ట్టియల-ట్ల-ట్టెల-ట్ల) = తొట్టె, ఉయ్యాల.

తొ(ట్లియ-ట్లె)=ఉయ్యాల.

తొ(డ-ణ)గు=పూను, అభ్యసించు.

తొడ(గు-వు)=ఆభరణము.

తొడు(గు)=ధరించు, పట్టు.

తొ(డుగు-డ్గు-డవు-డు)సంధించు.

తొ(న-డ-ల)కు=నీరు మొ॥ చిందు.

తొ(ర-రు)గు=పడు, రాలు, కాలు.

తొ(ఱ-ఱట-లట-ఱ్ఱ)=కోటరము.

తొ(లి-ల్లి)=పూర్వము.

తొ(లి-లిక-ల్లి-ల)=రంధ్రము.

తొ(లుక-లక-ల్క)రి=తొలుకారు.

తొ(లుకా-ల్కా)డు-తొలుకు=పొంగు.

తొ(లత-ల్త)=మున్ను.

తొ(వ-గ)=కలువ

తొ(వ-గ)రు=ఎఱుపు.

తోఁచ-తోటి=మాలవాఁడు.

తోఁ(ట)ఁపు=ఉపవనము.

తోఁ(డే-డే)లు-అడవికుక్క.

తో(డు)కొను=వెంటఁగొను.

తో(టి-ఁచ)=మాలవాఁడు.

తో(డుతో-డ్తో)=వెనువెంట.

తో(తొ)పారము=వేగ, గంత

తోయ(తొయ్య)లి=ఆఁడుది.

తో(త్రో)లు = నడపించు.

తోలు(క)=చర్మము, చెట్టుపట్ట

తో(తొ)వ=తోగ, కలువ.

తౌ-తవు=తగు.

త్రెం(తెం)పి=దారి.

త్రె(వు-వ్వు)=చీరు, గ్రొచ్చు.

త్రా(గు-వు)డు=త్రాగుట.

త్రా(తా)డు=పాశము.

త్రా(తరా)సు=తుల.

త్రి(తి)క్క=పిచ్చి.

త్రుం(తుం)చు = ఖండించు.

త్రు(ళ్ళగిం-ళ్ళిం)త = గంతు.

త్రెం(చు-పు)-తెంచు = ఖండించు.

త్రే(నుపు-న్పు-ఁపు) = త్రేఁచుట.

త్రో(చు-యు) = గెంటు, పడవేయు.

త్రో(తో)లు = తఱుము, నడపించు.

దం(దెం)చనము = పెద్దఫిరంగి.

దం(చు-పు) = నలఁగఁద్రొక్కు.

దం(తం)డు = ధనము సంపాదించు.

దండు(వ-పు-గు) = జరిమానా.

ద(డ)క్కు-లభించు, లొంగు.

ద(డ)గ్గఱు = సమీపించు.

ద(డ)గ్గుత్తిక = గద్గదస్వరము.

ద(చ్చువు-చ్చొక) = దచ్చి = ఎనిమిది.

ద(ట్టి-ట్టీ) = కాసెకోశ.

దడి(బ-మ)ము = పఱపు, శయ్య.

దలి(బమ)ను = చూ. పై.

దద్ద(ఱిలు-ఱిల్లు-ఱు) = తబ్బిబ్బుపడు.

దద్దఱు = దత్తఱిల్లు = చూ. పై.

దద్ద(డ-ళను) = బోడిమిద్దె.

ద(ద్దు-ద్దురు) = దద్రువు.

ద(ప్పి-ప్పిక)- డప్పి=దాహము, పిపాస.

ద(డ)బ్బఱ = అసత్యము.

ద(డ)బ్బు = బొంకు, చెప్పు.

ద(డ)బ్బర = గిన్నె.

ద(డ)య్యు = బడలు, కృశించు.

ద(రిసె-ర్సె)నము = కానుక.

ద(ల-ళ-డ)ము = ఆధిక్యము దట్టము.

ద(లి డి)మము = సన్ననిది.

ద(వు-వ్వు)-దౌ = దూరము.

దా(డా)ఁకొను = ముఱుఁగుపడు.

దా(ఁ)-గిలు = డాఁగు = చూ. పై.

దా(క-గ)లి = డాక(లిల్లు) = సమీపము, అగసాలెవాని దిమ్మె.

దా(డింబ-డిమ లిమ్మ = దానిమ్మ.

దాడి(నిమ్మ-మ్మ-మము) = దానిమ్మ.

దా(డి-ళి)మి-దాలిమము = చూ. పై.

దా(ది-దిలి) = ఉపమాత, ధాత్రి.

దా(డా)పల = ఎడమవైపు.

దా(డా)పురము = ప్రాప్తి.

దా(శువా-ళ్వా) = సస్యవిశేషము.

దా(డా)వరడంగి = దేవతాళము.

దాప(రి-రీఁడు) = పీఱుఁడు.

దా(వా-వగము) = దొంగతనము.

దా(హ-స)రి = విష్ణుభక్తుఁడగుశూద్రుఁడు.

దిం(చు-పు) = దిగుచు = పోనిచ్చు.

ది(గు-గ్గు)డు-డిగ్గుడు = పల్లమైనది.

ది(గి-గ్గి)యు = డి(గి-గ్గి)యు = నడబావి.

ది(ట-ట్ట-డవు-టము-ట్టము) = శక్తి, ధైర్యము.

దిద్దు(పాటు-బడి) = సవరించుట.

ది(ద)బ్బడము = మూఁకుడు.

ది(బ్బె-బ్బియ)ము = దీపము.

దిరిసె(న)ము = శిరీషము.

ది(డి)ల్ల = దిల్లము, అధైర్యము.

ది(వియ-వ్వియ-వ్వ-వె-వ్వె) = దీపము.

ది(వ్వె-వె)ల = దీపావళి.

ది(స-స్స)మొల = దెసమొల=నగ్నుఁడు.

దీ(డీ)కొను = ఎదిరించు.

దీ(మ-వ)సము = ధైర్యము.

దీ(వ-వె)న = ఆశీర్వాదము.

దుం(ఘుం)డుభము = రెండుతలలపాము.

దుం(దిల-డిక-డిల-డిగ)ము = దుండుగ.

దు(గ-గా-వ) = ద్వికము, రెండు.

దు(గ్గ-గ్గి) = పార్శ్వసి.

దు(సె-సే)దారి = ప్రభువు, శూరుఁడు.

దు(న్న-ను) = దుక్కిచేయు.

దుప్ప(టము-టి-టీ)= చీర=ఉత్తరీయము.

దుబా(సి-సీ)-దుబాసికుఁడు = ద్విభాషి.

దు(మా-మ్మా) (మ్మ)రము = పెద్దదుమ్ము.

దుముకు-దూఁకు = ఉఱుకు.

దు(డు)య్యు - దూ (డూ)యు = తీయు, లాగు.

దుర(టి-పి)ల్లు(ను) = శోకించు, తపించు.

దురా(యి) = ఆజ్ఞ, శాసనము.

దు(వాళము-వ్వాళి-వాళి) = పరుగు.

దు(వ్వ-ప్ప)టము-దువ్వలువ = సన్నబట్ట.

దు(ప్వి-వ్వ) = పెద్ద (చిరుత)పులి.

దుసె(కిలు-కిల్లు)-దుసుకు = జాఱు.

దూప(టిలు-టిల్లు) = దప్పిగొను.

దూపి(ంచు-లు-ల్లు) = చూ. పై.

దూ(డూ)యు = కత్తి పైకిలాగు.

దె(డె)ప్పరము = ఆపద, రీతి, అధికము.

దె(డె)ప్పు = దూఱు, ఎత్తిపొడుచు.

దే(జేం)ద్ర = సాలీలలో నొకజాతి.

దై(లు)వాఱు-దయివాఱు=అతిశయించు.

దొం(డొం)కెన = ఆయుధవిశేషము.

దొం(తి-తర) = ఎత్తుగ పేర్చిన వరుస.

దొ(ంద-ంసు-గ్దు) = స్థూలకాయుఁడు.

దొ(డ్డ-డ్డ) = పెద్దది, అధికము.

దొ(డొ)ప్ప = ఆకులదొన్నె.

దొ(ద్రొ)బ్బు = దొంగిలించు, రమించు.

దొమ్మ(దొంబ)ర = ఒకమానవజాతి.

దొ(దోయి) = జంట, యుగ్మము.

దొర(లించు-ల్చు) = దొరలఁజేయు.

దొ(లుచు-ల్చు-లుపు-ల్పు) = చూ. పై.

దొ(రువు-రవి-ర్వు) = నడబావి, చెఱువు.

దొస(ఁగు-వు) = దోషము.

దో(డో)ఁగు = ప్రాకు, చర్మము, ఉసు.

దో(ని-నె) = దొన, ద్రోణి, తూము.

దో(యి-సి)లి = అంజలి, నతి.

దో(డో)ల(లిక) = డోలి, ఉయ్యాల.

దో(తి-వతి) = కట్టుపంచ.

దౌ(దవు) = దూరప్రదేశము.

దౌ(దవు)డ = చెక్కిలి (లోనిభాగము).

దౌ(దవు)డు = పరుగు, దండయాత్ర.

దౌ(దవు)రు = రుచి, కాంతి, హారము.

ధంగ(నాచి) = చతుర, వడ్లచిలుక.

ధం(చు-ౘు) = అన్నము మొదలగువానితో కూర తిను.

న(కె-క్కెర) = ఎఱ్ఱకోస.

న(గ-వ)రు = అంతఃపురము.

న(గవు-వు-వ్వు) = హాసము.

నగౌక(స)ము = పక్షి, సింహము మొ. జంతువు.

నట్టు(గుఁడు-వ-వుఁడు) = నటుఁడు.

నడ(క-త)-నడితి = నడనడి.

న(డ-డు)పు = నడపించు, నడిపించు.

నడి(కి)రేయి = నడిరాతిరి, అర్ధరాత్రము.

న(డ-డు)చు = సంచరించు.

న(డపు-డుపు-డిపించు) = జరుపు, చేయు.

న(ద-జ)రు = కానుక.

నన(లెత్తు-లొత్తు-నచుచు) = పూచు.

న(నుపు-న్పు-వు) = అనురాగము.

న(మ-మి-మ్మి)లి—నమ్మి = నెమలి.

నమ్మి(క-గ) = నమ్మకము, విశ్వాసము.

నర(పు) = పలితము, పండినది.

న(ర-రి)యు = వెండ్రుకలు తెల్లపడు.

న(నా-రా-జి)జీ = కత్తి, ఖడ్గము.

న(ఱకు-ఱుకు-ఱ్కు) ఖండించు.

న(ను)రుము = పీడించు.

న(లచు-లఁపు-లుచు-లుపు) పీడించు.

న(లఁగు-లుఁగు) = నలియగు, తగ్గు.

నలు(గు-వు)రు—నల్వురు = అందరు.

న(లువ-ల్వ) = బ్రహ్మ, చతుర్ముఖుఁడు.

నల్ల(ప-ఁబ-వ)డు = నల్లనగు.

న(ల్లె-లే)రు = వజ్రవల్లి.

నవరసు-సవరను = కాసు.

న(వ-ఁ)రు = రాజగృహము.

నవ్వ(రా)రు = పల్లవు, మొగ్రి.

నవు(నా)రు = మెత్తనిది.

నఁ(గొంటు-గొట్టు) = కాముకుఁడు.

నాంచారు-నాఁచారు = దేవత, స్త్రీ.

నాఁ(గలి-గెలు-గేలు) = లాంగలము.

నా(అ)ఁచికొను—నాఁచు=లాగుకొను.

నా(టించు-టు) = గ్రుచ్చు, పాతు.

నా(గప-గప్ప-ప) = నాగమసాని.

నాగవ(ల్లరి-ల్లి-లి) = నాగబలి.

నా(టు-ఁటు) = గ్రుచ్చుకొను, పీడించు.

నా(డె-ణె)ము = నాణ్యము = శ్రేష్ఠము.

నా(తి-తుక) = స్త్రీ, ఆఁడుది.

నా(నుచు-చ్చు-న్చు) నానవైచు.

నా(ను-నో)డి = జనశ్రుతి, సామెత.

నా(యఁ-యిం-యుఁడు)=నాయకుఁడు.

నారి(క-కె) డము = వాల్కడము = కొబ్బెర.

నా(లుక-లిక-ల్క) = జిహ్వ, మంట.

నా(లుగు-ల్గు-లువు) = సంఖ్యావిశేషము.

నా(అన)వుడు = అనిన పిదప.

నా(సిక-స) = ముక్కు.

నిండ—నిట్ట = జలప్రవాహము.

నిం(పు-చు-డించు) = నిండఁజేయు.

ని(క-క్క-క్క)ము = నిజము.

ని(క-గ)రము = పాదభూతము.

ని(క్కు-గుడు-వుడు) = పైకిలేచు.

ని(క్వ-క్వా)ణము = ధ్వని, శబ్దము.

ని(గ-గా)రము = కాంతివిశేషము, బిల్ల.

ని(గి-గు)డించు = నిగు (డుచు-డ్చు) = చాచు.

ని(గు-ఘ)ఱు, నీఱు = భస్మము.

నిచ్చ(లు) = నిత్యము, ఎల్లప్పుడు.

నిట్ట—నింట = ప్రవాహము, పోటు, స్థానము, స్థిరము.

ని(ట్టు-ట్రు) = పస్తు, క్షామము.

ని(దు-ద్దు)ర = నిద్ర, కూరుకు.

ని(ద్దము-ద్దా) = నున్ననిది, స్నిగ్ధము.

ని(న-నా)దము = ధ్వని.

ని(నుపు-ంపు) = వెల్లువ, సమృద్ధము.

నిప్పచ్చ(రము)=శూన్యము, దారిద్ర్యము.

ని(ప్పు-ప్పుక) = అగ్ని.

ని(బ-బ్బ)ద్ది = నిజము.

నిబ్బ(ర-రిక)ము = దయ, సూటి.

ని(మ-వు)రు = ప్రేమచే తాఁకు.

ని(లుక-ల్క)డ = ఉనికి, వాసస్థానము.

ని(వీ)లఁగు = చచ్చు, గర్వించు, ఒడలు విఱుచుకొను.

ని(వు-గు)డు = చాఁగు, పుటు, స్రవించు.

నీ(ఈ)ఁగు = నివర్తిల్లజేయు.

నీ(చు-చుఁడు) = మూర్ఖుఁడు.

నీ(రా-ర్ఱా)డు = జలకమాడు.

నీ(ఈ)రెండ = లేఁతఎండ.

నీ(ఈ)వు = యుష్మదర్థకము.

నుం(నుస)పారు = మెత్తనగు.

ను(డి-డుఁ)నొడుగు = పలుకు, మాట.

నుడు(గు-వు) = నొడువు = చెప్పు, నుడి.

నుఁ(నుపు-న్పుంపు) = నున్ననిది, స్నిగ్ధము.

ను(రుఁగు-రువు-ర్వు) = ఫేనము.

ను(ఱుగు-ర్గు-గ్గు) = చూర్ణము, పొడి.

ను(న)ఱుము = పొడిచేయు, చంపు.

ను(లించు-లుచు-లుపు) = నలియఁజేయు.

ను(న)లియు = పొడియగు, వడఁకు.

ను(వ్వు-వునూవు) = ధాన్యవిశేషము.

నూ(వు-గు)నువ్వు = చూ. పై.

నె(లకొ-క్కొ-లవుకొ)ను = వసించు.

నె(గ-వ)డు = బయలుపడు, ఒప్పు.

నె(ఎ)గయు = ఎగురు, తేలు, వెడలు.

నె(నొ)గులు = బాధ, కష్టము.

నెటి(క-కె) = నెట్టిక = వ్రేలిగనుపు.

నె(ట్ట-ట్టె-ట్టియ)ము = గుండ్రపాగ.

నె(త్తురు-త్రు) = రక్తము.

నె(ప-వ)ము = వ్యాజ్యము, కారణము.

నెప్ప(ర-ళ)ము = వేగము, త్వర.

నె(మ-మ్మ-మి)లి=నమలి=మయూరము.

నెమ్మి(క) = ప్రేమము, అనురాగము.

నె(యి-య్యి) = నేయి = ఆజ్యము.

నెయ్య(ము-మి) = స్నేహము, ప్రేమ.

నె(ర-ఱ-ఱా)-నేఱా = గొప్పది, నేర్పరి.

నె(ర-ఱ)వు = పూర్తి, మార్గము, నెలవు.

నె(ఱ-ర)పు = నెఱవేర్చు, ప్రకటించు.

నె(ఱి-రి)క = పింజె, వస్త్రపుకుచ్చె.

నెల(వు) = స్థానము.

నెల(త-ఁతుక) = ఆఁడుది, భార్య.

నె(లకొ-లవుకొ-ల్కొ)ను = పాదుకొను.

నె(వ-ప)ము = మిష, నిభము.

నే(జ-జా) నేజము = చిల్లకోల.

నేయ(నెయ్య)ఁము = స్నేహము.

నే(నేయి-నె-యి)య్యి = ఘృతము.

నే(రిమి)ర్మి = నేర్పు, శక్తి.

నేవ(డ-ళ)ము, నేహారము = మణుల హారము.

నొ(గల్చు-లుచు-లించు) = పొడిచేయు.

నొడు(వు-గ) = చెప్పు.

నొ(వు-గు)లు = బాధపడు.

నో(చు-ము) = ఆచరించు.

నోవి-నొవ్వి = బాధ, నొప్పి.

నోవు-నొవ్వు = వ్యాధి, బాధ.

నౌకు-నవుకు = నిమ్నము, పల్లము.

నౌ (నవు)బత్తు-చర్మవాద్య విశేషము.

ప(ంటి-నఁటి) = వంటకుండ.

పం(టియ-టె) = సాలెవాని పనిముట్టు.

పండు(గ-గు-వ) = ఉత్సవము.

పం(దియ-దె)ము = దాయము.

ప(ముక-క్క) = పార్శ్వము.

ప(గ్గ-గ్గియ) = సామర్థ్యము.

పటాపంచ(ము) = అగోచరము.

ప(టు-ట్టు)కొలు = ఒక పనిముట్టు.

ప(టు-ట్టు)సాలె = ఒకజాతి.

ప(డవా-డా)లు = స్వల్పసేనాధిపతి.

పడిగ(ము) = తమ్మ యుమియు పాత్ర.

ప(త-తం)గము = పక్షి.

ప(త్రి-త్తిరి) మాకేడుదళము మొ.

పదు(గు-వ) = ఏకజాతి సంఘము

ప(ద్రు-దురు)చు = త్వర పెట్టు.

ప(య-య్యా)ట } చీర చెరఁగు.
ప(య-య్యో)ద } పైఁట.

ప(నఁ-రఁ)టి = కడవ.

పరి-పారి = ఆవృత్తి, సారి.

పరు(గు-వు) = ధావనము

ప(ట్టి-ట్టీ)య-పట్టె = బ్రద్ద.

ప(లు-ల్లు) = దంతము.

పలుమ(రు-రు) పల్మ(రు) = చాలాసార్లు.

పల్మారు-పలుమారు = చూ. పై.

పల్ల(కి-కీ) = నరులు మోయు వాహనము.

పల్లన(ము) = గుజ్జుపు పల్లము.

ప(ల్లే-ల్లె)రు — పలంకష.

ప(లవ-ల్వ)రించు=ప్రలాపించు.

ప(వ-గ)డము = ప్రవాళము.

ప(వ-గ)తుఁడు = శత్రువు.

ప(వ-గ)లు = దినము.

ప(పా)వాడము = ప్రాయశ్చిత్తకర్మము.

ప(వి-గి)ది = విధము.

పస(ర-[illegible]) = [illegible]

ప[illegible]డి = బంగారము.

ప([illegible])ము [illegible]పాత్ర.

ప([illegible])ఁడు = పాఁచి.

పా[illegible]త = జీగము.

పా(ప్రా)తము = ప్రాయశ్చిత్తము.

పా(చ-స)నము = విరేచనము.

పాటి(లు-ల్లు) = కలుఁగు.

పా(య)పోసు = ముచ్చె.

పా(ప్రా)ము = రుద్దు, వి. సర్పము.

పార(ద-త)ము = పాదరసము.

పార(సి-సీ)కము = ఒకానొక దేశము.

పా(వహ)రా = కావలి.

పారియాత్ర(క)ము = ఒకానొక కొండ.

పార్తెంచు-పారుతెంచు=పరుగెత్తివచ్చు.

పా(ర్వ-రవ)ము = పారావతము.

పా(రుప-ర్ప)త్తెము = అధికారము.

పాలకి—పల్లకి = పాలకి.

పా(మ)వాడము = తనకోరిక నెరవేర నపుడు దేవుని ఎదుట చేసికొను శిక్ష.

పాషం(డి-డుఁడు) = వేదబాహ్యుఁడు.

పా(ళియ-ళె)ము=జూదపుపలక.

పా(ళి-ళీ)=వ్రాఁతసాధనము = చూ. పై.

పిక్కటి(లు-ల్లు) = పిగులు, నిండు.

పిచి(లు-ల్లు)—చిప్పి(లు-ల్లు)=స్రవించు.

పి(చ్చు-చ్చి)క = చటకము.

పి(చ్చిక-చ్చి-చ్చుక-చ్చు) కుంటు = అనూరుఁడు.

పితాళ్ళు = పితరులు, పితృదేవతలు.

పి(న-న్న) = చిన్న; చిట్టి.

పిన్న(ట)నాడు = బాల్యదశ.

పిఱు(ఁదు) = వెనుక, నితంబము.

పిల్లా(ఁడి-ణి) = స్త్రీల కాలివ్రేలినగ.

పి(ప్ప)ల్లు = కసవు, తృణము.

పీఁచ(పించ)ము = మదము.

పీ(నుఁగు-న్గు) = శవము.

పీ(రుచు-ర్చు-లుచు-ల్చు)=ఆఘ్రాణించు.

పీ(పి-గు)లు = చినుఁగు, చీలు.

పుం(పూ)ట = సంధ్య.

పు(కి-క్కి)లించు = నీరు గండూషించు.

పు(టి-ట్టి)క = చిన్నగంప.

పు(డి-ణి)కిరించు = ఇచ్చు, గ్రహించు.

పు(ఱు-ణు)గు = చూ. పై.

పుత్త(డి-ళి-ళిక) = అపరంజి.

పు(ణ్నె-నె)ము = సుకృతము.

పుయిలోట(ము) = వెనుదీయుట.

పుర(డిం-ణిం)చు=వర్ధిల్లు.

పురు(టియా-టా)లు = బాలెంత.

పురు(భు-హు)వు = మిక్కుటము.

పు(రె-రే) = ప్రశంసార్థకము.

పురోధ(సుఁడు) = పురోహితుఁడు.

పు(రువు)ర్వు = పురుగు.

పు(ల్లియ-ల్లె) — పుటియ = పునక.

పు(ల-ల్ల) = పసుపుమించిన తెలుపు.

పులిహో(హో)ర = పులుసు కలిపిన అన్నము.

పు(లు-ల్లు) = రత్నమాలిన్యము, కసవు.

పు(వు-వ్వు) పూవు, పుష్పము.

పూ(ఁడులు-ండ్లు) అనేకసంవత్సరములు.

పూచి(క) = తృణవిశేషము, బాధ్యత.

పూ(జ-జా)రి = అర్చకుఁడు.

పూ(నిక-నికి-నిక్క) = ఉద్యమము.

పూ(రె-రే)కు=పక్షి విశేషము.

పెం(టి-ట్టి)క = జంతువుల పిష్ఠమలము

పెం(పేఁడ)=గోమయము.

పెం(డ్లి-డిలి)=వివాహము.

పెం(డియు-డె-డెం-డేర-డర-డారు)ము = గండపెండారము.

పె(క్కురు-క్కండ్రు)=అనేకులు.

పె(ప్రె)గడ-ప్రెగ్గడ=మంత్రి, ప్రధాని.

పె(గ-క)ల=పెల్లగిల్లు.

పెడ(ము-మోము) = వెనుకకు త్రిప్పిన మొగము.

పె(డ-ణ)క = ఒక భాగపు పైకప్పు కత్తి లేక అసియొక్క వెనుక భాగము.

పె(ద-ద్ద)=పెద్దవాఁడు, గొప్పవాఁడు.

పెద్దపులి=బెబ్బులి=వ్యాఘ్రము.

పె(న్న-న్నె)రు=అశ్వగంధ.

పె(మ్మె-రిమె)పెద్దతికము.

పెరి(ప్రే)మ(ను)-స్నేహము.

పె(రుకు-ర్కు-లుకు)=పీఁకు, పెల్లగించు.

పె(రుగు-ర్గ)=వర్ధిల్లు.

పె(రువు-ర్వు)=దధి.

పె(లుచ-ల్చ)న=అతిశయము, కోపము.

పెల్లగి(లు-ల్లు)=పాఁగు, ఊడిలేచు, పాటు.

పే(టి-టీ)=నడికట్టు.

పేద(తిమి)రికం=దారిద్ర్యము.

పే(ప్రే)ము=బెత్తము, వేత్రము.

పేర(ంట్ర-ట)ము=శుభములందు ముత్తయిదువులను పిలుచుట.

పేర(ణము-ణి) = అంగీసుండపై నాట్యము.

పే(రు-రె)ము=(కుఱ్ఱు) పరుకు.

పే(రుకొ-ర్కొ)ను=పేరుపెట్టి పిలుచుట.

పే(రిమి-ర్మి)=గౌరవము, అతిశయము.

పై(పయి-పయఁ)ట=పయ్యెద.

పైఁ(పయి)డి=బంగారు, ఉంకువ.

పై(పయి)దలి=ఆఁడుది.

పై(పయ)పయినము=ప్రయాణము.

పై(పయి)రము=ఆవు.

పై(పయి)రు=సస్యము.

పై(పయ్య)సరము=రతి.

పొం(పో)జు-ప్రోఁజు=నాగపోఁగు.

పొ(పా)కారు=నాశమగు.

పొ(ట్టె-ట్టే)లు=గొఱ్ఱెపోతు.

పొ(త్ర-త్తరు)ము=గుండ్రాయి.

పొ(ప్రొ)ద్దు=కాలము, సూర్యుఁడు.

పొ(రి-ల్తి)=అత్యంతము, మాటికి.

పొ(రుగు-ర్లు-రువు)=ప్రక్క, సమీపము.

పొ(లఁతి-త్తి-లఁతుక-ల్తుక)=ఆఁడుది.

పొ(లుపా-ల్పా)రు=ఒప్పారు.

పొ(వ-గ)=ధూమము.

పొ(వ-గ)డు=స్తుతించు.

పొ(వ-గ)రు=గర్వము.

పోఁగు-ప్రోఁగు=దారము.

పోగు-ప్రో(గ-క)=రాశి.

పో(టులా-ట్లా)డు=కలహించు.
పో(ండి-డి)మి=సౌందర్యము, రీతి, ఒప్పు.
పోరాట(ము)=కలహము.
పో(ప-త)రించు=మదించు, క్రొవ్వు.
పో(జా-పవ్వ)జా)=బారు దండు.
పో(ల-ప(గు-వ్రు)లు=చీలు.
ప్రె(గ-గ్గ-వ)డ=మంత్రి, యువరాజు.
ప్రేగు-ప్రేగు=ఆంత్రము.
ప్రేమ-ప్రేరేచు=ప్రేరించు.
ప్రౌ(యి-య్య)=అధిశ్రయణి.
ప్రో(గు-వు-క)=రాశి.
ప్రోడ(డు)=నిపుణుడు.
బంగా(రము)(రు)=సువర్ణము.
బండ(డు)=ఆతతాయి (బండగుడు)
బండాట(ము)=ఆకతాయితనము.
బం(డా-డవ)లము=సామగ్రి, సమర్థత.
బం(ది-దే)ఖానా=చెఱసాల.
బందు(గు-వు)డు=మిట్టము.
బగళ(ము-మ్ము-ంబు)=తొలగుడు.
బ(గి-వి)సి-బైసి=భాగ్యము, గౌరవము.
బ(టా-టాక-ట్ట)బయలు=మిక్కిలి బయలు
బ(బా)ఢువ=పల్లపునేల.
బడు(గు-వు)=ఆశక్తుడు, శవము.
బత్త(డి-ళి)క=అమ్ములపొది.
బమ్మ(రించు-రిల్లు)=భ్రమించు.
బరాబరి(క)=హెచ్చరిక.
బరి(చి-గీ)=ఈటె,కుంతము.
బ(లా-లారా-శా-శారె)=బాపురె.
బ(ళి-ళీ-ళిరె-ళిరే)=బాపురె.
బా(గము-గ-గా)లు=ఠక్కుపొడి.
బా(ం)జారు=విపణివీథి.
బాడి(త-ప)=వడ్లవానిపనిముట్టు.
బాతు(వు)=జలపక్షి విశేషము.
బాదర(ము)=నూలుచీర, ఫాలము.
బాదరాయ(ణి)ణుడు=వ్యాసముని, వెత్తి వాడు.
బా(ద-దా)ము=వృక్షవిశేషము.
బారి(జ-ద)ము=పారిభద్రము.
బా(రి-రీ)=ఏనుగుకాలిగొలుసు.
బావ(డీ)=దొరువు, చెరువు.
బాహు(వు)=భుజము.
బికా(రి-సి)=బిచ్చగాడు.
బి(గిం-గియిం)చు=బిగువుచేయు.
బి(గ-గ్గ)=పిల్లగ్రోలు.
బి(డ—డ—డ్డ)=శిశువు.
బి(బ్బో—బ్బో)కము=నాయిక గర్వముచే ఇష్టవస్తువులందు చూపు నిరాదరము.
బి(ల్ల-ల్లి క)=సూర్యచంద్రుల బింబము.
బీ(టిక-ట)=పగులు, చీలిక.
బు(క్క-క్కా)=గందపొడి.
బుగు(గు-బు)లు=చిప్పిలు, వ్యాపించు.
బుజ్జ(గ-వ)ము=ఉపలాలనము.
బు(డిగి-డుగు) = పొట్టి.
బుడుత(డు)=బిడ్డ, బాలుడు.
బుడ్డి(గ)=చిన్నమూతిగల కొచపాత్ర.
బురు(బర)మా = పిడిసాన.

బూ(స్రు-జ)=ఎండలేని తడివస్తువులపైఁ బుట్టునలుపు.

బూ(మియ-మె) = వంచన, మాయ.

బూరు(గు-వు) = శాల్మలీవృక్షము.

బె(గ-గ్గ)డు=భయపడు, భీతి.

బెగ్గ(ల-లిక)ము = భయము, విహ్వలత.

బె(బే)డిదము = భయంకరము.

బె(డ-ణ)ఁకు = చలించు, తొలఁగు.

బె(బే)హారము = వాణిజ్యము.

బె(బే)హారి = వర్తకుఁడు.

బై(బయి)డాలము = కోపము, కినుక.

బై(బయి)రవాసము = ఉత్తరీయము.

బై(బయి-బయ)లు = మైదానము.

బై(బయి)సుక = ప్రతిజ్ఞ.

బొం(బోఁ)కి = కుత్సిత పాత్రము.

బొ (ఢ-డా-డల-డ్ల-డ్లా)ము=టెంకాయ మీఁది బొసిక.

బొందు(గ-వ)=కంఠనాళము.

బొంక(బొక్క)ణము=విబూదిసంచి.

బొక్కనియ-బొక్కెన=ఇనుపపాత్ర.

బొట(న-మన)వ్రేలు=బొట్ట(న)వ్రేలు.

బొత్తా(ను-ము)=గుండి.

బొ(మ-మ్మ)=కనుబొమ్మ, ప్రతిమ.

బొమి(డి-డీ)క(ము) = కిరీటము.

బొ(మ-మ్మ)ముడి=భ్రుకుటి.

బొమ్మి(డి-డీ)కము = కిరీటము.

బోయ(డు)=బోయవాఁడు=కిరాతుఁడు.

బో(రుకా-ర్కా)డు=స్నానముచేయు.

బ్ర(తు-దు)కు = జీవనము.

మంగు-మాఁగు = కమియఁబండు.

మంచు-మనుచు = హిమము.

మంజిమ(ము) = మనోజ్ఞత.

మంజా(డి-ళి) = వజ్రముల తూనిక.

మం(డ-డా)ము = చిల్లకోల.

మం(డు-డూ)కము = కప్ప, దండిగము.

మఁతటి(లు-ల్లు) = అడఁగు.

మ(కర-రక)తము = పచ్చరాయి.

మ(కు-ఫు)ష్టకము = అడవిపెసలు.

మ(మా)గధుఁడు=వంశావళిచదువువాఁడు.

మ(ఖ-ఘ)వుఁడు = ఇంద్రుఁడు.

మ(జ-జా-జ్జ-జ్జా-జ్జారె-జ్జరే-జ్జారే) = ప్రశంసార్థకము.

మ(టి-ట్టి)క=గోరుచిక్కుడు.

మడిమంచ(ము)=బలహీనము.

మడుఁ(గు-వు)-మడ్గు = ఉపశాంతి.

మశి(గ-వ)ము = అధికారము.

మ(త-త్త)ల్లిక = ప్రశస్తవాచకము.

మను(గు-వు) = అనుకు.

మ(నికి-నిక్కు) = నివాసస్థానము.

మ(నః-నో)వర్తి = జీవనమునకిచ్చుసొమ్ము.

మ(న్నియ-న్నె)ఁడు = ప్రభువు.

మ(మ్మ-మ్మా) = ప్రశంసను దెల్పునది.

మ(మ్మ-మ్మా)రె(రే) = ప్రశంసార్థకము.

మ(క)రందము = పూఁదేనె.

మ(రి-రీ)చము = మిరియము.

మ(లుచు-ల్చు) = తాతిని తొలుచు మొ.

మ(ల-ల్లా)ట = కెసఁగులాడుట.

మ(ల్లా-లా)రము = గాజుల గుడి.

మసూరి(క) = ఒక రకము గజ్జి.

మస్త(క)ము = తల, శిరము.

మహిమ(ము) = గొప్పతనము.

మా(ల)కరి = మాలాకారుఁడు.

మా(వి-మి)డి = చూతవృక్షము.

మ(సటీ-ష్టీ)ఁడు = కూరుఁడు.

మిం(మీఁ)గడ = పాలతొరక.

మిండ(ఁడు) = మిండ(గా-గీ)డు-విటుఁడు.

మి(క్క-క్కు)టము = అధికము.

మిగు(లుచు-ల్చు) = శేషింపఁజేయు.

మి(ణు-ణు)గు(రు) = అగ్నికణము.

మి(న్నవా-న్నా)ఁక = ఆకాశగంగ.

మీ(ఁగ-ఁగ)డ = కాఁగినపాలపై తెట్టె.

ము(ంగ-క్కు)ర = నాసాభరణము.

ముంగ(ర-రా)ము-ముంజేతి కంకణము.

ము(కు-క్కు)టము = కిరీటము(మకుటము)

ము(ంగో-కో)పము = అధికకోపము

ముట్ట(డ-ణ)ము = ముట్టడించుట

ము(త్తె-త్తియ-త్య)ము = మౌక్తికము.

ము(ది-ద్ది)యు = అఁడుది

ము(ను-న్ను) = ముందు, మొదలు.

ము(న్న-న్నా)డి = ముందుగా.

ము(బ్బ-మ్మ)డి)ము మ్మడుఁగు=3 రెట్లు.

ము(ల్కి-లికి) = బాణము.

ము(గు గ్గు-వు-వ్వు)రు=మూ(ఁగు-వు)రు.

మురి(ప-పె)ము = కులుకు, గర్వము.

ము(స్త-స్తె) స్త్రియ = తుంగ.

మూ(రుకొ-ర్కొ)ను = ఆఘ్రాణించు.

మూ(హుర్త-ర్త)ము = ముహూర్తము = పండ్రెండు క్షణముల కాలము.

మె(ట్టి-ట్టి)క = మెట్టు, సోపానము

మె(మట్టియు)ట్టె-కాలువ్రేలిసగ.

మె(తు-దు)కు = అన్నపుకణము.

మె(లఁత-లంత-ల్త) = స్త్రీ.

మె(లఁతు-ల్తు)క = ఆఁడుది.

మే(తా-తలా)కు = వేఁకమేయు.

మేళ(విం విం)చు = కలియు, జతకూర్చు.

మొ(క-గ)ము = ముఖము.

మొ(క్క-గ్గ)లము = అప్రతిహతము.

మొ(గ-గ్గ-గడ)=కొరకము.

మొ(గ-గ్గ)రము=వ్యూహము.

మొ(గు-గుడు)చు=మొగుడుఁజేయు.

మొ(మో)ర=ముఖము.

మొ(ఱి-ఱ్ఱి)=అంగన్యూనత.

మొ(ఱ-ఱ్ఱ)=ఆర్తధ్వని.

మొ(మో)లగు=నల్లచాయచెక్క.

మొ(లక-ల్క)=అంకురము.

మొ(హ)లాము=మొల్లాము = బంగారు మొ వానిపూఁత.

మొ(గు-వు)డు=ముకుళిత మగు.

మొగ(స-సా)ల = నగరి తలవాకిలిచావడి.

మొకరించు-ఱిలు-ఱిల్లు)=సాష్టాంగ నమస్కారము చేయు.

మో(మ్రో)డు = మొఱడు = స్థాణువు, మొద్దు.

మోద(గు-వు) = కింశుకము.

మో(మొగ)ము = ద్వారము, ముఖము.

మో(ల ళ)ము = మొలాము = ఎక్కసక్కెము.

మో(ము)హరీ = ఒక బంగారు నాణెము.

మ్రం(మం)గ = పిండీతకము.

మ్ర(మ)బ్బు = మేఘము.

మ్రో(మొర)డు = మోడు, స్థాణువు.

మ్రో(మొర)యు = మ్రోగు, ధ్వనించు.

రజ(స్సు-ము) = దుమ్ము, నెత్తురు.

ర(ద్ది-గ్గు) = కొట్టివేత, అల్లరి.

ర(మ-వ)ణించు = ఒప్పిదమగు.

ర(వ-వా)ళి(లి) = ధ్వని.

రసి(క) = పుంటిచీము.

రాకా(క్క)సి = రాక్ష(సి)సుఁడు.

రా(రమ)ణ-రవణ = ఒప్పిదము.

రా(గి-ఘి) = అశ్వత్థము.

రావు(తు-త్తు) = రౌతు.

రిం(ఖ-గ)ణము = జాఱుట.

రుద(రాక-రక్క) = రుద్రాక్షము.

రుమాలు(వు) = చేతిగుడ్డ.

రె(ంబ-బ్బ-మ్మ) = ఉపశాఖ.

రేత(స్సు-ము) = ఇంద్రియము.

రే-రేయి-రెయి = రాత్రి.

రే(గ-వ)డ(డి) = బంకమన్ను.

రొ(ంపు-ద్దు-)శ్వాసరోగము, రొఁజు.

రొ(ండు-ష్టు-జు)డు = ప్రలాపము.

రొ(ఱొ)మ్ము = వక్షము.

యి(యి-య్యి) = నిప్పుమీది భస్మము.

రో-రోయి = వేశ్యకిచ్చు వెల.

రౌ(రవు)తు = గుఱ్ఱము నెక్కువాఁడు.

రౌ(రగు-రవ)లు = మంటయెత్తు.

ఱా ఱాయి = శిల.

ఱి(ప్పు-వ్వు) = ఎగయుట.

ఱువు-ఱువ్వ = విసరివైచు.

లై(అవి-అయి)క = కంచెల.

లం(బి-బీ-లెంబి) = కుటుంబము.

లకో(రి-రీ) = క్షూరశరము.

ల(గ్న-గన)ము = లగ్నము.

ల(డ్డువ-డ్వ)ము = బూరె, లడ్డు.

లా(రా)క్ష = లక్క, జంతువు.

లా(చి-చీ) = గుఱ్ఱముపైవేయు జీను మొ.

లా(త-తా)ము = సన్న్యాసుల చంకసంచి.

లా(ళ-డ)ము = గుఱ్ఱపు గొరిజలకుఁ గొట్టెడు ఇనుప బిళ్ళ.

లి(ల)కుచము = గజనిమ్మ చెట్టు.

లి(పిక-పిక్కా-పీకా-పీక)కుఁడు = లేఁకరి.

లూ(టి-టీ) = ఉపద్రవము.

లెం(లం)బి-లంబీ = కుటుంబము.

లెం(లేఁ)క = భటుఁడు.

లే(లే)ఖని = వ్రాఁతపనిముట్టు.

లే(టి-డి) = జింక.

లే(లి లీ)హనము = పాము.

లొం(లోఁ)గు = లోఁగువగు, వెనుదీయు.
లొ(చ్చు-జ్జు)=తక్కువ, న్యూనము.
లొ(టి-ట్టి)పి(ట-ట్ట) = ఒంటె.
లొ(ఒ)డ్డ = ఎడమ.
లొ(ఒ)డ్డు = అధికము.
లొ(త్త)ట్ట = పల్లము.
లో(ఁగ-ఁగి)లి = గృహాంతర్భాగము.
లో(డి-డీ)=మల్లులు త్రిప్పెడు సాధనము.
లో(రో)మము = వెండ్రుక.
లో(రో)మశుఁడు = ఎక్కువ రోమములు గలవాఁడు.
లోలు(పు-భు)ఁడు = లోలుఁడు.
లో(ఁగు-వు) = లోఁకువగు, చొచ్చు, అడఁగు.
లౌ(లవు)డి(ణి) = పరిఘము, లాటి.
వం(క-కా)వు =గుఱ్ఱపుపల్లముంచుచోటు.
వంగ(డ-స)ము = వంశము.
వం(చి-చ-చను) =ఒకటి, ముఖ్యము.
వ(క-కా)వకలు=చెదరుటలు.
వక్క(ళిం-రిం)చు=తిరుగఁబడు.
వ(క్కా-క్క)ణ=వ్యాఖ్యానము.
వగ(రము-రు)=వగ(రుపు-రుప్పు).
వ(గ్గు-క్కు)=బక్కటిల్లు.
వ(టా-రా)రి=సమర్థము.
వ(రర-రారి) = సమర్థుఁడు.
వ(డ-డు)చు = పోయు, కార్చు.
వడు(గువు) = రీతి, ఉపనయనము.
వటు(వు-కుఁడు)=వడుగఁడు, బ్రహ్మచారి.

వ(డ్డ-డ్డె)న = వడ్డించుట.
వ(డ్ర-డ్రం)గము=వడ్రంగిపని.
వ(డ్రం-డ్లం)గి=వడ్లవాఁడు.
వ(ణ-డ)కు=కంపించు, కంపము.
వ(బ)దనిక=చెట్టుపై మొలచు ఓషధి.
వ(ఒ)ద్ద=సమీపమున.
వ(న-నే)చరము = కోఁతి.
వన(రు)ట = శోకము, వగపు.
వ(మ్రము-మ్రి-మ్రిక) = చెదలు
వ(యా-య్యా) = విహారము.
వర(ను-ఁసు) = చిక్కు, అడ్డంకి.
వర(వు వుఁడు) = దాసి.
వ(రా-రహా) = వరాహముద్రగల యొక బంగరు నాణెము.
వరా(టిక-టకము) = గవ్వ, తామరపూస.
వ(రు-ర్గువు) = పేరుపేరున వ్రాసినలెక్క.
వల(ను-ఁసువు) = దిక్కు.
వ(లు-ళు)కు=తగవు.
వ(లువ-లువు-లువము-ల్వ)=వస్త్రము.
వ(ల్లె-లె)వాటు= మెలిపెట్టి వైచుకొన్న యుత్తరీయము.
వ(లుఁద-ల్ద)వలము=స్థూలము.
వ(లపు-లుప్పు)=వాసన.
వ(సి-శి)రము = ఇందుప్పు, ఉత్తరేణు.
వస(ల-లా) = కొయ్యకు అడుసువేసిన కొయ్య.
వసా(ర-రా)=పంచపాళి.
వ(ళి-ళీ)రుఁడు=మెల్లకంటివాడు.

వాగ(రత-ర్త) = సముద్రనదీతీరము.
వాగ(శ-శ్య)ము = ఖలముఖము.
వాచా(టు-లు)ఁడు = వదరుఁబోతు.
వా(చారవ-చర)ము = పరిదేవనము.
వా(వ)నాయుజము = ఒక జాతిగుఱ్ఱము.
వాపు-వాయింపు = వాయించుట.
వావలూ(రము-రుఖ) = పుట్ట.
వారణ (బుస-బృస) = అరఁటి
వా(రి-ర్ధి), వారినిధి = సముద్రము.
వా(ర్వ-రువ)ము = గుఱ్ఱము.
వా(ల-లా)యించు = నిర్బంధించు.
వాలు(గ-వ) = మత్స్యవిశేషము.
వా(వుర-రువ)ము = గుఱ్ఱము.
వాస(ము-స్సు) = వస్త్రము, ఇల్లు.
విట(త-తా)టము = తాఱుమాఱు.
వి(డియ-డెము-డియము) = వీడియము.
విడు(గడ-గర-దల-పు) = విమోచనము.
వి(నుక-న్కు)లి=వి(నికి)న్కి = ఆకర్ణనము.
వి(న్ను-న) = ఆకాశము.
విరజా(ది-జి) = నవమాలిక.
విర(వాజి-వాది - జాజి) = చూ. పై.
వి(ర-రా)శము = చందాధనము, ఎడము.
విలంబ(న)ము = వ్రేలుట, జాగు.
వి(లపన-లాప)ము=దుఃఖముతోఁ పలుకుట.
వి(లు-ల్లు) = ధనస్సు.
వి(శ్ర-శ్రా)మము = పద్యవిరామము.
విశ్వక(ర్మ-ర్ముఁడు) = దేవశిల్పి.
విసు(గు-వు) = నిర్వేదము.

వి(స్ఫా-స్ఫా)రము = వింటిమ్రోఁత.
విహ(ంగమ-ంగ-గ)ము = పక్షి.
వీట(తా-తా)ట(న)ము = విటతాటము.
వీ(డె-డియ-డ్య)ము-విడ్యము = తాంబూలము.
వీ(ణా-ణ)ము = సన్నవస్త్రము.
వీ(నియ-నె-ణియ-ణె) = వీణావాద్యము.
వీయ(వియ్య)ము = పెండ్లిసంబంధము.
వీ(బీ)రము = పరాక్రమము
వీరమ(ద్దియ-ద్దలు) = } శత్రువీరులం
వీర(మద్దియము-ముద్రిక)లు } జేగుచెక్కించి
శూరులు తమ కాలి పెద్దవ్రేలున ధరించెడు ముద్రికలు.
వీరము(ద్దియ-ద్దె)లు = స్త్రీలు కాలివ్రేలున ధరించు ముద్రికావిశేషములు.
వీ(ణ రా)ణము = చర్మవాద్యవిశేషము.
వె(ంగ-క-క్కు)లి-వెంగలి = మూఢుఁడు.
వె(డ-ణ)ఁద = విశాలము.
వెలు(-లు)తురు = శరీరము.
వె(తు-ద-వ)కు = అన్వేషించు.
వె(ను-న్ను) = వెనుక.
వెను(క-కల)=వెన్క, పశ్చాద్భాగము.
వె(సబా-న్బా)టు = విషాదము.
వెఱఁగు-వెఱఁగు = ఆశ్చర్యము.
వె(ర-రు)వు = ఉపాయము.
వె(లనా-ల్నా)డు = దేశవిశేషము.
వె(ల-డ)లు = బయలుదేఱు.
వెలా(పచు-ర్చు-రించు) = వెడలించు.
వె(లిమి-ల్మి)డి = బూడిద.

వెల్లి(క) = ప్రవాహము.

వె(లువ-ల్వ)డము = సస్యవిశేషము.

వె(వ)లిపము = సన్నవస్త్రము.

వె(లువ-ల్వ)రించు(ఱచు)-వెలువడఁజేయు.

వె(డలు-ళ్ళు) = పోవు.

వే(వ్రే)ఁగు = తపించు.

వే(వ్రే)ఁత = వ్రేయుట.

వేమరు-వేమారు = మాటిమాటికి.

వే(మ-మా)ఱు = చూ. పై.

వేర(ము-మి)=విరోధము, వైరము.

వే(ల-డ)ము = మండలాగ్రము, శిబిరము.

వే(వ్రే)లు = వ్రేలాను, అంగుళి.

వే(వ్రే)లుచు(ల్చు) = అగ్నియందు హోమము చేయు.

వే(లుపు-ల్పు) = దేవత.

వే(వు గు)రు = వేయిమంది.

వే(శ-ష)ము = అలంకరించుకొనుట.

వేస(వి-ఁగి-ంగి)=గ్రీష్మఋతువు.

వే(స-సా)రు = విసుగుకొను.

వ్రే-వ్రేడు, వ్రేత = గొల్లకులము.

వ్రే(వే)ఁకటి = గర్భము.

వ్రే-(వే)ఁపు = తాపము.

వ్రే(ఱువి-ల్కి)డి = చిటిక, త్రుటి.

సం(క్రమ - క్రామ - క్రమణ)ము = సంక్రాంతి.

సంచ(కరము-కారము-కరువు) = బేరముల పట్ల ముందిచ్చుధనము, బజానా.

సంపు-చంపు = వధించు.

సంప(ఁగియ-ఁగె)-సంపెఁగ = చంపకము.

సంప(త్తు-ద) = ఐశ్వర్యము.

సంబ(డ-ళ)ము = దారిబత్తెము.

సంబా(ఱు-రము) = ఉప్పు, చింతపండు లోనగు వస్తువులు కలిసిన ద్రవము.

సం(బ్ర-బర)ము = వేఁగిరపాటు.

సంబ(ళి-ఱి) = తొలఁగుమని పల్కుట.

సంభరు(వు-ఁ) = పావలు.

సం(శం)భళి = కుంటెనకత్తె.

సంవ(శంబ)రము = జలము, చేఁప, జింక.

స(కి-గి)వ = కృత్రిమపక్షి, బొమ్మ.

స(గి-కి-)లింత = గుజ్జుపుకూఁత.

స(చ)చ్చు = చనిపోవు.

సవ(సు-స్సు) = సభ, రాజసభ.

సమకూ(ఱు-రు)సమకుఱు = చేకుఱు.

స(మ-మా)జ్ఞ = యశము.

స(మ్మా-ంబా)ళిగలు = పావలు.

స(య్యొద్ద-యొ్యద్ద)=చేరిక.

స(ర-రా)శము = ఔదార్యము కలది.

సరి(పణి-పణీ-పెణ) = (బంగరు)గొలుసు.

స(ళ)ర్వల=చిల్లకోల, తోమరము.

సల(గ-వ) = సలగపాలు, పాలుచిప్ప.

స(ద)లుపు = చేయు, కడపు.

సలు(వ-గ)=ధాన్యము కొలుచుచు గుర్తుకై దోసిటితో పోయు కుప్ప, పెచ్చు.

స(వ-వ్వ)డి = జాడ, ధ్వని.

సహితము-(సయి-సైతము) = కూడినది.

స(ళ్ళు-డలు) = ఊడు, జాఱు, వదలు.

సాం(సం)పరాయము = యుద్ధము, ఆపద.

సా(చా)గు = పోవు, జరుగు, యత్నించు.

సా(ట-టా) = వస్తువులమార్పు, పరివర్తనము.

సా(స)దనము = ఇల్లు.

సా(మ్రా-ంబ్రా)ణి = ఉత్తమాశ్వము.

సా(శా)లపర్ణి = ముయ్యాకుపొన్న.

సాలు(వు) = సన్నవస్త్రము, బొమ్మ.

సా(ళువ-ళ్వ)ము = శ్యేనవిశేషము.

సిం(గా-గి)ణి-సింగిణి = విల్లు.

సిం(దు-దూ)రము = చెందిరము, సిందువారము.

సి(క)గ = జుట్టు.

సి(గ-వ) = దేవతావేశము.

సిగ(ర-రి) = సంబారువులుచేర్చిన మజ్జిగ.

సితా(భ-భ్ర)ము = కర్పూరము.

సి(వఁగి-వ్వగి) = చివఁగి = తరక్షువు.

సీతు(వు) = చలి, చలికాలము.

సీ(దర-ద్ర)ము = సప్పము, దారిద్ర్యము.

సీ(చీ)లమండ = కాలిమడమల కిరుప్రక్కల నుండు కీలు.

సు(క-గ)ము = సౌఖ్యము, సంతోషము.

సుత(రాం-లాం) = బొత్తుగా, ఎంతమాత్రము.

సు(పా-ప్పా)ణి = ముత్యమునందలి శుభ్రమైన నీరు.

సురమా(యి) = మిక్కిలి నల్లనిది.

సు(రి-రె)యాళు = మాలవాఁడు.

సు(లు-ళు)వు = సులభము.

సూ(శూ)ర్మి = లోహపు ప్రతిమ.

సృ(ణి-ణీ)క = చొంగ, లాల.

సె(క-గ) = జ్వాల, తాపము.

సె(గ్గము-గ్గు) = రోఁత.

సె(బ్బర-బ్ర) = చెడుగు.

సెలగ-సలు(గ)వ = దోసెడు గింజలు.

సెల(ళు-వు) = ఆజ్ఞ, ఉపయోగము.

సే(సె)బాసు = బళీ.

సై(సయి)గ = సంజ్ఞ.

సొ(చొ)ట్ట = పల్లము లేక వంకర.

సో(జె-ద్దె)ము = ఆశ్చర్యము.

సో(సొ)పానము = మెట్టు.

సో(రణ-ర్ణ) = గండ్లు = గవాక్షము.

సౌ(సవు)రు = అందము, విధము.

సౌ(హార్ద-హృద-హృద్య)ము = స్నేహము.

స్యా(శ్యా)లిక = భార్యతోఁబుట్టువు.

స్యా(శ్యా)లుఁడు = బావమరఁది.

స్ర(స)గ్గు = తగ్గు, అడఁగు.

స్రా(సా-స)వి = కాలము.

హంస(ము) = రాజహంస.

హ(అ)జారము = ఆస్థానమండపము.

హ(అ)డపము = వక్కలాకులతిత్తి.

హ(అ)నుమఁడు = హనుమ = హనుమంతుఁడు.

హ(అ)రణము = సారె, కట్నము.

హ(అ)రిగోలు = నావ, పడవ, బల్లకట్టు.

హ(అ)రిదళము = హరితాళము.

హ(అ)రుసము = హర్షము, సంతోషము.

హ(హ)జారము = కొలువుకూటము.

హ(ఆ)రతి = నీరాజనము.

హ(ఆ)వడి-హావళి = ఉపద్రవము.

హి(ఇ)తవరి = హితము చెప్పువాఁడు.

హిరణ్యరే(తు-తసు)ఁడు = అగ్ని, సూర్యుఁడు

హుమా(యి) = గఱ్ఱము.

హు(రమ-ర్మ)త్తు = గొప్ప, పెద్ద.

హె(ఎ)చ్చరిక = సూచన, అవధానము.

హె(ఎ)చ్చరి(లు-ల్లు)ఎచ్చర్లు = వర్ధిల్లు.

హే(ఏ)-రా-వళి = పాడవన్నె కోక.

హొ(ఒ)మ్ము = సరిపడు, బలుపు.

హొ(హవు)సు-సొగసు = విలాసము.

హ్ర(హ్రా)దిని = వజ్రాయుధము.



# వ్యాకరణసంగ్రహము

## (సంజ్ఞాపరిచ్ఛేదము)

**సూ:—** సంస్కృతమున కేఁబది వర్ణములు గలవు

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః
క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప
బ భ మ య ర ళ వ శ ష స హ ళ ఇం దకారము మొదలు 16 అక్షరము
వఱకు నచ్చులు. క కారము మొదలు ళ కారము వఱకు 34 హల్లులు.

**సూ:—** ప్రాకృతమునకు నలుబది వర్ణములు గలవు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ
త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ. కొందఱి యభిప్రాయ
మున, ఎ ఏ ఒ ఓ లును, మఱికొందఱి మతమున ఐ ఔ లును గలవు.

వ్యా ప్రాకృతము = సంస్కృతభాషయొక్క వికారము. సరస్వతియొక్క
బాల్యమునందలి తొక్కు పలుకులు. ఈ భాష ప్రాకృతము, శౌరసేని,
మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశము - అని ఆఱు విధములు. ఈ భాషకు
వాల్మీకిమహర్షి కృతములగు మూలసూత్రములు గలవు.

**సూ:—** తెనుఁగునకు ముప్పదియాఱు వర్ణములు గలవు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అఁ క గ చ ౘ జ ౙ ట డ
త ద న ప బ మ య ర ల వ శ స హ ళ. (36)

వ్యా ఇందు శకటరేఫమును (ఱ) వర్ణాంతరముగాఁ బరిగణించుట యుక్తము.

**సూ:—** క, చ, ట, త, ప లు పరుషము లనియు, గ, జ, డ, ద, బ లు
సరళము లనియు వ్యవహరింపఁబడును.

వ్యా పరుషములు కఠినోచ్చారణము గలవనియు, సరళములు సులభోచ్చారణము
గలవనియుఁ జెప్పఁబడును.

**సూ:—** పరుషసరళములకంటె భిన్నములగు హల్లులు స్థిరములు.

వ్యా॥ క కారము మొదలు ళ కారమువఱకు నుండు ముప్పదినా ల్గక్షరములలో
బరుషసరళములు గాక మిగిలిన యిరువది నాల్గక్షరములు స్థిరము లనఁబడును.

లోపము—వర్ణమగపడకుండుట. (చూచెను బాలుఁడు - చూచె బాలుఁడు)
ద్విత్వము—సమానమైన హల్లుల కూడిక. (క్క, చ్చ, ట్ట మొ)
సంశ్లేషము (సంయుక్తము)—అసమానమైన హల్లుల కూడిక. (క్త, క్న, క్ష)
ఆదేశము—స్థానాక్రమణము. శత్రువువలె నొక యక్షరముయొక్క స్థానమును మఱియొక యక్షర మాక్రమించుట. (రాముఁడు వాలిని జంపెను.)

ఆగమము—మిత్రునివలెఁ బ్రక్కకుఁ జేరుట. (వర్ణాధిక్యము, మాయమ్మ.)
ఉపధ—అంత్యాక్షరమునకుఁ బూర్వాక్షరము.
వక్రములు—ఎ ఏ ఒ ఓ (నాల్గు వర్ణములు.)
వక్రతమములు—ఐ ఔ (రెండు వర్ణములు.)
ఉభయాక్షరములు—ఁ ం ః (మూఁడు వర్ణములు)
వర్గయుక్కులు—ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ ( 0 యక్షరములు )

స్పర్శములు—కవర్గము (క ఖ గ ఘ ఙ) చవర్గము (చ ౘ ఛ జ ౙ ఝ ఞ) టవర్గము (ట ఠ డ ఢ ణ) తవర్గము (త థ ద ధ న) పవర్గము (ప ఫ బ భ మ) 27 అక్షరములు.

అంతస్థములు—య ర ల వ (నాలుగు వర్ణములు)
ఊష్మములు—శ ష స హ (నాలుగు వర్ణములు)
పరుషములు—క చ ౘ ట త ప (6 వర్ణములు)
సరళములు—గ జ ౙ డ ద బ (6 వర్ణములు)
కంఠ్యములు—(కంఠమునుండి పుట్టునవి) అ ఆ క ఖ గ ఘ ఙ హ ః.
తాలవ్యములు—(దౌడలనుండి పుట్టునవి) ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ.
మూర్ధన్యములు—(శిరస్సునుండి పుట్టునవి) ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష.
దంత్యములు—(దంతములనుండి పుట్టునవి) ఌ ౡ త థ ద ధ న ల స.
ఓష్ఠ్యములు—(పెదవులనుండి పుట్టునవి) ఉ ఊ ప ఫ బ భ మ.

అవ్యయములు—లిఙ్గవిభక్తివచన శూన్యములగు పదములు.

ఉ వృథ, సర్వత్ర, సర్వద, అట్టులు, ఆహా, ఔర, భళి, బాపురే, అక్కట, కటకటా మొ.

ఉపసర్గములు-సంస్కృతావ్యయములైన యుపసర్గలు తత్సమవిశేష్యములయొక్కయుఁ, దత్సమవిశేషణములయొక్కయు, ధాతువులయొక్కయుఁ బ్రథమమునఁ జేరియుండును. ఇవి విడిగాఁ బ్రయోగింపఁబడవు. (ప్రాదులు ఉపసర్గలు)

ఉ॥ ప్ర-పరా-అప-సమ్-అను-అవ-నిస్-నిర్-దుస్-దుర్-వి-ఆఙ్-ని-అధి-అపి-అతి-సు-ఉద్-అభి-ప్రతి-పరి-ఉప (ఇవి ప్రాదులు)

| | | |
|---|---|---|
| ప్ర—ప్రవాసనము. | నిర్—నిర్దుష్టము. | అపి—అపిధానము |
| పరా—పరాజయము. | దుస్—దుష్క్రియ. | సు—సుమతి. |
| అప—అపకారము. | దుర్—దుర్భిక్షము. | ఉత్—ఉద్యమము. |
| సమ్—సంతోషము. | వి—విశేషము. | అభి—అభిమానము. |
| అను—అనుస్వారము. | ఆ—ఆగమనము. | ప్రతి—ప్రతిక్రియ. |
| అవ—అవమానము. | ని—నిదానము. | పరి—పరిమాణము. |
| నిస్—నిష్కృతి. | అధి—అధిపతి. | ఉప—ఉపకృతి. |

అనునాసికములు—(ముక్కునుండి పుట్టినవి) ఙ మ ఞ ణ న.
కంఠతాలవ్యములు—(కంఠమునుండియుఁ దాలువులనుండియుఁ బుట్టినవి) ఎ ఏ ఐ.
కంఠోష్ఠ్యములు—(కంఠమునుండియుఁ బెదవులనుండియుఁ బుట్టినవి) ఒ ఓ ఔ.
దంతోష్ఠ్యము—(దంతములనుండియుఁ బెదవులనుండియుఁ బుట్టినది) వ.

ప్రాతిపదికము-ధాతుభిన్నమును, ప్రత్యయభిన్నమును, ప్రత్యయాంత భిన్నమును నగు అర్థవచ్ఛబ్దము

(నామము. దీనిపైఁ బ్రత్యయాదులు చేరును. దీనిని బ్రకృతియని పిలుతురు)

ఉ రామ, కృష్ణ, గోవింద, ముకుంద మొదలగునవి.

ప్రత్యయము=వర్ణకము (నామవాచకముల చివరవచ్చు డు ము వు లు మొదలగునవి.

అనుస్వారము—స్వరము (అచ్చు) ననుసరించి వచ్చునది (సున్న. ఇది రెండు విధములు, పూర్ణము 'అం' ఖండము 'ఁ')

ఔపవిభక్తికములు=నామవిభక్తులకు వెనుక ఆగమాదేశ పూర్వకముగా వచ్చునట్టి 'ఇ-టి-తి' యను వర్ణకములు (ఉ కాలిచేన్, కంటిమంటలు, గోతియందు

లఘువు—తేలికగాఁ బలుకఁబడు వర్ణము. (ఉ క, న, అ, మ మొ)
(ఒకే మాత్రకాలములో నుచ్చరింపఁదగినది. మాత్ర = చిటుక)

గురువు—బరువుగాఁ బలుకఁబడు వర్ణము. (ఉ కం, కా, అక్క మొ)
(రెండుమాత్రల కాలములో నుచ్చరింపఁదగినది)

సూ.-య ర ల వ లు లఘువులనియు, నలఘువులనియు రెండు విధములు. సంధివశమున వచ్చిన యాగమ యకారము లఘువు.

ఉ॥ హరి + అతఁడు = హరియతఁడు. మేన + అత్త = మేనయత్త.

సూ—ఆగమాదులచేఁగాక శబ్దముతోడఁ బుట్టిన యకార మలఘువు

ఉ కాయ-మాయ-చాయ మొదలగునవి.

సూ:—న, ల, లు లఘువులుగాను, ఱ ళ లు అలఘువులుగాను గ్రహింపఁబడును.

ఉ వారు, మీరు, తేరు, కరుగు, పెరుగు మొ. } లఘువులు.
తల, నెల, కల, పాలము, కలము మొ

ఉ విఱుఁగు, మొఱుఁగు, తఱచు, గుఱి, పఱచు మొ } అలఘువులు.
ఉ ఏళులు, పాళులు, త్రాళులు, గోళ్లు మొ.

సూ:—ఇ ఈ ఎ ఏ లను గూడిన చ జ లు తాలవ్యములు.

ఉ చింత-చీమ-చెలి-చేఁప-జిల-జీడి-జెలగ-జేజె.

సూ:—అ ఆ ఉ ఊ ఒ ఓ ఔలంగూడిన చ జలు దంత్యములు.

ఉ చవి-చాప-చుక్క-చూపు-చొక్క-చోటు-చౌక-జముఁడు-జాతర-జున్ను-జూలు-జొన్న-జోలి-జౌకు.

సూ.—యకారమును, వు వూ వొ వో లును, ణ ళలును, దెలుఁగు మాటలకు మొదట లేవు. (స్పష్టము)

సూ:—న (ను) కారము ద్రుతము.

వ్యా ద్రుతమనఁగాఁ జలించునది యని యర్థము. నకార నుకారములు రెండును ద్రుత సంజ్ఞ గలవి. (నానిన్ని, వృక్షమును మొ.)

సూ.—ద్రుతమంతమందుఁ గల పదము ద్రుతప్రకృతికము.

వ్యా॥ ద్రుతసంజ్ఞగల నకారము చివరఁగల పదమునకు ద్రుతప్రకృతికమని పేరు. ప్రథమ, కయి, పట్టి, యొక్క, వీనికంటె నితరములగు విభక్తులు — (నన్నున్-నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్-మాలోపలన్ - మాయందున్) ఉత్తమపురుషైక వచనంబులు (వత్తున్-ఇచ్చెదన్) భూతకాల ప్రథమపురుషైక వచనము — (వచ్చెన్) తద్ధర్మకాల ప్రథమపురుషైక వచనము — (వచ్చున్) ఆశీరర్థకమయిన యెడువర్ణకము...(వచ్చెడున్) - (ప్రసన్నులయ్యెడున్) ఆశీరర్థకమయిన తఱర్ణకము — (కావుతన్) శత్రర్థకము - (కొట్టుచున్) తుమున్నర్థకము-(కొట్టన్-కొట్టఁగన్) అనంతర్యార్థకము-(కొట్టుడున్) చేదర్థకము-(కొట్టినన్) నేను, తాను అను శబ్దములును, వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్, మిగులన్, కడున్, వెంటన్ మొదలగు శబ్దములను ద్రుతప్రకృతికములుగా నూహింపఁదగినవి.

సూ·—ద్రుతప్రకృతికములుగాని శబ్దములు కళలనంబడును.

ప్రథమ, కూర్చి, కయి, పట్టి, యొక్క, సంబోధనములు — (రాముఁడు, వృక్షము, విష్ణువు, గిరులు, కృష్ణునిగూర్చి, గోపాలునకయి(కై), సూర్యునిబట్టి, శివునియొక్క, గోపాలుఁడా! ప్రథమపురుష క్రియాబహువచనము— (వచ్చిరి) ఉత్తమపురుష క్రియాబహువచనము — (వచ్చితివి) మధ్యమపురుషైకవచనక్రియ — (వచ్చితివి) మధ్యమపురుష బహువచనక్రియ— (వచ్చితిరి) కించిదర్థకము-(కొంచెము, ఇంచుక)

ప్రశంసార్థకము-(బాపురే, మజ్జారే, భళి, సెబాసు మొ) ఆశ్చర్యార్థకము—(అయ్యారే, ఔర, అద్దిర, ఓహో, ఆహా మొ) సంతాపార్థకము - (కటకటా, కట్టా అక్కటా, అయ్యో మొ.) యదార్థకము - (ఎప్పుడు) తదార్థకము - (అప్పుడు) కిమర్థకము - (ఏది, ఏమి) ఏవార్థకము - (అ, ఎ, ఏ - రాముఁడ, రాముఁడె, రాముఁడే) క్త్వార్థకము - (గ్రహించి, గ్రహింపక మొ.) కిలార్థకము - (అట, కద, కాద) తూష్ణీమర్థకము - (ఊరక, మిన్నక.) ఆదిశబ్దముచే నింకను మఱి, సుమ్ము, కదా, గాక మొదలగునవి కళలలో గ్రహింపఁబడుచున్నవి. ఇంక అను శబ్దము ద్రుత ప్రకృతికముగా వ్యవహరింపఁబడుచున్నది. చేను, పేను మొదలగు శబ్దముల తుది నుకారము ద్రుతమైనదియుఁ గానిదియుఁ దెలిసికొను మార్గము కలదు. అట్టి నుకారమును దీసివేసినను నర్థము చెడనిచో ద్రుతప్రకృతికమనియుఁ, జెడినచోఁ గళయనియుఁ దెలియవలెను.

## సూ — తత్సమతద్భవదేశ్య గ్రామ్యభేదములచే నాంధ్రభాష నాల్గువిధములు.

**తత్సమము — సూ. సంస్కృత ప్రాకృతతుల్యమగు భాష తత్సమము.**

(సంస్కృత శబ్దములయొక్కయుఁ, బ్రాకృతశబ్దములయొక్కయు, దీర్ఘవిసర్గాదులను శాస్త్రసమ్మతముగా మార్చి, లింగభేదములనుబట్టి విభక్తిప్రత్యయములను జేర్చుటచేఁ దత్సమములగును.)

| సంస్కృతము. | సంస్కృతసమము. | సంస్కృతము. | ప్రాకృతము. | ప్రాకృతసమము. |
|---|---|---|---|---|
| ఉ. రామః | రాముఁడు. | యమః | జమో | జముఁడు. |
| హరిః | హరి. | కటుః | కారో | కారము. |
| ధేనుః | ధేనువు. | రాజ్ఞీ | రాణీ | రాణి. |
| విద్యా | విద్య. | శృంగారః | సింగారో | సింగారము. |
| భూః | భువి. | శ్రీః | సిరీ | సిరి. |
| పితా | పిత. | అగ్నిః | అగ్గీ | అగ్గి. |

**తద్భవము—సంస్కృత ప్రాకృతభవమగు భాష తద్భవము.**

(సంస్కృతమునుండియుఁ బ్రాకృతమునుండియుఁ బుట్టిన భాష తద్భవము. ఇది వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణవ్యత్యయములను నాల్గు విధులచే శాస్త్రప్రకారము మార్పునొంది యాంధ్రమున వాడఁబడును.)

1. వర్ణలోపము - తామరసమ్ - తామర (సకారము లోపించినది.)
2. వర్ణాగమము - రథః - అరదము (అకారము క్రొత్తగాఁ జేరినది.)
3. వర్ణాదేశము- అంగణమ్-అంకణము (గకారమును ద్రోసి కకారము ప్రవేశించినది.)
4. వర్ణవ్యత్యయము - శుచిః - చిచ్చు (సంస్కృతమున నంత్యమగు చివర్ణము ఆంధ్రపదమున నాద్యవర్ణముగా మారెను.)

**దేశ్యము—సూ. త్రిలింగదేశ వ్యవహారసిద్ధమగు భాష దేశ్యము.**

(శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము, వీనిమధ్యనుండు దేశమును త్రిలింగదేశమని చెప్పుదురు. ఇందు వాడఁబడుభాష "త్రిలింగ"మనియుఁ, దెలుఁగనియుఁ, దెనుఁగనియుఁ బిలువఁబడుచున్నది. కొందరు తెనుఁగు త్రినగము పేరునుండి వచ్చినట్లూహింతురు) దేశ్యములు రెండు విధములు. 1. ఆంధ్రదేశ్యములు. 2. అన్యదేశ్యములు.

ఆంధ్రదేశ్యములు— ఊరు-పేరు, ఇల్లు-ముల్లు, కోట-పేట, దూడ-మేడ, కోఁతి-లేఁతి మొ.

అన్యదేశ్యములు— ఇతరదేశములనుండి వచ్చి, వాడుకలోనున్న పదములు.

ఉ రావు, హైరాణము, తిరుచూర్ణము, ఓడారు, శెబాస్, రీవి, రోడ్డు మొ

**గ్రామ్యము—సూ. లక్షణవిరుద్ధమగు భాష గ్రామ్యము.**

(వ్యాకరణసూత్రములచే సాధువుగాక గ్రంథప్రయోగానర్హమైన భాష.)

ఉ వస్తాఁడు - తెస్తాఁడు - వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు.

కొందరు దీనిని నింద్యగ్రామ్యమందురు.

**అనింద్యగ్రామ్యము—సూ. ఆర్యవ్యవహారముల దృష్టము గ్రామ్యము.**

(పెద్దలగు ఆదికవులు తమగ్రంథములయందుఁ బ్రయోగించిన శబ్దము గ్రామ్యమయినను గ్రాహ్యంపఁదగుననుట.)

ఉ కలకంఠుఁడు - ప్రాణగొడ్డము - జీవగట్టు - కపిలకన్నులు - కపిలగడ్డము-కపిల జడలు, దినవెచ్చము మొ )

---

# తత్సమపరిచ్ఛేదము

సూ.— సంస్కృతశబ్దములు తత్సమములుగా మాఱు విధానమును దెలుపు భాగమునకుఁ దత్సమపరిచ్ఛేదమని పేరు.

(తత్సమము = సంస్కృతసమము)

| విభక్తులు. | ప్రత్యయములు | విభక్తులు. | ప్రత్యయములు. |
| --- | --- | --- | --- |
| ప్రథమావిభక్తి | —డు - ము - వు - లు. | పంచమీవిభక్తి | — వలనన్-కంటెన్-పట్టి. |
| ద్వితీయావిభక్తి | —ని - ను - లన్. | షష్ఠీవిభక్తి | — కిన్ - కున్ - యొక్క - లోపలన్ - లోన్. |
| తృతీయావిభక్తి | —చేతన్ - చేన్ - తోడన్ - తోన్. | సప్తమీవిభక్తి | — అందున్ - నన్. |
| చతుర్థీవిభక్తి | — కై - కొఱకున్. | సంబోధన ప్రథమా విభక్తి. | ఓ - ఓయి - ఓరి - ఓసి. |

(విద్యార్థులు విభక్తిప్రత్యయములలోని యంత్య నకారమును విడిచిచదువవచ్చును.

సూ.—శబ్దములునాల్గువిధములు:—1. మహదర్థకములు, 2. అమహదర్థకములు, 3. మహాత్యర్థకములు, 4. మహన్మహాత్యర్థకములు.

మహదర్థకములు:—సూ. పురుషవాచక శబ్దములును, వాని విశేషణములును మహదర్థకములు.

ఉ రాముఁడు-కృష్ణుఁడు-చంద్రుఁడు-నారాయణుఁడు-లోకైకరక్షకుఁడు.

అమహదర్థకములు:—సూ. స్త్రీతిర్యగ్జడ వాచకములును, వాని విశేషణములును అమహదర్థకములు.

(స్త్రీలు-తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) జడములు=అచేతన పదార్థములు. అనఁగా ప్రాణము లేనివి. విశేష్యముయొక్క గుణమును జెప్పునది = విశేషణము.)

ఉ సీత - ద్రౌపది - తార - మండోదరి, సీత, లోకమాత (స్త్రీలు)
గోవు, లేడి, దూడ, గోరంక, చిలుక, కాకి, (తిర్యక్కులు)
పుస్తకము - వృక్షము - గృహము - పర్వతము (జడములు)

మహాత్యర్థకములు:—సూ. స్త్రీవాచక పదములు మహాత్యర్థకములు.
వ్యా—(స్త్రీలను మాత్రమే చెప్పునవి)

ఉ సరస్వతి - పార్వతి - లక్ష్మి - అనసూయ - ద్రౌపది మొదలగునవి

మహన్మహాత్యర్థకములు —సూ స్త్రీపురుషవాచకశబ్దములు మహన్మహాత్యర్థకములు (స్త్రీలను, పురుషులను దెలుపు శబ్దములు)

ఉ అందఱు - ఎందఱు - కొందఱు - పదుగురు - మొదలగునవి.

విశేష్యము —సూ. ఇంద్రియ గోచరములగు చేతనాచేతనముల పేరులు విశేష్యము లనఁబడును.

(విశేష్యము = నామవాచకము. ఇంద్రియ గోచరములు చర్మము - కన్నులు - చెవులు - ముక్కు - నాలుక - మనస్సు - వీనిచేఁ దెలిసికొనఁబడునవి. అచేతనములు = జడపదార్థములు.)

(చర్మముచేఁ దెలియఁదగును) - ఉష్ణము - శీతము.
(కన్నులచే) - పుస్తకము - కలము - చంద్రుఁడు.
(చెవులచే) - ధ్వని - సంగీతము.
(ముక్కుచే) - సుగంధము - దుర్గంధము.
(నాలుకచే) - ఉప్పు - పులుసు - కారము - చేఁదు - ఒగరు - తీపి.
(మనస్సుచే) - కల - సత్యము - అసత్యము - యుక్తము.
(గుణవిశేష్యములు) - నల్లన - తెల్లన - దొంగతనము - మొ.

విశేషణము —సూ విశేష్యము (నామవాచకము)లధర్మములను దెలుపు శబ్దములు విశేషణములు. (లేక నామవిశేషణములు అనిపేరు.)

| విశేషణము — విశేష్యము | విశేషణము — విశేష్యము |
|---|---|
| జాతి విశేషణము—బ్రాహ్మణ-యువతి. | శబ్ద విశేషణము—భీకర-ధ్వని. |
| సంజ్ఞా విశేషణము—కృష్ణ-రావు. | ద్రవ్యవిశేషణము-శ్రీమంతుఁడు-ప్రభువు. |
| రూప విశేషణము—నల్లని-బల్ల. | స్వభావ విశేషణము—సోమరి-పిల్లవాఁడు. |
| రస విశేషణము—పుల్లని-ద్రాక్ష | |
| గంధ విశేషణము—కమ్మని-వాసన. | క్రియాజన్య విశేషణము { పరుగెత్తుచున్న-బాలుఁడు. |
| స్పర్శ విశేషణము—చల్లని-నీరు. | పరుగెత్తిన-బాలుఁడు. |
| సంఖ్య విశేషణము—పది-దిక్కులు. | పరుగెత్తఁగల-బాలుఁడు. |
| పరిమాణ విశేషణము—సోలెడు-పాలు. | పరుగెత్తు-బాలుఁడు |

క్రియావిశేషణము:—సూ. క్రియయొక్క గుణమును జెప్పునది.

ఉ బాలుఁడు వడిగా బరుగెత్తెను. గాలి చల్లగా వీచెను.

తత్సమ శబ్దనిర్ణయము·— సూ. ఋ, ౠ, ఌ, ౡ, ః, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష యను నక్షరములు గల శబ్దములు తత్సమములు.

ఉ॥ ఋషి, ఖరము, ఛత్రము, ఝరము, ఢక్క, ధనము, ఫలము, యశము, వృష్టి మొదలగునవి.

సూ:—ప్ర, పర మొదలగు నుపసర్గలుగల శబ్దములును, యకారము మొదటగల శబ్దములును, స్థిరాక్షరములకు ముందు బిందువుగల శబ్దములును తత్సమములు.

ఉ॥ ప్రకటన, పరాక్రమము, యాచకుఁడు, సింహము, కింశుకము,

సూ.—వృద్ధాదుల ప్రథమావిభక్తి 'డు' వర్ణకము వైకల్పికముగా లోపించును.

ఉ వృద్ధుఁడు-వృద్ధు, మూర్ఖుఁడు-మూర్ఖు, గృహస్థుఁడు-గృహస్థు, నీచుఁడు-నీచు.

సూ:—సంస్కృత ప్రాతిపదికల యంత్యదీర్ఘమునకు హ్రస్వమగు

ఉ రమా-రమ, వనితా-వనిత మొదలగునవి.

సూ.—ఏకాక్షరపదాంత దీర్ఘములకు హ్రస్వము రాదు.

శ్రీ-శ్రీ, స్త్రీ-స్త్రీ.

సూ.—దూతాది శబ్దములు బహుళముగా స్త్రీలింగతుల్యము లగును.

ఉ॥ దూతుఁడు-దూత, కుంఠుఁడు-కుంఠ, యోధుఁడు-యోధ.

సూ.—సురశబ్దము నిత్యముగను, నసురశబ్దము వైకల్పికముగను స్త్రీలింగతుల్య మగును.

(స్వర్గవాసియగు సురశబ్దమునకు మాత్రము ఏకవచనప్రయోగము లేదు.)

ఉ॥ (1) సురలు (2) అసురుఁడు, (3) అసుర.

సూ:—మిత్ర, శరణ, పాత్రాది మహద్వాచక శబ్దములు వైకల్పికముగాఁ బుంలింగతుల్యము లగును.

ఉ మిత్రము-మిత్రుఁడు, శరణము-శరణుఁడు, పాత్రము-పాత్రుఁడు.

సూ.—చరిత్రాది శబ్దముల ము వర్ణకము బహుళముగా లోపించును

ఉ చరిత్రము-చరిత్ర, అభిలాషము-అభిలాష, స్ఫురణము-స్ఫురణ బహుళము గా లోపించు ననుటచే పనస, దర్భ మొదలగుపదముల ము వర్ణకము నిత్యముగా లోపించును.

సూ.—కంధరాదిసంస్కృత స్త్రీలింగశబ్దములు బహుళముగా నపుంసకలింగ సమము లగును.

ఉ॥ కంధర-కంధరము, నాసికా, భిక్షా, గ్రీవా, ఉల్కా, పాదుకాదులు కంధరాదులు. ఇట బహుళమని చెప్పుటచే విధాశబ్దమునకు విధము అను క్లీబత్వ తుల్యత్వ రూపము నిత్యము.

సూ:—ము వర్ణకమునకు ద్విత్వబిందుపూర్వక బు వర్ణంబులు వైకల్పికముగా వచ్చును.

ఉ వృక్షము, వృక్షమ్ము, వృక్షంబు.

సూ: — ఉకారాంత ప్రాతిపదికములకు వు వర్ణకము వచ్చును.

ఉ॥ తరువు, ధేనువు.

సూ:—మహద్వాచకముల యుకారమునకు మాత్రము వు వర్ణకము బహుళముగా నగును.

ఉ॥ విష్ణువు-విష్ణుఁడు, గురువు-గురుఁడు. బహుళ మనుటచే మనువు, వటువు మొదలగు శబ్దములకు డు వర్ణకము రాదు.

సూ.—ఋకారాంతపదములు తెనుఁగున స్త్రీలింగతుల్యము లగును.

ఉ॥ ధాతృ-ధాత, భ్రాతృ-భ్రాత, మాతృ-మాత, కర్తృ-కర్త. (మహద్వాచకములు వైకల్పికముగాఁ స్త్రీలింగతుల్యము లగు. ఉ॥ధాత-ధాతృఁడు, భ్రాత-భ్రాతృఁడు)

సూ —భూ, భ్రూ, ద్యు, హృత్, నౌ శబ్దములు భువి, భ్రూవు, దివి, హృది, నావ యను రూపములుగాఁ దెనుఁగున నగును.

సంస్కృత ప్రాతిపదికల తుదిహల్లునకు, ద్విత్వమును ఉకారమును నగును.

ఉ రాట్-రాట్టు, మరుత్-మరుత్తు, దిక్-దిక్కు.
వాక్-వాక్కు-వాకు, విరాట్-విరాట్టు-విరాటు.

సూ:—నకారాంత సంస్కృతశబ్దముల ప్రథమైకవచన తుల్యరూపములే తెనుఁగున ప్రాతిపదికము లగును.

(పిమ్మట వానికి, వైకల్పికముగా డు ము వు లేర్పడును.)

ఉ సుధన్వన్-సుధన్వా-సుధన్వ-సుధన్వుఁడు, కర్మన్-కర్మ-కర్మము.

సూ —విశ్వకర్మాది నకారాంత శబ్దములు నిత్యముగాన్ స్త్రీలింగ తుల్యములగును.

ఉ॥ విశ్వకర్మ, అశ్వత్థామ, కృష్ణవర్త్మ మొ॥

సూ —గుణవర్గణములోని మకారము లోపించిన పదములకు డు, ము, వు అను ప్రత్యయములు వచ్చును.

ఉ॥ (1) గుణవత్, గుణవంతమ్, గుణవంత, గుణవంతుఁడు, గుణవంతము, గుణవతి. ఆట్లే (2) శ్రీమంతుఁడు, శ్రీమంతము, శ్రీమతి. (3) విద్వాంసుఁడు, విద్వాంసము, విదుషి. (4) శ్వానము, శుని.

సూ —మహదాద్యాచకముల మతుప్ తకారమునకు 'ఆన' వైకల్పికముగా నగును.

ఉ ( ) హనుమంత్-హనుమానుఁడు. (2) భగవంత్-భగవానుఁడు.

సూ·—సకారాంతశబ్దముల తుది సకారమునకు లోపము బహుళముగా నగును.

ఉ ధనవు-ధనుస్సు, వక్షము-వక్షుస్సు, ఆయువు-ఆయుస్సు, ఉరము-ఉరస్సు, అర్చి-అర్చిస్సు. బహుళమనటచే పయస్, వయస్, సరస్ అను పదములకు సకార లోపము లేదు. కావున పయస్సు, వయస్సు, సరస్సు అనురూపములు సిద్ధించుచున్నవి.

1. మనస్-మనస్సు-మనసు-మనము. 2. శిరస్-శిరస్సు-శిరసు-శిరము.
వేధస్-వేధ, పురోధస్-పురోధ-పురోధసుఁడు.
(సకార లోపమునకు పై విధముగ వైకల్పికరూపము లేర్పడుచున్నవి.)

సూ.—తెనుఁగుపదములలోని కొన్నిరకముల రూపాంతరములను గమనింపనగును.

ఉ ఆరాటము-అరటము, కేళాకూళి-కేళకుళి, కొమారిత-కొమరిత, ఓయారము-ఒయారము, గోరువంక-గొరువంక, నీలుగు-నిలుగు, వీడియము-విడియము, నల్లేరు-నల్లెరు, కుందేలు-కుందెలు, మారేడు-మారెడు, వస్తువు-వస్తుర్, ప్రమానుపడు-ప్రమాన్పడు, కినుక-కిన్క, చిలుక-చిల్క, కొలువ-కొల్వ, కలికి కల్కి, ములికి-ముల్కి, గొంతియ-గొంతిక, కన్ను-కను, అక్కట-అంట, చెమ్మట-చెమట, నీలుగు-ఈలుగు, పొందు-ఒందు, లొట్టిపిట్ట-లొటిపిట, పాడఱము-అడపము, పారివళము-అరివళము, సింహము-సింగము, సంజిణి-సింగిణి, చిగురు-చివురు, వేగురు-వేవురు, పగడము-పవడము, అయిదు-ఐదు, అవును-ఔను, దొంగ-డొంగ, దాఁగు-డాఁగు జాదము-జాజము, జవాది-జవాజి, బ్రదుకు-బ్రతుకు, ఉదుకు-ఉతుకు, అడఁగు-అణఁగు, వడఁకు-వణఁకు.

---

# సంధిపరిచ్ఛేదము (తెలుఁగు సంధులు)

1. అచ్ సంధి, 2. ద్రుత ప్రకృతికసంధి, 3. ఆమ్రేడిత సమాససంధులు, 4 య ర న పుంప్వాగమ సంధులు.

సూ:—ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు.

వ్యా. "ఉత్తు" "అత్తు" లోనగువాఁనిలో నున్న తకారమును దపరకరణ మందురు. ఈ తకారమునకుఁ బూర్వాక్షరము హ్రస్వమైనచో హ్రస్వమునకే గ్రహణము. దీర్ఘాక్షరమైనచో దీర్ఘాక్షరమునకే గ్రహణము. సూత్రమున ఉకారమని చెప్పినచో హ్రస్వదీర్ఘోకారములు గ్రహింపవలసి వచ్చును. "ఉత్తు" అని చెప్పుటచే హ్రస్వోకారమునకే గ్రహణము. దీనినే సంస్కృతమున ఇత్సంజ్ఞక మందురు.

సూ:—పూర్వపరస్వరములకుఁ బరస్పర మేకాదేశ మగుట సంధి యనంబడును.

వ్యా. రెండు పదము లొకటిగాఁ గలియునపుడు మొదటిపదము తుదియచ్చు పోయి, యా స్థానమున రెండవపదముయొక్క మొదటియచ్చు నిలుచుట సంధి యనఁబడును. పూర్వస్వరము = మొదటి యచ్చు. పరస్వరము = పిమ్మటి యచ్చు. ఏకాదేశము = ఒక యక్షరము మఱియొకయక్షరమును ద్రోసి వచ్చుట.

ఉ॥ రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు. | వాఁడు+ఉండెను=వాఁడుండెను.
బాలుఁడు+ఇతఁడు=బాలుఁడితఁడు. | ఇతఁడు+ఎవఁడు=ఇతఁడెవఁడు?

వ్యా. రాముఁడ్+ఉ+అతఁడు. ఇందు డ్ పైని ఉకారము పూర్వస్వరము. అతఁడను పదమునందలి మొదటి అకారము పరస్వరము. ఈ రెండును గలియునపుడు పూర్వస్వరమగు 'ఉకారము' పోయి దాని స్థానమునఁ బరస్వరమగు 'అకారము' వచ్చెను.

సూ:— ప్రథమేతర విభక్తి శత్రర్థ చు వర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు.

వ్యా. ప్రథమావిభక్తికంటె నితరములగు విభక్తుల తుదియుకారమునకును, వర్తమానకాలక్రియయొక్క కడపటి చువర్ణమునందలి యుకారమునకును సంధి వైకల్పికము = సంధి కలసి యొకరూపము, సంధి కలియక మఱియొక రూపము.

ఉ॥ నన్నున్ + అడిగె = నన్నడిగె, నన్నునడిగె. —(ద్వితీయావిభక్తి)
నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె. —(చతుర్థీవిభక్తి)
నాకున్ + ఆదరువు = నాకాదరువు, నాకు నాదరువు. —(షష్ఠీవిభక్తి)
చూచుచున్ + ఏగెను = చూచుచేగెను, చూచుచు నేగెను. —(శత్రర్థకము)

సూ:—ద్విత్వరహితమగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరమైనను సంధిరాదు.

ఉ॥ నను + ఎఱిఁగె = నను నెఱిఁగె, నిను + ఎఱిఁగె = నిను నెఱిఁగె మొ॥

యడాగమసంధి—సూ. సంధిలేనిచో స్వరంబుకంటెఁబరంబగు స్వరంబునకు యడాగమం బగు.

ఉ॥ 1 మా + అమ్మ = మాయమ్మ, 2. మీ + ఇల్లు = మీయిల్లు.
(సంధి కలియనిచోట నచ్చుకంటెఁ బరంబైన యచ్చునకు "యట్" యనునది యాగమముగా వచ్చును. (యట్ లోని టవర్ణము ఇత్సంజ్ఞకము. యకారములోని అకారము ఉచ్చారణ సౌకర్యార్థము గ్రహింపఁబడినది. కావున "యడాగమములో గ్రహింపఁదగినది" 'య్' మాత్రమే. మా+ య్+ అమ్మ = మాయమ్మ.)

అకారసంధి—సూ. అత్తున కచ్చు పరంబగునపుడు సంధి బహుళము.

ఉ॥ మేన + అత్త = మేనత్త (సంధికలిసినది) మేనయత్త (సంధి లేక యడాగమము)
పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు (సంధి) పుట్టిన యిల్లు (యడాగమము)

హ్రస్వమైన అకారమునకు సంధి బహుళముగా నగును. బహుళమనఁగా 1. సంధి నిత్యముగా వచ్చుట, 2. సంధిరాకుండుట, 3. సంధివచ్చి యొకరూపమును రాక మఱియొక రూపమును గలుగుట, 4. ఆయా విధిసూత్రములలోఁ జెప్పిన స్థలమునఁ గాక యితరస్థలమున వచ్చుట.

సూ:—బహుళగ్రహణముచే స్త్రీవాచక తత్సమసంబోధనావధారణాంతములకు సంధి లేదు.

(స్త్రీవాచకము)—అమ్మ+ఇచ్చెను=అమ్మయిచ్చెను.
(తత్సమము)—హంస+ఏది=హంస యేది.
(సంబోధనము)—బాలుఁడ+ఇటురమ్ము = బాలుఁడ యిటురమ్ము.
(అవధారణము)—గోపాలుఁడ+ఇతఁడు=గోపాలుఁడ యితఁడు.

అవ+అంత=అవంత
గంగ+అనుకొని = గంగనుకొని.
శ్రీరంగధర్త+అంచు=శ్రీరంగధర్తంచు.
} బహుళగ్రహణముచే ఈ ప్రయోగములలో మాత్రము సంధి నిత్యముగా వచ్చినది.

అమ్మ+ఇచ్చెను=అమ్మయిచ్చెను-హంస+ఏది=హంసయేది?
బాలుఁడ+ఇటురమ్ము=బాలుఁడ యిటురమ్ము.
గోపాలుఁడ+ఇటురమ్ము=గోపాలుఁడ యిటురమ్ము.
} సంధిరాకయడాగమము వచ్చినది.

వెల+ఆలు = వెలయాలు—పుట్టిన+ఇల్లు=పుట్టినిల్లు,పుట్టినయిల్లు
చూడక+ఉండెను=చూడకుండెను, చూడకయుండెను.
} వచ్చుట, రాకపోవుట రెండు రూపములు.

తామర+ఆకు=తామరపాకు
ఒక+ఒక=ఒకానొక.
} పవర్ణము, దీర్ఘము, నకారము లక్షణములోఁ జెప్పఁబడిన దానికంటె నన్యముగుటఁ జేసి బహుళగ్రహణము సార్థకము.

సూ.—శ్రేష్ఠతావాచకములగు నార్యాంబాద్యర్థకపదములు పరములగునపుడు సర్వాచ్చులకును సంధి నిత్యము.

ఉ॥ రామయ్య, భీమయ్య, వెంకమ్మ, వీరమ్మ మొ. (రామ+అయ్య=రామయ్య.)
ఆదిశబ్దముచే లక్ష్మన్న, గంగన్న, సీతక్క, వెంకప్ప మొ॥ గ్రామ్యములు.

ఇకారసంధి:—సూ. ఏమ్యాదుల యిత్తులకు సంధి వైకల్పికముగానగు.
(అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, మఱి, కి షష్ఠి లోనగునవి యేమ్యాదులు.)

ఉ॥ ఏమి+అంటివి=ఏమంటివి, ఏమియంటివి.
మఱి+ఏమి=మఱేమి, మఱియేమి.
హరికిన్+ఇచ్చె=హరికిచ్చె, హరికినిచ్చె.
} సంధివచ్చి యొకరూపము. సంధిరాక మఱియొకరూపము.

సూ:—మధ్యమపురుష క్రియలయందలి యికారమున కచ్చుపరమగునపుడు సంధియగును.

ఉ॥ కొట్టితివి+అపుడు=కొట్టితివపుడు-ఏలితి+ఇపుడు=ఏలితిపుడు.
చెప్పితిరి+అపుడు=చెప్పితిరపుడు.
} నిత్యసంధి.

సూ:—ప్రథమోత్తమ పురుష క్రియల యికారమున కచ్చుపరం బగు నపుడు సంధి వైకల్పికముగా నగును.

ఉ॥ వెడలిరి+అపుడు = వెడలి రపుడు, వెడలిరి యపుడు.
వచ్చితిమి+ఇపుడు = వచ్చితి మిపుడు, వచ్చితిమి యిపుడు.

సూ:—క్త్వార్థకమై హ్రస్వమైన యికారమునకు సంధి లేదు.

ఉ॥ వచ్చి+ఇచ్చెను=వచ్చి యిచ్చెను. (వచ్చిచ్చె ననరాదు.)

సూ:—ఇ ప్రత్యయాంతావ్యయమునకు సంధియుం జూపట్టెడి.

ఉ॥ "ఎఱంగ ఱెంగి నా వలు విడియేల కట్టకొని వచ్చును దానవి." భాగ. ఇందు ఎఱంగి+ఎఱంగి=ఎఱంగఱెంగి (క్త్వార్థేత్తునకు సంధి కలిసినది)

సూ:—అచ్చున కామ్రేడితము పరమగునపుడు సంధి తఱచుగ నగు.
(ఒక శబ్దమును రెండుమాఱు లుచ్చరింపఁగా నందు రెండవమా టుచ్చరింపఁబడుదాని కామ్రేడిత మని పేరు.)

ఉ॥ ఔర+ఔర=ఔరౌర (ఇందు రెండవశబ్దము ఆమ్రేడితము.)
ఏమి+ఏమి=ఏమేమి, ఏమి యేమి (ఇట వైకల్పికసంధి.)
ఏగి+ఏగి = ఏగి యేగి (ఇచ్చట క్త్వార్థకమగుటచే సంధిలేదు.)

దీర్ఘాత్సంధి:—సూ. దీర్ఘాక్షరములకు, ఎ-ఒ లకును సంధి లేదు.

ఉ॥ మా+అమ్మ=మాయమ్మ
ఈ+ఊరు=ఈయూరు
ఊ+అనెను=ఊయనెను
ఓ+అమ్మ = ఓయమ్మ
ఒంటె+అదిగో—ఒంటెయదిగో
ఏలాగా+అనెను=ఏలాగాయనెను.

సూ:—పదము మొదటనుండు ఋ ఌ అను నక్షరములు క్రమముగా ర ల యను హల్లుల వంటివై సంధికార్యములను బొందనేరవు.

ఉ॥ అ+ఋషి ఆ ఋషి.
అతఁడు+ఋషి—అతఁడు ఋషి
} సంధి జరుగలేదని యడాగమమైనను రాలేదు.
(ఋ, ఌ అను నక్షరములు ర, ల యను హల్లులవంటివగుటచే ర, ల లు పరమైనపుడు జరుగు కార్యములు ద్విత్వలోప సంశ్లేషాదులు ఋ ఌ లు పరమైనపుడును జరుగును. వచ్చెను+ఋషి = వచ్చెన్ ఋషి, వచ్చె ఋషి మొ.)

సూ:—అందు అవ యనునవి తప్ప మిగిలిన ఎదు పదములు పరమగు నపు డన్నియచ్చులకు సంధి నిత్యముగా వచ్చును.

ఉ॥ చేసి+ఎఁడు=చేసెఁడు
పుట్టి+ఎఁడు=పుట్టెఁడు
వీసె+ఎఁడు=వీసెఁడు.
ఓసర+ఇంచు=ఓసరించు.
(అంద్వవగాగమంబులందు మాత్రము కొన్నిచోట్ల సంధి వైకల్పికముగను, మఱికొన్నిచోట్ల సంధి జరుగకుండుటయుఁ గలదు గానఁ బ్రయోగానుసారము గ్రహింపవలెను)

ఉ॥ ఎనిమిదవ-ఎనిమిదియవ, రాము లందున్-రాము లయందున్ మొ.

సూ:—కొలఁదను దెలుపు (నేకవచన) ఏఁడు వర్ణకము పరంబగునపుడు పదముల తుదినుండు లివర్ణంబు లోపించును.

ఉ॥ కమికిలి + ఏఁడు = కమికేఁడు, దోసేఁడు, పిడికేఁడు, సంచేఁడు మొ.

ద్రుతప్రకృతిక సంధి:—సూ. ద్రుత ప్రకృతికముల కచ్చు పరమయి నపుడు సంధిరాదు.

ఉ॥ వండన్ + ఏగ = వండనేగ
ఇచ్చున్ + ఇపుడు = ఇచ్చునిపుడు
చేయన్ + అరిగె = చేయనరిగె.
పోవన్ + ఐతి = పోవనైతి.

సూ:—ఇఁకన్, ఎట్టకేలకున్ మున్నగువాని ద్రుతమున కచ్చు పరమైనపుడు సంధి వైకల్పికముగా నగును.

ఉ ఇకన్ + ఐనన్ = ఇంకైనన్, ఇఁకనైనన్. ఎట్టకేలకున్ + ఇచ్చెను = ఎట్టకేలకిచ్చెను, ఎట్టకేలకు నిచ్చెను.

ద్విరుక్తటకారాదేశసంధి — సూ. కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల ఱ డ ల కచ్చు పరమగునపుడు ద్విరుక్తటకారమగు.

ఉ॥ కుఱు + ఉసురు = కుట్టుసురు
చిఱు + ఎలుక = చిట్టెలుక
నిడు + ఊరుపు = నిట్టూరుపు
కడు + ఎదురు = కట్టెదురు.
నడు + ఇల్లు = నట్టిల్లు.

వ్యా. కుఱు, చిఱు, కడు, నడు, నిడు అను పదముల తుదనున్న ఱ డ లకు నచ్చు పరమగునపుడు ద్విత్వటకార మగును. (కుఱు + ఉసురు) ఇచ్చట 'కుఱు' అను పదములోని శకటరేఫకు ద్విత్వటకారము వచ్చును. కుట్ + ట్ + ఉ = కుట్టు + ఉసురు = కుట్టుసురు, చిట్టెలుక, చిట్టాముదము, చిట్టడవి మొదలగువానిలోని పూర్వపదము, చిట్టి శబ్దమని ప్రౌఢవ్యాకరణకారుని మతము.

గ, స, డ, ద, వా దేశసంధులు:—సూ. ద్వంద్వసమాసమునఁ బదము మీఁది పరుషములకు గ స డ ద వ లగు.

ఉ కూర + కాయ = కూరగాయలు
టక్కు + టెక్కు = టక్కుడెక్కులు
ఊరు + పల్లె = ఊరువల్లెలు
కాలు + చేయి = కాలుసేతులు
తల్లి + తండ్రి = తల్లిదండ్రులు

వ్యా. ద్వంద్వసమాసమునందు మొదటిపదము తరువాతఁ గల్గు పరుషములకు (కచటతప) గసడదవలు గల్గును కొన్నిచోట్ల గ స డ ద వా దేశము గలుగక మొదటి పదము తుదిహ్రస్వమునకు దీర్ఘము కాస్త్రియముగాఁ గానుపించుచున్నది. అప్పా చెల్లెండ్రు మొదలయినవి. కొన్నిచోట్ల దీర్ఘమును, గ స డ ద వా దేశమును గలుగుచున్నవి.

ఉ॥ అన్నాదమ్ములు, తల్లీదండ్రులు మొ.

సూ:—ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వలు బహుళముగా నగును.

ఉ. వాఁడు+కొట్టె=వాఁడుగొట్టె, వాఁడుకొట్టె.
అపుడు+చనియె=అపుడుసనియె, అపుడుచనియె.
నీవు+టక్కరివి = నీవుడక్కరివి, నీవుటక్కరివి.
అతఁడు+తాకెను=అతఁడుదాకెను, అతఁడుతాకెను
వారు+పోయిరి = వారువోయిరి, వారుపోయిరి.

(అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అను నవ్యయములు ప్రథమావిభక్తితుల్యములును నిత్యైకవచనాంతములు నగు.)

వ్యా. గ స డ ద వా దేశము కళలగు క్రియాపదములయందు సైతము కానవచ్చుచున్నది.

ఉ. వచ్చుచున్నాఁడు+గదా = వచ్చుచున్నాఁడుగదా, వచ్చుచున్నాఁడుకదా.

సూ:— తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వలు రావు.

వాఁడు+కౌమారి=వాఁడు కౌమారి.
వీఁడు+చక్రపాణి=వీఁడుచక్రపాణి.
ఆయది+టంకారము = ఆయది టంకారము.
వాఁడు+తపస్వి=వాఁడు తపస్వి.
అతఁడు+పావకుఁడు=అతఁడు పావకుఁడు.

(తెనుఁగుశబ్దముల తరువాత వచ్చిన సంస్కృతపదముల ప్రథమాక్షరములగు క చ ట త ప లకు, గ స డ ద వలు రావు. ప్రాసములందు మాత్రము క త ప లకు, గ ద వ లు లాక్షణిక ప్రయోగములందుఁ జూపట్టుచున్నవి)
ఉ. వీరల్గోపించిన వంతకుండుఁ జెడు:—ఉ. హరివంశము.

ద్రుతపరుషసంధి:—సూ. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు.

ఉ వచ్చెను + కంజాక్షుఁడు = వచ్చెను గంజాక్షుఁడు. (క-గ)
తోఁచెను + చంద్రుఁడు = తోఁచెను జంద్రుఁడు. (చ-జ)
చేసెను + టంకారము = చేసెను డంకారము. (ట-డ)
నములెను + తములము = నములెను దములము. (త-ద)
వచ్చెను + పావని = వచ్చెను బావని. (ప-బ)
(ద్రుతమంతమందుగల పదములమీఁది పరుషములకుఁ (క చ ట త ప) క్రముగా సరళములు (గ జ డ ద బ) కలుగును.

ద్రుతాదేశసరళసంధి:—సూ. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు.

ఉ వచ్చెను గంజాక్షుఁడు (స్వత్వరూపము. ప్రకృతిభావము.)
వచ్చెం గంజాక్షుఁడు (బిందురూపము. ద్రుతిలోపము.)
వచ్చెఁ గంజాక్షుఁడు (అర్ధబిందు రూపము. ద్రుతలోపము)
వచ్చె న్గంజాక్షుఁడు (సంశ్లేషరూపము. ద్రుతము మీఁది హల్లుతోఁ గూడినది)

వ్యా. (ఆదేశముగా వచ్చిన గ జ డ ద బ లకుఁ బూర్వమునున్న ద్రుతమునకు బిందువును (నెఱసున్న, అఱసున్న) సంశ్లేషమును, (మీఁదిహల్లుతోఁ గూడుకొనుటయు) వైకల్పికముగానగు. మఱియొక పక్షమునఁ బైదానికి స్వత్వరూపమును సంభవించును.

సూ.—కొండొకచో ద్రుతముమీఁద నొండొక ద్రుతంబునుం గానంబడియెడి.

ఉ వాలిని + చంపెను = వాలిని జంపెను, వాలిని జంపెను.

ద్రుతసరళసంధి:—సూ. ద్రుతమునకు సరళస్థిరములు పరములగునపుడు లోపసంశ్లేషములు విభాషనగు.

ఉ వచ్చెను + జలజాక్షుఁడు = వచ్చెజలజాక్షుఁడు (ద్రుతలోపము.)
— — = వచ్చె జ్జలజాక్షుఁడు (సంశ్లేషరూపము )
— — = వచ్చెను జలజాక్షుఁడు (స్వత్వరూపము.)
(కొన్నిచోట్ల బిందురూపము వచ్చెం జలజాక్షుఁడు సైతము కానంబడుచున్నది.)
మెఱసెను + ఖడ్గము = మెరసె ఖడ్గము (గ్రుతలోపము.)
— — = మెఱసెన్ఖడ్గము (సంశ్లేషరూపము)
— — = మెఱసెను ఖడ్గము (స్వత్వరూపము.)

సూ:—తాను నేను పదముల ద్రుతమునకు సంశ్లేషములేదు.

ఉ తాను + చదివె = తాఁజదివె, తాను జదివె
నేను + కొట్టితి = నేఁగొట్టితి, నేను గొట్టితి
} తాజ్జదివె, నేగ్గొట్టితి. ఈప్రయోగములు దుష్టములు.

వ్యా. దీర్ఘము మీఁదిదికాన దీనికి సాధ్యపూర్ణము లేదు. దీర్ఘాక్షరమునకు దరువాత నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలెనుగాని వ్యాకరణముచే సిద్ధింపనేరదు. ద్రుతస్థానమున నర్ధబిందువు మాత్రమే యుండును.

సూ:—సమాసములందు ద్రుతమునకు స్వత్వములేదు.

సమాసములయందు (ఉ॥ చిగురుసు గైదువు) ఇత్యాది నకారస్వత్వరూపము లేదు.

సూ.—తలఁబ్రాలు మున్నగు సమాసముల ద్రుతమునకులోపములేదు.

(ఎల్లయర్థములు మొదలగు సమాసములందువలె తలఁబ్రాలు మొదలగు సమాసముల ద్రుతమునకు లోపములేదు.)

ఉ॥ తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు-సేసఁబ్రాలు - ఊరఁబంది - ఊరఁబిచ్చుక - తోడఁబుట్టువు-తోఁబుట్టువు-ఒల్లఁబాటు-ఒడఁబాటు-మొ.

టుగాగమసంధి·—సూ. కర్మధారయమునందుత్తునకచ్చుపరమగునపుడు టుగాగమ మగు.

ఉ॥ కఱకు+ఎఱుకు=కఱకు టెఱుకు
సరసపు+అలుక = సరసపుటలుక
} నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము.
కఱకు + అమ్ము = కఱకుటమ్ము.

సూ.—కర్మధారయమునఁ బేర్వాది శబ్దముల కచ్చు పరమగునప్పుడు టుగాగమము విభాషగా నగు.

ఉ॥ పేరు+ఉరము=పేరు టురము, పేరురము
చిగురు+ఆకు=చిగురుటాకు, చిగురాకు
పొదరు+ఇల్లు=పొదరు టిల్లు, పొద రిల్లు

1. విభాషచే టుగాగమము.
2. ఉకారసంధి ఆయెను.

రేఫాగమ సంధులు:—సూ. పేదాదిశబ్దముల కాలుశబ్దము పర మగునపుడు కర్మధారయమునందు రుగాగమ మగు.

ఉ 1. పేద+ఆలు (పేద+ర్+ఆలు) = పేదరాలు, 2. బీద + ఆలు = బీదరాలు.
(పేద - బీద - ముద్ద - బాలెంత - కొమ-జవ - అయిదువ-మొదలగునవి పేదాదులు. జవ్వని శబ్దమున కాలు శబ్దము పరమగుచో జవాదేశ మగును. రుక్ అను ఆగమము రుక్కు కిత్తుగావున శబ్దమునకు నంత్యావయవముగా వచ్చునని తెలియునది)

సూ:—ఉకారాంతముల కాలుశబ్దము పరమగుచో రుగాగమము బహుళముగా వచ్చును.

ఉ॥ జోగు + ఆలు = జోగురాలు. (రుగాగమము వచ్చినది.)
ఇల్లు + ఆలు = ఇల్లాలు (రుగాగమము రాలేదు.)
చూలు + ఆలు = చూలాలు. (అంత్యవర్ణలోపము. ఉకారసంధి ప్రాప్తించినది.)
అంకు + ఆలు = అంకుటాలు. (రుగాగమమునకు మాఱుగ సూత్రవిరుద్ధమైన టుగామము.)

సూ:—కర్మధారయమునఁ దత్సమముల కాలు శబ్దము పరమగునపు డత్వమున కుత్వమును రుగాగమము నగు.

ఉ 1. ధీర + ఆలు = ధీరురాలు, 2. గుణవంత + ఆలు = గుణవంతురాలు.
(ఇచ్చట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము. ధీరశబ్దము తత్సమము. ఆ కార ణమున నత్వమున కుత్వమును, రుగాగమమును గలిగెను)

పుంప్వాదేశసంధి:—సూ. కర్మధారయమునందు మువర్ణమునకుఁ బుంపు లగు.

ఉ॥ సరసము + మాట = సరసపుమాట, సరసంపుమాట.
విరసము + వచనము = విరసపువచనము, విరసంపు వచనము.

సూ:—సమాసంబుల నాము కనుమ్వాముల మువర్ణంబులు పఙ్ పవర్ణంబులగు.

ఉ॥ పాము + జన్నిదము = పాఁపజన్నిదము (నాము + చేను = నాఁపచేను.)
అమ్ము + వాన = అంపవాన, వేఁపకాయ, కసుపవులు మొ॥

నుగాగమసంధులు:—సూ. ఉదంత తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమ మగు.

వ్యా. ఉకారమంతమందుఁగల తద్ధర్మార్థక విశేషణమునకు అచ్చు పరమగుచో నుగాగమము (న్ అను వర్ణము) కలుగును.

ఉ॥ చేయు + ఇతఁడు = చేయు నితఁడు.
కొట్టెడు + అతఁడు = కొట్టెడు నతఁడు. } నుగాగమము వచ్చినది.

సూ:—షష్ఠీ సమాసమున ఉకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమమగు.

ఉ॥ రాజుయొక్క + ఆజ్ఞ = రాజు నాజ్ఞ. (రాజు ఉకారాంతపదము)
విధాతయొక్క + ఆనతి = విధాతృ నానతి. (విధాతృశబ్దము ఋకారాంతము.)

వ్యా. కొన్నిచోట్ల షష్ఠీసమాసమందు ఉకారమున కచ్చు పరమగునపుడు నుగాగమ లోపము గన్పట్టుచున్నది.

ఉ॥ శిరసు + అందంబు = శిరసందంబు ఉ శిర సందంబరయన్-కళా. పూ.

సూ:—ఉదంత స్త్రీసమములకును, బుంపులకును, నదంతగుణవాచకంబులకును దనము పరమగునపుడు నుగాగమ మగు.

ఉ॥ సొగసు + తనము = సొగసుందనము, సొగసుఁదనము, సొగసున్దనము.
పరసపు + తనము = పరసపుందనము, పరసపుఁదనము పరసపున్దనము.
తెల్ల + తనము = తెల్లందనము, తెల్లఁదనము, తెల్లన్దనము.

వ్యా. హ్రస్వమైన ఉకారము అంతమందుఁగల స్త్రీసమ పదములకును, (సొగసు) పుంపులకును (పరసపు) హ్రస్వాకార మంతమందుఁగల గుణవాచక పదములకును (తెల్ల) తన శబ్దము పరమగునపుడు నుగాగమము కలుగును.

నుగాగమసంధి:—సూ. సమాసముల నుదంతములగు స్త్రీసమములకును బుంపులకును బరుష సరళములుపరములగునపుడు నుగాగమ మగు.

వ్యా. ఇచటఁ బరుషములు పరములగుచో ద్రుతమునకు బిందుసంశ్లేషములచే మూఁడు రూపములును, సరళములు పరములగుచో లోపసంశ్లేష పూర్ణబిందువులచే మూఁడు రూపములును సిద్ధించుచున్నవి.

ఉ॥ చిగురు + కయిదువు = { చిగురుం గయిదువు. (బిందురూపము)
చిగురుఁ గయిదువు. (అర్ధబిందురూపము)
చిగురు న్గయిదువు. (సంశ్లేషరూపము)

తళుకు + గజ్జెలు = { తళుకు గజ్జెలు. (ద్రుతలోపరూపము) / తళుకు న్గజ్జెలు. (సంశ్లేష రూపము) / తళుకుం గజ్జెలు. (పూర్ణబిందురూపము) }

సింగపు + కొదమ = { సింగపుం గొదమ. (పూర్ణబిందురూపము) / సింగపుఁ గొదమ. (అర్ధబిందురూపము) / సింగపు న్గొదమ. (సంశ్లేషరూపము.) }

ప్రాఁతాదిసంధులు —సూ. సమాసమునఁ బ్రాఁతాదుల తొలియచ్చు మీఁదివర్ణములకెల్ల లోపము బహుళముగా నగు.

ఉ ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు, ప్రాఁత యిల్లు. / లేఁత + దూడ, = లేదూడ, లేఁతదూడ. } ఇట త వర్ణము వైకల్పికముగ లోపించెను.

వ్యా. సమాసమునఁ బ్రాఁత మొదలగువాని మొదటియచ్చు పిమ్మటి యక్షరమునకు లోపము బహుళముగానగును. ఇందు (ప్రాఁత)లో మొదటి యచ్చగు 'ఆ' కుఁ దరువాతనున్న త వర్ణము అర్ధబిందు సహితముగా లోపించును.

సూ:–లుప్తశేషమునకుఁబరుషములు పరములగునపుడు నుగాగమమగు.

ఉ॥ ప్రాఁత + కెంపు = ప్రాఁగెంపు, ప్రాఁత కెంపు / లేఁత + కొమ్మ = లేఁగొమ్మ, లేఁతకొమ్మ. / పూవు + తోట = పూఁదోట, పూవుతోట. / కాను + తీఁగ = కాఁదీఁగ, కానుతీఁగ. } (పూర్వ సూత్రముచే అర్ధబిందు సహిత తకారము లోపింపఁగా మిగిలిన ప్రా యనుదానికి నుగాగమము వచ్చి ప్రాను + కెంపు అగును. సమాసమున ద్రుతమునకు స్వత్వము లేకపోవు టచే 'ప్రాను గెంపు' అనురూపమును, దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదను టచే 'ప్రాంగెంపు' అను రూపమును, సంధిపదములలో నేకాచ్చు మాత్రమే యుండుటచె సంశ్లేషరూపమును రానేరదు.)

సూ.–క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషమునకుఁ గొన్నియెడల నుగాగమ మును, గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వమును నగు.

ఉ క్రొత్త + చాయ = క్రొంజాయ / క్రొత్త + చెమట = క్రొంజెమట } క్రొత్త + పసిఁడి = కొంబసిఁడి. / క్రొత్త + కారు = క్రొక్కారు.

సూ:–పరుషేతరములు పరములగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వమగు. (పరుషేతరములు = సరళస్థిరములు.)

ఉ 1. క్రొత్త + గండి = క్రొగ్గండి, 2. క్రొత్త + మావి = క్రొమ్మావి.

వ్యా. కెంధూళి కెంజడలను ప్రయోగములు చూపట్టెడు. బహుళగ్రహణముచేఁ గ్రొత్తకుండ లిత్యాదులందు లోపము లేదు. క్రీఁగడుపు–క్రీఁగాలు–క్రీ దొడ– ఇత్యాదులందు శబ్దముల లుప్తశేషమునకు దీర్ఘము బహుళగ్రహణముచేనని యెఱుఁగనగు.

ఆమ్రేడితసంధులు:— సూ. ఆమ్రేడితము పరమగునపుడు కడాదుల తొలియచ్చుమీఁదివర్ణములకెల్ల నదంతమగు ద్విరుక్తటకారమగు.
వ్యా. ఈసూత్రమున భృశార్థమునందు (అత్యంతార్థము) ద్విరుక్తము విషయము (లక్ష్యము) గా నెఱుఁగునది.

ఉ॥ 1. కడ+కడ = కట్టకడ, 2. ఎదురు+ఎదురు = ఎట్టఎదురు.

వ్యా కడ- ఎదురు- కొన- చివర- తుద- తెన్ను- తెరువు- నడుము- పగలు- పిడుగు- బయలు- మొదలు- లోనగునవి కడాదులు. రెండుమాఱు లుచ్చరింపఁబడినదాని పరరూపము ఆమ్రేడితము. ఇది పరమగునపుడు కడ మొదలగువాని యందలి మొదటియచ్చు తరవాతి యక్షరము లన్నిఁటికి అకార మంతమందుఁగల ద్విత్వటకారము వచ్చును. ఆమ్రేడితము పరమందుండుటచే 'కడ' అనుశబ్దమందలి మొదటియచ్చు మీఁది డవర్ణమునకు ద్విత్వటకారము వచ్చి కట్టకడయయ్యెను.

సూ.- ఆమ్రేడితము పరమగునపుడు విభక్తిలోపము బహుళముగానగు.

ఉ॥ అప్పటికిన్+అప్పటికన్ = అప్పటప్పటికిన్, అప్పటికి నప్పటికిన్.
అక్కడన్+అక్కడన్ = అక్కడక్కడన్, అక్కడనక్కడన్.
ఇంటన్+ఇంటన్ = ఇంటింటన్, ఇంటనింటన్.

వ్యా. బహుళ గ్రహణముచే 'ఇంచుక, నా' డిత్యాదులయందు నంతిమాక్షర లోపమునగు.

ఉ ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక. (కవర్ణ లోపము)
నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు. (డువర్ణ లోపము)
(ఇచ్చట నామ్రేడితము పరమైనది గావున మొదటి అప్పటికిన్ అనుదానిలోను షష్ఠీవిభక్తి ప్రత్యయమగు 'కిన్' లోపించి అప్పటి + అప్పటికిన్ కాఁగా, సంధి కలిగి అప్పటప్పటికిన్ అనియు, కివర్ణము లోపింపనియప్పుడు 'అప్పటికప్పటికిన్' అనియుఁ గలిగినది. బహుళగ్రహణముచే నించుక, నాడిత్యాదులయందంతిమాక్షర లోపము (విభక్తి కాకపోయినను) సయితముకలుగును.

సూ:—అందదుకు ప్రభృతులు యథాప్రయోగముగ గ్రాహ్యములు.
ప్రయోగము ననుసరించి గ్రహింపఁదగినవి. అందదుకు (అదుకు + అదుకు) = మిక్కిలి యదుకుగలది. ఇఱ్ఱింకులు (ఇంకులు+ఇంకులు) = మిక్కిలి యింకుటలు. ఇల్లిగ్గులు (ఇగ్గులు+ఇగ్గులు) = మిక్కిలి వెనుకకొఱగుటలు. చెల్లచెదరు (చెదరు + చెదరు)=మిక్కిలి చెదరినది. తుత్తుమురు (తుమురు+తుమురు) = చిన్న చిన్న తునుకలు. మిఱుమిట్లు (మిట్లు + మిట్లు) కన్నులు మిక్కిలి మిట్టుటలు గ్రహింప వలయును. అత్తాఁకలి(అఁకలి+అఁకలి) ఎక్కువయాఁకలియగుట. (ఇవి యందదుకు ప్రభృతులు. ఈ పైఁ జెప్పఁబడిన ప్రయోగముల కొకవిధానము లేకపోవుటచే·

ప్రయోగానుసారముగ రూపనిర్ధారణము గావించుకొనవలయును. భారతాదులలో దీనికి విరుద్ధముగ 'కసుసెండ, కడుసధిసుండు' మొదలగు ప్రయోగములు గాన వచ్చుట వ్యస్తపదముల సంధి యగుటయే కారణముగా నెఱుంగునది. ఈ సంధి సమాసస్థలమున మాత్రమే వచ్చునని తెలియవలెను.)

అలుక్సమాససంధులు — సూ. చేత, తోడ, వలనల కిత్వము సమాసములం దగు.

ఉ॥ నీచేతన్+ప్రోపు = నీచేతి ప్రోపు.
నాతోడన్ + చెలిమి = నాతోడి చెలిమి.
నీవలనన్ + భయము = నీవలని భయము.
} ఈ సమాసములందు విభక్తులు (చేత, తోడ, వలనలు) లోపింపమిచే నలుక్సమాసము లనంబడెను.

సూ:—అంద్వాదుల కలిగాగమము సమాసమునం దగు.

ఉ॥ నాయందున్ +కరుణ = నాయందలి కరుణ.
ఇందున్ + జనులు = ఇందలి జనులు.
ఎందున్ + వారు = ఎందలివారు.
} ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేవందురు.

సూ:—అది యవి శబ్దముల యత్తునకు వృత్తిని లోపము బహుళము.

ఉ॥ 1. నా + అది = నాది, నా యది, 2. నా + అవి = నావి, నాయవి.

వ్యా. బహుళ గ్రహణముచే నుదంతకర్మ విశేషణములకు మీఁదిలోపము లేదనియు, నిదంతకర్తృ విశేషణములమీఁద నిత్యమనియు నెఱుంగునది.
వచ్చున్ + అది = వచ్చునది - వచ్చునవి. (లోపములేదు )
వచ్చెడిన్ + అది = వచ్చెడిది - వచ్చెడివి. (లోపము నిత్యము.)

సూ:—పడ్వాదులు పరములగునపుడు మువర్ణమునకు లోపపూర్ణబిందువులు విభాషనగు. (పడు, పట్టు, పాటు, పఱచు, పెట్టు, పోవు, పుచ్చు మొ )

ఉ॥ భయము + పడె = భయపడె, భయంపడె, భయముపడె.
సూత్రము + పట్టె = సూత్రపట్టె, సూత్రంపట్టె, సూత్రముపట్టె.
వ్యా. (ఈ కార్యము కర్తృవాచి ము వర్ణమునకుఁ గలుగదు. గజము పడియె, అశ్వము పడియె. (తక్కినరూపములు వీనికి రానేరవు.)

సూ —మధ్యమపురుష ము వర్ణమునకు హలవసానములు పరములగునపుడు లోపము విభాషనగు.

ఉ॥ చూడుము + నన్ను = చూడు నన్ను, చూడుము నన్ను.

వ్యా. అచ్చుపరమగునపుడును గొన్నిచోట్ల లోపము గనవచ్చుచున్నది. (ఉ॥ 'ఆడిదె వీడు పండెము.' కళా.)

ఉ॥ ఆడుము + ఇదె = ఆడిదె. (ము వర్ణలోపము)

సూ.—వ్యతిరేకమధ్యమ మువర్ణములకెల్లయెడల లోపము విభాషనగు.

ఉ॥ నమ్మకుము + ఇట = నమ్మకిట, నమ్మకుమిట.

వ్యా. (వ్యతిరేకార్థమందలి ధాతువుయొక్క మధ్యమపురుష మువర్ణమునకు సంశేటను లోపము వైకల్పికముగా నగును.)

సూ:—ఆమ్రేడితము పరమగునపుడు మధ్యమ ముముజ్గులకు లోపము విభాషగా నగు.

ఉ ఉండుము + ఉండుము = ఉండుండుము, ఉండుముండుము.

కొట్టుఁడు+కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు, కొట్టుఁడు కొట్టుఁడు.

వ్యా. ఆమ్రేడితము పరముగా నున్నపుడు మధ్యమపురుషము, నందలి ఏకవచన మువర్ణకమునకు, బహువచన డుక్ వర్ణమునకు విభాషగా లోపము జరుగును.

సూ—ఆమ్రేడితము పరమగునపుడు కృతహ్రస్వమునకు దీర్ఘమగు

ఉ॥ 1. తెమ్ము + తెమ్ము = తేతెమ్ము. 2. పొమ్ము + పొమ్ము = పోపొమ్ము.

అనుకరణసంధులు.— సూ. విసర్గమున కనుకరణమున లోపమగు.

ఉ॥ వర్ధతాంశ్రీః + అనియె = వర్ధతాంశ్రీ యనియె.

వ్యా. విసర్గమునకు అనుధాతువు చేర్చి పలుకునపుడు లోపము కలుగును.

(అనుకరణము = ఒకరుచెప్పినదానిని మఱియొకఁడు పలుకుట.)

సూ:—అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాషనగు.

ఉ॥ తుభ్యంనమః + అని = తుభ్యంనమోయని తుభ్యంనమయని

వ్యా. అనుకరణమునందు నమశ్శబ్దముయొక్క విసర్గలు పూర్వసూత్రముచే లోపించి తుది హ్రస్వ అకారమునకు ఓకారము వచ్చెను. అటుపై సంధిలేమి యడాగమము వచ్చి 'తుభ్యంనమోయని' అనురూపమును, విభాష యగుటచే నోత్వము రాక 'తుభ్యం నమయని' అను రూపాంతరమును గలిగెను. 'గతానుగతికో లోకో యటంచున్' అనురూపము పైసూత్రమునకుఁ గట్టుపడకయున్నది.

సూ:—అనుకరణమునఁ దుదిహల్లునకు ద్విర్వచనమగు.

ఉ॥ కింతత్ + అనియె = కింతత్తనియె, కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె.

వ్యా. అనుకరణమునందుఁ గడపటిహల్లునకు ద్విత్వము వచ్చును.

సూ:—అనుకరణమున నహమాదుల మకారమునకు ద్విరుక్తి విభాషనగు.

ఉ॥ దాసోహమ్ + అని = దాసోహమ్మని, దాసోహమని.

తత్కర్తవ్యమ్ + అని = తత్కర్తవ్యమ్మని, తత్కర్తవ్యమని.

వ్యా. అనుకరణమున 'అహమ్' మొదలగు శబ్దముల మకారమునకు ద్విత్వము వైకల్పికముగా నగును. తత్కర్తవ్యమ్మని (ద్విత్వరూపము) తత్కర్తవ్యమని. విభాషయగుటచే ద్విత్వమురాని రూపము.

సూ:—ఉదంతనామమున కనుకరణమున వుగాగమ మగు.

ఉ ఇయంధేనుః + అనియె = ఇయంధేను వనియె.

వ్యా. హ్రస్వమైన యుకారము అంతమందుఁగల నామవాచకములకు అనుకరణమున వుగాగమము కలుగును.

సూ.—ఏసి పరమగుచో సర్వస్వరములకు సంధి నిత్యము.

ఉ పది + ఏసి = పదేసి, గంపెడు + ఏసి = గంపెడేసి.

దుగాగమసంధి —సూ. యుష్మదస్మదాత్మార్థకముల కుత్తర పదము పరమగునపుడు దుగాగమము విభాషనగు.

ఉ 1. నా + కరుణ = నాదుకరుణ, నాకరుణ, 2. నీ + కరుణ = నీదుకరుణ, నీకరుణ

త్రికసంధి:—సూ. ద్విరుక్తంబగుహల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

వ్యా. ద్విత్వహల్లు పరమగునపు డచ్చతెలుఁగు దీర్ఘమునకు హ్రస్వమగును.

సూ:—త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. (అ, ఈ, ఏ లు త్రికంబు నాఁబడు.)

ఉ ఆ + చోటు = అచ్చోటు. ఈ + కడ ఇక్కడ. ఆ + కాలము = అక్కాలము

—· పంచసంధులు - సంస్కృతసంధి :—

1. అచ్సంధి (స్వరసంధి). 2. ప్రకృతి భావసంధి. 3. హల్సంధి. 4. విసర్గసంధి 5. స్వాదిసంధి. అచ్సంధులలో గుణ వృద్ధి, సవర్ణదీర్ఘ సంధులు ప్రధానములు.

సవర్ణదీర్ఘసంధి.—సూ. సమానమైన వర్ణములకు సంధిపొసంగునపుడు దీర్ఘమూదేశ మగును.

వ్యా. అఆలను ఇఈలను, ఉఊలను, ఋౠలును, ఌౡలును బరస్పర సవర్ణములు. అ-ఇ ఉ-ఋ-ఌ వర్ణములకు సవియే క్రమముగాఁ బరంబగునెడల నారెండచ్చులకు మాఱుగ దీర్ఘాచ్చు ఆదేశముగవచ్చును.

ఉ దైత్య + అరి = దైత్యారి } కవి + ఇంద్రుఁడు=కవీంద్రుఁడు (అ + అ=ఆ)
చంద్ర + ఆనన = చంద్రానన { లక్ష్మీ + ఈశుఁడు=లక్ష్మీశుఁడు (ఇ+ఈ=ఈ)
గురు+ఉదయము=గురూదయము } పితృ+ఋణము=పితౄణము. (ఉ+ఉ=ఊ)
ధేను+ఊధస్యము=ధేనూధస్యము { భ్రాతృ+ఌకారము=భ్రాతౄకారము.

గుణసంధి —సూ. అఆ లకు ఇఈ లు పరమగునపుడు ఏ కారమును, ఉఊ లు పరమగునెడల ఓకారమును, ఋ కారము పరమగుచో అర్ అనునదియు, ఌ కారము పరమగునప్పుడు అల్ అనునదియు నేకాదేశముగా వచ్చును.

వ్యా. ఏకాదేశమనఁగాఁ బూర్వపరవర్ణములకు మాఱుగా నితర వర్ణము వచ్చుట. 'ఏ, ఓ, అర్, అల్' అనునవి గుణసంజ్ఞకములు.

ఉ ఉప + ఇంద్రుఁడు = ఉపేంద్రుఁడు
ధన + ఈశుఁడు = ధనేశుఁడు
దేవ + ఋషి = దేవర్షి
కూప + ఉదకము = కూపోదకము.
గంగా + ఊర్ములు = గంగోర్ములు.
తవ + ౡకారము = తవల్కారము.

వృద్ధిసంధి — సూ. అఆ లకు ఏఐ లు పర మగునపుడు ఐ కారమును, ఓఔ లు పరమగునెడల ఔ కారమును, ఋౡ లు పరమగుచో ఆర్, ఆల్ అనువృద్ధులును వచ్చును.

ప్రథమా+ఏకవచనము=ప్రథమైకవచనము.
గంగా+ఓఘము = గంగౌఘము
దేవ + ఐశ్వర్యము = దేవైశ్వర్యము.
రమ+ఔదార్యము=రమౌదార్యం.
సుఖ + ఋతము=సుఖార్తము.

సూ —స్వశబ్దమునకు ఈర, ఈరిన్ శబ్దములును, అక్ష శబ్దమునకు ఊహినీ శబ్దమును పరమగునపుడు ఐఔ లు ఏకాదేశమగును.

ఉ 1. అక్ష + ఊహిని = అక్షౌహిని (గుణసంధి రాలేదు)
2. స్వ + ఈరుఁడు = స్వైరుఁడు 3. స్వ + ఈరి = స్వైరి.

యణాదేశసంధి —సూ. ఇ, ఉ, ఋ, ౡ లకు నసమానాచ్చు పర మగునపుడు య, ర, వ, ల లు క్రమముగా వచ్చును.

అతి + ఊర్ధ్వము = అత్యూర్ధ్వము.
పితృ + అంశము = పిత్రంశము.
మధు + అరి = మధ్వరి.
ౡ + ఆకృతి = లాకృతి.

శ్చుత్వసంధి:—సూ. సకార తవర్గములకు (స త థ ద ధ న) శవర్గ, చవర్గముల (శ చ ఛ జ ఝ ఞ) తో సంధికలియుచో శవర్గ చవర్గములగును

ఉ॥ మనస్ + చలనము = మనశ్చలనము. సత్ + చరిత్ర = సచ్చరిత్ర.
రామస్ + శేతే = రామశ్శేతే. శార్ఙ్గిన్ + జయ = శార్ఙ్గిఞ్జయ.

ష్టుత్వసంధి —సూ. సకారతవర్గములకు షకారటవర్గములతో సంయోగము గలిగినచో షకారటవర్గములు క్రమముగా నగును.

ఉ॥ మనస్ + షట్పదము = మనష్షట్పదము
తద్ + టీకా—తడ్ + టీకా=తట్టీకా
అయస్ + టంకము=అయష్టంకము.

సూ —తవర్గములో నేయక్షరమున కైనను లకారము పరమగుచో లకారము వచ్చును.

ఉ తత్ + లయము = తల్లయము మొ॥

సూ -సకారమునకు 'శఖపఫ' లు పరమగునపుడు విసర్గమువచ్చును.

ఉ॥ మనస్ + కలుషము = మనఃకలుషము. | మనస్ + ఖేదము = మనఃఖేదము.
పయస్ + పానము = పయఃపానము. | తపస్ + ఫలము = తపఃఫలము.

వ్యా. క ఖ లకుఁ బూర్వమునందు విసర్గలకు జిహ్వామూలీయ మనియు, 'పఫ' లకుఁ బూర్వమున నుండు విసర్గలకు ఉపధ్మానీయ మనియుఁ జెప్పుదురు.

అనునాసికసంధి —సూ. పరుషాక్షరముల కనునాసికము పరమగుచో ననునాసికము వైకల్పికముగ నగు.

వ్యా. ప్రత్యయానునాసికము పరమగునపుడు నిత్యముగా నగు.

ఉ॥ వాక్ + మహిమ = వాఙ్మహిమ, వాగ్మహిమ. | చిత్ + మయము = చిన్మయము.
రాట్ + నిలయము = రాణ్ణిలయము, రాడ్నిలయము | (ఇది ప్రత్యయానునాసికము.)

సూ:—తవర్గములో నే యక్షరమునకైనను లకారము పరమగుచో లకారము వచ్చును.

ఉ॥ తత్ + లయము = తల్లయము.

సూ —గ, జ, డ, ద, బ లకు మయము, మాత్రము మొదలగు మకారాది ప్రత్యయములు పరమగుచో ఙ, ఞ, ణ, న, మలు క్రమముగా నిత్యముగా వచ్చును.

ఉ॥ వాగ్ + మయము = వాఙ్మయము.
అజ్ + మాత్రము = అఞ్మాత్రము.
రాడ్ + మాత్రుఁడు = రాణ్మాత్రుఁడు.
జగద్ + మాత్రము = జగన్మాత్రము
అబ్ + మయము = అమ్మయము.

సూ:—అచ్చులకు ఋకారము పరమగుచో సంధి వికల్పము.

ఉ॥ అ+ఋ=అర్, ఆ+ఋ=అర్, ఇ+ఋ=య్ర, ఈ+ఋ=య్ర, ఉ+ఋ=వ్ర, ఊ+ఋ=వ్ర.

ఉ॥ 1. మహా+ఋషి=మహర్షి, మహాఋషి. 2. గిరి+ఋషి=గిర్యృషి, గిరిఋషి.

జశ్త్వసంధి —సూ. క, చ, ట, త, ప లకు అచ్చులుగాని (క,ఖ,చ,ఛ, ట,ఠ,త థ,ప,ఫ,శ,ష, సవర్ణములకంటె భిన్నములగు) హల్లులుగాని పరమైనయెడల గ,జ,డ,ద,బ లు క్రమముగా వచ్చును.

ఉ వాక్ + అధిపతి = వాగధిపతి | రాట్ + గణము = రాడ్గణము.
అచ్ + అంతము = అజంతము | తత్ + దినము = తద్దినము.
షట్ + అంగము = షడంగము | సుప్ + అంతము = సుబంతము.

సూ — గ, జ, డ, ద, బ లకుఁ బరముగానున్న హకారమునకుఁ క్రమముగా వికల్పముగా ఘ, ఝ, ఢ, ధ, భ వర్ణములు వచ్చును.

ఉ॥ వాగ్+హరి=వాగ్ఘరి, వాగ్హరి,
అజ్+హల్లులు=అజ్ఝల్లులు, అజ్హల్లులు
రాట్+హంత=రాడ్ఢంత, రాడ్హంత.
తత్+హితము=తద్ధితము, తద్హితము.
కకుప్+హస్తి=కకుబ్భస్తి, కకుబ్హస్తి.

సూ:— క,చ,ట,త, ప లకు పరమైన శవర్ణమునకు ఛవర్ణము వికల్పముగా వచ్చును.

ఉ॥ వాక్+శరము = వాక్ఛరము. వాక్శరము.
అచ్+శరము = అచ్ఛరము, అచ్శరము.
రాట్+శాసనము=రాట్ఛాసనము, రాట్శాసనము.
తత్+శాస్త్రము=తచ్ఛాస్త్రము, తచ్శాస్త్రము.
అప్+శీకరము = అప్ఛీకరము, అప్శీకరము.

షత్వసంధి:— సూ. ఇస్, ఉస్, అంతశబ్దముల సకారమునకు క, ఖ, ప, ఫ వర్ణములు పరమగుచో షకారము వచ్చును.

ఉ॥ నిస్+కారణము=నిష్కారణము
ధనుస్+ఖండము=ధనుష్ఖండము
బహిస్+కారము=బహిష్కారము
దుస్+కరము=దుష్కరము.
ధనుస్+ఫలకము=ధనుష్ఫలకము.
సర్పిస్+పాత్రము=సర్పిష్పాత్రము.

వ్యా. ముహుస్ శబ్దమునకు షకారము రాదు. (ముహుఃకామ) ఇస్, ఉస్ అంత పదములు, సమాసాదులు కానియెడల షకారము రాక విసర్గము వచ్చును. (పరమ సర్పిఃకుండిః)

సూ:— పదాంతమందలి 'అస్' నకు క,ఖ,చ,ఛ,ట,ఠ,త,థ,ప,ఫ,శ,ష,స,లకంటె భిన్నములగు హల్లులు పరమగునపుడు ఓకారము వచ్చును.

ఉ॥ మనస్+గతి=మనోగతి.
అయస్+ఘంట=అయోఘంట.
మనస్+జవము=మనోజవము.
పయస్+డంబరము=పయోడంబరము.
మనస్+దయితుఁడు=మనోదయితుఁడు.
తపస్+ధనము=తపోధనము మొ.

రేఫాగమసంధి:—సూ. ఇకారాద్యచ్చులు పూర్వమునఁగల సకారమునకు క,ఖ,చ,ఛ,ట,ఠ,త,థ,ప ఫ,శ,ష,స వర్ణములకంటె భిన్నములగు హల్లులును, అచ్చులును బరమగుచో రేఫము వచ్చును.

ఉ॥ బహిస్+అంగము - బహిరంగము
దుస్+అంతము=దురంతము
బహిస్+గమనము=బహిర్గమనము
చతుస్+ముఖుఁడు=చతుర్ముఖుఁడు.

సూ.—స్వస్, అంతస్, ప్రాతస్, పునస్, అహస్ శబ్దములయు, ఇకారాద్యచ్చులు పూర్వమునఁగలసకారాంతపదములయు, సకారమునకు రేఫముపరమగునపుడు సకారలోపముపూర్వాచ్చునకు దీర్ఘమునగును.

ఉ॥ స్వస్+రాజ్యము=స్వారాజ్యము
పునస్+రావము=పునారావము
ధనుస్+రావము=ధనూరావము.
అర్చిస్+రక్తము=అర్చీరక్తము.

# సమాసపరిచ్ఛేదము



సమాసములనుగూర్చి తెలియఁజేయు భాగము సమాసపరిచ్ఛేదమనఁబడును.

సూ:—సమర్థంబులగు పదంబు లేకపదం బగుట సమాసంబు.

వ్యా. వేఱువేఱుగానున్న పదముల యర్థము నఖండార్థముగా భావించుట సామర్థ్యము సామర్థ్యము వ్యపేక్షయనియు, ఏకార్థీభావమనియు రెండు విధములు. వ్యపేక్షా సామర్థ్యము వాక్యమునను, ఏకార్థీ భావసామర్థ్యము సమాసమునను గలిగియుండును. కొన్నిస్థలములయందు సమాసమున నుభయమును నంగీకరింపఁబడినవి.

సూ:—భాషాభేదంబువలన సమాసంబు త్రివిధంబు.

ఉ 1. సాంస్కృతికము, 2. ఆచ్ఛికము, 3 మిశ్రము.

సూ:—సాంస్కృతికము ద్వివిధము.

ఉ॥ 1. సిద్ధము, 2. సాధ్యము.

సూ:—కేవల సంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబు.

వ్యా. సిద్ధమనఁగా సంస్కృత వ్యాకరణ సూత్రముల ననుసరించి కూడినది.

ఉ॥ 1. రాజాజ్ఞ, 2. తటాకోదకము, 3. లక్ష్మీవల్లభుఁడు.

సూ:—సంస్కృత సమంబుల సమాసంబు సాధ్యంబు.

ఉ 1. రాజునాజ్ఞ, 2. తటాకంబు నుదకము, 3. లక్ష్మీవల్లభుఁడు.

సూ:—తెనుఁగు పదంబుల సమాసం బాచ్ఛికంబు. (సమాసకము)

ఉ॥ 1. తొలియావతి, 2. చెఱువునీరు, 3. సిరిచెలువుఁడు, 4. చలివెలుఁగు.

సూ:—తత్సమాంధ్రపదంబు లుభయంబులును జేరిన సమాసంబు మిశ్రంబు.

ఉ 1. రాజుముదల, 2. చెఱువునుదకము, 3. సిరివల్లభుఁడు.

వ్యా. మిశ్రసమాసమునందు మొదట సంస్కృతశబ్దముండరాదు. (అతితెలివి మొ.)

సూ:—అర్థభేదంబువలన సమాసంబు చతుర్విధంబు.

ఉ 1. తత్పురుషము, 2. ద్వంద్వము, 3. బహువ్రీహి, 4. అవ్యయీభావము.

తత్పురుషసమాసము.—సూ. ఉత్తరపదార్థ ప్రధానము తత్పురుషము.

వ్యా. రెండు పదములుగల సమాసమున రెండవ పదముయొక్క యర్థము మాత్రమే ప్రధానముగా నుండునది తత్పురుషము. ఇది అయిదు విధములు.

ఉ 1. సమానాధికరణము, 2 వ్యధికరణము, 3. నఞ్, 4. ప్రాది, 5. ఉపపదము.

సమానాధికరణము.—సూ. విశేషణ విశేష్యంబుల సమాసంబు సమానాధికరణంబు

ఉ॥ 1. సరసపు వచనము, 2. తెల్లగుఱ్ఱము, 3. వీరబాలుఁడు.

వ్యా. సమమైన యాధారముగలది సమానాధికరణము. రెండుపదముల భావము ఒక పదమునందే నిలిచియుండుట. దీనినే కర్మధారయమందురు. సరసపు వచనమను స్థలమున సరసత్వధర్మమును, వచనత్వధర్మమును వచనము నాధారము చేసికొని యున్నవి. సమానాధికరణత్వము విశేషణవిశేష్యభావమున్నచోటనే యుండును.

సూ.—కర్మధారయంబు త్రికస్త్రీసమ ముగంత ధాతుజ విశేషణపూర్వ పదంబై యుండును. (ఆ, ఈ, ఏలు త్రికంబు నాఁబడు )

వ్యా. ఆ చందము - ఈ విధము - ఏ బృందము - వాఁడిబాణము-బెడిదపు టడిదము-మడిసెడు దడములు త్రికాది పరిగణనమున బల్లిదఁడు, మల్లుఁడు, కావలఁడు, రావణుఁడు మొ దుమంత విశేషణములతోఁ గర్మధారయము రానేరదు. కావున 'బల్లిదమల్లుఁడు' మొదలగు ప్రయోగములు దుష్టములు.

విశేషణపూర్వపద కర్మధారయము -సూ. విశేషణము మొదటిపదము గాను, విశేష్యము రెండవపదముగాను నుండుట

ఉ॥ 1. నీలఘటము, 2. కఱకుబాణము.

విశేష్యపూర్వపదము.—సూ మొదటిపదము విశేష్యముగను, రెండవ పదము విశేషణముగను నుండునది.

ఉ॥ కపోత వృద్ధము మొ.

విశేషణోభయపదము.-ఉభయపదములు విశేషణములుగా నుండునది.

ఉ॥ 1. శీతోష్ణము, 2. కనని వినని, 3. స్నాతానులిప్తుఁడు.

సంభావనాపూర్వపదము·—సూ. సంభావన పూర్వపదముగాఁ గలది. (సంభావన = ఊహ లేక సంజ్ఞ.)

ఉ॥ 1. మాతృవృక్షము, 2. రామశాస్త్రి మొ.

అవధారణాపూర్వపదము:—సూ. అవధారణపూర్వపదముగాఁ గలది.

వ్యా. అవధారణ = ఒక వస్తువునందు మఱియొక వస్తుధర్మము నారోపించుట. దీనికి రూపక సమాసమను నామాంతరము కలదు.

ఉ॥ 1. సంసారసాగరము, 2. అజ్ఞానాంధకారము.

వ్యా. సంసారమునఁదు సాగరత్వారోపణమును, అజ్ఞానమునందు అంధకారత్వారోపణమును గావింపఁబడుటచే నవధారణాపూర్వపదమనియు, రూపకమనియుఁ బేరులు గల్గినవి.

లుప్తమధ్యమపదము:—సూ. లోపించిన మధ్యమపదము గలది.

ఉ॥ 1. శాకపార్థివుఁడు, 2 ఛాయావృక్షము.

వ్యా. శాకప్రియుఁడగు పార్థివుఁడు. ఇచ్చట ప్రియశబ్దము లోపించినది. దేవ బ్రాహ్మణుఁడు = దేవపూజకుఁడగు బ్రాహ్మణుఁడు.

**ఉపమానపూర్వపదము:**—సూ. ఉపమానము మొదటిపదముగను నుపమేయము రెండవపదముగను నుండునది.

ఉ॥ 1. చంద్రముఖము, 2. పూవుఁబోఁడి, 3. పద్మహస్తము, 4. కంబుకంఠము.

**ఉపమానోత్తరపదము (ఉపమితసమాసము):**— సూ. ఉపమానము త్తరపదముగాఁ గలది.

ఉ॥ 1. ముఖపద్మము, 2. పురుషసింహుఁడు. 3. చరణకమలము.

**ద్విగుసమాసము:**-సూ. సంఖ్యాపూర్వక తత్పురుషవిశేషంబు ద్విగువు.

ఉ. 1. మూఁడులోకములు, 2. చతుష్పథము (సమాహారద్విగువు), 3. ముజ్జగములు (మిశ్రద్విగువు), 4. షాణ్మాతురుఁడు (తద్ధితార్థద్విగువు).

వ్యా. మూఁడనునది తెనుఁగుగాను, జగములనునది తత్సమముగాను నుండుటచే మిశ్రద్విగు వనంబడెను.

**వ్యధికరణ తత్పురుషము:**—సూ. భిన్నమయిన యధార్థముగలది వ్యధికరణము.

వ్యా. రాముని పుస్తకము. ఇట రామత్వధర్మము రామునందే యుండునుగాని పుస్తకమునం దుండనేరదు. అట్లే పుస్తకత్వధర్మము పుస్తకమునందే యుండును గాని రామునియందుండనేరదు. కావున నీరెండుపదార్థములను భిన్నాశ్రయములు.

**ద్వితీయాతత్పురుషము:**—ఉ॥ 1. కృష్ణశ్రితుఁడు, 2. నెలతాల్పు.

**తృతీయాతత్పురుషము:**—ఉ॥ 1. రాజపూజితుఁడు, 2. రామహతుఁడు, 3. నీతోడి చెలిమి (అలుక్సమాసము = విభక్తిలోపము లేనిది).

**చతుర్థీతత్పురుషము:**—ఉ॥ 1. దేవర మేలు, 2. భూతబలి, 3. పరస్మైపదము, 4. ఆత్మనే పదము (అలుక్సమాసము).

**పంచమీతత్పురుషము:**— ఉ॥ 1 దొంగభయము = దొంగవలని భయము, 2. వ్యాఘ్ర భీతుఁడు, 3. నావలని నేరము (అలుక్సమాసము).

**షష్ఠీతత్పురుషము:**—ఉ॥ 1. రాజపరిచారకుఁడు = రాజుయొక్క సేవకుఁడు. 2. దేవానాం ప్రియుఁడు (అలుక్సమాసము).

వ్యా. నిర్ధారణషష్ఠియందు సమాసము లేదు. భూసురోత్తముఁడు — భూసురుల యందు త్తముఁడని చెప్పవలెనుగాని భూసురులలో నుత్తముఁ డనరాదు.

**సప్తమీతత్పురుషము.**— ఉ॥ 1. యుద్ధనిపుణుఁడు (యుద్ధమున నేర్పరి) 2. నగర వాయసము, 3. పంకేరుహము (అలుక్సమాసము).

**నఞ్ తత్పురుషము:**—సూ. అకారనకారములు సమాసాది నుండి వ్యతిరేకార్థమును బోధించుచో నఞ్ తత్పురుషము.

ఉ॥ న + బ్రాహ్మణుఁడు = అబ్రాహ్మణుఁడు.

వ్యా నవర్ణమునకు హల్లు పరమగుచో 'అ' వర్ణముగా మారును.

న + ఉచితము = అనుచితము (వర్ణమున కచ్చు పరమగుచో అన్ వచ్చును).

ప్రాదితత్పురుషము.—సూ. తత్పురుష సమాస ప్రథమమునఁ బ్రాదు లుండునది.

ఉ 1. ప్రాచార్యుఁడు, 2. అతిరథుఁడు, 3. నిర్లజ్జుఁడు.

గతితత్పురుషము.—ఉ 1. అస్తమయము, 2. పురస్కారము, 3. తిరస్కారము.

ద్వంద్వసమాసము.—సూ. ఉభయపదార్థ ప్రధానము ద్వంద్వము.

వ్యా. అనేక సుబంతములు సముచ్చయార్థము గలిగి సమసించునది. ఉభయపదార్థ ప్రధానమనఁగా సమాసమునందున్న పదములన్నియు సమప్రాధాన్యము కలవనుట.

ఉ 1. రామలక్ష్మణులు, 2. కూరగాయలు.

ఇతరేతర ద్వంద్వము.—సూ. ప్రత్యేకాన్వయము కలది.

వ్యా. రామలక్ష్మణులు కానలకుఁబోయిరి. రాముఁడు, లక్ష్మణుఁడు అను రెండు శబ్దములు వేర్వేఱ కానలకుఁబోయెను క్రియతో నన్వయించుచున్నవి.

సమాహార ద్వంద్వము—సూ. సమూహార్థమే ముఖ్యముగాఁ గలది సమాహార ద్వంద్వము

ఉ॥ 1. ఛత్రీపటహము, 2. ఆహారనిద్రాభయములు, 3. కూడుగుడ్డ.

ఏకశేషము.—సూ. సమానరూపంబులు గల పదంబుల యేకశేషము సరూపైకశేషము

వ్యా. ఏకవిధరూపములగు ననేకపదములు సమసించుచో నందొక్క పదమునకు మాత్రము బహువచనప్రత్యయ మగు.

ఉ రాముఁడు + రాముఁడు = రాములు. (సరూపైకశేషము)

విరూపైకశేషము:—సూ. భిన్నరూపములుగల పదంబుల యేకశేషము విరూపైకశేషము.

ఉ॥ మాత + పిత = పితలు, పుత్రి + పుత్త్రుఁడు=పుత్త్రులు.

బహువ్రీహి సమాసము.—సూ. అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి.

వ్యా అన్యపదార్థమనఁగా సమాసమునందలి పూర్వోత్తర పదములు బోధించు నర్థముకంటె భిన్నమైన యర్థము.

ఉ॥ 1. పీతాంబరుఁడు, 2. సాధుబుద్ధి, 3. నీలకంఠుఁడు.

ద్వితీయాబహువ్రీహి—ఉ॥ 1. ప్రాప్తానందుఁడు, 2. ప్రాప్తోదకము.

తృతీయాబహువ్రీహి—ఉ 1. లబ్ధవిజయుఁడు, 2. జితసేనుఁడు.

చతుర్థీబహువ్రీహి– ఉ 1. అర్పితార్ఘ్యుఁడు, 2. దత్తాస్త్రుఁడు.

పంచమీబహువ్రీహి—ఉ 1 నిరస్తదోషుఁ, మునులు, 2. నిరవము.

షష్ఠీబహువ్రీహి—ఉ॥ 1 శార్ఙ్గధన్వుఁడు, 2. రక్తాక్షుఁడు, 3. ముక్కంటి.

సప్తమీబహువ్రీహి—ఉ॥ 1. వీరపురుషము, (గ్రామము) 2. బహువిహగము.

దిగంతరాళ బహువ్రీహి—1. దిక్కుల యంతరాళమును దెలుపు బహువ్రీహి.

ఉ॥ 1. దక్షిణ పూర్వము=ఆగ్నేయమూల, 2. ఉత్తరపూర్వము=ఈశాన్యమూల.

క్రియావిశేషణ బహువ్రీహి—ఉ॥ 1. నిశ్శంకము, 2. నిరాంతకము.

బహుపద బహువ్రీహి—ఉ॥ శ్యామోజ్జ్వల వపువు.

వ్యధికరణ బహువ్రీహి—సూ. భిన్నవిభక్తులు కలది.

ఉ॥ 1. మృగాక్షి, 2. కంఠేకాలుఁడు, 3. దండపాణి, 4. పద్మనాభుఁడు మొ

వికారబహువ్రీహి:-సూ. మొదటిపదము ద్రవ్యవాచకమైన బహువ్రీహి.

ఉ సువర్ణాభరణుఁడు (బంగారపు నగలు కలవాఁడు).

దిగంతరాళబహువ్రీహి:-సూ. రెండుదిక్కులమధ్యభాగమునుజెప్పునది.

ఉ॥ దక్షిణపూర్వ (తూర్పు దక్షిణముల మధ్యనున్న ఆగ్నేయమూల).

సంఘాత బహువ్రీహి:—సూ. మొదటి పదము సముదాయార్థమును బోధించుచు విశేషణమై యుండునది.

ఉ॥ కేశచూడుఁడు (కేశముల సమూహము కలవాఁడు).

వికల్ప బహువ్రీహి.—సూ. ఇందలి పదములు సంఖ్యావాచకములై వికల్పమును జెప్పును.

ఉ 1. త్రిచతురులు (ముగ్గురు లేక నలుగురు కలవారు), 2. ద్విత్రులు (ఇద్దరు లేక ముగ్గురు కలవారు).

అభ్యాస బహువ్రీహి:—సూ. ఇందు మొదటి పదము రెండవపదము యొక్క ఆవృత్తులను తెలుపును.

ఉ 1. త్రిదశులు (మూఁడుపదుల (30) యేండ్లవయస్సు గలవారు).

వ్యతిహారలక్షణ బహువ్రీహి:—సూ. కలహమును సూచించునది.

ఉ 1. కేశాకేశి, 2. ముష్టీముష్టి, 3. బాహూబాహవి.

ఉపమానపూర్వపద బహువ్రీహి:—సూ. ఉపమానవాచకము పూర్వపదమందుఁ గలది.

ఉ 1. చంద్రముఖి, 2. కమలాక్షుఁడు.

లుప్తమధ్యమపద బహువ్రీహి:—సూ. మధ్యమపదలోపము గలది.

ఉ కరధనుఁడు (కరమందు ధనము కలవాఁడు).

నఞ్ బహువ్రీహి—ఉ॥ 1. అనంగుఁడు, 2. అధనుఁడు.

అవ్యయీభావ సమాసము:—సూ. పూర్వపదార్థ ప్రధానము.

వ్యా. పూర్వపదము యొక్క యర్థమే ముఖ్యముగాఁగలది యవ్యయీభావము.

ఉ 1 యథాశక్తి 2. నిర్జనము, 3. ప్రత్యాహము, 4 ఆబాలము.

వ్యా. ఇందుఁ దఱచుగా మొదటిపద మవ్యయముగా రెండవది నామవాచకముగా నుండును.

ఉపపదసమాసము.—సూ సమాసమందలి ధాతువులకుఁగృత్ప్రత్యయములు చేర్చునపుడు వానివెనుక నేవేనిపదము లుండవలెను.

ఉ॥ 1. కుంభకారుఁడు, 2. సోమయాజి, 3 జలజము.

వ్యా. ఇచ్చట కృత్ ధాతువునకు సమీపమున కుంభయనుశబ్దమును, జలశబ్దమునకుఁ బిమ్మట జలధాతువును కలవు.

లుక్సమాసము —సూ. విభక్తులు లోపించిన సమాసములను లుక్సమాసము లందురు.

ఉ నెల తక్కువవాఁడు.

వ్యా. ఇట సమాసమునందు చేత అను విభక్తిప్రత్యయము లోపించినది.

అలుక్సమాసము.—సూ. విభక్తులు లోపింపని సమాసముల నలుక్సమాసము లందురు

ఉ 1. నీచేతి ప్రోపు, 2. నీతోడిచెలిమి.

వ్యా. ఇందు చేత తోడ అను విభక్తిప్రత్యయములు లోపించలేదు.

—: తద్ధితములు :—

సూ. విభక్త్యంతశబ్దముల మీఁద భావార్థ-స్వార్థ-మత్వర్థాదుల యందుఁ బ్రయోగింపఁబడు ప్రత్యయములు తద్ధితములు.

భావార్థక తద్ధిత.—సూ. ధర్మమును జెప్పునది.

ఉ॥ 1. బ్రాహ్మణ్యము, 2. గోత్వము, 3. చాతుర్యము, 4. గొప్పతనము, 5 చిన్నతికము, 6 చుట్టరికము, 7. వెజ్జరికము, 8. లోత్తరికము, 9. పేరిమి, 10. వేడిమి, 11. తియ్యన, 12. పుల్లన, 13. అగ్గలిక.

అపత్యార్థక తద్ధిత:—సూ. సంతానమును దెల్పునది.

ఉ 1. రాఘవుఁడు, 2. దాశరథి, 3. వైనతేయుఁడు.

స్వార్థక తద్ధిత:—సూ. ప్రత్యయములు చేరినను ప్రకృత్యర్థము మాఱకుండును.

ఉ॥ 1. అరమరిక, 2. నడవడిక, 3 చిఱుతుక, 4. వెలఁతుక, 5. నిప్పుక, 6. కొలగారము, 7. చెలికారము, 8 నుడికారము, 9. విలుకాఁడు, 10. చెలికాఁడు, 11. బాసిఁడు, 12 జూదరి.

సమూహార్థకతద్ధిత —సూ. సమూహమను నర్థమును జెప్పునది
ఉ యౌవతము (యువతుల సమూహము).

తుల్యార్థకతద్ధిత.—సూ. సమానమను నర్థమును జెప్పునది.
ఉ॥ బ్రాహ్మణవత్ (బ్రాహ్మణునివంటి).

ప్రమాణార్థకతద్ధిత:—సూ. పరిణామార్థమును జెప్పునది
ఉ 1. కటిదఘ్నము, 2. పాదమాత్రము, 3. మోకాలిబంటి, 4. తుండెడు, 5. పిడికెడు, 6. సంచెడు.

అర్హార్థకతద్ధిత.—సూ. తగినవాఁడని చెప్పునది
ఉ 1. వంద్యుఁడు, 2. దండ్యుఁడు (దండింపఁదగినవాఁడు).

మతుబర్థకతద్ధిత.—సూ. కల, నిండు మొదలగు అర్థములనిచ్చు ప్రత్యయములు చేరినది.

ఉ 1. బుద్ధిమంతుఁడు, 2. ఐశ్వర్యవంతుఁడు, 3. ఆటకాఁడు, 4 సొగసుకత్తె, 5. ఒయారి, 6. అందగాఁడు, 7. జేరగత్తె, 8. బాసీఁడు, 9. కలరిఁడు, 10. తగలాఁడు, 11. చాకిత, 12. సాలెత, 13. మచ్చరి, 14. మక్కాఁడి, 15. జాలరి.

సంబంధార్థకతద్ధిత.—సూ. సంబంధమును తెలియపఱచునది.
ఉ॥ 1. మదీయము, 2. త్వదీయము, 3. తావకీనము.

—: కృత్తులు :—

సూ:—ధాతువులకు ప్రత్యయములు చేర్చుటచే నేర్పడు నామవాచకములు కృదంతములనఁబడును.

1. అలఁగు—అలుక, ఎఱుఁగ-ఎఱుక, తనఁగు-తనక, నడచు-నడక, కడఁగు-కడక.
2. కలుగు-కలిమి, వ్రేలుచు-వ్రేలిమి, ఓరుచు-ఓరిమి, నేరుచు-నేరిమి, బ్రదుకు-బ్రదిమి.
3. అలయు—అలఁత, మూయు—మూఁత, కూయు—కూఁత, చేయు—చేఁత.
4. అడఁగు—అడఁకువ, ఎఱుఁగు—ఎఱుకువ, కలఁగు-కలఁకువ, లోఁగు—లోకువ.
5. తివురు—తివుట, వేసరు—వేసట, పండు—పంట, తేరు—తేట.
6. కఱచు—కాటు, పొడుచు—పోటు, పడు—పాటు, ఏయు—ఏటు.
7. అవ్వలించు—అవులింత, ఇగిలించు—ఇగిలింత, కొక్కరించు—కొక్కరింత, గిలిగించు—గిలిగింత.
8. మాయు—మాపు, తలఁచు—తలఁపు, చూచు—చూపు, మేయు—మేపు.
9. ఏలు—ఏలుబడి, తీఱు—తీఱుబడి, పెట్టు—పెట్టుబడి, సాఁగు—సాఁగుబడి.
10. చేరు—చేరుగడ, మను—మనుగడ, విరుగు—విరుగడ, తీఱు— తీఱుగడ.
11. కోరు—కోరిక, మను—మనికి, విను —వినికి, పూను—పూనిక.
—చావు, పూచు- [illegible] లుచు—కొలువు, తడయు—తడవు.
ఉడు, అమ్ము-అమ్ముడు, [illegible] -త్రొక్కుడు, దంచు-దంపుడు.
మాఱకము, అమ్ము-అమ్మకము, పంపు-పంపకము, అంపు-అంపకము.

# అర్ధబిందు విధాయక ప్రకరణము



సూ:—అఁట-ఇఁక-చుఁడు-అను శబ్దములందక్క పదము మొదటి హ్రస్వముమీఁద ఖండబిందువు లేదు.

వ్యా. పై మూఁడు శబ్దములందు మాత్రమే కలదని భావము.

సూ:—సంస్కృత సమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది.

వ్యా. తత్సమములకంటె నితరములగు క, చ, చే, ట, త, ప, గ, జ, జే, డ, ద, బ లకు ముందుఁ బూర్ణఖండబిందువు లుండును గాని స్థిరాక్షరములముందుఁ గాఁరావు.

ఉ వంకర-కలఁకువ-మంచు - త్రాఁచు-దంట-దాఁటు-కొంత-కోఁత.

సూ—దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.

ఉ వాఁడు, వీఁడు, రాఁడు, కాఁడు మొ. (వాండు-వీండు అను రూపములు దుష్టములు.)

వ్యా. అంబోతు, గోంగూర మొ. రూపములు దీనికి విరుద్ధముగఁ గాన్పించుచున్నవి.

సూ:—విభక్తిప్రత్యయ ఁడువర్ణకమునకుఁ బూర్వమున నర్ధబిందు వుండును.

ఉ 1. గోపాలుఁడు, 2. కృష్ణుఁడు, 3. రాముఁడు మొ.

సూ:—డువర్ణకాంతసుబంతములతో నన్వయించు క్రియల యంత్య ఁడు వర్ణకమునకుఁ బూర్వమున నర్ధబిందువుండును.

ఉ॥ రాముఁడు భుజించు చున్నాఁడు.

వ్యా. రాముండను కర్తతో నన్వయించు "భుజించు చున్నాఁడు" అను క్రియయొక్క యంత్య ఁడు వర్ణమునకు ముందు ఖండబిందువు నుపయోగింపవలయును.

సూ:—విశేష్యములయందలి యంత్య ను వర్ణమునకు కు గు లాదేశ మగునపుడు వానిముం దర్ధబిందు వుండును.

ఉ॥ 1. రేను-రేఁగు, 2. కొలను-కొలఁకు, 3. గోను-గోఁగు మొ.

సూ:—దీర్ఘపూర్వక ము వర్ణమునకు 'పజ్' ఆదేశ మగునపుడు పకారమునకుఁ బూర్వమున నర్ధబిందు వుండును.

వ్యా. దీర్ఘము పూర్వమునఁగల ము వర్ణమునకు నాదేశముగావచ్చు ప వర్ణమునకు ముందట సున్నయుండును.

ఉ॥ 1. వాము + చేను = వాఁపచేను, 2. వేము + చెట్టు = వేఁపచెట్టు,
8. పాము + ఱేఁడు = పాఁపఱేఁడు మొ.

సూ:—స్త్రీ ప్రత్యయమగు 'ఆఁడి' యం దర్ధబిందువు కలదు.

ఉ. 1. వగలాఁడి, 2. బొంకులాఁడి, 3. మాయలాఁడి, 4. వన్నెలాఁడి, 5. ఎమ్మెలాఁడి

సూ:—పుం ప్రత్యయమగు కాఁడు, ఆఁడు లోని డు వర్ణమునకు ముం దఱసున్న కలదు.

ఉ. 1. కోడెకాఁడు, 2. అందగాఁడు, 3. సొగసుగాఁడు, 4. వన్నెలాఁడు మొ.

వ్యా. స్వార్థమునందు వచ్చు ఇడి వర్ణకమున అర్ధబిందు వుండదని గ్రహింపవలెను.

ఉ. తెలివిడి, వినికిడి, రాపిడి మొ.

సూ:— వ్యతిరేకార్థద్యోతకమగు 'ఇఁడి' వర్ణకమున నర్ధబిందువుండును.

ఉ. 1. ముక్కిఁడి, 2. విగ్గిఁడి, 3. వెరవిఁడి (ముక్కులేనివాఁడని భావము.)

సూ.—తద్భవంబుల హ్రస్వమున కనునాసికములు పరమగునపుడు రూపాంతరమున హ్రస్వమునకు దీర్ఘమును, ననునాసికస్థానమున బిందువు నగు.

ఉ. కుంకటి - కూఁకటి, పించము - పీఁచము మొ.

సూ:—అనునాసికాక్షర ప్రకృతిశబ్దము వికృతిగా మాఱునపు డను నాసికసానమున బిందువు కలుగును.

ఉ॥ బ్రాహ్మణుఁడు-బాపఁడు.

సూ:—ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందువగును.

ఉ॥ పూచెను + కలువలు = పూచెం గలువలు, పూచెఁ గలువలు.

సూ —సమాసములయం దుదంతస్త్రీసమములకును, బుం పు వర్ణాంత పదములకును బరుషములు పరమగుచో బిందుసంశ్లేషములు విభాషనగు.

ఉ॥ సింగపుఁ+కోదమ=సింగపుం గోదము, సింగపుఁ గోదమ, సింగపుగ్గోదమ.

సూ —పదాంతమందలి ఎఁడు వర్ణకము పరిమాణార్థక మగుచో నం దఱసున్న యుండును.

ఉ 1. దోసెఁడు, 2. పిడికెఁడు, 3. సోలెఁడు 4. చేరెఁడు మొ.

సూ:—యువర్ణాంతధాతువులనుండి పుట్టిన తవర్ణకాంత శబ్దములలో నఱసున్న యుండును.

ఉ॥ 1. పూయు-పూఁత, 2. నేయు-నేఁత, 3. కోయు-కోఁత, 4. గీయు-గీఁత.

సూ.—శరీరార్థకముగా నున్న బోఁడియం దఱసున్న గలదు.

ఉ॥ 1. పూఁబోఁడి, 2. విరిఁబోఁడి, 3. ననఁబోఁడి.

సూ:—కొన్ని పదముల హ్రస్వదీర్ఘములమీఁద సిద్ధముగా నఱసున్న యుండును.

ఉ॥ అడఁగు - చెలఁగు - పడఁతి - ఆఁట - ఇఁక - ఎఱుఁగు - కోఁతి - ఈఁగ - తేఁటి - దాఁగు - నాఁడు - ఊఁత - చీఁకటి - మేఁక - మూఁడు - ప్రాఁత - దాఁటు - కౌఁగు - కౌఁగిలి - ఆఁకలి - ఆఁడుది - వీఁగు - వీఁపు - మొ.

సూ:—నాఁడు, నేఁడు మొదలగు పదములు డువర్ణకాంతసుబంతములు కాకున్నను నర్ధబిందుయుతములై యుండుట గ్రహింపనగును.

సూ:—అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, నావుడు అనవుడు మొదలగు నవ్యయపదము లర్ధబిందురహితము లని గ్రహింపవలెను.

---

# సిద్ధార్ధానుస్వార పదముల పట్టిక

ఆఁట, ఆడఁకువ, అణఁకువ, అడఁగు, అణఁగు, అనఁగు, అనఁటి, అనుఁగు, అరఁగు, అరఁటి, అరుఁగు, అలఁచు, ఆఁక, ఆఁకరము, ఆఁకలి, ఆఁగు, ఆఁచికొను, ఆఁచు, ఆఁపు, ఆఁటు, ఆఁడది, ఆఁడి, ఆఁకు, ఇఁక, ఇఁగ, ఇఁడి, ఈఁక, ఈఁకు, ఈఁగ, ఈఁగు, ఈఁచ, ఈఁటె, ఈఁటియ, ఈఁడు, ఈఁత, ఈఁద, ఈఁదర, ఈఁదు, ఊఁక, ఊఁకర, ఊఁకు, ఊఁకువ, ఊఁకొను, ఊఁగు, ఊఁచ, ఊఁచు, ఊఁటు, ఊఁడు, ఊఁత, ఊఁతు, ఊఁద, ఊఁదర, ఊఁదు, ఊఁపు, ఊఁపురము, ఎరఁగు, ఎఱఁగు, ఎఱుఁగు, ఎలుఁగు, ఎసఁగు, ఏఁకట, ఏఁకరి, ఏఁకరు, ఏఁకారు, ఏఁగు, ఏఁచు, ఏఁడి, ఏఁడీ, ఏఁడు, ఏఁడికోల, ఏఁదర, ఏఁదుము, ఏనుఁగు, ఏఁపు, ఒసఁగు, ఓఁక, ఔఁగు, కడఁగు, కడఁజా, కడఁత, కణఁత, కడఁలి, కరఁగు, కలఁక, కలఁగు, కలఁత, కలుఁగు, కలుఁజా, కాఁక, కాఁకర, కాఁగు, కాఁచు, కాఁడ, కాఁడి, కాఁపు, కీఁచు, కూఁక, కూఁకు, కూఁతురు, కొడుఁగురు, కొణుఁగురు, కొణిఁగె, కొలఁది, కోఁగు, కోఁచ, కోఁడు, కోఁతి, కౌఁగిలి, కౌఁజా, క్రేఁటు, క్రోఁతి, గాఁజరగడ్డ, గాఁడి, గాఁడు, గానఁగ, గీఁక, గీఁకు, గేదఁగి, గోఁకు, గోఁగు, గోఁచి, గోఁజా, గోఁటు, గోఁదు, గోరఁట, చినుఁగు, చీఁకటి, చీఁకు, చీఁద, చీఁదఱ, చీఁదు, చీఁపురు, చూఁడి, చూఁడు, చెనఁగి, చెనఁటి, చెఱఁగు, చెలఁగు, చేఁతారు, చేఁదు, చేఁప, చేఁపు, చాఁగ,

చాఁగు, చాఁదు, చాఁప, చాఁపు, జోడఁగి, జోణఁగి, చేఁకి, చేఁకు, డాఁగట, డాఁచుట, డోఁకు, డోఁగు, తరఁగ, తలఁకు, తఱఁగు, తలఁచు, తఱఁపు, తాఁకు, తాఁగలి, తాఁచు, త్రాఁచు, తాఁట, తాఁడి, తాఁడె, తాఁపు, తాఁబేలు, తీఁగ, తీఁగె, తీఁట, తీఁడిరించు, తీఁపురము, తునఁగ, తుఱఁగలి, తూఁగు, తూఁచు, తూఁట, తూఁటరి, తూఁడరి, తూఁటి, తూఁటు, తూఁడు, తూఁకొమ్ము, తెనుఁగు, తెలుఁగు, తెఱుఁగు, తేఁకు, తేఁకువ, తేఁటి, తేఁడు, తొడఁకు, తొనఁకు, తొరఁగ, తొరుఁగు, తొఱఁగు, తొలఁకు, తొలఁగు, తొలఁచు, తోఁక, తోఁగు, తోఁచ, తోఁచు, తోఁట, తోఁడు, తోఁడేలు, తోఁప, తోఁపు, త్రేఁచు, త్రేఁపు, దాఁక, దాఁకొను, దాఁగర, దాఁగిలిమూఁతలు, దాఁగు, దాఁచు, దాఁటు, దాఁపన, దాఁపటికము, దాఁపు, దాఁపురము, దూఁకలి, దూఁకు, దూఁకుడు, దూఁట, దూఁటు, దొరఁకు, దొరఁకొను, దొసఁగు, దోఁకిన, దోఁకుడు, దోఁకు, డోఁకు, దోఁగు, దోఁగురు, దోఁచు, దోఁటి, దోఁటు, దోఁపు, నలఁక, నలఁకువ, నలఁగు, నలఁచు, నలుఁగు, నాఁగలి, నాఁగెలు, నాఁగు, నాఁగురు, నాఁచు, నాఁచుడు, నాఁడు, నాఁడెము, నాయఁడు, నిసుఁగు, నీఁగు, నీఁడు, నురుఁగు, నూఁక, నూఁగు, నెలఁత, నెలఁతుక, నేఁడు, నోఁచు, పడఁకు, పణఁకు, పడఁత, పడఁతి, పడఁతుక, పణఁతి, పణఁతుక, పసఁడి, పయఁట, పయిఁడి, పరఁగు, పరఁటి, పరుఁజు, పరఁట, పరఁటె, పవుఁజు, పసఁగు, పసిఁడి, పాఁకుడు, ప్రాఁకుడు, పాఁకోడు, పాఁగెము, పాఁచి, పాఁడి, పాఁత, పాఁతు, పిడుఁజు, పిడుఁదు, పినుఁగు, పిఱుఁదు, పిలుఁగు, పిసుఁగు, పీఁకుట, పీఁకె, పీఁచము, పీఁచ, పీఁచు, పీఁట, పీనుఁగు, పులుఁగు, పూఁచు, పూఁట, పూఁదులు, పూఁత, పూఁపు, పెనఁకువ, పెనఁగు, పెరుఁగు, పేఁట, పేఁటు, పేఁడకడి, పేఁడు, పేఁటము, పైఁట, పయిఁట, పైఁడి, పొదుఁగు, పొనఁగు, పొరఁటు, పొలఁకు, పొలఁతి, పొలఁతుక, పొసఁగు, పోఁక, పోఁకు, పోఁగు, ప్రోఁగు, పోఁపు, పోఁగొట్టు, పోఁచి, పోఁచీ, పోఁచ, పోఁజు, పోఁడి, పాఁజు, ప్రాఁకు, ప్రాఁచి, ప్రాఁత, ప్రోఁజు, బాఁకు, బాఁజు, బాఁతి, బాఁదు, బాఁపన, బీఁట, బీఁటిక, బూఁజు, బూఁదు, బెడఁకు, బెడఁగు, బెడఁద, బెడఁకు, బెణఁకు, బెళఁగు, బెళఁకు, బోఁకి, బోఁకె, బోఁటి, మడఁక, మడఁగు, మణఁగు, మడఁచు, మడుఁచు, మడఁతి, మడఁతుక, మడుఁగు, మడుఁచు, మణఁగు, మణుఁచు, మఱఁదలు, మఱఁది, మఱుఁగు, మలఁక, మలఁగ, మలఁగు, మఱఁచు, మలఁపు, మసఁగు, మాఁకు, మ్రాఁకు, మాఁగు, మాఁగుడు, మాఁటు, మాఁడు, మాఁడెము, మాఁతు, మిడుఁగురు, మిణుఁగురు, మీఁగడ, మీఁద, మీఁది, మీఁదు, ముడుఁగు, ముణుఁగు, ముడుఁచు, మునుఁగు, మూఁక, మూఁకుడు, మూఁగ, మూఁగు, మూఁడు, మూఁపు, మెఱుఁగు, మెఱుఁగుడు, మెలఁకువ, మెలఁగు, మెలఁచు, మెలఁత, మెసఁగు, మేఁక, మేఁగు, మేఁడి, మొఱఁగు, మొఱుఁగు, మోఁకరించు, మోఁద, మోఁదు, మ్రాఁగు, మ్రేఁగు, రేఁగు, రేఁగుచెట్టు, రేఁగుడు, రోఁకలి, రోఁజా, రోఁజుడు, రేఁచు, రేఁడు, లాఁక, లాఁగ, లాఁతి, లాఁతు, లేఁక, లేఁగ,

లోఁకువ, లోఁగిలి, లోఁగు, లోఁడు, లోఁతు, వడఁకు, వణఁకు, వలఁతి, వాఁక, వాఁకుడు, వాఁగు, వాఁడి, వాఁత, వాఁకిరిగొట్టు, వాఁపు, వీఁగుట, వెడఁగు, వెడఁద, వెరఁజు, వెఱఁగు, వెలఁగ, వెలఁది, వెలఁగు, వేఁకరము, వేఁకి, వేఁగి, వేఁగీ, వేఁగు, వేఁచు, వేఁట, వేఁడి, వేఁడు, వేఁపి, వేఁపు, వ్రేఁగు, వ్రేఁడు, సంపఁగి, సాఁకు, సాఁగు, సాఁడు, సాఁతు, సురఁటి, సురుఁగు, సైఁదము, సోఁకు, సోఁగు.

---

# శకటరేఫములు



అందఱు, అక్కఱ, అఱ, అఱక, అఱకఱ, అఱగొఱ, అఱకఱలు, అఱచుట, అఱిమఱి, అఱకము, అఱకాలు, అఱసేయి, అఱజాతి, అఱడా, అఱప, అఱమర, అఱమరిక, అఱవ, అఱవకు, అఱవము, అఱవరలు, అఱిముఱి, అఱిమెసఁగుడలు, అఱిసె, అఱు, అఱుకువ, అఱుగు, అఱుగుస్సు, అఱుత, అఱుపు, అఱుము, అఱ్ఱాక, అఱ్ఱాఁకలి, అఱ్ఱాడు, అఱ్ఱు, అఱ్ఱెము, ఆఱడి, ఆఱు, ఆఱుగురు, ఆఱుపు, ఆఱుగ, ఇద్దఱు, ఇఱికి, ఇఱుకు, ఇఱుము, ఇఱ్ఱి, ఇఱియుట, ఈరువాఱు, ఈఱమి, ఈఱను, ఉఱవు, ఉఱిది, ఉఱియ, ఉఱు, ఊఱుకు, ఉఱుత, ఉఱువు, ఊఱుము, ఊఁఱట, ఊఁఱడిల్లు, ఊఱు, ఎఱ, ఎఱఁగు, ఎఱక, ఎఱగందు, ఎఱగొను, ఎఱచి, ఎఱబరికము, ఎఱసంజ, ఎఱుఁగమి, ఎఱుఁగు, ఎఱుక, ఎఱుకు, ఎఱుకువ, ఎఱుపు, ఎఱ్ఱ, ఏమఱు, ఏఱు, ఏఱుప, ఒక్కఱ, ఒఱ, ఒఱకటము, ఒఱకము, ఒఱగడ్డము, ఒఱగు, ఒఱటు, ఒఱపరి, ఒఱపిఁడి, ఒఱపు, ఒఱలు, ఒఱప, ఒఱవు, ఒఱుబీజము, ఒఱ్ఱ, ఒఱ్ఱు, ఒఱ్ఱె, కన్నఱ, కన్నఱి, కఱ, కఱకరి, కఱకఱి, కఱకు, కఱపు, కఱచు, కఱటి, కఱత, కఱద, కఱవు, కఱి, కఱివేము, కఱుకు, కఱుగోల, కఱుదు, కఱ్ఱ, కఱ్ఱి, కఱు, కాఱియ, కాఱు, కాఱులు, కిఱకిఱ, కిఱుకు, కిఱుదు, కిఱ్ఱు, కుఱగలి, కుఱఁగట, కుఱకుఱ, కుఱు, కుఱుకు, కుఱుచ, కుఱుపు, కుఱువు, కుఱ్ఱ, కుఱ్ఱి, కుఱ్ఱు, కొఱ, కొఱఁకు, కొఱఁత, కొఱకు, కొఱకొఱ, కొఱడు, కొఱను. కొఱపము, కొఱలు, కొఱవ, కొఱవి, కొఱు, కొఱుకు, కొఱ్ఱ, కొఱ్ఱు, కోడఱికము, కోఱ, కోఱడము, క్రమ్మఱ, క్రమ్మఱు, గద్దఱి, గఱగఱ, గఱగొఱ, గఱి, గఱిక, గఱుకు, గఱుప, గఱ్ఱె, గిఱక, గిఱి, గిఱుకు, గిఱుక్కు, గిఱుపు, గిఱువు, గీఱ, గీఱు, గుఱక, గుఱగుఱ, గుఱి, గుఱిచి, గుఱుకొను, గుఱుతు, గుఱుములు, గుఱ్ఱము, గుఱ్ఱు, గొఱకు, గొఱపము, గొఱవంక, గొఱుగు, గొఱ్ఱె, చిందఱ, చింపిఱి, చిచ్చఱ, చిచ్చుఱ, చిఱచిఱ, చిఱి, చిఱు, చిఱుత, చిఱుము, చిఱ్ఱ, చిఱ్ఱచిఱ్ఱ, చిఱ్ఱు, చీఁదఱ, చీఱు, చెఱ, చెఱఁగు, చెఱకడము, చెఱకు, చెఱచు, చెఱపు, చెఱమ, చెఱి, చెఱపు, చెఱుము, చెఱువు, చేఱు, చఱచు, చఱపు, చఱవు, చఱి,

చాఱియు, చాఁగఱ, చాఱిక, చుఱచుఱ, చుఱుకు, చూఱ, చొఱ, చోఱ, చోఱవాఁడు, జిలకఱ, జేగుఱు, జేవుఱు, జెఱ్ఱి, జఱభి, జఱజఱ, జాఱు, డగ్గఱు, డబ్బఱ, తంబుఱ, తక్కెఱ, తత్తఱము, తఱచు, తఱటు, తఱతఱ, తఱపి, తఱలు, తఱి, తఱిగొను, తఱిమెన, తఱియు, తఱుఁగు, తఱుగు, తఱుపు, తఱుము, తఱువు, తఱుసలి, తఱ్ఱ, తఱ్ఱు, తీఱు, తీఱుపు, తుఱుగు, తుఱుము, తుఱ్ఱ, తుఱ్ఱు, తెఱ, తెఱఁగు, తెఱకువ, తెఱప, తెఱపి, తెఱవ, తెఱవు, తెఱ్ఱ, తేఱి, తేఱిచూపు, త్రేఱు, తొఱ, తొఱఁగు, తొఱవు, తొఱ్ఱ, తొఱ్ఱి, తొఱ్ఱు, దగ్గఱ, దబ్బఱ, నఱకొ, నఱుకు, నఱుజు, నఱుము, నాఱు, నిఱు, నివుఱు, నుఱుపు, నుఱుము, నూఱు, నెఱఁకు, నెఱ, నెఱక, నెఱవాది, నెఱసరి, నెఱి, నెఱిక, పగఱు, పఱ, పఱకు, పఱచు, పఱపు, పఱవ, పఱిక, పఱిగ, పఱిపఱి, పఱియ, పఱ్ఱుపు, పఱ్ఱి, పాఁతఱ, పాడఱు, పాఱ, పాఱు, పాఱుఁడు, పాఱుడు, పాఱుత, పిఱికి, పిఱు, పిఱుఁదు, పిఱుము, పిఱ్ఱ, పుఱ్ఱ, పుఱ్ఱె, పెఱ, పెఱుకు, పెఱుగు, పొఱడు, పొఱయు, పోఱి, పోఱిగాఁడు, బజాఱము, బజాఱు, బఱటు, బఱ్ఱె, బీఱ, బీఱు, బుఱ్ఱ, బుఱ్ఱి, బుఱ్ఱు, బొఱియ, బొఱ్ఱ, మఱఁదలు, మఱఁది, మఱక, మఱకువ, మఱపు, మఱలు, మఱి, మఱు, మఱుఁగు, మఱుకువ, మఱువ, మఱువు, మఱుస, మఱ్ఱి, మాఱకము, మాఱాటము, మాఱు, మిఱు, మిఱుమిట్లు, మిఱ్ఱు, మీఱు, ముక్కఱ, ముఱకము, ముఱి, ముఱికి, ముఱియు, మూఱుగు, మూఱ్ఱు, మెఱపు, మెఱము, మెఱయు, మెఱియ, మెఱుకు, మెఱుఁగు, మెఱుము, మొఱ, మొఱక, మొఱకడము, మొఱకు, మొఱకుఁడు, మొఱవ, మొఱికి, మొఱుఁగు, మొఱ్ఱ, మొఱ్ఱి, రూపఱు, ఱంపటాలు, ఱంకె, ఱంకెత, ఱంతు, ఱంపము, ఱంపు, ఱంపె, ఱక్క, ఱట్టు, ఱప్ప, ఱవిక, ఱవ్వ, ఱాఁగ, ఱాచు, ఱాయి, ఱిచ్చ, ఱివ్వున, ఱెక్క, ఱేఁగు, ఱెప్ప, ఱెల్లు, ఱేఁచు, ఱేఁడు, ఱేవు, ఱేపు, ఱేయి, ఱేల, ఱైక, ఱయిక, ఱొచ్చ, ఱొడ్డ, ఱొడ్డు, ఱొమ్ము, ఱోలు, వందఱ, వఱ, వఱకు, వఱగొడ్డము, వఱదు, వఱప, వఱపు, వఱల, వఱలు, వఱువట్లు, వఱువాత, వఱ్ఱు, వఱ్ఱె, వఱ్ఱియు, వఱ్ఱొడ్డు, వాతెఱ, వాఱు, వాఱెన, విఱిగి, విఱిచి, విఱుగు, విఱుచు, విఱుపు, విఱ్ఱవీగు, వీఱిఁడి, వెఱ, వెఱఁగు, వెఱక, వెఱపు, వెఱ్ఱి, వెఱ్ఱిబీఱ, వెఱ్ఱివాఁడు, వెలరువాఱు, వెలవెలఁబాఱు, వెలివాఱు, వెలుఁగుఱేఁడు, వెలుఁగఱచు, వెల్కఁబాఱు, వెల్లఁబాఱు, వెల్లచఱపు, వేఁదుఱు, వేమఱు, వేమాఱు, వేఱచము, వేఱిఁడి, వేఱిఁడించు, వేఱిమి, వేఱు, వేఱుపడు, వేఱుపాటు, వేఱుపోవు, వేఱుపుచ్చు, వేఱుబందము, వేల్పుటేఱు, వేలుపుఱేఁడు, ప్రక్కవాఱు, సిగ్గఱు, సుఱసుఱ, సేదుకఱ్ఱ, సౌఱ.

# గుణదోషపరిచ్ఛేదము



సూ:—యకారము, వువూవొవోలు, ణళలు తెనుఁగుపదముల మొదట నుండరాదు.

ఒప్పు—అంత, ఇక్కడ, ఉప్పు, ఊరు, ఒకటి, ఓర, నావ, లావు.

తప్పు—యంత, యిక్కడ, వుప్పు, వూరు, వొకటి, వోర, ణావ, ళావు.

సూ:—శషసలను తాఱుమాఱు చేయుట.

ఒప్పు—శిరస్సు, ఇష్టము, సీత, నివసించు, అవశ్యము.

తప్పు—శిరసు, ఇస్టము, శీత, నివశించు, అవస్యము.

సూ:—ద్రుత ప్రకృతికముమీఁద యడాగమ దోషము.

ఒప్పు—చూచెనతఁడు, అక్కడనుండెను, నావలె నేగెను.

తప్పు—చూచెనతఁడు, అక్కడయుండెను, నావలెయేగెను.

సూ.—కళలమీఁద నకారాగమ దోషములు.

ఒప్పు—ఏలయన, లేకయే, చావకయుండెను.

తప్పు—ఏలనన, లేకనే, చావకనుండెను.

సూ:—వట్రువసుడి దోషములు.

ఒప్పు—కృప, కృష్ణుఁడు, ద్రుతము, సంస్కృతము, క్రూరము.

తప్పు—క్రుప, క్రుష్ణుఁడు, దృతము, సంస్క్రితము, కౄరము.

సూ:—ధాతువులలోని యకారమునకు సవర్ణము వ్రాయుట.

ఒప్పు—చేయుట, కోయుట, వ్రాయుట.

తప్పు—చేసుట, కోసుట, వ్రాసుట.

సూ:—దుష్టహల్సంయోగము.

ఒప్పు—శరచ్చంద్రిక, వృక్షచ్ఛాయ, పుత్త్రుఁడు.

తప్పు—శరశ్చంద్రిక, వృక్షఛాయ, పుత్రుఁడు.

సూ:—ప్రథమావిభక్తి మువర్ణమును బిందువుగా వ్రాయుట.

ఒప్పు—కలము, ఫలము, పాలము, గుఱ్ఱము, ధనము.

తప్పు—కలం, ఫలం, పాలం, గుఱ్ఱం, ధనం.

సూ:—ఒత్తులను తాఱుమాఱు చేయుట.

ఒప్పు—బాధ, దారము, భేదము, కష్టము.

తప్పు—భాద, ధారము, బేధము, కషము.

సూ:—క్త్వార్థకేకార సంధిదోషములు.

ఒప్పు—వచ్చియిచ్చెను, చేసియుడుగు, ఎఱింగి యెఱింగి.

తప్పు—వచ్చిచ్చెను, చేసడుఁగు, ఎఱింగెఱింగి.

సూ:—ఆత్మనేపద 'కొను'నకు కకారాదేశము.

ఒప్పు—పెట్టుకొని, తీసికొని, చేసికొని, మోసికొని.

తప్పు—పెట్టుక, తీసుక, చేసుక, మోసుక.

సూ:—ప్రార్థనార్థకములను వ్యతిరేకార్థకములుగావాడుట.

ఒప్పు—చేయుమనియె, చావుమనియె, తీయుమనియె.

తప్పు—చేయమనియె, చావమనియె, తీయమనియె.

సూ:—ఉకారసంధిపై యడాగమము.

ఒప్పు—వాఁడేగెను, వాఁడు వెళ్లెను, అతఁడిచ్చెను.

తప్పు—వాఁడుయేగెను, వాఁడెళ్లెను, అతఁడు యిచ్చెను.

సూ.—పునరుక్తి దోషములు.

1. అగ్గినిప్పు, 2. హిమాచల పర్వతము.

సూ:—ఔప విభక్తికములను పాటింపకుండుట.

ఒప్పు—నేతికై, గోతిలో, ఏటికి, త్రాటిని.

తప్పు—నేయికై, గోయిలో, ఏఱునకు, త్రాడును.

సూ:—వాక్యరచనలో వచనదోషములు.

ఒప్పు—సీతారామలక్ష్మణు లడవుల కేగిరి.

తప్పు—సీతారామలక్ష్మణు లడవుల కేగెను.

సూ:—విశేషణ విశేష్యములను భిన్నవిభక్తులలో వ్రాయుట.

ఒప్పు—భగవంతుని శ్రీరాముని బూజించిరి.
తప్పు—భగవంతుఁడు శ్రీరాముని బూజించిరి.

గమనిక:—విశేషణంబుల షష్ఠికి మాత్రము ప్రథమ వ్రాయవచ్చును.

ఉ॥ సుగుణాభిరాముఁడు రామునకు జోహారు.

సూ:—కర్మధారయమునందు మహచ్ఛబ్ద తకారమునకు బదులుగా ఆకారమువచ్చి 'మహా' యగును. ఇతరస్థలములందు మార్పులేదు.

ఒప్పు—మహారాజు, మహాభాగ్యము, మహానవమి.
తప్పు—మహరాజు, మహాద్భాగ్యము, మహాన్నవమి.

సూ:—కేవల సంస్కృతశబ్దములను తెనుఁగు లేక తత్సమశబ్దములతో సమసింపఁ జేయుట.

ఒప్పు—పంచవర్ణములు, అనేక పర్యాయములు, చెడ్డయలవాటు.
తప్పు—పంచరంగులు, అనేకసారులు, దురలవాటు.

సూ:—ధాతురూపముల యిత్వమున కత్వమును, అత్వమున కిత్వమును వ్రాయుట.

ఒప్పు—పిలిచెను, అడిగి, దొరకినది, కలిసి, తెలిసి.
తప్పు—పిలచెను, అడగి, దొరికినది, కలసి, తెలసి.

సూ.—యువర్ణాంత ధాతువులకు ఇకార, ఎకారములు పరమగునపుడు సకారము వచ్చును.

ఒప్పు—తీసికొను, మూసికొను, వ్రాసికొను, కోసికొను.
తప్పు—తీసుకొను, మూసుకొను, వ్రాసుకొను, కోసుకొను.

సూ:—వాడుకలో నసాధురూపము నొందిన పదములను గుర్తించి వ్రాయకుండుట

ఒప్పు—మట్టమధ్యాహ్నము, ఒబ్బట్లు, పులిహోర, కురియించు.
తప్పు—మిట్టమధ్యాహ్నము, బొబ్బట్లు, పులిహార, కురిపించు.

సూ.—కొన్నిశబ్దములమీఁది యచ్చులను లోపింపఁజేసి, మీఁది హల్లుతోఁ గూర్చుట.

ఒప్పు—అందులకు, గనుక, తీసికొని, మన.
తప్పు—అంద్లకు, గన్క, తీస్కొని, మ్న.

సూ:—స్ఫుటమైన యుచ్చారణలేక ఒత్తులు తారుమారు చేయుట.

ఒప్పు—పక్షము, గార్దభము, పాఠశాల, సౌఖ్యము.
తప్పు—పచ్చము, గార్ధబము, పాటసాల, సౌక్యము.

సూ:—అకార ఎకారములను తారుమారుచేసి పదములు వాడుట.

ఒప్పు—చరిత్ర, జంతువు, కొంచెము, చెమట, చంచలము.
తప్పు—చెరిత్ర, జెంతువు, కొంచము, చమట, చెంచెలము.

సూ:—కొన్ని శబ్దదోషములు.

ఒప్పు—ఇంకన్, బాగుగన్, చాలన్, కూడన్, లేకుండన్.
తప్పు—ఇంకా, బాగా, చాలా, కూడా, లేకుండా.

సూ:—లఘురేఫ ద్విత్వమును వాడుట.

ఒప్పు—గుఱ్ఱము, కఱ్ఱ, వెఱ్ఱి, మఱ్ఱి.
తప్పు—గుర్రము, కర్ర, వెర్రి, మర్రి.

సూ:—సర్వనామములలో దుష్టప్రయోగములు.

ఒప్పు—అతఁడు, వానిని, ఒకటి, సొంతము, తోడివాఁడు.
తప్పు—అతను, వాటిని, ఒకే, స్వంతము, తోటివాఁడు.

సూ:—సంస్కృతశబ్దములు తెనుఁగులో తప్పుగా వ్రాయుట.

ఒప్పు—ఆజ్ఞ, ఆధిక్యము, తత్క్షణము, దారిద్ర్యము, మధ్యాహ్నము.
తప్పు—అగ్న, అధిక్యత, తక్షణము, దరిద్రము, మధ్యాన్నము.
ఒప్పు—దార్ఢ్యము, మాహాత్మ్యము, శాశ్వతము, శుశ్రూష.
తప్పు—దారుఢ్యము, మహత్యము, శాశ్వితము, శిశ్రూష.

సూ:—థ ధ వర్ణముల తేడాను గుర్తింపకుండుట.

ఒప్పు—అతిథి, ప్రథమ, గ్రంథము, పృథివి, రథము, ధనము.
తప్పు—అతిధి, ప్రధమ, గ్రంధము, పృధివి, రధము, థనము.

---

# ఛందఃపరిచ్ఛేదము

పద్యములకుఁ గారణమయిన వర్ణనియతిని దెలుపు భాగము.

సూ:— వృత్తములు, జాతులు, ఉపజాతులని పద్యములు మూఁడు విధములు.
వృత్తములు—1. ఉత్పలమాల, 2. చంపకమాల, 3. శార్దూలము మొ॥

(ఈ పద్యములు గురు లఘువులతోఁ గూడిన గణములచే నేర్పఱుపఁబడు చున్నవి.) గురు లఘు నిర్ణయము — దీర్ఘములగు నక్షరములు, పూర్ణబిందువు, విసర్గము, పొల్లు పరమైనఁగల యక్షరములు, సంయుక్తాక్షరమునకు ముందున్న యక్షరములు గురువులు. తక్కినవి లఘువులు.

ఉ॥ శ్రీ, గద్య, కం, కః గురువులు. క, చ, ట లు లఘువులు.

విశేషాంశములు:—పాదాంతమున పొల్లు హల్లు పరమైనచో పూర్వవర్ణము గురువగును. రేఫ సంయోగమునకుఁ బూర్వమందున్న వర్ణము సమయానుకూలముగ గురువు, లఘువుకూడఁ గావచ్చును. భిన్నపదగతమగు సంయోగము పూర్వవర్ణమునకు గురుత్వమును గలిగించునని కొందఱును, కలిగింపలేదని కొందఱును దలంతురు.

గురువు పరమేశ్వరాకృతియనియు, లఘువు గిరికుమారికాకృతియనియుఁ జెప్పఁబడెను. లఘువు ఒకమాత్ర గలది. గురువు రెండు మాత్రలు గలది. అనఁగాఁ జిటిక వేయునంత కాలములో నచ్చరింపఁదగినది లఘువనియు, రెండు చిటికలు వేయు కాలములోఁ బలుకఁబడునది గురువనియు భావము. పద్యముల మొదటి యక్షరము యతి యనియు, రెండవ యక్షరము ప్రాస మనియుఁ జెప్పఁబడును.

అ ఆ ఎ క చ ట త ప య ష లు: —వాయు బీజాక్షరములు.
ఇ ఈ ఐ ఖ ఛ ఠ థ ఫ ర స లు:—అగ్ని బీజాక్షరములు.
ఉ ఊ ఓ గ జ డ ద బ ల హ లు:—భూమి బీజాక్షరములు.
ఋ ౠ ఔ ఘ ఝ ఢ ధ భ వ శ లు:—జల బీజాక్షరములు.
ఌ ౡ అం ఙ ఞ ణ న మ ళ అః లు:—గగన బీజాక్షరములు.

వాయు, అగ్ని, గగన బీజాక్షరములు పద్యాదిని నిలిపిన నశుభప్రదములు. భూమి జల బీజాక్షరములు శుభప్రదములు. గురువు "గ" లేక "U", లఘువు "ల" లేక "।" ఇవి సంజ్ఞలుగాఁ దెలియునది.

శ్లో॥ ఆది మధ్యావసానేషు యరతా యాంతి లాఘవమ్ ।
భజసా గౌరవం యాంతి మనౌ తు గురులాఘవే ॥ (వృత్తరత్నాకరము)

ఆది, మధ్య, అవసానములయందు లఘువు లున్నచోఁ గ్రమముగా య, ర, త గణములును, గురువు లుండెనేని భ, జ, స గణము లగును. మూఁడు గురువులు గలది మగణము, మూఁడు లఘువులు గలది నగణము.

గణములు రెండు విధములు 1. నిసర్గగణములు, 2. ఉపగణములు.
గగము = రెండు గురువులు గలది (శ్రీశ్రీ)
గలము (హగణము) = గురువును లఘువును గలది = (రామ)
లలము = రెండు లఘువులు గలవి = (రమ).
లగము (వగణము) = లఘువును గురువును గలది = (హరీ.)
మగణము = మూఁడు గురువులు గలది = (వంగేంద్రా.)
భగణము = మొదట గురువు పిదప రెండు లఘువులు గలది = (రంగన)

జగణము = మొదట లఘువును పిదప గురువును మీఁద లఘువునుగలది (మహాత్మ.)
సగణము = మొదట రెండు లఘువులను పిదప గురువును గలది = (అతివా)
నగణము = మూఁడు లఘువులు గలది = (వనము)
యగణము = మొదట లఘువును పిదప రెండు గురువులుగలది = (రమేశా)
రగణము = మొదట గురువును పిదప లఘువును మీఁద గురువునుగలది = మోహనా
తగణము = మొదట రెండు గురువులను పిదప లఘువును గలది = (రంగేంద్ర)

గమనిక:—'య, మా, తా, రా, జ, భా, న, స' ఇందు ఏమూఁడక్షరములను వరుసగాఁ దీసికొన్నను మొదటి యక్షరము పేరుగల గణమగును. ఎట్లనఁగా,

ఉ॥ యమాతా —యగణము
మాతారా:—మగణము
తారాజ:—తగణము
రాజభా:—రగణము
జభాన:— జగణము
భానస: —భగణము
నసయ:—నగణము
సయమా:—సగణము

ఈ పైఁ జెప్పఁబడినవన్నియు త్రికగణములు.
సూర్యగణములు = 1. నగణము, 2 హగణము
ఇంద్రగణములు = నగము, నలము సలము, భ, ర, త గణములు.
చంద్రగణములు = నగగము, నహము, సలలము, భలము, భగురువు, మలఘువు, సవము, సహము, తలము, రలము, రగము, నవము, నలలము, తగము.

యతి:—సూ. పద్యప్రథమపాదాద్యక్షరమునకు యతియని పేరు.

పద్యపాదాదిని గురు లఘువులలో నేదియున్నను దానినే నాల్గుపాదములందును నిలుపవలయును. యతులయందు స్వరము ముఖ్యము. విరతి, విశ్రాంతి, విశ్రామము, విశ్రమము, శ్రాంతి, విరమణము, విరమము, వళి మొదలగునవి తొమ్మిదియు యతియను పదమునకుఁ బర్యాయపదములు.

—: యతివర్ణసామ్యము :—

అ ఆ ఐ ఔ లు, ఇ ఈ ఋ ౠ ఎ ఏ లు, ఉ ఊ ఒ ఓ లు తమలోఁ దాము పరస్పర మిత్రములు. హ యలు స్వరసామ్యమును బొంది పై స్వరముల కన్నిటికిని మిత్రములగును సర్వస్వరమైత్రి బొందును. రేఫము స్వరసామ్యము కలిగి ఋ ౠలకును, వానితోడి యెల్లహల్లులకును మిత్రమగును. ఋ ౠలతోఁ గూడిన హల్లులు తమలోఁ దాము మిత్రములగును ఋఋూలతోడను, వాని మిత్రములతోడను మైత్రి కలిగియుండును సంస్కృతసంధిలో నాదేశముగా వచ్చెడి ఐకారమునకు ఏకారాదులను నట్టి ఔకారమునకు ఓకారాదులును మిత్రములగును.

క ఖ గ ఘలు, చ ఛ జ ఝ శ ష స హలు, ట ఠ డ ఢలు, త థ ద ధలు, ప ఫ బ భ వలు, ర ఱ ల ళలు, జ ఞ న ణలు, ల ళ డలు, అ హ యలు పరస్పర మిత్రములు. పూర్ణబిందుపూర్వకములగు ట ఠ డ ఢ త థ ద ధలును, ణ న లను మిత్రములు. క ఖ గ ఘలు, చ ఛ జ ఝలు పూర్ణబిందుపూర్వకములై జ ఞ మలతో

మిత్రము లగును. ఉకారోకార విశిష్టములగు ప ఫ బ భ మ లు మిత్రములు. యతిస్థానమున సంయుక్తవర్ణము వచ్చెనేని అందలి వర్ణములలో దేనికైనను యతి వేయనగును. ప్రాది సంధులలో సయితము సంధి విరిచి యుత్తరపదాద్యచ్చుతోఁగాని, విరువక విశిష్టముతోఁగాని యతి వేయవచ్చును.

## —: యతి భేదములు :—

పరసయతులు:—నణలకును, అయహలకును, శషసచఛజఝలకును యతి చెప్పుట.

సంయుక్తయతి — పాదాదినిగాని, యతిస్థానమునఁగాని సంయుక్తాక్షరమున్నచో నా యక్షరమున నే వర్ణమునైనను గ్రహించి యతి చెప్పుట.

వర్గయతి —క చ ట త ప వర్గములలో అంత్యాక్షరములగు ననునాసికములుగాక మిగిలిన వర్గాక్షరములు పరస్పరము యతి మైత్రి కలిగియుండుట.

జ్ఞావడి:— సంస్కృతపదమందలి జ్ఞ వర్ణమునకును, తద్భవరూపమునందు వచ్చిన న ణ లకును యతి చెల్లుట.

దేశీయయతి — పాదాది స్వరమునకును, యతి స్థానమునందలి హల్లుమీఁది యచ్చునకును సామ్యము లేకున్నను స్వరమైత్రి కలుగునట్లు చెప్పుట.

ఎక్కటియతి.—ల, ర, మ, ఱ, వ యను నక్షరములు పాదాదిని యతిస్థానమునను అత్వముతోఁ గూడియుండుట.

పోలికయతి:— మ వర్ణమునకును, పు ఫు బు భు యను వర్ణములకును గల మైత్రిని పోలికయతి యందురు.

చక్కటియతి —పు ఫు బు భు లకు స్వరమైత్రిగల మకారముతో యతిచెల్లుట.

పరసస్వరయతి:— పాదాదినిగాని, యతిస్థానమునఁగాని హల్లునైనున్న యచ్చును సంధిచేయఁగా మఱియొక యచ్చుగా మాఱినను దానికి మైత్రికలదు. దీనికి స్వరప్రధానవళి యను నామాంతరము కలదు.

బిందుయతి
అనుస్వారయతి } బిందుపూర్వకములగు కవర్గ చవర్గ టవర్గ తవర్గ పవర్గములందలి వరుస నాలక్షరములతో క్రమముగా ననునాసికాక్షరములగు ఙ ఞ ణ న లకు యతి చెల్లును.

స్వరయతి:—ఉపసర్గలును నిత్యసమాసములగు పదములుగాక తక్కిన పదములన్నిఁట పాదాదియందలి స్వరము విశ్రమ స్థానమునందున్న స్వరము సంధివలనవచ్చినను మైత్రి గలిగినచో యతి చెప్పవచ్చును.

మావడి.— బిందుపూర్వకములగు య ర ల వ శ ష స హ వర్ణములు మకారముతో యతి మైత్రి నొందును.

ప్రాసయతి.— ప్రాసాక్షరము ననుసరించి యతి చెప్పుట. విశ్రమస్థానమందలి యక్షరమునకుఁ బిమ్మటి యక్షరము యతిస్థాన మగును.

అభేదయతి:—వ బ లకును, రల డలకును, ప ఫ బ భ లతో వకారమునకును యతి చెల్లును.

## -: ప్రాస భేదములు:-

ప్రాసము—సూ. పద్య ప్రథమపాదమునందలి ద్వితీయాక్షరము ప్రాసము.

పద్య ప్రథమపాదమున నే యక్షరము ద్వితీయాక్షరమై యుండునో యా వర్ణమే మిగిలిన మూఁడుపాదములయందును ద్వితీయాక్షరముగా నుండవలయును. ప్రాసమునందు వ్యంజనమైత్రియే కాని స్వరమైత్రి ముఖ్యముకాదు. ప్రాసవర్ణము పూర్ణబిందుపూర్వకమై యుండినయెడల మిగిలిన మూఁడుపాదములయందు నట్లేయుండవలెను. అర్ధబిందువున కట్టి పూర్ణవిధి లేదు. రేఫలకార సంయోగముతోఁ గూడిన యితరవర్ణములు ప్రాసస్థానమున వచ్చినచో రెండవచోట రేఫలేకున్నను జెల్లును.

సుకరప్రాసము:—ప్రాసస్థానమునఁ జెప్పఁబడిన యక్షరము నచ్చటచ్చట ప్రతిపాదమునను జెప్పుట.

అవప్రాసము.—ప్రాసాక్షరమును యతిస్థానముల ముందు వెనుకల నుంచుట.

దుష్కరప్రాసము:—సులభముగా లభింపని యక్షరమును ప్రాసస్థానమునఁ జెప్పుట.

అంత్యప్రాసము—మొదటిపాదము చివర ప్రయోగించిన వర్ణమును మార్పుచేయక ప్రతిపాదము చివరను ప్రయోగించుట.

ద్విప్రాసము.—4 పాదములందును ప్రాసస్థానమున జంటగా రెండక్షరములను బ్రయోగించుట.

త్రిప్రాసము:—నాలుగు పాదములందును ప్రాసస్థానమున నొక్కరీతిగానే మూఁడక్షరములు ప్రయోగించుట.

కందము —కందమునకు నాలుగు పాదములుండును. మొదటిపాదమున మూఁడు గణములును, రెండవపాదమున నయిదు గణములు నుండును. అవి నల, గగ, భ, జ, స గణములలో నేవియైనను గావచ్చును. ఇందు మొదటి రెండుపాదములను బూర్వార్థమనియు, మిగిలిన రెండుపాదముల నుత్తరార్థమనియుఁ జెప్పుదురు. మొదటి పాదమున యతి లేదు. రెండవ పాదమున మూఁడవ గణము జగణముగాఁగాని, నలముగాఁ గాని యుండవలెను. నాల్గవగణముయొక్క ప్రథమాక్షరమున యతి చెల్లవలెను. దీని యంత్యాక్షరము గురువుగా నుండవలెను. ఈ లక్షణమే యుత్తరార్థమునకు (మూఁడు నాల్గు పాదములు) ను జెల్లును. 1, 3 పాదములలో బేసి గణముగాను, 2, 4 పాదములలో సరిగణముగాను జగణ ముండరాదు. నాలుగు పాదములయందును ప్రాసనియమము కలదు.

ఈ క్రింది పద్యమును లక్షణముగాను, లక్ష్యముగాను జూచుకొనునది.

ఉదా:—కం కందము త్రిశరగణంబులు

నందును। గాభజ సనలము లైదుసె గణముల్
పొందును నాఱిట నలజము
లొందుం దుదిగురు వుజగణ మొప్పదు బేసిన్.

తేటగీతి — ఈ పద్యమునఁ బ్రతిపాదమునందు నయిదేసి గణము లుండును. ఒక సూర్య గణము, రెండు ఇంద్రగణములు, రెండు సూర్యగణములు కలిగియుండును. పాద ప్రథమవర్ణమునకును, నాల్గవగణము మొదటి యక్షరమునకును యతి చెల్లును. ఇందుఁ బ్రాసయతియుఁ (యతికి మాఱుగఁ బ్రాసమువాడుట) చెల్లును.

ఉ॥— తే. గీ. మిత్రుఁ డొక్కఁడు వీణియ మీటు చుండి
విబుధ వరులిద్ద ఱగ్ంబు విప్పి చెప్ప
నినులు నిద్దరు వినుచుండ నేక గతిని
దేట గీతంబు మాఁటను వాట మయ్యె॥

ఆటవెలఁది:—ప్రథమపాదమున మూఁడు సూర్యగణములును, పిమ్మట రెం డింద్ర గణములు నుండును. ద్వితీయపాదమున నయిదు సూర్యగణము లుండును. మూఁడు నాలుగు పాదముల యందును వరుసగా నిట్లే యూహించుకొనునది. ప్రతిపాదము నందును నాల్గవగణము, మొదటియక్షరమున యతిచెల్లును. ఇందుఁ బ్రాసయతియు నొప్పును.

ఉ మేలు మేల । టంచు మిత్రులు ముగ్గురు
వింత వింత యనుచు విబుధు లిద్ద
అహహ యనుచు సూర్యు లయిదుగు రును మెచ్చ
నాట । వెలఁది మాఁట నలరు నగము॥

సీసము:—ప్రతిపాదమునందును నాలేసి యింద్రగణములును, పిదప రెండు సూర్య గణములును గలిగి నాలుగు పాదములలో నొప్పును. ప్రథమగణాద్యక్షరమునకుఁ దృతీయగణాద్యక్షరమునకు నొక యతియుఁ, పంచమగణాద్యక్షరమునకు, సప్తమ గణాద్యక్షరమునకు మఱియొక యతియుఁ జెల్లును. ఈ విధముగ నాలుగు పాద ములు ముగిసినపిమ్మట నాటవెలఁదిగాని, తేటగీతిగాని యుండవలెను. ఈ పద్య మునఁ బ్రాసయతి చెల్లును. 8 పాదములుగల యీ మొత్తమునకు సీసమని పేరు.

సీ॥ మందార । మకరంద మాధుర్య మునఁ దేలు

మధుపంబు వోవునే మదన । ములకు

చంపకమాల:—ఈ పద్యముయొక్క ప్రతి పాదమునందును న-జ-భ-జ-జ-జ-ర గణములు వరుసగా నుండవలెను. 11 వ యక్షరమున యతి చెల్లవలెను. ప్రాసము ముఖ్యము. (చంపకమాలలోని మొదటి రెండు లఘువులను దీసి యా స్థానమున నొక గురు వుంచినచో నుత్పలమాల యగును.)

ఉ॥ నజభ జజజ్జ రేఫలు । పెనంగి దిశాయ తితోడఁ గూడినన్
త్రిజగ । దభీష్ట శాబుధ నిధీవి నుచంప । కమాల । యైచనున్॥

ఉత్పలమాల:— ఈ పద్యమునకు ప్రతి పాదమునను భ-ర-న-భ-భ-ర-వ (లగము) గణములు వరుసగా నుండవలెను. పదియవ యక్షరము యతిస్థానము. ప్రాసము విధాయకము. ఈ పద్యపాదమునందలి ప్రథమాక్షరమగు గురువునకు బదులుగా రెండు లఘువు లుంచి యెడల నది చంపకమాల యగును.

ఉ॥— భానుస | మానవి | స్ఫురన | భారము | గొంటివి | గూడివి | క్రమ
స్థానము | నందుఁ బ | ల్కజయు | తంబుగ | నుత్పల | మాలయై | చనన్॥

శార్దూలవిక్రీడితము:— ఈ పద్యము యొక్క ప్రతిపాదమునందును మ-స-జ-స-త-త గ-గణములు వరుసగా నుండును. 13 వ యక్షరమున యతి చెల్లును. ప్రాసము ప్రధానము. ఇందు మొదటిగురువునకు మారుగ రెండు లఘువు లుంచినచో మత్తేభ విక్రీడిత మగును.

ఉ॥— సారచా | రుశశా | రదాయి | నయతిన్ | శార్దూల | విక్రీడి | తా
కారంబై | మసజ | స్తతిమ్ము | గనతా | గ్రప్రాప్త | పైచెల్వ | గన్.

మత్తేభవిక్రీడితము:— ఈపద్యము యొక్క ప్రతిపాదమునను స-భ-ర-న-మ-య-వ గణములు వరుసగా నుండును 14 వ యక్షరమున యతి చెల్లును. ప్రాసము నియమము. (పాదాదిని రెండు లఘువులకు బదులుగా గురువలను జేర్చిన శార్దూలమగును.)

మ॥ సలువొం | దన్ సభ | రల్ నమ | య్యవల | తోనంగూ | డిమత్తే | భవిం
పలరా | రన్ బదు | నాలుగో | విరతి | చేనానం | దరంగా | ధిపా॥

మత్తకోకిల:— ఈ పద్య ప్రతిపాదమునందును ర-స-జ-జ భ-ర గణములు వరుసగా నుండును. పదునొకండవ యక్షరమున యతి చెల్లును. ప్రాసము నియతము.

మత్త.— సత్క్రియా | రసజా | భరల్ భ | వసంఖ్య | విశ్రమ మొప్పఁగన్
మత్తకో | కిలవృ | త్తమాన | సమాన | రంగస్ఫు | పాలకా |

స్రగ్ధర:— ఈ పద్యమునకు మ-ర-భ-న-య-య-య గణములు వరుసగా నుండును; ఎనిమిదవ పదునైదవ యక్షరములయందు యతి యొప్పును. ప్రాసము విధాయకము.

స్ర॥ సారెన్ నా | గాధిరా | ట్ప్రంచద | శశిర | వటీక్షి | ద్ధరాస్ఫు | త్తుంగాం
తారాజీ | వాస్త్రయు | ద్యస్మర | ధిశయ | యయోద్యా | సిద్ధైరం | గభూపా॥

సుగంధి:— ప్రతిపాదమునను ర-జ-ర-జ-ర గణములు వరుసగానుండును. 9 వ యక్షరము యతిస్థానము. ప్రాసము లేదు.

ఉ॥— రంబుజం | బురంబు | జంబురం | బుచెన్న | మీరఁగా |
దామ్మిదిం | టవిశ్ర | మంబులో | రమైను | గంధికా॥

మాలిని:—ఈ పద్యమున న-న-మ-య-య- గణములు వరుసగా నుండును. 9 వ యక్షరము యతిస్థానము. ప్రాస మవసరము.

ఉదా:— నవవి | రమణ | యుక్తిన్ స్రా | వయాసం | గతంబై |
యవనిఁ | దగును | మాలిన్యా | ఖ్యచేఁ | గథీరా‖

దండకము — విద్వాంసు | లెల్లన్ హ | కారంబె | కానీక | కారంబె | కానీస | కారంబె | కానీక | చింపంద | గమ్మందు | గాని దుఁ | గాకేని | యాదింవ | కారంబు | గల్పించి | యామీఁది | కెల్లంద | కారంబు | లేమెంచు | గానిచ్చు | కవ్వచ్చు | నందాక | నిర్మించి | గర్వంతి | మంజేసి | నన్ దండ | కంబంద్రు | కాదంబి | నీనీల | గోపాల | బాలాన | మస్తేపు | నస్తే నమః.

(కవీశ్వరులు హ-న-స-తగణములలో నొకదానిని దీసికొని దానితోడనే దండకము పూర్తిచేయుచు నవసానమున గురువును ఘటింపవలయును)

ద్విపదలక్షణము.— ద్విపదమున ప్రతిపాదమునను మూఁడింద్రగణములు, పిదప నొక సూర్యగణము నుండవలెను. తొలియక్షరమునకును, మూఁడవ గణము నందలి తొలి వర్ణమునకును యతి చెల్లును. ప్రాసయతి పనికిరాదు. రెండు పాదముల చొప్పున ప్రాస మంచవలెను. రెండు చరణములు కలిపిన ద్విపద యగును.

ద్వి‖ ఇంద్రగ | ణములు మూఁ | డినగణం | బొకటి.
చంద్రాస్య | ద్విపదకుఁ | జనుఁజెప్ప | రే చ.

ఉ‖ ఎక్కడ | గుఱుఁడని | యెఱుఁగని | నీకు
నక్కటా గుఱుఁడు వి | - శ్వామిత్రుఁ | డయ్యె.

పంచచామరవృత్తము:— ఇందు నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను వరుసగా జగణ, రగణ, జగణ - రగణ జగణములును, పైని గురువు నుండును. పదియవయిం యతి ప్రాస మవసరము.

ఉ‖ త్వరాస దృగ్విధీ | యమాన | - దానతో | యశోషి | తాం
బురాలి | శర్ధనా | తికృత్ప్రి | - భూతకీ | ర్తిమండ | ల
స్ఫురత్తు | ధామయూ | ఖశైరి | - భూమి భృ | చ్ఛిరోల్ల | స
త్కిరీట | రత్నరా | జికాంతి | దీపితాం | ఘ్రిపంక | జా‖

మలయజము:— ఈ పద్యముయొక్క ప్రతిపాదమునను న-జ-న-స-న-న-భ-న-లగము లుండవలెను. ప్రతి యెనిమిదవ అక్షరమున యతియుండును. ప్రాసము నియమము.

ఉ‖ నలిన | విలోచ | న - నజ | నసనం | బులు - న | భనగ | ణంబులు | నటల |
గమున్ | మలసి | గిరిత్ర | య-మహి | తయతుల్ | తగి-మ | లయజ | వృత్తము | మహి వె | లయున్.

మధ్యాక్కర:— ఇందు పాదమునకు మొదట 2 ఇంద్రగణములు, 1 సూర్యగణము, మరల 2 ఇంద్రగణములు తిరిగి ఒక సూర్యగణము నుండియుండును. నాలుగవ గణము మొదటి వర్ణము యతిస్థానము. ప్రాస మవసరము.

ఉ॥ సురరాజ । యుగములోఁ గూడి - సూర్యుతో నొడఁబడి ॥ యుండి
సురరాజ యుగములోఁ గూడి - సూర్యుతో నొడఁబడి యుండి
కర మొప్పు నీ పాట నాలు - గణముల మధ్యాక్కరంబు
విరచింపఁ బ్రావళ్లు నిల్చు - నైలయుఁగ విజనాళ్ళ యుండ.

ధ్రువకోకిలావృత్తము:— పాదమున న-భ-ర-స-జ-జ-గురువు నుండవలెను. యతిస్థానము 12 వ అక్షరము. ఇందును ప్రాసము నియమము.

ఉ శుభవిలాసము కుందకే శివ - శూలి భవ్య విరామ మున్
సభర । సంబులు జాగముల్ దగు - న ర్యమైధ్రువ కోకి లన్.

మహాస్రగ్ధర:— ఈ వృత్తమున స-త-త-న-స-ర రగణంబులు నొకగురువును ప్రతిపాదమున నుండవలెను. ఇందు మూఁడు యతులు 1, 9, 16 స్థానములం దుండును. ప్రాసము 4 పాదములకును గలదు.

ఉదా॥ దిహ్మాఖండగ్లౌ శాఃక్షిపు నుముల సుమహా స్రగ్ధరా వృత్తమా శ్రీ
సహితా । దార్యాస తానల్ స రసగు రువుతన్ రంగ శ్రీ రంగధూ।పా.

ఉత్సాహము:— ఇందు వరుసగా 7 సూర్యగణములు, 5 వ గణము తొలియక్షరము యతిస్థానము. (నగణము , హగణము ( ) యీ రెండును సూర్యగణములు. ఇందేవేని యేడు గణములు వరుసగా నుండి తుదను గురు వుండవలెను.

ఉదా సాహచర్య పద్మమిత్ర - సస్త కంబు గురువు ను
త్సాహ వృత్త మునకు చెల్లు - జలజ దళవిలోచనా.

కవిరాజ విరాజితము:— 1 నగణమును, 6 జగణములను, 1 వగణము నుండును. మహాస్రగ్ధరలోవలె 1, 8, 14 అక్షరములు యతిస్థానములు. ప్రాస మవసరము.

ఉదా శ్రీమదు నవొక్క న-కార ముగాలు జ-కార ములన్ వరఁగంగ వకా
మురను నొడంబ డి-రాఁగ విరాజ వి-రాజి త మన్న ది రామనిభా.

మానినీవృత్తము:— ప్రతిపాదమునకు 7 భగణములమీఁద నొక గురువుగలిగి యుండును. ఏడేసి యక్షరముల కొక యతి చొప్పున 4 యతిస్థానము లుండును.

ఉదా॥ కారము లన్నిటఁ గన్గొన నేడుభ - కారము లొక్క గ-కారము తో
గారవ మైచనఁ - గావరు లన్నియుఁ । గల్గిన మానిని । కామని భా.

రమణక వృత్తము:— ప్రతి పాదమునందును మొదట 9 నగణములు, 1 వగణము నుండును. 1, 9, 17 అక్షరములు యతిస్థానములు.

ఉదా॥ మనసి జ జన క స-మ దశిపు । గజహ రి-మన గజన మ విర । మణకు । లలో
నన వ వన । నన-న లగము । లెనయఁగ- నన వ రమ ॥ త రమ । ణ కమ । మయన్.

వనమయూరము:— భ-జ-స-న-గ-గ యను గణములుండి, 9 యింట యతియుండును.

ఉదా:— ఉన్నత । మూలైన । సమ - యూ । ర కృతు । లోలిన్
ఎన్నఁగ । భజంబు । లప - యిన్ - నన గగం । బల్
చెన్నొంద । న దంతి । యతి - చెం।ది యల । రారఁగా
వెన్నుని । నుతింతు । రు ఐ-వే।కు లతి । భ క్తిన్.

లయగ్రాహి:—ప్రతిపాదమునను భ-జ-స న-భ-జ-స-న-భ-యగణములు. 9 అక్షరముల కొక్క యతి(ప్రాసయతి) యుండును. నాలుగు పాదములలోను ప్రాసము.

ఉదా:— ఎమ్మెవె । లయన్ భ।జసనమ్ములు మా।ఱిన్
భజ।స-నమ్ము । లపయిన్ - భయగ।ణమ్ములు । లయగ్రా ।
హి మ్మెఱ।యు రంగ।నృప।యి । మ్మహిని । ప్రాసయ ।
తులమ్మె।ఱపినా।ల్గు చర।ణమ్ము।ల।ను వేడ్కన్.

తరలి వృత్తము:—ఈ వృత్తమునందు ప్రతిపాదమున భ-స-న-జ-న-ర గణములు, 11-వ అక్షరము యతియు నుండవలెను. ప్రాస నియమము కలదు.

ఉదా:— చారుభ । సనభూ । రిజన । ర-సాంద్ర । గణము । లన్ దిగా
సా ర వి । రతినం । దముగ । నిజంబు । తరలి । చెన్నగున్.

విద్యున్మాల:—పాదమున 2 మగణములు, 2 గురువులు నుండి 5-వ యింట యతి విలసిల్లును.

ఉదా:—విద్యున్మా।గా - యుక్తం । బైనన్
విద్యున్మా । లా - వృత్తం । బయ్యెన్.

మందాక్రాంత వృత్తము — ఇందు ప్రతిపాదమునను మ, భ, న, త, త, గగ యను గణములుండి 11-వ యక్షరము యతి గలిగియుండును. ప్రాసము ముఖ్యము.

ఉదా:— కాంతా కాం । తా మభ । నతత । గా - క్రాంత । సంక్రాంత మందా
క్రాంతం బ । య్యెన్ విర । మదళ । మా-క్రాంతి । విక్రాంత । మైనన్.

మంగళం మహాశ్రీ యను వృత్తము:—ఇందు భ-జ-స-న-భ-జ-స-న-గ-గ యను గణములుండి 9-వ యక్షరము 17-వ యక్షరము యతిస్థానముగా నుండును.

ఉ॥ సత్తుగ । నుదత్న । ములస । త్తదళ।మంబున । నుసద్య । తులమం।గళమ।హాశ్రీ ।
వృత్తము । నకాభ । జస్తవృ।త్తినభ । జల్మన । లపైగు।రులు రం।గనృప।ధీరా ॥

---

# నాయకప్రకరణము

కావ్యోత్కర్షః— ఉత్తమ పురుషవర్ణమాగల కావ్యములవల శుభములు గలుగును. అనిష్టములు తొలఁగును. కర్తవ్యజ్ఞానము సుకరమగును.

వేదశాస్త్రములు ప్రభుసమ్మితములు. ఇవి విధినిషేధవాక్యముల రూపమున శాసించి సన్మార్గమునఁ బెట్టఁజూచును. వీనివలనఁ బ్రజలకు కర్తవ్యాకర్తవ్య జ్ఞానము సుకరము కానేరదు.

పురాణములు సుహృత్సమ్మితములు. ఉత్తమ పురుషుల చరితములను గొనియాడుచు దుర్గుణులపై ద్వేషము గలిగించును. మిత్త్రునివలెఁ గర్తవ్యజ్ఞానమును గలిగించును.

కావ్యము కాంతాసమ్మితమయి సరసమార్గమునఁ గర్తవ్యోపదేశమును జేయును. వేదశాస్త్రములవలె శాసింపక వ్యంజనయను విలక్షణవ్యాపారముతో హృదయాహ్లాదకరమై దుష్టులగు రావణాదులవలెఁగాక ఉత్తములగు శ్రీరామాదులవలెఁ బ్రవర్తింపుట కర్తవ్యమని యుపదేశించును పాఠకుని సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయును. కావున ఏకావ్యమున నుత్తమపురుషచరిత మభివర్ణింపఁబడదో, యట్టికావ్యమును బరిహరింపవలెనని చెప్పుటకే కావ్యాలాపములు వర్జింపవలెనను ప్రాచీనోక్తి కలిగెను. మహాభారతము, రామాయణము, భాగవతము మున్నగు గ్రంథముల కింతటి ప్రసిద్ధికలుగుట కవి మహాపురుషచరితములు గలవగుటయే ప్రధానకారణము. అట్టికావ్యములయం దుత్తమనాయక చరితము వర్ణింపఁబడినచో నా ప్రబంధమున కుత్కర్ష కలుగును.

ఉత్తమ నాయక గుణములు.—

| | | |
|---|---|---|
| 1. మహాకులీనత | 4 ఔదార్యము | 7. ధార్మికత్వము |
| 2 ఔజ్జ్వల్యము | 5. తేజస్విత | 8. మహామహిమత్వము |
| 3. మహాభాగ్యము | 6 వైదగ్ధ్యము | 9. పాండిత్యము |

మహాకులీనత:—గొప్పవంశమునఁ బుట్టుట.

ఔజ్జ్వల్యము.—చక్కని రూపసంపద గలిగియుండుట.

మహాభాగ్యము:—భూమండలమునకు చక్రవర్తియగుట.

ఔదార్యము —దానశీలము గలిగియుండుట.

తేజస్విత —దేశమును బ్రకాశవంతముగాఁ జేయుట.

వైదగ్ధ్యము —పనులందు నేర్పుగలిగి యుండుట.

ధార్మికత్వము:—ధర్మాచరణమున నాసక్తి కలిగియుండుట.

మహామహిమత్వము:—భగవంతుని యంశము కలిగియుండుట.

పాండిత్యము:—విద్యయందు ప్రవేశము కలిగియుండుట.

నాయకలక్షణము:—నాయకుఁడు యశఃప్రతాపములచేఁ బ్రసిద్ధుఁడై, సదా ధర్మార్థకామములయం దనురాగము గలిగియుండును. ఇతఁడు రాజ్యపాలనాది సమస్తవ్యాపారములంగను దక్షుఁడై సుగుణసంపదచే విరాజిల్లును.

నాయకులు.—వీరు ధీరోదాత్త ధీరోద్ధత ధీరశాంత ధీరలలితులని నాల్గు విధములు.

ధీరోదాత్తుఁడు:—వీరుఁడు, దయాళువు, గంభీరుఁడు, ఆత్మశ్లాఘావిముఖుఁడు, భూరిబలాఢ్యుఁడునై యొప్పును.

ధీరోద్ధతుఁడు:—గర్వము, పరనింద, ఆత్మశ్లాఘ, ముక్కోపితనము, క్రూరత్వము, వంచన మున్నగు లక్షణములు కలిగియుండును.

ధీరలలితుఁడు — నిశ్చితుఁడు, విమలవర్తనుఁడు, భోగలాలసుఁడు, కళలయం దనురక్తుఁడునై యొప్పును.

ధీరశాంతుఁడు:—ధీరుఁడు, శాంతుఁడు, బుద్ధిమంతుఁడు, పండితుఁడునై యుండును.

శృంగారనాయకులు నాల్గువిధములు -1. అనుకూలుఁడు, 2. దక్షిణుఁడు, 3. ధృష్టుఁడు, 4 శఠుఁడు.

అనుకూలుఁడు:—ఒక నాయికయందే యనురాగము గలవాఁడు.

దక్షిణుఁడు.—పెక్కురు భార్యలను సమముగాఁ బ్రేమించువాఁడు.

ధృష్టుఁడు:—దోషములు బయలుపడినను భయపడనివాఁడు.

శఠుఁడు —నాయికకుఁదక్క యితరులకుఁ దెలియకుండున ట్లపరాధము సల్పువాఁడు.

సహాయనాయకులు:—శృంగారనాయకులకు నాయికల ననుకూలింపఁ జేయుటకు సహాయపడువారు. వీరు నలుగురు.

పీఠమర్దుఁడు:—ఇతఁడు మహానాయకునికంటె కొంచెము తక్కువవాఁడయ్యు పతాక (ఉపకథలో నాయకత్వమువహించి ప్రధాననాయకునకు సహాయుఁడై యుండును.) (ఉ॥ రామాయణమున సుగ్రీవుఁడు పీఠమర్ద నాయకుఁడు.)

విటుఁడు:—నాయకుని రంజింపఁజేయుటలో నేర్పరియై పనులలో సహకరించును.

చేటుఁడు:—వాక్నైపుణ్యములో నాయకునకు నాయికలను గూర్చువాఁడు.

విదూషకుఁడు:—నవ్వుపుట్టించు మాటలు, చేష్టలు కలిగి, మహానాయకునిమనస్సును రంజింపఁజేయువాఁడు. ఉ॥ శృంగారశాకుంతలమున మాధవ్యుఁడు విదూషకుఁడు.

శృంగారనాయికలు ఎనిమిదివిధములు:—1. స్వాధీనపతిక, 2. వాసకసజ్జిక, 3. విరహోత్కంఠిత, 4. విప్రలబ్ధ, 5. ఖండిత, 6. కలహాంతరిత, 7. ప్రోషితభర్తృక, 8. అభిసారిక.

స్వాధీనపతిక:—చెప్పినట్లు విని కోరినట్లు జరుపు మగఁడు గలది.

వాసకసజ్జిక —ప్రియుఁడిపుడు రాఁగలఁడని పడకగదిని, తనను అలంకరించుకొనునది.

విరహోత్కంఠిత —సంకేతస్థలమునకుఁ బ్రియుఁడు రాఁడాయెనని విరహముచేఁ జింతించునది

విప్రలబ్ధ:—సంకేతస్థలమునఁ బ్రియునిగానక వంచింపంబడి రాయబార మంపునది.

ఖండిత.—ప్రియునియందు పరస్త్రీసంగమచిహ్నములను జూచి యసూయపడునది.

కలహాంతరిత:— భర్త నవమానించి పిదప పరితపించునది.

ప్రోషితభర్తృక:—పతి దేశాంతరగతుఁడు కాఁగా వ్యాకులపడునది.

అభిసారిక:—తన్నలంకరించుకొని నాయకునిగూర్చి సంకేతస్థానమునకుఁ బోవునది.

దూతికలు:—వీరు నాయకు ననుకూలపఱచుటయందు నాయికకుఁ జేదోడువాఁదోడుగా నుందురు.

స్త్రీజాతి విశేషములు:—1. పద్మిని, 2. చిత్రిణి, 3. శంఖిణి, 4. హస్తిని.

పద్మిని —ఎఱ్ఱని నుకొలకులు, నువ్వుపూవువంటి నాసిక, చంపకపుష్పమువంటి శరీరచ్ఛాయ, లేడికన్నులు, మితభోజనము, హంసగమనము, విశేషమగులజ్జ, అభిమానము, యోగ్యప్రవర్తనముగల యుత్తమజాతి స్త్రీ.

చిత్రిణి:—మిక్కిలిదీర్ఘముగాని విగ్రహము, సుకుమారశరీరము, తీయనివచనము, చిలుకపలుకులు, శంఖమువంటి మెడ, నృత్యగీతాదులందు నిపుణత, బెదరు చూపులు మొ॥ లక్షణములు గలది.

శంఖిని:— ఎఱ్ఱనిచీరలు, పూలమాలలు ధరింపఁగోరుట, చిరాకు, కంపముతోఁగూడిన మితభోజనము, దట్టమైన రోమములు, గోధుమవన్నె శరీరచ్ఛాయ, కొండెములు పల్కు స్వభావము మున్నగు లక్షణములు గలది.

హస్తిని — పొట్టియై లావుబారిన శరీరము, ప్రక్కకు తిరిగిన పాదాంగుళులు, రాగి జుట్టు, సిగ్గులేని మొరటుతనము, బొంగురుకంఠము, విరసపు పలుకులు మొదలగు లక్షణములు గలది.

నాయికలు:—1. ముగ్ధ, 2. మధ్య, 3. ప్రౌఢ అని మూఁడు విధములు.

ముగ్ధ:—ఉదయించుచున్న యౌవనము, లజ్జయుఁ గల స్త్రీ.

మధ్య:—సగము వీడిన సిగ్గుగల యౌవనవతి.

ప్రౌఢ:—సిగ్గు విడిచిన పూర్ణయౌవనవతి.

---

# కావ్యప్రకరణము

కావ్యము కీర్తికొఱకు, ధనార్జనమునకు, వ్యవహారములను దెలిసికొనుటకు, నశుభములను బోఁజేయుటకుఁ, జదువునపుడు ఆనంద మొనఁగూర్చుటకు, భార్యను బోలినదగుట నుపదేశించుటకు నేర్పడినది.

కావ్యలక్షణము:—గుణాలంకారసహితములు దోషరహితములు రసాత్మకములు నగు శబ్దార్థములుగల పద్యములుకాని, గద్యములుకాని కావ్యమనఁదగు.

శబ్దార్థసముదాయము కావ్యశరీరము. ఆ శరీరమునకు ఆత్మ వ్యంగ్యము. ఉపమాద్యలంకారములు భూషణములు. శ్లేషప్రసాద మాధుర్యాది గుణములు శౌర్యాదులవంటి యాత్మగుణములు. గౌడి, పాంచాలి మున్నగురీతులు స్వభావములు. కైశిక్యాదివృత్తులు నాట్యోచిత వృత్తులు. రచనయందలి శైలి విశ్రమింపఁదగిన శయ్య. ద్రాక్ష కదళీ నారికేళాది పాకములు రసాస్వాదన సాధనములగు పాకములు.

శబ్దార్థములు:—శబ్దసముదాయము వాచకలక్షక వ్యంజక భేదములచే మూఁడువిధములు. అట్లే అర్థములు వాచ్య లక్ష్య వ్యంగ్యములని ముత్తెఱంగులు. శబ్దవృత్తులు అభిధ, లక్షణ, వ్యంజన యను పేర్లతో నొప్పును.

అభిధ.—సంకేతితమగు నర్థమును స్ఫురింపఁజేయు శబ్దవ్యాపారము.

ఇది రూఢికాభిధ, యోగపూర్వికాభిధ యని రెండు విధములు.

రూఢిపూర్వికాభిధ:—అవయవార్థము అవివక్షితముకాఁగా సంకేతితమయిన సముదాయార్థము నిచ్చు శబ్దశక్తి.

(అశ్వకర్ణమను చోట గుఱ్ఱపుచెవి యని యవయవార్థమువలన వివక్షితముకాఁగా సముదాయార్థబోధకమయిన రూఢివలన ఇనుమద్దిచెట్టు అను నర్థము నిశ్చితమగుచున్నది)

యోగపూర్వికాభిధ.—అవయవార్థము కలిగియే సంకేతితార్థమును దెలిపెడు శబ్దశక్తి

ఉ॥ రత్నగర్భ (లోన రత్నములు గలది) = భూమి.

లక్షణ —వాక్యార్థమున వాచ్యార్థము పొసఁగకుండుటవలన (అనఁగా ముఖ్యార్థబాధవలన) దానికి సంబంధించిన విషయమునందు ఆరోపింపఁబడు శబ్దవ్యాపారము. ఇది నాల్గు విధములు. ఉ॥ 1. జహల్లక్షణ, 2. అజహల్లక్షణ, 3. సారోపలక్షణ, 4. సాధ్యవసాయలక్షణ.

జహల్లక్షణ —పదము ప్రకరణవశమున స్వార్థమునువిడిచి, యర్థాంతరమును బోధించునట్టి లక్షణ.

ఉ॥ గంగలో గొల్లపల్లె యున్నది. (గంగాయాం ఘోషః) అనుచోట గంగాపదము స్వార్థమును విడిచి గంగాతీరమను నర్థము చెప్పుచున్నది. అట్లే పురములన్నియు 'గొల్లనబొగులుచున్నవి' అనుచోట వాక్యార్థము సరిపడలేదుగాన పురములు అను పదము లక్షణావృత్తిచే స్వార్థమునువిడిచి, పురప్రజలు అనునర్థమును బోధించును.

అజహల్లక్షణ:—పదము ప్రకరణ సందర్భమున స్వార్థమును విడువకయే అర్థాంతరమును దెలిపెడు లక్షణకు అజహల్లక్షణ యని పేరు.

ఉ॥ 'గొడుగులుపోవుచున్నవి' అనునపుడు వాక్యార్థమునకు బాధ గలిగినది గాన గొడుగులు అను పదము స్వార్థమునేకాక వానిని ధరించువానినిగూడఁ దెలుపును.

సారోపలక్షణ:—ఒకదాని ధర్మములు అవిలేని మఱియొకదానియందు న్నట్లు చెప్పట యారోపము. (ఉపమానోపమేయములను వేఱువేఱుగాఁజెప్పి వాని కభేదమును నిరూపించుట.) ఉ॥ అతని ముఖము చంద్రుఁడు.

సాధ్యవసాయలక్షణ —ప్రకృతమును తద్బోధక శబ్దముతోఁ జెప్పకయే యప్రకృతముతో నభేదమని నిరూపించుట అధ్యవసాయము.

ఉ॥ స్త్రీయొక్క కన్నులనుజూపి 'అవిగో పద్మములు' (స్పష్టము)

వ్యంజన:—పదార్థములు అన్వితములు కాఁగా వచ్చిన వాక్యార్థమునకు శోభాజనకమయిన యర్థాంతరమును స్ఫురింపఁజేయు శబ్దవ్యాపారము వ్యంజన.

(అభిధాశక్తిచేఁ దోఁచిన ప్రకృతార్థముకంటె అప్రకృతమైన మఱియొక విశేషార్థము స్ఫురించునని భావము. ఇది 1. శబ్దశక్తిమూలమనియు, 2. అర్థశక్తిమూలమనియు, 3. శబ్దార్థోభయశక్తి మూలమనియు మూఁడు విధము లయినది.

శబ్దశక్తిమూలవ్యంజన —ఉ॥ ఎదురులేని శ్రీరామచంద్రుని వాహినులు ధరణి సందడింపఁగాఁ గదలి పరబలార్ణవమును ఎగిరెడు కబంధములు గలదానినిగాఁ జేసెను.

(ఇచ్చట శ్రీరామచంద్రునిసేనలు కదలి శత్రుసేనలను ఎగురుచుండు మొండెములతో నిండినదానినిగఁ జేసెనని ప్రకృతార్థము గోచరించినది. పిదప వాహినులు కబంధములు మన్నగు శబ్దముల మూలమున ఎదురులేక వెల్లువలవాఱు నదులు ధ్వనించుచు సముద్రమునఁబడి నీటితోనింపివైచినవని యప్రకృతమయిన విశేషార్థము వచ్చినది)

అర్థశక్తిమూలధ్వని:— ఉ॥ శ్రీరామచంద్రునిభూమిపాణిగ్రహణోత్సవమువిన్నరాజులు తలలు వాల్చి కాలి బ్రొటనవ్రేలితోఁ బాదపీఠిని గీఱిరి. (పై వాక్యమువలన రాజులు చింతిల్లిరని అర్థశక్తివలనఁ దోఁచుచున్నది.)

వృత్తులు నాల్గు విధములు:—1 కైశికి, 2 ఆరభటి, 3. భారతి, 4. సాత్వతి.
కైశికి —శృంగార కరుణరసములు మిక్కిలి సున్నితమగు రీతిని వర్ణించినది.
ఆరభటి — రౌద్రబీభత్సాదులు పరుషవర్ణములతో మెఱుఁగ వర్ణింపఁబడినది.
భారతి — హాస్యశాంతాద్భుత రసములు సరళాక్షరములతో మధురముగాఁ జెప్పఁబడినది.
సాత్వతి —అతి పరుషములుగాని వర్ణములుగల పదజాలముతో వీరభయానకరసముల నభివర్ణించినది.

(అనఁగా సుకుమారములగు శృంగార కరుణరసములకు మిక్కిలి ప్రౌఢరచన కూడదు. అట్లే అతి ప్రౌఢములగు రౌద్రబీభత్సములకు మిక్కిలి కోమలవర్ణములుగల రచనయు పనికిరాదు అనఁగా వర్ణనము రసానుకూలముగా నుండవలెననుట)

రీతులు:—ఓజస్సు, ప్రసాదము మొదలగు పదములుగల పదములకూర్పు రీతి యనఁబడును. ఇది మూఁడు విధములు.

వైదర్భి:—గాఢసంధి శ్లిష్టసంధులును, పరుషవర్ణములును, దీర్ఘసమాసములును లేని పదరచన వైదర్భి యనఁబడును.

గౌడి —అస్ఫుటపదములు దీర్ఘసమాసములుగల రచన.

పాంచాలి —వైదర్భిగౌడీ రీతుల సాహచర్యము గలిగిన రచన.

శయ్య —పదము లొండొంటితోఁ జక్కఁగాఁ గూర్పఁబడిన రచన.

పాకములు —స్ఫుటమై రసాస్వాదనయోగ్యమైన కావ్యరచనకుఁ బాకమని పేరు. ఇది ద్రాక్ష నారికేళ భేదములచే రెండు విధములు.

ద్రాక్షాపాకము.—పలుకుటకు సుకరములైన సరళవర్ణములు గలిగి వెలుపలను లోపల స్ఫురించుచున్న రసము గలది.

నారికేళపాకము.— అంతర్గూఢమైన రసము గలదగుట నించుక యోపికతో బుద్ధిని జొనిపి, రసాస్వాదనము చేయఁదగినది.

కావ్యములు మూఁడు తెఱఁగులు:— వ్యంగ్యము ప్రధానముగాఁ గలవి యుత్తమ కావ్యములు. వీనిని ధ్వనికావ్యములందురు. వ్యంగ్యము ప్రధానముగా లేనివి మధ్యమకావ్యములు. వీనికి గుణీభూత వ్యంగ్యములని నామాంతరము కలదు. వ్యంగ్యము అస్ఫుటముగా నుండు కావ్యములు అధమకావ్యములు. రసభావాది శూన్యములగు వీనికి చిత్రకావ్యములని మఱియొక పేరు.

మహాకావ్యోపకావ్యములు:— మహాకావ్యము ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశములలో నొకదానితో నారంభింపఁబడి నగరాద్యష్టాదశవర్ణనములతో గూడిన యెక్కు సర్గలు కలిగి యుండవలెను. ఇందలి యితిహాసము విఖ్యాతము, ధీరోదాత్త నాయకాశ్రితమును ధర్మార్థకామమోక్షఫలప్రదమునై యుండవలెను. శ్రావ్యమయిన వృత్తములతో సుసంధులతో విలసిల్లవలెను.

కూ:—మహాకావ్యము గద్యపద్యోభయ కావ్యములని మూఁడు విధములు.

గద్యకావ్యము —ఛందోబద్ధముగాని పదజాలముగల కావ్యము.
ఉ॥ కాదంబరి, పంచతంత్రము, దశకుమారచరిత్రము మొ.

పద్యకావ్యము —ఛందోబద్ధములగు 4 గేని పాదములుగల పద్యములతోఁ గూడినది.
ఉ రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము మొ
గద్యపద్యోభయకావ్యములు:—గద్యపద్యములు గలిగినది చంపువు, లేక ప్రబంధము.
ఉ రామాయణ చంపువు, మనుచరిత్రము మొ.
ఆనందవర్ధనాచార్యులు మఱికొన్ని కావ్యభేదములు చెప్పిరి. 1. ముక్తకము, 2. సందానికము, 3. విశేషకము, 4 కలాపకము, 5. కులకము, 6. పరికథ, 7. ఖండకథ, 8. ఆఖ్యాయిక.
ముక్తకము:—సంపూర్ణార్థముగల యొక స్వతంత్రపద్యము.
ఉ అమరుకశతకమునందలి యొక్కొక శ్లోకము లేక తెనుఁగున చాటుపద్యము.
సందానికము (యుగ్మము) —క్రియాది సంబంధముగల రెండు పద్యములు.
విశేషకము (గుణవతి):—ఒకే క్రియతో నన్వయించు మూఁడు పద్యములు.
కలాపకము (ప్రభద్రకము) —ఏకక్రియాన్వయముగల నాల్గు పద్యములు.
కులకము (బాణావళి) —ఏకక్రియాన్వయముగల అయిదు పద్యములు.
పరికథ:—పురుషార్థములలో నొకదానిని వర్ణించు కావ్యము.
ఖండకథ (ఉపాఖ్యానము).—మహాకథలోని యవాంతరకథ.
ఆఖ్యాయిక (కథ) -- పద్యములలో మొదట మంగళాశీర్వాదము గావించి, సరసమైన వస్తువును గద్యమునఁ గూర్చుట. ఉ॥ హర్షచరిత్రము మొ.
ఉపకావ్యము:—సర్గలులేని పద్యకావ్య ముపకావ్య మనఁదగును.
క్షుద్రప్రబంధములు:— 1. ఉదాహరణము, 2. చక్రవాళము, 3. భోగావళి, 4. బిరుదావళి, 5. తారావళి అని అయిదు విధములు.
ఉదాహరణము:— జయశబ్దమాదియందుఁ గల మాలిన్యాదివృత్తములతోఁ బ్రారంభింపఁబడు గద్యపద్యాత్మక స్తోత్రపాఠము. ఇది తాళములతోఁ గూడి అనుప్రాసాలంకార శోభితములగు వాక్యభేదములతో విలసిల్లునట్లు ఎనిమిది వాక్యము లెనిమిది విభక్తులతో గూర్చి కవి ప్రబంధనామాంకితమగు పద్యము ననుసంధింపవలెను.
చక్రవాళము, చతుర్భద్రము —పద్యముతోఁ బ్రారంభింపబడి కలికలుగా గద్యాష్టకము దశాష్టకమున మెఱయ చక్రవాళ మగును. దీర్ఘసమాసభూయిష్టమై అద్యంత పద్యములు ఆశీస్సమన్వితములు కావలెను. వాక్యాంతమున విడిచిన వర్ణములు తిరిగి అన్యవాక్యాదిని గృహీతము లగును.
భోగావళి.—ఇందు దేవశబ్దము ఆదిగా నాద్యంతములు పద్యములతో విలసిల్లును. పాలుగేని లేక ఎనిమిదేని గద్యములతో స్కంధములుగ విభజింపఁబడి యుండును. దేవతలకు, రాజులకుఁ దగిన రీతితోఁ గూడియుండును. ఉద్యానములు, ఋతువులు లెస్సగా వర్ణింపఁబడును.
బిరుదావళి:—ఆడంబరవాక్యములతో నాయకుని వర్ణించుచుఁ దక్కినవిషయములలో భోగావళి ననుసరింపఁబడును.
తారావళి (నక్షత్రమాల):—ఇరువదియేడు పద్యములతోఁ జేసిన స్తోత్రపాఠము.

# నాటకప్రకరణము

శ్రావ్య ప్రబంధములు కావ్యములు. దృశ్య శ్రవ్య ప్రబంధములు నాటకములు. ఇవి నాట్యాభినయ ప్రధానములు. అభినయము, సాత్త్విక, ఆంగిక, ఆహార్య, వాచిక భేదములచే నాలుగు విధములు.

సాత్త్వికాభినయము:— పరుల సుఖదుఃఖముల నూహింపఁజాలిన యంతఃకరణము సత్త్వము. దానివలనఁ గలుగు స్తంభ రోమాంచాదులు సాత్త్వికభావములు. వాని నభినయించుటయే సాత్త్వికాభినయము.

ఆంగికాభినయము —హస్తాద్యవయవములతో నభినయించుట.

ఆహార్యాభినయము.—నాట్యము నకు వలయు వస్త్రాభరణాదుల నలంకరించుకొనుట.

వాచికాభినయము:—రసానుగుణములగు రాగాదులతో గానము చేయుట.

నృత్తము —తాళలయములుగల అభినయ శూన్యమయిన అంగవిక్షేపము.

నృత్యము (లాస్యము) —తాళలయలతోడను, అంగప్రత్యంగముల యభినయములతోడను భావమును దెలుపుచు నాడెడు యాట.

తాండవము —నర్త నృత్యములు లలితము లగుచో లాస్యమనియు, నుద్ధతములగుచో తాండవమనియుఁ జెప్పఁబడును.

దశరూపకములు:—1. నాటకము, 2. ప్రకరణము, 3. భాణము, 4. ప్రహసనము, 5. డిమము, 6. వ్యాయోగము, 7. సమవాకారము, 8. వీధి, 9. అంకము, 10. ఈహామృగము.

పై రూపకములలోని ఇతివృత్తము ప్రఖ్యాతము, ఉత్పాద్య, మూఁడు విధములు. ఇతిహాస ప్రసిద్ధమైన కథ ప్రఖ్యాతము. కవికల్పితము ఉత్పాద్యము. కొంత ప్రఖ్యాతము, కొంత కల్పితము నైనది మిశ్రము.

(1) నాటకము:—ఇందు ప్రఖ్యాతమయిన యితివృత్తము, ధీరోదాత్తుఁడయిన నాయకుఁడు, వీర శృంగారములలో నొక రసము ప్రధానమయి యుండవలెను. అంగములుగా నితరరసములకుఁ బ్రవేశము కలుగవచ్చును. 5 మొదలు 10 వఱకు అంకము లుండవచ్చును. ఉ. శాకుంతలాదులు. ఇందు 8 గాని 12 గాని 18 గాని 22 గాని పదములతో నొప్పునది నాంది. ఇది నాటకాదిని ఘటించినపిదప కాలానుగుణమైన ఋతువును వర్ణించుచు భారతీవృత్తిలో కావ్యార్థమును సూచించు పద్యములను బాడవలెను. ఇది కవి యిష్టము ననుసరించి చేయవలెను. విధి లేదు.

(2) ప్రకరణము.—ఇందలి ఇతివృత్తము కల్పితము. నాయకుఁడు ధీరశాంతుఁడు. శృంగారరసము ప్రధానమయి యుండవలెను. ఇందు వేశ్యగాని, కులస్త్రీగాని, వేశ్యాకులస్త్రీ లిరువురు గాని నాయికలయి యుందురు. తరంగవృత్తము, మాలతీమాధవము, మృచ్ఛకటికము నుదాహరణములయి యొప్పును. అమాత్య విప్ర వణిజులలో నొకండు నాయకుండయి యుండును. తక్కినవి నాటకమును బోలి యుండును.

(3) భాణము:—ఇందలి ఇతివృత్తము కల్పితము. ధూర్తవిటుఁడు నాయకుఁడు. శృంగారవీరరసములు కొలఁదిగ సూచింపఁబడవలెను. భారతీవృత్తి తఱచుగా నుపయోగింపఁబడుచుండును. విట చోర ద్యూతకారాదుల కల్పిత చరిత్రముగల యేకాంక నాటిక. దీనికి ముఖనిర్వహణ సంధులుమాత్రమే యుండును. ఒక విటుఁడు ఆకాశభాషితము చేయుచు 'ఏమనుచున్నావు' అని పలుకుచు, సమాధానము చెప్పుచుండును. ఉ పంచబాణవిజయము మొ

ప్రహసనము:—ఇందలి కథ కల్పితము. నాయకులు పాషండాదులు. హాస్యరసము ప్రధానము. ఉ లంబోదర ప్రహసనము మొ

డిమము —ఇందలి ఇతివృత్తము ప్రసిద్ధము. ధీరోద్ధతులగు దేవ గంధర్వ పిశాచాదులు నాయకులు. రౌద్రరసము ప్రధానముగను. వీరశృంగారములు అంగములుగను ఉండును. 4 అంకముల నాటిక. మాయ, ఇంద్రజాలము, యుద్ధము, గ్రహణములు వర్ణింపఁబడును.

వ్యాయోగము.—ఇందలి యితివృత్తము ప్రసిద్ధము. నాయకుఁడు ధీరోదాత్తుఁడు. వీర రసము ప్రధానముగ నుండవలెను. ఒక్కనాఁటి మహాయుద్ధకథ ప్రయోగింపఁబడవలెను.

సమవాకారము —ఇందలికథ కల్పితముగాని, ప్రసిద్ధముగాని కావచ్చును. దేవాసుర ప్రభృతులు 12 గురు నాయకులు. వీరరసము ప్రధానముగను, తదితరము లప్రధానముగను నుండవలెను. 3 అంకముల నాటిక. ఉ సముద్రమథనము మొ॥

...ఇతివృత్తము కల్పితము. నాయకుఁడు ధీరోదాత్తుఁడు. శృంగార రసము సూచనమాత్ర ప్రయోగము కలుగును. ఒక అంకము. భాణమునందలి .ము లిందును గలవు. ఉ మాలతీవీథి మొ॥

అంకము:—ఇందలి కథ ప్రసిద్ధము. నాయకుఁడు ప్రాకృతజనుఁడు. కరుణరసము ప్రధానము. స్త్రీవిచారము, వాగ్యుద్ధము ముఖ్యముగ వర్ణింపఁబడును. తక్కినవి భాణమువలె నుండునని తెలియనగును.

ఈహామృగము:—ఇందు కథ కొంత కల్పితము, కొంత ప్రసిద్ధమునై యుండును. నాయకుఁడు ధీరోద్ధతుఁడు. శృంగారరసము సూచితము. 4 అంకముల రూపకము. మర్త్యుఁడు నాయకుఁడు, దివ్యుఁడు ప్రతినాయకుఁడుగా నుండును. వీరిరువురు స్త్రీకొఱకుఁ గలహింతురు.

సంధియన నేమి?:—ధర్మార్థ కామములలో నొక్కదానికి సంబంధించిన కథాంశము నకు అప్రధానములగు తక్కిన రెండింటితోడి సంబంధమే సంధియనఁబడును.

## పంచసంధులు : అవి యేర్పడు విధానము:—

1. ముఖసంధి 2. ప్రతిముఖసంధి 3. గర్భసంధి 4. అవ(వి)మర్శసంధి 5. నిర్వహణసంధి.

1. ముఖసంధి:—ఆరంభబీజ సంబంధము గలది ముఖసంధి.

2. ప్రతిముఖసంధి —ప్రయత్నబిందుసంబంధము గలది ప్రతిముఖసంధి.

3. ప్రాప్త్యాశాపతాకల సంబంధము గలది గర్భసంధి.
4. విమర్శసంధి —నియతాప్తి ప్రకరుల సంబంధముగలది విమర్శసంధి.
5. నిర్వహణసంధి:—ఫలాగమ కార్యముల సంబంధముగలది నిర్వహణసంధి.
బీజ బిందు పతాక ప్రకరీ కార్యములు అర్థప్రకృతులు.
ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమములు పంచావస్థలు.
పై రెండువరుసలయందును యథాసంఖ్యముగఁ జేరి పంచసంధులగును.

## అర్థప్రకృతులగు బీజాదుల స్వరూప నిర్ణయము:—

బీజము.—బీజము అంకురమై, మొక్కయై, మ్రానై, శాఖోపశాఖలతోడను, ఆకులు, పూవులు, పిందెలు మొదలగువానితోడను విస్తరిల్లునట్లు ఈ బీజము నర్థప్రకృతి మొదట స్వల్పమై పోనుపోను నాయకోపనాయకప్రతినాయకులకు సంబంధించిన వివిధ కథాంశములతో విస్తరించి ధర్మార్థకామముల ఫలసిద్ధికి హేతువగుచున్నది.

బిందువు —నీటిమీఁద నూనెచుక్క అవిచ్ఛిన్నముగ ప్రసరించినట్లు అప్రధాన కథల వలన ప్రధాన కథాభాగమునకు విచ్ఛేదము కలుగనీయకుండఁ జేయునది బిందువు.

పతాక:—ప్రధానకథకు అంగమై దానికి పుష్టినిచ్చుచు, కొంతవఱకు వ్యాపించునట్టి యుపకథ. ఉ రామాయణమున సుగ్రీవుని కథయు, వేణీసంహారమున కర్ణచరిత్రమును పతాక యగును.

ప్రకరి:—పతాకవలె మిక్కిలిదూరము వ్యాపింపని యుపకథ. (ప్రకరి = పూలగుత్తి) ఉదా॥ రామాయణమున జటాయువు వృత్తాంతము మొ.

కార్యము:—ప్రధానఫలమును నిర్వహించెడు కట్టకడపటి కథావయవము.

## పంచావస్థలగు ఆరంభాదుల స్వరూప నిర్ణయము:—

ఆరంభము:—ధర్మార్థకామములలో నొకనిర్దిష్టప్రయోజనమును నేనుసాధింపఁగలనను నాయకుని పూనిక.

యత్నము:—సాధింపఁదలఁచిన కార్యఫలము లభింపమి, రెట్టింపైనపూనికతోఁ జేయు చేష్టాదికము.

ప్రాప్త్యాశ:-ఫలము సిద్ధించునో లేదోయను సంశయముతో కార్యసిద్ధి యనిశ్చితమగుట.

నియతాప్తి:—కార్యావరోధకములగు నపాయములు తొలఁగఁగా, కోరిక సిద్ధించునను దృఢనిశ్చయము.

ఫలాగమము:—ఏ ఫలమునకై యత్నముజరిగెనో యా కార్యఫలము సిద్ధించుట.

## ముఖసంధ్యంగములు – వాని స్వరూపము:—

1. ఉపక్షేపము, 2. పరికరము, 3. పరిన్యాసము, 4. విలోభనము, 5. యుక్తి, 6. ప్రాప్తి, 7. సమాధానము, 8 విధానము, 9. పరిభావనము, 10 ఉద్భేదము, 11. భేదము, 12. కరణము. (ఇందు ఉపక్షేప పరికర పరిన్యాస యుక్త్యుద్భేద సమాధానములు ప్రధానములు.)

ఉపక్షేపము:—ప్రధానఫలమునకు తగినబీజము నావాపనుచేయుట.
పరికరము:— నిక్షిప్తమైన బీజమును విస్తరిల్లఁజేయుట.
పరిన్యాసము:— బీజము లక్షింపఁబడునట్లు వ్యక్తముచేయుట.
విలోభనము:—బీజగుణములను వర్ణించుట.
యుక్తి:—బీజప్రయోగమున కార్యసిద్ధికిఁ దగినయుపాయము నిశ్చయించుట.
ప్రాప్తి —బీజమునుగూర్చి ప్రసంగము చేయుటవలనఁ గలుగు సుఖలాభము.
సమాధానము —బీజసన్నిధానము.
విధానము —బీజానుగుణముగ నాయికానాయకుల సుఖప్రదమైన దర్శనాదికము.
పరిభావనము —బీజవిషయమునఁ గలుగు ఆశ్చర్యము.
ఉద్భేదము:—బీజసంబంధముగల యనురాగ ప్రోద్ధారలను వెల్లడించుట.
భేదము:—బీజమునకుఁ దగిన ప్రోత్సాహమిచ్చుట.
కరణము —బీజము ఫలించుటకుఁ దగినయత్నములు చేయుట.

## ప్రతిముఖ సంధ్యంగములు : వాని స్వరూపము:—

ప్రతిముఖసంధి — అంశమున గనఁబడియు, నంశాంతరమునఁ గనఁబడకయు నున్న బీజము ప్రకాశించుట. వీని యంగములు 13.

1 విలాసము, 2 పరిసర్పము, 3 విధూనము, 4. శమము, 5. నర్మ, 6. నర్మద్యుతి, 7. ప్రగమనము, 8 విరోధము, 9. పర్యుపాసనము, 10 వజ్రము, 11. పుష్పము, 12 ఉపన్యాసము, 13. వర్ణసంహారము.

విలాసము:—నాయికానాయకులకుఁ గలుగు సంభోగేచ్ఛ.
పరిసర్పము:—కనఁబడి యంతరించిన లింగరూపబీజము ననుసరించుట.
విధూనము — అభీష్టవస్తువును నిరాకరించుట.
శమము — అరతి శాంతించుట.
నర్మము:—బీజమునకు సంబంధించిన పరిహాసవచనము.
నర్మద్యుతి —పరిహాస వచనముద్వారా ప్రకటింపఁబడిన యనురాగము.
ప్రగమనము:—నాయికానాయకులు దూతికావిదూషకాదులతో ప్రసంగించునపుడు అన్యోన్యానురాగమును ప్రకటించుట
విరోధము:—ఏదేనొక మిషచే నభీష్టమున కాటంకము కలుగుట.
పర్యుపాసనము:—కోపించిన ప్రియులను ప్రతిమాలుట.
వజ్రము:—ప్రియులయెడ పరుసము లాడుట.
పుష్పము:—నాయికానాయకుల వలపు దెలుపు మాటల నేర్పు.
ఉపన్యాసము—వలపు పుట్టునట్లు చతురముగాఁ బలుకుట.
వర్ణసంహారము:—చతుర్వర్ణములవారు బీజముద్గతమగునట్లు అనుగుణముగాఁ బలుకుట.
(ఇందు పరిసర్ప ప్రగమన వజ్రోపన్యాస పుష్పములు ముఖ్యములు.)

## గర్భసంధ్యంగములు - వాని వివరణము.—

గర్భసంధి:—ముఖసంధిలో నుక్షిప్తమగుబీజము ప్రతిముఖసంధిలో స్పష్టముగనుండ, దాని నన్వేషించుట. ఇందు పతాక లేనిపక్షమున దానిస్థానమున బీజబిందువులలో నొకదాని నుపయోగింపనగును. ఇవి 12 విధములు.

అభూతాహరణము:—ప్రకృతకార్యమున కుపయోగించెడు నొక వంచనకృత్యము.
మార్గము —యథార్థమును బలుకుట.
రూపము:—తనసంగతి పరులకుఁ దెలియునేమో యను సందేహముగల మాట.
ఉదాహృతి:—ప్రకృతిసందర్భమునకు గౌరవము కలుగునట్లు పలుకుట.
క్రమము:—కోరికను చెల్లించుకొనుట.
సంగ్రహము:—కార్యసాధనకై పలికెడి సామాది వాక్యములు.
అనుమానము:—ఆనవాళ్ళవలన నొక విషయము నూహించుట.
తోటకము:—కోపసంభ్రమములు గలిగిన మాటలు.
అధిబలము:—ఇష్టజనులతోడి కలయిక.
ఉద్వేగము —పగతురవలని భయము.
సంభ్రమము:—శంకాభయములు కలుగుట.
ఆక్షేపము:—కోరిక బీజార్థప్రకాశమునకై యత్నించుట.
(ఇందు అభూతాహరణ మార్గ తోటకాధి బలాక్షేపములు ప్రధానములు.)

## విమర్శసంధ్యంగములు - వాని వివరణము:—

వి(అవ) మర్శసంధి:—క్రోధవ్యసనాదులచే గర్భసంధియందుఁ బ్రకాశించిన బీజార్థమును గురించి చేయఁబడు పర్యాలోచనము. ఇందలి యంగములు 13.

అపవాదము:—దోసఁగులనెత్తిమాపుట. సంఫేటము:—క్రోధముతో మాట్లాడుట. విద్రవము:—చచ్చుట చెఱవడుట మొదలగునవి. ద్రవము:—గురుతిరస్కారము. శక్తి —విరోధ ముపశమించుట. ద్యుతి:—భయపెట్టుట, తెచ్చగొట్టుట. ప్రసంగము:—గురువులను స్తుతించుట. చలనము:—పరాభవించుట. వ్యవసాయము:—ఆత్మస్తుతి చేసికొనుట. నిరోధము:—కుపితులు పరస్పరము ధిక్కరించుకొనుట. ప్రరోచనము:—భావిమంగళమును ముందుగఁ బ్రసంగించుట. విచలనము:— తనగుణముల నెంచుకొనుట. ఆదానము:— ఉద్దిష్టకార్యము నాచరించుట.

## నిర్వహణ సంధ్యంగములు - వాని స్వరూపము:—

సంధి —బీజవిషయమును తిరిగి ఫలప్రాప్తి కనుగుణముగఁ జెప్పుట.
విబోధము —ముఖ్యకార్యమును బర్యాలోకనము చేయుట.
గ్రథనము:—ప్రధానకార్యమును ప్రారంభించుట
నిర్ణయము.—బీజానుగుణముగ కార్యమును బ్రశంసించుట.
పరిభాష:— పరస్పర సంభాషణము.

ప్రసాదము:—కార్యము సిద్ధించెనని చెప్పి సంతోషపెట్టుట.
ఆనందము:—కోరిక తీఱుట వలనఁ గల్గు సంతోషము.
సమయము:—విచారము తొలఁగుట.
కృతి.—లభించిన యర్థమును రక్షించుకొనుట.
ఆభాషణము:—కార్యము నెఱవేఱుటచేఁ గలిగిన సంతోషప్రసంగము.
ఉపగూహనము:—ఆశ్చర్యకరమగు సిద్ధిని బొందుట.
పూర్వభావము:—ఇష్టకార్య సందర్శనము.
సంహారము:—కావ్యార్థమును ముగించుట.
ప్రశస్తి:—వరలాభము, శుభాశంసనము.

ఇట్లు 64 అంగములు గల పంచసంధులు వివరింపఁబడినవి.

సంధ్యంగముల వలని ప్రయోజనములు:—

1. వివక్షితార్థ ప్రతిపాదనము
2. గోప్యార్థ గోపనము
3. ప్రకాశ్యార్థ ప్రకాశనము
4. అభినయరాగ సమృద్ధి
5. చమత్కారిత్వము
6. ఇతివృత్త విస్తరము

ఇతివృత్తము సూచ్యమనియు, అసూచ్యమనియు 2 విధములు. వీనిలోని అసూచ్యము దృశ్య మనియు, శ్రావ్యమనియు 2 విధములు. సూచ్యము 5 విధములుగా నుండును.

విష్కంభము:—పూర్వోత్తర కథాసందర్భముల కలయికను, రంగస్థలముపైఁ బ్రదర్శింప రాని విషయములను సూచనగాఁ దెలుపుట.

చూళిక:—తెరలోపలి పాత్రములతోనే యర్థసూచన చేయఁబడుట.

అంకాస్యము:—పూర్వాంకము తుదనున్న పాత్రలచే నుత్తరాంకార్థము సూచింపఁబడుట.

ప్రవేశకము:—అధమపాత్రలచేఁ బ్రయోగింపఁబడి ముందువెనుకల కథాంశములను సూచించునది.

అంకావతారము:—పూర్వాంకమునందలి పాత్రములే యుత్తరాంకమునను అసూచితములయి ప్రవేశించి కథను నడపుట.

అంకస్వరూపము:—నాయకులు వాని ననుసరించెడు పాత్రములు రంగమునఁ బ్రవేశించి తమ వేషభాషాభినయ చాతుర్యమున కథను బ్రత్యక్షముగఁ జూపుటకు అంకమని పేరు. మూఁడు లేక నాలుగు పాత్రములతోఁ బ్రయోగింపఁదగినదై వివిధప్రయోజనములకును, రసాన్వితములగు కథాంశవిశేషములకును నాశ్రయమగును. యుద్ధము, దూరప్రయాణము, స్నానానులేపన భోజనాదులు విష్కంభప్రవేశకాదులతో సూచింపఁబడవలెను. అంకమున ఒక్కనాటి కథమాత్రమే సూచితము కావలెను.

ఆముఖము లేక ప్రస్తావన:—ఇందు సూత్రధారుఁడు జరుగఁబోవు నాటకమునుగూర్చి నటీమారిష విదూషకాదులతోఁ బ్రస్తావించును.

సూత్రధారుఁడు (నటుఁడు):—నటబృందమునకు నాయకుఁడు. కవినాయక కథావస్తువుల గుణవిశేషములను బ్రసంగించువాఁడు. ఇతఁడు రెండవ సూత్రధారుఁడు. మొదటివాఁడు నాటకాదిని నాంది చదివి నిష్క్రమించును. నాటక ప్రయోగానుష్ఠానబాధ్యత యను సూత్రమును ధరించువాఁడుగాన సూత్రధారుఁడయ్యెను

మారిషుఁడు—భరతనాట్యమునఁ జక్కని యభినివేశము గలిగి సూత్రధారునకు సహాయకారిగా నుండును.

విదూషకుఁడు—ఇతఁడు మాటకారియై రాజునకు నర్మసచివుఁడుగా నుండును. రాజాంతఃపురమునందును ఈతనికిఁ బ్రవేశార్హత కలదు.

ఆముఖాంగములు:—1. కథోద్ఘాతము, 2. ప్రవర్తకము, 3. ప్రయోగాతిశయము.

కథోద్ఘాతము:—సూత్రధారుని కథాసూచనను బట్టి పాత్రము రంగమున బ్రవేశించుట.

ప్రవర్తకము:—ప్రస్తావనలోని ఋతువర్ణము ననుసరించి ఆ యా పాత్రములు రంగమునఁ బ్రవేశించుట.

ప్రయోగాతిశయము.—సూత్రధారుఁడు నటితో ప్రసంగవశమున వచ్చిన పాత్రధారి యిటు వచ్చుచున్నాఁడనఁగానే యతఁడు రంగమునఁ బ్రవేశించుట.

# రసప్రకరణము



రసము:— విభావములు, అనుభావములు, సాత్త్విక భావములు, వ్యభిచారిభావములు అనువాని సంయోగమున నాస్వాద్యముగా జేయఁబడిన స్థాయిభావము రసము.

స్థాయిభావము — సజాతీయ విజాతీయ భావములలో వేనిచేతను తిరస్కరింపఁబడక రసపరిణతివఱకు నిలిచి యుండునది.

| రసములు. | స్థాయిభావములు. | ఆలంబన విభావములు. |
|---|---|---|
| 1. శృంగారము | 1. రతి | తరుణులగు స్త్రీ పురుషులు. |
| 2. హాస్యము | 2. హాసము | వికృతచేష్ట వేషభాషలు గలవారు |
| 3. కరుణము | 3. శోకము | బంధు నాశాదులు. |
| 4. రౌద్రము | 4. క్రోధము | అపరాధ మొనర్చినవారు. |
| 5. వీరము | 5. ఉత్సాహము | ధిక్కరింపఁ బడినవారు. |
| 6. భయానకము | 6. భయము | భీతులగు శత్రువులు. |
| 7. బీభత్సము | 7. జుగుప్స | శవాదులు. |
| 8. అద్భుతము | 8. విస్మయము | ఆశ్చర్యకర వస్తువులు. |
| 9. శాంతము | 9. శమము | ప్రకృతి. |

విభావము:—రసోత్పత్తికి కారణమైనది. ఇది ఆలంబన విభావమనియు, ఉద్దీపన విభావమనియు రెండువిధములు. రత్యాదిస్థాయి భావములకు సమవాయి కారణమైన వాయికా నాయకులు ఆలంబన విభావము. మిగిలిన చంద్ర మలయ మారుతాది కారణ సమూహ ముద్దీపన విభావము.

అనుభావములు:—రత్యాదుల కార్యములైన కడగంటిచూపులు మున్నగునవి.

సాత్త్విక భావము:—పరుల కష్టసుఖములను పలుమాఱు తలంచుటచే మనస్సునకుఁ గలుగు తన్మయతకలన నుద్భవిల్లెడి అనురాగ నిర్వేదాదులగు చిత్తవృత్తులు.

ఇవి స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథువు, వైస్వర్యము, అశ్రువు అని ఎనిమిది విధములు.

వ్యభిచారిభావము:—లోకమున రత్యాది స్థాయిభావములతోఁగూడ చరించుచు సహకారులయినట్టి నిర్వేదాది చిత్తవృత్తులు వ్యభిచారిభావములనివ్యవహరింపఁబడును. ఇవి ముప్పదిమూఁడు విధములు.

వికృతి.  ప్రకృతి.  అర్థములు

రౌతు—రాహుత్తుడు=రవుతు.

ఱేఁడు —రాట్టు=రాజు.

ఱాఁగ—లంక = జారిణి.

లంకణము—లఙ్ఘనము = జ్వరాదుల
కుండెడి యుపవాసము.

లంకనము—లంఘనము=ఉపవాసము.

లంకె—లంకము =సంగమము, కౌగిలింత.

లంగ—లంఘనము=దాఁటుట.

లం(జె)జియ—లంజిక=వేశ్య.

లక్క—లాక్ష = ఒకానొక చెట్టుబంక.

లచ్చనము—లక్షణము=గుఱుతు, వ్యాకర
ణాది శాస్త్రము.

లత్తుక—అలక్తకము=లాక్షారసము.

లాటీ—లగుడము=దుడ్డుకఱ్ఱ.

లేక— } లేఖ = జాబు.
 రేఖ = వరుస.

లో(డి)డీ—లగుడము=మల్లుల గద.

లెక్క—లక్ష్యము=లక్ష్యము.

లేమ—రామ = స్త్రీ.

వంకర—వక్రము=కుటిలము.

వంజ—వన్ధ్య=గొడ్డువోయినది.

వక్కణ
వక్కనము } వ్యాఖ్యానము=అర్థవివరణము

వట్రువ—వర్తులము=గుండ్రనిది.

వడుగు
వడువు } వటుకుఁడు = బ్రహ్మచారి,
ఉపనయనము.

వడ్డి—వృద్ధి = అసలుకంటెఁ హెచ్చుగా
నిచ్చు ధనము.

వికృతి.  ప్రకృతి.  అర్థములు.

వత్తి—వర్తి = దీపపు వత్తి.

వదిన—వధూని = అన్నభార్య, భార్యకు
అక్క, పెద్దదగు మామ కూఁతురు.

వయాళి—వాహ్యాళి = విహారము.

వసనాభి— వత్సనాభము = విషభేదము.

వాడ—వాటము = వీథి.

వాదు—వాదము = వాదులాట.

వాలము—వ్యాళము = పులి.

వాలు—వాలము=కత్తి, దీర్ఘము, తోఁక.

విగడియ—విఘటిక = గడియలో నఱు
వదియవ భాగము.

విడియము
విడెము } వీటిక = తాంబూలము

విడ్డూరము— విడ్వరము = ఉపద్రవము.

విత—వృథ = వ్యర్థము.

వితము—విధము =ప్రకారము.

విద్దె—విద్య = చదువు.

విన్నపము—విజ్ఞాపనము = మనవి.

విన్నాణము—విజ్ఞానము=నేర్పు.

విబూది—విభూతి = భస్మము.

విరాళము
విరాళి } విరహము=ఎడఁబాటు.

వివ్వచ్చము—బీభత్సము—రోఁత.

వివ్వచ్చుఁడు—బీభత్సుఁడు=అర్జునుఁడు

విసదారి—విషధారి = పాము.

విసనము—వీజనము = వీవన.

విసము—విషము = గరళము.

| వికృతి. | ప్రకృతి. | అర్థములు. |
|---|---|---|

విసుమానము—విస్మయము=ఆశ్చర్యము.
విసువాసము—విశ్వాసము=నమ్మకము.
విసువాసి—విశ్వాసి = నమ్మించువాఁడు.
వీడియము, వీడెము } వీటిక = తాంబూలము
వీణియ, వీణె— ణ = తంత్రీవాద్యము.
వీ(ని య)ణె—వీణ=తంత్రీవాద్యము.
వీరమద్దియ (మద్దె)లు—వీరమధ్యములు = శూరులు బిరుదముగా కాలిఁ వ్రేలిని ధరించెడు ముద్రికలు, స్త్రీల కాలి మట్టెలు.
వీర(ముద్దియ)లు— వీర ముద్రికలు, వీర మధ్యములు = చూ. పై.
వీ(వ)వెన—వ్యజనము=సురఁటి.
వెంగ(లి)ళి—వ్యంగుఁడు=వెంగళప్ప.
వెంగలి, వె(క)క్కలి } వికలుఁడు = మూఢుఁడు, అసమర్థుఁడు.
వెక్కసము—వికాశము = వెగటు.
వెక్కురు—వికారి = వికృతుఁడు.
వెగటు—వికటువు = అప్రియము.
వెచ్చము—విసర్జనము=వ్యయము.
వెత, వెతారము—వ్యథ=దుఃఖము.
వెనకయ్య — వినాయకుఁడు=విఘ్నారి.
వెన్నుఁడు—విష్ణువు=భగవంతుఁడు.
వెసనము—వ్యసనము=చింత.
వేగిరము—వేగము=జవము, త్వర.
వేడబము—విడంబన=మాయ, వంచన.
వేనలి—వేణి = జడ, కొప్పు.
వేర(మి)ము—వైరము=విరోధము.
వేసఁగి—వైశాఖము=గ్రీష్మఋతువు.
వేసము— వేషము = వస్త్రభూషణాద్యలంకరణము.
వేసవి—వైశాఖము=గ్రీష్మఋతువు.
సంకు—శఙ్ఖువు = శంఖము.
వెజ్జు—వైద్యుఁడు=ధన్వంతరి.
వెదురు—వేణువు=గడ, కీచకము.
వెలఁది—వనిత = యువతి.
వేడెము—వేష్టనము = మండలగతి.
సంకెలియ, సంకెల } శృఙ్ఖలము=ఇనుపగొలుసు
సంగడము—సంగతము=కూడిక.
సంగ(గా)డి, సంగాతి } సంగతుఁడు=స్నేహితుఁడు.
సంగాతము—సఙ్గతము, స్నేహము.
సంచకరము, సంచకరువు } సత్యంకారము=పెట్టుబడిసొత్తు.
సంజె—సన్ధ్య = సంధ్యాకాలము.
సంతన—సంధానము = చేరిక.
సంతసము—సంతోషము=హర్షము.
సంతు—సన్తతి=వంశము, పుత్త్రపౌత్రపారంపర్యము.
సంతోసము, సంతోషము } సన్తోషము=హర్షము.

వికృతి. ప్రకృతి. అర్థములు.

సందరము—సముద్రము = కడలి.

సంది—సన్ధి = సందు, రాజీ.

సందియము—సన్దేహము = సంశయము.

సందె—సంధ్య = సాయంకాలము.

సంద్రము—సముద్రము = కడలి.

సంబరము, సంబ్రము } సంభ్రమము = తొట్రుపాటు, ఉత్సవము.

సంబారము, సంబారు } సమ్భారము = ఉప్పు, చింతపండు లోనగు వంటసామగ్రి.

సంబెళ—సంపుటము = అడపము.

సకినము—శకునము = శుభసూచకము.

సకియ—సఖి = చెలికత్తె, స్త్రీ.

సకుఁడు—సఖుఁడు = చెలికాఁడు.

సగ్గాలము—సృగాలము = నక్క.

సడ్డకుఁడు-షడ్డకుఁడు = తోడియల్లుఁడు.

సతము—సతతము = శాశ్వతము.

సత్తరువు—సత్రము = ధర్మమున కన్నమిడు గృహము.

సత్తి—శక్తి = ఆయుధవిశేషము, కాళి.

సత్తు—సత్యము = నిజము.

సత్తువ—సత్త్వము = బలము.

సదసద—సమ్మర్దము = రాయిడి.

సదాప—శతపుష్పము = ఒకచెట్టు.

సద్దు—శబ్దము = ధ్వని.

సని—శని = ఒకానొక గ్రహము.

సన్న—సంజ్ఞ = సైగ.

సన్నాసి—సన్న్యాసి = కామ్యకర్మములను విడిచినవాఁడు.

సప్పము—సర్పము = పాము.

సబాము—స్వభావము = స్వధర్మము.

సమర్త, సమరత } సమర్తువు = ప్రథమఋతువు.

సమేళము—సమ్మేళనము = సంయోగము.

సయిగ—సంజ్ఞ = హస్తసాంకేతికము.

సయితము—సహితము = కూడ.

సయా(య్యా)ట — సహాటనము = [illegible]హాసము.

సయిరణ—సహనము = ఓర్పు.

సరగు—స్రాక్ = వడి.

సరదారు—శరధారి = శూరుఁడు.

సరడు—శరండము = మెడసగ.

సరుడు—శరము = బాణము.

సలాక—శలాక = సన్ననికమ్మి.

సవతి—సపత్ని = తోడిపెండ్లాము.

సలగము—శమలము = పురీషము.

సలించు—చలనము = కదలు.

సవతు—సమత = పాటి.

సవము—శవము = పీనుఁగు.

సవరము—చమరము = చమరమృగము తోఁక.

సవి—సస్యము = పైరు.

సాకి(రి)—సాక్షి = చూచువాఁడు.

సాజము—సహజము = స్వభావము.

సాతు—సార్థము = వణిక్సమూహము.

సాదన—సాధనము = సాము, అభ్యాసము.

Derivation = వ్యుత్పత్త్యర్థము.
Colloquial Dialect = గ్రామ్యము.
Country Dialect = దేశ్యము.
Analysis = పదచ్ఛేదము, వాక్యవిగ్రహము.
Subject = కర్త.
Object = కర్మ.
Predicate = క్రియ.
Figure = అలంకారము
Philippic = దూషణకావ్యము.
Didactic = నీతికావ్యము.
Dissertation = ప్రబంధము.
Epic Poem = మహాకావ్యము.
Epigram = చాటువు, లఘుకావ్యము
Epilogue = ఉపసంహారము.
Farce = ప్రహసనము.
Parody = వికటకావ్యము.
Philology = శబ్దశాస్త్రము, భాషాశాస్త్రము.
Phonetics = స్వరశాస్త్రము.
Prose = వచనకావ్యము.
Prosody = ఛందస్సు.
Rhetoric = అలంకార శాస్త్రము, సాహిత్యశాస్త్రము.
Essay = వ్యాసము.
Philosophy = వేదాంతశాస్త్రము.
Anticlimax = ప్రతిసారాలంకారము.
Antithesis = వ్యతిరేకాలంకారము.
Aposiopesis = ఆక్షేపాలంకారము.
Bathos (Anticlimax) = ప్రతిసారాలంకారము.
Climax = సారాలంకారము.
Collocation = సంసృష్టి.
Digression = అర్థాంతరన్యాసము.
Dissembling Eulogy = వ్యాజస్తుతి.
Equivogue = వక్రోక్తి ...
Excitant = విభావన.

Exemplification = దృష్టాంతము.
Frustration = వ్యాఘాతాలంకారము.
Hyperbole = అతిశయోక్తి.
Illustration = నిదర్శనాలంకారము.
Inference = అర్థాపత్తి
Insinuator = పరికరాలంకారము.
Innendo = శ్లేషోక్తి, వ్యాజోక్తి, వక్రోక్తి.
Irony = నిందాస్తుతి, వ్యాజనింద.
Laconic = సంక్షేపోక్తి.
Litotes = ఆక్షేపాలంకారము.
Metophor = రూపకము, ఉత్ప్రేక్ష.
Metonymy = అన్యాపదేశము.
Peradle = ఉపమ, దృష్టాంతము.
Paronomasia = శ్లేష.
Reciprocal Comparison = ఉపమేయోపమ.
Simile = ఉపమాలంకారము.
Vision = భావికాలంకారము.
Transition = అర్థాంతరన్యాసము.
Sorites = కారణమాలాలంకారము.
Synodoche = ఉపలక్షణము.
Alliteration = అనుప్రాసము.
Chime = యమకము.
Commixture = సంకరము.
Epitome = సారాంశము.
Ono-Matopoeia = అనుకరణము.
Rhyme = అంత్యనియమము ప్రాసము, యమకము.
Augment = ఆగమము.
Substiture = ఆదేశము.
Caesura = యతి. (విరామము)
Combination = సంధి.
Derivative = యౌగికము.
Idiom = జాతీయము
Optional = వికల్పము, విభాష.
Paraphrase = వివరణము.
Purport = తాత్పర్యము

వేంకట్రామ్ పవర్ ప్రెస్, ఏలూరు - 300) ప్రతులు మార్చి 1 64

### Accent = స్వరము

Acute = ఉదాత్తము.
Grave = అనుదాత్తము.
Cir.mfflex = స్వరితము.
Alphabet = వర్ణసమామ్నాయము.
Aspirates = ఒత్తు అక్షరములు.
Orthography = వర్ణపరిచ్ఛేదము.
Consonants = హల్లులు.
Fixed Consonants = స్థిరములు.
Hard Consonants = పరుషములు.
Soft Consonants = సరళములు.
Labials = ఓష్ఠ్యములు.
Gutturals = కంఠ్యములు.
Labio-Dentals = దంతోష్ఠ్యములు.
Light Semi Vowels = లఘువులు.
Linguals = మూర్ధన్యములు.
Metre = ఛందము.
Major = మహాద్వాచకము.
Minor = అమహాద్వాచకము.
Nasals = అనునాసికములు.
Palatals = తాలవ్యములు.
Dentals = దంత్యములు.
Declinable = ఔపవిభక్తికము.
Vowels = అచ్చులు.
Long Vowels = దీర్ఘాచ్చులు.
Short Vowels = హ్రస్వాచ్చులు.
Etymology = నిరుక్తము, శబ్దసాధనము, పదపరిచ్ఛేదనము.
Epithet = ఉపాధి, విశేషణము.
Root = ధాతువు.
Indeclinable = అవ్యయము.

Riddle = కూటప్రశ్న.
Rule = సూత్రము.
Stanza = పద్యము.
Syllable = పదాంశము.
Synonym = పర్యాయపదము.

### Compound = సమాసము.

Adverbial Compound = అవ్యయీభావసమాసము.
Appositional Compound = కర్మధారయసమాసము.
Copulative Compound = ద్వంద్వసమాసము.
Numeral Compound = ద్విగు సమాసము.
Relative Compound = బహువ్రీహి సమాసము.
Punctuation Marks = విరామ చిహ్నములు.
Brackets = కుండలికలు.
Caret = హంసపాదము.
Colon = న్యూనబిందువు, ద్విబిందువు.
Comma = బిందుకల్పము, వాక్యాంశబిందువు.
Exclamation Point = రాగచిహ్నము.
Full Stop = బిందువు.
Hyphen = సమస్తపద విభాజక లఘురేఖ.
Interrogative Mark = ప్రశ్నార్థకచిహ్నము.
Inverted Commas = ఉద్ధృత వచన సూచక బిందుకల్పములు.
Period = బిందువు, వాక్య విరామాంతము.
Semicolon = బిందుద్వయకల్పము, అర్ధబిందువు.
Language = భాష.
Brogue = గ్రామ్యభాష.
Allusions = పురాణగాథలు.

Tense = కాలము.

Past Tense = భూతకాలము.
Present Tense = వర్తమానకాలము.
Future Tense = భవిష్యత్కాలము.
Perfect Tense = పరోక్ష భూత కాలము. [కాలము
Present Imperfect = పూర్ణ వర్తమాన
Conjugation of verb = క్రియా రూప నిష్పత్తి.

Aorist = తద్ధర్మము.
Adverb = క్రియావిశేషణము.
Conjunction = సముచ్చయము.
Preposition = విభక్త్యర్థ కావ్యయము, విభక్తిప్రత్యయము.
Interjection = ఆశ్చర్యాద్యర్థకము.

Article = ఉపపదము.

Definite Article = నిర్దిష్టోపపదము.
Indefinite Article = అనిర్దిష్టోప పదము.

Gender = లింగము.

Masculine Gender = పుంలింగము.
Feminine Gender = స్త్రీలింగము.
Neuter Gender = నపుంసకలింగము.
Common Gender = సామాన్య లింగము.

Number = వచనము

Singular Number = ఏకవచనము.
Plural Number = బహువచనము.
Dual Number = ద్వివచనము.

Case = విభక్తి.

Nominative Case = ప్రథమావిభక్తి.
Accusative or Objective Case = ద్వితీయావిభక్తి.

Instrumental Case = తృతీయావిభక్తి
Dative Case = చతుర్థీవిభక్తి,
Ablative Case = పంచమీవిభక్తి
Genetive or Possessive Case = షష్ఠీవిభక్తి.
Locative Case = సప్తమీవిభక్తి.
Vocative Case = సంబోధన ప్రథమ.
Affix = ప్రత్యయము.

Person = పురుషము

First Person = ఉత్తమపురుషము.
Second Person = మధ్యమపురుషము.
Third Person = ప్రథమపురుషము.

Degree = తరతమభావము.

Positive Degree = భావార్థకస్థితి.
Comparative Degree = తరబర్థకస్థితి.
Superlative Degree = తమబర్థకస్థితి.

Mood = లకారము, వృత్తి.

Imperative Mood = విధ్యర్థక ప్రయోగము. [వృత్తి.
Indicative Mood = స్వార్థకక్రియా
Infinitive Mood = తుమర్థక ప్రయో గము. (భావరూపము.) [వృత్తి.
Precative Mood = ఆశీరర్థక క్రియా
Subjunctive Mood = అసంతర్యార్థక క్రియావృత్తి.

Sentence = వాక్యము.

Affirmative Sentence = భావార్థక వాక్యము.
Negative Sentence = వ్యతిరేకార్థక వాక్యము.

# ఆంధ్రాంగ్లవైయాకరణపరిభాష

## Parts of Speech = భాషాభాగములు.

### Noun = నామవాచకము విశేష్యము.

Abstract Noun = గుణవాచక విశేష్యము. [వాచక నామము.
Collective Noun = సముదాయ
Common Noun = సాధారణనామము.
Derivative Noun = తద్ధితనామము.
Material Noun = పదార్థ వాచక నామము [నామము.
Proper Noun = సంజ్ఞావాచక
Verbal Noun = ధాత్వర్థక విశేష్యము, కృదంతము.

### Pronoun = సర్వనామము.

Adjectival Pronoun = విశేషణ సర్వనామము.
Demonstrative Pronoun = నిర్దేశక సర్వనామము.
Distributive Pronoun = భిన్నతావాచక సర్వనామము.
Exclamatory Pronoun = ఉత్క్రోశక సర్వనామము. [సర్వనామము.
Indefinite Pronoun = సామాన్య
Interrogative Pronoun = ప్రశ్నార్థక సర్వనామము.
Personal Pronoun = పురుషవాచక సర్వనామము.
Reciprocal Pronoun = అన్యోన్య దర్శక సర్వనామము.
Reflexive Pronoun = కర్తృవాచక సర్వనామము.
Relative Pronoun = సంబంధ బోధక సర్వనామము.

### Adjective = విశేషణము.

Adjective of quality = గుణవాచక విశేషణము. [చక విశేషణము.
Numeral Adjective = సంఖ్యావా
Participial Adjective = క్రియాజన్య విశేషణము
Verbal Adjective = విశేషణార్థకము.

### Verb = క్రియ.

Active Verb = పరస్మైపద క్రియ.
Auxiliary Verb = సహాయక్రియ, ఉపక్రియ.
Causative Verb = హేతుక్రియ.
Cupulative Verb = సంబంధక్రియ.
Defective Verb = న్యూనక్రియ.
Denominative Verb = నామ ధాతువులు. [క్రియ.
Desiderative Verb = సన్నంతార్థక
Finite Verb = సమాపకక్రియ.
Impersonal Verb = అకర్తృక క్రియ.
Infinite Verb = అసమాపకక్రియ.
Intransitive Verb (or Infinitive) = అకర్మక క్రియ.
Nominal Verb = నామధాతువు.
Passive Verb = కర్మణిక్రియ.
Principal Verb = స్వతంత్ర క్రియ.
Reflexive Verb = ఆత్మనేపదక్రియ.
Transitive Verb = సకర్మకక్రియ.

### Voice = ప్రయోగము.

Active Voice = సకర్మక ప్రయోగము.
Pasaive Voice = కర్మణిప్రయోగము. (కర్మార్థక ప్రయోగము.)

ప్రతీతియు గలుగగా వారిని అట్లే భావించు చుండుటచేత నలౌకికరసము సామాజికునియందుఁ గలుగుచున్నది. నటుఁడు రామాదుల ననుసరించువాఁడే కావున రసాశ్రయుఁడు కానేరఁడు. అతని మనస్సెల్లప్పుడును అభినయప్రకటనము నందే లగ్నమగుటచే తాదాత్మ్యమును బొందజాలఁడుగదా!

ఇక అనుకార్యులగు రామాదులు ఎప్పుడో గతించిరి కాన ఇప్పుడు కలుగుచున్న రసమునకు కాలాంతర గతులగు రామాదులు యాశ్రయులనుట యసంభవము. పూర్వకాలమున వారు రసమున కాశ్రయులైనను నది లౌకికరసముగా చెన్నవలసి యున్నది. కాన లౌకికరసము అనుకార్యులగు రామాదులందును, నలౌకికరసము సామాజికునియందును కలుగునని రసవాద సిద్ధాంతము.

టలో నిమిత్తమాత్రుడుగా నున్నాఁడు. కాని రసికుఁడు వస్తువిశేషముల నాస్వాదించి రసోత్పత్తికిఁ గారణమగుచున్నాఁడు.

కావ్యము రసాత్మకము. రసము భావానుభూతి, భావనాశక్తి యను నింద్రజాల మహిమచె లబ్ధమగును. భావనాశక్తి కవికి సాముగ్రిగను, బలముగను, అండగను నుండి కావ్యనిర్మాణ విషయమున కృష్ణసారథ్యమువలె సహాయకారి యగును. భావము లనంతములు. అట్లే భావస్వరూపములగు శైలులు అనంతములు. అందు భావబోధకములై నాదరూపములగు పద్యరీతులు ప్రధానము లనఁజెల్లును.

శైలియొక్క సౌందర్యమును బోషించుటలో అలంకారము, రీతుల, వృత్తులు మున్నగువానికన్న సాక్షాత్కారబలమే ప్రధానమగును. అదిలేని కవిత యెరువుసొమ్ములు పెట్టుకొన్న పేరంటాలువలె హాస్యాస్పదముగను నలంకరించిన రాతిబొమ్మవలె నిర్జీవముగను నుండును. కావున కవియొక్క ప్రతిభావంతమయిన చిత్తవృత్తి సాక్షాత్కారబలము, రసభావము, శబ్దసిద్ధి, చిత్తసంస్కారము నను రసవత్తరమగు శైలి నుత్పాదింపఁజేయునుగాని పై మెఱుఁగులవంటి యుపమాద్యలంకారములు అంతగాఁ బ్రయోజనకారులు కానేరవు. మనుజుని చిత్తవృత్తి ననుసరించి రసభావాదు లుత్పత్తియగుచు వర్ధిల్లుచుండును. దుర్జనులు, సజ్జనులు మున్నగువా రేవస్తువులు చూచినను వారి వారి చిత్తవృత్తుల ననుసరించి వివిధములగు రసభావాదు లావిర్భవించుచుండును. ఈ జగమున నెన్నికోట్ల విపరీత ప్రకృతులు కలవో యన్ని విచిత్రభావములు, విపరీతరసములు వర్తిల్లుచునే యుండును. కావున మానవప్రకృతులనుబట్టి రసభావములు అనంతములని తేలగలదు.

## రసము లౌకికమనియు, నలౌకికమనియు రెండు విధములు.

లౌకికరసము:— లోకమున యువతీయువకులకుఁగలిగిన రత్యాది చిత్తవృత్తులు ఆయా కారణసామగ్రిచేఁ బోషింపఁబడి రసీభావము పొందును. వీనివలన యానందము అల్పము, నిత్యమునై యొప్పును. అనుకార్యుఁడగు నాయకుఁడే ఆశ్రయము. నేర్పరులయిన నటకుల నేర్పువలనను, గుణాలంకారాది పరిష్కృతమైన కావ్యశ్రవణమువలనను సహృదయుఁడగు సామాజికుఁడుసైతము ఆశ్రయము కావచ్చును. పిల్లలయానందమును దర్శించి భావించుచున్న తల్లిదండ్రులకును ఆనందముకలిగినది. కావున అన్యాశ్రయమైన రసమును భావించు సామాజికునకు సైత మా రసాశ్రయత్వము ఉపపన్న మనుట.

అలౌకికరసము:—కావ్యనాట్యములవలన తాదాత్మ్యము నొందిన సహృదయుని చిత్తవృత్తి రూపములగు రత్యాదులు విభావాదులచే పరిపుష్టము లయి రసవ్యవహారము నొందును. ఇది నిత్యమును బ్రహ్మానందమునై యొప్పును. కావ్య నాటకములందు వినవచ్చు సీత, ద్రౌపది మున్నగు శబ్దములవలన స్త్రీసామాన్యమ్మాత్రియును రావణ, దుర్యోధ నాది శబ్దముల శ్రవణమాత్రమున శత్రుసామాన్య

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చాపల్యము, హర్షము, ఆవేగము, జాడ్యము, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విరోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము.

శృంగారచేష్టలు:—ఇవి 18. భావము, హావము, హేల, మాధుర్యము, ధైర్యము, లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, కుతూహలము, విహృతము, హాసము.

మన్మథావస్థలు —చక్షుఃప్రీతి, మనస్సంగము, సంకల్పము, ప్రలాపితము, జాగరము, కృశత, అరతి, లజ్జాత్యాగము, సంజ్వరము, ఉన్మాదము, మూర్ఛ, మరణము (12 అవస్థలు).

విప్రలంభ శృంగారము:—1. అభిలాషము, 2. అసూయ, 3. విరహము, 4. ప్రవాసము అని నాలుగు విధములు.

రసాభాసము మూఁడు విధములు.— నాయికా నాయకులలో నొకరికి మాత్రమే యనురాగముండుట, 2. తిర్యగ్జంతువుల యనురాగము, 3. స్త్రీకిఁగలిగిన బహుపురుషాసక్తియు రసాభాస మగును.

భావోదయాదులు:—భావమునకు ఉదయము, శాంతి, సంధి, శబలత లను నాలుగవస్థలు గలవు.

పరస్పర విరుద్ధ రసము:—శృంగార బీభత్సములు, వీరభయానకములు, రౌద్రాద్భుతములు, హాస్యకరుణలు.

పరస్పరానుకూల రసములు:—శృంగారమునుండి హాస్యము, రౌద్రమునుండి కరుణము, వీరమునుండి అద్భుతము, బీభత్సమునుండి భయానకరసము పుట్టెను.

రసము —

రసమునకు వ్యుత్పత్తిచేనాస్వాదింపఁబడునది యనునర్థము కలుగుచున్నది. విభావానుభావ సాత్త్విక వ్యభిచారిభావములచే దేఁబడిన మాధుర్యముగలస్థాయిభావమే రసమని చెప్పఁబడెను. జన్మాంతర లబ్ధపరిపాకముగల కవిదృష్టి యొక వస్తువుపైఁబడినపుడు జనించిన భావోద్రేకమే రసమగుచున్నది. కావ్యరచనకు మూలమైన యిట్టి రసభావసంపద జన్మాంతర సంస్కారవాసనాబలమునను, చిత్తసంస్కారము వలనను జనింపవలెనేగాని లక్షణగ్రంథపరనమువలనఁ గలుగనేరదు. రసము కావ్యమున కాత్మ యగుచున్నదేగాని నీతి ధర్మ మత వేదాంతాది శాస్త్రములు కానేరవు. ప్రకృతియందు రసమునకుఁ దావులేనిపట్టు లేదు. జన్మాంతర సంచిత చిత్తపరిపాకముగల సుకవికి జగమంతయు రసభావోద్దీపనమే యగుచుండును. అతఁడు వస్తువును ఓరసాయిగా గర్భితమైయున్న రసము ననుభవించి పరులకు వ్యక్తముచేయు